## అంకితం

**మహర్షులకు,**
**సూష్లర్ మహోదయునకు,**
**వైద్య ప్రచారకులకు**
**ఈ పుస్తకం అంకితం**

# ఒక మాట

జీవిత లక్ష్యం ఆనంద–ప్రాప్తి అని మన మహర్షులు చెప్పారు. ఆనందం ఆరోగ్యంపై ఆధారపడి ఉంటుంది. ఆరోగ్యమంటే శారీరక ఆరోగ్యమే కాదు, మానసిక ఆరోగ్యం కూడా. విశ్వానికి, మనిషికి మధ్య సమన్వయం కుదిరినప్పుడే ఆరోగ్యం సిద్ధిస్తుంది. విశ్వంవలె ఈ శరీరం కూడా పంచభూతాత్మకమైనది. పంచభూతాలు – పృథ్వి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము. భూతమనగా చైతన్యశక్తి.

పృథ్విలో వేసిన విత్తనాలు అంకురించి మొలకలు ఎత్తుతాయి. ఆ మొలకలు పెద్దవై ధాన్యాన్ని ఇస్తాయి. కనుక పృథ్వి ఆధారతత్త్వం. పృథ్విలో వేసిన విత్తనాలు అంకురించి పెద్దవగుటకు జలం, తేజస్సు, వాయువు తోడ్పడును. శూన్యం ఆకాశతత్త్వం. ఈ శూన్యంలోనే మన ధ్వనులూ, మాటలు ఉంటాయి.

ప్రాణవాయువు మన మనుగడకు చాలా అవసరమైనటువంటిది. ఇది శ్వాసక్రియకు తోడ్పడుతుంది. ఇది దేహంలోని నీటి తత్త్వం, అగ్ని తత్త్వంతో కలిసి దేహానికి అవసరమైన శక్తిని తయారుచేస్తుంది. నీరు దేహంలో తయారైన మురికి పదార్థాలను మలమూత్రాదుల రూపంలోను, చెమట రూపంలోను బయటికి పంపే శుద్ధిక్రియలో తోడ్పడును.

మన దేహంలోని పంచభూతాలు ఉండవలసిన పాళ్ళల్లో ఉన్నప్పుడే మన దేహం ఆరోగ్యంగా ఉంటుంది. లేనప్పుడు అనారోగ్యం కలుగుతుంది. మానవుడు ఆరోగ్యంగా ఉండాలంటే విసర్జన క్రియ బాగుండాలి. మలమూత్ర విసర్జనలో ఎట్టి ఇబ్బంది ఉండరాదు. శ్వాసక్రియ బాగుండాలి. చక్కగా విశ్రాంతి తీసుకోవాలి. హాయిగా నిద్రించాలి. సరిగా ఆలోచించాలి. ప్రతిదానిపట్ల సకారాత్మక అభిప్రాయం కలిగి ఉండాలి.

కాని నేటి పరిస్థితులు మనుష్యుల ఆరోగ్యానికి అనుకూలంగా లేవు. ధనార్జనే జీవిత లక్ష్యంగా ప్రజలందరూ పరుగెడుతున్నారు. స్కూలుకు వెళ్లే పిల్లలే కాదు, పెద్దలు కూడా పరుగెడుతున్నారు. వారికి తినటానికి, త్రాగటానికి కూడా సమయం దొరుకుట లేదు. ఎక్కువమంది ఫాస్ట్‌ఫుడ్స్ పైన ఆధారపడుతున్నారు. ఫాస్ట్ ఫుడ్స్ తయారీలో మినరల్/శుద్ధమైన నీరు వాడే సందర్భాలు బహు తక్కువగా ఉంటాయి. అంతేగాకుండా ఫాస్ట్‌ఫుడ్స్ తినే ప్రదేశాలు కూడా శుభ్రంగా ఉండవు కదా! పారిశ్రామికీకరణ వల్ల వాయువు కూడా కలుషితమవుతున్నది. శుద్ధమైన గాలిని కూడా కొనవలసి వస్తున్నది. జలకాలుష్యం వల్లను, రసాయనిక ఎరువుల వాడకం వల్లను, క్రిమిసంహారక మందుల వల్లను మనం తినే ఆహారపదార్థాలు, కూరగాయలు, ఆకుకూరలు కూడా శుద్ధముగా ఉండుట లేదు. శారీరక శ్రమ తక్కువైంది. కసరత్తు, వ్యాయామం, ప్రాణాయామం, శ్వాసను బాగా లోనికి పీల్చుకొనే అభ్యాసాలు చేసేవారు అతి తక్కువగా ఉంటున్నారు. ఫలితంగా విసర్జన క్రియ సవ్యంగా ఉండుట లేదు. కుటుంబంలోను, సమాజంలోను సత్సంబంధాలు కరువైనాయి. దీనివల్ల రోగుల సంఖ్య రోజురోజుకు పెరుగుతున్నది. పెరుగుతున్న రోగులతోబాటు ఆస్పత్రులు, సూపర్‌స్పెషాలిటీ ఆస్పత్రులు, వైద్యులు కూడా పెరుగుతున్నారు. కాని బీదతనం ఎక్కువగాను, అక్షరాస్యత తక్కువగాను ఉన్న మనదేశ పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని ఈ పుస్తకం రూపొందించబడింది.

## ఈ పుస్తకం ప్రత్యేకతలు !

1. చికిత్స కన్నా నివారణ మిన్న అని మన పెద్దలు చెప్పియున్నారు. కనుక అనేక వ్యాధులకు నివారణోపాయాలు సూచించటం జరిగింది. ఈనాడు చాలామంది అజీర్ణం, గ్యాస్‌ట్రబుల్, ఊబ శరీరంతో బాధపడుతూ ఉన్నారు. వీరి బాధలను ఎట్టి మందులు వాడకుండా క్రింద పేర్కొన్న సులభమైన మార్గాల ద్వారా నివారించవచ్చును.

   ఎ) ఎన్ని పనులున్నా మధ్యాహ్నం 12 గంటలప్పుడు భోజనం చేయుట ఉత్తమం. ఆ సమయమున జీర్ణరసాలన్నీ అత్యధికంగా ఊరియుండును. ఆ రసాలన్నీ మనం తీసుకొన్న ఆహారపదార్థాలతో కలిసి వాటిని సులభంగా జీర్ణం చేయును. ఆ సమయంలో భోజనం చేయనిచో దేహంలో ఉత్పన్నమైన రసాలు అట్లే ఉండి జిగటపొరలను/ఆమత్వక్కులను పాడుచేయును. మధ్యాహ్నం 2 గం॥, 3 గం॥ సమయమున భోజనం చేసినచో జీర్ణరసాలు అల్పముగ ఉండుటచే అజీర్ణం ఏర్పడును. గ్యాస్‌ట్రబుల్‌కు ఇది ఒక కారణం.

బి) పడుకొనుటకు 2 గంటల ముందే రాత్రిభోజనం చేయాలి.

సి) నీరు బాగా త్రాగాలి.

డి) శారీరక శ్రమ చేయాలి.

2. ద్వాదశ లవణ చికిత్సా విధానంలో 12 మందులతోనే ఆరోగ్యం పొందటానికి వీలుంది. అవసరమైన మందు కొనుటకు, దానిని నిలువ ఉంచుకొనుటకు పెద్ద కష్టమేమీ ఉండదు.

3. అల్లోపతి వైద్యం ఎన్నో పరీక్షలపై ఆధారపడి ఉంటుంది. ఆ పరీక్షలకు ఎక్కువ డబ్బు, ఎక్కువ సమయం కావాలి. ద్వాదశ లవణ చికిత్సలో ఈ బాధ లేదు.

4. అల్లోపతిలో పరోక్ష పరీక్షలపై ఆధారపడి మందును ఎంపిక చేయుట జరుగుతుంది. కాని ద్వాదశ లవణ చికిత్సలో ప్రత్యక్ష లక్షణాలను ఆధారం చేసుకొని మందును ఎంపిక చేస్తారు. ఇతరులు చేసే పరీక్షల కన్నా రోగి వ్యక్తపరచే లక్షణాలలో ఎక్కువ వాస్తవికత ఉంటుంది.

5. ఏ అర్ధరాత్రో కుటుంబంలోని వారెవరికైనా ఏదైనా అనారోగ్య పరిస్థితి కలిగినచో, ఇంటి యజమాని ఇంట్లో లేకపోయినా, వైద్యుడు/వైద్యాలయం అందుబాటులో లేకపోయినా ఇంట్లో ద్వాదశ లవణాల కిట్‌ను ఉంచుకొన్నచో ప్రథమచికిత్స చేయుటకు వీలవుతుంది. దీనికి పెద్ద–పెద్ద చదువులు అవసరం లేదు.

ఈ పుస్తకమును చక్కగా, శ్రద్ధగా చదివి రోగమును గూర్చి సరైన అవగాహనను ఏర్పరచుకొన్నచో సరైన మందును ఎంపిక చేసుకొనుటలో సులువు ఏర్పడుతుంది. బాధల నుండి ఉపశమనం పొందుటకు/పొందునట్లు చేయుటకు ఈ పుస్తకం బాగా ఉపయోగపడగలదని ఆశిస్తున్నాను.

లాభమును గురించి ఆలోచించకుండా, ప్రజల వైద్య అవసరాలను తీర్చాలనే సత్సంకల్పంతో ఈ పుస్తకాన్ని అతి తక్కువ కాలంలోనే చక్కగా ముద్రించి ప్రజలకు అందించిన **విక్టరీ పబ్లిషర్స్ అధినేత శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్ గారికి,** వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

ఈ పుస్తకమును చదివి, రోగ ఉపశమనంలో తగు ప్రయోజనం పొందగలరని ఆశిస్తున్నాను. మీరిచ్చు సలహాలను, సూచనలను సహృదయంతో స్వీకరింతును. వాటికి అనుగుణముగా ఈ పుస్తకమును పునర్ముద్రించగలము.

# ఈ పుస్తకమును ఏ విధంగా ఉపయోగించుకోవాలి ?

- ప్రథమ అధ్యాయంలో రోగాలను గురించియు, అందుకు పనికివచ్చే ద్వాదశ లవణాలు తెలుపబడినవి. రోగి తన రోగపు లక్షణాలకు సరిపడు ద్వాదశ లవణాన్ని ఎంపిక చేసుకొని వాడాలి.
- ఒకవేళ 2, 3 ద్వాదశ లవణములు సూచింపబడినచో ఈ పుస్తకపు రెండవ అధ్యాయంలో తెలుపబడిన వాటి మెటీరియా మెడికాను జాగ్రత్తగా చదివి ఒక లవణమును ఎంపిక చేసుకోవాలి. ఈ ఎంపికలో మందు ఉద్రేకాలు, ఉపశమనాలు బాగా ఉపయోగపడ్తాయి. ఇవి ప్రతి మందు మెటీరియా మెడికాకు సంబంధించిన ప్రథమపేజీలోనే పేర్కొనబడినవి.
- ఏ మందును ఎంతకాలం తీసుకోవాలి? ఏ పొటెన్సీలో తీసుకోవాలి? పై పూతగా వాడవచ్చా ? వీటికి సంబంధించిన జవాబులు ఆ మందుకు సంబంధించిన మెటీరియా మెడికాలో లభించును. (చూడుము : ద్వితీయ అధ్యాయం)
- మందును ఎంపిక చేయుటకు ఎక్కువ సమయం కేటాయించలేని వైద్యులు/ రోగులు ఈ పుస్తకపు మూడవ అధ్యాయమగు లక్షణ సముదాయం (Repertory) చూడవచ్చు.
- ద్వాదశ లవణ చికిత్సా విధానంలో ఒకే మందు అనేక వ్యాధులకు ఉపయోగపడుతుంది. కనుక రోగి బాధల గూర్చి పూర్తి వివరణ ఇచ్చినప్పుడే వైద్యుడు సరైన మందును ఎంపిక చేయగలడు. ఉదాహరణకు ఒకరోగి తలనొప్పితో బాధపడుచున్నచో అతడు వైద్యునకు ఈ క్రింది విషయాలన్నీ క్షుణ్ణంగా తెలపాలి–
  1) తలనొప్పికి సంబంధించిన వంశాగత చరిత్ర
  2) తలనొప్పి తల ఏ ప్రాంతంలో వస్తుంది ? ఏ సమయాన వస్తుంది ?
  3) ఏ పరిస్థితులలో తలనొప్పి అధికమవుతుంది ?
  4) ఏ పరిస్థితులలో తగ్గుతుంది ?
  5) రోగి వ్యక్తిత్వం ఎలాంటిది ?
  6) రోగికి తలనొప్పితోపాటు ఇతర బాధలు ఏవైనా ఉన్నాయా? ఉన్నచో అవి ఏవి ?

# విషయసూచిక



## ప్రథమ భాగం

### 1. జీర్ణమండల వ్యాధులు

## 2. జ్వరం - వివిధ రకాలు



## 3. ఊపిరితిత్తుల/శ్వాసమండల వ్యాధులు
(Diseases of the Respiratory system)

## 4. రక్తప్రసరణ మండల వ్యాధులు (Diseases of the Circulatory System)



## 5. మస్తిష్కమునకు సంబంధించిన వ్యాధులు (Diseases Related to Mind)

## 6. కంటి వ్యాధులు
(Diseases of the Eye)



## 7. నాసికా వ్యాధులు
(Diseases of Nose)



## 8. చెవి సంబంధ వ్యాధులు
(Diseases of the Ear)

## 9. ఎముకల వ్యాధులు
(Bone Diseases)



## 10. నరాల వ్యాధులు
(Neuralgia)



## 11. కండరాల వ్యాధులు
**(Diseases of Muscles)**

## 12. కీళ్ళ వ్యాధులు
(Joints' Diseases)



## 13. గ్రంథుల వ్యాధులు
(Glandular Affect)



## 14. సంధాయక ధాతువుల వ్యాధులు
(Diseases of Connective Tissues)



## 15. చర్మ వ్యాధులు
(Skin Diseases)

## 16. మూత్రపిండముల వ్యాధులు
(Kidney Diseases)



## 17. వెంట్రుకల వ్యాధులు
(Diseases of Hair)



## 18. చేతుల, కాళ్ళ వ్యాధులు
(Diseases of Extremities)

## 19. గోళ్ళ వ్యాధులు
(Nail Diseases)



## 20. సుఖ వ్యాధులు
(Sex Diseases)



## 21. పురుషుల వ్యాధులు
(Diseases of Men)



## 22. స్త్రీల వ్యాధులు
(Diseases of Women)

## 23. శిశువుల వ్యాధులు



## 24. వివిధములు

# ద్వితీయ భాగం

## వస్తుగుణ దీపిక
Materia Medica



# తృతీయ భాగం

## లక్షణ సముదాయం
Repertory

# • 1. నేడు వాడుకలో ఉన్న వైద్య విధానాలు •

ఆనంద-ప్రాప్తియే జీవిత లక్ష్యం. ఆరోగ్యం లేకుండా ఆనంద-ప్రాప్తి సంభవం కాదు. అందుకే ప్రాచీనకాలం నుండి నేటి వరకు భారతదేశంలోనే కాదు, విదేశాలలో కూడా ఎంతోమంది మహర్షులు అనేక వైద్య విధానాలను ప్రవేశపెట్టారు. పాత వైద్యవిధానాలను సంస్కరించి అభివృద్ధి పరచారు.

నేడు ప్రపంచంలో అమలులోనున్న కొన్ని వైద్య విధానాలు –ఆయుర్వేదం, అల్లోపతి, యూనానీ, సిద్ధ, హోమియో, ద్వాదశ లవణ చికిత్స మొ॥వి. కొంతమంది తమ శాస్త్రమే గొప్పది అని అంటుంటారు. ఇలాగైతే వారు నిజాన్ని స్వీకరించలేరు. వాస్తవానికి ప్రతి శాస్త్రానికి కొన్ని పరిమితులు ఉంటాయి.

భారతదేశం ఆయుర్వేదానికి పుట్టిల్లు. అయినప్పటికీ దానికి భారతదేశంలోనే తగిన ప్రాచుర్యం లేదు. ఒకప్పుడు మన గ్రామాల్లోనే ఆయుర్వేద మందులు తయారు చేసే వైద్యులుండేవారు. వారు కనుమరుగవుతున్నారు. ప్రభుత్వాలు, స్వచ్ఛంద సంస్థలు చేస్తున్న సేవ పెరుగుచున్న జనాభా అవసరాలను తీర్చలేకపోతున్నది. కొన్ని ఆయుర్వేద మందుల తయారీలో బంగారం, వెండి వాడబడతాయి. దానివల్ల మందుల ధరలు విప రీతంగా పెరిగిపోయాయి. అనేక మందులు అనవసరమైన ఇతర లక్షణాలను (side effects) కలిగిస్తాయి.

అల్లోపతి నేడు ప్రపంచంలో అనేక దేశాల్లో ప్రసిద్ధి చెందిన వైద్య విధానం. అది శాఖోపశాఖలుగా విస్తరించివుంది. కనుక రోగి తన వ్యాధికి ఏ డాక్టరును సంప్రదించాలి అని చాలాకాలం సతమతమవుతాడు. ఇదొక ప్రహేళిక (puzzle). డాక్టరును నిర్ణయించు కొన్న తర్వాత ఆ డాక్టరు దగ్గరకు వెళ్ళటం మరొక సమస్య. ఆ డాక్టరు సాధారణంగా తన గ్రామంలో ఉండడు. సహాయకులను తీసుకొని బస్సులోనో, రైలులోనో ప్రయాణం. ఆ తర్వాత డాక్టరు ఫీజులు, మూత్రం, విరేచనం, రక్తం, కళ్ళె మొ॥ పరీక్షలు, వాటి ఫీజు. తర్వాత మందుల లిస్టు. దీనికంతా ఎంత ఖర్చవుతుందో ఆ దేవునికే తెలియాలి. దీనిని బట్టే ఒక పెద్ద రోగం వస్తే ఉన్న కొద్దిపాటి పొలాన్ని అమ్ముకొని డాక్టరు చేతిలో పెట్టాలి అనే సామెత పుట్టుకొచ్చింది కాబోలు. ఇంత ఖర్చు పెట్టినా రోగం పూర్తిగా, శాశ్వతంగా నయం అవుతుందనే గ్యారంటీ ఏమీ లేదు. ఉన్న రోగం పోయి కొత్త రోగాలు పుట్టుకొచ్చే ప్రమాదం కూడా ఉంది. చాలా సందర్భాల్లో మందులకు side-effects కూడా ఉంటాయి. చాలా రోగాలు పునరావృతమవుతుంటాయి.

అల్లోపతి వైద్య విధానంలో ఎన్ని లోపాలున్నా గుండె మార్పిడి, కిడ్నీ మార్పిడి, ఎముకలు విరిగినపుడు రాడ్స్ వేయుట, శస్త్రచికిత్స, లేజర్ కిరణాల చికిత్స, కృత్రిమ అవయవాలను అమర్చుట, ప్లాస్టిక్ సర్జరీ మొదలగునవన్నియూ ఈ వైద్యవిధానానికి స్వంతం.

ఎన్నో ఆధునిక సౌకర్యాలు ఉన్న సూపర్‌స్పెషాలిటీ ఆసుపత్రులు పుట్టుకొస్తు న్నాయి. కాని ఇవన్నీ మనదేశ జనాభాలో ఎంతమందికి అందుబాటులో ఉన్నాయి ?

యూనానీ వైద్యవిధానంలో మూలికలు వాడబడతాయి. దానిలో జాజి, యాలకులు, అల్లం మొ॥ సుగంధ ద్రవ్యములు, తియ్యని కషాయాలు వాడబడును. ఇది ముస్లిములలో ఎక్కువగా వాడుకలోనున్న వైద్యవిధానం.

సిద్ధ వైద్యవిధానంలో వ్యాధిని త్వరగా నయంచేసే మందులు ఉన్నాయి. కాని సరైన వైద్యులు లేకపోవుట, దీనికి ప్రాచుర్యం కల్పించలేకపోవుటవల్ల ఈ విధానం ఎక్కువ వ్యాప్తి చెందలేదు.

డా॥ శామ్యూల్ హానిమన్ జర్మన్ దేశస్థుడు. అతడు అల్లోపతి వైద్యవృత్తిలో బాగా డబ్బు, పేరు ప్రతిష్ఠలు సంపాదించాడు. కాని అతనికి తన వృత్తివల్ల సంతృప్తి లభించలేదు. ఆనాడు అమలులోనున్న వైద్య పద్ధతులు అతనికి నచ్చలేదు. చాలాకాలం పరిశోధన చేసి హోమియోపతి వైద్యవిధానాన్ని లోకానికి అందించాడు. దీనిలో రోగి శారీరక, మానసిక లక్షణాలన్నింటినీ తెలుసుకొని, ఆ లక్షణాలకు సరిపడే మందును సరైన పొటెన్సీలో ఇవ్వడం జరుగుతుంది. దీనిలో మందు ఖర్చు స్వల్పం. పరీక్షలు (tests) ఏవీ ఉండవు. దీనిలో దీర్ఘవ్యాధులు కూడా నయమగును. దీనివల్ల కలిగే ఇతర అనర్థాలేవీ ఉండవు. కనుక ఇది ప్రజల మన్ననలు పొంది ఇతర దేశాలకు కూడా వ్యాప్తి చెందింది. ఇది మనదేశానికెంతో ఉపయోగకారి. మహానుభావులైన మహాత్మాగాంధీ, రవీంద్రనాథ ఠాగూరు, సర్వేపల్లి రాధాకృష్ణ మొదలైనవారు హోమియోపతిని గూర్చి చాలా గొప్పగా చెప్పుటే కాక మన దేశమునకు చాలా అనుకూలమైనదని తెలిపారు.

జర్మనీ దేశస్థుడే అయిన డా॥ సూష్లరు హోమియోపతి కంటే సరళమైన ద్వాదశ లవణ చికిత్సను ప్రవేశపెట్టి ప్రజలకు ఎంతో మేలు చేశాడు. దీనిలో 12 లవణాలు మాత్రమే వాడబడతాయి. కనుక విద్యావంతులైన వ్యక్తులు ఈ పుస్తకమును, ఈ మందుల సెట్‌ను తమ ఇంట్లో ఉంచుకొన్నట్లయితే రాత్రివేళ కుటుంబసభ్యులకు ఏదైనా వ్యాధి వచ్చినా, వెంటనే డాక్టరును సంప్రదించలేని పరిస్థితులున్నా మందిచ్చి ఇబ్బందికర పరిస్థితి నుండి రక్షణ పొందవచ్చు. దీనిలో మందును ఎంపిక చేయునపుడు మందు లక్షణాలు, రోగి/రోగము లక్షణాలను దృష్టిలో ఉంచుకోవటం జరుగుతుంది. ఈ లక్షణాలన్నీ రోగి ప్రత్యక్షంగా చూసేవి. కాని అల్లోపతిలో పరోక్షమైన విధానములపై ఆధారపడి మందును ఎంపిక చేయటం జరుగుతుంది. ప్రత్యక్ష విధానం, పరోక్ష విధానంకన్నా శ్రేష్ఠమైనది కదా!

నివారణ చికిత్స కంటే శ్రేష్ఠమైనది. మానవ జీవితం ప్రకృతి ప్రదత్తం. కనుక బాహ్య ప్రకృతి నియమాలను అనుసరించి ప్రవర్తించినచో మనం అనేక రోగాల బారిన పడకుండా రక్షణ పొందవచ్చు. ఆహార విహారాదులలో సంయమనం పాటిస్తే రోగాలనుండి శరీరాన్ని కాపాడుకోవచ్చు. రోగం వచ్చినా దాని నుండి త్వరగా ఉపశమనం పొందవచ్చు. అందుకే ఈ పుస్తకములో నివారణోపాయాలు తెలిపిన తర్వాత ద్వాదశ లవణ చికిత్సను గురించి పేర్కొనబడింది.

# • 2. డా॥ సూష్లరు - ద్వాదశ లవణ చికిత్స •

**డా॥** సూష్లరు జర్మనీ దేశపు ఓల్డెన్‌బర్గు వాస్తవ్యుడు. అతడు 1873 సంవత్సరం మార్చి నెలలో ఒక జర్మన్ హోమియో పత్రికయందు 'సంక్షిప్త హోమియో చికిత్స' అను వ్యాసమును ప్రచురించెను. దీనిని బట్టి చాలా మంది హోమియోపతికి, డా॥ సూష్లర్ ద్వాదశ లవణ చికిత్సకు మంచి సంబంధం ఉందని తలంచారు. కాని ఇది వాస్తవంకాదు. డా॥ సూష్లరు క్రీ.శ. 1898 సంవత్సరం ప్రారంభంలో మరణించారు. అతడు తన మరణానికి పూర్వం తన గ్రంథపు 25వ జర్మను ముద్రణను వెలువరించారు. దానిలో అతడు చాలా మందుల ఉపయోగాన్ని విస్తృతంగా వివరించారు. అందులో అతడు స్పష్టంగా హోమియోపతి విధానానికి, తన విధానానికి ఏ మాత్రం సంబంధం లేదని తెలిపారు.

డా॥ సూష్లరు శరీర ధర్మ రసాయన శాస్త్రమును, శరీర ధర్మ విషయములను, వ్యాధి సంబంధమైన విషయములను తన చికిత్సా విధానమందు ఉపయోగించుకొనెను.

శరీర అవయవ నిర్మాణం, దాని జీవశక్తి శరీరములో నిర్దిష్టమైన కొంత పరిమాణంలో ఉండునట్టి అంగారక (organic) రసాయన పదార్థాలపై ఆధారపడి యున్నది. ఈ అంగారక పదార్థములు, ధాతువులు కాల్చబడి బూడిదగా మారినప్పుడు కూడా మిగిలియుండును.

శరీర అవయవముల ఏర్పాటుకు, ధాతువుల ఏర్పాటుకు, వాటి ధర్మ నిర్వహణకు అనంగారక (Inorganic) రసాయన పదార్థములు అత్యావశ్యకములు. అవి నిర్దిష్ట పరిమాణంలో ఉండును. డా॥ సూష్లరు ప్రకారం ఆ అనంగారక రసాయన పదార్థములు ఆవశ్యకమైన పరిమాణం కంటె తగ్గినప్పుడు వాటి అణుచలనంలో కలత ఏర్పడును. ఆ కలతయే వ్యాధి యగుచున్నది. అప్పుడు ఆ అనంగారక రసాయన పదార్థమును సూక్ష్మ పరిమాణంలో సరఫరా చేసి ఆ కలతను నివారించవచ్చును.

ఈ విషయాన్ని మనకు బాగా తెలిసిన ఈ ఉదాహరణ ద్వారా సులభంగా అర్థం చేసుకోవచ్చు. భూమిలో ఒక మొక్కను నాటామనుకోండి. భూమిలో మొక్క పెరుగుదలకు కావలసిన పదార్థాలన్నీ లభించినచో మొక్క పెరుగును. ఒకవేళ మొక్కకు భూమిలో కొన్ని పదార్థాలు మాత్రమే లభించి మరికొన్ని పదార్థాలు లభించనిచో మొక్క సరిగా పెరగదు. భూమిలో లభించని పదార్థాలను మనం భూమికి సరఫరా చేయాలి. మనం సాధారణంగా అమ్మోనియా, కాల్షియం ఫాస్ఫేటు, పొటాషియం ఫాస్ఫేటు భూమిలో వేస్తూ ఉంటాం. అట్లే మన శరీరంలో లోపించిన లవణాలను సూక్ష్మ మోతాదులో దేహానికి అందించిన అనారోగ్యం తొలగును.

# • 3. ద్వాదశ లవణములు •

**డా॥ సూష్లరు ఈ క్రింది ద్వాదశ లవణాలను పేర్కొన్నారు**

| లవణం | రసాయనిక నామం | సంక్షిప్త నామం | | ఏ కణములలో ఉండును |
|---|---|---|---|---|
| | | ఇంగ్లీషులో | తెలుగులో | |
| **1. కాల్కేరియా ఫ్లోర్** | కాల్షియం ఫ్లోరైడ్ | CF | కాల్కే.ఫ్లో | ఎముకలలో |
| **2. కాల్కేరియా ఫాస్** | కాల్షియం ఫాస్ఫేటు | CP | కాల్కే.ఫా | ఎముకలలో ఎక్కువగా |
| **3. కాల్కేరియా సల్ఫ్** | కాల్షియం సల్ఫేటు | CS | కాల్కే.స | పైత్యరసములో |
| **4. ఫెర్రంఫాస్** | ఫెర్రం ఫాస్ఫేటు | FP | ఫె.ఫా | నరములలో, కండరములలో |
| **5. కాలీమూర్** | పొటాషియం క్లోరైడు | KM | కా.మూ | కండరములలో |
| **6. కాలీఫాస్** | పొటాషియం ఫాస్ఫేటు | KP | కాలీ.ఫా | నరములలో, కండరములలో |
| **7. కాలీసల్ఫ్** | పొటాషియం సల్ఫేటు | KS | కాలీ.స | కణములలోను, బోలుగా ఉండు ఆధార కణముల మధ్య నుండు ద్రవము లలోను, కండరములు, నరాలలో |
| **8. మెగ్నీషియం ఫాస్** | మెగ్నీషియం ఫాస్ఫేటు | MP | మె.ఫా | నరములలో, కండర ములలో, ఎముకలలో |
| **9. నేట్రంమూర్** | సోడియం క్లోరైడు | NM | నే.మూ | నరములలో, కండరములలో |
| **10. నేట్రంఫాస్** | సోడియం ఫాస్ఫేటు | NP | నే.ఫా | రక్తములో, కండరాలలో, నాడులలో, మెదడు కణా లలో, ఆధార కణముల మధ్యనుండు ద్రవాలలో |
| **11. నేట్రంసల్ఫ్** | సోడియం సల్ఫేటు | NS | నే.స | ఆధారకణముల మధ్య నుండు ద్రవాలలో |
| **12. సైలీషియా** | సిలిసిక్ ఆక్సైడ్ | Sil | సైలీ | సంధాయక ధాతువులలో (Connective tissues) |

# 4. ద్వాదశ లవణములు తయారుచేయు విధానం

ద్వాదశ లవణములు రెండు రకములుగా తయారుచేయబడును – 1) డెసిమల్ లేక దశాంశ పద్ధతిలో 2) సెంటెసిమల్ లేక శతాంశ పద్ధతిలో.

## 1) డెసిమల్ లేక దశాంశ పద్ధతి

ఒక భాగము శుభ్రమైన ముడి ఔషధం తీసుకొని దానికి 9 భాగములు పాల పంచదార (Sugar of Milk) కలపాలి. ఆ మిశ్రమమును 2 గంటలపాటు నూరాలి. అలా చేసిన 1× పొటెన్సీ తయారగును. ఈ 1× పొటెన్సీ ఒక భాగమునకు 9 భాగములు పాల పంచదార కలిపి రెండు గంటలపాటు బాగా నూరిన 2× తయారగును. ఇదే విధంగా ఇతర పొటెన్సీలు తయారు చేయవచ్చు.

## 2) శతాంశ పద్ధతి

ఈ పద్ధతిలో కూడా ద్వాదశ లవణములను తయారు చేయవచ్చు. కాని ఒక భాగం ముడి ఔషధమునకు 99 భాగములు పాల పంచదార కలిపి నూరవలెను. అప్పుడు 1 లేక 1c మందు తయారగును. ఇదే విధంగా 1వ పొటెన్సీతో 2వ పొటెన్సీ, ఆపై పొటెన్సీలు చేయవచ్చు.

పాల పంచదారకు బదులు ఆల్కహాలు కూడా 9పాళ్లు లేక 99 పాళ్లు వాడవచ్చు. నూరుటకు బదులు ఔషధం గల సీసాను కార్కు/బిరడాతో మూసి ఒక బల్లమీద కుదుపుచూ కొన్నిసార్లు కొట్టవలెను (succession). అప్పుడు పొటెన్సీలు తయారగును.

## మాతృద్రవము లేక మదర్ టించరు

మందును ద్రవరూపములో చేయుటకు ముందుగా దానిని మదరు టించరుగా చేయుదురు. దాని నుండి కావలసిన పొటెన్సీ ఫార్మకోపియా పద్ధతిలో చేయబడును.

పొటెన్సీలు వాటి శక్తిని బట్టి మూడు రకములు :

1) క్రింది పొటెన్సీలు : 1×, 3×, 6× మొ॥

2) మధ్య పొటెన్సీలు : 12, 30

3) హెచ్చు పొటెన్సీలు : 200, 500, 1000 (1M), 10,000 (10M)

ద్వాదశ లవణములు పంచదార గోలీలు (pills), ట్యాబ్లెట్లు, చూర్ణం (powder), అరకు (liquid/solution) రూపంలో లభించును.

## • 5. ఏ పొటెన్సీ ఎప్పుడు వాడాలి ? •

**సూ**ష్లరు తన abgekurzte Therapic అను గ్రంథం యొక్క చివరి ముద్రణ యందు పొటెన్సీ విషయమై ఈ విధంగా వ్రాసియున్నారు – “నా చికిత్సానుభవములో నేను 6వ దశాంశ ట్రిట్యురేషనును (6×) సర్వసాధారణముగ నుపయోగింతును. ఫెర్రంఫాస్, సైలీషియా, కాల్కేరియా ఫ్లోరులను 12వ ట్రిట్యురేషనులో (12×) నేను సాధారణముగ వాడుదును. తరుణ (Acute) వ్యాధులలో బఠానీ గింజంత మందును ఒక మోతాదుగా ప్రతి గంటకు లేక రెండు గంటలకు వాడవలెను. బాధ ఎక్కువగానున్న తరుణ వ్యాధులలో మందును ప్రతి 10–15 నిమిషములకు ఒకసారి ఇవ్వాలి. దీర్ఘవ్యాధులలో రోజుకు 3,4 సార్లు వాడవలెను. మందును నాలుకపై వేసుకొనవచ్చును, లేదా చెంచాడు నీళ్ళలో కరిగించి త్రాగవచ్చు.

మందు బిళ్లల రూపములో నున్న రెండు/మూడింటిని ఒక మోతాదుగా నాలుకపై వేసుకోవచ్చును లేక నీటిలో కరిగించి తీసుకొనవచ్చు.

మందు ద్రవరూపములో వున్నచో 1,2 చుక్కలను 1/2 గ్లాసు నీటియందు కరిగించి ప్రతిగంటకు/రెండు గంటలకు ఒక టీ స్పూను చొప్పున తీసుకొనవచ్చు. చిన్నపిల్లలకు మందు ఇవ్వవలసినచో 1–2 టాబ్లెట్లను 1/2 గ్లాసు నీటిలో కరిగించి ఒక మోతాదుకు ఒక టీస్పూను చొప్పున ఇవ్వవచ్చు.

పుండ్లకు, గాయములకు పైపూతగా వాడవచ్చు. అందుకు ట్యూబు రూపంలో మందు బజారులో లభించును.

వాడుకలో పెద్దవారికి 4 మాత్రలు/టాబ్లెట్స్ ఒక మోతాదు. 6 నెలల లోపు పిల్లలకు 1 మాత్ర/టాబ్లెట్ సరిపోవును. 6 నెలలు పైబడిన వారికి 2–3 మాత్రలు/ టాబ్లెట్స్ వ్యాధి తీవ్రతను బట్టి వాడబడును.

# 1

# జీర్ణ మండల వ్యాధులు

## (DISEASES OF THE DIGESTIVE SYSTEM)

## 1. నోటి వ్యాధులు
### (Mouth Diseases)

జీర్ణవ్యవస్థలో నోరు ప్రథమ భాగం. నోటిలో నాలుక, దంతాలు,చిగుళ్ళు ఉంటాయి. సాధారణంగా నోటిలోను, నాలుకపైన పుండ్లు లేస్తూ ఉంటాయి. పంటి నొప్పి, చిగుళ్ళనొప్పి సర్వసాధారణ వ్యాధులు.

**కారణాలు :** 1) నోటిని శుభ్రంగా ఉంచక పోవుట, 2) ఆహార దోషాలు, 3) మలబద్ధకం, 4) అజీర్ణం, 5) సిఫిలిస్.

**నివారణోపాయాలు :**

1. నోటిని శుభ్రంగా ఉంచుకోవాలి. ఏదైనా తిన్న తర్వాత నోటిని శుభ్రంగా కడుగకొన వలెను. 2. దంతములను బాగా బ్రష్ చేసుకోవాలి. తిన్న తర్వాత కూడ బ్రష్ చేసుకొనుట మంచిది. 3. ముతక బియ్యంతో చేసిన ఆహారాన్ని తినుట మంచిది. 4. తీపి పదార్థాలు, చాక్లెట్లు, ఐస్‌క్రీమ్‌లు తినుట తగ్గించాలి. 5. బాగా నీరు త్రాగాలి. దీనివల్ల అజీర్ణం, మలబద్ధకం నివారింపబడును. 6. శుభ్రమైన జీవితం గడపాలి.

### • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× - 12× :** బాధాకరమైన ఇగుళ్ళు / చిగుర్లు – అవి ఎర్రగ, వేడిగ, వాపుతో ఉండుట–నోటి జిగురు పొర / ఆమత్వక్కు ఎరుపు, పొడితనం / వేడితో నుండుట.

**కాలీమూర్ 6× - 12× :** చిన్న పిల్లల / పాలిచ్చు తల్లుల నోటిలో పుండ్లు – తినివేసెడు నోటి పుండ్లు – ఇగుళ్ళ కురుపులు – చీము స్రవించుటకు పూర్వం కోమలమైన వాపు, నోటి చర్మం ఊడుట – నోటి నుండి అధిక దుర్గంధం – నోరు ఎర్రగ, వాపుతో ఉండుట – నోటి నుండి చిక్కని, నీళ్ళ వంటి స్రావం వెలువడుట – ఇగుళ్ళు ఉబ్బుట, అవి తెల్లగ / పసుపు పచ్చగ నుండుట – ఇగుళ్ళ నుండి తేలికగ రక్తం స్రవించుట – సవాయి / సిఫిలిస్ కారణంగా ఇగుళ్ళు వాచుట, నోటిలోని శరీర ధాతువులు మృతి చెందుట – జిగురుపొరపై ఉబ్బెత్తుగ ఉండు పుండ్లు ఏర్పడుట.

**కాలీఫాస్ 6× - 12× :** నోటి యందలి ధాతువులు కుళ్ళి అపాయకరమగు పుండు ఏర్పడుట - చెక్కిళ్ళు అనారోగ్యముగ నుండుట - బూడిదరంగు పుండ్లు, దుర్వాసన - నోరు వాచుట, ఇగుళ్ల నుండి సులభముగ రక్తస్రావమగుట, వాటి అంచుల మీద ఎర్రని గీత ఉండుట - నీటితో నిండియున్న కొరుకుడు పుండు, శరీర ధాతువులు మృతి చెందునట్టి కొరుకుడు పుండు - నోటి పొక్కులు, బాధాకరమైన పొక్కులు, పెదవులపై చిన్న చీము పొక్కులు - ఇగుళ్ళు స్పాంజివలె మెత్తగా ఉండుట, ఇగుళ్ళ బాధ తగ్గ సాగుట - లాలాజలం చిక్కగ ఉప్పు వలె ఉండుట - అది అధికంగా ఉండుట - నాలుక వాచుట, దాని అంచులు ఎర్రగను, బాధాకరంగాను ఉండుట.

**నేట్రంమూర్ 6× - 12× :** నాలుకపై పుండ్లు, లాలాజలం స్రవించుట - నోటి చుట్టూ ముత్యాల వంటి పొక్కులు - పెదవులు వాచుట - గడ్డముపై కురుపులు - చిగురు కురుపు - ధనారింపుగను, తొలుచునట్లు ఉండు పుండు.

**కాలీసల్ఫ్ 6× :** క్రింది పెదవి పొడిగ ఉండుట - దాని పొరలు ఊడుట.

**కాల్కేరియాఫాస్ 6× :** దంతములు వచ్చు పిల్లలలో ఇగుళ్ళు బాధాకరంగా ఉండుట, అవి వాచుట - ఇగుళ్ళు పాలిపోయినట్లుగ కనిపించుట, రక్తహీనత లక్షణం - పై పెదవి వాచి బాధాకరంగా ఉండుట.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** చిగురు కురుపు - దవుడలు, ఇగుళ్ళు గట్టిగ వాచుట, అవి బాగ గట్టిపడుట - నోటి అంచులలో చల్లగ నుండు పుండ్లు.

**నేట్రంఫాస్ 6× :** పెదవులను తినివేయునట్టి పుండ్లకు చక్కని మందు.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** పెదవుల లోపలి వైపున పుండు - పెదవులపైన తేమగ నున్న / చర్మం లేనట్టి పుండ్లు-దంతములను బ్రష్ చేసుకొనునప్పుడు చిగుళ్ళనుండి రక్తం స్రవించుట.

## 2. నోటిపూత
## (Aphthae)

నాలుకపైన, అడుగున, నోటి గోడలకు చిన్న-చిన్న పుండ్లు లేస్తూ ఉంటాయి. కొన్ని సందర్భాలలో పూత లాగా వస్తూ ఉంటుంది. కొంతమందికి పెదవుల లోపలిభాగం ఎర్రగా పూసినట్లు ఉంటుంది. మరికొంత మందికి రెండు పెదవులు కలిసే చోట మూతికి ఇరువైపులా చీలినట్లు అవుతుంది. పెదవులకు రెండు చర్మాలు ఉంటాయి-

1. పలచని పొర
2. దేహపు చర్మం. పలచని పొర, దేహపు చర్మంతో కలిసేచోట సాధారణంగా పుండ్లు వస్తాయి.

**కారణాలు :**

1. బి–విటమిన్ లోపం – బాగా పాలీష్ పట్టిన బియ్యంతో వండిన అన్నం తినటం, బాగా జల్లించిన పిండితో రొట్టెలు చేసి తినటం నేటి సభ్యత. దీనివల్ల మనం తినే ఆహారంలో తవుడు ఏ మాత్రం ఉండదు. ఆ తవుడులోనే బి–విటమిన్ ఉంటుంది కదా ! కనుక మన ఆహారంలో బి–విటమిన్ లోపించిన పై వ్యాధికి గురికావలసి వస్తుంది.
2. ప్రేగులకు సంబంధించిన కొన్ని వ్యాధులు.

**నివారణోపాయాలు :**

1. దంపుడు బియ్యం అన్నం తినటం అలవాటు చేసుకోవాలి. 2. మర పట్టించిన పిండిని జల్లెడ పట్టకుండానే వాడుకోవాలి. 3. దంపుడు బియ్యం, జల్లెడ పట్టని పిండితో చేసిన రొట్టెలను తినలేనివారు 2 స్పూన్ల తవుడును పెద్దగ్లాసు నీళ్ళలో వేసి 1, 2 గంటల పాటు నాననిచ్చి, వడకట్టి, వాటిలో తేనె, నిమ్మరసం వేసి త్రాగాలి. ఈమధ్య మన వార్తా పత్రికలలో ఒక వ్యక్తి ఫోటో ప్రచురితమైంది. అతను మన రాష్ట్రానికి చెందిన వాడే. వయస్సు 100కి పైనే ఉంటుంది. అతడు తలపై ఒక బస్తా ఉంచుకొని గ్రామాల వెంట తిరుగుతూ ధాన్యం అమ్ముతూ ఉంటాడు. అతని ఆరోగ్య విశేషం ఏమిటంటే అతడు రోజూ అన్నము నకు అదనంగా కొన్ని పిడికెల తవుడు తింటాడట. తవుడు మహిమ ఏమిటో అర్థమయ్యింది కదా!

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6× – 12× :** నోటిలోని ఆమత్వక్కు / జిగురుపొర ఎర్రగా ఉండుట – సాధారణ విషయాల పట్ల ఉదాసీనత కలిగి ఉండుట – మనసులోని భావాన్ని సరిగా వ్యక్తం చేయలేకపోవుట.

**కాలీమూర్ 6× – 12× :** చిన్న పిల్లల / పాలిచ్చు తల్లుల నోటిలో పుండ్లు – నోటి జిగురు పొరను తినివేయునట్టి పుండ్లు / సవాయి పుండ్లు – ఆ పుండ్లు ఉబ్బెత్తుగా ఉండుట – నోటి నుండి దుర్గంధం.

**కాలీఫాస్ 6× – 12× :** నోటిలో పుండ్లు / పొక్కులు – బాధాకరమైన పొక్కులు – పెదవులపై చిన్న చీము పొక్కులు – లాలాజలం చిక్కగ, ఉప్పువలె ఉండుట – అధిక లాలాజలం స్రవించుట – నాలుక వాచుట, దాని అంచులు ఎర్రగా బాధాకరంగా ఉండుట.

**నేట్రంమూర్ 6× – 12× :** నాలుకపై పుండ్లు – నోటిచుట్టూ ముత్యాల వంటి పొక్కులు – పెదవులు వాచుట – గడ్డముపై కురుపులు – లాలాజలం స్రవించుట.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** నోటి అంచులలో పుండ్లు – తాకితే అవి చల్లగా ఉండుట – ఏ నిర్ణయమూ తీసుకోలేక పోవుట, ఆర్థిక నష్టాలను గురించి ఆధారం లేని భయాలు.

# 3. పంటి నొప్పి
## (Toothache)

పంటినొప్పి దంతక్షయంపై ఆధారపడి ఉంటుంది. దంతక్షయంలో నాలుగు దశలు గలవు.

**ప్రథమ దశ :** ఈ దశలో పంటిపై చిన్న నల్లని మచ్చ ఏర్పడుతుంది. అనగా పంటిపై భాగపు పై పొర అయిన ఎనామిల్ బాక్టీరియా చర్య వల్ల పాడైందని అర్థం. ఆ సందర్భంలో ఐస్‌క్రీమ్ తిన్నా, ఫ్రిజ్‌లో చల్లని నీళ్ళు త్రాగినా పళ్ళు జివ్వున లాగుతాయి. డెంటిస్టులు పంటికి సిల్వర్ ఫిల్లింగ్ చేయించుకోమని చెబుతారు.

**ద్వితీయ దశ :** ఈ దశలో బాక్టీరియా పంటి రెండో భాగమైన డెంటిన్‌ను చేరును. పంటిలో కొద్దిగా రంధ్రం పడును. ఈ దశలో ఐస్‌క్రీమ్‌తిన్నా, చల్లని నీళ్ళు త్రాగినా పళ్ళు జివ్వుమనటమే కాకుండా పంటి నొప్పి వచ్చును. డెంటిన్ భాగంలోని జీవకణాలు ఐస్‌క్రీమ్‌లోని చల్లదనానికి, తీపికి స్పందించి పంటి నొప్పి వస్తుంది. డెంటిస్టులు పంటికి సిల్వర్ ఫిల్లింగ్ చేయించుకోమని సలహా ఇస్తారు.

**తృతీయ దశ :** ఈ దశలో బాక్టీరియా పంటి మూడవ భాగమగు పల్ప్‌కు చేరుతుంది. అందుచే ఐస్‌క్రీము తిన్నా, ఫ్రిజ్ నీటిని త్రాగినా విపరీతమైన నొప్పి వస్తుంది. దీనికి కూడా రూట్ కెనాల్ చికిత్స చేయబడుతుంది.

**చతుర్థ దశ :** ఈ దశలో బాక్టీరియా రక్తనాళాలను, నాడులను పూర్తిగా నాశనం చేసి, పంటి మూలం ద్వారా దవడ ఎముకకు చేరుతుంది. దవడ ఎముకను నాశనం చేయుట వల్ల దవడ ఎముకలో చీము ఏర్పడుతుంది. ఈ దశలో పన్ను పూర్తిగా పుచ్చిపోయి మూలం క్రింద చీము పట్టుతుంది. దవడ వాపు వస్తుంది. డెంటిస్ట్‌లు పన్ను పూర్తిగ చెడిపోయిన సందర్భాలలో పన్ను తీస్తారు. పంటి క్రౌన్ భాగం పూర్తిగ చెడిపోకపోతే రూట్‌కెనాల్ చికిత్స చేస్తారు.

**దంత క్షయపు దశలు :**

**పంటి నొప్పి కారణాలు :** 1. బాక్టీరియా 2. నరాల వ్యాధులు 3. చక్కెర వ్యాధి 4. చల్లని గాలి సోకుట మొ।। కారణాలు.

**నివారణోపాయాలు :**

1. దంతములను పరిశుభ్రముగ ఉంచుకొనుట చాలా అవసరం. అందుకుగాను ప్రతిదినం ఉదయం, సాయంత్రం పండ్లను తోముకొనుట శ్రేయస్కరం. పంటిలో ఇరుకుకొన్న పదార్థాన్ని ఎప్పటికప్పుడు తీసివేయాలి. ఫ్లోరైడ్ ఎక్కువగా ఉన్న ప్రాంతాలలోనివారు ఫ్లోరైడు పేస్టును వాడాలి. గరుకుగా ఉన్న పండ్లపొడిని వాడరాదు.

2. అజీర్ణం రాకుండా జాగ్రత్త వహించాలి.
3. చిన్న పిల్లలు చాక్లెట్లు, పిప్పెరమెంట్లు, బిస్కట్లు, ఐస్‌క్రీములు ఎక్కువగా తింటూ ఉంటారు. తిన్న ప్రతిసారీ నోటిని శుభ్రం చేసుకోరు. దానివల్ల బాక్టీరియా నోటిలో సులభంగా అభివృద్ధి చెంది దంత సమస్యలను సృష్టించును. కనుక పిల్లలకు దంతములను శుభ్రంగా ఉంచుకోవలసిన ఆవశ్యకతను తెలుపుటేకాక పద్ధతిని కూడా నేర్పాలి.
4. గ్లాసునీటిలో గుప్పెడు వేపాకులు వేసి మరిగించి, చల్లార్చి, వడకట్టిన నీటిని నోటిలో పోసుకొని 10 – 15 నిముషాలపాటు పుక్కిలించాలి. రోజుకు రెండుసార్లు ఈ విధంగా చేసుకోవాలి.
5. పంటినొప్పి ఉన్నప్పుడు పంటితొఱ్ఱలో తేనె బొట్టు వేయాలి. ఈ విధంగా రోజుకు 3–4 సార్లు చేయాలి. తేనెకు బాక్టీరియాను చంపే గుణం ఉంది.
6. దంతములకు సంబంధించిన సమస్య ఉన్నా లేకపోయినా 6 నెలలకు ఒకసారి దంత వైద్యుడ్ని సంప్రదించాలి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12× :** పంటినొప్పి, వేడిగానున్న చెంప/బుగ్గ, వాపు, వేడిమి, మంటతోనున్న ఇగురు / చిగురు – దంతములు ఎక్కువ నొప్పితో ఉండుట – దంతములు పొడుగైనట్టి భావన – వేడిద్రవాల వల్ల నొప్పి ఎక్కువగుట, చల్లని పానీయాల వల్ల ఉపశమనం.

**కాలీమూర్ 6× :** పంటినొప్పి, ఇగుళ్ళు, చెంపలు / బుగ్గలు వాచుట – (చెమర్చిన ఆల్బుమిన్ పదార్థాన్ని తొలగించుటకు / చంపుటకు) – చన్నీళ్ళవల్ల నొప్పి, వాపు తగ్గును. ఈ మందును ఫెర్రంఫాస్‌తో మార్చి వాడాలి.

**కాలీఫాస్ 6× :** ఎక్కువగా నరాల వ్యాధులతో బాధపడునట్టి వారి, సున్నితముగ నున్నవారి / పాలిపోయినవారి, చిరాకు పడునట్టివారి, ఉద్రేకపడువారి పంటినొప్పి.

- ★ సులభముగ రక్తం స్రవించు చిగుళ్ళు కలవారి పంటినొప్పి
- ★ చిగుళ్ళపై ప్రకాశవంతమైన ఎర్రని చార ఉండుట.
- ★ దంతములు నొప్పిగ ఉండుట – దంతములు పటపట కొరుకుట.
- ★ పుచ్చిన / పెట్టుడు (కృత్రిమపు) దంతాల తీవ్రమైన నొప్పి.

**కాలీసల్ఫ్ 6× :** పంటినొప్పి వేడిగదిలోను, సాయంకాలం ఎక్కువగుట – చల్లని బహిరంగ ప్రదేశంలో నొప్పి తగ్గుట.

**మెగ్నీషియం ఫాస్ 3× – 30× :** వేడి ద్రవాలు పంటి నొప్పిని తగ్గించుట – నరాలకు సంబంధించిన, మేహవాతపు పంటినొప్పికి తీవ్రమైన, శూలనొప్పి (పోటు) వేడిమివల్ల

తగ్గుట – ఒత్తినా, అదిమినా నొప్పులు తగ్గుట, కొద్దిగా కదిలినా నొప్పులు పెరుగుట – నిద్రించుట, చల్లని నీటితో కడుగుకొనుట, చల్లని పదార్థాలను తినుటవల్ల పంటి నొప్పి ఎక్కువ అగుట (సాధారణంగా కట్టుడు / పెట్టుడు దంతములలో) – వాపు, వేడిమి, మంట, తీపి లేని పంటినొప్పి.

**నేట్రంమూర్ 6X :** పంటినొప్పితో కన్నీరు / అధిక లాలాజలం ఏమాత్రం నియంత్రణ లేకుండా స్రవించుట – పంటిని, పంటితో కొరికిన నొప్పి.

**సైలీషియా 12X :**

- ★ పంటినొప్పి రాత్రిపూట అధిక తీవ్రంగ ఉండుట, వేడిమి / చల్లదనం వల్ల ఆ నొప్పి తగ్గకుండుట, పాదములు చల్లబడుట వల్ల పంటినొప్పి వచ్చుట, ఎముకల చుట్టూ ఉండే తెల్లని పొర / పంటి మూలాన్ని కప్పివుంచే నారవంటి ఆమత్వక్కులో లోతుగ నొప్పి ఉండుట, పంటిలో పుండు ఏర్పడుటవల్ల వచ్చు పంటినొప్పి.
- ★ అకస్మాత్తుగ పాదములకు చల్లని గాలి సోకుట వల్ల / తడిగా ఉన్న వాతావరణంలో చెమటలు పట్టుట వల్ల వచ్చు పంటినొప్పి.
- ★ దంతములు వదులుగ నుండుట వల్ల వచ్చు పంటినొప్పి.

**కాల్కేరియా ఫాస్ 6X :** అతి త్వరగా పిప్పిపన్ను ఏర్పడుట, స్క్రూపులా / క్షయ పరిస్థితులు ఉండుట – గర్భధారణ సమయంలో వచ్చు దంత సంబంధమైన వ్యాధులు – రాత్రిపూట పంటినొప్పి ఎక్కువగుట.

**కాల్కేరియా ఫ్లోర్ 6X :**

- ★ పంటికి ఏదైనా ఆహారం తగిలిన వచ్చు పంటినొప్పి
- ★ దంతములు వదులుగా నుండుట, దంతముల ఎనామిల్ గరుకుగాను, తక్కువగాను ఉండుట, దంతములు అస్వాభావికముగా వదులుగా ఉన్నప్పుడు వచ్చు పంటినొప్పి.

***హెచ్చరిక :*** *పిప్పిపళ్ళు కలవారు, ముఖ్యంగా చిన్నపిల్లల పంటినొప్పికి ఈ మందును కొన్ని వారాల పాటు వాడినపుడు నేను కొన్ని దుష్పరిణామాలను గ్రహించాను–* ***(ఆర్.ఎస్.కోప్‌ల్యాండ్)*** *కనుక ఈ మందును పంటినొప్పిలో ఎక్కువకాలం వాడరాదని తెలియుచున్నది.*

## 4. చిగుళ్ళ వ్యాధులు
## (Diseases of Gums)

చిగురు / ఇగురు పంటికి ఆధారం. దంతములు వచ్చునపుడు ఇవి నొప్పిగాను, ఉబ్బుగాను ఉంటాయి. శుభ్రత లేకపోవుట, విటమిన్ 'సి' తక్కువగుట, ఇతర వ్యాధులవల్ల

చిగుళ్ళ నుండి రక్తం కారును. అవి వాచును. వాటి నుండి దుర్వాసన వెలువడును. కొన్ని సందర్భాలలో వాటి నుండి చీము కారును. విపరీతమైన బాధ ఉండును.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 12X :** చిగుళ్ళు వేడిగ, వాచినట్లుండుట – నోటి ఆమత్వక్కు ఎర్రగా ఉండుట.

**కాల్కేరియా ఫ్లోర్ 6X – 12X :** చిగురు కురుపు – దవుడపైన గట్టి వాపు – దవుడ ఎముక రాతి వలె గట్టిగ ఉండుట.

**కాల్కేరియా ఫాస్ 6X :** చిగుళ్ళు బాధాకరంగాను, వాపుతోను ఉండుట / పాలిపోయినట్టి చిగుళ్ళు.

**కాల్కేరియా సల్ఫ్ 6X :** చిగుళ్ళ కురుపులు – పెదవుల లోపలిభాగం పుండుగ ఉండుట – పెదవులపై తేమగా నుండు పుండ్లు – నోరు పొడిగాను, వేడిగాను ఉండుట.

**కాలీమూర్ 6X :** చిగురు ఏర్పడటానికి పూర్వమున్న చిగురువాపు – చిగుళ్ల వాపు, చెంపల వాపుతో నున్న పంటినొప్పి.

**కాలీఫాస్ 6X :** రక్తం కారుటకు ముందు చిగుళ్ళపైన ఎర్రని కోత – పంటినొప్పి, నుదుటి తలనొప్పి మారి మారి వచ్చుట – పాడైన / కృత్రిమ పళ్ళల్లో తీవ్రమైన నొప్పి – చిగుర్లు స్పాంజివలె మెత్తగ ఉండుట – అవి వెనుకకు పోవుట.

**కాలీసల్ఫ్ 6X :** దీర్ఘకాలంగా ఉన్న చిగుళ్ళ బాధ – వేడిగ ఉన్నప్పుడు, సాయంకాలం పంటినొప్పి అధికమగుట–చల్లని గాలిలో, బహిరంగ ప్రదేశంలో పంటినొప్పికి ఉపశమనం.

**నేట్రంమూర్ 6X – 12X :** చిగుర్ల కురుపులు, గుండె కొట్టుకొంటున్నట్టి నొప్పి, తొలుచు చుండునట్టి నొప్పి – కన్నీరు / లాలాజలం నియంత్రణ లేకుండ స్రవించుట – వాపుతో నున్న చిగుర్లు, రక్తం స్రవించుట.

**నేట్రంసల్ఫ్ 6X :** చిగుళ్ళు మండుచుండుట – చిగుళ్ళపైన బొబ్బలు / పొక్కులు (Blisters), పొగత్రాగుట, చల్లనిగాలి వల్ల పంటినొప్పి ఉపశమనం.

**సైలీషియా 6X :** చిగుళ్ళు సున్నితంగా ఉండుట – వాటిపై బొబ్బలు / పొక్కులు లేచుట – చిగుళ్ళ కురుపులు – కొంచెం ఒత్తిడి తగిలినా చిగుళ్ళు నొప్పి చేయుట – దంతములు వదులుగా ఉండుట–రాత్రి పూట తీవ్రమైన పంటినొప్పి–వేడిమి / చల్లదనం వల్ల నొప్పి తగ్గకుండుట – కాళ్ళు చల్లబడటం వల్ల పంటినొప్పి కలుగుట–పంటిలో రంధ్రం ఏర్పడుట.

## 5. చిగుళ్ల నుండి రక్తం కారుట

కొంతమంది పంటి చిగుళ్ళ నుండి రక్తం కారుతూ ఉంటుంది. ముఖ్యంగా పళ్ళు తోముకొనేటప్పుడు ఇలా జరుగుతుంది.

**కారణం :** విటమిన్ 'సి' లోపం.

**నివారణోపాయాలు :**

1. మనం కూరగాయలను, ఆకుకూరలను వండి తింటూ ఉంటాం. వండుట వల్ల కూరగాయలలోను, ఆకుకూరలలోను ఉన్న 'సి' విటమిన్ నశిస్తుంది. కనుక మనం సాయంకాలం తినే ఆహారంలో సగం పచ్చికూరగాయలను తినుట మంచిది.
2. ఉదయాన నారింజ రసం త్రాగాలి. నారింజ దొరకనిచో బత్తాయి / కమలా రసం తీసుకోవాలి. వీలున్నవారు తేనె కలుపుకోవచ్చు.
3. అన్నం తినేటప్పుడు కూరలపై నిమ్మరసం పిండుకొని తినాలి.
4. ఉసిరికాయ తినాలి. ఇవి అన్ని రోజులలోను దొరకవు. కాబట్టి అవి దొరుకునప్పుడు ఎండబెట్టుకొని నిలవ చేసుకొన్నచో దొరకనప్పుడు వాడుకొనుటకు ఉపయోగపడును. ఉసిరికాయ పచ్చడి తినరాదు.
5. జామకాయలో విటమిన్ 'సి' ఎక్కువగా ఉంటుంది. కనుక దానిని ప్రతిరోజూ తినటం మంచిది.

**• చికిత్స •**

**కాలీఫాస్ 6X :** సులభముగ రక్తం స్రవించు చిగుళ్ళు – చిగుళ్ళపై ప్రకాశవంతమైన చార – విచారం, దిగులు, ఆందోళనతో ఉండుట – నోటిలో చిక్కని, ఉప్పుగా నుండునట్టి అధిక లాలాజలం – దుర్వాసనతోనున్న శ్వాస.

**నేట్రంమూర్ 6X :** వాచిన చిగుళ్ళు సున్నితంగా ఉండుట – అవి సులభంగా రక్తమును స్రవింపజేయుట – రుచి నశించుట – విస్తారముగా లాలాజలం స్రవించుట – ఆ లాలాజలం ఉప్పు రుచితో ఉండుట.

## 6. నాలుక – రుచి
## (Tongue and taste)

నాలుక శరీరంలో బలిష్ఠమైన కండరం. ఇది నోటిలో ఉంటుంది. దీని పైభాగాన రుచి గుళికలు ఉంటాయి. దీనివల్ల ఈ ప్రయోజనాలు గలవు : 1) రుచి తెలుసుకోవచ్చును 2) ఆహారాన్ని దంతాల క్రిందకు తోయుటకు పనికివచ్చును 3) మాట్లాడుటకు ఉపయోగపడును.

నాలుక రూపాన్ని బట్టి వ్యక్తి ఏ వ్యాధితో బాధపడుతున్నదీ స్పష్టంగా తెలుస్తుంది. నాలుక రూపంలో టైఫాయిడ్ జ్వరం, అజీర్ణం, పైత్యం మొదలైన వ్యాధులు తెలియనగును. నాలుక జీర్ణాశయం, ప్రేగుల మార్గానికి అద్దం వంటిది అని చెబుతారు. అనగా జీర్ణాశయం,

ప్రేగులకు సంబంధించిన వ్యాధి నాలుకను చూడగా తెలియునని అర్థం. జాగ్రఫీ మ్యాప్ వలె వున్న నాలుక దాని మంట, ఎరుపు, వాపును తెలుపును. కనుక కొంతమంది అల్లోపతి వైద్యులు కూడా రోగి నాలుకను చూసి అతని వ్యాధిని గురించి ఒక నిర్ణయానికి వచ్చెదరు.

## • చికిత్స •

**కాల్కేరియా సల్ఫ్ 6X :** నాలుకపై పసుపుపచ్చని / రేగడి మన్ను రంగులోనున్న పూత – నాలుక నుండి చీము కారుతున్నప్పుడు అది మంటగ, ఎర్రగ, వాపుతో వుండుట – నాలుక వదులుగా ఉండుట. **రుచి :** పుల్లగ, సబ్బువలె, మంటగ వుండిన ఈ మందు ఉపయోగపడును.

**ఫెర్రంఫాస్ 12X :** నాలుక వాపు – అది ముదురు ఎరుపు రంగుతో వుండి మంటగనుండుట – దానిపై క్యాన్సర్ / పుట్టు వ్రణం.

**కాలీమూర్ 6X :** నాలుక వాపు – నాలుకపై తెల్లని/బూడిద వర్ణపు పూత – ఆ పూత బంకగాను, నాలుక పొడిగాను ఉండుట.

**కాలీఫాస్ 12X :** నాలుక ఆర్చుకొని యున్నప్పుడు, బాగా క్షీణించినప్పుడు అది వాచును – అది గోధుమ రంగు పూతతో కుళ్ళిన వాసనను వెదజల్లును. ఉదయాన అది చాలా ఎక్కువగ ఆర్చుకొనియుండును. అది నోటి పైభాగానికి (అంగిటికి) అంటుకొనునేమో అనినట్లు ఉండును. – నాలుక కొనలు ఎర్రగాను, మంటతోను ఉండును.

**కాలీసల్ఫ్ 6X :** నాలుకపై పసుపుపచ్చని పూత బంకతో ఉండును. కొన్ని సమయాల్లో నాలుక కొన తెల్లగా ఉండును. **రుచి :** రుచి లేకుండుట.

**కాల్కేరియా ఫాస్ 6X :** నాలుక మందంగా, తిమ్మిరిగా ఉండుట – దానిపై తెల్లని పూత – దానిపై మొటిమలు, క్యాన్సర్ వ్రణం.

**నేట్రంమూర్ 6X :** నాలుకపై పూత బంకగా, స్వచ్ఛంగా, నీళ్ళ వలె ఉండుట (ముఖ్యంగా చిన్న బుడగలు గల నురుగుతో కూడిన లాలాజలం నాలుక ప్రక్కలను, కొనను కప్పియుంచినపుడు) –

- ★ నాలుకపై మ్యాప్‌వలె వివిధ ఆకృతులు గల మచ్చలుండుట
- ★ స్వచ్ఛముగను, తేమగను ఉన్న నాలుక.
- ★ నాలుక తిమ్మిరిగను, బిర్రబిగిసి ఉండుట.
- ★ పిల్లలు నెమ్మదిగా మాట్లాడుట నేర్చుకొనుట.
- ★ నాలుకపై వెంట్రుక ఉన్నట్టి అనుభూతి.
- ★ నాలుక, నోరు ఆర్చుకొనిపోయినట్లు అనిపించుట.

**రుచి :** రుచి కోల్పోవుట.

**నేట్రంఫాస్ 6X :** నాలుక వెనుక భాగాన తడిగ, క్రీమువలెనున్న / బంగారు పసుపుపచ్చ రంగు పూత. నాలుకపై బొబ్బలు, క్యాన్సర్ వ్రణం. నాలుక కొనపై వెంట్రుక ఉన్నట్టి భావన.

**నేట్రంసల్ఫ్ 6X :** నాలుకపై అసహ్యముగా నుండు గోధుమ – ఆకుపచ్చ / బూడిద వర్ణపు పసుపుపచ్చ పూత. బంకగా నుండు నాలుక. నాలుక కొనపై మంట పుట్టిస్తున్న బొబ్బలు. నాలుకపై క్యాన్సర్ వ్రణం. **రుచి :** చేదు, పులుపు.

**సైలీషియా 12X :** నాలుక వాచుట, అది గట్టిపడియుండుట. నాలుక ఎరుపు, మంట, తీపి, వాపు వల్ల చీము పట్టుట. **రుచి :** రక్తపు రుచి, ఏ రుచి లేకుండుట.

**కాల్కేరియా ఫ్లోర్ 6X :** నాలుక పగిలియుండుట – నొప్పి వుండవచ్చు / లేకపోవచ్చు. నాలుక ఎరుపు, మంట, తీపి, వాపు – ఆ తర్వాత నాలుక గట్టిపడుట.

**మెగ్నీషియం ఫాస్ 6X :** నాలుకపై పసుపుపచ్చని, బంకగా నుండు పూత. ప్రేగులలో నొప్పి, పొట్ట బరువుగానుండుట.

**ముఖ్య గమనిక :** నాలుకపై పూతను బట్టి, దాని రూపాన్ని బట్టి అన్ని సందర్భాలలోను మందును నిర్ణయించుటకు వీలుకాదు. ఏదైనా వ్యక్తి దీర్ఘకాలం పొట్ట వాపుతో బాధపడుతూ, మరొక తరుణ వ్యాధికి గురైన అతని నాలుక పూత, రూపాన్ని బట్టి మందును నిర్ణయించుట కష్టమగును. ఏదైనా దీర్ఘకాలపు వ్యాధి నాలుక ఆకృతిని గూర్చి నిర్ణయాత్మక లక్షణాలను తెలియజేసినచో సరైన మందును ఎంపిక చేయుటలో బాగా ఉపయోగపడును. (డా. స్క్యూస్లర్)

## 7. పదార్థంలోని రుచి బాగా తెలియుటకు

కొంత మందికి ఇష్టమైన వంటలు చేసిపెట్టినా వారు ఆ పదార్థముల రుచిని పూర్తిగా ఆస్వాదించలేని పరిస్థితిలో ఉంటున్నారు.

ఆకలితోపాటు, తినే వ్యక్తి మనస్సుపై కూడా పదార్థపు రుచి ఆధారపడుతుందని నేటి వైద్యులు అందరూ చెబుతారు. కనుక ఒక పదార్థాన్ని తినేటప్పుడు వ్యక్తి తన దృష్టి, ధ్యాస అంతయు ఆ పదార్థంపైనే నిలపాలి. పత్రికలు చూస్తూగాని, టి.వి.చూస్తూగాని లేక ఇతరులతో మాట్లాడుతూగాని తినరాదు. అలా చేస్తున్నప్పుడు వ్యక్తి ఆ పదార్థంపై దృష్టి నిలపలేడు. అందువల్ల అతని లాలాజల గ్రంథులు పనిచేయవు. లాలాజలం తయారుకాదు. అందువల్ల తినే ఆహారపదార్థంతో లాలాజలం కలవలేదు. అప్పుడు పదార్థపు రుచి సరిగా తెలియదు. అంతేగాక జీర్ణక్రియ దెబ్బతింటుంది.

కనుక ఏదైనా తినేటప్పుడు ఇతర వ్యాపకాలను వదిలిపెట్టి పూర్తిగా మనస్సును తినటముపైనే లగ్నం చేయాలి. దానివల్ల ఆ పదార్థం రుచి తెలుస్తుంది. అప్పుడు పూర్తి సంతృప్తి కలుగుతుంది. తినే పదార్థంతో లాలాజలం కలియుటచే జీర్ణక్రియకు ఎలాంటి ఇబ్బంది కలగదు.

## 8. తినేటప్పుడు గొంతుపట్టుట

కొంతమంది తినేటప్పుడు గొంతు పట్టేసిందంటారు.

**కారణాలు :** 1) తినేటప్పుడు మాట్లాడుట – దీనివల్ల ఆహారం సరిగా నమలబడకుండానే మింగటం జరుగుతుంది. ఆ ముద్ద సన్నటి అన్నవాహికలో ముందుకు వెళ్ళలేదు. గొంతు పడుతుంది. 2) కొంతమంది గబగబా 5 నిమిషాలలో అన్నం తినే కార్యక్రమాన్ని పూర్తి చేయాలనుకొంటారు. వారు ఒక ముద్ద అన్నవాహికలో ముందుకు జరగకపూర్వమే మరొక ముద్దను నోటిలో కుక్కుట జరుగుతుంది. దానివల్ల కూడా గొంతు పట్టేస్తుంది. 3) కొంతమంది గొంతు పట్టినా తింటూ ఉంటారు. అప్పుడు ఎక్కిళ్ళు వస్తాయి. ఎక్కిళ్ళు వచ్చినా తినటం ఆపరు. నీళ్ళు త్రాగుతారు. అప్పుడు త్రాగిన నీరు తిన్న ఆహారాన్ని జీర్ణం చేయుటలో ఉపయోగపడదు.

**నివారణోపాయాలు :**

1) అన్నం తినటానికి అరగంట ముందు, తిన్న రెండు గంటల తరువాత మాత్రమే నీరు త్రాగలి. 2) అన్నం తినునపుడు ఎవరితోను మాట్లాడరాదు. తినేటప్పుడు హడావిడి పనికిరాదు. అన్నం తినటంపైనే మనస్సును లగ్నం చేయాలి. ప్రశాంత చిత్తంతో అన్నం తినాలి. అన్నం బాగా నమిలి తినాలి. భోజనానికి 20–30 నిమిషముల సమయం తీసుకోవాలి.

## 9. గొంతునొప్పి
## (Sore Throat/ Pharyngitis)

నోటి వెనుక భాగాన ఆహారనాళం దాటుతూ శ్వాసనాళం ఉండు ప్రాంతాన్ని గ్రసని/కుత్తుక/సప్తపథ అని అంటారు. దానిలో రెండు బాష్ప గ్రంథి నాళములు, రెండు యూస్టేషియన్ ట్యూబ్‌లు, రెండు నాసికలు, ఒక నోరు కలిపే మార్గం ఉంటుంది. కొన్నిసార్లు నొప్పి, వేడి, ఎరుపు, మంట, తీపు, వాపు ఉండును. దీనిని గొంతునొప్పి / వ్యాధి అని అందురు.

**లక్షణాలు :** 1) మొదట నోటి లోపలి భాగములో వాపు 2) కొండ/చిరు నాలుక పొడవగుట 3) టాన్సిల్స్ వాచుట 4) గొంతులో గులగుల 5) మాటిమాటికి దగ్గి ఉమ్మి బయటకు

తెచ్చుకొనదలచుట 6) కొన్ని సమయాల్లో మ్రింగుట కష్టముగా నుండుట 7) ఊపిరి పీల్చుకొనుట కష్టమగుట.

**కారణాలు :** 1) టాన్సిల్సు/ఎడినాయిడ్స్ (ముక్కుకాయలు/కొయ్యకండలు) ఉండుట 2) ఇన్ఫ్లూయంజ, డిఫ్తీరియా[1], పొంగు, రుమాటిక్ జ్వరం ఉండుట 3) సిఫిలిస్/సవాయి 4) పొగత్రాగుట 5) చలి, తేమ వాతావరణమునకు గురియగుట 6) మద్యపానం 7) క్యాన్సర్ 8) ఇన్ఫెక్షన్, బాక్టీరియా 9) గొంతు ఎండిపోవుట, 10) నీరు తక్కువగా త్రాగుట మొ॥ కారణాలు.

**నివారణోపాయాలు :**

1) గొంతుకు చలిగాలి సోకనీయరాదు. 2) మెడపై కప్పుకొనుట మంచిది. 3) వెచ్చని నీరు త్రాగాలి. 4) ఉప్పునీటితో అప్పుడప్పుడు పుక్కిలించాలి. 5) చప్పరించటానికి ఏదైనా ఇస్తూ ఉండాలి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12X :** గొంతు పొడిగ, ఎర్రగ, వాపు, నొప్పితో నుండుట – ఈ స్థితిలో ఈ మందును అనేక మోతాదులుగ ఇచ్చిన రక్తాధిక్యత ఉండుటను, వేడిని, జ్వరాన్ని, నొప్పిని, ధనారింపును, గొంతు నొప్పిని; పుండయి, వాచిన అంగిటి (నోటి ఊర్ధ్వభాగం)ని, తరుణ స్థితిలో నున్న లారినిక్స్ వ్యాధి[2]ని తగ్గించును – గొంతు మండుట, నొప్పి – గొంతును ఎక్కువగ ఉపయోగించే ఉపన్యాసకులు, పాటలుపాడువారి గొంతు నొప్పికి ఇది మంచి మందు – సాయంకాలమునకు బొంగురుతనం వచ్చు ప్రవృత్తి ఉండుట.

**కాలీమూర్ 6X :** గ్రంథులు/టాన్సిల్స్ వాచినపుడు ఫెర్రంఫాస్‌ను, కాలీమూర్‌ను మార్చి మార్చి వాడాలి. గొంతువాపు, నాలుకపై తెల్లని/బూడిద రంగు గల మచ్చలు ఉండుట. సిఫిలిస్ తత్త్వంవల్ల వచ్చిన గొంతునొప్పి. ఏదైనా మ్రింగినపుడు గొంతు నొప్పి – దుర్గంధ భరితమైన, చిన్న ఉండలవలె ఉండు కళ్ళె/గల్లును మ్రింగుట. ఈ మందుతో పుక్కిలించిన గొంతునొప్పి తగ్గునని ప్రొఫెసర్ వెర్థీమ్ సిఫారసు చేసినాడు. చిన్న నూకలుగ ఉండు కళ్ళె – ఎడినాయిడ్స్ ఉబ్బు – గట్టిగను, తెల్లగను వుండు కఫం/కళ్ళె – ముక్కు రంధ్రముల వెనుక భాగపు ద్వారములందు కూడ చిన్న నూకలుగ ఉండు చీమిడి. రోగి గొంతులోని కళ్ళెను పైకి తెచ్చుటకు గట్టిగ కాండ్రించవలసి యుండుట. గట్టిగను, జిగటగను నుండు

*1. **డిఫ్తీరియా** (Diphtheria) : ఇది అపాయకరమగు అంటువ్యాధి. గొంతుక, మెడవాచును. టాన్సిల్సు, అంగుడు, కొండనాలుక, ముక్కు రంధ్రములపైన పొరవంటిది ఏర్పడును. ఊపిరాడకపోవచ్చును. నొప్పి, వాపు ఉండును.*

*2. **లారినిక్స్ వ్యాధి :** ఈ వ్యాధి జ్వరం, గొంతు బొంగురుపోవుట, మొరగుచున్నట్లుండు దగ్గుతో ప్రారంభమగును. దగ్గు తర్వాత శ్వాస ఆడుట కష్టమగును.*

కళ్ళె దగ్గుటకు బాగా ప్రయత్నించిన తర్వాత తొలగుట. గొంతు పొడిగ నుండుట – మ్రింగుట కష్ట దాయకంగాను, బాధాకరంగాను ఉండుట.

**కాలీఫాస్ 6X :** గొంతునందలి ధాతువులు మృతిచెందుట–గొంతు చాలా పొడిగ ఉండుట – ఎప్పుడూ కళ్ళెను మ్రింగాలని తలంచుట – గొంతునుండి ఉప్పుగా నుండు కళ్ళె బయటికి వచ్చుట.

**నేట్రంమూర్ 6X :** గొంతు వాచుట. నీళ్ళవంటి స్రావములతో మెడ యందలి థైరాయిడ్ గ్రంథి వాచుట. గొంతులోని ఆమత్వక్కు పొర వాచుట – పారదర్శకమగు కళ్ళెతో గొంతు భాగాలు కప్పబడుట – కొండనాలుక బిగి సడలుట. దీర్ఘకాలంగా వున్న గొంతునొప్పి – గొంతులో ఏదో ముద్ద ఉన్నట్టి భావన. గొంతు ఎక్కువ పొడిగ నుండుట. గొంతు దగ్గరకు ముడుచుకొని పోయినట్లుండుట, కుట్టినట్టి నొప్పి. పొగత్రాగువారి గొంతునొప్పికి (సిల్వర్ నైట్రేట్ చికిత్స తర్వాత) బాగా ఉపయోగపడును.

**నేట్రంఫాస్ 6X :** టాన్సిల్స్‌పై పసుపుపచ్చని క్రీమువంటి కఫం – పొడిగానున్న భావన – ఉదయాన నాలుకపై పసుపుపచ్చని పూత – గొంతులో ఉండలాంటి స్రావం – ద్రవాన్ని మ్రింగిన తర్వాత గొంతునొప్పి అధికమగుట.

**కాల్కేరియాఫాస్ 6X :** నిత్యం మాట్లాడెడి వృత్తి యందు ఉండువారిలో స్వరం బొంగురు పోవుటతో కూడిన గొంతునొప్పికి దీనిని మధ్య–మధ్య వాడాలి.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** గొంతునొప్పి చివరిదశలో గొంతుకు చీముపట్టుట – పసుపు పచ్చని పదార్థం వెలువడుట.

**మెగ్నీషియంఫాస్ 6X :** దీర్ఘకాలపు గొంతునొప్పిలో వేగంగా తినుటకు ప్రయత్నించినపుడు ఊపిరాడుకుండుట.

**నేట్రంసల్ఫ్ 6X :** గొంతునొప్పి – మ్రింగునపుడు గొంతు పొడిగా ఉండుట – గొంతులో ఏదో ముద్ద ఉన్నట్టి భావన. గొంతు నొప్పిలో గొంతు వాపు, పుండు పడియుండుట, మంటగా ఉండుట. డిఫ్తీరియాలో వాంతులు – పొట్టలో నుంచి కఫం ఊటవలె ఉండుట.

**కాల్కేరియాఫ్లోర్ 6X :** కొండనాలుక బిగి సడలుట – స్వరపేటికలో గిలగింతలు – ఉద్రేకపరచు దగ్గు –తెల్లవారుజామున కఫాన్ని కాండ్రించుట – వేడిమి/వేడి పానీయములను త్రాగుటవల్ల గొంతు మంట తగ్గుట. –గొంతుమడతల నొప్పి – టాన్సిల్స్‌పైన కళ్ళె ఉండలు నిరంతరం ఏర్పడుట.

## 10. టాన్సిల్సు / గవదకాయలు వాపు (Tonsilitis)

మన నోటిలో నాలుక మొదలుకు ఇరువైపుల వుండు రెండు గ్రంథులను గవదకాయలు/టాన్సిల్స్ అని అంటారు. ఇవి నోటి ద్వారా సూక్ష్మక్రిములు శరీరంలోనికి

పోకుండ అడ్డగించును. కాని పడిసెము, దగ్గు వచ్చినపుడు రోగనిరోధక శక్తి తగ్గి సూక్ష్మ క్రిములు నోటిద్వారా శరీరం లోనికి సులభంగా ప్రవేశించును. అప్పుడు గవదకాయలు వాచి బాధిస్తాయి. కొందరిలో అవి వాచి గట్టిపడును. అప్పుడు శ్వాసపీల్చుట కష్టమగును. సాధారణంగా చలిగాలి సోకినా, చల్లని పదార్థాలను సేవించినా కొందరిలో టాన్సిల్స్ వాచును. అప్పుడు జ్వరం, నొప్పి ఉండును. మ్రింగుట కష్టమగును. కొంతమంది అల్లోపతి వైద్యులు టాన్సిల్స్ వాచిన వాటిని శస్త్రచికిత్స చేసి తొలగింతురు. దీనివలన తర్వాత కొన్ని దుష్పరిణామములు సంభవించ వచ్చు. కనుక ఎక్కువ సమయం పట్టినా, బాధలకు ఓర్చుకొనవలసివచ్చినా క్రిందపేర్కొన్న జాగ్రత్తలు పాటించాలి. తర్వాత ద్వాదశ లవణములు లక్షణాలను బట్టి తీసుకొనుట మంచిది. స్వీట్సు, ఐస్‌క్రీములు, చాక్లెట్స్ మొ॥వి ఎక్కువగా తినే పిల్లలకు, కూల్‌డ్రింక్స్ ఎక్కువగా త్రాగేవారికి టాన్సిల్స్ వాపు ఎక్కువగా వస్తుంది.

**నివారణోపాయాలు :**

1. రోజంతా కాచి చల్లార్చిన నీరు త్రాగాలి / త్రాగేటప్పుడు నీటిని గోరువెచ్చగా చేసుకొని త్రాగాలి. నీటిని ఎక్కువగా త్రాగితే ఈ బాధ త్వరగా తగ్గుతుంది.
2. వేపపుల్ల నమిలి ఆ చేదును ఊసివేస్తూ ఉండాలి. ఆ చేదుకు కొంత ఇన్‌ఫెక్షన్ తగ్గుతుంది.
3. గొంతు పైభాగాన రెండు పూటలా కొద్దిగా నూనె రాయాలి. తర్వాత వేడినీటి కాపడం పెట్టాలి.
4. వాపు ఎక్కువగా వున్నచో 2,3 రోజులపాటు ఉపవాసం ఉంటే మంచిది. ఉపవాస సమయంలో నీరసం ఏర్పడకుండా ఉండుటకు తేనె, నీళ్ళు తీసుకోవాలి.
5. వాపు కొద్దిగా తగ్గిన తర్వాత మధ్యాహ్నం పూట చప్పటి కూరలతో కొద్దిగా అన్నం తినాలి. సాయంకాలం పండ్లు తినుట మంచిది. రాత్రిపూట తేనె నీళ్ళు త్రాగవచ్చు.
6. ఈ విధంగా ఒకవారం రోజులు చేసినచో మందుల అవసరం లేకుండానే వాపు తగ్గును.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× - 12× :** టాన్సిల్స్ ఎర్రగ, మంటగ, వాపుతో ఉండుట - గుటక వేయుట బాధాకరముగ ఉండుట - ఈ మందు ఒక్కటే తొలిదశలో ఈ వ్యాధిని నయం చేయును.

**కాలీమూర్ 6× :** గొంతులో వాపు ఉన్నచో దీనిని వాడాలి - గొంతులో తెల్లటి/బూడిద వర్ణపు మచ్చలు - టాన్సిల్స్ వాపు (దీర్ఘకాలపు/తరుణ వ్యాధి) - వాపు ఎక్కువగా ఉండుట.

**కాలీఫాస్ 6× :** టాన్సిల్స్ పెద్దవిగను, పుండుపడి వుండుట - వాటిపై తెల్లని ఘనపదార్థం పేరుకొనుట (deposit).

**నేట్రంఫాస్ 6× :** నాలుక వాపు – పొట్ట ఆమ్లస్థితి వల్ల బంగారు పసుపుపచ్చని రంగు ద్రవం స్రవించుట – దీర్ఘకాలపు టాన్సిల్స్ వాపు.

**కాల్కేరియాఫాస్ 3× – 12× :** దీర్ఘకాలంగా వున్న టాన్సిల్స్‌వాపు – దీనివల్ల నోరు తెరుచుకొనుటకు కష్టంగా వుండుట, చెవుడు ఏర్పడుట, మ్రింగుట కష్టమగుట – ఇలాంటి లక్షణాలు ఉన్నప్పుడు దీనిని మధ్య మధ్య వాడాలి – గొంతు బొంగురుపోవుట.

చిన్నపిల్లలలో మెత్తని టాన్సిల్స్ బాగా పెద్దవైనప్పుడు ఈ మందును 2వ పొటెన్సీలో ఇవ్వగా టాన్సిల్స్ సైజును బాగా తగ్గించినది. **(హె.సి.ఫ్రెంచ్, ఎం.డి)**

**కాల్కేరియాసల్ఫ్ 3× – 12× :** టాన్సిల్స్ వాపు చివరిదశ – చీము స్రవించుట/టాన్సిల్స్‌పై పుండు ఏర్పడుట.

**నేట్రంమూర్ 6× – 30× :** కొండ నాలుక వాచుట. దీనిని బట్టి టాన్సిల్స్ వాపుకు కారణం ఆమత్వక్కు కణములు అని తెలియుచున్నది. కనుక కాలీమూర్ కన్నా ఈ మందే సరైనది. దీర్ఘకాలంగా వున్న టాన్సిల్స్ వాపు కూడ ఈ మందును 30వ పొటెన్సీలో తీసుకొన్న బాగా తగ్గిన సందర్భాలు అనేకం కలవు.

**మెగ్నీషియంఫాస్ 6× :** కుడివైపున నున్న టాన్సిల్ ఎక్కువగ వాచుట – గొంతు బాగా ఎర్రగా ఉబ్బినట్లు ఉండుట – రోగి శీతల స్వభావుడుగాను, అలసిపోయినవానిగాను ఉండుట – తలనొప్పి, వేడిమిచే ముఖం ఎర్రబడుట.

**ద్వాదశ లవణ మిశ్రమం :** ఒక్కొక్క మోతాదులో కాల్కేరియాఫాస్ 6× – 1 మాత్ర, ఫెర్రంఫాస్ 6× – 1 మాత్ర, కాలీమూర్ 6× –1 మాత్ర చొప్పున మొత్తం 3 మాత్రలు తీసుకోవాలి. ఈ విధంగా ఉదయం, రాత్రి కొన్ని నెలలపాటు వాడాలి.

## 11. థైరాయిడ్ గ్రంథి కంతి
## (Goitre)

కంఠమునందు థైరాయిడ్ గ్రంథి ఉండును. అది థైరాక్సిన్ అనే హార్మోనును స్రవింపజేస్తుంది. కొన్ని సందర్భాలలో ఈ హార్మోను ఎక్కువగను, మరికొన్ని సందర్భాలలో అది తక్కువగను స్రవించును. ఈ హార్మోను ఎక్కువగ స్రవించిన శరీరం వేడిగా ఉండును. గుండె వడిగా కొట్టుకొనును. చెమటపట్టును. ఆకలి ఎక్కువగును. బరువు తగ్గును. ఈ హార్మోను తగ్గిన బద్ధకత్వం, లావు పెరుగును.

థైరాయిడ్ గ్రంథి పెద్దదగుట వల్ల కొంతమందిలో కన్నుగ్రుడ్లు రెప్పలలో నుండి బయటకు పొడుచుకొని వచ్చినట్లుండును.

కొన్ని సందర్భాలలో ఎదురు రొమ్ములో నున్న పలచటి పొడుగాటి ఎముకకు వెనుక వైపున థైరాయిడ్ కణితి ఏర్పడును. కొన్ని ప్రాంతాలలో త్రాగునీటిలో అయోడిన్ లోపం వల్ల కూడా ఈ వ్యాధి వచ్చును.

**• చికిత్స •**

**మెగ్నీషియంఫాస్ 6× - 12× :** గొంతు బిగ్రబిగియుట, బాధగ ఉండుట – ముఖ్యంగ కుడివైపున – దేహభాగాలు లావుగ ఉండుట – గొంతు అంతట చల్లదనం, నొప్పి.

**నేట్రంమూర్ 6× - 12× :** థైరాయిడ్ గ్రంథి పెద్దదగుట, నీళ్ళవంటి స్రావాలతో (ఈ లక్షణానికి ముఖ్యమందు కాల్కేరియా ఫాస్ 6×).

**సైలీషియా 6× - 12× :** థైరాయిడ్ గ్రంథి పెద్దదగుట – విపరీతమైన ఆకలి – మాంసం, వేడిగనున్న ఆహారం పట్ల అయిష్టం.

**నేట్రంఫాస్ 6× :** థైరాయిడ్ గ్రంథి పెద్దదగుట – గొంతులో ఆకస్మికముగ వచ్చు నొప్పి – వీపులోను, కాళ్ళు – చేతులలోను బలహీనత.

**ద్వాదశ లవణ మిశ్రమం :** ప్రతిమోతాదుకు కాల్కేరియా ఫ్లోర్ 3× – 1 మాత్ర, కాలీఫాస్ 3×–1 మాత్ర, నేట్రంమూర్ 3×–1 మాత్ర, మెగ్నీషియంఫాస్ 3×–1 మాత్ర చొప్పున మొత్తం 4 మాత్రలు ప్రతిరోజు ఉదయం, రాత్రి తీసుకొనవలెను.

## 12. కంఠ / గండమాల
## (Scrofula)

రేగిపండు/ఉసిరికాయ ప్రమాణం గల గ్రంథులు చంకలలోను, కంఠం నందు, దవడల క్రింద, గజ్జలలోను వరుసగ మాలవలె ఏర్పడిన కంఠ/గండమాల అని అందురు.

**లక్షణాలు :** 1) స్క్రాఫ్యులా తత్త్వపు[1] లక్షణాలు (ఆకలి లేకపోవుట, రక్తక్షీణత, మొ॥ లక్షణాలు ఉండుట). 2) గ్రంథులు వాచుట.

**కారణాలు :** 1) వంశపారంపర్యత 2) క్షయరోగ కుటుంబమునకు చెందుట 3) దగ్గర బంధువులలో వివాహములు జరుగుట 4) సుఖ వ్యాధులు 5) మద్యం సేవించుట 6) పౌష్టిక ఆహారలోపం 7) తేమ ప్రదేశమున నివసించుట.

**నివారణోపాయాలు :**

1. రోగి పరిశుభ్రమైన గాలి తగులు ప్రదేశంలో పడుకొనవలెను. 2. చలిగాలిలో ఎక్కువగ తిరగరాదు 3. పౌష్టిక ఆహారం తినవలెను.

*1. **స్క్రాఫ్యులా తత్త్వం :** ఇది క్షయకు ముందు ఉండు స్థితి. ఈ స్థితిలో తెల్లకణాలు జున్నువలె రూపాంతరం చెందియుండవు. క్షయలో తెల్లకణాలు జున్నువలె రూపాంతరం చెందును.*

### చికిత్స

**సైలీషియా 6×-12× :** బలహీనులకు, పెద్దతలగలవారికి-చెవినుండి చీము కారుచుండుట.

**కాలీమూర్ 6× :** కంఠం వద్ద గ్రంథులు వాచుట.

**కాల్కేరియాఫాస్ 6× :** కృశించియుండుట - జీర్ణశక్తి తక్కువగనుండుట - కంపములు వచ్చుట.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** గ్రంథులు వాచి గట్టిగ రాయివలె ఉండుట.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** సైలీషియా గ్రంథులకు చీముపట్టుటను వేగిరపరచును. ఆ పరిస్థితిలో రక్తంలో కాల్కేరియా సల్ఫ్ తగు పరిమాణంలో ఉన్నచో చీము స్రవించుటను ఆపుచేయును **(కేరే)** - కనుక గ్రంథులకు చీముపట్టియున్నచో ఈ మందును ఇచ్చిన చీము స్రవించుటను ఆపి గ్రంథిని నయం చేయును.

## 13. బొంగురుతనం / స్వరం పోవుట
**(Hoarseness / Aphonia)**

మనం మాట్లాడుటకు, పాటలు పాడుటకు గొంతులోనున్న స్వరపేటిక ఉపయోగపడుతుంది. వాతావరణంలో అకస్మాత్తుగా వచ్చే మార్పులవల్లను, మాట్లాడుట/పాటలు పాడుట మొ॥ పనులలో స్వరపేటికకు అధిక శ్రమ కల్పించిన స్వరం బొంగురు పోవును. మాట సరిగా రాదు.

### • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12× :** పాటగాంఢ్రు/గాయకులు పాట పాడిన తర్వాత, వక్తలు మాట్లాడిన తర్వాత స్వరపేటికలో బాధ కలుగుట - చల్లగాలి వల్ల, జలుబువల్ల సాయంకాల సమయాన బొంగురుతనం ఏర్పడును.

**కాలీమూర్ 6× :** బొంగురుతనం, జలుబు వల్ల స్వరం క్షీణించుట - మొండి కేసులలో దీనితర్వాత కాల్కేరియా సల్ఫ్‌ను వాడాలి.

**కాలీఫాస్ 6× :** తన స్వరాన్ని అధికంగా వాడటంవల్ల నాడీ వ్యవస్థ క్రుంగిపోయి ఏర్పడు బొంగురుతనం - కీళ్ళవాత వ్యాధి వల్ల వచ్చే బొంగురుతనం.

**కాలీసల్ఫ్ 3×-6× :** జలుబు వల్ల, స్వరతంత్రులవల్ల కలిగే బొంగురుతనం.

**సైలీషియా 6×-12× :** క్షోభ కలిగించే దగ్గుతోనున్న బొంగురుతనం.

**కాల్కేరియాసల్ఫ్ 3×-6× :** మొండిగానున్న బొంగురుతనం.

# 14. జీర్ణాశయపు అవ్యవస్థ
## (Gastric Derangements)

జీర్ణాశయములో జీర్ణక్రియకు అవసరమైన కొన్ని రసాలు స్రవిస్తాయి. ఈ రసాల ఉత్పత్తి సరిగా లేనపుడు ఆహారం జీర్ణం కాదు. దీనివల్ల అజీర్ణం, ఆకలి లేకపోవుట, పొట్ట ఉబ్బరించుట మొ॥ లక్షణాలు కన్పిస్తాయి.

జీర్ణాశయంలో ఆమ్లం ఎక్కువగా స్రవించినచో జీర్ణాశయపు గోడలను కప్పివుంచు సున్నితమైన ఆమత్వక్కుపొర దెబ్బతిని అక్కడ చిన్న పుండ్లు ఏర్పడును. దానివల్ల కలుగు బాధలు భోజనానికి ముందుగాని, తర్వాతగాని లేదా ఎల్లప్పుడు గాని ఉంటాయి.

**జాగ్రత్తలు :** 1) సాత్విక ఆహారం తీసుకొనవలెను. ఎక్కువ కారం, మసాలా పదార్థాలు తినుట బాగా తగ్గించాలి. దీనివల్ల కడుపు, కాలేయము, ప్రేగులు మొ॥ వాటికి బాగా విశ్రాంతి లభించును. 2) కాఫీ, టీ, పొగత్రాగుట పూర్తిగా మానుట/తగ్గించుట చేయాలి.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 3×-12× :** జీర్ణాశయపు జ్వరపు చలిదశకు ఈ మందు ఉపయోగకారి. నొప్పితోవున్న జీర్ణకోశపు వాపు (తరుణవ్యాధి). ఆహారం వాంతి అయిన తర్వాత రొమ్మెముక క్రింది భాగం చాలా సున్నితంగా వుండుట. అజీర్ణం, ముఖం ఎరుపెక్కుట, ఉదర కుహర మండలం తాకిన సున్నితంగా వుండుట. అజీర్ణం, బ్రద్ధలు చేయు నొప్పి, వేడిమి, ఎర్రని ముఖం, అజీర్ణమైన ఆహారాన్ని వాంతి చేసుకొనుట, నాలుక శుభ్రంగా వుండుట. కడుపు రక్తనాళాల కండరాల గోడలు వదులుగా నుండుటచే కలుగు అజీర్ణం, నొప్పితోనున్న సున్నితత్వం, కందిన ముఖం, ఆహారం తిన్న తర్వాత నొప్పి. అపానవాయువు వెలువడుట, తిన్న ఆహారపు రుచితో త్రేపులు. పిల్లలలో జలుబు వల్ల కడుపునొప్పి, ఒత్తిడి వల్ల నొప్పి ఎక్కువగుట. ఆంత్రచూషకములు[1] బిగిసడలుట వల్ల తేమ సరిగా పీల్చలేకపోవును. దీని వల్ల కడుపునొప్పి, నీళ్ళవిరేచనాలు అగుట. ఆకలి తగ్గుట, పాలంటే అయిష్టం, తిన్న తర్వాత వమన వికారం, ఆహారమును వాంతి చేసుకొనుట, వాంతి చేసుకొన్న పదార్థాలు పుల్లగా నుండుట. ఆమ్లాలు, హెరింగ్ చేపలు, మాంసము / కాఫీ, కేకులు అయిష్టం. కొన్ని సందర్భాలలో ఉదయపు ఫలాహారమునకు ముందు వాంతి చేసుకొనుట, తలనొప్పి, నుదుటియందు, చెంపలలోను సుత్తితో కొట్టినట్లు నొప్పి – ఈ లక్షణాలను బట్టి మెదడునందలి రక్తనాళం పగులుటచే పక్షవాతం వచ్చునేమోనని భయపడుట. బహిష్టుస్రావం ప్రతివారం అత్యధికంగా అగుట, ఉదరకుహరములోను, త్రికాస్థి, నడుముకు క్రింది భాగాన నొప్పి, నిద్ర అస్థిమితంగా వుండుట, భయంకరమైన కలలు వచ్చుట, వీటివల్ల ఉదయానికి తాజాగా నుండు పరిస్థితి ఏర్పడక పోవుట.

*1. **ఆంత్రచూషకములు :** ఇవి సన్నని నూగు వెంట్రుకల వలె ఉండును. చిన్న ప్రేగులలో వీటి పొడవు 0.5-1.5 మి.మీ. ఉండును.*

**కాలీమూర్ 3× - 6× :** నాలుకపై బూడిదరంగు/తెల్లని పూత లేక వివిధాకృతులుగల మచ్చలు ఏర్పడుట. క్రొవ్వు పదార్థాలు గల (వెన్న, నెయ్యి, నూనె కలిసిన) ఆహారం తినినా; కళ్ళు పెద్దవిగాను, ముందుకు తోసుకొని వచ్చినట్లుగా కనిపించునపుడు అజీర్ణం, భుజం క్రింద కుడివైపు భారంగా వుండుట/నొప్పి. అపాన వాయువు వెలువడుట, కాలేయం సరిగా పనిచేయకపోవుట, బూడిద రంగుగల/తెల్లని నాలుక. బాగా వేడిగానున్న పానీయములను త్రాగిన జీర్ణకోశపు నొప్పి వచ్చినచో ఈ మందును వెంటనే ఇవ్వాలి. జీర్ణకోశపు వాపు ద్వితీయ దశ. క్రొవ్వు పదార్థాలను అధికముగా తిన్న తర్వాత వచ్చు అజీర్ణం, నాలుకపై తెల్లని పూత. చేదు రుచి, క్రొవ్వు పదార్థాలను తిన్న తర్వాత జబ్బు చేయుట, అపారదర్శకమగు శ్లేష్మమును వాంతిచేసుకొనుట. కడుపునొప్పి, మలబద్ధకం.

**కాలీఫాస్ 3×- 6× :** తిన్నవెంటనే ఎక్కువ ఆకలిగా నున్నట్టి భావన. ఉత్సాహం క్రుంగుట, బలహీనత, అపానవాయువు వెలువడుట, గుండెవద్ద/కడుపు ఎడమవైపున బాధ, గుండె బలహీనత, ఎడమవైపున బడలిక. దీనికి చికిత్స ఆలస్యమైనచో జీర్ణకోశపు వాపు వచ్చును. రక్తప్రసరణ నెమ్మదించును. అజీర్ణం, నరాల అధిక బలహీనత. భయం, ఉద్రేకంతో కూడిన కడుపునొప్పి. పొట్టలో పుండు (ulcer)/క్యాన్సర్. ఎక్కువ దప్పిక, కొరికి తినాలనే భావన, ఏదైనా తినుట వల్ల తగ్గుట. చేదైన, ఘాటు రుచితోనున్న త్రేపులు. కడుపుమీద ఉదరకుహర మండలం వద్ద స్థిరమైన నొప్పి.

**కాలీసల్ఫ్ 3×- 6× :** దీర్ఘకాలంగా పొట్ట జలుబు వుండుట. నాలుకపై పసుపుపచ్చని, జిగురు వంటి పూత. జీర్ణాశయపు వాపు, కడుపు గుంట (ఉదరకుహర మండలం) నిండుగాను, బరువుగాను వున్నట్లు భావన కలుగుట. ఉదరకుహర మండలం వద్ద నిస్త్రాణ, అజీర్ణం, నొప్పి, మంటగా నుండు త్రేపులు, నోటిలో నీరు చేరుట (నేట్రంమూర్, కాలీమూర్ తర్వాత). కడుపులో కుడి తుంటి పైభాగముపై నొప్పి. కడుపులో శూల (మెగ్నీషియం ఫాస్ వల్ల ఉపశమనం లభించనపుడు దీనిని వాడవలెను). సాయంకాలం బాధలు ఎక్కువగుట.

**మెగ్నీషియంఫాస్ 3×- 6× :** కడుపు గుంట వద్ద నొప్పి – నమలుచున్నట్లు, నొక్కుచున్నట్లు, పీకుచున్నట్లు, పట్టుకొను చున్నట్లు నొప్పి విడిచి విడిచి వచ్చుట – త్రేపులవల్ల నొప్పి తగ్గకుండుట. నాలుక శుభ్రంగా వుండుట. జీర్ణాశయములోని కండరాలను గట్టిగా రబ్బరు బ్యాండుతో గట్టిగా కట్టినట్లు అనిపించుట. నొప్పితో అపానవాయువు వెలువడుట, అపాన వాయువు వెలువడినా నొప్పి తగ్గకుండుట. ఏదైనా తిన్న తర్వాత ఉద్ధృతముగా ఎక్కిళ్ళు వచ్చుట. భోజనానంతరం తినిన పదార్థములు నోటిలోనికి వచ్చుచుండుట – అజీర్ణం – రోగి పంచదారను తినగోరుట. బొడ్డుచుట్టూ నొప్పి వుండును. ముడుచుకొని పరుండినా, రుద్దినా, వేడికాపడం పెట్టినా నొప్పి తగ్గును. అజీర్ణం, ఈడ్పులు, కండరములందు

బాధలు ఎక్కువగుట, నాలుక శుభ్రంగా ఉండుట. పొట్ట పై పొర కండరాలు నొప్పిగా బంధింపబడివుండుట – వేడి నీటి కాపడంవల్ల కూడా నొప్పి తగ్గకుండుట.

**నేట్రంమూర్ 3×– 6× :** అజీర్ణం, నొప్పి, నోటిలో నీరు చేరుట, శుద్ధమైన నురుగు నీరు లేక దారంవలె వుండు లాలాజలం. కడుపునొప్పి, నోటిలో ఎక్కువ లాలాజలం చేరుట – గొంతులోనికి నీళ్ళవంటి ద్రవం వచ్చుట – మలబద్ధకం – దుర్వాసన గల శ్వాస – విపరీతమైన ఆకలి – విపరీతమైన దప్పిక. పొగత్రాగాలనే కోరిక నశించుట. బ్రెడ్ తినుట యందు అరుచి. చేదైన రుచి. ఉదరకుహర మండలం వద్ద అధిక బలహీనత. పొట్టగుంట వద్ద ఎర్రని మచ్చలు

**నేట్రంఫాస్ 3× - 12× :** ఆమ్ల లక్షణాలు (కడుపులో మంట) – పుల్లని పదార్థం జీర్ణాశయం నుండి నోటిలోనికి వచ్చుట – లాక్టిక్ యాసిడ్ అధికముగ నుండుట. ఆకలి లేకుండుట, కొద్దిగా అజీర్ణంగా వున్నట్లు అనిపించుట. ఉదయాన నిద్రనుండి మేల్కొన్న తర్వాత నాలుక వెనుక భాగాన పలచని, తడిగానుండు క్రీమువంటి పూత. అపానవాయువు వెలువడుట, పుల్లని పదార్థం నోటిలోనికి వచ్చుట. జీర్ణాశయపు వాపు, నొప్పి, అజీర్ణం, నోటిలో పుల్లని రుచి. అజీర్ణం – భోజనం చేసిన వెంటనే/రెండుగంటల తర్వాత విపరీతమైన నొప్పి – ఆమ్లపు/పుల్లని పదార్థం నోటిలోనికి వచ్చుట. క్రిములవల్ల కడుపునొప్పి – ఆమ్లము పైకివచ్చుట – పొట్టవాపు – తిన్న తర్వాత ఒక చోట నొప్పి – కొన్ని సమయాల్లో పుల్లని పదార్థం నోటిలోనికి వచ్చుట – ఆకలి లేకపోవుట – ముఖం ఎర్రబడుట – ముఖంపై మచ్చలు – జ్వరం లేకుండుట – కడుపులో మంట – కాఫీ విత్తనాల వంటి నల్లని ద్రవాన్ని వాంతి చేసుకొనుట – క్రొవ్వు పదార్థం తిన్నతర్వాత జీర్ణాశయపు ఇబ్బందులు కలుగుట. నేట్రంఫాస్ క్రొవ్వును పాల వలె మార్చును.

**నేట్రంసల్ఫ్ 3× - 6× :** పైత్యాధిక్యత – నోటిలో చేదు రుచి – చేదు ద్రవాన్ని వాంతి చేసుకొనుట. నాలుకపై ఆకుపచ్చ – గోధుమ/బూడిద వర్ణపు పూత. ఆకుపచ్చని నీళ్ళ విరేచనాలు – నల్లని/పైత్యరసముతో నున్న విరేచనాలు. తలనొప్పి, తలతిరుగుడు, అలసట. ఉదయాన చేదు రుచి – పుల్లని త్రేపులు, కడుపులో మంట – పిండివంటలు తినుట వల్ల వాయువు అధికమగుట. పెద్దప్రేగు పురీషనాళపు S ఆకృతి వంపులోను, పెద్దప్రేగు యొక్క మొదటి 1/3 భాగములోను అపానవాయువు బంధించబడును. దీనివల్ల తీవ్రమైన శూల కలుగును. పిసుకుటవల్ల, ఉదరములో వాయువుచే గుడగుడ శబ్దం కలుగుట వల్ల ఈ శూల తగ్గును. కాలేయములో కుట్టినట్టి నొప్పి. నడుముచుట్టూ బిగుతుగానున్న వస్త్రాలను భరించలేకపోవుట.

**కాల్కేరియాఫాస్ 3× - 6× :** జీర్ణాశయపు జ్వరానికి దీనిని మధ్య–మధ్య ఇవ్వాలి. కొద్దిపాటి ఆహారం తీసుకొన్నా నొప్పి. కడుపులో మంట, ఒత్తిడి వల్ల పొట్ట బాధ

ఎక్కువగుట. పందిమాంసం, జంతువు తొడమాంసం, ఉప్పు, మసాలా వేసిన పదార్థాలను ఇష్టపడుట. ఉదయాన చేదురుచి, తలనొప్పి. జీర్ణాశయపు వాపు, ఆకలి, అపానవాయువు, కడుపునొప్పి – తినుటవల్ల, వాయువు పైకి వెళ్ళుటవల్ల తాత్కాలికంగా ఉపశమనం. పొట్టలో అధిక వాయువు చేరిన ఇది మంచి మందు. భోజనం తర్వాత అరగంటకు ఈ మందును నీటిలో వేసి ఇచ్చిన ఆహారమును శరీర ధాతువులు స్వీకరించకుండా చేయుటను తగ్గించును. తినుటవల్ల జీర్ణాశయపు నొప్పి తాత్కాలికముగ తగ్గును.

**కాల్కేరియాఫ్లోర్ 6X :** జీర్ణంకాని పదార్థాన్ని వాంతిచేసుకొనుట. శ్లేష్మమును కాండ్రించుటవల్ల ఎక్కిళ్ళు వచ్చుట. పగటిపూట బలహీనత, జీర్ణాశయపు బాధ తిరిగి వచ్చుట.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** పండ్లు, టీ, పసుపుపచ్చని, పుల్లని కాయగూరలు/ఆకుకూరలు ఇష్టపడుట. వికారం, తలత్రిప్పుడు. తినునపుడు నోటిపైభాగం పుండుగా వుండుట, పొట్టలో మంట.

**సైలీషియా 6X :** జీర్ణకోశపు అధోద్వారము గట్టిపడుట. జీర్ణాశయపు వాపు, ఆమ్లపు రుచిగల త్రేపులు, కడుపులో మంట, చలి, దీర్ఘకాలంగా వుండుట. మాంసం, వేడి ఆహారం పట్ల అయిష్టత. విపరీతమైన ఆకలి. సారాయి, మద్యము మొ॥ ఉత్ప్రేరకాలను సహించలేకపోవుట.

## 15. కడుపునొప్పి /శూల
## (Colic)

అప్పుడప్పుడు ఉదరభాగాన పిసికినట్లు తీవ్రమైన నొప్పివస్తుంది. కొన్ని సందర్భాలలో ఈడ్పులతో కూడిన నొప్పి వచ్చును. పెద్దవారు కడుపునొప్పిని అర్థం చేసుకోగలరు. మాటలురాని పిల్లలు తమ బాధను ఏడ్పు ద్వారా తెలుపుదురు. ఆకలి వేసినా, కోపం కలిగినా, ఏమీ తోచకపోయినా వారు ఏడుస్తూవుంటారు. కనుక ఇతర లక్షణాల ద్వారా మాత్రమే వారి కడుపు నొప్పిని అర్థం చేసుకోవాలి.

శిశువుల కడుపు మీద చెయ్యివేసి చూచినచో మెత్తగ నుండుటకు బదులు గట్టిగా రాయివలె వుండును. శిశువులు తమ తొడలను పొట్టవద్దకు లాగుకొందురు. కాళ్ళు తన్నుకొందురు. వారి విరేచనములో పెరుగుబిళ్ళల వంటి అజీర్ణపదార్థములు వుండును. అపానవాయువును వదలునప్పుడు ఏడ్పు మానుదురు.

**కారణములు :** 1) అజీర్ణం, 2) మలబద్ధకం 3) క్రిములు 4) శరీర పరిశ్రమ లేకపోవుట 5) పిత్తాశయం (Gall-bladder)లో రాళ్ళు 6) ఉదర కండరాల సంకోచం 7) ప్రేగులలో వాయువు చేరుట 8) పెయింట్ పనులు చేయుట, పెయింట్ చేసిన వస్తువులను శిశువులు నోటిలో పెట్టుకొనుట (పెయింట్‌లో వుండు లెడ్ కడుపునొప్పికి కారణమగును)

9) మూత్రపిండాలలో రాళ్ళు 10) స్త్రీల బహిష్టు సమయం 11) కడుపులో పుండ్లు (gastric ulcers) 12) కడుపుకు వచ్చు క్యాన్సర్, 13) ఎపెండిసైటిస్ వాపు.

**నివారణోపాయాలు :**

1) తల్లిపాలు త్రాగునట్టి శిశువుకు కడుపునొప్పిగానున్న ఆ శిశువుకు ఆ రోజున పాలు త్రాపుట మంచిదికాదు. 2) పోతపాలు త్రాగు శిశువుకు కడుపు నొప్పిగా నున్న పాలను శుభ్రముగా తయారు చేయాలి. పాలసీసాను శుభ్రంగా వుంచాలి. నిల్వ వుంచిన పాలను త్రాపరాదు. ఆ రోజుకు మాత్రం శిశువుకు ఎట్టి పాలు త్రాపకుండుట మంచిది. 3) తమలపాకులకు ఆముదమును రాసి వెచ్చచేసి శిశువు పొట్టను కాచుట చాలా మంచిది. 4) పెద్దవారికి కడుపు నొప్పి వచ్చిన ఆ రోజు ఆహారం మానుట మంచిది. సగ్గుబియ్యం / బార్లీ గంజి / పండ్లరసం / మజ్జిగ / కొబ్బరినీళ్లు / తేనె నీళ్ళు త్రాగవచ్చు. పండ్లు తినవచ్చును. 5) ఇతర కారణాల వలన కడుపునొప్పి వచ్చినచో ఆ కారణాలను నిర్మూలించు చర్యలు గైకొనాలి. పెద్దలు ఎక్కువ నీరు త్రాగాలి. దీనివల్ల మలబద్ధకం వంటి ఇబ్బందులను అధిగమించవచ్చు. 6) నొప్పిగా ఉన్నచోట నూనె రాసి వేడినీటి బ్యాగ్ కాపడం పెట్టాలి. ఆ విధంగా 2 – 3 సార్లు చేయాలి. రోజూ రెండు పూటలా పొత్తికడుపుపై తడిగుడ్డ పెట్టాలి. దానివల్ల మలం బాగా కదులుతుంది.

**• చికిత్స •**

**మెగ్నీషియంఫాస్ 3× – 30× :** పిల్లల వాయుపూరితమైన శూల – పిల్లలను కాళ్ళు ముడుచుకొనునట్లు చేయు శూల – శూల రోగిని బాగా వంగునట్లు చేయుట – పిల్లల నాభి ప్రాంతములో కూడా శూల – కండరములు దగ్గరకు ముడుచుకొని పోవు శూల – పెరుగుతూ, తగ్గుతూ వుండే శూల – ఈడ్పులుగల నొప్పి – నూతనముగా పుట్టిన శిశువుల శూల – శూలగల పిల్లలు ఎక్కువ సమయం ఏడుస్తూనే ఉండుట – పిత్తాశయంలో రాళ్ళు ఏర్పడుట – గట్టిగా నొక్కుట వల్ల, వేడి కాపడం వల్ల, త్రేపుల వల్ల ఉపశమనం. ఈ మందును వేడినీటితో వాడాలి.

**నేట్రంఫాస్ 3× – 12× :** పిల్లలలో క్రిముల వల్ల నొప్పి – ఆమ్లత్వపు లక్షణాలతో (పుల్లని వాసనగల, ఆకుపచ్చని విరేచనాలు – పెరుగువంటి పదార్థం వాంతి అగుట – నాలుక వెనుక భాగాన పసుపు పచ్చని పూత మొ॥ లక్షణాలు) – మెగ్నీషియం ఫాస్‌తో గంటకొకసారి మార్చి దీనిని వాడవలెను.

**ఫెర్రంఫాస్ 6× – 12× :** బహిష్టు సమయాన వచ్చు శూల – వేడిమి – ముఖములో పొగలు – నాడి వడిగా కొట్టుకొనుట – ఈ మందును గంటకు ఒకసారి ఇవ్వాలి.

**నేట్రంసల్ఫ్ 3× – 12× :** కడుపు వాయుపూరితమగుటచే వచ్చు శూల – కుడిగజ్జ (పొత్తికడుపుకు తొడకు మధ్య భాగం) ప్రాంతంలో శూల ప్రారంభమగుట – పైత్యాధిక్యత

(నోటిలో చేదు రుచి, నాలుక మొదట్లో బూడిద / గోధుమ – ఆకుపచ్చ పూత మొ॥ లక్షణాలు) – దీనికి ఈ మందు 1×, 2× పొటెన్సిలో బాగా ఉపయోగకారి – పొత్తి కడుపులోను, నడుములోను కముకు దెబ్బవంటి నొప్పి – ఎక్కువ వాయువు వెలువడుట – క్రిందకు దిగిన అపానవాయువు పైకి వెళ్ళలేక పోవుట – ప్రసవం, మలబద్ధకం తర్వాత వచ్చు అపానవాయువునకు సంబంధించిన ఇబ్బందులు – సీసము (lead) తాకుట వల్ల శూల – ఎడమ ప్రక్కన పడుకొంటే శూల ఎక్కువగుట – అరగంటకు ఒకసారి దీనిని మెగ్నీషియం ఫాస్‌తో మారుస్తూ వాడాలి.

**కాలీసల్ఫ్ 6× :** శూలను పోలిన నొప్పులు – పొత్తికడుపు తాకుటకు చల్లగా నుండుట – అధిక వేడిమి, ఉద్రేకం, అకస్మాత్తుగా వచ్చు జలుబు కారణంగా వచ్చు శూల – గంధకపు వాసనగల అపానవాయువు వెలువడిన తర్వాత వచ్చు శూల – మెగ్నీషియం ఫాస్ వల్ల తగు ఫలితం లభించనప్పుడు దీనిని వాడాలి.

**కాలీఫాస్ 6× :** పొత్తికడుపు శూల – నిష్ఫలమైన మల విసర్జన – శరీరమును బాగా వంచిన శూల తగ్గుట – పొత్తి కడుపు వాయు పూరితమగుట.

**నేట్రంమూర్ 12× :** పైత్యరసాధిక్యత వల్ల కలిగే శూల – త్రేపులు.

## 16. మలబద్ధకం (Constipation)

మలబద్ధకం ఒక రోగము కాదు, అది అనేక రోగాల లక్షణం. నిజానికి మలబద్ధకమంటే నిర్ణీత వేళకు క్రమం తప్పకుండా విరేచనానికి వెళ్ళటం. కొంత మంది మాకు మలబద్ధకమేమిటి? మేము రోజూ ఒకసారి లేక రెండుసార్లు విరేచనానికి వెళ్తుంటామే అని చెబుతారు. కాని వారు ఒక రోజున ఉదయం నిద్రనుండి లేవగానే, రెండవరోజున మధ్యాహ్నం భోజనానంతరం, మూడవ రోజున సాయంకాలం విరేచనానికి వెళ్ళుతుంటారు. ఈ విధంగా సమయ నియమం లేకుండా విరేచనమగుట కూడా మలబద్ధకం క్రిందికే వస్తుంది.

శిశువులకు ప్రారంభమున దినమునకు 3–4 విరేచనములగును. 2, 3 నెలల తర్వాత విరేచనముల సంఖ్య తగ్గును. పెద్దవారు కూడా రోజుకు 2 – 3 సార్లు విరేచనమునకు వెళ్ళవచ్చు. మలం మన దేహములో నిలువయున్న అనేక విష పదార్థములు తయారై ఆరోగ్యం దెబ్బతినును. కనుక మలాన్ని ఎప్పటికప్పుడు విసర్జించుట మంచిది. మహాత్మాగాంధీ రెండవసారి మల విసర్జనకొరకై సాయంకాలం 3 – 4 గంటల ప్రాంతంలో పొట్టపై మట్టి పట్టీని వేసుకొనేవారు. దీనిని బట్టి వారు మలవిసర్జన పట్ల ఎంత శ్రద్ధ వహించేవారో తెలుస్తుంది. కాని ఆధునిక సభ్యత ప్రభావం వల్ల ఎక్కువమంది విద్యా

సంస్థలకో, ఉద్యోగ నిమిత్తమై ఆఫీసులకో, ఫ్యాక్టరీలకో వెళ్ళుతుంటారు. అక్కడ మల విసర్జనకు తగు వసతి లేకపోవుట, ఇతర కారణాల వల్ల రెండవసారి మల విసర్జనకు బద్ధకిస్తూ ఉంటారు.

3 – 4 రోజులు మల విసర్జన చేయనివారు కూడా వుంటారు. ఇది ప్రమాదకరం కానప్పటికీ దేహం నిలవవున్న మలాన్నంతటినీ బహిష్కరించుటకు అతిసారం / గ్రహణిని ఆశ్రయించాల్సి వస్తుంది.

**లక్షణాలు :** మామూలుగా ప్రజలు తలంచే దాని ప్రకారం మలబద్ధకానికి ఈ లక్షణాలు వుంటాయి.

★ మలము గట్టిగ, కొద్దిగ వెడలుట. ఒకప్పుడు చిన్న – చిన్న వుండలవలె గట్టిగ అతి కష్టము మీద వెడలుట. ఒక్కొక్కసారి ఈ వుండలకు తెల్లని జిగురు వంటి పదార్థం అంటుకొని యుండవచ్చును.

★ వాయిదాల పద్ధతిలో మల విసర్జన, అంచెలంచెలుగ మల విసర్జన.

★ మల విసర్జన సమయమున కొంతమందికి తినుక వలసి వచ్చును. దీనివల్ల ఎక్కువ బాధ కలుగును.

★ తలనొప్పి, స్థిమితము లేకపోవుట, ఉత్సాహం లేకుండుట, కడుపు ఉబ్బరం, తరచు విరేచన అనుమానం, నిద్ర సరిగా పట్టకపోవుట, పిల్లలలో శయ్యామూత్రం.

★ మలంలో నులిపురుగులు, అమీబాలు ఉండుట.

**కొన్ని ఇతర లక్షణాలు ఇవి –** 1) మొదట మూత్ర విసర్జన జరిగి తర్వాత మల విసర్జన జరుగుట. 2) మలవిసర్జనకై లెట్రిన్‌లో ఎక్కువసేపు గడపాల్సి వచ్చుట. కొంతమంది లెట్రిన్‌లో న్యూస్ పేపర్ అంతా చదువుతారు. కాని వారికి మల విసర్జన కాదు. 3) మల విసర్జన తర్వాత ప్లేటుకు/పాన్‌కు మలం గట్టిగ అతుక్కొనును. మలమును కడుగుకొన్న చేతికి జిగురు అంటుకొనును. 4) మల విసర్జన తర్వాత సంతృప్తి లేకపోవుట 5) వ్యాధి ముదిరిన వాంతులు, నోటిలో దుర్గంధం, కడుపునొప్పి వుండును. తరచుగా జ్వరం కూడా రావచ్చును.

**కారణాలు :**

1. తగినంత శరీర శ్రమ లేకుండుట
2. అవసరము కలిగినపుడు మల విసర్జనకు బద్ధకించుట
3. అజీర్ణం
4. టానిక్ ఆసిడ్ ఎక్కువగా గల కాఫీ, టీలు త్రాగుట
5. విరేచనకారులగు మందులు చాలా కాలం వాడుట. ప్రాచీన కాలములో తల్లులు శిశువులకు ఆముదము పట్టేవారు. గ్రైప్‌వాటర్ పోసేవారు. ఆముదము, గ్రైప్‌వాటర్

విరేచనకారులు. వాటివల్ల పిల్లలకు విరేచనమైతే అయ్యేది. కాని కాలక్రమములో దానివల్ల మలబద్ధకం ఏర్పడేది. కనుక నేడు డాక్టర్లు వాటిని వాడవద్దని చెబుతారు. పెద్దవారికి కూడా విరేచన కారులు వాడటం మంచిది కాదు

6. ప్రేగుల సంకోచ శక్తి నశించుట
7. కాలేయమునకు దెబ్బ తగులుట, కాలేయ వ్యాధులు
8. వెన్నెముక, మెదడుకు సంబంధించిన వ్యాధులు
9. కండరముల బలహీనత
10. నీటిని తగినంత త్రాగకపోవుట
11. అతిమూత్రం, మధుమేహం, బిడ్డకు పాలిచ్చుట, ఎక్కువగా చెమట పోయుట మొ॥ కారణాల వల్ల దేహంలోని ద్రవములు నష్టమగుట
12. నల్లమందు సేవించుట వల్ల ప్రేగుల చలనశక్తి లోపించుట
13. ప్రేగుల సమీపమున గడ్డలేమైనా ఏర్పడి ప్రేగుల చర్యను ఆపుచేయుట
14. పక్షవాతం
15. అలవాటు పడ్డ పరిసరాలు మారుట
16. హార్మోన్ల లోపం
17. కాల్షియం ఎక్కువగుట
18. అల్లోపతి మందుల సైడ్ అఫెక్ట్స్

**నివారణోపాయములు :**

1. విరేచనమునకు మందును వాడుట మానుకొనవలెను.
2. ఆహారంలో ఆకుకూరలు, కూరగాయలు అధికముగా తీసుకొనవలెను. వాటిలో పీచు అధికముగా వుండవలెను.
3. వేకువజామున నిద్ర లేవగానే 1-2 లీటర్ల నీరు ఏకధాటిగా గాని, 2-3 సార్లుగా గాని త్రాగాలి. త్రాగి నిద్రపోరాదు. వడివడిగా 20 నిముషాలపాటు నడవాలి. నీరు త్రాగిన తర్వాత మనసును ప్రేగుల మీదనే వుంచాలి. పేపరు చదువుట / టి.వి. చూచుట చేయరాదు. అంటే మనసును కేవలం మలవిసర్జనపైనే కేంద్రీకరించ వలెనని అర్థము. దీనిని బట్టి మన వ్యాధులకు, మనస్సుకు ఎంత సంబంధం ఉందో తెలుస్తుంది. మామూలు నీటిని త్రాగటం వల్ల విరేచనం కానిచో గోరువెచ్చని నీటిని త్రాగాలి.

*__గమనిక :__ 2 లీటర్లు నీరు ఒకే రోజున త్రాగుట కష్టం కావచ్చు. నెమ్మది-నెమ్మదిగా ఒక గ్లాసుతో ప్రారంభించి ప్రాక్టీసు చేయాలి.*

4. వీలైతే దంపుడు బియ్యం అన్నం తినుట మంచిది. గోధుమ / జొన్న రొట్టెలు తినేవారు వాటిని మర పట్టించి, పిండిని జల్లెడ పట్టకుండా వాడాలి. ఎందుకంటే ఆ తవుడులో మనకు అవసరమైన పీచు పదార్థం, విటమిన్లు లభించును.
5. పండ్లు అధికముగా తినవలెను. మధుమేహ రోగులు డాక్టర్లు నిర్దేశించిన మేరకే పండ్లు భుజించాలి.
6. ఫాస్ట్‌ఫుడ్స్ (సమోసాలు, బజ్జీలు మొ॥వి), బేకరీ ఫుడ్స్ (కేకులు, బ్రెడ్ మొ॥వి) చాలా వరకు మానుకోవాలి.
7. మాంసాహారాన్ని తినుట మానుకొనవలెను. ఈ మధ్య శాకాహారులు కూడా మాంసాహారం పట్ల మక్కువ చూపుతున్నారు. మానవ శరీరం మాంసాహారాన్ని జీర్ణము చేయుటకు అనువుగా నిర్మింపబడలేదు. కనుక అజీర్ణ సమస్యలు తలెత్తుతాయి. వాటివల్ల మలబద్ధకం ఏర్పడుతుంది.
8. నియమం ప్రకారం లెట్రిన్‌కు వెళ్ళాలి. పిల్లలకు తల్లులు అలవాటు చేయించాలి. మనశాస్త్రాల్లో ఉదయం నిద్ర మేల్కొన్నాక మలవిసర్జన తర్వాతే ఏదైనా పనిచేసుకోమని చెప్పటం జరిగింది. దీనిని బట్టి మనవారు మలవిసర్జనకు ఎంత ప్రాధాన్య మిచ్చినదీ అర్థమవుతుంది.
9. శరీరశ్రమ చేయాలి. శరీర శ్రమ చేయలేని ముసలివారు వాహ్యాళి (walking) కి వెళ్ళుట అవసరం.
10. మల విసర్జనకై అల్లోపతి మందులు వాడటం అంత మంచిది కాదు. దానివల్ల ప్రేగులు పెద్దవగును. అవి ప్రేగులలోని తేమను పీల్చివేసి ఇతర వ్యాధులు కలిగించును.

పై సూచనలు పాటించినా మలబద్ధకం తగ్గనిచో ఆయుర్వేదంలో రాత్రిపూట కరక్కాయ చూర్ణం / త్రిఫలా చూర్ణం వేడినీటితో తీసుకోవాలనియు, అల్లోపతిలో Glactilax అనే మందును వాడవచ్చునియు, వీటివల్ల side effects ఉండవని చెబుతారు.

## • చికిత్స •

**కాలీమూర్ 3x - 6x :** మలబద్ధకం - నాలుకపై తెల్లనిపూత - క్రొవ్వు పదార్థాలు, పిండివంటలు నచ్చకపోవుట - చాలాకాలం నుంచి వున్న మలబద్ధకానికి ఈ మందు చాలా మంచిది. కాలేయం మందగించుటవల్ల పైత్యరస ఉత్పత్తి తగ్గును. దీనివల్ల విరేచనం లేత రంగులో వుండును. నాలుకమీద తెల్లని / నుసి రంగు గల పూత.

**కాలీఫాస్ 3x - 6x :** పెద్దప్రేగునకు, పురీషనాళము (పెద్దప్రేగు చివరిభాగం)నకు పక్షవాతం ఏర్పడుటవల్ల కలుగు మలబద్ధకం-విరేచనం ముదురు గోధుమరంగులో వుండును. దానిలో పసుపుపచ్చ, ఆకుపచ్చ శ్లేష్మం ఉండును. ఈ మందును రోజూ 3-4 సార్లు వాడాలి.

**నేట్రంమూర్ 3× – 6× :** ప్రేగుల గోడల బలహీనత ఎక్కువగుటవల్ల కలిగిన మలబద్ధకం – బలహీనమైన గుండె కలిగిన లావుపాటి మనుష్యుల మలబద్ధకానికిది మంచి మందు **(ఫాలే)** – విరేచనం తర్వాత చీల్చినట్టి, చురుకుగా నున్న భావన – గుదం నుండి రక్తం కారుట – ప్రేగుల ఆమత్వక్కులు నీరు లేనందువల్ల పొడిగా నుండుట – ఇతర భాగాల్లో నీళ్లవంటి స్రావాలు వుండుట, నీళ్ళు వాంతిగా అగుట, కళ్ళల్లో కన్నీరు, నోటిలో / నాలుకపై అధిక లాలాజలం – నిద్రమత్తు – జీర్ణకోశము నుండి నీటి వంటి పుల్లని ద్రవం నోటిలోనికి వచ్చుట. (water brash) – విరేచనం గట్టిగాను, పొడిగాను, బయటికి పంపుటకు కష్టముగానుండుట – తలనొప్పి – మూలశంక (piles) సంబంధమైన మలబద్ధకం – పురీషనాళమందు నొప్పి – పొత్తికడుపు వలయాలలో నొప్పి – ఈ మందును రోజూ 3–4 సార్లు వాడాలి.

**కాల్కేరియాఫాస్ 6× – 12× :** ముసలివారి మలము గట్టిగాను, రక్తముతోను వుండుట – మానసికంగా క్రుంగిపోవుట – తల తిరుగుడు, తలనొప్పి – ఉదరము బాన కడుపువలె పెద్దదిగా ఉండుట.

**కాల్కేరియాఫ్లోర్ 3× – 12× :** మలమును బయటికి నెట్టలేకపోవుట – మలము కొద్దిగా బయటికి వచ్చుట – ఈ పరిస్థితి ముఖ్యంగా గర్భిణులలో వుండవచ్చును. మూలశంఖ వుండవచ్చు. ఈ మందు రోజూ 3 సార్లు వాడాలి.

**నేట్రంఫాస్ 3× – 12× :** మొండిగానున్న మలబద్ధకం – యువకులలో అలవాటుగానున్న మలబద్ధకం – అప్పుడప్పుడు అతిసారం (diarrhoea) గల శిశువులకు ఆహారముతోపాటు ఈ మందునిచ్చిన చక్కని విరేచనమగును. 6 నెలల శిశువునకు 1 మాత్ర చొప్పున రోజుకు 3సార్లు ఇవ్వవచ్చు. త్రేపులు – నాలుకపై పసుపుపచ్చని మీగడవంటి పూత ఉండును.

**నేట్రంసల్ఫ్ 3× – 12× :** గట్టిగాను, ఉండలుగాను వుండునట్టి మలం – మలము రక్త జీరతో నుండుట – విరేచనానికి ముందు / తర్వాత గుదము వద్ద మంట–మెత్తగా నున్న మలమును కూడా బయటికి నెట్టుట కష్టముగా నుండుట. దుర్వాసనగల అపాన వాయువును ఎక్కువ పరిమాణంలో వదలుట.

**ఫెర్రంఫాస్ 12× :** ప్రేగుల కండరాల పేశాల నిస్త్రాణ వల్ల ఏర్పడిన మలబద్ధకం – మొండి మలబద్ధకం – చిన్న ప్రేగులలో వేడిమి – గుదము క్రిందికి జారుట – మూలశంక / మొలలు, రక్తహీనత – పాలిపోయిన ముఖం – ముఖం వేడిగా, కాళ్ళుచేతులు చల్లగా – గుండె కొట్టుకొనుట సక్రమముగా లేకపోవుట – నిరంతరం చల్లదనం – కడుపుమీదగల ఉదరకుహర మండలము నిండుగా వుండుట –మాంసాహారం పట్ల అయిష్టత – అపాన వాయువు వెడలుట.

**సైలీషియా 6× - 12× :** పురీషనాళం మలమును బహిష్కరించు శక్తిని కోల్పోవుట - మలములో కొంతభాగం బయటికి వెళ్ళిన తర్వాత అది వెనుకకు మరలుట (shy stool), గుదములో బాధ, కుట్టిన నొప్పి, శూలనొప్పి - చాలా కాలముగా స్క్రాఫ్యులా తత్త్వము గలవారి, చీముపట్టిన రోగాలతో బాధ పడువారి మలబద్ధకం - పాలిపోయిన ముఖాలు కలిగిన, తక్కువ పోషణగల పిల్లల మలబద్ధకం - పక్షవాతంతో బాధపడువారి మలబద్ధకం.

## 17. నీళ్ళ విరేచనాలు / అజీర్ణ విరేచనాలు / అతిసారం (Diarrhoea)

నీళ్ళ విరేచనాలు సాధారణంగా ప్రతి కుటుంబాన్నీ వేధిస్తూ వుంటాయి. పిల్లలకైతే చాలా ప్రమాదం కలిగించు వ్యాధి. కనుక వెంటనే శ్రద్ధ వహించాలి.

**లక్షణములు :** కడుపు నొప్పి, వాంతి, ఉబ్బరం, జ్వరం, నీళ్ల విరేచనాలు అధికమగుట వాటి సాధారణ లక్షణాలు. శిశువులకు పాలయందు ఇష్టముండదు. విరేచనములు అధికమైనప్పుడు కాళ్ళు, చేతులు చల్లబడును. వారు నీరసింతురు. వారి కళ్ళు గుంటలు పడును. నిద్రపోవునపుడు వారు కళ్ళు సగము మూసుకొందురు. మూత్రం కూడ క్రమముగా తగ్గును.

**కారణములు :** అజీర్ణము ముఖ్య కారణం. అధికముగా తినుట / పాడైన ఆహారమును తినుటవల్ల అజీర్ణం ఏర్పడవచ్చు. తేమ ప్రదేశం, చలిగాలి అజీర్ణమును పెంచును. పొంగు, మశూచి, జ్వరం, కళ్ళిదగ్గు, కింకవాయువు (croup), కోరింత దగ్గు, నీళ్ళ విరేచనాలకు కారణమగును. ప్రేగుల వైరస్ ఇన్‌ఫెక్షన్, ప్రేగులవాపు, భయం, ఆతురత, దంతోత్పత్తి, చల్లటి పానీయాలు / అపరిశుభ్రమైన నీరు త్రాగుట, ఆల్కహాలు, బీరుత్రాగుట, లవణాల అసమస్థితి కారణాలు.

**మలమును బట్టి కారణము :** మలము రంగు, స్వరూపం, లక్షణాలను బట్టి నీళ్ళ విరేచనాలకు గల కారణాన్ని అర్థం చేసుకోవచ్చు.

1. దుర్గంధం, జ్వరం లేని పసుపు పచ్చని, పల్చని విరేచనం - సాధారణ రకం.
2. విరేచనం ఆకుపచ్చని రంగులో ఉండుట-కాలేయం నుండి పైత్యరసం అధికముగ పోవుట.
3. విరేచనం పులిసిపోయిన వాసన కలిగి తెల్లని పెరుగుబిళ్ళలవలె ఉండుట - అజీర్ణం అధికంగా ఉండుట.
4. విరేచనం తెల్లగ వుండుట - కాలేయం సరిగా పనిచేయనందున ఆకలి లేకపోవుట.
5. నీళ్ళ విరేచనముల మధ్య మలబద్ధకముండుట - మలబద్ధకం.
6. విరేచనము అకస్మాత్తుగ, అధికముగ ప్రారంభమగును. వాంతి కూడా వుండును - కలరా.

7. విరేచనములో రక్తం పడుట / విరేచనము రక్తపు జీరతో వుండుట – రక్తపు విరేచనము / గ్రహణి.

**నివారణోపాయములు :**

నీళ్ళ విరేచనములు ఉన్నప్పుడు ఏమీ తినరాదు. పిల్లలకైతే ఏమీ పెట్టరాదు. వాళ్ళు నీరసింతురని పాలు త్రాపుట, ఆహారం పెట్టుట మంచిది కాదు. విరేచనములు తగ్గిన తర్వాత ఆహారం పెట్టవచ్చు. పిల్లలకు పాలు త్రాపవచ్చు. ఆహారము సాత్వికముగా ఉండాలి. విరేచనములగునపుడు శరీరములోని నీరు చాల ఎక్కువగా బయటికి పోవును. దీనిని నిర్జలీకరణము (dehydration) అని అందురు. అందుకు ఎలక్ట్రాల్ పౌడర్‌ను నీటిలో కరిగించి ఇవ్వాలి లేదా ORS ద్రావణం[1] తయారుచేసి ఇచ్చినా మంచిదే. ప్రమాద పరిస్థితిలో సెలైన్ కట్టవలెను. రోగికి అధిక విశ్రాంతి, కాచి చల్లార్చిన నీళ్ళు అవసరం.

**• చికిత్స •**

క్రింది మందులను లక్షణాలను బట్టి ఇవ్వవలెను. విరేచనాలు ఆగిన తర్వాత మందు ఇవ్వకూడదు.

**ఫెర్రంఫాస్ 6× – 12× :** ఆంత్రచూషకముల[2] (villis) బిగి సడలుటవల్ల కలుగు విరేచనాలు – ప్రేగులు సాధారణంగా ఎంత తేమను / నీటిని గ్రహిస్తాయో అంత పరిమాణాన్ని గ్రహించలేకపోవుట వల్ల వచ్చు విరేచనాలు – జీర్ణంకాని ఆహారం చలిగాలి వల్ల విరేచన రూపంలో బహిర్గతమగుట – జ్వరముండుట – పురీషనాళము (rectum) క్రిందికి దిగుట – "విరేచనము విస్తారముగా, నీళ్ళగా, అకస్మాత్తుగా, బాధాకరముగా వాంతులతో కూడి యుండుట" **(గిల్‌బెర్ట్)** మలంతో రక్తం, తర్వాత శ్లేష్మముండును. మలము యొక్క రకాన్ని బట్టి జ్వరమున్నంత వరకు దీనిని వేరే మందుతో మార్చి ఇవ్వవలెను.

పిల్లల నీళ్ళ విరేచనాలు నురుగుతో, ఆకుపచ్చగా తరచుగా వచ్చుట – పిల్లవాడు తలను, గజ్జలను ముడుచుకొనుట – ముఖం గిల్లుకొనుట – కళ్ళు సగం తెరుచుకొనుట – మూత్రం కొద్దిగా – నాడి, శ్వాస వడిగా కొట్టుకొనుట – నిద్రలో ఉలికి పడుట – జీర్ణంకాని పదార్థాల విరేచనాలు – చర్మం వేడిగా, పొడిగా ఉండుట – దాహం ఉండుట – దంతోత్పత్తి – కొద్దిపాటి కసరత్తు చేసినా విరేచనాలు చిమ్మినట్లు వచ్చుట.

---

*1. **ORS (Oral Rehydration Solution) :** ఈ ద్రావణాన్ని ఎవరైనా తమ ఇంట్లోనే చేసుకోవచ్చు. ఒక లీటరు శుద్ధమైన నీరు / మినరల్ వాటర్ తీసుకోవాలి. దానిలో 20 గ్రాముల గ్లూకోసు / పంచదార, 3.5 గ్రాముల ఉప్పు, 2.5 గ్రాముల వంటసోడా, 1.5 గ్రా. పొటాషియం క్లోరైడ్/ కొద్దిగ నిమ్మరసం కలపాలి. ఆ ద్రావణమును అప్పటికప్పుడు త్రాగించాలి. ఎప్పుడో తయారు చేసిన ద్రావణాన్ని వాడరాదు. పొటాషియం క్లోరైడు/నిమ్మరసం లేనప్పుడు రోగికి అరటిపండు తినిపించవచ్చు.)*

*2. **ఆంత్రచూషకములు :** ఇవి చిన్నప్రేగుల ఆమత్వక్కు పై భాగమున వుండును. వీటి యందు రక్తనాళములు, నరములు, ఇతర పదార్థములను పీల్చుకొనునవి ఉండును. ఇవి సూక్ష్మదర్శినితో మాత్రమే కనిపించును.*

**కాలీమూర్ 3X - 6X :** క్రొవ్వు పదార్థాలు, పిండి వంటలు తిన్న తర్వాత వచ్చు నీళ్ళ విరేచనాలు - పైత్యరసం తక్కువగా ఉండుటచే విరేచనాలు తేలిక పసుపు పచ్చ / బంకమట్టి రంగులో వుండుట - టైఫాయిడ్ జ్వరములో నీళ్ళ విరేచనాలు - విరేచనాలు తేలిక పసుపు / కాషాయరంగు / తెల్లగాను జిగటగాను ఉండుట - విరేచనాలలోరక్తం / శ్లేష్మం - నాలుకమీద తెల్లటి పూత.

**కాలీఫాస్ 3X-6X :** దుర్వాసనగల విరేచనం తరచుగా ఇతర వ్యాధులతో కూడి యుండుట - భయం మొ॥ కారణాల వల్ల వచ్చు గాఢమైన వాసన గల విరేచనములు - మానసికంగా క్రుంగుట, నరాల బలహీనతవల్ల వచ్చు విరేచనములు నొప్పితో / నొప్పిలేకుండా యుండుట - విరేచనం బియ్యపు కడుగునీరు / బియ్యపు గంజి వార్చిన నీరువలె నుండుట - గుదము క్రిందికి దిగుట - మధ్య చెవి వాచుట - విరేచనములు రక్తంవలె ఉండుట, వాని నుండి కుళ్ళిన / మరణించిన జంతువు వాసన వచ్చుట - అపానవాయువు దుర్వాసనతోను, ధ్వనితోను ఉండుట - ఏమైనా తినునపుడు విస్తారమైన, నొప్పిలేని, తప్పక వెళ్ళవలసిన విరేచనమగుట - మలము సంతృప్తిగా రాకపోవుట - గుదము బాధగాను, మంటగాను ఉండుట - అది క్రిందకు దిగుట.

**నేట్రంమూర్ 3X-6X :** నీటివలె, బంకగా, నురుగుతో నుండు విరేచనాలు - పారదర్శకమైన, కోడిగ్రుడ్డు నందలి తెల్లని సొనవలె బంకగానుండు విరేచనాలు - ఉప్పు అధికంగా వాడుట వల్ల వచ్చు విరేచనాలు - మెడ శుష్కించుట, ముఖం జిడ్డుగా కనిపించుట - 'విచిత్రమైన ఇష్టాలు, అయిష్టాలు ఉన్నప్పుడు ఈ మందు వాడదగును' **(బెల్ అండ్ లైడ్జ్)** - నాలుకపై బంకవంటి పూత - నాలుక కొనపై లాలాజలపు బుడగలు - మలబద్ధకం, విరేచనాలు మారిమారి వచ్చుట.

**నేట్రంఫాస్ 3X - 12X :** పైత్యరసం తక్కువగుటచే నీళ్ళ విరేచనాలు తెల్లగా / ఆకుపచ్చగా నుండుట - గుదం దురదగా, మంటగా, పొడిగా నుండుట - ఆమ్లాధిక్యత వల్ల కలుగు నీళ్ళ విరేచనాలు - పుల్లని వాసన గొలుపు ఆకుపచ్చని విరేచనాలు - పసుపు పచ్చని క్రీమువంటి పూతగలనాలుక - పుల్లని ద్రవము, పెరుగు వంటి పలకలు వాంతి యగుట - పిల్లలకు దంతాలు వచ్చునపుడు, నుసి పురుగుల వలన, వేసవికాలమున వచ్చు విరే చనాలు - జీర్ణశక్తి తగ్గుట వలన వచ్చు నీళ్ళ విరేచనాలు - బంకమట్టి రంగు / మామూలు ఆకుపచ్చ విరేచనాలు - తరచుగా కడుపునొప్పి ఉండుట - జెల్లీ వంటి నురుగు - బాధతో ముక్కుట-తోడుకొన్న పాలవలె నుండుట-మలం కొద్దిగాను, తరచుగాను వచ్చుట **(గిల్‌బెర్ట్)** - పాలు త్రాపుట / అన్నం తినిపించుటలోగల దురలవాట్ల వల్ల వచ్చు నీళ్ళ విరేచనాలు.

**నే(ట్రంసల్ఫ్ 3× –6× :** విరేచనాలు నీళ్ళవలె, గాఢముగా నుండు పైత్యరసంతో కూడి యుండును. ఆకుపచ్చని పైత్యం వుండును. విరేచనంలో నొప్పి వుండదు. అప్పుడప్పుడు ఒక రకమైన కడుపునొప్పి, గుడగుడ ధ్వని ఉండును. తినుటవల్ల అధికమగును. ఇది వదు లైన, ఆకస్మికముగ, విస్తారముగ వచ్చునట్టి విరేచనాలు ముఖ్య లక్షణంగా వున్న దీర్ఘకాలపు నీళ్ళ విరేచనాల వ్యాధికి ముఖ్యమైన మందు. వాయుపూరితముగా నుండుట ఈ రోగి ముఖ్య లక్షణం. కానీ అతడు తప్పనిసరిగా వాయుపూరితంగా వుండవలసిన పనిలేదు.

**కాలీసల్ఫ్ 3× - 6× :** విరేచనములు పసుపు పచ్చగా / నీళ్ళవలె, చీముతో / జిగురు వలె వుండును. నాలుక మొదట్లో పసుపు పచ్చని పూత – కలరా లక్షణాలు – కండరాలు బాధతో ముడుచుకు పోవుట – నల్లని, గట్టిగానున్న, దుర్వాసనతో నున్న మలం – వేడిపానీయములు త్రాగిన విరేచనములు ఎక్కువగుట. మెగ్నీషియం ఫాస్ పనిచేయనప్పుడు, నాలుక రంగును బట్టి దీనిని వాడాలి.

**కాల్కేరియాసల్ఫ్ 3× - 6× :** విరేచనాలు చీముతోను, రక్తముతోను కూడి యుండును. నాలుకపై బంకమట్టి రంగులో నున్న పూత – టైఫస్[1] రోగంలో వాతావరణంలో మార్పువల్ల విరేచనాలు వచ్చును.

**కాల్కేరియాఫాస్ 3× - 12× :** దంతములు వచ్చు పిల్లల నీళ్ళ విరేచనాలు. దీనిని మధ్య – మధ్య వాడాలి లేక దీనిని ఇతర మందులతో మార్చి వాడాలి. ప్రేగుల క్షయ వ్యాధిలో దీనిని మధ్య మధ్య వాడాలి. క్షయ వ్యాధిగ్రస్తుల, రికెట్ వ్యాధిగ్రస్తుల పిల్లలకు ముఖ్య మందు. ఆకుపచ్చని, బంకగానున్న, అజీర్ణంవల్ల వచ్చు నీళ్ళ విరేచనాలు – విరేచనం వేడిగా, నీళ్ళవలే, అధికంగా, దుర్వాసనతో శబ్దం చేస్తూ తొందరగా బయటికి వచ్చును. కాల్కేరియా ఫాస్, ఫెర్రంఫాస్, నే(ట్రంఫాస్ పిల్లల అన్ని రకాల విరేచనాలను అరికట్టును. వీటిని ఒకదాని తర్వాత ఒకటి మార్చి ఇవ్వవలెను.

**మెగ్నీషియంఫాస్ 3× - 6× :** నీళ్ళవలె వుండు విరేచనాలు – అధిక ఒత్తిడితో బయటికి నెట్టబడుట – ప్రేగులలో బిగపట్టు నొప్పి – వాయుపూరితమైన కడుపునొప్పి – నొప్పితో కాళ్ళను పైకి ముడుచుకొనుట వల్ల ప్రేగుల నొప్పికి ఉపశమనం – కాపడం పెట్టుట వల్ల ఉపశమనం – వాంతులు – కాళ్ల పిక్కలలో కంపములు – మధ్య–మధ్యన నొప్పి.

**సైలీషియా 6× - 12× :** చిన్న పిల్లల నీళ్ళ విరేచనాలు – కుళ్ళిన / శవపు వాసన – టీకాల వల్ల విరేచనాలు – శిశువు తలపై పుల్లని వాసనగల చెమట – గట్టిగా, వేడిగా నున్న, ఉబ్బిన పొత్తి కడుపు / ఉదరభాగం.

---

*1.* **టైఫస్ (Typhus)** *: పురుగుల/కీటకముల ద్వారా వచ్చు వ్యాధి.*

## 18. బంక / జిగట విరేచనం లేక గ్రహణి
(Dysentery)

బంక విరేచనాలు చిన్న పిల్లలలో చాల ప్రమాదకరమైనవి. ఈ వ్యాధి తరుణ వ్యాధిగను, దీర్ఘవ్యాధిగను ఉండును. తరుణ వ్యాధి కూడ రెండు రకాలుగ వచ్చును – 1) బాక్టీరియా అను సూక్ష్మక్రిమి వల్ల 2) అమీబా అను సూక్ష్మక్రిమివల్ల.

**లక్షణాలు :** ఈ వ్యాధి సాధారణమైనచో కొద్ది రోజుల తర్వాత ఎట్టి ప్రమాదం కలిగించకుండ తగ్గిపోవును. భయంకరమైన వ్యాధిగా ఉన్నచో అనేక లక్షణములు కనిపించును. కొందరిలో ఈ వ్యాధి చలి, జ్వరం, తలనొప్పి, వికారం, వాంతి, ఆకలిలేమితో ప్రారంభమగును. బొడ్డు వద్ద, పొత్తికడుపు వద్ద నులిమివేయునట్టి నొప్పి ఉండును. ప్రేగులలో నొప్పిని కలుగజేయు పదార్థమేదో ఉన్నదని తలచి రోగి దానిని బయటికి పంపుటకై మల విసర్జనకు కూర్చొండును. కాని అంత తేలికగా మలవిసర్జన జరగదు. గుదము నొప్పి పెట్టుచుండును. ఎంత ముక్కినను మలం రాదు. బలంగా ముక్కుట వల్ల మలం ప్రేగుల అంచులను, రక్తనాళాలను చిట్లగొట్టుకుంటూ బయటకు వస్తుంది. ఆ మలం నుండి హానిచేసే సూక్ష్మజీవులు కోట్ల సంఖ్యలో పుట్టును. వాటి ఇన్‌ఫెక్షన్ వల్ల ప్రేగులలోని రక్తనాళాలు పగిలి కొద్ది కొద్దిగా చీము/ బంక / జిగురు / రక్తం పడును. పురీషనాళం బయటికి వచ్చినట్లనిపించును. దీనిచే భయం కలుగును.

వ్యాధి ముదిరిన కొలది రోజుకు 30 – 40 సార్లు మల విసర్జనకు వెళ్ళవలసి వచ్చును. కాని విరేచనమునకు బదులు కొద్ది రక్తపు చుక్కలు మాత్రం విసర్జన అగును. దీనివల్ల రోగి నీరసించును. ముఖం రంగు మారిపోవును. నాడి బలహీనముగా నుండును. ఎక్కిళ్ళు ప్రారంభమగును. స్పృహతప్పిపోవును. అతడు మరణించుట కూడా సంభవించ వచ్చు. కొన్ని సందర్భాలలో ఈ వ్యాధి కాలేయపు పుండు, టైఫాయిడ్ జ్వరం, పెరిటోనైటిస్ రోగమును కలిగించవచ్చు.

చాలా సందర్భాలలో కొద్దిరోజుల తర్వాత విరేచనములో రక్తము పడుట ఆగి పోవును. మలం పడుట ప్రారంభమగును. నీరసం తగ్గసాగును. రోగి శరీరము వేడిగా ఉండును. ఇవన్నీ వ్యాధి తగ్గుచున్నదని తెలుపును.

**కారణములు :** 1) వేడి ప్రదేశముల నుండి అతి శీతలమైన ప్రదేశాలకు మారుట. 2) అతి వేడిగా నున్న పదార్థములను తినుట. 3) భరించరాని వేసవి కాలము నుండి అకస్మాత్తుగ వర్షాకాలములోనికి మారుట. 4) వర్షాకాలములో కలుషితమైన నీటిని త్రాగుట. 5) సరియైన ఆహారం తినకపోవుట. 6) అపరిశుభ్రమైన వాతావరణంలో ఈగలవలన ఈ వ్యాధి వ్యాప్తి అగుట. 7) ప్రేగుల వాపు. 8) ప్రేగుల రక్తనాళాల గోడలలో ఐరన్ లవణం తక్కువగుట. 9) కొన్ని లవణాలు తగ్గుట.

**నివారణోపాయములు :**

1) వ్యాధి ఎక్కువగా ఉన్నప్పుడు రోగి విశ్రాంతిగా పడుకోవలెను. 2) కడుపు నొప్పి ఉంటే వేడినీళ్ళు కాపడం పెట్టుట వలన గుణమిచ్చును. 3) అన్నం పెట్టుట మాని సగ్గుబియ్యం జావ పెట్టుట మంచిది. 4) కొద్దిగా కోలుకొన్న తర్వాత, జ్వరం లేకున్న మజ్జిగన్నం పెట్టవచ్చు. 5) వ్యాధి పూర్తిగ తగ్గునంత వరకు కారం, మసాలాలు తినకుండుట ఉత్తమం. 6) మలబద్ధకం తగ్గించుకోవటానికి రోజూ కూరలను బాగా అధికముగా పెట్టుకొని రొట్టెలతో తినుట మంచిది. కూరలు వండేటప్పుడు లేత కూరగాయలను తీసుకొని తొక్క తీయకుండా వండుకోవాలి. సాయంకాలం ఈ విధంగానే తినాలి. ఉదయం పూట కేవలం పండ్లను పిప్పితో సహా తినుట మంచిది.

## • చికిత్స •

విరేచనము లక్షణాలను బట్టి మందును ఎంపిక చేయాలి. విరేచన మైనపుడల్లా ఎంపిక చేసిన మందు ఒక మోతాదును రోగికివ్వవలెను.

**కాలీమూర్ 3×–6× :** పొత్తికడుపులో విపరీతమైన బాధ – కత్తులతో కోస్తున్నట్టి నొప్పి – విరేచనమగునపుడు గుదములో తీపు, బాధ, నాలుక మీద తెల్లనిపూత – కొన్ని నిమిషాల కొకసారి విరేచనం –మల విసర్జనకు ముక్కుట – బంకగానున్న, పల్చని చీముగల విరేచనాలు – అనేక సందర్భాలలో దీనిని ఫెర్రంఫాస్‌తో కలిపి వ్యాధిని నయం చేయవచ్చు.

**ఫెర్రంఫాస్ 6× –12× :** దీనిలో మలము రక్తముతో వేడిగా నీళ్ళవలే బాధతో వెలువడును. ఈ వ్యాధిలో తీవ్రమైన జ్వరము వున్నచో ఈ మందును కాలీఫాస్‌తో కలిపి వాడాలి. నొప్పి వాపుపైన ఆధారపడి ఉండదు. ఒత్తిడివల్ల నొప్పి పెరుగును. మల విసర్జన సమయంలో ముక్కుట ఉన్నచో ఈ మందు పనికిరాదు.

**కాలీఫాస్ 3× – 6× :** విరేచనములో రక్తం మాత్రమే ఉండును. పొత్తికడుపు వాచియుండుట, విరేచనములు కుళ్ళినట్లు, దుర్గంధ భరితముగా ఉండుట – నాలుక పొడిగా ఉండుట – పురీషనాళం దిగుట – విరేచనానంతరం నొప్పి – సంధి (ఒళ్ళు తెలియని స్థితి).

**మెగ్నీషియంఫాస్ 3× – 6× :** నులి నొప్పులతో వెడలు జిగట విరేచనాలు – నొప్పులు బాగా వంగినా, వేడిమివల్ల, రాపిడివల్ల, ఒత్తిడివల్ల తగ్గును. ముక్కుట, ప్రేగులందు శూల వుండును. నిరంతరం మలమూత్రములను విసర్జించవలయుననెడి ఆకాంక్ష ఉండును. కండరాలలో దీర్ఘకాలంగా ముడుచుకు పోవునట్టి నొప్పి ఉండును. ప్రతి విరేచనము తర్వాత పురీషనాళములో నొప్పి ఉండును.

**కాల్కేరియాసల్ఫ్ 3× – 6× :** ప్రేగులలోపుండ్లు (అల్సర్స్) ఏర్పడుటవల్ల చీము, రక్తముతో కూడిన విరేచనాలు – కాలీమూర్ వాడినా నయంకాని సందర్భాలలో దీనిని వాడవచ్చు.

**నేట్రంసల్ఫ్ 6× :** పైత్యరసాధిక్యతగల బంక విరేచనాలకు ఇది మంచి మందు.

## 19. వమన వికారం
### (Vomiting Sensation / Nausea)

కొంతమంది అప్పుడప్పుడు వమన వికారంతో బాధ పడుతుంటారు. వారు వాంతి చేసుకొంటే బాగుంటుందని భావిస్తూ ఉంటారు. కాని వారు వాంతి చేసుకొనలేరు. కొంతమంది కళ్లు తిరుగుతూ కుదురు లేనట్లుగా ఉంటారు. వికారం ముదిరితేనే వాంతి అవుతుంది. వాంతి అయితే వారి అస్వస్థత తొలగిపోతుంది.

**కారణాలు :** 1) నిద్రలేచిన వెంటనే ప్రేగులలో పసర్లు ఎక్కువగా ఉండుట. 2) తిన్నది సరిగా జీర్ణం కాకపోవుట. 3) ఆహారం తిన్న వెంటనే బస్సు / కారు ఎక్కుట. 4) ఆహారంలో సరిపడని పదార్థాలు ఉండుట. 5) గర్భధారణ.

**నివారణోపాయాలు :**

1) గోరువెచ్చని / బిందెలోని నీటిని 5, 6 గ్లాసులు లేక అంతకంటె ఎక్కువగా ఆపకుండా త్రాగుట – వాంతి కానిచో వ్రేళ్ళను నోటిలో పెట్టుకొని వాంతి చేసుకొనుట. 2) ఏమీ తినకుండా కొంతసేపు విశ్రాంతి తీసుకొని తేనె + నిమ్మరసం / కొబ్బరి నీళ్ళు త్రాగినా హాయిగా ఉంటుంది.

**• చికిత్స •**

**కాలీఫాస్ 6X :** వమన వికారం – పుల్లని, చేదైన ఆహారాన్ని, రక్తాన్ని వాంతి చేసుకొనుట – నాలుక తెల్లగా, బంకగా, గోధుమవర్ణంలో ఉండుట.

**నేట్రంఫాస్ 6X :** నిరంతరం వమన వికారం – నాలుకపై పసుపుపచ్చని పూత – గర్భవతులలో ఉదయాన పుల్లని వాంతులు.

## 20. వాంతి / వమనం
### (Vomiting)

నోటిద్వారా అన్నాశయం / జీర్ణాశయంలోని పదార్థాలు బయటికి వచ్చుటను వాంతి / వమనం / కక్కు / డోకు అని అంటారు.

**కారణాలు :**

1) మితిమీరి భోజనం చేయుట. 2) కాలనియమం, పరిమాణ నియమం లేక బిడ్డకు పాలు పట్టుట/పోయుట. 3) ఆకలి/కోరిక లేకుండ భుజించుట. 4) మెదడు వ్యాధులు. 5) మెదడుకు దెబ్బ తగులుట. 6) గర్భకోశపు వ్యాధులు. 7) వృషణాల రోగాలు. 8) గర్భధారణ. 9) కాలేయపు వ్యాధులు. 10) సొమ్మసిల్లుట. 11) పార్శ్వపు తలనొప్పి. 12) తల గిరగిర తిరుగుట. 13) పడవలో ప్రయాణం మొ॥ కారణాలు.

**నివారణోపాయాలు :**

1) జీర్ణాశయమునకు విశ్రాంతి ఇవ్వాలి. 2) నోటిలో మంచుగడ్డ ముక్కలను / వేడినీటిని చప్పరించిన వమన వికారం (nausea) తగ్గును. 3) ఆహారం ఇమడనిచో బార్లీ గంజి / కొబ్బరి బోండా నీరు త్రాగాలి. 4) వమనములు తగ్గిన తర్వాత సాధారణ ఆహారం తీసుకోవచ్చు.

## • చికిత్స •

**సైలీషియా 12×** : శిశువుకు పాలు ఇవ్వగానే వాంతి చేసుకొనును. ఉదయాన చలితో వాంతి – విపరీతమైన ఆకలి – మాంసం, వేడి ఆహారం ఇష్టం లేకుండుట.

**ఫెర్రంఫాస్ 6×** : ప్రకాశవంతమైన ఎర్రని రక్తాన్ని వాంతి చేసుకొనుట – జిగురు వంటి పదార్థం ఏర్పడే స్వభావం ఉండుట – ఆహారాన్ని, పుల్లని ద్రవాలను వాంతి చేసుకొనుట – భోజనం తిన్న వెంటనే / తర్వాత తిన్న ఆహారం జీర్ణం కాకుండా వాంతి అగుట – నాలుక చీలి ఉండుట – ఆహారం పట్ల అయిష్టత – దప్పిక అధికం.

**కాలీఫాస్ 6×** : వమన వికారం – పుల్లని, చేదైన ఆహారాన్ని, రక్తాన్ని వాంతి చేసుకొనుట.

**కాలీమూర్ 6×** : నల్లని, గడ్డకట్టిన, జిగురువంటి రక్తాన్ని వాంతి చేసుకొనుట – చిక్కని, తెల్లని శ్లేష్మం / కళ్ళె వాంతి అగుట.

**నేట్రంమూర్ 6×** : ఆహారాన్ని కాకుండా, ఆమ్లం, పుల్లని ద్రవం వాంతి అగుట – పెరుగు వలె గడ్డ కట్టిన పదార్థాన్ని, ఆమ్ల గుణం ఉండే ద్రవాలను వాంతి చేసుకొనుట – కాఫీ విత్తనాల వంటి నల్లని పదార్థాన్ని వాంతి చేసుకొనుట – నీళ్ళవంటి, బంక వంటి, పారదర్శకమైన శ్లేష్మాన్ని వాంతి చేసుకొనుట – ఆకలి, దాహం ఎక్కువ.

**నేట్రంఫాస్ 6×** : పుల్లని ద్రవాన్ని, పెరుగు వలె గట్టిగ నుండు పదార్థాలను వాంతి చేసుకొనుట – పసుపుపచ్చని పదార్థాన్ని వాంతి చేసుకొనుట – నిరంతరం వమన వికారం, నాలుకపై పసుపుపచ్చని పూత – గర్భవతులలో ఉదయం పుల్లని వాంతులు.

**కాల్కేరియాఫ్లోర్ 6×** : జీర్ణంకాని ఆహారం వాంతి అగుట – ఫెర్రంఫాస్ వల్ల వాంతి అగుట ఆగనప్పుడు దీనిని వాడాలి. దంతములు వచ్చు సమయమున అగు వాంతులకు ఇది మంచి మందు.

**కాల్కేరియాఫాస్ 6×** : చల్లని నీరు త్రాగిన తర్వాత / ఐస్‌క్రీమ్ తిన్న తర్వాత వాంతి అగుట – శిశువులు తరచుగాను, సులభంగాను వాంతి చేసుకొనుట, ఎల్లప్పుడు తనకు సపర్యలు చేయాలనుకొనుట–దంతములు వచ్చునప్పుడు దాని సమస్యలతో వాంతి అగుట – తిన్న కొన్నిగంటల తర్వాత వాంతి–కాలనియమం ప్రకారం రాత్రి ఒక సమయాన వాంతి –చల్లని పానీయాలవలన వాంతి–వాంతికి కొన్ని గంటల ముందు జీర్ణాశయం బరువుగా ఉండుట.

# 21. కలరా
## (Cholera)

ఇది అంటువ్యాధి. ఇది అకస్మాత్తుగ ప్రబలును. పూర్వం ఈ వ్యాధి సోకి గ్రామాలకు గ్రామాలు తుడుచిపెట్టుకు పోయినట్లు చెప్పబడ్తుంది. దీనిలో విపరీతమైన వాంతులు, విరేచనాలు అగును. వీటి వల్ల శరీరం చల్లబడును. కామా బ్యాసిలస్ క్రిమి రోగి మలము, వాంతి పదార్థముల ద్వారా ఆహార పానీయముల లోనికి ప్రవేశించి వ్యాధిని కలుగజేయును. సాధారణముగా ఈ వ్యాధికి 3 దశలుంటాయి.

**1. ప్రథమదశ :** ఇది కొన్ని గంటల నుండి 3, 4 రోజుల వరకు ఉండవచ్చు. రోగికి ఆకలి తగ్గి ఆహారముపై ఇష్టము నశించును. కడుపులో త్రిప్పుట ఉండును. దానిలో బండ పెట్టినట్లనిపించును. దాహం వేయును. చెవులలో హోరు, నిస్సత్తువ మొ॥ లక్షణాలు ఉండును.

**2. ద్వితీయదశ :** ఈ దశకు చేరేటప్పటికి వ్యాధి పూర్తిగ వృద్ధి పొందును. ఈ దశ కూడ కొన్ని గంటల నుండి కొన్ని రోజుల వరకు ఉండవచ్చు. కుడితి నీరు / బియ్యపు గంజి వంటి విరేచనాలు, వాంతులు అగును. కడుపు నొప్పి, కడుపులో గుడగుడ వుండును. నిస్సత్తువ, అరికాళ్ళు మంచువలె చల్లగా ఉండుట, చల్లని చెమట, మూత్రం బంధింప బడుట, ఈడ్పులు, కొంకర్లు మొ॥ లక్షణాలు కనిపించును.

**3. తృతీయదశ :** ఈ దశ 12 నుంచి 36 గంటల వరకు ఉండును. ఈ దశ చాలా అపాయ కరమైనది. ఈ దశలో రోగి సొమ్మసిల్లి ఉండును. మణికట్టు దగ్గర నాడి తెలియదు. పెదవులు, శరీరము నీలంగా మారవచ్చు. అది చల్లబడవచ్చు. ముఖం పాలి పోయి వుండును. మూత్రంరాదు. వ్రేళ్ళు కొంకర్లు పోతూ వుండును. శరీరమంతా చల్లని చెమట. శక్తి ఉండదు. ఈ స్థితిలో వాంతులు, విరేచనాలు అకస్మాత్తుగా ఆగిపోయి తర్వాత రోగి మరణించవచ్చు లేదా వాంతులు, విరేచనాలు నెమ్మదిగా తగ్గి రోగి కోలు కోవచ్చు. కనుక అతి జాగ్రత్తగ చికిత్స జరిగిన ప్రమాదం నుండి నివారణ పొందవచ్చు.

**నివారణోపాయాలు :**

1. కలరా లక్షణాలు పరిసరాలలో ఉన్నవని తెలిసిన వెంటనే కలరా వ్యాధి నిరోధక మందును కుటుంబంలోని వారందరికీ ఇవ్వవలెను.
2. కలరా లక్షణాలు కనిపించిన వెంటనే చికిత్స ప్రారంభించాలి.
3. రోగిని వేరుగా ఉంచి ఇతరులతో కలవనివ్వ కూడదు.
4. ఈగలు కలరాను వ్యాపింపజేయును. కనుక ఈగలు ఆహార పదార్థములపై వ్రాల కుండా / ఇంటిలో లేకుండా జాగ్రత్త వహించాలి.

5. వాంతులు, విరేచనాలు అయిన పదార్థాలను వెంటనే తీసివేయాలి. వాటిని పొట్టు/ పాతగుడ్డలతో కాల్చటం కాని వాటితో నీరు, సున్నము కలిపి లోతుగ పాతి పెట్టడం కాని చేయాలి.
6. రోగి విడిచిన వస్త్రములను ఫినాయిలు ద్రావణములో వుడకబెట్టి వుతికి ఎండలో ఆరనివ్వాలి.
7. విరేచనములు సాధారణ రంగులోనికివచ్చి, మూత్రం సాఫీగా వెలువడు వరకు రోగికి ఎలాంటి ఆహారం పెట్టరాదు. బార్లీ గంజి / కాచి చల్లార్చిన నీరు మాత్రమే ఇవ్వవలెను.
8. ఈ వ్యాధిలో రోగికి అధికముగ విరేచనాలు, వాంతులు అగును. కనుక రోగి శరీరపు రక్తములోని ఉప్పు (సోడియం క్లోరైడు) మొదలగు లవణాలు, నీరు బాగా తగ్గిపోవును. దీనిని నిర్జలీకరణ లేక dehydration అని అంటారు. ఇది ఎక్కువైనచో ప్రాణాలకు అపాయం వాటిల్లవచ్చు. దీనిని నివారించుటకు రోగి ధమనులలోనికి సెలైను ఎక్కించటం జరుగుతుంది.

   ఈ మధ్య ఆరోగ్య శాఖాధికారులు Oral Rehydration Therapy ని బాగా ప్రచారం లోనికి తెచ్చారు. వివరణ కొరకు ఇదే అధ్యాయంలోని 17. నీళ్ళవిరేచనాలు/ అజీర్ణ విరేచనాలు/ అతిసారం చాప్టర్ Foot Note చూడండి.
9. రోగికి ఈడ్పులు, కంపములు ఉన్నప్పుడు వేడినీటి కాపడం పెట్టాలి.
10. రోగి ఉండే చోట చక్కగా గాలి, వెలుతురు వచ్చే ఏర్పాటు చేయాలి.
11. రోగి వద్ద ఉన్న ఆహార పదార్థములను ఎవ్వరూ తినరాదు. అతని వద్ద ఉన్న నీటిని త్రాగరాదు. అతని దగ్గరినుండి వచ్చినవారు కాళ్ళు-చేతులను శుభ్రంగా కడుగుకొనవలెను.
12. కలరా వచ్చిన తల్లి తన బిడ్డకు పాలివ్వరాదు.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× - 12× :** కలరా ప్రథమ దశ – రక్తనాళముల, లింఫు నాళముల ఇబ్బందులకు కాలీఫాస్‌తో మార్చి వాడాలి – విరేచనము, వాంతి తరచుగాను, నీళ్ళగాను అగుట – ఒక్కొక్క సారి రక్తము పడుట – రోగి బాగా క్షీణించుట – స్పృహ కోల్పోవుట – ముఖం ఎర్రబడుట – కంటిపాపలు పెద్దవగుట – తల తిరుగుట – నాడి మృదువుగాను, నిండుగాను వుండుట – చెమటను నిరోధించుట వల్ల కలుగు కలరా – 15 నిమిషముల కొకసారి మందు వాడాలి.

**కాలీఫాస్ 6× :** బియ్యపు కడుగు వంటి విరేచనాలు – దుర్వాసనతో అపానవాయువు వెడలుట – గుదము మంటగా వుండుట – రోగి నీరసముగా, నీలి-నలుపు రంగు / నీలి రంగులో వుండుట – నాడి చాలా నెమ్మదిగా కొట్టుకొనుట – గంట కొకసారి 4 మాత్రలు.

**కాలీసల్ఫ్ 6X :** కంపములు/ఈడ్పులు – నీళ్ళ వలె పసుపుపచ్చని విరేచనాలు – చెమట పట్టుటకు గాను దీనిని ఫెర్రంఫాస్‌తో గంట కొకసారి యివ్వవలెను. దీనివల్ల జ్వరం తగ్గును.

**మెగ్నీషియంఫాస్ 6X :** నీళ్ళ విరేచనాలు, వాంతులు – ఉదర భాగమున కండరములు బాధాకరముగను, అప్రయత్నముగను దగ్గరకు ముడుచుకుపోవుట – పిక్క కండరములు ముడుచుకొనిపోవుట – ఒక మోతాదుకు 4 మాత్రలు చొప్పున వేడినీటితో వేసుకొనవలెను.

**నేట్రంసల్ఫ్ 6X :** కలరా లక్షణాలు – కోపం, పైత్య రసాధిక్యత, తొందర, మానసిక ఉద్రేకం ఉన్నప్పుడు స్క్యూష్లర్ దీనిని ప్రధాన ఔషధమనిరి. ఇది శరీరములో అధికంగా వున్న నీటిని బయటికి పంపును. కనుక దీనిని వ్యాధి నిరోధక మందుగా వాడవలెను.

**కాల్కేరియాఫాస్ 6X :** దంతాలువచ్చు పిల్లల కలరాకు బాగా పనిచేయును. పోషక పదార్థాలు సరిగా శోషణ కానందువలన వారు శుష్కించి ముసలివారి వలె కనిపింతురు. వారి విరేచనాలు అకుపచ్చగాను, బంకగాను, దుర్వాసనగాను, నీళ్ళవలే చిమ్మినట్లు వస్తుంటాయి.

## 22. ప్రేగులలో ఉండు పురుగులు మరియు అమీబియాసిస్
## (Intestinal Parasites/Worms & Amoebiasis)

మన ప్రేగులలో అప్పుడప్పుడు పురుగులు చేరి బాధిస్తాయి. అవి సాధారణముగ మూడు రకాలు.

**1) నుసి/నులిపురుగులు :** ఇవి పెద్ద ప్రేగులలో 1 అంగుళం పొడవు ఉండును. ఇవి తెల్లని దారముల వలె ఉండుటచే వీటిని Threadworms అని అంటారు.

**వీటివల్ల కలుగు బాధలు :** 1) గుదమందు దురద 2) ముక్కు గోకుకొనుచుండుట 3) ఆకలి సరిగా లేకుండుట 4) నిద్ర సరిగా పట్టకపోవుట 5) మలవిసర్జనకై ముక్కుట.

**2. ఏలికపాములు / గుండ్రని పురుగులు (Lumbricoides/Round worms) :** ఇవి చిన్న ప్రేగులలో 6–10 అంగుళాల పొడవు ఉండును. ఇవి వానపాముల వలె ఉండును. కాని వాటికంటె తెల్లగ ఉండును. ఇవి సాధారణంగా 1,2 ఉండును. కాని కొన్ని సమయాల్లో గుంపులుగా ఉండును.

**వీటివల్ల కలుగు బాధలు :** 1) కడుపు ఉబ్బి నొప్పిగ ఉండుట 2) ఆకలిలేమి 3) వికారం 4) తలత్రిప్పుట 5) నిద్రలో పళ్ళు కొరుకుట 6) కళ్ళచుట్టూ నల్లగ ఉండుట 7) ఇవి పురీషనాళం గుండా బయటికి వెళ్ళినా పెద్ద హాని కలగదు. కాని గొంతు ద్వారా శ్వాసనాళంలోనికి ప్రవేశించిన ఊపిరాడక చనిపోవుట జరుగును.

**3. బద్దీ/టేపు లాంటి పురుగు (Tape worm/Taenia solium) :**

అది చిన్నప్రేగులలో ఉండును. అది కొద్దిఅడుగులు/కొన్ని గజాలు ఉండును.

**దీనివల్ల కలుగు బాధలు :** 1) కడుపు బరువు 2) శూలనొప్పి 3) ఆకలి అధికం 4) రోగి మెల్లగ ఎండిపోవుట.

**విశేషాలు :** 1) ఇది చాలా అరుదుగా ఉండును. 2) చాలా అపాయకరమైనది. 3) క్రిమి ముక్కలు, ముక్కలైనను నాశనం కాదు. ఇది ముక్కలుగ తెగి విరేచనం ద్వారా పడిపోతేగాని బాధ ఉపశమించదు.

***గమనిక :*** *నుసి పురుగు అమీబా అయినచో అది కలిగించు వ్యాధిని అమీబియాసిస్ (Amoebiasis) అని అంటారు.*

**కారణాలు :** 1) బయటి నుండి పురుగులు శరీరంలోనికి ప్రవేశించి సోరాతత్త్వం గల వారిలో వృద్ధి చెందుతాయి. సాధారణంగా ప్రజలు తడి ప్రదేశాలలో పండే ఆకుకూరలను తింటూ ఉంటారు. ఆ ఆకుకూరలకు అంటుకొని యుండు పురుగుల గ్రుడ్లు శరీరంలోనికి చేరి అనుకూల పరిస్థితులలో క్రిములుగా మారును. పిల్లలు మట్టిలో ఆడుకొంటూ ఉంటారు. అప్పుడు పురుగుల గ్రుడ్లు వాళ్ళ గోర్లలోనికి వెళ్ళుతాయి. చేతులు కడుగు కొనకుండా ఏమైనా తిన్నప్పుడు ఆ గ్రుడ్లు శరీరంలోనికి పోయి అచ్చట క్రిములుగా మారును. 2) సోరాతత్త్వం పురుగుల అభివృద్ధికి మూల కారణం. కనుక ఈ పురుగుల నుండి శాశ్వత పరిష్కారం పొంద దలచినచో సోరా విరుగుడుకు మందు వాడి ఆ తర్వాత లక్షణాలను బట్టి ద్వాదశ లవణ చికిత్స చేయవచ్చు.

**నివారణోపాయాలు :**

1) క్రొవ్వుపదార్థాలు, మసాలాలు లేని ఆహారము తీసుకోవాలి 2) ఆరోగ్యపు అలవాట్లను మార్చుకోవాలి. 3) శుభ్రమైన ఆహారాన్ని, శుభ్రమైన నీటిని తీసుకోవాలి 4) పిల్లలకు శుభ్రతను గూర్చి నేర్పాలి. 5) ప్రయాణంలో మినరల్ వాటర్‌ను వాడుట మంచిది.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12× :** జీర్ణంకాని ఆహారంవల్ల నుసిపురుగులు / దారం వంటి పురుగులు వృద్ధి చెందును.

**కాలీమూర్ 6× :** చిన్నని, తెల్లని నుసిపురుగులు గుదం వద్ద దురదను కలిగించుట – తెల్లని నాలుక – ఈ మందును నేట్రంఫాస్‌తో మార్చి–మార్చి వాడాలి.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** ప్రేగులలోని పొడుగాటి, గుండ్రని నుసిపురుగులు – జీర్ణాశయంలో హైడ్రోక్లోరిక్ ఆమ్లం ఎక్కువై ఛాతీలో అధిక మంట కలిగించుట / ముక్కు వద్ద దురద, అప్పుడప్పుడు మెల్లకన్ను పెట్టుట. ప్రేగులలో నొప్పి – అస్థిమితముగ నుండు నిద్ర – గుదం వద్ద దురద ముఖ్యంగా రాత్రిపూట పడుకొన్నప్పుడు నోటివద్ద / ముక్కు వద్ద

ముఖం తెల్లగ ఉండుట. పిల్లలలో పళ్ళు కొరుకుట – నుసి పురుగులు ఉండుట. ఈ పురుగులు శరీరంలో  అభివృద్ధి చెందుటకు లాక్టిక్ యాసిడ్ అవసరం. కనుక ఈ మందు అధికంగా ఉన్న లాక్టిక్ యాసిడ్‌ను నాశనం చేయుట ద్వారా పురుగులను నాశనం చేస్తూ ఉండవచ్చు.

**ద్వాదశ లవణముల మిశ్రమం :** రోజుకు 3 మోతాదులుగ ప్రతిమోతాదుకీ ఈ మందులన్నిటినీ కలిపి వేడినీటితో తీసుకోవాలి ఫెర్రంఫాస్ 6×–1 మాత్ర, కాలీమూర్ 3× – 1 మాత్ర, మెగ్నీషియం ఫాస్ 3×–1 మాత్ర, కాలీఫాస్ 3×–1 మాత్ర చొప్పున మొత్తం 4 మాత్రలు తీసుకోవాలి.

## 23. గ్యాస్ ట్రబుల్
## (Gas Trouble)

ప్రతిరోజు మానవ శరీరంలోని ప్రేగులలో ఒక లీటరు గ్యాస్ సహజంగా ఉత్పత్తి అగుతుంది. అలా ఉత్పత్తి అయిన గ్యాస్ త్రేపుల రూపంలో పైకి, అపానవాయువు రూపంలో క్రిందికి పోతుంది. గ్యాస్‌పైకి పోక, క్రిందికి పోక బిగిపట్టటాన్ని గ్యాస్‌ట్రబుల్ అని అంటారు.

**కారణాలు :** గ్యాస్‌ట్రబుల్‌కు ఈ కారణాలు గలవు –

1. మలబద్ధకం – ప్రేగులలో నిలువగా వున్న మలం ఎక్కువ గ్యాస్‌ను ఉత్పత్తి చేస్తుంది. ప్రేగులు మలంతో నిండిఉండుట వల్ల ఎక్కువగా ఉత్పత్తి అయిన గ్యాస్ బయటికి వెళ్ళుటకు ప్రేగులలో స్థలం ఉండదు. అందువల్ల బొడ్డుక్రింద గ్యాస్ బిగపట్టి ఉంటుంది / నొప్పి వస్తుంది.
2. తినేటప్పుడు మంచినీళ్ళు త్రాగిన ఆహారం జీర్ణమగుటకు ఎక్కువ సమయం పడ్తుంది. ఆహారం పులిసి ఎక్కువ గ్యాస్‌ను ఉత్పత్తి చేస్తుంది.
3. ఆహారం బాగా నమలక మ్రింగుట వల్ల జీర్ణక్రియ సరిగా జరగక గ్యాస్ అధికంగా తయారవుతుంది.
4. మాంసాహారం, పలావ్‌లు, గ్రుడ్లు, ఫాస్ట్ ఫుడ్స్ మొ॥ ఆహార పదార్థాలను తినిన అవి ఆలస్యంగా జీర్ణమగును. అవి జీర్ణమగుటకు 7–8 గంటలు తీసుకొనును. ఆ సమయంలో గ్యాస్ అధికముగా ఉత్పత్తి అగును.
5. ఆకుకూరలు, కంది, పెసర పప్పులు మొ॥ వాటిలో మాంసకృత్తులు ఉంటాయి. అవి జీర్ణమగుటకు కూడా ఎక్కువ సమయం పడుతుంది. కనుక గ్యాస్ ఎక్కువగా ఉత్పత్తి అవుతుంది.

**నివారణోపాయాలు :**

1. ఎక్కువగా నీరు త్రాగినా మలవిసర్జన సాఫీగా జరగనిచో ఒక వారం రోజులపాటు ఎనీమా చేయించుకోవాలి.
2. తినేటప్పుడు నీరు త్రాగరాదు. తినటానికి అరగంట ముందు, తిన్న తర్వాత రెండు గంటలకు నీరు త్రాగాలి.
3. ఆహారాన్ని మెత్తగా నమిలి తినాలి.
4. ఆలస్యంగా జీర్ణమయ్యే క్రొవ్వు పదార్థాలు, మాంసం, గింజల మొలకలు మొ॥ వాటిని మాని తేలికగా జీర్ణమయ్యే ఆహార పదార్థాలను తినాలి.
5. ఉదయం పూట తక్కువ కేలరీలు ఉండే పండ్లు తినాలి. చక్కెర వ్యాధి లేనివారు ఖర్జూరం పండ్లు తినవచ్చు.
6. పులుపు, కారం వాడకుండుట మంచిది.
7. రాత్రి భోజనాన్ని సాయంకాలం 6 గం॥ పూర్వమే తినాలి.

**• చికిత్స •**

**కాలీఫాస్ 6X :** గ్యాస్‌తో పొత్తికడుపు ఉబ్బుట – క్రిందకు నొక్కుచుండు నొప్పులు – అధోజఠర ప్రాంతం (మూత్రాశయం ఉన్నచోట) లో శూల – విరేచన విసర్జన చేయాలనే కోరిక నెరవేరకుండుట – బాగా వంగిన ఉపశమనం కలుగుట.

**కాల్కేరియాఫ్లోర్ 6X :** క్రింది ప్రేగులలో అధిక వాయువు చేరుట.

## 24. కామెర్లు / పసరికలు
**(Jaundice)**

కామెర్లను సంస్కృతంలో కామలా అని అంటారు. కామలా అనగా కోరిక లేకుండుట అని అర్థం. ఈ వ్యాధిలో ఆహారంపై కోరిక ఉండదు. అనగా ఆకలి ఉండదు. అట్లే ఏ పని చేయాలన్నా ఆసక్తి ఉండదు. కామెర్లను పసరికలు అని కూడా అంటారు. ఎందుకనగా సాధారణంగా వ్యక్తి కళ్ళు, దేహం పచ్చగా మారుతుంది. తెల్లకామెర్లు కూడా ఉంటాయనుకోండి. కాని అలాంటి సందర్భాలు చాలా తక్కువ. అంతే కాకుండా తెల్లకామెర్లు పైకి కనిపించేవి కావు.

కామెర్లు ఒక వ్యాధి కాదు. ఇది ఒక వ్యాధి చిహ్నము. ఇది కాలేయం సరిగా పనిచేయుట లేదని తెలుపును.

**లక్షణాలు :** 1) మలబద్ధకం –అజీర్ణం–ఆకలి నశించుట. 2) మూత్రం పసుపు రంగులో ఉండుట. 3) మలం తెలుపు రంగులో ఉండుట. 4) కళ్ళు, చర్మం పసుపురంగులో

ఉండుట. 5) నోరు చేదుగా ఉండుట. 6) నాడి బలహీనంగా ఉండుట. 7) తలనొప్పి 8) కీళ్ళ నొప్పులు. 9) జ్వరం మొదలైనవి. దురద వచ్చినచో వ్యాధి తీవ్రతను తెలుపును.

**కారణాలు :**

1. **పైత్యరసము పోవు మార్గంలో అడ్డంకులు ఏర్పడుట :** కాలేయం పైత్యరసాన్ని ఉత్పత్తి చేస్తుంది. ఆ రసం పైత్యరసనాళం గుండా ప్రేగులలోనికి పోతుంది. కాని ఒక్కొక్కసారి కాలేయంలోగాని, పైత్యరసనాళంలోగాని రాళ్ళు ఏర్పడటం వల్ల కలిగే అడ్డంకి వల్ల పైత్యరసం ప్రేగులలోనికి పోదు. క్యాన్సర్ వల్ల కూడా ఇలా జరగవచ్చు. అప్పుడు పైత్యరసం, రక్తం కలియుట వల్ల శరీరపు రంగు పచ్చగా మారుతుంది. మలం సహజ రంగులో కాకుండా తెల్లగ వస్తుంది.
2. **పైత్యరసం అవసరం కన్నా అధికంగా తయారగుట :** ఒక్కొక్కసారి పైత్యరసం అవసరం కన్నా అధికంగా ఉత్పత్తి అవుతుంది. అధికంగా తయారైన పైత్యరసం రక్తంలో వుండి పోతుంది. తత్ఫలితంగా కళ్ళలోని తెల్లగ్రుడ్డు, చర్మం పసుపురంగులోకి మారిపోతాయి. పైత్యరస రంగు పదార్థం (Bile pigment) కొంత మూత్రంలోనికి విసర్జింపబడుతుంది. కనుక మూత్రం పచ్చగ వస్తుంది.
3. **ఎర్రకణాలు ఎక్కువగా నశించుట :** ఎర్రరక్తకణాలలో ఎర్రని హిమోగ్లోబిన్ అనే పదార్థం ఉంటుంది. హిమోగ్లోబిన్‌లో బైలు రుబిన్, బైల్ విర్డిన్ అనేవి ఉంటాయి. ఈ రెండు ప్రేగులలోని ఆహారముతో కలసి మలానికి బ్రౌన్ రంగునిస్తాయి. ఏ కారణం వల్లనైనా ఎర్రరక్త కణాలు ఎక్కువ నాశనమైతే అప్పుడు పైత్యరస రంగు పదార్థమగు బైలురుబిన్ అధికంగా తయారై కామెర్లకు దారి తీస్తుంది. కొత్తగా పుట్టిన శిశువులోని రక్తంలో అవసరం కన్న ఎక్కువ ఎర్రకణాలుంటాయి. కొద్ది రోజులకు అవి నశించి కామెర్లను కలిగిస్తాయి. కొద్ది రోజుల్లో సాధారణంగా ఈ పరిస్థితి పోతుంది. బిడ్డను ట్యూబ్‌లైట్ వెలుగులో పడుకోబెట్టుట వల్ల కూడ శిశువు కామెర్లు తొలగును.
4. **కాలేయం సరిగా పనిచేయకపోవుట :** నగరాలలోను, పట్టణాలలోను మంచినీటి పైపులు, డ్రైనేజి పైపులు ప్రక్క-ప్రక్కన ఉంటాయి. పైపులు పగిలినచో డ్రైనేజి పైపుల మురికి నీరు మంచి నీటి పైపులలోని మంచినీటితో కలసి నీరు కలుషితమవుతుంది. చెరువులలోని, నదులలోని నీరు అనేక కారణాల వలన కలుషితమవుతుంది. అలాంటి కలుషిత నీరు త్రాగినప్పుడు కొన్ని రకాల వైరస్‌లు దేహంలోనికి ప్రవేశించి కాలేయాన్ని పనిచేయకుండా చేయును. తగిన ఆహారం లేకపోయినా, ఏదైనా వ్యాధి సోకినా కాలేయం పనిచేయ జాలదు. పైత్యరస రంగు పదార్థమగు బైలు రుబిన్ రక్తములోనే ఉండిపోయి అవయవాలలో పసుపురంగుకు కారణమవుతుంది.

**నివారణోపాయాలు :**

1) రోగి ఎక్కువ విశ్రాంతి తీసుకొనవలెను. 2) మజ్జిగ అన్నం, బార్లీ గంజి వంటి తేలిక ఆహారం ఇవ్వాలి. గ్లూకోజ్ వాడవచ్చు. పెరుగు తినవచ్చు. 3) నూనె, క్రొవ్వు పదార్థాలు, వేడిచేసే పదార్థాలు వాడరాదు. 4) చెరుకురసం త్రాగాలి. మిషన్‌పై తీసిన చెరుకు రసం కంటె దంతములతో చెరుకును కొరికి ఆ రసాన్ని మ్రింగుట మంచిది. 5) రాత్రిపూట ఎండు ఖర్జూరాలను నీటిలో నానబెట్టి ఉదయాన వాటిని నీళ్ళలో నుంచి తీసి తినాలి. 6) ఉదయాన తోడుకొన్న పెరుగుపై నుండు నీటిని త్రాగాలి. 7) గుంద్రని సొరకాయ తినుట మంచిది.

**కామెర్లకు పరీక్షలు :**

1) రోగి మూత్రంలో కొన్ని అన్నపు మెతుకులు / బియ్యపు గింజలు వేసిన కొంత సేపటికి పచ్చగా మారిన, కామెర్లు ఉన్నట్లు భావించాలి. 2) 'సీరం బిలు రూబిన్' పరిమాణాన్ని రక్త పరీక్ష ద్వారా తెలుసుకొని కామెర్ల వ్యాధిని నిర్ధారించవచ్చు. 100 ఘ.సెం.కు 0.1 – 0.25 మి.గ్రా. కంటె అధికంగా ఉన్న కామెర్లు ఉన్నట్లు తలంచాలి.

## • చికిత్స •

వ్యాధికి గల కారణం తెలుసుకొని మందును వాడిన వ్యాధి త్వరగా నయమగును.

**ఫెర్రంఫాస్ 6X :** కాలేయం నొప్పి, వేడి, మంట, వాపు, పచ్చకామెర్లతో నుండుట.

**కాలీమూర్ 6X :** ఆంత్రమూలపు జలుబులో వచ్చు చలివల్ల కలుగు కామెర్లు – తెల్లని పూత గల నాలుక – విరేచనాలు తేలిక రంగులో ఉండుట – కాలేయం మందకొడిగా పనిచేయుట – కొన్ని సమయాల్లో కుడివైపున నొప్పి – తేలికగా నుండు పసుపుపచ్చని విరేచనాలు (పైత్యరసం తక్కువగా తయారగుచున్నట్లు తెలుపుట) – తెల్లని / బూడిద వర్ణపు నాలుక – మలబద్ధకం.

**కాలీఫాస్ 6X :** నరాల వ్యవస్థ క్రుంగియున్నచో

**నేట్రంఫాస్ 6X :** రక్తనాళాలు గట్టిపడినా, కాలేయమునకు సంబంధించిన వ్యాధుల వల్ల చక్కెర వ్యాధి కలిగినా–ఈ వ్యాధి తర్వాత కురుపులు లేసినా ఈ మందును వాడాలి.

**నేట్రంసల్ఫ్ 6X :** క్షోభ పడ్తున్న కాలేయం – ఎక్కువగ చదువుట / మానసిక శ్రమ చేయుట వల్ల అధికముగ పైత్యము ఊరుట – చేదుగా నున్న పదార్థం / పైత్యరసాన్ని వాంతి చేసుకొనుట – క్షోభ వల్ల కలుగు కామెర్లు – పైత్యముతో ఉండుట – ఆకుపచ్చగా నున్న విరేచనాలు – ఆకుపచ్చగా – గోధుమ వర్ణపు పూతగా నున్న నాలుక / పాలిపోయిన చర్మం – కాలేయమునకు రక్తము అధికముగ వచ్చుట – బాధాకరమైన, తీక్షణముగ

నుండు నొప్పులు – ప్రధానమైన మందు – పిత్తకోశపు (Gall bladder) ప్రాంతంలో బ్రద్ధలు చేయునట్టి నొప్పులు – వీటి వల్ల రోగి ముందుకు వంగాల్సి వస్తుంది – చేదైన రుచి – నోటిలో బంక వంటి పదార్థం –

**నేట్రంమూర్ 6X :** నిద్రమత్తు–కాలేయ ప్రాంతమున నొప్పి.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** కాలేయ ప్రాంతమున – కటి వలయపు కుడి వైపున నొప్పి – దాని వల్ల బలహీనత, వమన వికారం, కడుపు నొప్పి.

**కాలీసల్ఫ్ 6X :** జీర్ణాశయపు జలుబు వల్ల కలుగు కామెర్లు – మల విసర్జన.

**సైలీషియా 6X :** కాలేయపు పుండు – కాలేయ ప్రాంతమున ధనారింపుగనుండు నొప్పి, మంటతో నుండు వాపు.

## 25. కడుపులో మంట
### (Acidity)

కొందరికి కడుపులో భోజన సమయానికి మంట వస్తుంది. కొందరికి ఖాళీ కడుపుమీద పరగడుపున మంటగా ఉంటుంది. ఎక్కువ మందికి ఆహారం తిన్న తర్వాత వస్తుంది. కొందరికి తిన్నది జీర్ణమైన తర్వాత మంటగా ఉంటుంది. ఇంకొంతమందికి 24 గంటలూ మండుతూనే ఉంటుంది.

**కారణాలు :** 1) ఆధునిక సభ్యతలో పెరుగుచున్న వారు మాటి మాటికి మలవిసర్జన చేయాల్సి వస్తుందేమో, అందుకు తగిన వసతులు లేవు కదా అనే ఆలోచనతో అతి తక్కువగా నీరు త్రాగుతుంటారు. దానివల్ల పొట్టలోను, ప్రేగులలోను జిగురు ఉత్పత్తులు తగ్గి మంట రావచ్చు. 2) టీ, కాఫీలు త్రాగేవారిలో యాసిడ్ ఉత్పత్తి ఎక్కువగా ఉంటుంది. దాని నుండి రక్షించే జిగురు ఉత్పత్తులు సగానికి సగం తగ్గిపోతాయి. 3) చాలా మంది తినేటప్పుడు నీరు త్రాగుతుంటారు. దీనివల్ల పొట్టలో ఊరే యాసిడ్ పలచగా మారుతుంది. ఆ విధంగా పలచనైన యాసిడ్ తిన్న ఆహారాన్ని అరిగించలేదు. కనుక పొట్ట మరికొంత యాసిడ్‌ను ఉత్పత్తి చేసి పొట్టలో అదివరకే ఉన్న యాసిడ్ తీవ్రతను పెంచటానికి ప్రయత్నిస్తుంది. ఎక్కువ యాసిడ్ ఒకే సారి ఊరటం వల్ల మంట ఎక్కువగా వస్తుంది. 4) మంటను తగ్గించటానికి వాడే చాలా రకాల మందుల వల్ల జిగురు పొరలు నష్టమగుతాయి. 5) వ్యక్తి మానసిక ఆందోళన, కోపం, చిరాకు, తగాదాలు మొ॥వి యాసిడ్ ఉత్పత్తిని పెంచుతాయి. జిగురు ఉత్పత్తిని తగ్గిస్తాయి. ఫలితంగా మంటలు వస్తాయి. 6) మాంసం, గ్రుడ్లు, నూనె, నెయ్యి, పలావులు మొ॥వి, పొట్టలో ఆహారం లేనప్పుడు కూడా యాసిడ్‌ను తయారు చేస్తాయి. దానివల్ల కూడా మంట ఎక్కువవుతుంది.

**నివారణోపాయాలు :**

1) రోజుకు 3-4 లీటర్ల నీరు త్రాగాలి. ఒక్కసారిగా అంత నీరు త్రాగలేనివారు కొద్ది పరిమాణంతో నీరు త్రాగడం ప్రారంభించి ఆ పరిమాణాన్ని రోజురోజుకు కొద్దికొద్దిగా పెంచుకొంటూ పోవాలి. ఒక్కసారిగా త్రాగలేనివారు రోజులో వివిధ సమయాలలో ఆ నీటిని త్రాగవచ్చు. 2) ఏమైనా తినేటప్పుడు మాత్రం ఎట్టి పరిస్థితులలోను నీటిని త్రాగరాదు. తినటానికి అరగంట ముందే నీరు త్రాగాలి. తిన్న 2 గంటల తర్వాత నీరు త్రాగవచ్చు. ఆ నీరు గోరు వెచ్చనిదిగా ఉండాలి. ఇది మంటకు విరుగుడుగా పనిచేస్తుంది. అందులో 3, 4 టీస్పూన్లు తేనె కలుపుకోవచ్చు. 3) టీ, కాఫీలు పూర్తిగా మానివేయాలి. 4) ఎప్పుడు పడితే అప్పుడు తినరాదు. ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం మాత్రమే తినాలి. ఎక్కువసేపు పొట్టను ఖాళీగా ఉంచాలి. ఖాళీపొట్టలో యాసిడ్స్ తయారు కావు. మంట ఉండదు.

**• చికిత్స •**

కడుపులో మంట తగ్గటానికి క్రింది ద్వాదశ లవణాలను లక్షణములను బట్టి వాడాలి.

**నేట్రంఫాస్ 3×-30× :** నోరు పుల్లగా వుండి త్రేపులు వచ్చుట – జీర్ణాశయం నుండి నోటి లోనికి ఆమ్లం వచ్చుట – కడుపులో, ఛాతీలో మంట – భోజనం చేసిన తర్వాత కడుపులో తీవ్ర నొప్పి – నాలుక వెనుక భాగాన పసుపుపచ్చని పూత.

**వాడవలసిన విధానం :** భోజనానికి 1/2 గంట ముందు 4 మాత్రలు. దీర్ఘకాల వ్యాధిలో 30×.

**నేట్రంసల్ఫ్ 3×-6× :** పైత్యరసం నోటిలోనికి వచ్చుట – చేదు స్రావం వాంతి అగుట – నాలుక మీద ఆకుపచ్చని గోధుమ రంగుపూత – పిండి పదార్థాల వల్ల త్రేపులు.

**వాడవలసిన విధానం :** భోజనానంతరం 1/2 గంటకు 4 మాత్రలు.

**ద్వాదశ లవణముల మిశ్రమం :** ప్రతి మోతాదులో కాల్కేరియా ఫాస్ 3× – 2 మాత్రలు, కాలీఫాస్ 3× – 2 మాత్రలు, నేట్రం ఫాస్ 3× – 2 మాత్రలు, నేట్రంసల్ఫ్ 3× – 2 మాత్రలు మొత్తం 8 మాత్రలుగా రోజుకు 3 సార్లు వాడాలి.

## 26. అపెండిసైటిస్
## (Appendicitis)

మన శరీరంలో పెద్దప్రేగు, చిన్నప్రేగు కలిసే చోట కుడివైపు క్రింది భాగంలో ఒక చిన్న నాళం వంటి నిర్మాణం ఉంటుంది. దానిని అపెండిక్స్ (క్రిమిక) అని అంటారు. ఈ క్రిమిక వాచుట వల్ల అపెండిసైటిస్ అనే వ్యాధి కలుగును.

క్రిమిక వల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు. కాని ఆహార దోషాలు, చల్లదనం, దెబ్బలు తగులుట, నిరంతరం శ్రమించుటవల్ల గట్టిగింజలు లాంటి పదార్థాలు తిన్నప్పుడు అవి క్రిమికలో చేరును. సూక్ష్మక్రిముల ప్రభావం వల్ల ఈ క్రిమికకు చీము పట్టి వాయును. అది చితికి చీము కడుపులోనికి స్రవించుట వల్ల ప్రాణాపాయ పరిస్థితి ఏర్పడును. ఈ వ్యాధినే '24 గంటల వ్యాధి' అని అంటారు. ప్రాణాపాయ స్థితిలో దీనిని శస్త్రచికిత్స చేసి తొలగించి రోగిని కాపాడుకోవాలి. అట్టి స్థితి ఏర్పడకుండుటకు లక్షణాలను బట్టి మందును ఎంపిక చేసి చికిత్స చేయాలి.

క్రిమిక వాపు వలన మొదట నాభి (బొడ్డు) దగ్గర నొప్పి ప్రారంభమై కుడివైపునకు ప్రయాణించును. దాని వల్ల రోగి కాళ్ళు పైకెత్తి పడుకొనదలచును. మలబద్ధకం, జ్వరం, నాలుక పూత, చిరాకు, విరేచనాలు, పొట్ట ఉబ్బరం ఏర్పడును. ఉదరంలో కుడివైపున బిగుతుగ నుండును. అతనికి ఆకలి ఉండదు. రోగి బాధను భరించలేక తన కాళ్ళను ముడుచుకొని మూడంకె వేసి పడుకొనును. బోర్లా పడుకొంటే నొప్పికి ఉపశమనం ఏర్పడును.

**నివారణోపాయములు :**

అపెండిసైటిస్ ఏర్పడినపుడు రోగికి బాగా విశ్రాంతి కావాలి. ఘన పదార్థాలు, వాయువు పుట్టించే పదార్థాలు తినరాదు. ద్రవ పదార్థాలు ఎక్కువగా తీసుకోవాలి. నొప్పిగల చోట కాపడం పెట్టాలి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12X :** వాపు ప్రథమదశ – నాడి తొందరగ కొట్టుకొనును. ముఖం కందిపోయి వుండును. ఉదర భాగాన నొప్పి అధికము. జ్వరము తీవ్రంగా వుండును. జ్వరం తగ్గు వరకు ఈ మందును 1/2 గంటకు ఒకసారి ఇవ్వాలి.

**కాలీమూర్ 6X :** ఉదర భాగములో వాపు ఉండి గట్టిగా కనిపించును. ఈ లక్షణానికి ఈ మందును 1/2 గంటకు ఒకసారి ఫెర్రంఫాస్‌తో మార్చి ఇవ్వాలి.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** ఈ మందు చీము ఏర్పడకుండా తోడ్పడును. దీనిని రోజుకు 3 సార్లు ఇవ్వాలి.

**నేట్రంసల్ఫ్ 6X :** ఉదరభాగాన కోయుచున్నట్టి నొప్పి – గుడగుడ శబ్దాలు – జ్వరం. ఈ మందును ఫెర్రంఫాస్‌తో మార్చి ఇవ్వాలి.

**మెగ్నీషియంఫాస్ :** విపరీతమైన నొప్పి – ఈ మందును వేడి నీటితో తరచుగా ఇవ్వవలెను.

# 27. కడుపు / ప్రేగులో పుండు (Peptic Ulcer)

కొంతమందిలో అన్ననాళిక క్రింది భాగమున, పొట్టలో లేదా ఆంత్ర/ప్రేగు మూలం[1]లో పుండు ఏర్పడును. దీనిని ఆంత్ర మూలంలో పుండు (Duodenal Ulcer) అని అందురు. కొందరి జీర్ణాశయంలో పుండు ఏర్పడును.

**కారణాలు :** 1) వంశపారంపర్యత. 2) క్రమం లేని ఆహారపు అలవాట్లు. 3) మానసిక ఒత్తిడి మొ॥ కారణాలు.

**లక్షణాలు :** 1) కొన్ని నెలలు / సంవత్సరాలుగా ఉన్న అజీర్ణం 2) చలికాలం దీని లక్షణాలను ఉద్రేక పరచును.

| ఆంత్రమూలపు పుండు (Duodenal Ulcer) | జీర్ణాశయపు పుండు (Gastric Ulcer) |
|---|---|
| 1. తిన్న 3–4 గంటల తర్వాత నొప్పి ప్రారంభమగును. | 1. తిన్న వెంటనే నొప్పి ప్రారంభమగును. |
| 2. తినగానే నొప్పి తగ్గుట. | 2. తినటం వల్ల నొప్పి ఎక్కువగుట. |
| 3. వాంతి నొప్పిని తగ్గించదు. | 3. వాంతి నొప్పిని తగ్గించుటచే కొంత మంది రోగులు వాంతి అగునట్లు చేసుకొందురు. |
| 4. అర్ధరాత్రి నొప్పి ఏమైనా తిన్నచోతగ్గును | 4. అర్ధరాత్రి సమయమున నొప్పి రాదు. |
| 5. రోగి శుష్కించదు. | 5. రోగి శుష్కించును. |
| 6. మలబద్ధకపు స్వభావముండును. | 6. నీళ్ళ విరేచనాల స్వభావం ఉండును. |
| 7. ప్రమాదకరమైన క్యాన్సర్‌గా ఎప్పటికీ మారదు. | 7. ప్రమాదకరముగా మారవచ్చు. |
| 8. సాధారణంగా యువకులు ఈ వ్యాధికి గురి అగుదురు. | 8. మధ్య వయస్సు దాటిన వారు సాధారణంగా ఈ వ్యాధికి గురి అగుదురు. |

**అవలక్షణాలు :**

1. **రక్తస్రావం (Haemorrhage) :** వాంతి, విరేచనంలో రక్తం పడును. రక్తం బాగా నల్లగా, తారు వలె ఉండును. వాంతి, విరేచనంలో పడే రక్తం పరిమాణాన్ని బట్టి రక్తం ఎక్కించ వలసిన పరిస్థితి కూడా ఏర్పడును.

*1. ఆంత్ర / ప్రేగుమూలం (Duodenum) : చిన్న ప్రేగులోని మొదటి 11 అంగుళముల భాగాన్ని ఆంత్రమూలం అని అంటారు.*

2. **రంధ్రం పడుట (Perforation) :** చాలాకాలం నుంచి పుండు ఉన్నచో దానికి రంధ్రం పడే అవకాశం కూడా ఉండును. రంధ్రం పడినచో (తరుణ) నొప్పి తగ్గును. నెమ్మదిగా పొత్తికడుపు బిర్రబిగియును. మలమూత్రములు బంధింపబడును. పొత్తికడుపు కొద్దిగా వాచును. ఇవన్నీ పుండుకు రంధ్రం పడిన విషయాన్ని నిర్ధారించును. ఇట్టి పరిస్థితిలో శస్త్రచికిత్సయే శరణ్యం కావచ్చు.

3. **చిన్నప్రేగు ప్రథమభాగం సన్నబడుట** (Pyloric Stenosis) : ఈ పరిస్థితి సాధారణంగా చిన్నప్రేగు ఆరంభమున కలుగు పుండ్ల వల్ల ఏర్పడును. చాలా కొద్ది సందర్భాల్లో అన్నాశయపు పుండ్ల వల్ల కలుగును. దీనివల్ల ఆహారం చాలా నెమ్మదిగా పొట్టలోనికి చేరును. చిన్నప్రేగు ప్రథమ భాగం ఎంత వరకు సన్నబడిందో, దానిని బట్టి వాంతులు అగును. ఇది పూర్తిగా మూయబడనంతవరకు పూర్తిగా మందులతో చికిత్స చేయబడును.

**నివారణోపాయాలు :**

1) రోగి ఒక నిర్ణీత కాలవ్యవధిలో ఆహారం తీసుకొనవలెను 2) ఎక్కువ మసాలా, కారం ఉన్న ఆహారం మానుకొనవలెను 3) ఉత్తేజం కలిగించు కాఫీ, టీ, సారాయి/ మద్యం మానుకోవాలి 4) అనవసరమైన ఆందోళనను మానుకోవాలి. 5) పాలు చాలా మంచి ఆహారం 6) ప్రాణాయామం, ధ్యానం బాగా ఉపయోగపడును.

## • చికిత్స •

**నేట్రంఫాస్ 6X :** కడుపులో మంట – లాక్టిక్ యాసిడ్ ఎక్కువగుటచే పుల్లని త్రేపులు – జీర్ణాశయపు కోత, వాపు – ఆహారం తిన్న తర్వాత ఒక చోట నొప్పి – పుల్లని పదార్థముల / కాఫీ విత్తనముల వలె ఉండు నల్లని పదార్థాన్ని వాంతి చేసుకొనుట – పుల్లని త్రేపులు – ఆకలి లేమి – అజీర్ణం – నోటిలో పుల్లని రుచి – కొన్ని సమయాల్లో ఆహారం తిన్న 2 గంటలకు నొప్పి వచ్చుట – వమన వికారం – ఆమ్లం వంటి ద్రవాన్ని / పెరుగు వంటి పదార్థాన్ని వాంతి చేసుకొనుట – అజీర్ణముచే నోటి యందు నీరు అధికముగ ఊరుచుండుట – కడుపులో మంట – మలబద్ధకం – హైడ్రోక్లోరిక్ ఆమ్లం అధికముగ తయారగుటచే నీళ్ళ విరేచనాలు – విరేచనాన్ని ఆపుకొనలేక పోవుట – అకస్మాత్తుగా మలవిసర్జన చేయాలనిపించుట.

**సైలీషియా 6X :** సారాయి వంటి ప్రేరకాలను సహించలేకపోవుట, ఆంత్రముఖం (Pylorus) వాపు – దీర్ఘకాలపు అజీర్ణం – హైడ్రోక్లోరిక్ ఆమ్లం అధికముగా ఉత్పత్తి అగుటచే త్రేపులు–గుండెలో మంట–చలి–12 గంటల తర్వాత వాంతి–మాంసమన్నా, వెచ్చని ఆహారమన్నా విరక్తి–విపరీతమైన ఆకలి–మలబద్ధకం–పురీషనాళం నుండి మలం బయటికి వచ్చి వెనుతిరుగుట – శవపు వాసనతో ఉండు నీళ్ళ విరేచనం – పసుపుపచ్చని, నీళ్ళ వంటి విరేచనాలు.

**కాలీఫాస్ 6× :** ఇది జీర్ణాశయపు పుండుకు మంచి మందు – ఆహారం తిన్న తర్వాత ఆకలి ఎక్కువగుట – కడుపు ఖాళీగానున్నట్టి భావన – అజీర్ణం – క్రుంగుట – భయం/ఉద్రేకం వల్ల కడుపునొప్పి – ఎక్కువ దాహం – వమన వికారం – పుల్లని చేదైన పదార్థం/రక్తం వాంతి – తినుట వల్ల ఖాళీగా నున్న భావనకు, కొరుక్కు తినుచున్నట్టి నొప్పికి ఉపశమనం – చేదు, పులుపు రుచితో త్రేపులు – జీర్ణాశయ ప్రాంతంలో ఒక చిన్నచోట నిరంతరం నొప్పి – మెదడు బాధలవల్ల చిక్కని, పసుపుపచ్చని/నీలముగానున్న పదార్థపు వాంతి – నీళ్ళ విరేచనాలు, నొప్పిలేని విరేచనాలు భయం/క్రుంగదీయు ఇతర కారణాలవల్ల అగుట – బియ్యపు కడుగు నీరు వంటి దుర్వాసనకరమైన విరేచనాలు – విరేచనంలో రక్తం పడుట – విరేచనం కుళ్ళిన మాంసపు వాసనతో.

## 28. పైత్యరసతిత్తిలో రాళ్ళు
## (Gall - Stones)

కాలేయములో తయారయ్యే పైత్యరసం పైత్యరసతిత్తి (Gall bladder)లో నిలువ చేయబడును. పైత్యరసములో నేట్రంసల్ఫ్ తక్కువైన పైత్యరసము గట్టిపడి రాళ్ళుగా మారును. అవి బఠాణి గింజంత పరిమాణంలో వుండును. పైత్యనాళంలో ఈ రాళ్ళు వుండిన కామెర్ల రోగం (Jaundice) వచ్చును. ఈ రాళ్ళు పైత్యరస తిత్తి నుండి ప్రేగులోనికి పోవునపుడు విపరీతమైన నొప్పి వచ్చును. రాళ్ళు ఏర్పడినపుడు నొప్పి పైత్యరసతిత్తి నుండి కుడి భుజం వరకు వ్యాపించును.

### • చికిత్స •

**నేట్రంసల్ఫ్ 3× – 6× :** ఈ వ్యాధికి ఇది ముఖ్య ఔషధము. రోగి నడుము చుట్టూ బిగుతుగా నుండు గుడ్డలను భరించలేడు. వాంతి చేసుకొనును. నోరు చేదుగా వుండును. నాలుక మీద బూడిద ఆకుపచ్చ పూత వుండును. కాలేయ ప్రాంతములో కోయుచున్నట్లు నొప్పి వలన రోగి ముందుకు వంగును. ఎడమప్రక్క పడుకొనలేడు. గౌటుతత్త్వము (కీళ్ళవ్యాధి) గలవారికి ఈ మందు బాగా పనిచేయును.

**మెగ్నీషియంఫాస్ 3× – 6× :** ఈడ్పులతో కూడిన నొప్పివల్ల రోగి ముందుకు వంగును. త్రేపులవల్ల ఉపశమనం వుండదు. అస్థిమిత్వం వల్ల పరుండలేకపోవుట – నడుస్తూ అపానవాయువును వదలుట – ఈ మందును వేడినీటితో తీసుకొనవలెను.

**కాల్కేరియాఫాస్ 3× – 12× :** క్రొత్త రాళ్ళు ఏర్పడకుండా చేయును – దీనిని నేట్రంఫాస్‌తో మార్చి వాడాలి.

## 29. పెద్దప్రేగు మొదటిభాగం వాచుట
(Typhlitis)

పెద్దప్రేగు మొదటిభాగం (అంధనాళం) యొక్క నొప్పి, వేడి, మంట, ఎరుపు, వాపును టిఫిలైటిస్ అని అందురు.

**ఫెర్రంఫాస్ 6×–12× :**జ్వరం, వాపు, అధిక ఉష్ణోగ్రత, వడిగా కొట్టుకొనునాడి, నొప్పి.

**కాలీమూర్ 3× – 6× :** వాపు, చెమర్చుట, గట్టితనం.

**కాలీసల్ఫ్ 6× – 12× :** స్రావముల శోషణకు, పొత్తికడుపు వాపును తగ్గించుటకు, అధికముగ స్రవించు స్రావములు పంపకపోవుటవల్ల చిన్నప్రేగు, పెద్దప్రేగు కలియుచోట (అపెండిక్స్) చేరి శూలనొప్పి కలిగించుట.

**సైలీషియా 6× – 200× :** చీము, పుండు ఏర్పడుట.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** కటి ప్రదేశపు కుడి భాగాన నొప్పి – ప్రేగులలో పుండు ఏర్పడుట – ఈ మందు ధాతువుల విచ్ఛిత్తిని నిరోధించును. బలహీనతను, వాపును ఆపును. – పుండు, పసుపుపచ్చని సీరం, చీము కలిసిన రసిగల పదార్థం.

**నేట్రంసల్ఫ్ 3× – 6× :** అపానవాయువు కూడుటచే కడుపుబ్బరం కలిగి శూలనొప్పి వచ్చుట (కుడిగజ్జ ప్రాంతమున) – ఇది ఈ మందు ప్రత్యేక లక్షణం – ప్రేగు కోమలత్వం, వాపు – వీటివల్ల రంధ్రం ఏర్పడు స్వభావం – ప్రేగుల మందకొడితనం, వికార స్థితి కొన్ని సందర్భాలలో ప్రేగులలో రంధ్రం ఏర్పడు స్థితిని కల్పించును.

చిన్నప్రేగు చివరిభాగం, పెద్దప్రేగు ప్రారంభం – ఈ ప్రాంతపు కుడిభాగాన మంద్రస్థాయి నొప్పి – అపానవాయువు స్థానం మారుట – పొట్టను అదిమిన మెత్తగ ఉండుట – నాలుకపై పూత **(J.W. వార్డ్)** – వాంతులు ఆగకుండుట.

## 30. హెర్నియా / గిలక
(Hernia)

దేహంలో మెత్తని, బలహీనమైన చోట అవయవం/ కణజాలం చొరవ చేసుకొని ఉబ్బుటను గిలక అని అంటారు. ఇది అనేక రకములు – 1) ఉదరకుడ్యంలో నుండి ఏర్పడు హెర్నియా 2) విభాజక పటలం ద్వారా అన్నాశయం ఛాతీలోనికి వచ్చు హెర్నియా 3) విభాజక పటలం ద్వారా అన్నవాహిక సందులో నుంచి వచ్చు హెర్నియా 4) గజ్జ క్రింద ఫెమొరల్ కాల్వ గుండా ఉబుకు గిలక 5) లోగడ చేయబడిన శస్త్రగాటుగుండా కనిపించే హెర్నియా 6) తరచుగ ఉదరకుడ్యం మీద కనిపించే గిలక 7) నాభి/బొడ్డు దగ్గర ఏర్పడు హెర్నియా 8) ఉదరకుడ్యంలో కన్నం వేసుకొని వెలువడు హెర్నియా.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6×-12× :** వాచిన, క్రిందకు దిగిన ప్రేగు (గిలక) మరల పైకిపోవుట - పురీషనాళం క్రిందికి దిగజారుట.

**కాల్కేరియాఫాస్ 6× :** రక్తహీనత కలవారిలో గిలక - విరేచనంలో దుర్గంధభరితమైన చీముపడుట.

**ద్వాదశ లవణ మిశ్రమం :** ప్రతి మోతాదులోను కాల్కేరియాఫ్లోర్ 3× -1 మాత్ర, కాల్కేరియాఫాస్ 3×-1 మాత్ర, ఫెర్రంఫాస్ 12×-1 మాత్ర, కాలీమూర్ 3×-1 మాత్ర, నేట్రంమూర్ 3×-1 మాత్ర, సైలీషియా 12×-1 మాత్ర చొప్పున మొత్తం 6 మాత్రలు తీసుకోవాలి. ఈ విధంగా కొంతకాలంపాటు ఉదయం, రాత్రి వాడాలి.

# 31. గ్యాస్ బిగపట్టుట

కొందరిలో పొత్తికడుపు ప్రాంతంలో వాయువు బిగపట్టి బయటికి రాదు. వ్యక్తి ఎంతో ఇబ్బందికి గురవుతాడు. అపానవాయువు/త్రేపు వచ్చిన బాగుండునని తలస్తాడు. కాని అలా జరగక అతడు బాధపడుతుంటాడు.

**కారణాలు :** 1) మూత్రాన్ని ఎక్కువసేపు ఆపుకొనుట 2) బట్టలను నడుముకు బిగుతుగా కట్టుకొనుట 3) మలం మల ద్వారం దాకా వచ్చి ఆగిపోవుట 4) ఛాతీ భాగం / పొట్ట భాగంలోనే వాయువు బిగపట్టి త్రేపు రాకపోవుట.

**నివారణోపాయాలు :**

1) నడుముకు బిగించిన వస్త్రములను వదులు చేయాలి. 2) మూత్రం రాకపోయినా మూత్ర విసర్జన చేయాలనే భావంతో కొంతసేపు కూర్చోవాలి. ఆ సమయంలో కొంత వాయువు బయటికి పొయ్యే అవకాశం ఉంటుంది. 3) పైభాగంలో వాయువు బిగపట్టియున్నచో వజ్రాసనం (మోకాళ్ళపై కూర్చొనుట) వేసిన కొంత వాయువు బయటికి పోవును 4) ఇంకను గాలి బిగపట్టియున్న 5-10 శ్వాసలను గట్టిగా పీల్చి వదిలేయాలి. ఆ కదలి కలకు వాయువు బయటికి పోతుంది. 5) అప్పటికీ వాయువు బయటికి రాకపోతే వేడి నీటిని మెల్లమెల్లగా త్రాగాలి. దానివల్ల ప్రేగులలో కదలికలు పెరిగి వాయువు బయటికి పోతుంది. 6) ఇంకను ఇబ్బంది ఉంటే ఛాతీ/బొడ్డు క్రింద కొంచెం కొబ్బరినూనె రాసి వేడినీటి కాపడం పెట్టాలి. దానివల్ల సాధారణంగా వాయువు బయటికి వస్తుంది. అప్పటికీ వాయువు బయటికి రానిచో క్రింది చికిత్స చేయాలి.

**• చికిత్స •**

**మెగ్నీషియంఫాస్ 6×** : దీనిని వేడినీటితో ఇవ్వాలి. అరగంటకు ఒకసారి – మోతాదుకు 4 మాత్రలు.

**ద్వాదశ లవణ మిశ్రమం** : నేట్రంసల్ఫ్ 6× – 2 మాత్రలు + కాలీఫాస్ 6× – 2 మాత్రలు చొప్పున మొత్తం 4 మాత్రలు 1 మోతాదుకు – అరగంటకు ఒకసారి ఒక మోతాదు వాడాలి.

## 32. ఆసనములో పగుళ్ళు
### (Fissures of anus)

ఈ వ్యాధిలో ఆసనము / గుదము అంచువద్ద ఆమత్వక్కు / జిగురు పొరపై సన్నని గీతవలె పుండు ఏర్పడుతుంది.

**లక్షణాలు :**

1) మలవిసర్జన సమయమందు, తర్వాత మంటగ, బాధగ ఉండును. 2) గుదమును చుట్టియున్న కండరములు సంకోచించుటచే ఒక్కొక్కప్పుడు రక్తం కారును.

**కారణం :** మలబద్ధకం

**నివారణోపాయాలు :**

దీనిని శస్త్రచికిత్స చేసిన మరల–మరల వచ్చే అవకాశం ఉంటుంది. కనుక ఈ వ్యాధి రాకుండ చేసుకొనుట మంచిది. అందుకుగాను సాత్విక ఆహారం, పీచు పదార్థాలు ఉన్న ఆహారం తినుట మంచిది.

**• చికిత్స •**

**కాల్కేరియాఫ్లోర్ 3×–12×** : మలద్వారం వద్ద పగుళ్ళు – గుదం/ పురీషనాళంలో మలం ఎక్కువగా చేరుట – మలాన్ని విసర్జించలేకపోవుట – వ్రేలితో మలాన్ని తీసివేయ వలసివచ్చుట – పగుళ్ల దగ్గర మంట – ఈ మందును పైపూతగా కూడా వాడవచ్చు.

**కాల్కేరియాఫాస్ 3×–12×** : ఆసనం బీటలు వారుట – ముసలివారిలో మలం గట్టిగా నుండుట – రక్తక్షీణత / నీరసం గల వారికి బాగా పనిచేయును.

**నేట్రంమూర్ 3×– 6×** : మలం గట్టిగ, ఉండలు ఉండలు వలె ఉండుట – మలవిసర్జన తర్వాత మంట – గుదం/పురీషనాళంలో సూదితో కుట్టుచున్నట్లు తీవ్రమగు బాధ.

**సైలీషియా 12×** : గుదం/ఆసనంలో పగుళ్ళు – మలబద్ధకం – మలం కొద్దికొద్దిగా బయటికి వచ్చి తిరిగి లోనికిపోవుట – మలం దుర్వాసనగ ఉండుట.

# 33. మొలలు / మూలశంక
## (Piles / Haemorrhoids)

పురీషనాళము వద్ద వుండు సిరలు సాగి మొలలు[1] ఏర్పడును. ఒక్కొక్కసారి అవి క్రిందికి జారి బహిర్గతమై ద్రాక్షగుత్తులవలె కనిపించును. వాటిని బయటి/బాహ్య మొలలు (External piles) అని అంటారు. కొన్ని సమయాల్లో అవి లోపలే వుండి బాధిస్తాయి. వాటిని లోపలి మొలలు (Internal piles) అని అంటారు. ఒక్కొక్కసారి ఆ సిరలు చిట్లి రక్తస్రావమగును.

**కారణములు :**

1. పురీషనాళపు గోడల సిరల కండరాల కణాలలో కాల్కేరియాఫ్లోర్, ఫెర్రంఫాస్ మొ॥ లవణాలు తక్కువగుట వలన వాటిలో బిగువు పోయి వదలై క్రిందికి పిలకల మాదిరి వ్రేలాడును.
2. మలబద్ధకము మొలలకు మరొక ముఖ్య కారణము. మలబద్ధకము వున్నప్పుడు మలాన్ని బయటికి పంపుటకు ఎక్కువగా ముక్కవలసి/తినకవలసి వస్తుంది. దానివల్ల సిరలుబ్బి మొలలు ఏర్పడును. మెత్తలు కల కుర్చీలో కూర్చొనుటవల్ల కూడా మలబద్ధకం కలుగును.
3. కాలేయము, జీర్ణాశయము పనులలో తేడాలు.
4. గుండెజబ్బులు, గర్భధారణ, విరివిగా విరేచనకారులను వాడుట, మద్యము సేవించుట మొ॥వి ఇతర కారణాలు.

**నివారణోపాయాలు :**

1. సాధ్యమైనంత వరకు మొలలు వచ్చుటకు గల కారణమును తెలుసుకొని ఆ కారణమును తొలగించుట అవసరము.
2. మలబద్ధకము వలన మొలలు వచ్చియున్నచో దానిని నివారించిన మొలలు తగ్గును. మలబద్ధకమును నివారించుటకు తెల్లవారుజామున దాదాపు 2 లీటర్ల నీటిని ఒక్కసారిగా లేక 2–3 సార్లుగా త్రాగి వడివడిగా కొంతదూరం నడవాలి. ఆహారములో పీచుపదార్థం వుండేటట్లు జాగ్రత్త తీసుకోవాలి. ఆహారం తేలికగా జీర్ణమయ్యేటట్లు వుండాలి. బొప్పాయి, దోసకాయ, గుమ్మడికాయ, అరటిపండ్లు, మామిడి, నిమ్మ, ఆకుకూరలు వాడాలి. తాము తీసుకునే ఆహారంలో పీచుపదార్థాలు తక్కువగా ఉన్నచో ఉదయం అల్పాహారం తర్వాత, రాత్రి భోజనం పిమ్మట ఒక్కొక్క టేబుల్ స్పూను

*1. **మొలలు :** మొలలు పెద్దప్రేగుచివర ఆసనం/పురీషనాళం చివర ఉండే స్ఫింక్టర్ కండరాలు. ఇవి మల విసర్జన సహజ ప్రక్రియకు అవసరమైనప్పుడు తెరచుకొని ఆ తర్వాత కవాటంలా గట్టిగా మూసుకొంటాయి. ఇవి గుండ్రంగా ఉంటాయి. ఈ కండరాల మధ్య / పైన ఉన్న సిర రక్తనాళాలు వాచి, కంది, పుండ్లు కావటం, సాగటం, రక్తం కారుట జరుగుతుంది.*

గోధుమ తవుడును మజ్జిగ/పళ్లరసం/గోరువెచ్చటి నీటిలో కలిపి తీసుకోవాలి. తగినంత వ్యాయామం అవసరం. మలమూత్రములకు వెళ్ళవలసియున్నప్పుడు ఆలస్యం చేయరాదు. సైకిలు త్రొక్కుట, స్వారీ చేయుట కూడదు.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 3×–12× :** వాచిన మొలలు – ప్రకాశవంతమైన ఎర్రని రక్తాన్ని స్రవింపజేసే మొలలు, రక్తము గడ్డకట్టు స్వభావము కలిగియుండుట – మొలల వాపునకు ముందు దీనిని వాడిన నివారణమగును.

**కాలీమూర్ 3×–6× :** మొలల నుండి నల్లని, చిక్కని, పోగుల వంటి రక్తము కారుట – ఆ రక్తము గడ్డకట్టుట.

**కాలీఫాస్ 3×–6× :** మొలలు బాధాకరముగను, నొప్పితోను, దురదతోను వుండుట – వీటి నుండి వచ్చే రక్తము పలచగా వుండుట – ఆ రక్తము గడ్డకట్టకపోవుట.

**కాల్కేరియాఫ్లోర్ 3×–12× :** మొలలకు అతి ప్రధానమైన మందు – తలకు రక్తము ఎక్కువగా చేరుట – మొలలతో పాటు నడుము నొప్పి – గుదములో దురద – దీర్ఘకాలపు మలబద్ధకము – ఆసన గోడలలోని కండరాల బిగి తగ్గుటవల్ల గుదము బయటికి వచ్చుట – రక్తము, నాలుక రంగును బట్టి దీనిని వేరే మందులతో మార్చి యివ్వాలి. ఈ మందును వ్యాసిలైనుతో కలిపి బయటికి వాడవచ్చు.

**కాల్కేరియాఫాస్ 6× :** రక్తక్షీణత గలవారిలో దీర్ఘకాలంగా వున్న మొలలకు ఇది బాగా పనిచేయును. దీనిని మధ్యమధ్యన కాల్కేరియా ఫ్లోర్‌తో మార్చి వాడాలి.

**మెగ్నీషియంఫాస్ 3× – 6× :** మొలల వాపు వుండదు – కోయుచున్నట్లు, చురుకుగా పొడుచుచున్నట్టి తీవ్రనొప్పులు – ఆ నొప్పులు మెరుపు తీగలాగా వచ్చుచుండును – ఈ మందును వేడినీటితో యివ్వాలి.

**నేట్రంమూర్ 3× – 6× :** గుదము చుట్టూ తేమగా వుండుట – మలము గట్టిగా వుండి బయటకు పోవునపుడు ముక్కలు – ముక్కలు అగుట – మలవిసర్జనానంతరము చురుకైన మంట, చితుకకొట్టుచున్నట్టి బాధ – గుదములోని జిగట పొర పొడిగా వుండి పగుళ్ళు ఏర్పడుట – మూత్రవిసర్జనానంతరము మూత్రమార్గములో చురుకైన మంట.

**సైలీషియా 6×–12× :** అత్యంత బాధాకరమైన మొలలు – అవి ముందుకు తోసుకొని వచ్చినట్లుండుట – అవి లోపలకు వెళ్ళకుండుట – వాటి నుండి చీము కారుట – అవి బాగా దురదగా వుండుట – వాటి నొప్పి పురీషనాళము, ప్రేగులలోనికి వ్యాపించుట – భగందరము[1] కూడా ఏర్పడియుండును.

*1. **భగందరము :** పురీషనాళము నుండి గుదము ప్రక్కనున్న చర్మములోనికి ఏర్పడిన కాలువ వంటి రంధ్రము.*

# 34. భగందరం
## (Fistula in Ano)

పురీషనాళములోని ఆమత్వక్కు నుండి, గుదము ప్రక్కనున్న కండరాలలోనికి/ పెద్దప్రేగులలోనికి / చర్మముపైన కాలువవంటి రంధ్రమేర్పడుటను భగందరం అని అందురు. దీనిని శస్త్రచికిత్స చేసిన తర్వాత కూడ మరలా–మరలా రావచ్చు. ఈ భగందరమునకు చీముపట్టి, వాచి తీవ్రముగా బాధపెట్టును. చీము, రక్తము కారిన తర్వాత బాధ తగ్గును. భగందరమునకు రోగిలోని ట్యూబర్కులర్/క్షయతత్త్వ ముఖ్య కారణం.

**నివారణోపాయాలు :**

1) గుదము సమీప భాగమును వెచ్చని నీటితో శుభ్రం చేయాలి. 2) రోగిని వెచ్చని గదిలో వుంచాలి. 3) బార్లీ గంజి, పండ్లరసం, పాలు, ద్రవాహారం, సాత్విక ఆహారం ఇవ్వాలి. 4) మాంసం, మసాలాలు, సారాయి వాడరాదు. ఉప్పు తగ్గించాలి. 5) మలబద్ధకం లేకుండా జాగ్రత్తపడాలి.

### • చికిత్స •

**కాల్కేరియాఫాస్ 3×–12× :** భగందరమునకు ఆపరేషను చేసిన తర్వాత కలుగు పుండును మాన్పుటకు ఈ మందు ఉపయోగపడును. వాతావరణ మార్పులవల్ల కీళ్ళనొప్పులు వచ్చు వారి భగందరానికి ఈ మందును వాడాలి. రక్తక్షీణత గలవారి మలద్వారము నుండి తెల్లని స్రావం వెడలునపుడు దీనిని వాడాలి. ఉదయం లేచినపుడు గుదములో మంటగా వుండును.

ఒకవారం ఈ మందును, రెండవ వారం సైలీషియా 6× ను, మూడవ వారము కాలీఫాస్ 3× ను వాడాలి. ఇదే క్రమములో ఈ మందులను మార్చి–మార్చి వాడాలి. ప్రతి మందును రోజుకు 3 సార్లు వాడాలి.

**సైలీషియా 3×–200× :** గుదములో నొప్పి, దాని నుండి చిక్కటి పసుపుపచ్చని స్రావము వెడలుట – నడుచునపుడు గుదములో కుట్టినట్లుండు బాధ – ఆసనమువద్ద లోతుగల పుండు ఏర్పడుట – మలబద్ధకము వల్ల మలము కొద్దిగా బయటకు వచ్చి మరల లోనికి పోవుట – ఈ మందును కాలీఫాస్‌తో మార్చి చాలాకాలం పాటు వాడాలి.

**కాల్కేరియాసల్ఫ్ 3×–30× :** గుదము వద్ద బాధాకరమైన కురుపు వుండుట – ప్రేగుల నుండి చీము వంటి స్రావం వెలువడుట – ఈ మందు పొటెన్సీని క్రమంగా పెంచుతూ వాడాలి.

## 35. స్కర్వీ
### (Scurvy)

ఇది విటమిన్ 'సి' లోపం వల్ల కలిగే వ్యాధి.

**లక్షణాలు :** 1) రక్తహీనత 2) చిగుళ్ళ నుండి తేలికగా రక్తం కారుట 3) శ్లేష్మ పొరల్లోను, చర్మంలోను రక్తపు దద్దుర్లు

**నివారణోపాయం :**

నిమ్మకాయ/పండు, ఉసిరికాయ, మొ॥ పుల్లని పదార్థాల్లోను, పచ్చని ఆకుకూరల లోను, కొన్ని రకాల కాయగూరలలోను, పాలలోను మొ॥ పదార్థాలలోను విటమిన్ 'సి' ఎక్కువగా ఉంటుంది. కనుక ఈ వ్యాధిగ్రస్తులు ఈ పదార్థములను తినాలి.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6X :** రక్తవృద్ధి చేయును. రక్తస్రావములకు మంచిది.

**కాలీఫాస్ 6X :** పంటి చిగుళ్ళ నుండి రక్తం క్రమ్ముట – కుదుళ్ళలో నొప్పి – ముక్కు నుండి రక్తం కారుట.

**కాలీమూర్ 6X :** చిగుళ్ళ నుండి రక్తం కారుట.

**నేట్రంమూర్ 6X :** ముఖ్యమైన మందు – చిగుళ్ళు వాచుట, చిగుళ్ళ నుంచి రక్తం కారుట, చిగుళ్ళ నొప్పి.

## 36. ఆకలి మందగించుట / పెరుగుట
### (Loss/Increase of Appetite)

ఆకలి పుట్టుకతో వచ్చే స్వాభావిక లక్షణం. పుట్టిన పిల్లలు కూడా ఆకలైనప్పుడు ఏడుస్తూ ఉంటారు. కాని కొన్ని వ్యాధులవల్ల, కొన్ని పదార్థాలను సేవించుట వల్ల ఆకలి మందగించును లేదా ఎక్కువ అగును.

**కారణాలు :** 1) కాలేయం, క్లోమం, ప్రేగులు సరిగా పనిచేయకపోవుట 2) మలబద్ధకం 3) రక్తక్షీణత 4) అల్లోపతి మందులను ఎక్కువగా వాడుట 5) కాఫీ, టీలు, పొగ అధికముగా త్రాగుట 6) మత్తుపదార్థాలు సేవించుట.

**నివారణోపాయాలు :**

1) 5,6 రోజులపాటు ఉదయంపూట ఎనీమా చేసుకొని ప్రేగులను శుభ్రం చేసుకొనుట 2) ఉదయాన నీళ్ళు 2–3 లీటర్లు త్రాగాలి. 3) టిఫిన్లు, గింజల మొలకలు తినుట మానాలి. 4) టిఫెనుకు బదులుగా బొప్పాయి, సపోటా, ఖర్బూజా/దానిమ్మ

పండ్లు సరిపడా తినాలి. 5) మధ్యాహ్నం పుల్కాలను ఎక్కువగా కూరపెట్టుకొని తినాలి. కంది/పెసరపప్పు, ఆకుకూరలు తినటం మంచిది. 6) రాత్రిపూట భోజనం సాయంకాలం 5-6 గం॥కు తినుటయే శ్రేయస్కరం. అప్పుడు పండ్లు తినటం మంచిది.

**• చికిత్స •**

కారణం తెలుసుకొని మందు వాడిన మంచి ఫలితం కలుగును.

**ఎ) ఆకలి మందగించుట :**

**కాలీమూర్ 3×-6× :** కాలేయం (liver) సరిగా పనిచేయనపుడు, క్రొవ్వు పదార్థాలు పడనపుడు - నాలుక మీద తెల్లటి పూత ఉండుట.

**నేట్రంఫాస్ 3×-6× :** కడుపులో ఆమ్లం ఎక్కువగా ఉండుటచే నోటిలోనికి పుల్లని త్రేపులు - నోటిలో నీరువచ్చుట - నాలుక వెనుక భాగాన పచ్చని క్రీమ్‌పూత.

**కాల్కేరియాఫాస్ 6× :** జీర్ణక్రియ సరిగా లేకుండుట, జీర్ణమైన ఆహారం సరిగా వంటబట్టకపోవుట, కడుపులో విపరీతమైన వాయువు చేరుట.

**ఫెర్రంఫాస్ 12× :** అన్నం సహించదు - భోజనం తిన్న తర్వాత, పానీయములు త్రాగిన తర్వాత వాంతులు - జ్వర లక్షణాలు - నాలుక శుభ్రంగా ఉండుట.

**బి) ఆకలి ఎక్కువగా నుండుట :**

**కాలీఫాస్ 6× :** తిన్న తర్వాత కూడ ఆకలి - టైఫాయిడ్ జ్వరం తర్వాత విపరీతమైన ఆకలి - కడుపులో ఏమీ లేనట్లుండుట - నాడీ నిస్త్రాణ.

**నేట్రంసల్ఫ్ 3× - 6× :** ఆకలి ఎక్కువగా ఉండి, కొద్దిగా తినగానే కడుపు నిండుట - పైత్యరసం అధికముగ స్రవించి చేదుస్రావం వాంతి అగుట - నోరు చేదుగా ఉండుట - నాలుకపై ఆకుపచ్చ- గోధుమరంగు పూత.

**నేట్రంమూర్ 6× :** ఉదయం 11 గంటలకు ఆకలి ఎక్కువ - నోటిలో నీరు ఊరుచుండుట - మెడ సన్నం.

## 37. ఎండిపోవుట / కృశించుట / శుష్కించుట
### (Atrophy / Marasmus)

శైశవంలో సాధారణంగా మొదటి ఏడాది వయస్సులోనున్న పిల్లలు ఈ వ్యాధికి గురియగుదురు.

**లక్షణాలు :** 1) ఉదరం/పొట్ట వదులై వ్రేలాడుచుండుట. 2) కండరాలు బలహీనంగా ఉండి వదులుగా ఉండుట. 3) ముఖం పాలిపోయి ఉండుట. అది ముడతలు పడి

ముసలివారి వలె ఉండుట. 4) ఆకలి ఉంటుంది. ఎంత తిన్నా తృప్తి కలగకపోవుట. 5) మలబద్ధకం / విరేచనాలు 6) వాంతులు 7) మెడ కృశించి పోవుట 8. కాళ్ళు – చేతులు సన్నగా ఉండుట 9) దంతములు – నడక ఆలస్యంగా వచ్చుట.

**కారణాలు :** 1) మనం తిన్న ఆహారం జీర్ణమై రక్తంలో కలిసిపోవుటను శోషణ అని అంటారు. ఈ శోషణ జరుగుటకు వ్యాపనక్రియ, ద్రవాభిసరణక్రియ తోడ్పడతాయి. కానీ సోడియం లవణాల సమతుల్యత లోపించుట, తల్లిపాలు లేకపోవుట మొ॥ కారణాలచే ప్రోటీన్లు, కేలరీల శక్తి లోపం వల్ల శోషణకు ఉపకరించే క్రియలు సరిగా జరగవు. 2) తగినంత పరిశుభ్రమైన గాలి, వెలుతురు లభించకపోవుటవల్ల కూడా ఈ శోషణ చక్కగా జరగదు.

**నివారణోపాయాలు :**

1) మంచి పోషక ఆహారం ఇవ్వాలి. ఆ ఆహారం వల్ల శిశువుకు తగినంత సోడియం లభించేటట్లు జాగ్రత్త తీసుకోవాలి. వీలైనచో పండ్లు తినిపించాలి. 2) తల్లిపాలు లేనిచో తత్సమానమైన పాలను ఇచ్చుటకు ప్రయత్నించాలి. 3) మంచి గాలి, వెలుతురు లభించే చోట ఉండాలి.

## • చికిత్స •

**కాల్కేరియాఫాస్ 3× – 6× :** ఇది ఈ వ్యాధికి ప్రధానమైన మందు. పిల్లల ఎముకలను నష్టపరచు క్షయ వంటి వ్యాధులు – తిన్న ఆహారం శోషణ సరిగా జరగకపోవుట వల్ల నీరసం కలుగుట – నీళ్ళ విరేచనాలు – కడుపు వదులుగా ముడుచుకొనిపోయినట్లుండుట, అది వాయుపూరితముగా నుండుట – పాలిపోయిన ముఖం – ముసలివానివలె ఉండుట – శిశువు ఎంతో కుతూహలముతో చూచుట – ఎముకలు మెత్తన – వెన్నెముక బలహీనత వల్ల తలను నిలుపలేకపోవుట – దంతములు ఆలస్యముగా వచ్చుట.

**కాలీఫాస్ 3× – 6× :** క్షీణింపజేసెడి వ్యాధి – క్రుళ్ళిన వాసనగల విరేచనాలు – ఎముకలు శుష్కించుట – నరముల నిస్సత్తువ – అతి నీరసం – నిద్రలేకపోవుట – కండరాలు శుష్కించి నీరసముగ ఉండి పక్షవాతం ఉన్నట్లుండుట.

**నేట్రంమూర్ 3× – 6× :** పిల్లల గొంతు, మెడ త్వరగా శుష్కించుట – తలను సరిగా నిలుపలేకపోవుట – ఆకలి, దాహం అధికం – ఎంత తినినా చిక్కిపోవుట – అతిసారం, మలబద్ధకం – పాలిపోవుట – నడక నిదానంగా నేర్చుకొనుట – మలబద్ధకం, మలం గట్టిగా, ముక్కలు ముక్కలుగా ఉండుట.

**నేట్రంఫాస్ 3× – 6× :** సీసా పాలు త్రాగు పిల్లలు శుష్కించుట – పొట్ట ఉబ్బుట. కాలేయం పెద్దదిగా నుండుట – తిన్న తర్వాత శూల – విరేచనాలతో అజీర్ణమైన ఆహారం.

**నేట్రంసల్ఫ్ 3× - 6× :** వంశపారంపర్యంగా లభించిన సైకోటిక్‌తత్త్వం - ఉబ్బిన కడుపు - వాయువు గుడగుడ ధ్వని చేయుట - నీళ్ళ విరేచనాలు పసుపుపచ్చగా వుండి వడిగా వెడలుట - అవి ఆకస్మికముగను, విస్తారముగను వుండుట - ఉదయాన కదలుటకు ప్రారంభించగనే శిశువు పరిస్థితి బాగా క్షీణించుట.

## 38. వేడిచేయుట

చాలామంది నా దేహం బాగా వేడి దేహం అనియు, ఫలానా వస్తువు తింటే వేడి చేస్తుందనియు అంటారు. అసలు కారణం దేహంలో నీటి పరిమాణం తక్కువగా ఉండుటే. కొంత మంది కొబ్బరిబోండం నీళ్ళు త్రాగితే వేడి తగ్గుతుందని చెబుతారు. కొబ్బరిబోండం నీళ్ళు వేడిని తగ్గించే మందేమీ కాదు. అందులోని నీరే వేడిని తగ్గించేది. కనుక అందరూ రోజుకు 4–5 లీటర్లు నీరు త్రాగుట అలవాటు చేసుకోవాలి. ఎక్కువగా క్రొవ్వు పదార్థాలు ఉన్న ఆహారాన్ని తిన్నప్పుడు ఇంకొక లీటరు నీరు ఎక్కువగా త్రాగాలి.

## 39. నీరసం

నేడు జీవితం ఒక పరుగుపందెం వంటిది. ఉదయం లేచినప్పటి నుండి రాత్రి పడుకొనే వరకు వ్యక్తి పరుగులు తీయాల్సి వస్తుంది. దీనితో తీరికగా ఆహారం తీసుకొనే అవకాశం కూడా అతనికి లభించుటలేదు. ఈ పరిస్థితి వల్ల వృద్ధులే కాదు, అన్ని వయస్సుల వారూ బలహీనంగానూ, నీరసంగానూ కనిపిస్తున్నారు. భవిష్యత్తులో వారికి తినే ఓపిక కూడా లోపించినా ఆశ్చర్యపడనక్కరలేదు.

**కారణం:** 1) పౌష్టిక ఆహారం తినకపోవుట. 2) తిన్న ఆహారం సరిగా శోషణ కాకపోవుట 3) మానసిక శ్రమ ఎక్కువై, శారీరకశ్రమ తగ్గుట.

**నివారణోపాయాలు :**

1) కొబ్బరి ఎక్కువ బలవర్ధకమైనది. కనుక ఒక కొబ్బరికాయను కొట్టి పచ్చికొబ్బరిని మొత్తం తినవచ్చు. దానివల్ల కొలెస్టరాల్ పెరుగుతుందనే భావన కేవలం భ్రమ మాత్రమే. 2) రోజుకు నాణ్యమైన 20 ఖర్జూర పండ్లు తినవచ్చు. దీనివల్ల తక్కువ సమయంలోనే బలం చేకూరుతుంది. చక్కెర వ్యాధిగ్రస్తులు వాటిని తినరాదు. 3) పాలిష్ పట్టిన బియ్యంకన్నా దంపుడు బియ్యం మంచిది. 4) పౌష్టిక ఆహారం తీసుకోవాలి. 5) ఎప్పుడైనా అకస్మాత్తుగా కళ్ళు తిరిగిన, కొద్దిగా తేనె తీసుకొని మెల్లమెల్లగా నాకాలి. తేనె వెంటనే రక్తంలో కలిసిపోతుంది కనుక 5–10 నిమిషాలలో ఓపిక వస్తుంది.

## 40. భుక్తాయాసం

విందు భోజనం చేసినప్పుడు, పండుగలు – పబ్బాలులోను భోజనం చేసిన తర్వాత చాలా మంది భుక్తాయాసం పడుతుంటారు. డైనింగ్ టేబుల్ దగ్గర నుండి వాష్ బేసిన్ వరకు నడిచి వెళ్ళటానికి కూడా ఇబ్బంది పడుతుంటారు.

**కారణం :** భోజనం కడుపు నిండాతిని దానికి తోడు మంచినీరు త్రాగి కడుపును పూర్తిగా నింపుతారు. ఈ బరువంతా ఊపిరితిత్తుల చివరి భాగాలపై పడి వాటిని సుమారుగా 25,30 శాతం నొక్కివేస్తుంది. దానివల్ల ఊపిరితిత్తులు శరీర అవసరాలకు, తిన్న భోజనానికి అవసరమైన గాలిని అందించలేకపోతాయి. ఫలితంగా భుక్తాయాసం వస్తుంది.

**నివారణోపాయాలు :**

1. భారతీయ సంప్రదాయం ప్రకారం క్రింద కూర్చొని భోజనం చేయుట భుక్తాయాసాన్ని నిరోధిస్తుంది. క్రింద కూర్చొన్నప్పుడు పొట్ట 1/4 వంతు మూసుకుపోతుంది. కనుక పొట్టనిండా తిన్నా కొంతభాగం ఖాళీగా ఉండిపోయి భుక్తాయాసం కలగకుండా నిరోధిస్తుంది.
2. మాకు మోకాళ్ళ నొప్పులు ఉన్నాయి. క్రింద కూర్చొనలేము అని చెప్పేవారు పొట్టను బాగా ఖాళీగా ఉంచాలి.
3. అన్నం తినేటప్పుడు నీళ్ళు త్రాగరాదు. భోజనానికి అరగంటముందు, భోజనానంతరం 2 గంటల తర్వాత అప్పుడప్పుడు 1 గ్లాసు చొప్పున నీరు త్రాగాలి.
4. పొట్టను ఎట్టి పరిస్థితిలోను 80 శాతం కంటె అధికంగా నింపరాదు.

## 41. ఉబ్బు / నీరు పట్టుట
### (Dropsy)

శరీరంలో ఎక్కడైనా ద్రవం చేరుటను ఉబ్బు అంటారు. శరీరంలో నీరు ఎక్కువైనపుడు సోడియం లవణమగు నేట్రంసల్ఫ్ దానిని బయటికి పంపిస్తుంది. ఈ లవణలోపం వల్ల, ఏదైనా వ్యాధివల్ల రక్తం తగ్గిపోయినప్పుడు రక్తంలోని 'సీరం' ద్రవం శరీరములో అక్కడక్కడ చేరి ఆ భాగాలు ఉబ్బినట్లు కనిపిస్తాయి. ఈ ఉబ్బు ప్లూరా (ఊపిరితిత్తుల చుట్టూ వున్న పొర), పెరికార్డియం (గుండె చుట్టూ వున్న పొర), పెరిటోనియం (ఉదరకుహరమంతట నుండు సున్నితమగు పొర), మెదడు, వృషణముల తిత్తి, వదులుగానుండు సంధాయక కణజాలం లేదా ఏదైనా కణాలలో ఈ ఉబ్బు రావచ్చును. ఉబ్బు ఏర్పడిన భాగాలు చిన్న సంచులవలె కనిపించును.

రక్తహీనత వ్యాధిలోను, గుండె వ్యాధులలోను, చీలమండలోను, పాదంపై భాగంలోను ఉబ్బు కనిపిస్తుంది. కాలేయవ్యాధులలో ఉదరం లోపల ఉబ్బు వచ్చును. మూత్రపిండాల వ్యాధులలో ముఖంలో ఉబ్బు కనిపించును. ఉబ్బు వ్యాధి ముదిరినపుడు శరీరమంతా వస్తుంది. గర్భిణీస్త్రీల కాళ్ళలో ఉబ్బు రావటం సహజమే.

ఉబ్బుకు, వాపుకు తేడా వుంటుంది. వాపు వున్న భాగం వెచ్చగా, ఎర్రగా వుంటుంది. నొక్కితే నొప్పి వుంటుంది. కానీ నొక్కితే గుంట పడదు. ఉబ్బులో వ్రేలితో నొక్కిన ప్రదేశంలో గుంటపడును. కాని నొప్పి, వెచ్చదనం ఉండవు.

**కారణములు:** రక్తస్రావం, రక్తక్షీణత ఈ వ్యాధికి ముఖ్య కారణాలు. కాన్పులోను, ఏదైనా ప్రమాదం వల్లను రక్తస్రావం అగుతుంది. మలేరియా, అజీర్ణం, అజీర్తి విరేచనాలు, మధుమేహం, గుండె, మూత్రపిండములు, కాలేయం వ్యాధుల లోను, ఆహారంలో ప్రొటీన్ల లోపంవల్ల రక్తక్షీణత ఏర్పడుతుంది. రక్తస్రావం, రక్తక్షీణత ఏర్పడినప్పుడు ఉబ్బు రావచ్చు.

**నివారణోపాయాలు :**

1) రోగిని వెచ్చని, పొడి ప్రదేశంలో ఉంచాలి. అతని శరీరమంతటా ఉన్ని దుప్పట్లు కప్పాలి. శరీరముపై వేడినీటి రబ్బరు సంచులు పెట్టాలి. ఈ విధంగా చేసి బాగా చెమట పట్టునట్లు చేయాలి. అదే విధంగా మూత్రం బాగా పోవునట్లు చేయాలి. చెమట ద్వారాను, మూత్రం ద్వారాను శరీరములో ఎక్కువగానున్న నీరు బయటికి పోయి ఉబ్బు తగ్గును. 2) ఉప్పులేని, సులభముగ జీర్ణమయ్యే ఆహారమివ్వాలి. 3) పాలు, పండ్లరసం, గంజి విరివిగా ఇవ్వాలి. 3) మాంసం, గోధుమపిండి, సుగంధద్రవ్యాలు మానుకోవాలి. 4) అరచెంచాడు సొంటిపొడికి బెల్లం కలిపి తీసుకొనవలెను. ఈ విధంగా రోజుకు2 సార్లు చేసిన రక్తహీనత తగ్గును.

## • చికిత్స •

**కాలీమూర్ 3×-6× :** గుండె, కాలేయం/మూత్రపిండాల వ్యాధివల్ల వచ్చు ఉబ్బు - పైత్యరసనాళాలలో ఆటంకం కలుగుట వల్లను, కాలేయం పెద్దదగుట వల్లను వచ్చు ఉబ్బు రోగం - నాలుకపై తెల్లని పూత - గుండె బలహీనతవల్ల వచ్చు ఉబ్బు రోగానికి దీనిని కాలీఫాస్‌తో మార్చి వాడాలి. - గుండె వడిగా కొట్టుకొనుటతో నున్న ఉబ్బు - ఉబ్బు రోగి నుండి తీయబడిన ద్రవం తెలుపు - మూత్రంలో తెల్లని శ్లేష్మం - బుడ్డ (వృషణముల తిత్తిలో నీరు చేరుట)

**నేట్రంసల్ఫ్ 3×-6× :** శరీరపు లోపలి భాగాల, బయటి భాగాల ఉబ్బు - వృషణముల తిత్తి ఉబ్బు (బుడ్డ) - శరీరములోని సంధాయక ధాతువుల లోనికి నీరు చేరుటవల్ల వచ్చు ఉబ్బు.

**నేట్రంమూర్ 3×-6× :** శరీరపు చర్మం క్రింద ఉండు సంధాయక ధాతువుల ఉబ్బు, వాపు – పురుషుల వృషణముల తిత్తి ఉబ్బు బుడ్డ (Hydrocele) - స్త్రీ జననేంద్రియమందు క్లిటోరిస్ అను భాగమును కప్పియుంచు చర్మం ఉబ్బు – నోరు పొడిగా ఉండుట – మలబద్ధకం.

**ఫెర్రంఫాస్ 3×-12× :** రక్తం నష్టమగుట వల్ల ఉబ్బు లక్షణాలు ఏర్పడినప్పుడు దీనిని కాల్కేరియాఫాస్‌తో మార్చి వాడాలి.

**కాల్కేరియాఫాస్ 3×-12× :** తిన్న ఆహారం శోషణ కాకపోవుటవల్ల వచ్చు ఉబ్బు – రక్తహీనత లేక రక్తం/ముఖ్యద్రవాలు నష్టమగుటవల్ల కలుగు ఉబ్బు.

**కాల్కేరియాఫ్లోర్ 3×-6× :** గుండెజబ్బు వల్ల కలుగు ఉబ్బు – గుల్లగా నుండు భాగపు ఉబ్బు – దీర్ఘకాలం నుంచి వున్న ఉబ్బు – అధిక శ్రమ వలన ఏర్పడిన బుడ్డ (Hydrocele) - శరీరములో సాగే గుణము పోయి ఏర్పడిన ఉబ్బు –

**కాలీసల్ఫ్ 6× :** స్కార్‌లెట్ జ్వరం[1] తర్వాత వచ్చు ఉబ్బు

## 42. అధిక బరువు/ఊబ శరీరం/స్థూలకాయం తగ్గించుకొనుట (Over-weight/Reduction of Obesity)

**స్థూలకాయులు ఎవరు ?**

భారతీయ స్త్రీ–పురుషుల ప్రామాణిక ఎత్తు, బరువు నిర్ణయింపబడింది. ఎంత ఎత్తుగలవారు ఎంత బరువు ఉండాలో ఈ అధ్యాయం చివర పేర్కొన్న పట్టికను బట్టి తెలుస్తుంది. సాధారణంగా ఉండవలసిన బరువుకన్నా 20 శాతం ఎక్కువ వున్న వ్యక్తులను స్థూలకాయులు అని అంటారు. వారి శరీరాన్ని కొవ్వుకాయం, ఉబక/కొవ్వెక్కిన శరీరం అని అంటారు. స్థూలకాయుల చర్మం మందం 1" మించి ఉంటుంది. మెడ ఎముకలలో రక్తనాళాలు కనిపించవు. ఛాతీ మధ్యభాగంలో నుంచి తాడు వదిలితే ఎక్కడైనా తగులుతుంది. ఇవి స్థూలకాయుల లక్షణాలు. అధిక బరువుకు చిన్న–పెద్ద తేడా లేదు; స్త్రీ–పురుషుల భేదం ఏమీ లేదు. అన్ని దేశాలలోను, అన్ని మతాలలోను, అన్ని జాతులలోను, అన్ని వర్గాలలోను స్థూలకాయులు ఉన్నారు.

**స్థూలకాయం ఏర్పడటానికి గల కారణాలు :**

1) మనం తీసుకొనే ఆహారపు కేలరీలు, మన అవసరాలకు అవసరమయ్యే కేలరీలకంటె ఎక్కువగ ఉన్నచో అది క్రొవ్వుగ మారును. ఆ క్రొవ్వు శరీర కణజాలంలో

*1. **స్కార్‌లెట్ జ్వరం :** ఈ జ్వరంలో మొండెం, కాళ్ళు, చేతులపై అధికముగ చిన్న నూకల వంటివి ఏర్పడి చర్మం గరుకుగా అగును.*

(ముఖ్యంగా) చర్మం క్రింద చేరును. 2) వంశపారంపర్యత 3) పౌష్టిక ఆహార లోపం 4) హార్మోన్ల లోపం 5) క్యాన్సర్, కుష్టువ్యాధి, బి.పి.కి వాడే మందులవల్ల 6) గజ్జి వల్ల 7) శీతాకాలం 8) శారీరక శ్రమ లేకుండుట 9) మానసిక శ్రమ పెరుగుట 10) మానసిక సంఘర్షణ.

**స్థూలకాయం వల్ల కలిగే బాధలు/వ్యాధులు :**

స్థూలకాయం వల్ల శారీరక సౌందర్యం తగ్గును. రక్తనాళముల లోపలి పొరయందు క్రొవ్వు అధికముగ చేరి వాటికి హాని కలిగించును. దీనివల్ల గుండెపోటు, రక్తపోటు, చక్కెర వ్యాధి రావచ్చు. పక్షవాతం కలగవచ్చు. కీళ్ళ దగ్గర ఎముకల బరువు మోయలేక కీళ్ళ నొప్పికి గురికావచ్చు. బరువుగా ఉన్నవారికి రక్తం తక్కువగా ఉంటుంది. రక్తహీనత వల్ల అలసట కలుగుతుంది. బరువు క్యాన్సర్‌ను కూడా కలిగిస్తుంది.

**స్థూలకాయం తగ్గటానికి సులభ ఉపాయాలు :**

1) నడుము చుట్టుకొలత తగ్గితే స్థూలకాయం తగ్గుతుంది. అందుకు కాయకష్టమే తరుణోపాయం. జిహ్వాచాపల్యం తగ్గించుట మరొక ఉపాయం. డాక్టర్లు కొంతమంది వాకింగ్/ జాగింగ్ చేయమని సలహా ఇస్తుంటారు. కాని స్థూలకాయులు దీనివల్ల మడిమనొప్పులకు గురి అవుతుంటారు. 2) సైకిలు త్రొక్కుట స్థూలకాయం తగ్గించుకోవటానికి అందరికీ అందుబాటులో ఉండే మార్గం. దీనివల్ల వాతావరణ కాలుష్యం కూడా ఉండదు.

మన ఆహారంలో తక్కువ కేలరీలనిచ్చే పౌష్టిక పదార్థాలు ఉండాలి. కనుక

1. ఉదయం పూట ఇడ్లీ, దోసెలు తినటం కంటె పౌష్టిక ఆహారం తినాలి. మొలకెత్తిన గింజలు తినాలి.
2. మధ్యాహ్న భోజనంలో అన్నమునకు బదులుగా 3-4 రొట్టెలు తినాలి. (ఉప్పు, నూనె లేని) కూరను అధికంగా పెట్టుకొని తినాలి. కూరలలో పీచు పదార్థాలు ఎక్కువగా ఉంటాయి. కనుక అవి బరువు పెంచకుండానే క్రొవ్వును కరిగిస్తాయి.
3. సాయంకాలం 4 గంటలప్పుడు ఒక గ్లాసు పండ్లరసం త్రాగాలి లేక ఒక పండును తినాలి. (చక్కెర వ్యాధిగ్రస్తులు ప్రత్యామ్నాయపు ఆహారం తీసుకోవాలి) పండ్లరసం/ పండు వల్ల బరువు పెరుగుట జరగదు. అంతేగాక రక్తాన్ని పెంచి నీరసాన్ని తొలగిస్తుంది. పండ్లలో టాక్సిన్స్‌ను తగ్గించే గుణం ఉంటుంది.
4. సాయంకాలం 6 గంటలకు ముందే మధ్యాహ్నం వలె రొట్టెలు, కూర తినాలి.
5. శరీరంలో ఏ భాగంలో క్రొవ్వు ఉన్నదో ఆ క్రొవ్వు తగ్గే ఆసనాలు ప్రతిరోజూ చేయాలి.

**ఒబేసిటీ క్లినిక్‌లు :**

ఆధునిక యుగంలో స్త్రీ విద్యకు మంచి ప్రాచుర్యం లభించింది. స్కూళ్ళలోను, కాలేజీలలోను, యూనివర్శిటీలలోను చదువుకొనే స్త్రీల సంఖ్య బాగా పెరిగింది. చదువు

కొనుటకు, ఉద్యోగాలలోను వారికి రిజర్వేషన్ ఉండుటచే స్త్రీ విద్యకు మరింత ప్రోత్సాహం లభించింది. చదువుకొనేవారు, ఉద్యోగాలు చేసేవారు స్త్రీలు/పురుషులు గణనీయంగా పెరిగారు. దీనితో జీవితం బిజీ అయింది.

తెల్లవారుజామున అలారం మ్రోగగానే ఇంట్లో వాళ్ళంతా మేల్కొంటారు. కాల కృత్యాలు తీర్చుకోగానే ఎవరి పనులలో వారు నిమగ్నమవుతారు. గృహిణులు కుక్కర్లలో ఆహారసామగ్రి పెట్టి మిగతా పనులకు ఉపక్రమిస్తారు. రెండు-మూడు రోజుల క్రిందటే సిద్ధం చేసుకొని ఫ్రిజ్‌లలో పెట్టి ఉంచిన దోసె/ఇడ్లీ/చపాతీ పిండిని బయటికి తీస్తారు. అట్లే క్రిందటి రాత్రే తరిగి ఉంచిన ఆకుకూరలు, కూరగాయలు, ఉల్లిపాయలను బయటికి తీసి టిఫెన్లు, కూరలు చేయటానికి ప్రారంభం. ఉద్యోగం చేసే గృహిణులు అయితే ఎక్కువగా ఫాస్ట్‌ఫుడ్ సెంటర్స్, హోటల్స్, కూరల సెంటర్లు, అన్నం సెంటర్లు మొదలైన వాటిపై ఆధారపడుతారు. ఎక్కువమంది చదువుకొనేవారు చాక్లెట్లు, బిస్కెట్లు, కేకులు, సమోసాలు, బ్రెడ్‌జామ్ మొదలైనవి తిని సాఫ్ట్ డ్రింక్స్ త్రాగి కాలం గడిపేస్తారు. మధ్యాహ్నం పూట ఉద్యోగస్థులు తమతో పాటు తెచ్చుకొన్న పోషక ఆహార విలువలు లేని ఆహారం తిని, అది చాలక క్యాంటిన్ తిండితో సర్దుకొంటారు. ఉద్యోగాలు ఎక్కువగా కుర్చీలలో, ఫ్యాన్ల క్రింద చేసేవి. ఐ.టి. రంగపు ఉద్యోగాలైతే ఎ.సి.రూములో కంప్యూటర్లకు ఎదురుగా కూర్చొని చేసేవే. వీటిలో మానసిక శ్రమ తప్ప శారీరక శ్రమ ఎక్కడ? ఫ్యాక్టరీల పని కాని, పొలం పని కాని ఈ కాలంలో ఎక్కువగా యంత్రాలతో చేయబడుతుంది. అక్కడా శారీరక శ్రమ లేదు.

చదువు, ఉద్యోగం ఏమీ లేని స్త్రీకి కూడా సౌలభ్యం ఎక్కువయింది. మైళ్ళ దూరం నడిచి నీరు తెచ్చుకోవలసిన పని లేదు. ధాన్యం బాగు చేసుకోవలసిన పనిలేదు. దంచుకోనక్కరలేదు. విసరుకోనక్కరలేదు. రుబ్బుకోవలసిన పనిలేదు. అంతా మిషన్ల మీదే పని. అన్నీ రెడీగా దొరుకుతాయి. శారీరక శ్రమ నామమాత్రమే. తత్ఫలితంగా స్థూలకాయుల సంఖ్య బాగా పెరిగిపోయింది.

అందువల్ల ఎక్కడ చూసినా ఒబేసిటీ క్లినిక్‌లు ప్రారంభమవుతున్నాయి. ఒక వారంలో ఎంత బరువున్నా తగ్గిస్తాం అనే ప్రకటనలు వెలువడుతున్నాయి. ఆ ప్రకటనలకు ఆకర్షింపబడి చాలా మంది వాటిలో చేరుతున్నారు. దానివల్ల బరువు తగ్గినా అది చాలా కొంతకాలం వరకు మాత్రమే. ఆ తర్వాత మామూలు స్థితికి వస్తారు.

**డైటింగ్‌వల్ల ప్రయోజనం ఏమైనా ఉందా ?**

కొంతమంది స్థూలకాయం తగ్గడానికి డైటింగ్ చేస్తూవుంటారు. ఆహారం ఒకపూటే తింటారు. రెండవపూట 2 ఫుల్కాలు తిని ఉంటారు. దానితో నీరసం ఏర్పడి ఒక వారం రోజుల తర్వాత మామూలుగా తినటం ప్రారంభిస్తారు. ఈ విధంగా డైటింగ్ వల్ల కూడా ఆశించిన ఫలితం లభించుట లేదు.

**ప్రకృతి వైద్యం చెప్పే విధానం :**

ప్రకృతి వైద్యులు డైటింగ్ చేయకుండా మామూలు ఆహారం తింటూనే స్థూలకాయం తగ్గించుకోవచ్చు అని చెబుతారు. వారు ఆహారం తీసుకొనే పద్ధతులలో కొన్ని మార్పులు ఈ విధంగా సూచిస్తారు –

**ఉదయం :**

1) పురుగు మందుల ప్రభావం తక్కువగా ఉండే, మార్కెట్లో చౌకగా దొరికే 3-4 రకాల కూరగాయల/ఆకుకూరల రసం తీసుకొని వడకట్టి త్రాగవచ్చు. పొట్ల, బీర, సొర, నాటు టమోటా, దోసకాయ, బూడిద గుమ్మడికాయలలో వీలైనవి తీసుకోవచ్చు. ఒక పెద్దగ్లాసు (300 మి.లీ.) రసం త్రాగవచ్చు.

2) ఇడ్లీ, ఉప్మా, దోసె, చపాతీ టిఫెనుకు బదులుగా మొలకెత్తిన గింజలు రసం త్రాగిన గంటకు తినాలి. జామకాయ/బొప్పాయి తినవచ్చు.

**మధ్యాహ్న భోజనం :** గోధుమలను మర పట్టించిన పిండితో నూనె లేకుండా చేసిన 3 పుల్కాలను ఎక్కువ కూరపెట్టుకొని తినాలి. (మార్కెట్లో దొరికే గోధుమపిండి, ఆటా వాడరాదు)

**సాయంకాలపు భోజనం :** సాయంకాలం లైట్లు వెలిగించక పూర్వమే మధ్యాహ్న భోజనం వలె తినాలి. కూరలకు బదులుగా పచ్చి కూరగాయలను తినవచ్చు.

**తినరానివి, త్రాగరానివి :**

1. టీ, కాఫీ, పాలు త్రాగరాదు.
2. మిఠాయిలు, ఐస్‌క్రీమ్స్ తినరాదు.
3. నూనె, నెయ్యి, బంగాళాదుంపలు వాడరాదు.
4. మద్యం, సోడానీరు త్రాగరాదు.

**చేయవలసినవి :**

1. ఈదుట మంచి కసరత్తు.
2. ఆడపిల్లలు చిన్న చీపురుతో ఇంటిని 3-4 సార్లు ఊడ్చుట.

అందంగా, ఆకర్షణీయంగా, సన్నజాజి లాగా ఉండాలనుకొనే కన్యల కైనా, స్త్రీల కైనా, చక్కగా ఉండాలనుకొనే బాలురైనా, పురుషులైనాపై ఆహారనియమాలను పాటించటంలో కష్టం ఏమి ఉంటుంది ?

## • చికిత్స •

**కాల్కేరియాఫ్లోర్ 12x :** ప్రసవం తర్వాత పొట్టకు సంబంధించి కండరాలు వదులగును. కాని సరైన జాగ్రత్త తీసుకొనక పోయినచో ఆమె పొట్ట పెద్దదగును. అలాంటి స్త్రీకి ఇది మంచి మందు.

**కాలీమూర్ 6× :** క్రొవ్వెక్కి, లావుగాను, అసహ్యంగాను ఉన్నవారు దీనిని వాడాలి.

**నేట్రంసల్ఫ్ 6× :** ఇది ధాతువులలో ఎక్కువగా చేరిన నీటిని తొలగించి లావును తగ్గించును.

**నేట్రంమూర్ 6×, కాల్కేరియాఫాస్ 30× :** వీటిని ఒకదాని తర్వాత మరొకటి మార్చి – మార్చి వాడాలి. మధ్య–మధ్యన సైలీషియా 12×ను వాడాలి. ఇవి క్రొవ్వును లేకుండా చేసి లావును తగ్గిస్తాయి.

## భారతీయ స్త్రీపురుషుల ప్రామాణిక ఎత్తు, బరువు

| ఎత్తు | | బరువు (కేజీలలో) | |
|---|---|---|---|
| మీ॥ | అ.అం. | పురుషులు | స్త్రీలు |
| 1.523 | (5'0") | – | 50.8 – 54.4 |
| 1.5484 | (5'1") | – | 51.7–55.3 |
| 1.5738 | (5'2") | 56.3–60.3 | 53.1–56.7 |
| 1.5992 | (5'3") | 57.6–61.7 | 54.4–58.1 |
| 1.6246 | (5'4") | 58.9–63.5 | 56.3–59.9 |
| 1.65 | (5'5") | 60.8–65.3 | 57.6–61.2 |
| 1.6754 | (5'6") | 62.2–66.7 | 58.9–63.5 |
| 1.7008 | (5'7") | 64.0–68.5 | 60.8–65.3 |
| 1.7262 | (5'8") | 65.8–70.8 | 62.2–66.7 |
| 1.7516 | (5'9") | 67.6-72.6 | 64.0–68.5 |
| 1.7770 | (5'10") | 69.4–74.4 | 65.8–70.3 |
| 1.8024 | (5'11") | 71.2–76.2 | 67.1–71.7 |
| 1.8278 | (6'0") | 73.0–78.5 | 68.5–73.9 |
| 1.8532 | (6'1") | 75.3–80.7 | – |
| 1.8786 | (6'2") | 77.6–83.5 | – |
| 1.9040 | (6'3") | 79.8–85.7 | – |

*నోట్ : 1" = 2.54 సెం.మీ.*

# 43. పొట్ట తగ్గుటకు

గర్భిణీ స్త్రీకి పొట్ట రావటం సహజం . కానీ కొంతమందికి ఇతర కారణాల వల్ల పొట్ట వస్తుంది. ఆకృతిని బట్టే ఒక వ్యక్తికి పొట్ట వచ్చినట్లు స్పష్టంగా కనిపిస్తుంది. కానీ పొట్ట వచ్చినట్లు నిర్ధారించుకొనుటకు క్రింది తేలికపాటి పరీక్షలు ఉపయోగపడ్తాయి –

1. బొడ్డు ప్రక్కన ఉన్న పొట్టను రెండు వ్రేళ్ళతో పట్టుకొంటే పొట్ట రెండు వ్రేళ్ళకు దొరికి వ్రేళ్ళ మధ్య ఒక అంగుళం మందం ఉంటే పొట్ట లేదనుకోవాలి.
2. ఛాతీ మధ్యభాగం నుంచి ఒక దారాన్ని వదిలితే అది బొడ్డు క్రింది భాగం వరకూ నిటారుగా వున్నట్లయితే పొట్ట లేనట్లే అని భావించాలి.

**పొట్ట వచ్చుటకు కారణాలు :**

1. చాలామంది అన్నం తినటానికి ముందు నీరు త్రాగుతారు. భోజనం పొట్టలో ఉన్నంతసేపు త్రాగిన నీరు కూడా పొట్టలో అంతసేపు ఉంటుంది. దీనివల్ల పొట్ట బరువు పెరుగుతుంది. ఆ బరువుకు పొట్ట ముందుకు వస్తుంది.
2. అన్నం ఎక్కువగా తిని, కూరను తక్కువగా తిన్నచో వాటిలో ఉండే పిండి పదార్థాలు అవసరానికి మించి మిగిలిపోతాయి. ఆ మిగిలినవి క్రొవ్వుగా మారి పొట్ట వస్తుంది.
3. రాత్రిపూట భోజనం చాలామంది 10–11 గంటల సమయంలో చేస్తారు. అది పొట్టకు విశ్రాంతి సమయం. కనుక అది తిన్న ఆహారాన్ని దాచే ప్రయత్నం చేస్తుంది. దానివల్ల కూడా పొట్ట రావటం జరుగుతుంది.
4. దైనిక కార్యకలాపాల/చేసే వ్యాయామాల వల్ల పొట్ట కదలుట జరగదు. కనుక పొట్ట ముందుకు పోతుంది.

**నివారణోపాయాలు :**

1. భోజనానికి అరగంటముందు, భోజనం తర్వాత 2 గంటలకు నీరు త్రాగాలి.
2. పొట్ట ఖాళీగా ఉన్నప్పుడు మాత్రమే నీరు త్రాగాలి.
3. అన్నం పూర్తిగా మానివేయాలి.
4. ఉదయం పూట మొలకెత్తిన గింజలు తినాలి. దీనివల్ల పొట్ట కరుగుతుంది.
5. మధ్యాహ్నం రొట్టెలు/పుల్కాలు ఎక్కువ కూరపెట్టుకొని తినాలి.
6. రాత్రిపూట భోజనం సాయంకాలం 6 గంటలకు ముందే చేయాలి. ఆ భోజనంలో జామ/దానిమ్మ/బొప్పాయి/రేగు/కమలా/పుచ్చకాయ మాత్రమే తీసుకోవాలి.
7. పొట్టను తగ్గించడానికి ఇతర వ్యాయామాలు కంటే క్రింది ఆసనాలు తిరుగులేనివి – 1) క్రింది పొట్ట తగ్గడానికి ఉత్తానపాదం 2) పై పొట్ట తగ్గడానికి నౌకాసనం.

## 44. ఫుడ్ ఎలర్జీ
## (Food Allergy)

ఏదైనా ఆహారం తిన్న తర్వాత మనదేహంలోని కణజాలములు విద్వేషంతో ప్రవర్తించటాన్ని ఫుడ్ ఎలర్జీ అని అంటారు. కొన్ని ఆహారపదార్థాలను తిన్నప్పుడు దద్దుర్లు, వాపులు, గొంతులో తేడాలు వస్తూ వుంటాయి. అందువల్ల వారు అలాంటి ఆహారాన్ని తినటం మానుకొంటూ ఉంటారు. కొంతమంది వైద్యులు కూడా ఆ పదార్థాలను తినకుండా ఉండమని సలహా ఇస్తారు. కాని ఆ ఎలర్జీకిగల కారణాన్ని తెలుసుకొని దానిని నిర్మూలించిన ఆ ఆహారపదార్థాలు ఎట్టి బాధ కలగజేయవు.

**కారణం :** మంచినీరు తక్కువగా త్రాగుట.

**నివారణోపాయాలు :**

1. 3-4 లీటర్లు మంచినీరు రోజూ త్రాగాలి.
2. మూడు రోజులపాటు తేనె నీళ్ళతో ఉపవాసం ఉండాలి. నిమ్మరసం పడేవారు దానిని తేనె నీళ్ళతో కలుపుకోవచ్చు. రెండవ రోజున, మూడవ రోజున కొబ్బరినీరు త్రాగవచ్చు.
3. నాల్గవ రోజు నుండి ఎనిమిదవ రోజువరకు పళ్ళరసం వీలైనన్ని సార్లు త్రాగుతూ గడపాలి. చెరుకురసం పడితే త్రాగవచ్చు.
4. 9వ రోజున :

   ఎ) ఉదయం 8 గంటలకు పండ్ల రసాలు

   బి) 9 - 10 గంటలప్పుడు పండ్లు

   సి) మధ్యాహ్నం భోజనం : పుల్కాలు + చప్పటి కూర

   డి) సాయంకాలం 5, 6 గంటలకు : పండ్లు

   ఇ) ఈ విధంగా 5,6 రోజులు చేయాలి.
5. తర్వాత కూడా ఫుడ్ ఎలర్జీ తగ్గనివారు ఆహారం ఉప్పు, నూనెలు లేకుండా తినాలి.
6. **ముఖ్య గమనిక :** చక్కెర వ్యాధిగ్రస్తులు ఉపవాసం ఉండుట మంచిది కాదు.

## 45. స్రావములు
## (Exudations)

తేమగా నుండెడు ముక్కు, నోరు, ప్రేగులు, ఆసనము / గుదము, కనుగ్రుడ్డు ముందు భాగం, యోని మొ॥ వాని లోపల అంటి పెట్టుకొని యుండెడి పొరను ఆమత్వక్కు

/ జిగటపొర అని అందురు. ఈ ఆమత్వక్కు నుండి స్రావములు వెలువడును. కంటి నుండి వెలువడు స్రావం కన్నీరు. ముక్కు నుండి వెలువడు స్రావం శ్లేష్మం. ఈ స్రావములలో అధిక ప్రోటీన్ శాతం, శిథిలమైన కణముల పదార్థం ఉండును. కనుక ఈ స్రావములు వ్యాధులను తెలుపును. వీటి రంగు, స్వభావం ఎంపిక చేయవలసిన దేహంలో తక్కువైన ద్వాదశ లవణమును సూచించును. ఆ లవణమును వాడిన తత్సంబంధిత వ్యాధి నయమగును.

| స్రావం రంగు, స్వభావం | వాడవలసిన లవణం |
|---|---|
| 1. తెల్ల సొన / ఆల్బుమిన్ వంటి స్రావం | కాల్కేరియా ఫాస్ |
| 2. బాధను, ఒరుపును కలిగించు స్రావం | నేట్రంమూర్, నేట్రంఫాస్ |
| 3. స్పష్టముగను, పారదర్శకముగను, నీటివలె, నీరుగా నుండు స్రావం – నొప్పిని, ఒరుపును కలిగించునది. | నేట్రంమూర్ |
| 4. దారంవలె ఉండు స్రావం – ఫైబ్రిన్‌కు సంబంధించినది. | కాలీమూర్, మెగ్నీషియంఫాస్ |
| 5. బంగారం వంటి / వసుపు పచ్చని స్రావం | నేట్రంఫాస్ |
| 6. ఆకు / పసుపుపచ్చని స్రావం – పలుచగా బంక తీగగా / నీటివలె ఉండుట. | కాలీసల్ఫ్ |
| 7. దుర్వాసన గల స్రావం – నొప్పిని, ఒరుపును కలిగించు స్రావం. | కాలీఫాస్ |
| 8. అధికముగ నున్న స్రావం, చీము – రక్తం జీరతో ఉండుట. | కాల్కేరియా సల్ఫ్ |
| 9. బంకవలె నున్న స్రావం | కాలీసల్ఫ్ |
| 10. పసుపుపచ్చని చిన్న చిన్న ముద్దలవలె నుండు స్రావం. | కాల్కేరియా ఫ్లోర్ |
| 11. చీము చిక్కగ, పసుపుపచ్చగ ఉండుట. | సైలీషియా |
| 12. చిక్కని, పసుపుపచ్చని, చేదు స్రావం | నేట్రంసల్ఫ్ |

# 2

# జ్వరం - వివిధ రకాలు

## 1. సాధారణ జ్వరం
## (Simple fever)

జ్వరము అనేది వ్యాధికాదు అది ఒక లక్షణం మాత్రమే. జ్వరము ఆరోగ్యవంతునికి వుండవలసిన ఉష్ణోగ్రత కన్నా ఎక్కువ ఉష్ణోగ్రత ఉన్నదని తెలుపును. ఆరోగ్యవంతుని ఉష్ణోగ్రత 98.6° ఫా. లేక 37° సె. ఉండును. ఉష్ణోగ్రతను కొలుచుటకు థర్మామీటరును ఉపయోగింతురు. దానిని రోగి నాలుక క్రిందగాని, చంకలోగాని, గుదములోగాని ఉంచాలి. చంకలో ఉష్ణోగ్రత నోటిలోని ఉష్ణోగ్రత కన్నా సుమరు 1° ఫా. తక్కువ ఉంటుంది. జ్వరమనేది సాధారణ జలుబు వల్లనైనా వృద్ధికావచ్చు లేక క్యాన్సర్ వల్లనైనా రావచ్చు. కనుక జ్వరం దేహాన్ని బయటి నుంచి వచ్చే వ్యాధి కారకము నుండి కాపాడేది. ఇది ఒక హెచ్చరిక వంటిది. "ఏదో బాహ్య కారణం దేహాన్ని వ్యాధిగ్రస్తము చేయబోతున్నది, కనుక నీవు జాగ్రత్తగా ఉండుము" అని ఇది రోగికి ఒక సలహా ఇస్తుంది. లక్షణాలను బట్టి జ్వరానికి అనేక రకాలు వున్నాయి.

సాధారణ జ్వరం కఫం వల్ల వస్తే కఫజ్వరం, అది పైత్యాధిక్యతవల్ల వస్తే పైత్య / పిత్తజ్వరం, అది వాతం / నాడీ ఉద్రిక్తతవల్ల వస్తే వాతజ్వరం. ఒక్కొక్క జ్వరంలో వేర్వేరు లక్షణాలు ఉంటాయి.

1. **కఫజ్వరం** (Catarrhal fever)లో జలుబు, ఛాతీయందు శ్లేష్మము నిండి యుండుట, దగ్గు, వాంతి, ముక్కులు శ్లేష్మము/ చీమిడితో నిండి యుండుట, అన్నము సహించకుండుట / ఆకలి లేకపోవుట, నోరు తియ్యగనుండుట, కళ్ళు సగం విప్పి యుండుట, నిద్ర అధికముగ వచ్చుట, మలమూత్రములు తెల్లగ ఉండుట మొ॥ లక్షణాలు ఉండును.
2. **పైత్య / పిత్త జ్వరం** (Bilious fever) లో పైత్యాధిక్యత వల్ల కళ్ళు తిరుగుట, నోరు చేదుగా ఉండుట, మల మూత్రములు పచ్చగనుండుట, నీళ్ళ విరేచనాలు, దప్పిక, ప్రలాపము, శరీరముపై దద్దుర్లు (eruptions) మొ॥ లక్షణాలు కనిపించును.
3. **వాత జ్వరము**లో వాతము వల్ల వణకు, ఒంటినొప్పులు, పోట్లు, కడుపు నొప్పి వుండును. నోరు ఆరిపోవుట, ఆవలింతలు, నోటియందు అరుచి, మలబద్ధకము, కడుపు ఉబ్బరము మొ॥ లక్షణాలు ఉండును.

పై లక్షణాలలో అన్నియుగాని, కొన్నిగాని ఆయా జ్వరములలో ఉండును.

**కారణాలు :** 1) ఆహార దోషములు 2) అజీర్ణం 3) మలబద్ధకం 4) వాతావరణం మార్పు 5) తేమలోను, చలిగాలిలోను తిరుగుట 6) తడిబట్టలు తరచు కట్టుకొనుట 7) దెబ్బలు, గాయములు తగులుట.

**నివారణోపాయాలు :**

1) జ్వరము వచ్చినప్పుడు ఏమీ పెట్టకుండుట మంచిది. రోగి ఆహారం తినకుండా ఉండలేనిచో ద్రవాహారం ఇవ్వాలి. 2) రోగికి విశ్రాంతి నివ్వాలి. రోగికి చలిగాలి తగల కుండా జాగ్రత్త వహించాలి. 3) జ్వరం ఎక్కువగా ఉన్నప్పుడు నొసటిపై తడిబట్ట వేయాలి లేదా తలపై మంచుగడ్డ ఉంచిన రబ్బరు సంచి పెట్టాలి.

## • చికిత్స •

కొన్ని సందర్భాలలో సాధారణ జ్వరం ఏ మందు లేకుండానే దానంతటదే తగ్గి పోవును. లేనిచో లక్షణాలను బట్టి క్రింది మందులు వాడాలి.

**ఫెర్రంఫాస్ :** కఫజ్వరం (జలుబుచే కలుగు జ్వరం), వాపు వున్న జ్వరం, మేహవాతపు జ్వరం, గాయం / దెబ్బ తగిలినపుడు వచ్చు జ్వరం (traumatic fever) అనగా అన్ని రకాల జ్వరాలకూ, జ్వరపు అన్ని స్థితులకు ఇది ప్రధానమైన మందు. ఎడతెగని వాపు, జ్వరంలో ప్రతి రోజు 1 p.m. కు చలి వచ్చుట – అజీర్ణం, జీర్ణంకాని పదార్థాన్ని వాంతి చేసుకొనుట – మూత్రం స్వల్పముగ వచ్చుట, అరచేతులు, ముఖం, గొంతు, ఛాతీపై పొడి వేడిమి – గంటకొకసారి జ్వరం తగ్గువరకు ఈ మందునివ్వాలి.

**కాలీమూర్ 3× – 6× :** కఫజ్వరం – ఎక్కువ చలి, ఏమాత్రం చల్లనిగాలి తగిలినా, నిప్పుల దగ్గర కూర్చొని కాచుకొన్నా చల్లగా ఉండుట – శయ్యలో దుప్పటి కప్పుకొంటేనే బాగుండుట – **(హోల్‌బ్రూక్)**–మలబద్ధకం – నాలుకపై తెల్లని వెంట్రుక ఉన్నట్టి అనుభూతి.

**కాలీసల్ఫ్ 3× – 6× :** ఈ మందు సాయంకాలానికి రక్తపు వేడిమిని పెంచి చెమటను పుట్టించుటలో సహాయ పడును. వెచ్చగా ఉండు దుప్పట్లు తరచుగా కప్పుకోవాలి. ఈ మందును తరచుగా వాడాలి. రక్తం విషపూరితమగుట వల్ల వచ్చు జ్వరాలకు ఇది మంచి మందు.

**నేట్రంమూర్ 3× – 12× :** కఫజ్వరం – జలుబు, దగ్గు, ఛాతీ శ్లేష్మముతో నిండియుండి గురగురలాడుట, మూత్రం తెలుపు / నలుపు, నిద్ర ఎక్కువగా పోవలయునను కోరిక, రాత్రి మూమూలు నిద్ర చాలక ఉదయమున లేచుసరికి అలసట చెందినట్లుండుట – పుప్పొడి మొదలైన వాటివల్ల వచ్చు జ్వరం (Hay fever).

**కాలీఫాస్ 3× – 6× :** నాడీ సంబంధమైన/ వాత జ్వరం – ఎక్కువ ఉష్ణోగ్రత, వడిగాను, క్రమము లేనట్టి నాడి, నరాల ఉద్రేకం / ఎక్కువ బలహీనత, ఉత్సాహం క్రుంగుట,

నిద్రపట్టక పోవుట, నోరు ఆరిపోవుట, కడుపునొప్పి, మలబద్ధకం, ఆవలింతలు, వణకు – తక్కువ స్థాయిలో నున్న జ్వరం, పొడిగా నున్న నోరు, దంతములపై కూడు నల్లని పదార్థం / పాచి – సంధి – ఈ లక్షణాలున్నప్పుడు ఈ మందు చాలా మంచి ఫలితాలను ఇచ్చింది. **(మెడో).**

**6. నేట్రంసల్ఫ్ 6× – 12× :** పైత్య జ్వరం – నోరు చేదు, పుల్లని వాంతులు, చెమట, పుల్లని వాసన, కళ్ళు తిరుగుట, ప్రలాపం, పాదములు చల్లగా ఉండుట.

**సూచన :**

1. అన్ని జ్వరాలకు ప్రధానమైన ఫెర్రంఫాస్ 12× ను తొలుత వాడాలి. తర్వాత లక్షణాలను బట్టి మందులు వాడాలి.
2. సాధారణ జ్వరాలలో లక్షణాలు సరిగా తెలియనపుడు ముఖ్యంగా చంటి బిడ్డల విషయములో ఫెర్రంఫాస్, కాలీమూర్ మార్చి మార్చి వాడాలి.
3. జ్వరము తగ్గిన తర్వాత కాల్కేరియా ఫాస్ 6× ఇవ్వాలి. దీనివలన రోగికి బలము చేకూరును.

## ౨. మలేరియా / చలి / విడుపు జ్వరం
### Malaria / Intermittent fever

మానవుడు మలేరియా జ్వరంతో అనాదిగా బాధపడుచున్నాడు. ఇది చలితో ప్రారంభ మగును. కనుక దీనిని చలిజ్వరం అని అందురు. ఇది విడిచి విడిచి వచ్చు జ్వరం. ఇది మన్యపు ప్రదేశములో (అటవీ ప్రాంతంలో) అధికంగా వ్యాపించుటచే మన్యపు జ్వరంగా కూడా ప్రసిద్ధి గాంచింది.

ఈ జ్వరం 4 రకములు :

1. ప్రతి దినము వచ్చునది (Quotidian)
2. దినమునకు రెండుసార్లు వచ్చునది (Double quotidian)
3. దినము విడిచి దినము వచ్చునది (Tertian)
4. ప్రతి నాల్గవ రోజున వచ్చునది. (Quartan)

మలేరియా జ్వరంలో 3 దశలు ఉండును – 1) చలిదశ 2) ఉష్ణ / వేడి దశ 3) స్వేద / చెమట దశ

**1. చలి దశ :** ఈ జ్వరము చలితో మొదలగును. నిస్సత్తువ, అలసట, తలనొప్పి, వికారం ఉండును. వెన్నెముక వెంబడి చల్లని నీళ్ళు పోసినట్లు చలి, కుదుపు, వణకు వచ్చును. ముఖం పాలిపోయినట్లుండును. నాలుకపై తెల్లటి పూత, మూత్రం కొద్దిగా తరచుగా వెడలును. ఎన్ని దుప్పట్లు కప్పినా చలి ఆగదు.

**2. ఉష్ణ / వేడి దశ :** చలిదశ ప్రారంభమైన అరగంట, గంటకు ఉష్ణ / వేడి దశ వచ్చును. ఈ దశలో హెచ్చుగ జ్వరం, తలనొప్పి, వికారం, వాంతులు, దాహం, ఒంటినొప్పులు ఉండును. మూత్రం గాఢపు రంగులో వుండి కొద్దికొద్దిగా వెళ్ళును. ముఖం ఉబ్బి ఉండును. ప్లీహము పెద్దదగును.

**3. స్వేద / చెమట దశ :** పిమ్మట 2–3 గంటలకు చెమటలు పోయుట ప్రారంభ మగును. ఈ దశలో శరీరమంతా చెమట పట్టి జ్వరం తగ్గును. దప్పి తగ్గును. ఆకలి పుట్టును. నిద్ర పట్టును. మేల్కొన్న తర్వాత ఆరోగ్యంగా ఉంటాడు. ఈ దశ సుమారు ఆరు గంటలపాటు ఉండును. కాని తిరిగి చలి రావచ్చు.

**కారణములు :**

1) వ్యాధికారక సూక్ష్మజీవులు, ఆడ అనాఫిలస్ (anopheles) అనే దోమ కాటువలన శరీరములోనికి ప్రవేశించుట 2) దోమలు వృద్ధిచెందుటకు అనువైన మురికి కాలువలు, బురద గల ప్రదేశాలలో నివసించుట. 3) కలుషితమైన ఆహారాన్ని తినుట, కలుషితమైన నీటిని త్రాగుట.

**నివారణోపాయాలు :**

1. దోమకాటు నుండి రక్షణ పొందుటకుగాను ప్రజలు దోమతెరలు వాడాలి. దోమలను దూరం చేయుటకు మస్కిటో కిల్లర్స్, మస్కిటో రిపెలంట్స్ ఉపయోగపడతాయి. వీటి ప్రయోజనం పరిమితం. గాంధీగారు దోమతెర వాడేవారు. ఒంటికి కిరోసిన్ పూసుకొనేవారు. కిరోసిన్ దుర్గంధానికి దోమలు పారిపోయేవి. ఈ మధ్య ఇంటిముందు కొన్ని రకాల మొక్కలను పెంచి దోమలను అరికట్టే ప్రయత్నాలు చేస్తున్నారు. కొంతమంది కిటికీలు వంటి వాటికి సన్నని జల్లెడ వంటి తీగవల వేస్తున్నారు. ఇది దోమలను తగ్గించును.
2. దోమలు వృద్ధికాకుండా చెత్త కుప్పలను, పెంటకుప్పలను ఎప్పటికప్పుడు తొలగించి పరిసరాలను శుభ్రంగా వుంచాలి.
3. చలిగా నున్నప్పుడు రోగికి వేడినీటిని ఇవ్వాలి.
4. సులభముగా జీర్ణమగు తేలికపాటి ఆహారమివ్వాలి. బార్లీ గంజి / పలచని ద్రవాహారం బాగా ఉపయోగపడును. ద్రాక్ష, బత్తాయి, దానిమ్మ మొ॥ పండ్ల రసాలు ఇవ్వాలి. జ్వరము తగ్గిన 2, 3 రోజుల తర్వాత సులభముగ జీర్ణమగు ఆహారమివ్వాలి.
5. ఆహారం, నీరు శుద్ధమైనవిగా ఉండాలి.
6. మలేరియా తగ్గిన తర్వాత ప్లీహము, కాలేయము వాచవచ్చు. వాటికి కూడా తర్వాత తగు చికిత్స చేయాలి.

## • చికిత్స •

క్రింది మందులను లక్షణాలను బట్టి 2 గంటలకొకసారి ఇవ్వవలెను.

**నేట్రంసల్ఫ్ 3× - 30× :** ఈ జ్వరపు మూడు స్థాయిలలోను ఈ మందును 3× పొటెన్సీలో ఇవ్వవలెను. ఊబ శరీరం కలవారికి ఇది బాగా ఉపయోగకారి. పైత్యరసపు ఉద్రేకాన్ని తగ్గించుటలో ముఖ్య మందు. మలేరియా తడినేల గాలి పీల్చుట లేక బ్యాక్టీరియా వల్ల వచ్చినా ఈ మందు పనిచేయును. ఈ మందు మలేరియా జ్వరానికి మూల కారణమైన అధిక నీటిని దేహము నుండి తొలగించును. మలేరియా రోగి పాలు, మజ్జిగ త్రాగుట, గ్రుడ్లు, మాంసం, చేపలు తినుట మానుకోవాలి. "విడిచి విడిచి వచ్చునట్టి / మలేరియా జ్వరం, పైత్యాధిక్యత, రక్తపు జీరగల విరేచనాలు, నాలుక వెనుక ఆకుపచ్చ / కంచురంగు పూత, కంటి కలక, పసుపుపచ్చ స్రావం వున్నచో నేట్రంసల్ఫ్ పనికి వచ్చును" **- ఢఫ్ఫీల్డ్**

**నేట్రంఫాస్ 3× - 6× :** విడిచి విడిచి వచ్చు జ్వరం - ఆమ్లము / పుల్లని పదార్థమును వాంతి చేసుకొనుట - పులుపు వాసనగల చెమట పట్టుట - పాదాలు పగటిపూట అతి చల్లగాను, రాత్రి మంటగాను ఉండుట - మధ్యాహ్నం తర్వాత తలనొప్పి.

**మెగ్నీషియంఫాస్ 3× - 6× :** మలేరియా జ్వరం / విడిచి విడిచి వచ్చు జ్వరం - పిక్క కండరాలలో ఈడ్పులు - చలిదశలో చలి వీపున క్రింది నుండి పైకి ప్రాకుట - రాత్రి 7 గంటల నుండి ఉదయం 9 గంటల వరకు అధిక చలి - ఎక్కువ నీరసం, కాళ్ళు - చేతుల తీవ్రమైన ఈడ్పులు, నీలంగా మారుట, కండరాలు అధిక బాధతో ముడుచుకుపోవుట లక్షణాలు ఉండును. దీనిని నేట్రంసల్ఫ్‌తో మార్చి వాడాలి.

**కాలీమూర్ 3× - 6× :** మలేరియా జ్వరపు ఉష్ణదశ - నాలుక వెనుక భాగాన వెంట్రుక ఉన్నట్లు అనిపించుట - నాలుకపై బూడిద తెలుపు / తెలుపు వర్ణముగల పూత - దీనిని నేట్రంసల్ఫ్‌తో మార్చి వాడాలి.

**కాలీఫాస్ 3× - 6× :** మలేరియా జ్వరం - ఎక్కువ నీరసం - దుర్వాసనగల ఎక్కువ చెమట - 4 రోజుల కొకసారి వచ్చు జ్వరం.

**ఫెర్రంఫాస్ 6× - 12× :** మలేరియా జ్వరం రక్తహీనులకు వచ్చిన ఈ మందు బాగా పనిచేయును. జీర్ణంకాని పదార్థాన్ని వాంతిగా చేసుకొనుట - క్వైనాను వాడిన వారలకు దీనిని తప్పక ఇవ్వవలెను.

**కాల్కేరియాఫాస్ 3× - 12× :** పిల్లలకు చాలా కాలంగా మలేరియా జ్వరం ఉన్నప్పుడు లక్షణాలను బట్టి మందునిస్తూ దీనిని మధ్య-మధ్య వాడాలి.

**నేట్రంమూర్ 6× :** రోగిలో చలి వస్తుంటే భయం ఉంటుంది. చలిదశలో ఉదయం 10 - 11 గంటలకు చలి విపరీతంగా వస్తుంది. ఆ దశలో తలనొప్పి, వికారము,

వాంతి ఉంటాయి. పెదవులు, గోళ్ళు నీలంగా ఉంటాయి. ఉష్ణ / వేడి దశలో సుత్తితో కొట్టినట్లు తలనొప్పి, నిస్త్రాణ, ఒళ్ళు తెలియకపోవుట, రోగి పరుండి యుండుట వుండును. స్వేద దశలో ఎక్కువ చెమట పోయును. చెమటలో నొప్పులు తగ్గును. కాని నిస్త్రాణ ఉండును. ఈ రోగిలో పెదవులపై పొక్కులు ఉండును. కాలేయం, ప్లీహం వాచి నొక్కితే నొప్పి ఉండును. ఆర్సెనిక్, క్వైనా దుర్వినియోగం వలన వచ్చు రోగములకు ఇది మంచి మందు.

**సూచనలు :**

1. మలేరియా జ్వరానికి అల్లోపతిలోను, ఆయుర్వేదములోను ఈ మధ్య క్వైనా వాడు తున్నారు. దీని వలన రోగం అణచిపెట్టబడును. కాని పూర్తిగ నివారణ కాదు. కావున దీనిని వాడుట ఎంత మాత్రం మంచిది కాదు.
2. ద్వాదశ లవణములను ఇచ్చునపుడు జ్వరం తగ్గినప్పుడు / జ్వరానికి జ్వరానికి మధ్య హెచ్చు పొటెన్సీలు వాడాలి. నేట్రంసల్ఫ్ 30×, నేట్రంమూర్ 30× లను రోజుకు రెండుసార్లు మార్చి-మార్చి ఇచ్చిన దీర్ఘకాల వ్యాధులలో సత్ఫలితాలు లభించును.

## 3. ఇన్ఫ్లుయెంజా / విష పడిసెము జ్వరం
### (La Grippe)

ఇది వైరస్ వలన అకస్మాత్తుగ వచ్చు అంటువ్యాధి. ఇది బ్యాసిలస్ ఇన్ఫ్లుయంజ అనే క్రిమి వలన కలుగును. ఆ క్రిమి మనము పీల్చే గాలి ద్వారా శరీరములోనికి ప్రవేశించును. లవణ సమతుల్యత లేని కణాలలో చేరి వ్యాధి కలిగించును.

ఈ వ్యాధి నిస్త్రాణతో ప్రారంభమగును. దీనిలో దగ్గు, జలుబు, తుమ్ములు, తీవ్రమైన నొసటి నొప్పి, కీళ్ళ నొప్పులు ఉండును. జ్వరము 100° - 106° ఫా. వరకు ఉండవచ్చు. రోగి నాలుకపై తెల్లని పూత ఉండును. వమనానుమానం, నిద్రలేమి ఉండును. ఈ వ్యాధి కొన్ని సందర్భాలలో బ్రొంఖైటిస్ (శ్వాసనాళముల వాపు), న్యుమోనియా, అజీర్తి విరేచనాలు, జిగట విరేచనాలు, మూత్రబంధనం, గుండెదడ, గుండె కవాటముల వ్యాధులు, కండరాల జబ్బులు, గాలిబిళ్ళల వ్యాధి, డిఫ్తీరియా, ఉబ్బు వంటి రోగాలు రావచ్చు.

**నివారణోపాయాలు :**

1. రోగిని విశ్రాంతిగ శయ్యలో పడుకోనివ్వాలి.
2. రోగి గది పొడిగాను, మంచి గాలి, వెలుతురు వచ్చునదిగా ఉండాలి.
3. వెచ్చదనం కలిగించు దుస్తులను ధరించునట్లు చేయాలి.
4. జ్వరం ఎక్కువగా వున్నప్పుడు శరీరాన్ని తరచుగా నీటితో స్పాంజి చేయాలి.
5. సులభంగా జీర్ణమగు ద్రవాహారము ఇవ్వాలి.

6. పుల్లని పండ్లను ఇవ్వరాదు.
7. ముక్కు, నోటి నుండి వచ్చు స్రావములను సున్నపు పాత్రలోనికి పడునట్లు జాగ్రత్త వహించాలి. ఆ తర్వాత ఆ సున్నమును గుంటలో పాతిపెట్టుట కాని కాల్చి వేయుట కాని చెయ్యాలి.

**• చికిత్స •**

క్రింది మందులను లక్షణాలను బట్టి రెండు మూడు గంటలకొకసారి వ్యాధి తగ్గు వరకు వాడాలి.

**నేట్రంసల్ఫ్ 3× - 6× :** ఇది ఇన్ఫ్లూయంజాకు మంచి మందు. ఇతర మందులతో ఈ వ్యాధిని తగ్గించిన తర్వాత దీనిని వాడిన వ్యాధి పూర్తిగా నయమగును. ఇది కణాలలో ఎక్కువగ వున్న నీటిని తొలగించి వ్యాధిని నయం చేయును. పైత్యరస లక్షణాలు–నాలుక మీద గోధుమరంగు పూత - వాయువు, విరేచనాలతో నొప్పి - విరేచనాలు ఆకుపచ్చ - గోధుమ రంగులో - వ్యాధి తర్వాత వచ్చు బాధలకు కూడా ఇది మంచిమందు. ఈ వ్యాధి తర్వాతవచ్చు నిస్త్రాణను తొలగించుటకు కాలీఫాస్, కాల్కేరియా ఫాస్ ఉపయోగపడును.

**నేట్రంమూర్ 6× :** తుమ్ములు, ముక్కు నుండి స్వచ్ఛమైన నీరు వెడలుట–నాలుక శుభ్రంగా ఉండుట - నాలుక అంచుల మీద బుడగలు - పెదవులు, ముక్కు చుట్టూ చిన్న నీటి పొక్కులు ఏర్పడుట - ఆతురత, మానసికంగా కృంగుట.

**ఫెర్రంఫాస్ 3× - 12× :** వ్యాధి ప్రథమావస్థలో జ్వరము, తలనొప్పి, వీపునొప్పి, నాడి వడిగా కొట్టుకొనుట, ఆకలి లేకుండుట, జీర్ణంకాని ఆహారం వాంతి యగుట, ఆతురత.

**కాలిమూర్ 3×-6× :** వ్యాధి ద్వితీయావస్థలో జలుబు, నాలుకమీద తెల్లనిపూత, గొంతు మంట, కదలికల వలన వీపునొప్పి ఎక్కువైనపుడు ఈ మందును ఫెర్రంఫాస్‌తో మార్చి ఇవ్వాలి.

**కాలీఫాస్ 6× :** ఈ వ్యాధి తర్వాత వచ్చు బలహీనతకు, నీరసమునకు మంచి మందు. ఉదయాన అలసట, అనేక కండరాల ఈడ్పులను, నాడీ నొప్పులను ఇది తగ్గించును.

**మెగ్నీషియం ఫాస్ 6× :** ఇన్ఫ్లూయంజా తర్వాత కలుగు నరాల బలహీనత, ఈడ్పులను ఈ మందు తొలగించును. వేడిమి వల్ల తగ్గుట, కాల వ్యవధులలో వచ్చుట - ఈ లక్షణాలకు దీనిని వాడాలి.

## 4. టైఫాయిడ్ / సన్నిపాత జ్వరం
## (Typhoid / Enteric Fever)

ఇది చాలా ప్రమాదకరమైన జ్వరము. ఇది అంటువ్యాధి. ఇది బాసిల్లస్ టైఫోసిస్ అనే క్రిమి వలన వస్తుంది. ఇది ఆహార పానీయముల ద్వారా శరీరములోనికి ప్రవేశిస్తుంది.

ఇది సాధారణముగా 5 మొదలు 35 సంవత్సరముల వయస్సు గలవారికిని, ఆగస్టు, సెప్టెంబర్ నెలలోను ఎక్కువగ వచ్చుచుండును. దీని సాధారణ పరిమితి 3 వారములు. కాని తీవ్రమైన కేసులలో 5 – 6 వారములు కూడ పీడించుచుండును.

**లక్షణములు :**

**జ్వరం రావటానికి పూర్వము :** ఈ జ్వరం రావటానికి ముందే కొన్ని రోజులుగ రోగికి బలహీనత, పాలుమాలిక, తలనొప్పి, అవయవములు పచ్చి పుండులాగ ఉండుట, చెవులు వినబడకుండుట, ముక్కు నుండి రక్తం కారుట ఉండును.

**1. మొదటి వారం :** జ్వరం నిచ్చెన మెట్లవలె పెరుగుట, సాయంకాలపు ఉష్ణోగ్రత ఉదయపు ఉష్ణోగ్రత కన్నా 1, 2 డిగ్రీలు ఎక్కువగుట, ముందురోజు సాయంత్రంకన్నా ఒక డిగ్రీ ఎక్కువగ ఉండుట, ఈ విధంగా 7 రోజుల వరకు పెరుగుతూ ఉండుట – నాడి వేగంగా కొట్టుకొనుట – ప్లీహం కొద్దిగా పెరుగుట – చెవులలో హోరు – కడుపులో కుడివైపు క్రింది భాగములో వాయువు చేరుట (చిన్న ప్రేగులో తుంటి ఎముక యొక్క ఊర్ధ్వభాగము వాచుట, పుండు పడుటవల్ల) – రోగి చిరాకుగా ఉండుట – కలలు వచ్చుట, నిద్రలో ఏమేమో మాట్లాడుట, మేల్కొన్నప్పుడు కూడా సరిగా జవాబు చెప్పలేక పోవుట, ఆకలి లేకుండుట, ఎక్కువ దాహం, మొదట మలబద్ధకం, తర్వాత విరేచనాలు, నాలుకపై దంతముల గుర్తులు, కడుపులో వాయువు చేరుట, దగ్గు, ఒంటినొప్పులు.

మొదటి వారం చివర్లో కడుపుపైన, ఛాతిపైన దోమకాట్ల వంటి పొక్కులు, నాలుగు రోజులపాటు ఉండుట.

**2. రెండవ వారం :** ఉష్ణోగ్రతలో పెద్ద మార్పు ఉండక పోవుట, ముఖము పిచ్చివాని ముఖంవలె ఉండుట, ఒళ్ళు తెలియకపోవుట, నాలుక బయటికి పెట్టలేకపోవుట, మలమూత్రములు తెలియకుండా వచ్చుట, నిద్రలో వెల్లకిల పండుకొని క్రిందకు జారుట, కళ్ళు సగం మూసుకొని ఉండుట, నాలుక ఎండిపోయి ఉండుట, నోటి నుండి చొంగ కారుట, చెవులలో హోరు లేకపోవుట – పిచ్చిచేష్టలు వుండవచ్చు లేకపోవచ్చు.

**3. మూడవ వారం :** ఈ వారములో రెండవ వారములోని లక్షణాలు ఉంటాయి. కోలుకొనే సందర్భములో జ్వరము, నీళ్ళ విరేచనములు, శరీర అవయవాల నొప్పులు తగ్గును. ఆకలి పుట్టును. రాత్రియందు నిద్ర పట్టును. నాలుక శుభ్రపడును. ఇవన్నీ శుభ లక్షణాలు, కొన్ని సందర్భాలలో రోగం వికటించును, జ్వరము ఎక్కువగును.

**4. నాల్గవ వారం :** రోగము సవ్యముగ నడిచినచో జ్వరం పూర్తిగ తగ్గును. దుర్గుణములు ఏమియు ఉండవు. రోగము వక్రగతిలో నడిచినచో మూడవ వారములోని దుర్గుణములన్నియూ ప్రకోపించును. ఎక్కువ మత్తు, ప్రేలాపసంధి, అప్రయత్నముగ మలమూత్ర విసర్జన మొ॥ లక్షణాలన్నియు వృద్ధి అగును. ప్రేగులో బెజ్జములు పడి రోగి

చనిపోవచ్చును. న్యుమోనియా, మూత్రపిండముల వాపు, నీళ్ళ విరేచనాలు, ఊపిరితిత్తులు చెడిపోవుట దుశ్శకునాలు.

**నివారణోపాయాలు :**

1. రోగిని పరుండపెట్టి తగు విశ్రాంతి నివ్వాలి.
2. రోగి వుండు గదికి మంచి వెలుతురు, శుభ్రమైన గాలి రావాలి.
3. రోగిని, అతని గదిని ఎప్పుడూ శుభ్రంగా ఉంచాలి.
4. రోగిని ప్రతిదినము స్పాంజితో తుడిచి దుస్తులు మార్చాలి.
5. రోగి మలమూత్రములను క్రిమి సంహారక పదార్థాలతో కలిపి వాటిని ఎప్పటికప్పుడు గది నుండి తొలగించాలి. అతడు వాడిన వస్తువులను వేనినీ ఇతరులు వాడరాదు.
6. రోగిని అప్పుడప్పుడు కదిలిస్తూ ఉండాలి. ఎప్పుడూ పడుకొని ఉన్నచో కురుపులు రావచ్చు.
7. నోరు అప్పుడప్పుడు కడుగుచుండాలి. గుండె పరీక్షలు చేయించాలి.
8. ఉష్ణోగ్రతను రికార్డు చేసి జ్వర తీవ్రతను గమనిస్తూ వుండాలి.
9. జ్వరంగా ఉన్నప్పుడు నీటిలో గుడ్డను తడిపి దానితో శరీరమును తుడవాలి. పొట్ట / నుదుటిపై ఆ తడిగుడ్డను పెట్టవచ్చు.
10. జ్వరము తగ్గు వరకు ద్రవాహారమే ఇవ్వాలి. పలుచగ చేసిన పాలు మంచిది. మలము ద్వారా అజీర్ణమైన పాలు పోవుచున్నచో పాలను విరుగగొట్టి ఘన పదార్థ మును తీసివేసి మిగిలిన ద్రవాన్ని (whey) ఇవ్వాలి. నీళ్ళ విరేచనములు ఉన్నప్పుడు ఎట్టి ఆహారం ఇవ్వరాదు.
11. నీరు కొద్దిగా ఇవ్వవచ్చు.
12. రోగము బాగా నెమ్మదించిన తర్వాత అన్నం పెట్టవచ్చు.
13. రోగము నెమ్మదించిన కొన్ని నెలల వరకు ఏ పనీ చేయరాదు.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 3× - 12× :** టైఫాయిడ్ జ్వరము ప్రారంభమున చలి, జ్వరం, తలనొప్పి ఉండుట – ఆఖరిదశలో రక్తవిరేచనములు, అజీర్ణం, జీర్ణంకాని పదార్థం వాంతి అగుట – ముఖము, పెదవులు, ఆమత్వక్కు ఎరుపెక్కుట – నాడి వేగముగ కొట్టుకొనుట, కాలీఫాస్ కంటె ఎక్కువ బలంగాను, తక్కువ క్రమస్థితి – రక్తహీనులకు మంచిది. క్వైనా విశేషంగా వాడిన వారలకు ఉపయోగకారి.

**కాలీమూర్ 3× - 6× :** టైఫాయిడ్‌కు ప్రధానమైన మందు – నాలుకపై బూడిద / తెల్లని పూత – ప్రేగులు బిగి లేకుండుట – తేలికపాటి పసుపు పచ్చని / కాషాయరంగు / ఉన్నెవంటి విరేచనాలు – పొత్తికడుపు నొప్పి, వాపు – రక్తస్రావం నల్లని గడ్డల వలె.

**కాలీఫాస్ 3× - 6× :** టైఫాయిడ్ జ్వరము మధ్యలో అపాయకరమైన లక్షణాలు - మెదడుపై ప్రభావం చూపుటచే స్పృహ కోల్పోవుట / దుర్వాసనగల రక్తస్రావం - నీరసం, గుండె బలహీనత, నిద్రలేమి, దుర్వాసన గొలుపు శ్వాస, విరేచనాల దుర్వాసన, స్పృహ కోల్పోవుట, దంతములపై నల్లని పదార్థం / పాచి కూడుట - రక్తము టైఫాయిడ్ విషముతో నిండి యుండుట - శ్వాస కష్టముగా నుండుట - వ్యాధి ఏదో ఒక అవయవములో మాత్రమే లేకుండుట - దుర్గంధ భరితమైన స్రావం దీని ముఖ్య లక్షణం - విశ్రాంతి లేకపోవుట, తేలికపాటి సంధి - నాలుకపై తెలుపు / పసుపు పూత - పాలిపోయిన ముఖం, అది గిల్లినట్లుండుట, అది ఆదుర్దాతో నున్నట్లు కనిపించుట - కొన్ని రోజుల్లో శరీరపు వివిధ భాగాలలో తీక్షణమైన కోస్తున్న నొప్పులు, బలహీనత, తీక్షణమైన క్రమంలేని నాడి - సాపేక్షికంగా తక్కువ ఉష్ణోగ్రత.

రోగి శారీరకంగా కంటే మానసికంగా పనిచేయువాడైనచో కాలీఫాస్ ఇవ్వవలయు నని హాల్‌బర్ట్ పేర్కొన్నాడు. మానసిక, శారీరక నిస్త్రాణ, అలసట, మందకొడిగా నుండుట, ఏ పనిచేయుట కిష్టము లేకపోవుట, అస్తిమితము, కోపము, తలనొప్పి, నిద్రపట్టకపోవుట - చివరి దశలో ఆరోగ్యవంతుని చేయుశక్తి లేకపోవుట.

**కాలీసల్ఫ్ 3×-6× :** టైఫాయిడ్ జ్వరం-రాత్రిపూట ఉష్ణోగ్రత పెరుగుట, ఉదయాన తగ్గుట.

**నేట్రంమూర్ 3× - 6× :** ఉదయం 10, 11 గంటల మధ్య చలి, జ్వరము ఎక్కువగుట, దప్పిక, జ్వరములో ఈడ్పులు, ఎక్కువ నిద్రమత్తు, నీళ్ళ వాంతి, పెదవుల మీద నీటి పొక్కులు, మలబద్ధకం, ఆకలిలేకపోవుట, నీరసము, తలనొప్పి -ఈ లక్షణములలో బాగా పనిచేయును. క్వైనా వాడిన పిమ్మట దీనిని వాడినచో దాని విరుగుడుగా పనిచేయును.

**నేట్రంసల్ఫ్ 3× - 6× :** ఈ రోగము యొక్క అన్ని అవస్థలలోను వాడవచ్చు. పైత్యోద్రేకమును తగ్గించుటకు ముఖ్యమైన మందు. చేదు వాంతులు, ఆకుపచ్చ నీళ్ళ విరేచనము లగుచుండును.

**కాల్కేరియాఫాస్ 6× :** వ్యాధి అన్ని దశలలోను ఇతర మందులతో మధ్యమధ్యన ఇవ్వవలెను. వ్యాధి నుండి కోలుకొనుచున్నప్పుడు దీనినిచ్చిన కణాలు వృద్ధి చెంది రోగికి బలం చేకూర్చును.

## 5. న్యుమోనియా
## (Pneumonia)

ఇది ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధి. స్త్రీల కంటే పురుషులలోను, అందులో పిల్లలకు ఎక్కువ తరచుగ వచ్చుచుండును. పెద్దవారిలో కూడ కొందరు దీనివలన

బాధపడుచుందురు. ఒకే వ్యక్తి దీనివలన అనేకసార్లు బాధ పడవచ్చు. ఈ వ్యాధిలో ఊపిరితిత్తుల పనితీరు బాగా దెబ్బతింటుంది. అవి సాగే గుణాన్ని కోల్పోవుటవల్ల ప్రాణాపాయ స్థితి ఏర్పడును.

**లక్షణములు :**

1. ఈ వ్యాధి అకస్మాత్తుగ అపరిమితమైన చలితో ప్రారంభమగును.
2. తర్వాత రొంపభారము, తలనొప్పి, జ్వరము, అపరిమితమైన నొప్పులు, దగ్గు వచ్చును.
3. శ్వాస అధికమగును.
4. దగ్గు వల్లను, ఊపిరిపీల్చుట వల్లను ఆయాసము, నొప్పులు వృద్ధి యగును.
5. రెండవ రోజున లేక మూడవ రోజున న్యుమోనియా లక్షణములు బాగా వృద్ధి చెందును.
   i) కఫము (కళ్ళె) గట్టిగా, జిగురుగా నుండును.
   ii) దగ్గునపుడు బాధ అధికమగును. అందువల్ల రోగి తన చేతులతో తన ప్రక్కలను గట్టిగ పట్టుకొనును.
   iii) దేహపు ఉష్ణోగ్రత 104 ఫా, 105 ఫా. వరకు పెరుగును.
   iv) గుండె మామూలుగా నిమిషమునకు 72 సార్లు కొట్టుకొనును. కాని న్యుమోనియాలో 120 సార్లు లేదా ఇంకా ఎక్కువగా కొట్టుకొనును.
   v) శ్వాసను మామూలుగా నిమిషమునకు 18సార్లు పీల్చుదురు. కాని న్యుమోనియాలో ఈ సంఖ్య 50 వరకు పెరుగుతుంది.
   vi) శ్వాస వదలునపుడు ధ్వని వచ్చును. రోగి ముక్కులు ఎగరవేయును.
   vii) రోగి బాధగా నున్న వైపున పడుకొనుచుండును.
   viii) మూత్రము ఎర్రగా, కొద్దిగా వెడలును. నిద్ర పట్టదు. శరీరము వేడిగా నుండును. ముఖం పాలిపోయి పొంగరించి యుండును. నాలుక తెల్లగా వుండును.
   ix) శరీరపు ఉష్ణోగ్రత 10 రోజుల తర్వాత అకస్మాత్తుగ తగ్గిపోవును. చెమటలు పోయును. కొద్దిగా సంధి లక్షణాలు కనిపించును.

**రకములు :** న్యుమోనియా రెండు రకములు – **i) లోబార్ న్యుమోనియా :** దీనిలో ఒక ఊపిరితిత్తి మాత్రము చెడిపోవును. **ii) బ్రాంకో న్యుమోనియా :** దీనిలో రెండు ఊపిరితిత్తులు చెడిపోవును.

**కారణములు :** 1) న్యోమోకాకస్ అను సూక్ష్మక్రిమి దేహములో ప్రవేశించుట 2) కొన్ని రకాల వైరస్‌లు 3) సరైన దుస్తులు లేక చలిగాలిలో తిరిగినను, తడి బట్టలతో వుండినను ఈ వ్యాధి సోకుటకు అవకాశము ఎక్కువగా ఉండును 4) కాలీమూర్, ఫెర్రంఫాస్ లవణాలు దేహములో తక్కువగా నుండుట.

**నివారణోపాయాలు :**

1) ఆయాసముతో బాధపడుచున్న రోగిని మాట్లాడించకూడదు. 2) వేడినీళ్ళ ఎనిమా పెట్టి ప్రేగులను శుభ్రపరచవలెను. 3) కళ్ళె చిక్కపడి, గట్టిగ, జిగురు వలె ఉండి బయటికి వెళ్ళునపుడు అమితమైన బాధగా నున్నచో గుడ్డను ఫెర్రంఫాస్ కలిపిన వేడినీటిలో తడిపి ఛాతీకి వేయుట మంచిది.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× - 12× :** ఇది న్యుమోనియా ప్రథమ దశకు మొదటి ప్రధానమైన మందు. ఈ దశలో ఊపిరితిత్తులు వాచును. ఎక్కువ జ్వరం ఉండును. శ్వాస పొట్టిగా, అదిమినట్లుగా, ఆవేశపూరితముగా ఉండును. రోగి స్తబ్ధత కలిగి యుండును. కొన్ని సందర్భాలలో ఆవలిస్తూ ఉండును. రోగికి బాగా చెమట పట్టి ఆరోగ్యవంతుడగు వరకు ఈ మందును ఇవ్వవచ్చు. బాగా చెమర్చిన తర్వాత దీని ఉపయోగం ఉండదు. ముసలివారి న్యుమోనియాకు ఇది బాగా ఉపయోగ పడును. కళ్ళెలో శుద్ధమైన రక్తం పడునపుడు దీనిని వాడవచ్చని డా. జె.సి. గుర్న్‌సే పేర్కొన్నారు. ఛాతీకి వేడి కాపడం పెట్టుట వల్ల తగ్గిన దీనిని వాడవచ్చు.

బాగా వున్న ఊపిరితిత్తి అకస్మాత్తుగా రక్తాధిక్యతచే నిండి, పై భాగమున మచ్చలు ఏర్పడి కదిలినపుడు అస్థిరత్వము కాని, నొప్పికాని లేనిచో ఈ మందు ఉపయోగపడును. పిల్లలకు ఇది మంచి మందు. శ్వాసను వదలునపుడు బుడగల వంటి ధ్వని వినిపించినా, కళ్ళె తుప్పురంగులో వుండినా దీనిని వాడవచ్చు.

**కాలీమూర్ 3× - 6× :** ఊపిరితిత్తుల లోనికి దారము వంటి పదార్థం చెమర్చుట - నాలుకపై సాధారణంగా తెల్లటి పూత - కళ్ళె తెల్లగాను, జిగట గాను వుండుట - న్యుమోనియా ద్వితీయ దశలో ముక్కు, గొంతుక, చెవులలో శ్లేష్మ సంబంధమైన బాధలు కలుగుట - గుండెకు సంబంధించిన బాధలు, ఉబ్బు రోగము ఉన్నచో ఈ మందును వాడాలని సూచించును. ఉబ్బు రోగం తగ్గును. దగ్గు వదులుగా నుండును. ఊపిరితిత్తి గట్టి పడును. ఈ మందును ఫెర్రంఫాస్‌తో మార్చి ఇవ్వవలెను.

**మెగ్నీషియంఫాస్ 6× :** ఈడ్పులతో దగ్గు వచ్చుట - కళ్ళె పడకుండుట - ఛాతీ నొక్కినట్లుండుట - రాత్రి పూట దగ్గు ఎక్కువగుట - పడుకొన్నప్పుడు దగ్గు ఎక్కువగుట.

**నేట్రంమూర్ 3× - 6× :** ఊపిరితిత్తుల వాపు - వదులైన, గడగడ ధ్వని చేయు కళ్ళె - కళ్ళె స్వచ్ఛముగాను, సీరం ద్రవముతోను, నురుగుతోను ఉండుట - అతి కష్టముమీద కళ్ళె వెడలుచుండుట - ఉదయాన దగ్గు ఎక్కువగుట - బ్రద్దలు చేయుచున్నట్టి నొప్పి - అప్రయత్నముగ మూత్రం / కన్నీరు వెలువడుట - నాలుక శుభ్రంగా, పొడిగా, ప్రకాశవంతంగా ఉండుట - మద్యం సేవించువారికిది మంచి మందు.

**నేట్రంఫాస్ 6X :** న్యూమోనియాలో పైత్య లక్షణాలు కనిపించుట –కళ్ళె గట్టిగా, దారము వలె, ఆకు పచ్చని చీమువలె నుండుట – ఛాతీ పుండుగా వుండుట–ఒత్తిడి వల్ల ఆరోగ్యం బాగుపడుట – దగ్గునపుడు ఛాతీని బిగపట్టుకొనుట – తేమ వాతావరణంలో లక్షణాలు ఉద్రేకించుట.

**కాలీసల్ఫ్ 3X – 6X :** ఊపిరితిత్తుల వాపు – పిల్లి కూతలు వినపడుట – కఫం పసుపు పచ్చగా, వదులుగా వుంటూ ధ్వని చేస్తూ పడుట – అది నీళ్ళవలె ఉండుట – ముఖ్యంగా పిల్లలలో ఈ లక్షణాలు కనిపించుట – ఊపిరాడకుండుట, చల్లని గాలి కావాలనిపించుట – సాయంకాలం నుండి అర్ధరాత్రి వరకు ఉష్ణోగ్రత పెరిగి తర్వాత తగ్గుట – అసాధారణ ముతక ధ్వనులు – గడగడ ధ్వని చేయు దగ్గు – కఫము అతి కష్టము మీద వెలువడుట.

**కాలీఫాస్ 6X :** టైఫాయిడ్ న్యుమోనియా – నరాల శక్తి పూర్తిగా నశించుట – నిద్రలేక పోవుట – బలహీనత – శ్వాస పొట్టిగా నుండుట – కళ్ళె నుండి కుళ్ళిన వాసన వచ్చుట. బొంగురుతనం – ఊపిరి గొట్టములోని క్షోభ వల్ల దగ్గు వచ్చుట – కళ్ళె గట్టిగా, పసుపు పచ్చగా, ఉప్పుగా, కుళ్ళినట్లుండుట – ఈడ్పులు గల దగ్గు – నురుగు, సీరంతో నున్న కళ్ళె – కళ్ళె అధికంగా ఉండి ఊపిరాడకుండా చేయుట.

**సైలీషియా 6X :** దీర్ఘకాలపు న్యుమోనియా – న్యుమోనియా నిర్లక్ష్యం చేయబడి చీముపట్టు స్థితికి చేరుకొనుట – వీపుపై / వెల్లకిల పరుండినపుడు శ్వాస కష్టముగా నుండుట – ఊపిరితిత్తులలో లోతుగా నొప్పి ఎక్కువగా ఉండుట – దగ్గు వదులుగా నుండి గడగడ ధ్వని చేయుట – కళ్ళె అధికముగను, జిడ్డుగను, కుళ్ళినట్లు, గట్టిగను, పసుపు పచ్చగను / ఆకుపచ్చగను ఉండుట – క్షయకు సంబంధించిన జ్వరం – చెమట ఎక్కువ – అధిక బలహీనత.

**కాల్కేరియాఫాస్ 6X :** పిల్లల న్యుమోనియా – రక్త క్షీణత గలవారి న్యుమోనియా – కళ్ళె పసుపు పచ్చగా వుండుట – ఉదయంపూట ఎక్కువ కళ్ళె – ఛాతీలో కుట్టినట్టి నొప్పి – జలుబు వల్ల బాధ ఎక్కువగుట.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** న్యుమోనియా తృతీయ దశ – కళ్ళె అధికముగను, దుర్వాసనతోను, చీము మాదిరిగా పలచగా ఉండుట – పిల్లలలో విపరీతమైన దగ్గు – అస్వస్థత.

**నేట్రంసల్ఫ్ 6X :** దగ్గినపుడు రోగి లేచి బాధచే తన చేతిలో ప్రక్కలను గట్టిగా పట్టుకొనును. ఛాతీలో ఎడమవైపున నొప్పి యున్నప్పుడు ఈ మందు బాగా పనిచేయును.

## 6. డెంగ్యూ జ్వరం
### (Dengue Fever)

వర్షాకాలంలో పరిశుభ్రత లోపించుటవల్ల చిన్న చిన్న గుంటలలో కూడ నీళ్ళు నిలువ ఉండిపోయి దోమలు పెరగడానికి అధిక అవకాశం ఏర్పడుతుంది. దీనివల్ల

డెంగ్యూ వ్యాధి సోకే ప్రమాదం ఉంటుంది. ఇది ఫ్లేవి విరిడే కుటుంబానికి చెందిన డెంగ్యూ అనే వైరస్ వల్ల వస్తుంది.

ఈ వ్యాధి మూడు రకాలుగా ఉంటుంది. 1) డెంగ్యూ జ్వరం. 2) డెంగ్యూ రక్తస్రావ జ్వరం. 3) డెంగ్యూ షాక్ సింగ్రోమ్. ఈ వ్యాధులు అన్ని వయస్సుల వారికి రావచ్చు. కాని 15 సంవత్సరాల లోపు వారు ఎక్కువగా ఈ వ్యాధికి గురవుతుంటారు

ఈ వ్యాధి ఎడినస్ ఈజిప్ట్ అనే ఆడదోమ ద్వారా ఒకరి నుండి మరొకరికి వ్యాపిస్తుంది. ఈ దోమ నోటిలోని గ్రంథులలో వైరస్‌ను అభివృద్ధి పరుస్తుంది. ఇది ఎక్కువగా పగటిపూట కుడ్తుంది. ఈ దోమ మంచినీరు నిలువ ఉండే ప్రాంతాలలో ఎక్కువగా పెరుగుతుంది.

**డెంగ్యూ జ్వరం – లక్షణాలు :** 1) ఈ వ్యాధి సోకిన వారికి 103 నుంచి 104 డిగ్రీల జ్వరం రావచ్చు. 2) ఆకలి ఉండదు. 3) నోరు చేదుగా ఉంటుంది. 4) కండరాలు, తల, కళ్ళు, ఛాతీ, కడుపు – వీటిలో నొప్పి ఉంటుంది.

**డెంగ్యూ రక్తస్రావ జ్వరం – లక్షణాలు :** 1) విపరీతమైన జ్వరం 2) కడుపులో నొప్పి, ఛాతీక్రింద కుడి ప్రక్కన నొప్పి 3) రక్తస్రావపు ఛాయలు సాలెగూళ్ళవలె కనిపించుట – ఇవి ముఖ్యంగా చేతులు, కాళ్ళు, ముఖం, అంగిలి, చంకలలో కనిపిస్తాయి.

సరైన సమయంలో చికిత్స జరగకపోతే ఒక్కొక్కసారి రోగి షాక్‌కు గురికావచ్చు.

**డెంగ్యూ షాక్ సింగ్రోమ్ :** డెంగ్యూ జ్వరం సోకిన వారం రోజుల లోపు ఈ వ్యాధి వచ్చే అవకాశాలు ఉన్నాయి. ఈ వ్యాధి సోకిన వ్యక్తిలో ఈ లక్షణాలు కనిపిస్తాయి– 1) శరీరం చల్లబడుట 2) పాలిపోవుట 3) నీరసముగా ఉండుట 4) రక్తపోటు తగ్గుట.

ఈ వ్యాధికి సరైన సమయంలో చికిత్స జరగక పోయినచో 24 గంటలలోగా వ్యక్తి మరణించవచ్చు. మరణం సంభవించక పోయినను కొంతమందిలో మెదడు దెబ్బతినుట, మూత్ర పిండాలు, కాలేయం పని చేయకపోవుట జరగవచ్చు.

**జాగ్రత్తలు :** 1) ఇండ్లలో నీటి బిందెలపై మూతలు పెట్టాలి. 2) సగం నీరు త్రాగి విడిచిపెట్టిన గ్లాసులలోని నీటిని త్రాగరాదు. 3) ఫ్లవర్‌వాజ్‌లు, కూలర్‌లలోని నీటిని తరచుగ మార్చాలి. 4) ఇంటి పరిసరాలలో మురుగు నీరు నిలువ ఉండకుండా జాగ్రత్త తీసుకోవాలి.

## 7. స్కార్‌లెట్ జ్వరం
**(Scarlatina)**

ఇది అపాయకరమగు అంటువ్యాధి. ఇది ముఖ్యముగా చిన్న పిల్లలందు కలుగును. దీనిలో ఎడతెగని తీవ్ర జ్వరముండును. నోరు, నాలుక, టాన్సిల్స్, గొంతుక వాచును.

ఈ వ్యాధి వికారము, వాంతులు, చలితో ప్రారంభమగును. తదుపరి జ్వరము, గొంతునొప్పి కలుగును. మెడలోని గ్రంథులు వాచును. తదుపరి పొంగు (ఎర్రని తట్టు) వచ్చును. స్కార్‌లెట్ జ్వరపు లక్షణములన్నియు పెరుగును. నాలుక అతి ఎర్రగ నుండును. 5 – 6 రోజుల తర్వాత పొంగుతగ్గి చర్మం పొలుసులు ఊడును. దీనిలో మూత్రపిండములు వ్యాధిగ్రస్తమై వాటిలో ఆల్బుమెన్ చేరును. ఇందు అపాయకరమగు లక్షణములు ఏ క్షణమందైనను కలుగవచ్చు.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ :** స్కార్‌లెట్ జ్వరపు సాధారణ కేసులలో ఈ మందును కాలీమూర్‌తో మార్చి వాడాలి.

**కాలీమూర్ :** తక్కువస్థాయి స్కార్‌లెట్ జ్వరానికి ఫెర్రంఫాస్‌తో పాటు ఈ మందు సరి పోతుంది. ఇది లోతు లేనట్టి తట్టు / పొంగును బయటికి తెస్తుంది. వ్యాధి తగ్గిన పిమ్మట వచ్చు దుష్ఫలితములను నిరోధిస్తుంది. డా॥ పి.డి. పెల్టియర్ ప్రకారం ఇది ప్రయోజన కారియే కాకుండా వ్యాధి నిరోధకము కూడా. ఇది శోషరస నాళములు పెద్దవగుటను నిరోధించును.

**కాలీసల్ఫ్ :** ఇది ఈ వ్యాధిలో చర్మం వూడిపోయి కొత్త చర్మం వచ్చునట్లు చేయును. తట్టు / పొంగు వృద్ధి యగునట్లు చేయును. చెవుల నుండి దుర్వాసన గొలుపు రసి వంటి చీము వచ్చుటను ఆపును. ఆమత్వక్కు వాపుల నుండి, పిండము నుండి స్రావము వచ్చును.

**కాలీఫాస్ :** స్కార్‌లెట్ జ్వరము తర్వాత వచ్చు ఉబ్బుకు ఇది ఉపయోగపడును.

**నేట్రంమూర్ :** నిద్రమత్తు, ఈడ్పులు, నీళ్ళవంటి ద్రవాలను వాంతి చేసుకొనుట – ఈ లక్షణాలకిది ఉపయోగపడును.

**సైలీషియా :** స్క్రాఫ్యులా వ్యాధి – గ్రంథుల వాపు చీము పట్టునట్లు చేయును. పుండ్లు, గాయములను తగ్గించును.

**నేట్రంసల్ఫ్ :** పొంగు మొటిమలను, గొంతులో శ్లేష్మము కూడుటను ఈ మందు నివారించును.

## 8. పుప్పొడి వల్ల వచ్చు జ్వరం
### (Hay Fever)

ఇది పుప్పొడివల్ల వచ్చును. దీనిలో జలుబు, తుమ్ములు, కన్నీరు ఉండును. దీనివల్ల కళ్ళు, గొంతు, ముక్కు వాచును. ఇది సంవత్సరములో వేరు–వేరు కాలములందు వచ్చును.

**• చికిత్స •**

**మెగ్నీషియంఫాస్ 3× - 6× :** పుప్పొడివల్ల జ్వరము వచ్చి తారాస్థాయికి చేరునపుడు లేక వచ్చిన జ్వరము తగ్గుచున్నప్పుడు దీనిని వాడమని  డా॥ టి.సి. ఫ్యానింగ్ సిఫారసు చేసాడు. వాతావరణం ఉక్కగా ఉన్నను, రోగి ముక్కు పగటిపూట దిబ్బడ వేయబడి యున్నను, హ్రస్వమైన, కుతూహలము కలిగించు శ్వాస భారముగా నున్నను, ఈడ్పు వచ్చినను ఈ మందు గంటకొకసారి పగలు, సాయంత్రం వేడినీటితో ఇవ్వాలి.

**నేట్రంమూర్ 3× - 30× :** పుప్పొడివల్ల వచ్చు జ్వరం మధ్య-మధ్య వాడిన మందులవల్ల అణచబడుట - రోగి ఉప్పు కావలయునని ఎక్కువగా కోరుట - ఏ మాత్రం సూర్యరశ్మి కలిగినా తీవ్రమైన జలుబు కలుగుట - ముక్కు, కంటి మార్గాలలో దురద.

**సైలీషియా 6× - 12× :** ముక్కు లోను, కర్ణాంతర నాళముల రంధ్రముల వెనుక దురద - ఎక్కువగా తుమ్ముట, చర్మమును ఒరుచు స్రావం, బొంగురుతనం, ముతక తనం, పొడిగా నుండుట, చల్లని పానీయముల వల్లను, మాట్లాడుట వల్లను, రాత్రిపూట పడుకొన్నప్పుడు ఎక్కువగ గిలిగింతలు పెట్టు దగ్గు.

## 9. పీత జ్వరము
## (Yellow Fever)

ఇది దోమలచే వ్యాపించు అంటువ్యాధి. దీనిలో తీవ్ర జ్వరము, కామెర్లు, నల్లని వాంతి, మూత్రోత్పత్తి లేకుండుట మొదలైన లక్షణాలు ఉండును.

**• చికిత్స •**

**నేట్రంసల్ఫ్ :** తీవ్రమైన పైత్యముతో కూడిన, నియమిత కాల వ్యవధులలో హెచ్చుచు, తగ్గుచుండు జ్వరము - పైత్యము అధికముగా ఉండుట - ఆకుపచ్చ / పసుపు పచ్చ - గోధుమ / నల్లని పదార్థాన్ని వాంతి చేసుకొనుట.

**ఫెర్రంఫాస్ :** జ్వరము ఉన్నప్పుడు నేట్రంసల్ఫ్‌తో పాటు దీనిని వాడాలి. జ్వరము రావడానికి ప్రారంభమున దీనిని వాడాలి.

**కాలీఫాస్ :** నీరసముగా నుండుట - జీవశక్తి క్రుంగిపోవుట - గాఢమైన ఆకుపచ్చ / నీలపు / నల్లని వాంతి, రక్తస్రావము.

## 10. టైఫస్ జ్వరం
(Typhus Fever)

ఇది ఒక అంటువ్యాధిగ ప్రబలు జ్వరము. రోగి అధికముగ క్రుంగి యుండును. జ్వరము హెచ్చుగ నుండును. శరీరముపై తట్టు లేచును. జ్వరము 10 – 14 రోజులు ఉండును.

### • చికిత్స •

**ఫెర్రంఫాస్ :** టైఫస్ జ్వరము ప్రథమ దశలో ఈ మందును కాలీఫాస్‌తో మార్చాలి.

**కాలీమూర్ :** మలబద్ధకం – విరేచనాలు తేలిక రంగులో ఉండును.

**కాలీఫాస్ :** విషపు జ్వరము, క్యాంపులో వచ్చు జ్వరము, నాడీ జ్వరము, మెదడు జ్వరము, నేల / తోటలో వచ్చు జ్వరము – నాలుకపై గోధుమ రంగు పూత – చర్మం మీద ఏర్పడు చిన్న రక్తపు దద్దుర్లు – నిద్రలేమి – మెదడు విచిత్రముగా పని చేయుట – స్పృహ పూర్తిగ / కొద్దిగ కోల్పోవుట – సంధి.

**నేట్రంమూర్ :** టైఫస్ జ్వరము – స్పృహ పూర్తిగ / పాక్షికముగ కోల్పోవుట – నిద్రలేమి ఎక్కువగా నుండుట.

**నేట్రంఫాస్ :** నాలుకపై బంగారు పసుపు పచ్చ పూత – క్రీమువలె తడిగా నుండుట.

## 11. సూతికా జ్వరం
(Puerperal Fever)

ఇది ప్రసవము / గర్భస్రావము తర్వాత వచ్చు అపాయకరమగు జ్వరం. మావికి సంబం ధించిన పదార్థం గర్భములో కొలదిగ మిగిలిపోయి, కుళ్ళుటచే ఈ జ్వరం వచ్చునని చెప్పుదురు.

### • చికిత్స •

**కాలీమూర్ 6x :** సూతికా జ్వరానికి ఇదొక మందే సరిపోతుంది. దీనితోపాటు నీరసం ఉన్నచో దీనిని ఫెర్రంఫాస్‌తో మార్చి వాడాలి.

**కాలీఫాస్ 6x – 12x :** సూతికా జ్వరము – భ్రమలు, అసంబద్ధమైన ఆలోచనలు / తీవ్రమైన పిచ్చి – దీనికిది విశిష్టమైన మందు.

**నేట్రంమూర్ 6x :** సూతికా జ్వరములో లక్షణాలను బట్టి మందులు వాడుతూ దీనిని మధ్య – మధ్య వాడాలి.

# 3

# ఊపిరితిత్తుల / శ్వాసమండల వ్యాధులు

## (DISEASES OF THE RESPIRATORY SYSTEM)

### 1. ఆయాసం / ఉబ్బసం
(Asthma)

ఇది ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధి. ఇది ఏ వయస్సు వారికైనా రావచ్చు. కాని ఎక్కువగా వృద్ధులకు వస్తుంది. ఇది ఏ కాలములోనైనా, ఎప్పుడైనా రావచ్చు. కాని ఇది వర్షాకాలములోను, చలికాలములోను ఎక్కువగా వస్తుంది. ఈ వ్యాధిగలవారు ఆ ఋతువులు వస్తున్నాయంటేనే భయపడుతుంటారు.

ఉబ్బసం జలుబుతో ప్రారంభమవుతుంది. ముక్కు కారుతూ ఉంటుంది. తుమ్ములు వస్తుంటాయి. ఊపిరితిత్తులు చెడిపోయి ఊపిరిపీల్చుట కష్టమగును. కఫము చేరుకొని గురగుర లాడుచూ గొంతులో పిల్లికూతలు బయలుదేరును.

ఉబ్బసం వచ్చుటకు ముందు కొందరి గుండెలలో బరువు, తలనొప్పి, జలుబు, కడుపుబ్బరం, వికారం, నిద్రలేమి, మలబద్ధకం, నీరసం – ఈ లక్షణములన్నియు గాని, కొన్నిగాని కనిపించును. కొందరికి ఈ లక్షణములేమియు లేక అకస్మాత్తుగ వచ్చును. కొందరికి ఆకాశం మేఘావృతం కాగానే ఆయాసం రావచ్చు. కొందరికి ధూళి, కొన్ని రకముల పుప్పొడి వల్ల ఆయాసం వస్తుంది. కొందరికి ఘాటైన వాసనలను పీల్చుటవల్ల ఉబ్బసం రావచ్చు. చల్లని ఆహారం తినటం వల్ల కాని, మానసిక ఆందోళన వల్లకాని, వంశపారంపర్యంగా గాని ఈ వ్యాధి రావచ్చు.

ఆయాసం తెరలు తెరలుగ వచ్చుచుండును. ఈ తెరలు సామాన్యముగ రాత్రి యందు, అందు ముఖ్యముగా 2– 4 గంటల మధ్యకాలములో ఎక్కువగ కలుగుచుండును. ఉన్నట్లుండి ఊపిరి ఆడక రోగి నిద్రనుంచి లేచి కూర్చొనును. కఫ ప్రకోపముచే గొంతులో గురగుర, పిల్లికూతలు, గుండెలో బరువు, ఛాతీమీద పెద్ద బరువు నొక్కి యుండుట, శరీరమంతా చెమట పట్టుట మొ။ లక్షణాలు కనిపించును. ఊపిరి ఆడనందువల్ల రోగి ప్రాణం పోవునేమో అని తలంచును.

ఆయాసంతో బాధపడే రోగికి ఎటు కూర్చొన్నను కష్టమే. పడుకొనలేడు. ఆయాసమెక్కువ. ఊపిరి కొరకు పెనుగులాట సల్పుతూ ఆ రోగి ఈ క్రింది ప్రయత్నాలు చేయవచ్చు - 1) పడక కుర్చీలో కూర్చొనును. 2) మంచంమీద తన వీపు వెనుక పెద్ద దిండు పెట్టుకొని కూర్చొనును. 3) ముందు బల్లమీద / పరుపు మీద మోచేతులు ఆనించి కూర్చొనును. 4) కిటికీ / గుమ్మమును చేతులతో ఆనుకొని ముందుకు వంగి కూర్చొనును.

కఫము తెగిపడక ఆయాసము ఎక్కువగా ఉండును. కఫము తెగినచో బాధ తగ్గును. ఈ ఫిట్టు 2 - 3 గంటలు ఉండును. కొందరిలో ఇంకా ఎక్కువ కాలం ఉండవచ్చు. శ్లేష్మము పడి గుండెలో బరువు, ఆయాసం తగ్గును. రోగికి నిద్ర పట్టును.

ఏ కుటుంబంలో ఆయాసమునకు సంబంధించిన పూర్వ చరిత్ర వుండునో, ఆ కుటుంబంలోని ఆయాసంతో బాధపడే వ్యక్తి చికిత్సకు ఎక్కువ సమయం పట్టును. అలా కాకపోయినా ఈ చికిత్సకు అధిక కాలమే పట్టవచ్చు. ఈ విషయాన్ని అందరూ గుర్తించుకోవాలి.

**కారణాలు :**

1. హోమియోపతి విధానం ప్రకారం ఉబ్బసం రావటానికి ముఖ్య కారణాలు సోరా, సైకోసిస్ తత్త్వములు.
2. వాతావరణంలో మార్పులు.
3. శ్వాసనాళాలు మూసుకు పోవుట.
4. చలిగాలిలో ఎక్కువగా తిరుగుట.
5. చల్లని నీళ్ళలో తరచుగా స్నానాలు చేయుట.
6. అధిక శ్రమ, అలసట, మానసిక ఒత్తిడి.
7. జీర్ణకోశ వ్యాధులు, గుండె జబ్బులు.
8. కొన్ని రకాల మందుల సైడ్ రియాక్షన్ మొదలైనవి.

**నివారణోపాయాలు :**

1. మలబద్ధకం లేకుండా జాగ్రత్త పడాలి.
2. ఒకవేళ అధికముగ తిన్న తర్వాత ఉబ్బసం వచ్చినచో తిన్న ఆహారం వాంతి యగుటకు మందును వాడాలి.
3. ఉబ్బసం తీవ్రముగా ఉన్నచో వేడి నీరు / పానీయం త్రాగాలి. వెన్నెముక వెంబడి తోమినా, నీలగిరి తైలము (Eucalyptus Oil) తో దానిని మర్దన చేసినా, నల్ల ఉమ్మెత్త పొడి పొగను పీల్చినా ఉద్ధృతి తగ్గును.
4. శనగపిండి, వేరుశనగ నూనె, డాల్డాతో చేసిన వంటలు మానుకోవాలి.
5. తేలికైన ఆహారం తీసుకొని కొద్ది ఆకలితో లేచి పోవాలి.

6. సాయంకాలం పెందల కడనే భుజించి రాత్రి పడుకొనునప్పటికి జీర్ణమగునట్లు చూడాలి.
7. ఆయాసం కలిగించు శ్రమ పనికిరాదు.
8. మాంసాహారం వర్జించుట మంచిది.
9. మద్యం సేవించుట, పొగత్రాగుట, పాన్ పరాగ్‌లు నములుటవల్ల ఈ వ్యాధి అధికమగును.

## • చికిత్స •

**కాలీఫాస్ 3× – 6× :** నాడీ సంబంధమైన ఉబ్బసానికి ప్రధానమైన మందు. ఏ మాత్రం తిన్నా ఉబ్బసం వచ్చును. పుప్పొడి మొ॥ వాటివల్ల జలుబు, తుమ్ములు, కన్నీరు వచ్చును. కళ్ళు, గొంతు, ముక్కు వాచును. మెట్లెక్కునపుడు శ్వాస కష్టంగా వుండును. కళ్ళె దుర్వాసనగా ఉండును. ఈ మందును పెద్ద మోతాదులో ఎక్కువసార్లు వాడాలి. దీనిని మెగ్నీషియంఫాస్‌తో మార్చి ఇవ్వాలి.

**కాలీమూర్ 6× – 30× :** జీర్ణకోశ దోషముల వల్ల వచ్చు ఉబ్బసం – నాలుక దళసరిగా నుండును. దానిపై తెల్లని / ఆకుపచ్చ పూత – దానిపై బొచ్చు ఉన్న భావన – తెల్లని కళ్ళెని వెలువరించుటకు కష్టపడాలి – దగ్గవలసియుండును – ఊపిరి పీల్చుకొనుట కష్టమైనపుడు దీనిని కాలీఫాస్‌తో మార్చి వాడాలి. మలబద్ధకం ఉండును. గుండె, ఊపిరితిత్తులు బిగపట్టుకొనినట్లుండుట – గుండె సరిగ పనిచేయకపోవుట వల్ల కలుగు ఉబ్బసం ఊష్మ ధ్వనులతో యుండుట – కాలేయం సరిగా పనిచేయకపోవుట – ఈ మందును కాలీఫాస్‌తో మార్చి ఇవ్వాలి.

**నేట్రంమూర్ 6× – 12× :** ఉదయం 10 గంటలకు ఎక్కువగు ఉబ్బసం – లాలాజలం అధికంగా స్రవించుట – నురుగుతో నున్న కఫం అధికంగా వెలువడుట – ఇలాంటప్పుడు దీనిని కాలీఫాస్‌తో మార్చి వాడాలి. మలబద్ధకం, కడుపుబ్బరం– దగ్గినపుడల్లా కన్నీరు కారుట – ఊపిరి పీల్చుకొన్నపుడల్లా ఈడ్పు సంబంధమైన అదురు – ఏమాత్రం శ్రమించినా ఉబ్బసం.

**కాల్కేరియాఫాస్ 3× – 6× :** ఊపిరితిత్తులకు సంబంధించిన ఉబ్బసం ఉన్నప్పుడు లక్షణాలను బట్టి మందునిస్తూ దీనిని మధ్య–మధ్య వాడాలి. రంగులేని, చిక్కని కళ్ళె. ఉయ్యేలలో నుండి శిశువును పైకి తీసినపుడు ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి యగును.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** అతి కష్టముమీద చిన్న ముద్దల వంటి పసుపు పచ్చని కళ్ళె వెలువడును. దీనిని కాలీఫాస్‌తో మార్చి వాడాలి. శ్వాస అణచబడి యుండును. ఉపజిహ్వా మూయబడి యున్నట్లు లేదా ఏదో గట్టిగానున్న వస్తువు ద్వారా ఊపిరి పీల్చినట్లుండును.

**మెగ్నీషియంఫాస్ 3× – 6× :** నాడీ సంబంధమైన ఉబ్బసపు ఈడ్పులు – ఉదరకుహరము వాయువు (పిత్తలు)తో చేరి బాధాకరముగ నుండుట – ఆకస్మికముగను, ఉద్ధృతముగను ఆగి ఆగి వచ్చు దగ్గు. అది పొడిగాను, గిలిగింతలు పెట్టునదిగాను ఉండును – పడుకొనుట కష్టముగా నుండును.

**కాలీసల్ఫ్ 6× :** ఊపిరితిత్తులకు సంబంధించిన ఉబ్బసం – ఎండాకాలం / వేడి వాతావరణంలో ఉబ్బసం ఎక్కువగుట – చల్లగాలిలో ఉపశమనం – గడగడ ధ్వని చేస్తూ పసుపుపచ్చని కఫము వెలువడుట – ఏదైనా ఆహారం తీసుకొన్న ఉబ్బసం వచ్చుట – ముఖం రంగు మారుట – శుష్కించుట – కళ్ళు లోపలికి పోవుట.

**నేట్రంఫాస్ 6× :** పసుపు పచ్చని కఫముతో నున్న ఉబ్బసం.

**నేట్రంసల్ఫ్ 3× – 6× :** సైకోటిక్ తత్త్వముగల రోగిలో ఉబ్బసం తరచుగా వస్తున్నచో ఇది ముఖ్యమైన మందు. పిల్లలకు, యువకులకు వచ్చే ఉబ్బసములో ఇది బాగా ఉపయోగపడును. ఉదయం 4 – 5 గంటల సమయమున వ్యాధి ఉద్రేకించును. పొర్లు వచ్చును. దగ్గు ఉండును. కళ్ళె జిగురుగాను, మెత్తగాను, ఆకుపచ్చగాను, విస్తారముగాను ఉండును – తిన్న తర్వాత వాంతి యగును. జీర్ణవ్యవస్థ సరిగా లేనందున ఉబ్బసం వచ్చును. వర్షాకాలపు తేమ వాతావరణంలో ఉండుట వల్ల అధికమగు ఉబ్బసం – ఉదయం లేవగానే వదులుగా నుండు (loose) విరేచనం. ఉబ్బసం పూర్తిగా నివారణగుటకు ఈ మందును ప్రతి రాత్రి ఒక మోతాదు చొప్పున కొంతకాలం వాడాలి. చర్మవ్యాధులు అణగారుటచే వచ్చు ఉబ్బసానికి ఈ మందును కొన్ని వారాలు వాడిన తర్వాత కాల్కేరియా ఫాస్ 6× ను కొన్ని వారాలు వాడాలి.

**సైలీషియా 12× – 30× :** ఊపిరి పీల్చుకొనుట ఎంత కష్టమంటే కళ్ళు కంటిలొత్తుల (Eye-sockets) నుండి ముందుకు పొడుచుకొని వచ్చును. కళ్ళె పసుపు పచ్చగా, చీమువలె నుండును. తుఫానులో కూడా రోగి ఎల్లప్పుడు తలుపులు, కిటికీలు తెరచి ఉంచాలని కోరును. ఇది శరీర తత్త్వమునకు సంబంధించిన (constitutional) మందు. దీనిని నేట్రంసల్ఫ్‌తో యిచ్చిన ఉబ్బసం నిర్మూల మగును. శరీర పోషణ తక్కువగా నున్న వారిలోను, రాళ్ళు కొట్టువారిలోను, మట్టి / దుమ్ములో పనిచేయువారి లోను వచ్చు ఉబ్బసానికి మంచి మందు.

## 2. బ్రాంకైటిస్, బ్రాంకైటిస్ జలుబు / కళ్ళె దగ్గు - జలుబు
## (Bronchitis, Bronchial Catarrh)

**లక్షణాలు :** జలుబు తర్వాత శ్వాసనాళములందలి / ఊపిరితిత్తుల ఆమత్వక్కు వాచును. దీనివల్ల ఊపిరి పీల్చుట చాల కష్టమగును. ఛాతీ బిగించినట్లుండును. తరచుగా దగ్గు వచ్చి కళ్ళె పడుచుండును. శ్వాస సరిగా ఆడక పిల్లికూతలవలె శబ్దాలు వచ్చును.

**కారణాలు :** చలిగాలిలో తిరుగుట, దుమ్ము / ధూళి / పొగ / విషవాయువులు పీల్చుట, కోరింత దగ్గు, పొంగు వ్యాధిగ్రస్తులగుట మొదలైనవి ఈ వ్యాధికి కారణములు.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ :** శ్వాసనాళముల వాపు (తరుణవ్యాధి, దీర్ఘకాలిక వ్యాధి) – కళ్ళె లక్షణాలను బట్టి ఏ మందు వాడవలెనో, దానిని, ఈ మందుతో మార్చి వాడాలి – శ్వాసనాళముల క్షోభ – శ్వాస కష్టముగా నుండుట – వేడిమి, మంట, బాధ – శ్వాస పొట్టిగాను, అణచబడి యుండునది, తొందర పెట్టునది – చిన్న పిల్లల కేశనాళికల వంటి శ్వాసనాళోపశాఖల వాపు – హ్రస్వముగా నుండు ఈడ్పులు గల బాధాకరమైన దగ్గు.

**కాలీమూర్ :** ద్వితీయస్థాయి – చిక్కని, తెల్లని, దారమువలె సాగునట్టి కళ్ళె.

**కాలీసల్ఫ్ :** కళ్ళె పసుపుపచ్చగా, నీళ్ళగా, చాలా ఎక్కువగా ఉండుట లేదా ఆకుపచ్చగా, బంకగా, నీళ్ళవలె వుండుట – శ్వాసనాళముల ఆమత్వక్కు వాపు తగ్గుతున్నట్టి మొదటి సూచన.

**నేట్రంమూర్ :** శ్వాసనాళముల వాపు – కళ్ళె నురుగుతోను, స్వచ్ఛమైన నీళ్ళవలె వుండుట – గురగుర శబ్దమగుట – అతి కష్టంమీద దగ్గగలుగుట – చలికాలపు దగ్గు – శ్వాసనాళముల వాపు చాలా కాలము నుంచి వుండుట – కళ్ళె పారదర్శకముగను, జిగురుగను ఉండుట – బలహీనమైన స్వరం – గుండె వణకుట – సముద్ర తీరాన రోగి పరిస్థితి క్షీణించుట.

**కాల్కేరియాఫాస్ :** రక్తహీనతగల వారికి – కళ్ళె గ్రుడ్డుతెల్లసొనవలె ఉండుట.

**కాల్కేరియాసల్ఫ్ :** పసుపు పచ్చని / పసుపు–ఆకుపచ్చగా నుండు కళ్ళె – రక్తముతో కూడియుండుట – తగ్గు ముఖం పట్టిన సూచన – తృతీయదశ – మామూలు జలుబు (హెపార్ సల్ఫ్‌తో నయమగునట్టి జలుబు వంటిది).

**నేట్రంసల్ఫ్ :** చెమర్చుట / ఊరుట, మంటను, రాపిడిని కలిగించుట, దగ్గినపుడు ఛాతీని పట్టుకొన వలసి వచ్చుట – ఉదయానికి ఆయాసపు ఉద్ధృతి (spells) ఎక్కువగుట – చల్లగా, తడిగానున్న, వర్షాకాలపు వాతావరణములో ఆయాసం ఎక్కువగుట.

**8. సైలీషియా :** దగ్గు, జలుబువల్ల ఎక్కువగుట, వెచ్చని పానీయాల వల్ల తగ్గుట – చీము వంటి కళ్ళె నీటిపాత్ర అడుగున పడి మడ్డి వలె విస్తరించుట. రికెట్స్ వ్యాధిగల పిల్లల శ్వాసనాళము వాపు – శబ్దపేటికకు సంబంధించిన ఉదయపు దగ్గు.

## 3. దగ్గు
## (Cough)

దగ్గు ఒక ప్రత్యేక రోగము కాదు. అది ఒక రోగ లక్షణము. అది కొన్ని వ్యాధులు కలుగుటకు ముందుగాని, కొన్ని వ్యాధులలో మధ్యనగాని, కొన్నింటిలో చివరగాని

వచ్చుచుండును. క్షయ రోగములో జ్వరము, ఛాతీనొప్పి, రక్తము–చీము కలసిన కళ్ళెతోను దగ్గు వస్తుంది. ఉబ్బసములో రాత్రిపూట ఉన్నట్లుండి దగ్గువచ్చి విస్తారముగ కళ్ళె పడిన తర్వాత తగ్గుతుంది. న్యుమోనియాలో చిక్కని తుప్పు రంగు కళ్ళెతో దగ్గువస్తుంది. కోరింత దగ్గులో తెరలు తెరలుగ వచ్చి దగ్గు బాధించును.

**లక్షణాలు :** 1) గొంతు నందు, నోటియందు ముండ్లున్నట్లుండుట 2) ఏ పదార్థము మ్రింగలేక పోవుట 3) గుండెలో నొప్పి 4) కణతలు నొప్పి 5) తరచు దగ్గుట 6) వాంతి యగుట 7) స్వరము మారుట 8) ముఖము కృశించుట 9) దగ్గు పొర్లు పొర్లుగా వచ్చి ఉక్కిరిబిక్కిరి చేసి పడుకోనివ్వకపోవుట 10) కఫము వుండవచ్చు లేకపోవచ్చు. కఫమున్నచో నోరు జిగటగాను, అసహ్యముగాను ఉండును. అన్నము నందు రుచి యుండదు 11) పడిసెము, జ్వరము ఉండవచ్చు.

**కారణాలు:** 1) పొగ, దుమ్ము, నోటియందు, ముక్కులోను ప్రవేశించి శ్వాసను అడ్డగించుట. 2) చలిగాలి వల్ల పడిసెము ఏర్పడి ఊపిరితిత్తులు అనారోగ్యము చెందుట. 3) ఎక్కువగా దేహ శ్రమచేయుట. 4) పరిశుభ్రమైన గాలిరాని చీకటి ఇంటిలో నివసించుట. 5) సరైన ఆహారము తినకపోవుట వల్ల జీర్ణవ్యవస్థలో మార్పువచ్చుట, నులి పురుగులు వచ్చుట. 6) కొండనాలుక వాచుట. 7) గొంతు కండరాలు సంకోచించుట వల్ల గొంతు ఇరుకుగా అయి గ్లాటిస్ (కంఠబిలం) మూసుకొని పోవుట మొ॥ కారణాలు.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× - 12× :** శ్వాసనాళములో క్షోభవల్ల బాధాకరమైన, హ్రస్వమైన, గిలిగింతలు పెట్టే దగ్గు – పొడిగా, ఈడ్పులతో నుండు దగ్గు, ఊపిరితిత్తులలో బాధ, కఫము లేకుండుట – జలుబు వల్ల బాధాకరమైన దగ్గు – ఛాతీలో గడగడ ధ్వని చేస్తున్న శ్లేష్మముతో దగ్గు. ఈ దగ్గు రాత్రి పూట ఎక్కువగుట.

**కాలీమూర్ 3× – 6× :** బిగ్గరగ, ధ్వని చేస్తూ పొట్టలో నుండి దగ్గు వచ్చుట, నాలుకపై బూడిద వర్ణపు – తెల్లని పూత – కోరింత దగ్గువలె పొర్లు–పొర్లుగా హ్రస్వపు దగ్గు – పిల్లికూతలతో నున్న దగ్గు, కళ్ళు పొడుచుకొని వచ్చినట్లుండుట, తెల్లని – బూడిద వర్ణపు పూత – మొరటగు దగ్గుతో ఊపిరి పీల్చుట కష్టమగుట, దగ్గునపుడు శిశువు గొంతును గట్టిగ పట్టుకొనుట – విడువకుండ వచ్చునట్టి దగ్గు, బొంగురుతనము – దగ్గు, చిక్కని, పాలవంటి తెల్లని, బంకగాను, ఆల్బుమిన్‌తో నున్న కఫము – క్షయలో దగ్గు, పాలవంటి తెల్లని, చిక్కని, జిగటవలె పట్టుకొనెడి శ్లేష్మముతో – నాలుకపై తెల్లని పూత.

**కాలీఫాస్ 6× :** శ్వాసనాళపు క్షోభచే దగ్గు వచ్చుట – శ్లేష్మము చిక్కగా, పసుపుపచ్చగా, ఉప్పుగా, దుర్వాసనతో నుండుట – ఛాతీ పుండువలె నుండుట.

**కాలీసల్ఫ్ 3X – 6X :** పసుపు పచ్చని / నీళ్ళవలె నుండు కఫముతో దగ్గు వెలువడుట – వెచ్చని గది / సాయంకాలమున దగ్గు అధికమగుట – కఫము గొంతులోనికి జారిపడి మ్రింగబడుట – కఠినమైన, బొంగురుతనముతో నున్న దగ్గు, గొంతులో అలసట భావము – గడగడ ధ్వనిచేస్తూ దగ్గు వెలువడుట, కఫము అతి కష్టముమీద వెలువడుట.

**మెగ్నీషియాఫాస్ 3X – 6X :** ఈడ్పులతో పొరలు–పొరలుగా వచ్చు దగ్గు – రాత్రులందు కఫము లేకుండా ఈడ్పులతో వచ్చు దగ్గు, పడుకొనుట కష్టమగుట – కోరింత దగ్గు – గొంతు గుంట నుండి ఈడ్పు వచ్చుచున్నదని రోగులు పేర్కొందురు – దగ్గుట వల్ల ఊపిరితిత్తులు పుండుపడుట – నరాల బాధలతో బాధపడు శిశువుల పొడి దగ్గుకు ఈ మందు గురించి ఆలోచించాలి.

**కాల్కేరియాఫ్లోర్ 3X – 12X :** దగ్గు, కఫము, చిన్న చిన్న పసుపు పచ్చని ఉండలతో – కొండనాలుక సాగుట / కొండనాలుక గొంతులోనికి పడి పోవుట వల్ల, పడుకొన్నప్పుడు గొంతులో గిలిగింతలు, క్షోభ పెట్టే దగ్గు.

**కాల్కేరియాఫాస్ 6X – 12X :** ఆల్బుమిన్ వంటి పదార్థము కఫముగాగల దగ్గు – క్షయ వ్యాధిగ్రస్తుల దగ్గులో దీనిని మధ్య–మధ్య వాడాలి – పిల్లలలో ఈడ్పులుగల దగ్గు, పడుకొన్న తర్వాత ఉపశమనం.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** దగ్గినప్పుడు దుర్వాసనగల, పలచని, ఆకుపచ్చని సీరం వంటి ద్రవము కఫముగా పడుట.

**నేట్రంమూర్ 6X :** దగ్గు, అధికముగా నీళ్ళవంటి కఫము వెలువడుట – క్షయలో నీళ్ళవంటి కళ్ళె – దగ్గు వల్ల కాలేయములో కుట్టినట్టి నొప్పి – పొట్టగుంటలోని క్షోభవల్ల పొడిగా, హ్రస్వముగా నుండు దగ్గు పగలు – రాత్రి వచ్చుట.

**నేట్రంసల్ఫ్ 3X – 12X :** దగ్గినప్పుడు ఛాతీలో ఖాళీగా నున్నట్టి భావన – కఫము చీమువలె, చిక్కగా, త్రాడువలె, పసుపుపచ్చ–ఆకుపచ్చగా నుండుట – బాధను, బలహీనతను తొలగించుటకు ఛాతీని గట్టిగా పట్టుకొనవలసి వచ్చును – తేమ వాతావరణ మందు, వర్షాకాలమున, తెల్లవారుజామున (4 – 6 గంటల మధ్య) దగ్గు అధికమగును.

**సైలీషియా 6X – 12X :** చల్లని పానీయములను త్రాగుటవల్ల అధికమగు దగ్గు – ఛాతీ బాధకు, బలహీనతకు వెచ్చని, తడిగానున్న గాలివల్ల ఉపశమనము లభించును – ఉదయాన శ్వాసనాళపు దగ్గు, కఫము అతి కష్టముతో వెలువడుట – తలవంచుట/ వెల్లకిల పడుకొనుటవల్ల శ్వాస కష్టముగా వుండుట – దుర్వాసనగల, అధికమైన, పసుపుపచ్చ– ఆకుపచ్చ, గ్రీజు రుచిగల చీము కఫముగా వెడలుట – ఊపిరాడనీయని రాత్రి దగ్గు.

## 4. ఇసినోఫిలియా

దేహంలోని తెల్లరక్తకణాలలో ఉండే ఇసినోఫిల్స్ 4% కంటె ఎక్కువైనపుడు ఈ వ్యాధి వచ్చును.

**లక్షణాలు :** 1) పొడిదగ్గు వస్తూ ఆయాసంగా ఉండుట – 2) దగ్గు ఎక్కువగా ఉండుట – పిల్లి కూతలు 3) గొంతులోను, శరీరంపైన దురద 4) కళ్ళు ఎర్రబడుట 5) ఊపిరితిత్తులు కఫంతో నిండి ఉండుటచే ఊపిరి ఆడకపోవుట 6) రాత్రి పూట నిద్రపట్టక పోవుట.

**కారణాలు:** 1) ఎలర్జీ 2) మలంలో క్రిములు ఉండుట 3) గ్రంథుల వాపు 4) చర్మవ్యాధులు. 5) ఇన్‌ఫెక్షన్.

### • చికిత్స •

లక్షణాలను బట్టి మందును ఎంపిక చేయాలి. మందు ఎంపికలో ఆయాసం, బ్రాంకైటిస్ అధ్యాయాలు చూడవలెను.

## 5. కోరింత దగ్గు / కక్కాయి దగ్గు
## (Whooping cough / Pertussis)

ఇది ఒక విధమైన అంటు రోగము. ఇది ముఖ్యముగా పిల్లలకు ఎక్కువగ వచ్చుచుండును.

**లక్షణములు :** దీనికి మూడు దశలు గలవు –

**1. ప్రథమ దశ (జలుబుదశ) :** ఈ దశ జలుబు, దగ్గుతో ప్రారంభమగును.

**2. ద్వితీయ దశ (ఈడ్పులు గల దశ) :** ఈ వ్యాధి ప్రారంభమైన వారము రోజులకు ఈ దశ ప్రారంభమగును. దీనిలో దగ్గు ఎక్కువగును. ప్రారంభమున కంటె అతి తరచుగ వచ్చుచుండును. పిల్లవాడు దగ్గుతో ఉక్కిరిబిక్కిరి యగును. ముఖము నల్లబడును. ఉచ్ఛ్వాసములు ఈలవంటి ధ్వనితో ఉండును. కాకికూత వంటి ధ్వనులు బయలుదేరును. 'హుష్' అను ధ్వనితో ముగియును. ఒక్కొక్కసారి వాంతులు; ముక్కు, నోరు, చెవుల నుండి రక్త స్రావముండును.

దగ్గు సాధారణముగ రాత్రిపూట వచ్చును. ఫిట్స్ 2–3 గంటల కాల వ్యవధిలోగాని, ఇంకా తరచుగా గాని రావచ్చు. ఫిట్ వచ్చినపుడు శిశువు ఉక్కిరి బిక్కిరి యగును. దగ్గులేనప్పుడు పిల్లవాడు ఉల్లాసముగ నుండును. ఈ దశ సుమారు రెండు నెలలుండును.

**3. తృతీయ దశ (తగ్గు దశ) :** ఈ దశలో కళ్ళె / కఫము తెగి పడిపోవును. క్రమముగ వ్యాధి తగ్గును. పిల్లవాడు ఆరోగ్యవంతుడగును.

**కారణములు:** 1) అంటువ్యాధి 2) చలిగాలి తగులుట 3) తల్లిపాలలో / తిను ఆహారములో దోషములు.

ఈ వ్యాధి సాధారణంగా చలికాలములో ఎక్కువగును. దీనితోపాటు న్యుమోనియా వంటి వ్యాధి తోడైన ఇది చాల ప్రమాదకరముగా మారును.

**నివారణోపాయాలు :**

1. కోరింత దగ్గుతో బాధపడు పిల్లవానిని ఇతరులతో వేరుచేయుట మంచిది.
2. పిల్లవానిని చలిగాలిలో త్రిప్పకూడదు. తిరగనివ్వకూడదు. వెచ్చని దుస్తులతో కప్పి ఉంచాలి. గాలి, వెలుతురు బాగా ఆడే ప్రదేశంలో ఉంచాలి.
3. ఫిట్టు వచ్చినప్పుడు పిల్లవానిని లేవదీసి కూర్చోపెట్టాలి.
4. తేలికగా జీర్ణమగు ఆహారాన్ని పిల్లవానికి పెట్టాలి. ఆహారాన్ని కొద్దికొద్దిగా ఎక్కువ సార్లు ఇవ్వాలి.

## • చికిత్స •

ఫిట్టువచ్చి పిల్లవాడు ఊపిరి సలపక బాధ పడుచున్నప్పుడు మందివ్వ రాదు. ఏ మందు వాడినను ఫిట్టులకు మధ్య వాడాలి. దీనివలన గుణము కలుగునని డాక్టర్ టూకర్ వ్రాసియున్నాడు.

**ఫెర్రంఫాస్ 6X :** కోరింతదగ్గు ప్రథమ దశ – అవయవములు వాచుట – రక్తమును వాంతి చేసుకొనుట.

**కాలీమూర్ 6X :** కోరింత దగ్గు ద్వితీయదశ – హ్రస్వముగా నుండు ఈడ్పులుగల దగ్గు – నాలుకపై తెల్లని పూత – కళ్ళె తెల్లగా, చిక్కగా ఉండుట.

**నేట్రంమూర్ 6X :** కళ్ళె నురుగుగా, స్వచ్ఛముగా, దారమువలె ఉండుట.

**కాలీఫాస్ 6X :** నాడీ వ్యాధులుగల, పిరికి స్వభావము గల పిల్లల కోరింత దగ్గుకు దీనిని మధ్య – మధ్య వాడాలి. పిల్లవాడు క్షీణించుట ప్రారంభమైనపుడు దీనిని వాడాలి.

**కాలీసల్ఫ్ 6X :** కోరింతదగ్గులో పసుపు పచ్చని, బంకగా నుండు కళ్ళె పడునపుడు అది త్రాడువలె వుండును. క్రిందికి పడక, కొంతవరకు వచ్చి తిరిగి గొంతులోనికి పోవును.

**మెగ్నీషియంఫాస్ 6X – 12X :** ఈ రోగమునకు ప్రధాన ఔషధము. ఇది కోరింత దగ్గు అన్ని దశలలోను ఉపయోగపడును. దీనిని నిరంతరం ఇవ్వాలి.

**కాల్కేరియాఫాస్ 6X :** పాలిపోయి రక్తహీనతగల పిల్లలకు, శుష్కించుచున్న పిల్లలకు, దంతములు వస్తున్న పిల్లలకు, కోరింత దగ్గు మొండి కేసులకు ఇది మంచి మందు.

# 6. క్షయ
## (Pulmonary Tuberculosis / Phthisis Pulmonum)

క్షయ అనేది ఊపిరితిత్తులతో సహా దేహంలోని ఏ భాగానికైనా సోకును. ఊపిరి తిత్తులకు ఈ వ్యాధి సోకిన ఊపిరితిత్తుల క్షయ (Pulmonary Tuberculosis – P.T.B / Phthisis Pulmonum) అని పిలువబడును. ఈ వ్యాధికి కారణమైన సూక్ష్మ క్రిములను డాక్టర్ కోచ్ కనుగొనెను. కనుక ఈ వ్యాధిని కోచ్ క్షయ అని కూడా పిలుస్తారు.

**కారణాలు:** 1. ఇది అంటువ్యాధి. ట్యుబర్క్యులిస్ బాసిల్లనం (ఊపిరితిత్తుల సూక్ష్మక్రిముల) వల్ల ఒక వ్యక్తి నుండి మరొక వ్యక్తికి వ్యాపిస్తుంది. వ్యక్తుల సంసర్గం ఉండవచ్చు / లేకపోవచ్చు. ఈ వ్యాధి సోకి తరుణస్థితిలో నుండగ దగ్గినా / తుమ్మినా అసంఖ్యాకమైన సూక్ష్మక్రిములు బయటికి వచ్చును. ఆ సూక్ష్మక్రిములను శ్వాసతో పాటు లోనికి పీల్చుకొన్న వ్యక్తి సాధారణముగా ఈ వ్యాధికి గురి యగును. క్షయ రోగి కళ్ళెను ఉమ్మివేసిన క్షయ వ్యాధి కారకములైన సూక్ష్మక్రిములు గాలిలో ప్రవేశించును. ఆ గాలిని పీల్చిన వ్యక్తి ఈ వ్యాధికి గురి కావచ్చు. రోగి కళ్ళె మీద వాలిన ఈగలు ఆహార పదార్థములపై వాలును. ఆ ఆహార పదార్థములు తిన్న వ్యక్తులు ఈ వ్యాధిగ్రస్తులు కావచ్చు. అట్లే ఈ సూక్ష్మక్రిములు ప్రవేశించిన పానీయములను త్రాగినవారు, క్షయరోగుల పడకమీద కూర్చొన్నవారు, క్షయరోగుల వస్తువులను వాడినవారు కూడ ఈ వ్యాధికి గురి కావచ్చు. కనుక ఈ వ్యాధికి గురైన వ్యక్తులను వేరు చేసినచో వ్యాధిని వ్యాపించకుండా చేయవచ్చు. హోమియోపతి వైద్యశాస్త్రం ప్రకారం సోరా, సిఫిలిస్ ఈ వ్యాధికి కారణాలు. సోరా, సిఫిలిస్‌కి గురికాని వ్యక్తి ఈ సూక్ష్మక్రిములను పీల్చినా క్షయ రోగానికి గురికాడు. 2. కణాలలో లవణాలు తక్కువగుట – దీని వల్ల కణాలు తమ పనిని సరిగా చేయలేవు. అందువల్ల బాక్టీరియా అభివృద్ధి చెందుటకు అవకాశం కలుగును.

**లక్షణాలు :**

1. **జ్వరం :** సాయంకాలం అధికమై అర్ధరాత్రికి తగ్గును. కొద్దిపాటి చెమట ఉండును.
2. **దగ్గు :** దగ్గు కళ్ళెతో / కళ్ళె లేకుండా ఉండవచ్చు. కళ్లె తెల్లగ / ఆకుపచ్చగ / పసుపు పచ్చగ ఉండును. కొంతమందిలో కళ్ళె రక్తముతో కలిసి యుండును. దగ్గు లేకపోయినా క్షయవ్యాధి రావచ్చు. కొంతమందిలో దగ్గు బాగా క్షీణింపజేయును.
3. **శుష్కించుట :** కొంతమంది బాగా శుష్కించి పోవుదురు.
4. దగ్గునపుడు ఛాతీనొప్పి – ఏమాత్రం శ్రమించినా ఆయాసం.
5. గుండె కొట్టుకొను వేగం పెరుగుట (నిముషమునకు 120 సార్లు లేక అంతకంటే ఎక్కువ).

6. రక్తహీనత.
7. స్త్రీలలో బహిష్టు అణచిపెట్టబడుట.

**భవిష్యత్తులో వచ్చే క్షయను సూచించే లక్షణాలు :**

1. తరచుగ వచ్చే దగ్గు (కళ్ళెతో / కళ్ళె లేకుండ).
2. సాయంకాలమున ఉష్ణోగ్రత పెరుగుట.
3. వెసలుబాటు లేని జ్వరం.
4. చెమటపోయుట (ముఖ్యంగా తలపై).
5. శుష్కించుట.
6. ఆకలి లేకపోవుట.
7. సులభంగా జలుబుకు గురయ్యే స్వభావం.

**క్షయ వ్యాధి పరీక్షలు :**

1. **కళ్ళె పరీక్ష :** కళ్ళెతో AFB (Acid Fast Bacilli) పరీక్ష చేయించాలి. కళ్ళెలో AFB ఉన్నచో క్షయగా భావించాలి. ఈ పరీక్ష 100% నమ్మదగినది.
2. **×-రే పరీక్ష :** ఊపిరితిత్తుల ×-రే ఫోటో తీయించిన, ఫోటోలో ఆరోగ్యవంతమైన ఊపిరితిత్తులు నల్లని ఛాయగాను, దెబ్బతిన్న ఊపిరితిత్తులు అస్పష్టమైన తెల్లని ఛాయగాను కనిపిస్తాయి.
3. **రక్త పరీక్ష :** ఎర్రరక్తకణాల మడ్డి (ESR) ను, లింఫోసైట్లను లెక్కించుట జరుగుతుంది. సాధారణంగా ESR 10 మి.మీ., లింఫోసైట్లు (కణికలు లేని తెల్లరక్త కణాలు) 35% ఉంటాయి. కాని క్షయ వ్యాధిగ్రస్తులలో ఇవి ఎక్కువగా ఉంటాయి.

**క్షయ వల్ల ఏర్పడు చిక్కులు :**

1. **దగ్గులో రక్తం పడుట :** ఒకసారి దగ్గినప్పుడు దానిలో రక్తం పడిన పెద్ద సమస్యేమీ కాదు. కాని కళ్ళెలో అధిక రక్తం పడిన ప్రమాదమును సూచించును.
2. **ఊపిరితిత్తులలో రంధ్రములు ఏర్పడుట :** కొన్ని సందర్భాలలో అక్కడక్కడ ఊపిరితిత్తుల ధాతువులు నాశనమై రంధ్రాలు ఏర్పడును. అప్పుడు ఆ రంధ్రాలలో కళ్ళె పేరుకుపోవును. కళ్ళెను బయటికి పంపుటకు రోగి బాగ దగ్గవలసి యుండును. కొన్ని సందర్భాలలో రంధ్రాలు ఎక్కువగుటచే ఊపిరితిత్తిలో కొంతభాగం శస్త్రచికిత్స చేసి తొలగించబడును.
3. ఊపిరితిత్తులకు పుండు ఏర్పడుట
4. ఊపిరితిత్తులు ముడుచుకొనిపోవుట

**నివారణోపాయాలు :**

1. రోగిని ఇతరులకు దూరంగా ఉంచాలి.

2. రోగి మలమూత్రములను తగు జాగ్రత్తలతో దూరం చేయాలి.
3. రోగిని తేమగల ప్రదేశంలో ఉంచరాదు.
4. రోగి గది మంచిగాలి, వెలుతురు వచ్చేటట్లు ఉండాలి.
5. రోగికి పౌష్టిక ఆహారమివ్వాలి. పాలు, గ్రుడ్లు, పండ్లు బాగ ఉపయోగపడును.
6. లోపించిన లవణాలను ఇవ్వాలి.

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 6× – 12× :** రక్తహీనతగల రోగులలో ప్రారంభమవుతున్న క్షయ – శరీరంపై అధిక చెమట, ముఖ్యంగా మెడ, తలపైన – శుష్కించుటను తగ్గించుటకు మీగడ, కొద్దిగా కాడ్ లివర్ నూనె ఇవ్వాలి – క్షయ రోగుల దీర్ఘకాలపు దగ్గు – రాత్రిపూట చెమట, కాళ్ళు – చేతులు చల్లగ ఉండుట – దీర్ఘకాలపు నీళ్ళ విరేచనాలు – కొద్దిపాటి జ్వరం – బొంగురుతనం – నియంత్రణ లేకుండానే నిట్టూర్పు – ఊపిరాడకుండుట– బాధగను, పొడిగను వున్న గొంతు, ఛాతీలో మందస్థితిలో నున్న నొప్పితో దగ్గు – వీటితో పాటు / వీటి తర్వాత గుదములో రంధ్రాలు.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** చీముతో నున్న కళ్లె – రక్తం కలిసిన సీరం – క్షయరోగుల దగ్గులో ఆకుపచ్చని, పసుపు పచ్చని స్రావం గడగడ ధ్వని చేస్తూ వెలువడు దగ్గు.

**కాలీఫాస్ 6× :** ఏ మాత్రం కొద్దిగ కదిలినా హ్రస్వ శ్వాస – కుళ్ళిన వాసనతో నున్న కళ్లె.

**కాలీమూర్ 6× :** తెల్లని, చిక్కని కళ్ళె.

**నేట్రంసల్ఫ్ 6× :** ఊబ శరీరంగల క్షయరోగులు – చీముతో నున్న కళ్ళెగల దగ్గు – ఎడమవైపున నున్న ఊపిరితిత్తి క్రింది భాగం క్షయగ్రస్తమగుట – ఛాతీలో అంతా పోయినట్లు అనిపించుట.

**నేట్రంమూర్ 6× :** ఏమాత్రం శ్రమపడినా అనారోగ్యము పాలగుట – పగటిపూట నిద్ర – రాత్రిపూట అస్తిమితం – కాలనియమం ప్రకారం వచ్చునట్టి ఈడ్పులుగల దగ్గు – ఛాతీలో గుడగుడ ధ్వని, రక్తపు కళ్ళె – సాయంకాలమున పడుకొన్న తర్వాత ఈ లక్షణాలన్నీ ఉద్రేకించుట – తలకు రక్తం అధికంగా ప్రసరించుట, ఎర్రబడిన ముఖం, దీర్ఘకాలం నుంచి వున్న జలుబు – రుచి, వాసన పూర్తిగ నశించుట – సముద్రతీరం వద్ద రోగి లక్షణాలు ఉద్రేకించుట–ఉదయాన ఊపిరితిత్తుల ఊర్ధ్వభాగాన కళ్ళె కూడుట – ఖాళీ పొట్టతో ఏదైనా మ్రింగిన దగ్గు వచ్చుట.

**సైలీషియా 12× – 200× :** కంపుకొట్టెడు చీముగల స్రావాన్ని అధికంగా స్రవింపజేయుట – రాత్రిపూట పొర్లతో వచ్చే దగ్గు – రొమ్మెముక పల్లంలో గిలిగింతలు పెట్టే దగ్గు – చర్మంపై క్షయకు సంబంధించిన కంతులు (tumors) – శుష్కించుట, రాత్రిపూట అధిక

చెమట – పాదములకు చాల ఎక్కువగ ఉండు చెమట – ఎక్కువ మలబద్ధకం – గుదము / పురీషనాళము మలాన్ని బయటికి పంపలేక పోవడం వల్ల మలం కొద్దిగ విసర్జింపబడి మిగిలినది వెనుకకు నెట్టబడుట–రోగి శరీరం ముఖ్యంగా పాదాలు చల్లగ ఉండుట – శక్తి అంతయు కోల్పోవుట–వదులుగా నున్న, గడగడ ధ్వని చేయుచున్న దగ్గు; చిక్కని, పసుపు పచ్చని, ఆకుపచ్చని చీముతో నున్న విస్తారముగ నున్న కళ్ళె–పుట్టుక నుండి వున్నట్టి /వంశపరంపరగా వచ్చు క్షయ వ్యాధులకు ఇది మంచి మందు–క్షయ రోగపు చివరి దశలో డాక్టర్ హోల్‌కంబే ఈ మందును 6000 పొటెన్సీలో వాడి చక్కని ఫలితాలను పొందాడు.

**ఫెర్రంఫాస్ 6× – 12× :** శ్వాస హ్రస్వంగాను, భారంగాను, తొందరపెట్టునదిగ వుండుట, వేడిమి, జ్వరం లక్షణాలతో – స్వరాన్ని ఎక్కువగ వాడుట (ఎక్కువసేపు మాట్లాడుట), ఉపన్యాసము చెప్పుట / పాటలు పాడుట మొ॥ వల్ల వచ్చు బొంగురుతనం – బహిరంగ ప్రదేశంలో దగ్గు, ఉద్రేకించుట – క్షయ వ్యాధిలో కళ్ళెలో ప్రకాశవంతమైన ఎర్రని రక్తం నురుగు అధికముగ ఉండుట – ముక్కు నుండి రక్తం కారుట – నాజూకుగా ఉండు వ్యక్తులలో రక్తస్రావం మొదటి లక్షణమైన ఇది బాగ పనిచేయును – రోగికి జలుబు చేసి, శక్తి కోల్పోయి రక్తజీరతో నున్న కళ్ళె యున్నచో ఈ మందు 300 పొటెన్సీలో కూడ త్వరగ పనిచేసి ఊపిరితిత్తుల రక్తాధిక్యతను తొలగించును – శ్వాసనాళముల / స్వరపేటికల రక్తస్రావం – స్వరపేటిక, కంఠనాళపు క్షోభ వలన తరుణ, పొడిగా నుండు గిలిగింతలు పెట్టే దగ్గుతో వుండుట.

## 7. ఊపిరితిత్తిపై పుండు / ప్లూరసీ (Pleurisy)

ప్లూరా అనునది ఊపిరితిత్తిపై ఉండు రెండు పొరల తొడుగు. ఈ ప్లూరా ఊపిరితిత్తిని శ్వాసక్రియలో రాపిడి కలగకుండా కాపాడుతుంది. ప్లూరా రెండు పొరల మధ్య ఖాళీస్థలం వుండును. వ్యాధులలో ఈ ఖాళీస్థలంలో ద్రవం చేరును. ప్లూరా నొప్పి, వేడి, వాపుతో ఉండుటను ప్లూరసీ అని అందురు.

ప్లూరా రెండు పొరల మధ్య ద్రవం కూడనిచో డ్రయ్ ప్లూరసీ (Dry Pleurisy) అనియు, రెండు పొరల మధ్య ద్రవం కూడినచో వెట్ ప్లూరసీ (Wet Pleurisy) అనియు, చీము చేరిన పర్యులెంట్ ప్లూరసీ (Purulent Pleurisy) అనియు అందురు.

**లక్షణాలు :** ప్లూరసీ వ్యాధిలో వాపుతో పాటు చలి జ్వరం, ఛాతీయందు నొప్పి (సూదితో కుట్టుచున్నట్టు/ కత్తితో పొడుచుచున్నట్టు), దగ్గు, హ్రస్వ శ్వాస ఉంటాయి. వాపు కొన్ని రోజుల తర్వాత తగ్గును.

**కారణములు :** న్యుమోనియా, క్షయ / ఇన్‌ఫ్లూయంజ వ్యాధి సోకుట.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6× -12× :** జ్వరం, ఆకస్మికమగు చురుకైన నొప్పి, శ్వాస పట్టు పట్టుచుండుట, హ్రస్వదగ్గు, పొట్టిశ్వాస, శ్వాసతీసుకొనుట కష్టంగాను, తొందరగాను వుండుట.

**కాలీమూర్ 6× :** మెత్తగ చెమర్చుట వున్నప్పుడు ఇది రెండవ మందు - ఇది చికిత్సను పూర్తి చేయును.

**నేట్రంమూర్ 6× - 12× :** సీరం చెమర్చినపుడు ఈ మందును వాడాలి.

**కాల్కేరియాసల్ఫ్ 6×-12× :** ప్లూరా పొరలందు /ఊపిరితిత్తులలో చీము చేరుట, శ్వాస కష్టంగా ఉండుట, నాలుకపై వివిధ ఆకృతుల మచ్చలు, ప్లూరా పొరలలోనికి సూదిని గ్రుచ్చి ద్రవంతీసిన తర్వాత ఈ మందు బాగా ఉపయోగపడునని డాక్టర్ ఓ.ఎస్. హైనెస్ పేర్కొన్నాడు.

**కాల్కేరియాఫాస్ 6× - 12× :** దీర్ఘకాలపు ప్లూరసీ, పుండుగ నుండు నొప్పి, ప్రతి శ్వాస నొప్పితో యుండుట, రాత్రిపూట దగ్గు అధికముగ నుండుట, కొద్దిపాటి జ్వరం / జ్వరం లేకుండుట, తీక్షణముగా లేని నొప్పులు - అకస్మాత్తుగ వాతావరణంలో మార్పులు వచ్చిన నొప్పులు అధికం అగుట.

## 8. ఊపిరితిత్తుల వాపు
## (Odema of the lungs)

**కాలీఫాస్ 6×-12× :** ఊపిరితిత్తుల వాపు - ఈడ్పులుగల దగ్గు - భయపెట్టు ఆయాసం - కమలిన[1] ముఖాకృతి - ఊపిరితిత్తుల వాపు (తరుణవ్యాధి) - నురుగు, సీరపు పదార్థాలను అధికంగా బహిర్గతం చేయుట.

**నేట్రంమూర్ 6× - 12× :** ఊపిరితిత్తుల వాపు - ఊపిరితిత్తుల శ్వాసనాళ శాఖల లైనింగులో నీళ్ళవంటి కఫం, సీరం, నురుగు అధికంగా చేరుట.

## 9. కింకవాయువు
## (Croup)

ఇది శ్వాసకోశములకు సంబంధించిన వ్యాధి. సాధారణముగ రెండు మొదలు ఎనిమిది సంవత్సరముల వయస్సు కలిగిన పిల్లలకు, బలమైన దృఢ శరీరముగల మగ పిల్లలకు, క్షయరోగ పీడితులైన తల్లిదండ్రులకు పుట్టిన పిల్లలకు (Scrofulous children) ఈ వ్యాధి తరచుగా వస్తుంది.

*1. **కమలిన రంగు :** అనగా నీలి - నలుపు రంగు. కముకు దెబ్బచే గాని, రక్తప్రసరణాధిక్యతచే గాని, ప్రాణవాయువు తక్కువగుటచే గాని ఇట్లు కలుగును.*

**లక్షణములు :** ఈ వ్యాధి రెండు రకములు.

**1. మొదటి రకము :** ఈ వ్యాధి ప్రారంభమగుటకు ముందు బాలునకు జలుబు చేయును. జ్వరం వచ్చును. మొరుగుచున్నట్టి దగ్గు. గద్గద స్వరం, ముఖం ఎర్రబడును. ఆయాసం, వేగవంతమైన నాడి. ఈ లక్షణాలు పగలు తక్కువ, సాయంకాలమగు నప్పటికి ఎక్కువగును. కళ్ళు జ్యోతులవలె ప్రకాశించును. 2 – 3 రోజుల తర్వాత సాయంకాలం ఎక్కువగు లక్షణాలు రాత్రి పూట ప్రకోపించును. దగ్గు ఈలవేయుచున్నట్లు ఉండును. ఊపిరి పీల్చుట కష్టమగును. కనుక బాలుడు అకస్మాత్తుగ నిద్రనుంచి లేచును.

**2. రెండవ రకము :** దీనిలో ఈ వ్యాధి ప్రారంభమగుటకు పూర్వం బాలుడు పగలంతయు సుఖముగా ఆడుకొనును. సాయంకాలం మామూలుగానే ఉండును. కాని పడుకొన్న తర్వాత రాత్రిపూట బాలునకు అకస్మాత్తుగా దగ్గు వచ్చును. ఊపిరాడక బాలుడు నిద్ర నుంచి లేచి కూర్చొనును. ఒకసారి ఫిట్ వచ్చిన తర్వాత బాలుడు కొద్దిసేపు నిద్రించును. కాని వెంటనే ఫిట్ వచ్చును. బాలుడు తిరిగి లేచి కూర్చొనును. దగ్గు పొడిగా నుండును. ఆయాసం వచ్చును. ఊపిరిపీల్చుట కష్టమగును. బాలునకు స్థిమితముండదు. పడుకొనలేడు. బాలుడు తల్లి చేతుల మీద ఆనుకొని యుండును. మెడ వాచి యుండును. ముఖం ఎర్రగా ఉండును. ఫిట్సు మధ్య దప్పిక ఉండును. కాని గొంతు నొప్పి వల్ల త్రాగలేడు. మూత్రవిసర్జన చేయదలచినా పూర్తిగా చేయలేడు. కొద్దిగా మాత్రమే మూత్రవిసర్జన చేయును. ఆ బాలుని దగ్గు ప్రారంభమున కోడికూత వలె యుండును. హీన స్వరముండును. తర్వాత పొడిదగ్గు రంపపు కోతవలె యుండును.

**కారణములు :**

1) చలిగాలి సోకుట. 2) వాతావరణ స్థితిలో అకస్మాత్తుగ మార్పు వచ్చుట. 3) బాలుడు తరచుగ తడికాళ్ళతో ఉండుట. 4) బాలునకు సరియైన పోషక ఆహారం లభించకపోవుట. 5) బాలుని నివాస స్థానం తడిగా, చీకటిగా, పల్లంగా ఉండుట. 6) లోగడ జ్వరం, పొంగు, మసూచికం వంటి వ్యాధికి బాలుడు గురియై వుండుట.

**నివారణోపాయాలు :**

1. రోగికి పంచదారను వేడినీళ్ళలో కలిపి ఇవ్వటం ద్వారా దగ్గును నివారించవచ్చు.
2. గొంతుకు వేడినీటి కాపడం పెట్టాలి.
3. బాలుని ముతక వస్త్రముతో కప్పుట.
4. ఆవిరిని బాలుడు పీల్చునట్లు చేయుట.
5. చలిగాలిలో పిల్లలను బయట తిరగకుండా చేయుట.
6. రోగము తీవ్రముగానున్నపుడు మంచినీళ్ళను మాత్రమే రోగికి ఇవ్వాలి. ఏమియు ఇవ్వరాదు. రోగము కొద్దిగా నెమ్మదించిన పిమ్మట పాలు, నీళ్ళు కలిపి ఇవ్వవచ్చు.

**• చికిత్స •**

**కాలీమూర్ 6X :** ఆమత్వక్కులు చెమర్చుచున్న ఈ మందు ప్రధానమైనది. దీనిని ఫెర్రంఫాస్‌తో మార్చాలి. దొంగ కింక వాయువుకు ముఖ్యమైన మందు. కఫము చిక్కగ, తెల్లగ, జిగురుగ వుండును. నాలుకపై తెల్లని పూత.

**ఫెర్రంఫాస్ 6X–12X :** ఈ వ్యాధి ప్రారంభమున జ్వరమున్నప్పుడు దీనిని వాడదగును. శ్వాస హ్రస్వముగను, పొడిగను వుండి తొందర పెట్టుచున్న దీనిని వాడాలి. దీనిని కాలీమూర్‌తో మార్చాలి.

**కాల్కేరియాఫాస్ 6X–12X :** ఫెర్రంఫాస్ ఉపయోగపడనప్పుడు దీనిని వాడాలి. ఉయ్యేలలో నుంచి బిడ్డను పైకి తీసినపుడు, బిడ్డకు సపర్యలు చేసిన తర్వాత, బిడ్డ ఏడ్చిన తర్వాత బిడ్డకు ఊపిరాడకుండుట – బిడ్డ తల వెనుకకు తిరుగుట–బిడ్డ ముఖం నీలంగా మారుట – బిడ్డ కాళ్ళు – చేతులతో కుస్తీ పట్టిన తర్వాత విశ్రాంతి పొందుట–ఈ లక్షణాలు ఉన్నప్పుడు ఈ మందును వాడాలి.

**కాల్కేరియాఫ్లోర్ 3X–12X :** ఈ వ్యాధికి ముఖ్యమైనది. పై మందులు పనిచేయనిచో దీనిని వాడదగును.

**కాలీఫాస్ 6X :** ఈ వ్యాధి చివరిదశలో బాలుడు స్పృహ కోల్పోయి శోషిల్లుట – నాడీమండలం అలసట – ముఖం పాలిపోవుట – నిస్త్రాణ – కమిలిన రంగుతో నున్న ముఖం – ఈ లక్షణాలున్నప్పుడు దీనిని కాలీమూర్‌తో మార్చి వాడాలి.

**మెగ్నీషియంఫాస్ 6X–12X :** శ్వాసనాళము ఈడ్పులు ఆగిపోవుట –అకస్మాత్తుగ గొంతు బొంగురుపోవుట – ఊపిరాడని దగ్గు.

**కాలీసల్ఫ్ 6X :** బాలుని ఆమత్వక్కులు చెమర్చుచున్న ఈ మందును వాడిన తర్వాత చెమర్చుట ఆగిపోవును. గట్టి ఆమత్వక్కు మెత్తబడుట వల్ల, గట్టి శ్లేష్మం గొంతులో ఉండుట వల్ల చాల ఇబ్బందిగా ఉన్నప్పుడు దీనిని వాడనగును.

## 10. ఎక్కిళ్ళు
## (Hiccough / Singultus)

రొమ్మునకు, ఉరమునకు మధ్య విభాజక పటలము (Diaphragm) వుండును. అది ఒక పరదా వంటిది. అది ఒక కండరస్నాయు బంధనము. కొన్ని సందర్భాలలో ఉదరములో వాయువు ఎక్కువై విభాజక పటలములో కదలికలను తెచ్చును. ఆ కదలికల వలన స్వరపేటిక మూసుకొనిపోవును. అప్పుడు లోనికి వచ్చు గాలి హిక్ హిక్ శబ్దము చేయును. అవే ఎక్కిళ్ళు.

**కారణములు :**

1. మిరపకాయల వంటి పదార్థముల ఘాటు వలన
2. మలబద్ధకము కలుగజేయు పదార్థములు తినుట
3. బాగా చల్లగా నుండు అన్నపానాదులను సేవించుట
4. పొగ, దుమ్ము
5. అతిశ్రమతో కూడిన పనులు చేయుట
6. ఉపవాసము
7. పైత్యాధిక్యత
8. చల్లని గాలి తగులుట

**నివారణోపాయాలు :**

1. ఎక్కిళ్ళు స్వల్పముగానున్నచో మంచినీళ్ళు త్రాగాలి.
2. శిశువుకు ఎక్కిళ్ళు వచ్చినచో వెచ్చగ వుంచు వస్త్రాలు ధరింపజేయాలి. వెచ్చని దుప్పటి / శాలువ కప్పాలి. స్తన్యపానము చేయించాలి. దీనివల్ల సాధారణముగ ఎక్కిళ్ళు తగ్గును. ఇట్లు చేసినను ఎక్కిళ్ళు తగ్గనియెడల, చిన్న చెంచాడు పంచదార కలిపిన నీటిని పట్టించవలయును.
3. గుడ్డ కాల్చి పొగను రోగి ముక్కు వద్ద పెట్టిన ఎక్కిళ్ళు తగ్గును. – **ఛటర్జీ.**
4. కొన్ని సెకన్లపాటు నోటిని, ముక్కు రంధ్రాలను మూసి ఉంచుటవల్ల ఎక్కిళ్ళు తగ్గును.

**• చికిత్స •**

**నక్సువామికా 6× :** మలబద్ధకము కలిగించు పదార్థాలను తినుట – మలబద్ధకముండుట.

**మెగ్నీషియాఫాస్ 12× :** మొండిగా నున్న ఎక్కిళ్ళు – ఎక్కువ బాధ కలుగజేయుట – ఇతర మందులు వాడినా తగ్గనప్పుడు మెగ్నీషియం ఫాస్‌ను 15 నిమిషములకు ఒకసారి వేడినీళ్ళతో ఇవ్వాలి.

**నేట్రంమూర్ 6× :** క్వినైనును విస్తారముగా వాడిన తర్వాత వచ్చు ఎక్కిళ్ళకు పనిచేయును.

## 11. గురక
## (Snore)

శబ్దప్రేరితమైన శ్వాసను గురక అని అంటారు. ఇది చిన్న అంగిలి మరియు కొండనాలుక వణకు వలన సంభవిస్తుంది. శరీర ధర్మశాస్త్రం దృష్ట్యా ఇది సుఖనిద్రను తెలుపును. రోగ లక్షణశాస్త్రం ప్రకారం క్రొవ్వు వల్ల గొంతుమార్గం సన్నగిల్లుట వలన శ్వాసకు ఏర్పడిన అడ్డును తెలుపును.

గురక భార్యాభర్తలలో సమస్యలు సృష్టిస్తుంది. ఒకరి గురక మరొకరి నిద్రకు ఆటంకం కలిగిస్తుంది. చాలా వరకు భార్యాభర్తలు వేరు–వేరు గదులలో నిద్రించి సమస్యను పరిష్కరించుకొంటున్నారు. పాశ్చాత్య దేశాలలో గురక నెపంతో భార్యాభర్తలు విడాకులు తీసుకొన్నట్లు తెలుస్తుంది. నేడు మనదేశంలో కూడా పాశ్చాత్య పోకడలు ఎక్కువ అవుతున్నాయి. ఆర్థిక స్వాతంత్ర్యం, వ్యక్తిత్వం మొదలగు విషయాలను గురించి స్త్రీలు ఎక్కువగా వాదిస్తున్న రోజులు వచ్చాయి. భవిష్యత్తులో ఏమి జరుగనున్నదో!

గురక సాధారణంగా బాగా లావుగా ఉన్నవారికి, పొట్ట ఉన్నవారికి, తినగానే పడుకొనేవారికి ఎక్కువగా వచ్చే అవకాశం ఉంటుంది. ఇలాంటి వారి ఊపిరితిత్తులు 25, 30 శాతం మూసుకుపోతాయి. కనుక వారు రెండు ముక్కు రంధ్రాల ద్వారా పీల్చే గాలిలోని ఆక్సిజన్ తిన్న ఆహారాన్ని జీర్ణం చేయుటకు, శ్వాసక్రియకు సరిపోదు. అందువల్ల ఎక్కువ గాలి నోటిలోనుండి లోపలకు వెళ్ళుతుంది. కనుక వివిధ రకాల మోతలు వినిపిస్తాయి.

**నివారణోపాయాలు :**

1) సాయంకాలం 6 గంటలకు పూర్వమే భోజనం చెయ్యాలి. మహాత్మాగాంధీగారు ఇలాగే చేసేవారు. రాత్రి పడుకొనేటప్పటికి తిన్న ఆహారం జీర్ణమవుతుంది. దీనివల్ల పడుకొన్నప్పుడు ముక్కు రంధ్రాల గుండా పీల్చేగాలి శ్వాసక్రియకు సరిపోతుంది. కనుక గురక అవసరమే ఉండదు. 2) సాయంకాలం కేవలం పండ్లను మాత్రమే తినాలి. జీర్ణం చేయుటకు ఎక్కువ ఆక్సిజన్ అవసరం ఉండదు. కనుక పడుకొన్నప్పుడు గురక పెట్టాల్సిన పని ఉండదు. 3) బరువు తగ్గించుకోవాలి. 4) గురక పెట్టే వ్యక్తి నిద్రపోయిన స్థానాన్ని మార్చినను అతని గురక తగ్గును. శ్రీ షిర్డీసాయి తనతోపాటు పడుకొని గురకపెట్టే వారిని అలా చేసేవారట.

## 12. దుమ్ము, ధూళి సరిపడక పోవుట (Dust Allergy)

పుప్పొడి, ఆహారపదార్థం, ఔషధం కొంతమంది శరీరంలోనికి ప్రవేశించినా లేదా ఆ శరీరములను ఆశ్రయించి జీవించు పరాన్నజీవుల శరీరంలోకి ప్రవేశించినా వారి శరీరంలో నుండు కణజాలములు విపరీతముగా సంచరించి వ్యాధికి గురియగును. అట్లే కొంతమందికి దుమ్ము, ధూళి, పొగ పడవు. కొందరికి తాళింపు వేస్తున్నా గిట్టదు. ఆ సందర్భములలో వారికి తుమ్ములు రావచ్చు / ముక్కులు బిగదీయవచ్చు / గొంతులో నుసనుసగా ఉండవచ్చు / దగ్గు రావచ్చు / దురద రావచ్చు / ముఖం ఎరుపు ఎక్కవచ్చు.

ఈ బాధ ఉన్న స్త్రీలు మానసికంగా కూడా బాధ పడ్తారు. ఇంట్లోని దుమ్ము, ధూళి దులుపుకొని శుభ్రం చేయాలన్నా బాధ. వండిన ఆహార పదార్థాలకు పోపు పెట్టాలన్నా బాధ. పరిసరాలు అన్నీ వాతావరణ కాలుష్యంతో నిండిపోతున్న ఈ రోజులలో బయటికి పోవాలన్నా బాధ. ఇన్ని రకాలుగా ఈ వ్యాధిగ్రస్తురాలు బాధ పడుతూ ఉంటుంది. ఇతరులకు చెప్పుకోలేని బాధతో సతమతమవుతూ ఉంటుంది.

**నివారణోపాయాలు :**

1) ప్రతిరోజు త్రాగుతున్న నీటిని గోరువెచ్చగా చేసుకొని త్రాగాలి. 2) ప్రతిరోజు ఉదయాన దీర్ఘశ్వాసల ప్రాణాయామం 20 – 30 నిముషాలపాటు చేయాలి. దీనివల్ల ముక్కులో నున్న ఇన్‌ఫెక్షన్ తొలగిపోతుంది. 3) ముఖానికి కొద్దిగా నూనె రాసి ఆవిరిపట్టాలి. రోజుకు కనీసం ఒకసారైనా చేయాలి. 4) వ్యాధి నిరోధక శక్తిని పెంచే ఆహారం తినాలి.

# 4

# రక్తప్రసరణ మండల వ్యాధులు

## (DISEASES OF THE CIRCULATORY SYSTEM)

### 1. రక్తస్రావము (Haemorrhage)/(Hemorhage) ముక్కునుండి రక్తస్రావం (Epistasis)

రక్తనాళముల నుండి రక్తము కారుటను రక్తస్రావము అని అంటారు. ఏ అవయవం నుండి రక్తము స్రవించినా భయము కలుగుట సహజము. కొన్ని సందర్భాలలో రక్తస్రావమగుట స్వాభావికము కావచ్చు. కాని ఎక్కువ రక్తస్రావం కాకుండా జాగ్రత్త వహించవలెను. కారణమేదైనా రక్తస్రావానికి వెంటనే చికిత్స అవసరం.

ఏదైనా ప్రమాదం జరిగినప్పుడు రక్తస్రావం కావచ్చు. శిశువు తల్లి యొక్క గర్భాశయంలో నుండి భూమి మీదకు రాగానే తల్లి గర్భాశయం నుండి రక్తస్రావమగును. వ్యాధుల వల్ల కొంత మందికి మస్తిష్కములో నెత్తురు కారుతుంది. ఊపిరితిత్తులు / ముక్కు నుండి రక్తస్రావము అగును.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6× - 12× :** గాయాల నుండి బయటా – లోపల రక్తస్రావమగుట – దెబ్బ తగులుటవల్ల / ఇతర కారణాల వల్ల ముక్కు నుండి ప్రకాశవంతమైన, ఎర్రని రక్తము కారుతున్న ఈ మందు సరిపోతుంది – ప్రకాశవంతమైన ఎర్రని రక్తము కారి వెంటనే గడ్డకట్టుచున్న ఈ మందు బాగా ఉపయోగపడును – ప్రకాశవంతమైన ఎర్రని రక్తమును వాంతి చేసుకొనుట – త్వరగా ఎదుగుతున్న పిల్లలలో ముక్కు నుండి రక్తము కారు స్వభావము ఉండుట.

**కాలీమూర్ 3× - 6× :** రక్తము నల్లగా, గడ్డలుగా, బంకగా నుండుట – మధ్యాహ్నం తర్వాత ముక్కు నుండి రక్తము కారుట.

**కాల్కేరియాసల్ఫ్ 6× - 12× :** ముక్కు నుండి రక్తము స్రవించుట – చీమిడి రక్తపు జీరతో ఉండుట.

**కాలీఫాస్ 3× - 6× :** బలహీనముగా, కోమలముగా ఉన్నవారి లేక ముసలివారి ముక్కు నుండి రక్తస్రావమగుట – చిగుళ్ళ నుండి రక్తస్రావమగుటకు ముందు ముక్కు

నుండి రక్తము కారుట – కాఫీ విత్తనముల రంగులో వుండు రక్తము, పలచని, గడ్డకట్టని రక్తము స్రవించుట – రక్తము దుర్వాసన గొలుపుట – కుళ్ళిన వాసన వచ్చుట.

**నేట్రంమూర్ 6× – 12× :** ఎర్రని, పలుచని, నీళ్ళవలె ఉండు, గడ్డకట్టని రక్తము స్రవించుట – అవయవముల బాధతో దగ్గుటకు ముందుకు వంగగా ముక్కు నుండి రక్తస్రావమగుట.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** అధిక శ్రమ వలన తరచుగా వచ్చు హ్రస్వమైన దగ్గు వల్ల ఊపిరితిత్తుల నుండి ఎర్రని రక్తము స్రవించుట.

**నేట్రంసల్ఫ్ 3× – 6× :** ముక్కు నుండి రక్తము కారుట, వాంతి, విరేచనం.

## సారాంశం

| లక్షణము | మందు |
|---|---|
| 1. ప్రకాశవంతమైన ఎర్రని రక్తము– రక్తము వెంటనే గడ్డకట్టుట. | ఫెర్రంఫాస్ 6× – 12×. |
| 2. ఎర్రని రక్తము – రక్తము గడ్డ కట్ట కుండుట – ముందుకు వంగినపుడు | నేట్రంమూర్ 6× |
| 3. ఎర్రని రక్తము – దగ్గినప్పుడు ఊపిరి తిత్తుల నుండి పడుట. | కాల్కేరియాఫ్లోర్ 6× |
| 4. కాఫీ విత్తనముల వంటి రక్తము – పలచని, గడ్డకట్టని రక్తము. | కాలీఫాస్ 6× |

## ముక్కు నుండి రక్తస్రావము

| | |
|---|---|
| 1. ఎర్రని రక్తము–రక్తము వెంటనే గడ్డ కట్టుట | ఫెర్రంఫాస్ 6× – 12× |
| 2. ముక్కు నుండి రక్తము కారుట, వాంతి, విరేచనాలుండుట – బహిష్టులో. | నేట్రంసల్ఫ్ 6× |
| 3. ముక్కునుండి రక్తము కారుట, చీమిడి రక్తపు జీరతో నుండుట. | కాల్కేరియా సల్ఫ్ 6×. |
| 4. ముక్కు నుండి కాఫీ గింజల వంటి రక్తము | కాలీఫాస్ 6× |
| 5. మధ్యాహ్నము తర్వాత ముక్కు నుండి నల్లని, గడ్డలున్న, బంకగా నున్న రక్తము | కాలీమూర్ |
| 6. వంగినా, దగ్గినా ముక్కు నుంచి రక్తస్రావం | నేట్రంమూర్ 6× |

## ౨. రక్తక్షీణత / హీనత
## (Anaemia)

మన శరీరంలో ప్రతిరోజూ కొన్ని కోట్ల ఎర్రరక్త కణాలు చనిపోతూ ఉంటాయి. ఈ ఎర్ర రక్త కణాలు తక్కువగా ఉన్నా, రక్తానికి రంగును ఇచ్చే హిమోగ్లోబిన్ అనే పదార్థం తక్కువగా ఉన్నా, రక్త క్షీణత / హీనత అని అంటారు. పురుషుల కంటె స్త్రీలలో ఈ వ్యాధి ఎక్కువగా ఉంటుంది. ప్రతినెల ఋతుక్రమంలో స్త్రీలు అధికంగా రక్తాన్ని కోల్పోతూవుంటారు. గర్భిణీ స్త్రీలకు, పాలిచ్చే తల్లులకు రక్తం అధికంగా అవసరం అవుతుంది.

**లక్షణాలు :** రక్త క్షీణత / హీనత గలవారిలో ఈ లక్షణాలు ఉంటాయి –

1. నీరసం
2. గుండె వేగంగా కొట్టుకొనుట.
3. ఒగుర్పు
4. ముఖం, కళ్ళు, అరచేతులు, గోళ్ళు మొ॥వి పాలిపోయినట్లుండుట
5. శరీరం ఉబ్బుట

**నివారణోపాయాలు :** రక్తక్షీణత గలవారికి హిమోగ్లోబిన్‌ను అందించే ఐరన్ కావాలి. ఐరన్‌ను గ్రహించుటకు విటమిన్ 'సి' కావాలి. అందువల్ల ఐరన్, విటమిన్ 'సి' గల ఆహారాన్ని తీసుకొంటే రక్తక్షీణత తగ్గుతుంది. ఐరన్, విటమిన్ 'సి' పొందుటకు ఈ క్రింది వాటిని తీసుకోవాలి –

1. క్యారెట్, నాటు టమోటా, కీర దోసకాయలు, బీట్‌రూట్ – ఈ నాలుగింటిని కలిపి రసం తీసి, వడగట్టాలి. ఆ రసాన్ని పెద్ద గ్లాసునిండా తీసుకొని అందులో తేనె 3, 4 స్పూన్లు వేసి, దానిలో నిమ్మరసం పిండాలి. తేనె త్వరగా రక్తంలో కలుస్తుంది. నిమ్మరసంలో ఉండే 'సి' విటమిన్ కూరగాయల రసంలోని ఐరన్‌ను ఆకర్షించ గలుగుతుంది. ఇట్టి రసాన్ని ఉదయం 7 – 8 గంటలప్పుడు త్రాగాలి.
2. ఖర్జూరంలో ఐరన్ ఉంటుంది. కనుక రోజుకు 10 – 15 ఖర్జూరాలు తినవచ్చు.
3. సాయంకాలం 4, 5 గంటలప్పుడు పుల్లగా ఉండు పండ్లరసం త్రాగాలి.

### • చికిత్స •

**కాల్కేరియాఫాస్ 3× – 6× :** ఇది క్రొత్త రక్తకణాలను వృద్ధి అయ్యేటట్లు చేయును. నొప్పులు, ఈడ్పులు రక్తక్షీణత పరిస్థితులపై ఆధారపడి యుండుట – రక్తహీనత వల్ల చర్మం మైనం వలే జిడ్డు గాను, ఆకుపచ్చ – తెల్లగాను వుండుట – స్థిరమైన తలనొప్పి – చెవులలో మ్రోత – ఎర్ర కణముల ఉత్పత్తి సహజముగ లేకపోవుటచే కలుగు రక్తక్షీణత

– మేల్కొన్నప్పుడు / కూర్చొని లేచునపుడు కలుగు తలనొప్పి – కళ్ళు మసకగా వుండుట – ముక్కు నుండి రక్తస్రావం – పాలిపోయిన ముఖం – పసుపు పచ్చగాను, మట్టిగాను వున్న ముఖం – దేహం, ముక్కుకొన చల్లగా ఉండుట – ముఖం మీద చల్లని చెమట – దుర్వాసన గొలుపు రుచి – నాలుక తెలుపు – ఉదయాన నాలుక ముందు భాగాన బొచ్చు వున్నట్టి భావన – వికారం – వాంతి– కడుపు మీద గల ఉదర కుహర మండలము శూన్యముగను, క్రుంగిపోయినట్లు వుండుట – పగలు / రాత్రి పూట విరేచనాలకు వెళ్ళాలనిపించుట – ఉన్నివంటి మడ్డి అడుగు భాగాన గల మూత్రం – ఋతుస్రావం అత్యధికముగా నుండుట – రక్తం ప్రకాశవంతమైన ఎరుపుగ / అధిక నలుపుగ ఉండుట – నాడి ఆందోళనకరముగా నుండుట – ఆ తర్వాత వణికెడి బలహీనత (ముఖ్యంగా మడిమల వద్ద) – అలసట, అధిక బలహీనత మొ॥ లక్షణాలు ఉన్నప్పుడు దీనిని వాడాలి.

క్షయ వంటి వ్యాధుల తర్వాత రక్తములో తెల్ల కణాలు అధికమైన (Leucaemia) ఇది ముఖ్యమైన మందు. సూష్లర్ ప్రకారం పోషణ సరిగాలేకపోవుటచే వచ్చునట్టి మెదడుకు సంబంధించిన రక్తహీనతకిది మంచి మందు.

**ఫెర్రంఫాస్ 3X :** పై మందు వాడిన తర్వాత ఆరోగ్యం బాగుపడి, వ్యవస్థలో ఎర్రరక్తం తక్కువైనపుడు ఈ మందును వాడాలి. ఆక్సిజన్‌ను ఆకర్షించే శక్తి కలిగియున్న ఈ మందు కొత్త రక్తకణాలకు ఎరుపురంగు వేసి వాటిని వృద్ధి చేయును.

**కాలీమూర్ 6X :** రక్తహీనతతో పాటు చర్మంపై గజ్జి / కురుపులు ఉన్నప్పుడు ఈ మందును వాడాలి.

**కాలీఫాస్ 6X :** మెదడుకు సంబంధించిన రక్తహీనత మనస్సును (Mind), నాడీవ్యవస్థను నిరంతరం క్రుంగదీసినచో ఈ మందు బాగా ఉపయోగపడును. ఈ మందు క్రింది రోగాలను కూడా నయం చేయును –

i) రక్తములో తెల్లకణాలు అధికమగుట.

ii) డిఫ్తీరియా[1] వంటి రోగాలవల్ల కలిగే వెన్నెముక రక్తహీనత.

iii) విశ్రాంతి వల్ల అధికమయ్యే నొప్పులకు, కదలుటకు ప్రారంభించినపుడు వచ్చే నొప్పి.

**నేట్రంమూర్ 6X :** రక్తం పలుచగా నీళ్ళవలె ఉండుట – యువతుల రక్తహీనత – వీపులో శీతలత్వం – గుండె తరచుగా, వడిగా, బలముగా కొట్టుకొనుట – ఛాతీలో ఆందోళన – ఛాతీ భారంగా ఉండుట – ఉదయపు దగ్గు– తేలికగా అలసిపోవుట, శక్తి కోల్పోవుట – నాలుక శుభ్రంగాను, దానిపై వెంట్రుక ఉన్నట్లు భావన – మలేరియా

*1. **డిఫ్తీరియా (Diphtheria) :** దీనిలో మెడ వాచును. టాన్సిల్స్, కొండనాలుక, ముక్కు రంధ్రముల పైపొర వంటిది ఏర్పడి ఊపిరాడక పోవచ్చును.*

జ్వరం, క్వినైన్ వాడకం వల్ల శుష్కించుట – పాలిపోవుట – పొట్టపై ఒత్తిడి – పొట్ట వాపు – గుదం సంకోచించుటవల్ల ఏర్పడిన మలబద్ధకం – అమితమైన విచారం.

**నేట్రంఫాస్ 6× :** వెన్నెముక రక్తహీనత – కాళ్ళ పక్షవాతపు బలహీనత – శక్తి కోల్పోవుట – కొంచెం దూరం నడిచినా, మెట్లు ఎక్కినా పొట్ట బరువుగాను, ఆకలిగాను ఉన్నట్టి భావన – కాళ్ళు ఎడమగా వుంచుట వల్ల ముందుకు వెళ్ళలేకపోవుట.

**నేట్రంసల్ఫ్ 6× :** వాతావరణపు తేమను బట్టి / తడిగానున్న ఇండ్లలో ఉండుటను బట్టి కలిగిన రక్తహీనత – నెలలు నిండిన గర్భవతి రక్తములో రక్తకణాల కన్నా ప్లాస్మా అధికముగా నుండుట – సైకోసిస్ తత్త్వం – ఊబ శరీరం.

**సైలీషియా 6× :** బహిష్టుకు బదులుగా కుసుమ – తాత్కాలికముగా ఏర్పడు అంధత్వం – ఈ లక్షణములతో పాటు వున్న రక్తహీనతకు ఇది మంచి మందు. శిశువులకు, సన్నగా, దుర్బలముగా, నిస్త్రాణతో ఉండి సూక్ష్మమైన స్వభావం కలిగి యుండి, రికెట్స్ వచ్చే ప్రవృత్తి కలిగిన వారికి బాగా ఉపయోగపడును.

**ద్వాదశ మిశ్రమం :** ప్రతి మోతాదులో ఫెర్రంఫాస్ 3× – 1 మాత్ర + కాల్కేరియా ఫాస్ 6× –1 మాత్ర + నేట్రంమూర్ 6× –1 మాత్ర + కాలీఫాస్ 6× –1 మాత్ర మొత్తం 4 మాత్రలు రోజుకు 3 సార్లు.

## 3. రక్తనాళపు కంతి
## (Aneurism)

ధమనులలో ఎలాస్టిక్ తంతువులు సడలుట వల్ల వాటి గోడలు ఉబ్బును. ఆ ఉబ్బినవి పగులుట వల్ల రక్తం వేగంగా ప్రవహించును. దీనివల్ల కంతి ఏర్పడును. ఈ కంతి కారోటెడ్ ధమనిలోను, గజ్జలలోను, మోకాలి వెనుక భాగమున వచ్చును. ఇది సిఫిలిస్, రుమాటిజమ్, గౌటు వ్యాధులు కలవారిలోను, త్రాగుడు అలవాటున్నవారిలోను, ఎక్కువ అలసట చెందినపుడు ఏర్పడును.

### • చికిత్స •

**కాల్కేరియాఫ్లోర్ 6× :** ఇది ప్రధానమైన మందు. దీనిని వ్యాధి ఆరంభంలోనే వాడిన వ్యాధిని అదుపులో పెట్టును/తగ్గించును. పొటాష్ అయొడైడ్ వాడనిచో దీనిని ఫెర్రంఫాస్‌తో మార్చి వాడిన మంచి గుణం కనిపించును.

**ఫెర్రంఫాస్ 12× :** దీనిని వెంటనే వాడిన రక్తప్రసరణను మామూలు స్థితికి తేవచ్చును. గుండె అధికముగా కొట్టుకొనుట వల్ల ఏర్పడు ఇబ్బందులను సవరించవచ్చు. రక్తనాళపు చిన్న కంతులలో గుండె అధికముగా కొట్టుకొనుచున్నచో దీనిని కాల్కేరియా ఫ్లోర్ 6×తో మార్చి వాడాలి.

# 4. రక్తపీడనం
## (Blood Pressure)

మన దేహంలో నిరంతరం రక్తం ప్రాణవాయువును, ఇతర పోషక పదార్థాలను వేరువేరు ధాతువులకు అందిస్తూ ఉంటుంది. ఇది శుద్ధమైన రక్తం. ఇది ధమనుల గుండా ప్రవహించే రక్తం. తన పని పూర్తయిన తర్వాత రక్తం వేరు వేరు ధాతువుల నుండి కార్బన్ డయాక్సైడ్, అనేక వ్యర్థ పదార్థాలను ప్రోగుచేసుకొని గుండెకు చేరును. ఇది అపరిశుద్ధమైన రక్తం. ఇది సిరలగుండా ప్రవహించును.

హృదయం నుండి ధమనుల ద్వారా శరీర అవయవాలకు పంపబడే రక్తం ఎక్కువ పీడనంతో పంపబడుతుంది. జఠరిక సంకోచ, వ్యాకోచాల సమయాల్లో ధమనులందలి రక్తపీడనం వేర్వేరుగా ఉంటుంది. జఠరిక సంకోచించినపుడు రక్తం ధమనుల లోనికి నెట్టబడుతుంది. అందువల్ల పీడనం హెచ్చుగా ఉంటుంది. దీనినే సంకోచిత రక్తపీడనం (Systolic Pressure) అని అంటారు. జఠరిక వ్యాకోచించినపుడు ఈ పీడనం తగ్గుతుంది. దీనిని వ్యాకోచిత పీడనం (Diastolic Pressure) అని అంటారు. ఒక ఆరోగ్యవంతుని సంకోచిత రక్తపీడనం 120 మి.మీ., వ్యాకోచిత పీడనం 80 మి.మీ. దీనిని 120/80గా వ్రాస్తారు.

ఆరోగ్యవంతునిలో సంకోచిత పీడనం ఎప్పుడూ ఒకే విధంగా ఉండదు. అది వయస్సునుబట్టి మారుతుంది. ఇది పురుషులలోకన్నా స్త్రీలలో కొంచెం తక్కువగా ఉంటుంది. ఇది ఉదయం కన్నా సాయంత్రం, భోజనం చేసిన వెంటనే, వ్యాయామం చేసిన తర్వాత, భయాందోళనలలో, కోపం వచ్చినప్పుడు ఎక్కువగను, నిద్రలో చాలా తక్కువగను ఉంటుంది. కాని వ్యాకోచిత పీడనం మారదు. వ్యాకోచిత పీడనం హెచ్చినప్పుడే అధిక రక్తపీడనం/హెచ్చురక్తపు పోటు అనియు, వ్యాకోచిత పీడనం సాధారణ పీడనం కన్నా బాగా తగ్గితే అల్పరక్తపీడనం (Hypo tension or low B.P.) అని అంటారు.

దేహంలోని అన్ని ధమనులలో పీడనం ఒకే విధంగా ఉండదు. గుండెకు దగ్గరగా వున్న ధమనులలో కన్నా దూరంగా ఉండే ధమనులలో పీడనం తక్కువగా ఉంటుంది. సాధారణంగా భుజములో పోవు ధమని రక్తపీడనాన్ని స్ఫిగ్మో మేనోమీటరు సాధనం ద్వారా కొలిచెదరు. వివిధ వయస్సుల వారి High B.P., Low B.P. వివరాలు క్రింది పట్టికలో తెలుపబడినాయి.

## సంకోచిత రక్తపీడనం సరాసరి విలువలు

| వయస్సు | ఆరోగ్యవంతునిలో సరాసరి పీడనం | అధిక B.P. | అల్ప B.P. |
|---|---|---|---|
| 15-30 సం॥ | 123 | 142 | 104 |
| 30-40 సం॥ | 126 | 143 | 107 |
| 40-50 సం॥ | 128 | 147 | 110 |
| 50-60 సం॥ | 133 | 150 | 117 |
| 60-70 సం॥ | 138 | 156 | 121 |

***గమనిక :*** *స్త్రీలలో పై విలువల కన్నా కొంచెం తక్కువగా ఉంటుంది.*

## 5. అధిక రక్తపీడనం / రక్తపోటు
## (High Blood Pressure/Hyper tension)

రక్తపీడనం 150/100 ఉంటే అధిక రక్తపీడనం/రక్తపోటు అని అంటారు. అది మూడు రకాలుగా ఉంటుంది.

1) **ప్రైమరీ హైపర్ టెన్షన్ :** దీనికి కారణం తెలియదు.
2) **సెకండరీ హైపర్ టెన్షన్ :** దీనిలో కారణం ఉండును. దేహంలో ఏదో అవయవంలో ఉన్న వ్యాధి వల్ల వచ్చు హైపర్ టెన్షన్. ఉదా॥ కిడ్నీ వ్యాధిలో హైపర్‌టెన్షన్.
3) **మారణమైన (Malignant) హైపర్‌టెన్షన్ :** దీనిలో B.P. 200/140 మి.మీ. ఉండును.

పైవాటిలో మొదటి రకానికి, మూడవ రకానికి చికిత్స లేదు. కనుక ఇచ్చట రెండవ రకంపై చర్చ చేయబడింది.

**లక్షణాలు :** 1) ఎక్కువ తలనొప్పి, 2) తలత్రిప్పు, 3) జ్ఞాపక శక్తి తగ్గుట, 4) ఏ విషయంపైన మనసు కేంద్రీకరించ లేకుండుట 5) తలపై భారం ఉన్నట్లుండుట, 6) ఆకలి తక్కువగుట 7) వమన వికారం, 8) నిద్ర లేమి 9) సులభంగా అలసట చెందుట 10) శ్రమ కలిగించెడి వ్యాయామం వల్ల తలనొప్పి 11) కొద్దిగా చిరాకు పడుట.

**కారణాలు :** 1) హార్మోన్ల సమతుల్యం లేకుండుట 2) మూత్రపిండముల వ్యాధులు (ఉదా: మూత్రపిండముల వాపు, మూత్రపిండములకు రక్తసరఫరా సరిగా లేకుండుట మొ॥) – ప్రోస్టేట్ గ్రంథికి కలిగిన ఆటంకాలు 3) ప్రధానమైన రక్తనాళమగు బృహద్ధమని చిన్నదగుట 4) గర్భవతి రక్తంలో సూక్ష్మక్రిములచే గాని, ధాతువులు పాడగుటచే గాని విష పదార్థములు ఏర్పడుట 5) దీర్ఘకాలం నుంచి వున్న మలబద్ధకం, అజీర్తి వంటి

వ్యాధులు 6) ఎక్కువ శ్రమ/శారీరక శ్రమ లేకుండుట 7) మితిమీరి ఆహారం తీసుకొనుట – ఆహారంలో ఉప్పు ఎక్కువగా ఉండుట 8) సుఖ జీవనానికి అలవాటు పడుట 9) ప్రతి చిన్న విషయానికి మనసులో బాధపడి ఆరాటపడుట 10) ఉద్రేకం చెందుట 11) ఆందోళన/ ఒత్తిడి – ఎక్కువగా ఉండుట 12) సారాయి, పొగ త్రాగుడుకు అలవాటు పడుట.

**నివారణోపాయాలు :**

1) సులభముగా జీర్ణమయ్యే పదార్థాలు తినాలి. కొద్దిగా తగ్గించి తీసుకోవాలి. 2) క్రొవ్వుపదార్థాలు, మసాలా దినుసులు, ఉప్పు మానుకోవాలి. 3) గొర్రె మాంసం చాలావరకు తగ్గించాలి. 4) లావుగా నున్నవారు పిండి పదార్థాలు తగ్గించాలి. 5) ఉద్రేక పరచు కాఫీ, సారాయి/మద్యం, పొగ త్రాగుట విసర్జించాలి. 6) బాగుగ నమలి నెమ్మదిగ తినాలి. 7) మలబద్ధకం రాకుండ జాగ్రత్త పడాలి. 8) చన్నీటిస్నానం కన్నావేడి నీళ్ళ స్నానం మంచిది. 9) మానసిక ఆందోళన లేకుండా చూసుకోవాలి. 10) మధ్యాహ్న భోజనం తర్వాత కొద్ది విశ్రాంతి తీసుకోవాలి. 11) రాత్రిపూట కలతలు లేని నిద్ర పొందాలి. 12) అప్పుడప్పుడు విహారయాత్రలకు వెళ్ళి దైనందిన జీవితపు ఒడిదుడుకులను మరచిపోవాలి. 13) ఉప్పు మానుకొంటే కొద్ది నెలలలోనే ఈ వ్యాధి నుండి నివారణ పొందవచ్చు. కాని ఉప్పు మానుకోవటానికి 15 రోజుల ముందు నుండే రోజూ 3–4 లీటర్ల నీరు త్రాగాలి. అట్లే పచ్చికూరల రసం త్రాగాలి. మొలకెత్తిన విత్తనాలు, పండ్లు తినాలి. ఇలా చేస్తే సహజ సిద్ధమైన ఉప్పు దేహానికి లభిస్తుంది. ఉప్పువల్ల కలిగే లాభాలు పొందగలుగుతాము. అందువల్ల ఉప్పు మానివేసినా నష్టమంటూ ఏమీ ఉండదు. మొలకెత్తిన విత్తనాల వల్ల పొటాషియం, మెగ్నీషియం లవణాలు లభిస్తాయి.

**• చికిత్స •**

రోగలక్షణాలను, రోగకారణాలను తెలుసుకొని చికిత్స చేసిన ప్రయోజనం లభించును.

**ఫెర్రంఫాస్ 12× :** గుండె ఎక్కువ వడిగా కొట్టుకొనుట – రక్తపుపోటు ఉద్ధృతంగా ఉండుట.

**ద్వాదశ లవణముల మిశ్రమం :** ప్రతి మోతాదులోను ఫెర్రంఫాస్ 12×–1 మాత్ర, కాల్కేరియా ఫ్లోర్ 6×–1 మాత్ర, కాలీఫాస్ 6×–1 మాత్ర, మెగ్నీషియం ఫాస్ 6×–1 మాత్ర చొప్పున మొత్తం 4 మాత్రలు గోరువెచ్చని నీటితో తీసుకోవాలి. ఈ విధంగా రోజూ ఉదయం, రాత్రి కొన్ని నెలల పాటు వాడాలి.

## 6. అల్ప / తక్కువ రక్తపీడనం
## Low Blood Pressure (L.B.P.) / Hypotension

సంకోచిత రక్తపీడనం (రక్తపోటు) 110 మి.మీ. కన్నా తక్కువగా ఉన్న దానిని అల్ప/రక్తపీడనం అని అంటారు. కొందరు అల్పరక్తపీడనం అంటూ ఏదీ లేదని చెబుతారు.

**లక్షణాలు :** 1) తలనొప్పి 2) తలత్రిప్పు 3) కండరాలలో అలసట 4) మానసిక నిస్త్రాణ 5) మలబద్ధకం 6) తలమీద ఒత్తిడి, బరువు 7) కాళ్ళు - చేతులు చల్లగా ఉండుట 8) కొంచెం పనిచేసినా అలసిపోవుట 9) రక్తప్రసరణ నెమ్మదిగా జరుగుట.

**• చికిత్స •**

**1. కాలీఫాస్ 6× :** అల్పరక్తపీడనమునకు ఇది మంచి మందు.

**2. ద్వాదశ లవణ మిశ్రమం :** కాల్కేరియా ఫాస్ 6× - 1 మాత్ర, కాలీఫాస్ 6× - 1 మాత్ర, నేట్రంమూర్ 6× - 1 మాత్ర చొప్పున మొత్తం మూడు మాత్రలు ఒక మోతాదు - ఉదయం, రాత్రి తీసుకోవాలి.

## 7. గుండె జబ్బులు
## (Heart Diseases)

గుండె మన శరీరంలోని ప్రతి జీవకణానికి రక్తం అందజేస్తుంది. రక్తం ద్వారా ఆమ్లజని/ఆక్సిజన్, పోషక పదార్థాలూ అందిస్తుంది. తాను నిరంతరం శ్రమించటానికి కావలసిన ఆమ్లజనిని, పోషక పదార్థాలను పొందుటకు కావలసిన రక్తాన్ని సరఫరా చేసుకొంటుంది. అంతేగాక దేహం అతిగా కష్టపడవలసిన సమయంలో దానికి అవసరమైన ఆమ్లజనిని, పోషక పదార్థాలను సరఫరా చేయుటకై అధిక రక్తాన్ని సరఫరా చేస్తుంది. తాను ఆ సందర్భములో అధికంగా శ్రమించాల్సి ఉంటుంది. కనుక తనకు కూడా అధిక రక్తాన్ని సరఫరా చేసుకొంటుంది.

ఈ పనులన్నీ చేయాలంటే రక్తమును సరఫరా చేసే ధమనులు సాగుదల శక్తిని, స్థితి స్థాపక శక్తిని కలిగి ఉండాలి. వాటిలో ఎలాంటి అడ్డంకులు ఉండరాదు. అవి పాక్షికంగా గాని, పూర్తిగా గాని పూడిపోయి వుండరాదు.

కాని నేడు స్త్రీ-పురుష భేదం కాని, వయస్సు తేడా కానీ ఏమీ లేకుండా అందరికీ గుండె వ్యాధులు వస్తున్నాయి. చిన్నపిల్లలు కూడా ఈ వ్యాధికి గురియగుట మరింత విచారింపదగిన విషయం. ఏ మాత్రం గుండెనొప్పి వచ్చినా భయపడవలసిన పరిస్థితి ఏర్పడి ఉంది. చాలా సందర్భాలలో పొట్ట / ప్రేగులలో వాయువు చేరినా గుండెనొప్పి అని భావించటం కూడా జరుగుతున్నది. చాలా విచిత్రమైన విషయమేమిటంటే నాకు భవిష్యత్తులో గుండెనొప్పి వస్తుందేమో అని తలంచేవారు కూడా చాలామందే ఉన్నారు.

**గుండె జబ్బులకు కారణాలు :** 1) ధూమపానం : ధూమపానం చేయనివారికన్నా చేసేవారు నూరుశాతం అధికంగా గుండెజబ్బులకు, మరణాలకు గురవుతున్నారు. 2) క్రొవ్వు పదార్థాలు : మన ఆహారంలో అధికశాతంలో ఉండుట. ఇవి కొలెస్టిరాల్‌ను పెంచుతాయి.

దీనివల్ల రక్తపోటు, గుండెజబ్బులు సంభవిస్తాయి. 3) స్థూలకాయం (తొడలలో, బొజ్జపైన క్రొవ్వు ఉన్న ఫరవాలేదు. కాని బొజ్జ లోపల క్రొవ్వువచ్చిన గుండె వ్యాధులు వచ్చే అవకాశం పెరుగును) 4) వ్యాయామం లేకపోవుట 5) మానసిక ఒత్తిళ్ళు, ఆందోళనలు 6) ఆహారంలో ఉప్పు/పంచదార అవసరం కన్నా ఎక్కువగా ఉండుట 7) మెనోపాజ్ సమస్యలు : సాధారణంగా పురుషులలో కన్నా స్త్రీలలో గుండెజబ్బులు, గుండెపోటు వల్ల మరణాలు చాలా తక్కువ. అయితే స్త్రీలలో నెలసరి ఆగిన తర్వాత గణనీయంగా గుండెజబ్బులకు గురిఅగుచున్నారు. 8) వాతావరణ కాలుష్యం పెరుగుట.

**నివారణోపాయాలు :**

1. ప్రశాంతంగా వుండుట – ధ్యానం, యోగ మొదలైన వాటి ద్వారా ప్రశాంతంగా వుండుట.
2. వాతావరణ కాలుష్యాన్ని తగ్గించే ప్రయత్నాలు చేయుట.
3. మసాలా ద్రవ్యములు, టీ, కాఫీ, పొగాకు, సారాయి మానుకొనుట.
4. పరిశుభ్రమైన గాలి, సాత్విక ఆహారం అవసరం.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6X–12X :** గుండెనొప్పి, మంట, వాపు గల అన్ని వ్యాధుల ప్రథమ దశలో – ఎన్‌డోకార్డియమ్ పొర వాపుతో సహా గుండె లోపలి గోడకు, కవాటముల మీద పులిపిరి కాయలు, కంతులు పెరుగుట – గుండె వాపు – మృదులాస్థి చుట్టూ యుండు పొర (పెరికార్డియం పొర) వాచుట – ఇది ప్రధానమైన మందు – గుండె/రక్తనాళాలు పెద్దవగుట/ విపులీకరించుట – ఈ మందును కాల్కేరియా ఫ్లోర్‌తో మార్చి వాడాలి – గుండె దడ (వడిగా, బలముగా కొట్టుకొనుట)

**కాల్కేరియాఫాస్ 6X–12X :** కపాల అడుగు భాగమందలి ఎముకలోని రంధ్రం మూతబడకుండుట – ఆందోళనతో గుండెదడ, వణకుతున్న బలహీనత – గుండె నెమ్మదిగా కొట్టుకొనుట – గాలిని లోపలికి పీల్చుకొనునపుడు తీవ్రమైన నొప్పి.

**కాలీమూర్ 12X :** రక్తప్రసరణ యందు గాలి బుడగ అవరోధముగా నుండుట – పెరికార్డియం వాచిన ఇది రెండవ మందుగా ఉపయోగపడును. చికిత్సను పూర్తిచేయును – గుండె పెద్దదైన పరిస్థితిలో గుండెకు రక్తమధికముగా ప్రవహించుటవల్ల కలుగు గుండెదడ.

**కాలీఫాస్ 6X :** అలసటతో కూడిన కీళ్ళవాతపు జ్వరము తర్వాత గుండెదడ వచ్చునప్పుడు దీనిని మధ్య–మధ్య గుండె బాధలకు వాడాలి. అనారోగ్యముగ నుండు నరాల బాధలు, తీవ్రమైన భావాల ప్రభావము, దుఃఖము, జాగ్రత్త, గుండె బలహీనత, భావోద్వేగము వల్ల గుండెదడ, మెట్లు ఎక్కునపుడు హ్రస్వశ్వాస వలన గుండెదడ – నరాల బలహీనత

వల్ల గుండెదడ, ఆందోళన, విచారము, నిద్రలేమి, నిలుకడ లేకపోవుట – గుండె నెమ్మదిగా కొట్టుకొనుట వలన కలుగు నీరసము, భయము వల్ల మూర్ఛ కలుగుట – ఏ మాత్రం మానసిక భావోద్వేగము కలిగినా/మెట్లెక్కినా గుండెదడ వచ్చుట.

**కాలీసల్ఫ్ 12X :** నాడి వడిగా / నెమ్మదిగా కొట్టుకొనుట – తుంటి ఎముక ఊర్ధ్వభాగమున ధనారింపుగ నుండు నొప్పి, తొలుచునట్లుండు నొప్పి – మాట్లాడుటలో రుచి చూపకుండుట – పాలిపోయిన ముఖం – గుండె వ్యాధి ఉబ్బువ్యాధి (Dropsy)ని కలిగించుట (కాలీమూర్) – వేడిమి వల్ల గుండెదడ.

**మెగ్నీషియంఫాస్ 12X - 30X :** అకస్మాత్తుగ గుండెదడ కలుగుట – పొర్లు పొర్లుగా వచ్చుట – గుండె ప్రాంతమున శూలనొప్పి, మెరుపువలె చటుక్కున కలుగునొప్పి.

**నేట్రంమూర్ 12X :** రక్తహీనత కలవారిలో గుండెదడ–నీళ్ళవలె వుండు రక్తము– ఉబ్బుతో కూడిన వాపు – ఆందోళన, దుఃఖముతో గుండెదడ–తీవ్రమైన నాడి, విడిచివిడిచి వచ్చే నాడి, ఉదయపు తలనొప్పి–రక్తములో రక్తకణాల కన్నా ప్లాస్మా శాతము అధికముగా వుండుట–స్కర్వీ–గుండె పక్షిరెక్కలవలె కొట్టుకొనుట–గుండె దగ్గరకు ముడుచుకొని పోయినట్లుండుట.

**కాల్కేరియాఫ్లోర్ 12X :**గుండె పెద్దదగుట–రక్తనాళాలు విపులీకరించుట–సాగునట్టి కండర పేశములను సంకోచింపజేయుటకు ప్రధానమైన మందు–గుండె మందముగా పనిచేయుట.

## 8. గుండెనొప్పి / గుండెపోటు
## (Angina Pectoris)

ఇది ఆకస్మికముగ వచ్చు బాధ. బాధ హృదయ సమీపములోనో, హృదయములోనో ప్రారంభమై భుజములలోనికి, చేతులలోనికి ముఖ్యముగా ఎడమవైపునకు వ్యాపించును. బాధ తీవ్రముగ వుండును. హృదయమును ఇనుపబద్దీతో కట్టివేసి నొక్కినట్లు, ఛాతీని చీల్చివేయుచున్నట్లు వుండును. ఈ బాధ మరణ బాధవలె వుండును.

గుండెనొప్పి వచ్చినపుడు శరీరము చెమట పట్టును. చెమట బంకవలె వుండును. చేయి చల్లగా, తిమ్మిరిగా వుండును. ఆ సమయములో రోగికి గాలి ఆడక తల తిరిగిన ట్లుండును. మూత్ర విసర్జన కూడా జరుగును. ప్రాణము పోవునేమో అనిపించును. ఈ బాధ కొలది సెకనుల నుండి కొన్ని నిమిషముల వరకు వుండవచ్చు.

గుండెనొప్పి ఈ కారణాల వల్ల సాధారణంగా వస్తుంది –1) కొరనరీ ధమని గోడలు గట్టిపడి రక్తప్రసరణకు కొంచెం అడ్డంకి ఏర్పడుట 2) గుండె కండరములకు సరిగా రక్త ప్రసరణ లేకపోవుట 3) అజీర్ణము వలన కడుపులోను, ప్రేగులలోను అధికవాయువు చేరుట.

**హెచ్చరికలు :** 1) గుండెనొప్పి గుండెజబ్బుల వలన వచ్చినచో ప్రాణాపాయం సంభవించుటకు అవకాశం కలదు. కనుక గుండెనొప్పి వచ్చినపుడు వెంటనే ప్రథమ చికిత్స చేసి గుండెవ్యాధుల చికిత్సకై ఏర్పాటు చేయబడిన ఆస్పత్రికి రోగిని ఆలస్యము చేయకుండ తీసుకొని వెళ్ళాలి. ఇ.సి.జి. (E.C.G.) తీసినచో అనేక సందర్భాలలో లాభకరముగ నుండును. ఇలాంటి వాటిలో స్వంత వైద్యం పనికిరాదు. 2) చాలా సమయాలలో పొట్ట లోను, ప్రేగులలోను వాయువు చేరి గుండెనొప్పి లక్షణాలు కనపడును. కారణం తెలియక చాలామంది కంగారు పడుదురు. ప్రథమ చికిత్సవలన ఏమాత్రం ప్రయోజనం కనిపించనిచో వెంటనే ఆస్పత్రికి తీసుకొని వెళ్ళాలి.

**నివారణోపాయాలు :**

1) రోగి ప్రశాంతముగ నుండవలెను. 2) ఉద్రేకములకు లోనుకారాదు. 3) అలసట కలిగించు పనులు చేయరాదు. 4) నియమిత ఆహార పానీయములను మాత్రమే తీసుకోవాలి.

**• ప్రథమ చికిత్స •**

**మెగ్నీషియంఫాస్ 6x :** ఛాతీని బిగపట్టి యుంచు నరాల నొప్పులకు, ఈడ్పులకు ఇది మంచి మందు. దొంగ గుండెనొప్పిని నివారించుటకు బాగా ఉపయోగపడును. డా॥ వాలెస్ మెక్‌జార్జ్ దీనిని వాడి ఈడ్పుల తీవ్రతను, వాటి సమయాన్ని సమర్థవంతంగా తగ్గించ గలిగెను. ఈ మందును వేడినీటితో వాడాలి. ఇది వెంటనే తన చర్యను ప్రారంభించును.

**ఫెర్రంఫాస్ 12x :** గుండెనొప్పితో పాటు ముఖం ఎర్రబడి, ముఖమంతటా వేడిమి వ్యాపించియున్న ఈ మందును ముందు పేర్కొన్న మందుతో మార్చి–మార్చి వాడాలి.

**కాలీఫాస్ 6x :** గుండె పని బలహీనంగా వుండుట, అది మధ్య మధ్య ఆగి కొట్టుకొనుట, రోగి శోషిల్లుట వున్నప్పుడు ఈ మందును మెగ్నీషియం ఫాస్‌తో మార్చి–మార్చి వాడాలి.

## 9. సిరల వాపు
## (Diseases of Veins)

రక్తప్రసరణలో సిరలకు ఎంతో ప్రాధాన్యం ఉంది. ఇవి శరీరంలోని ప్రతి భాగం నుండియు గుండెకు అశుద్ధమైన నల్లని రక్తమును గైకొనిపోవును. సిరల గోడలలో సాగే గుణం తగ్గడంవల్ల అవి పెద్దవగును. వాటిలోని కవాటాల సామర్థ్యం తగ్గి రక్తం సరిగా ప్రవహించదు. అప్పుడు సిరల వాపు జరుగును. ఈ సిరల వాపు శరీరంలోని ఏ అవయవంలో ఉండునో, దానిని బట్టి వ్యాధికి వేరే పేరుండును.

| ప్రదేశం | వ్యాధి పేరు |
|---|---|
| గుదము | మొలలు |
| శుక్రనాళం | వెరికోసిల్ |
| కాళ్ళు | కాళ్ళ వాపు |

కొంతమంది కాళ్ళల్లో సిరలు పెద్దవై ముండ్లుముండ్లుగా ఏర్పడి నీలిరంగుగా ఉంటాయి. సిరల వాపు వల్ల విపరీతమైన నొప్పి ఉండును. కొన్ని సందర్భాలలో సిరలు పగిలి రక్తస్రావం జరుగును. పుండ్లు ఏర్పడును. ఈ సిరలవాపుకు ఈ కారణాలు ఉన్నవి – 1) వంశపారంపర్యత 2) గర్భం దాల్చుట 3) మలబద్ధకం.

**• చికిత్స •**

**కాల్కేరియాఫ్లోర్ 6× :** సిరలు ఉబ్బుట – సిరలకు పుండు ఏర్పడుట – ఇలాంటప్పుడు ఈ మందును లోషన్‌గా కూడా వాడవచ్చు.

- తీవ్రమైన చురుకైన నొప్పులు – ఈ నొప్పులవల్ల రోగులు తమ కాళ్ళపై నిలబడలేక పోవుట. స్త్రీ బాహ్య జననేంద్రియం వద్ద నున్న సిరల వాపుకు, అండాశయముల వాపుకు, అండాశయముల సిరల బాధలకు డాక్టర్ పీటర్ ఈ మందును సిఫారసు చేశారు.
- కాల్కేరియా ఫ్లోర్‌కు, సైలీషియాకు ఈ తేడా ఉంది –

1) కాల్కేరియా ఫ్లోర్ కండరాల ధాతువుల పట్ల ఎక్కువగా ఆకర్షితమగును. చల్లదనం వల్ల ఉపశమనం లభించును.

2) సైలీషియాలో బాధలు చలి/చల్లదనం వల్ల ఎక్కువగును.

**ఫెర్రంఫాస్ 12× :** వృషణముల తిత్తి (Scrotum)లోని సిరలు ఉబ్బుట – వృషణముల (testicles) నొప్పి–సిరల వాపుకు ఇది చాలా శక్తివంతమైన మందు. ధమని విపులీకరించుటచే కలుగు చిన్న మెత్తని కంతులను ఈ మందు నయం చేసింది. గుండె బలముగా కొట్టుకొనుటవల్ల కంతి నయమైనట్లు తెలుస్తుంది. యువకులలో సిరలు ఉబ్బుట.

## 10. రక్తం విషపూరితమగుట
### (Septicaemia)

కొన్ని సందర్భాలలో రక్తం విషపూరితం అవుతుంది. ఆ సందర్భాలలో స్పృహ ఉండవచ్చు, లేకపోవచ్చు.

**కారణాలు :**

1) విషంతో ఉండు ప్రాణులు కుట్టుట/కాటు వేయుట.

2) కళాయి పాడైన పాత్రలలో వండిన ఆహారం తినుట.
3) కళాయి పాడైన పాత్రలలో వండిన సారాయి త్రాగుట.
4) వండిన ఆహారపదార్థాలలో విషక్రిములు పడుట.
5) వండిన ఆహారపదార్థములు విషపూరితమగుట.
6) ఆత్మహత్య చేసుకోవాలనే తలంపుతో విషం/విషపూరితమైన మందులు సేవించుట.
7) విషప్రయోగం
8) కోసుకొనుట
9) ఇనుప వస్తువులు గ్రుచ్చుకొనుట

### • చికిత్స •

**కాలీఫాస్ 12×** : కుళ్ళిన వాసనగల, విషపూరితమైన రక్తస్రావం - పాదం యొక్క విషపూరితమైన రక్తం, పల్లముగనున్నచోట రక్తంకూడుట, దుర్గంధమును వెదజల్లు వాసన.

## 11. చక్కెర వ్యాధి / మధుమేహం / మధుమూత్రం (Diabetes/Diabetes Mellitus)

మధుమేహం నేటి ప్రధాన వ్యాధులలో ఒకటి. రోజురోజుకు ఈ వ్యాధిగ్రస్తుల సంఖ్య ఎక్కువగుచున్నది. లోగడ 40 సం॥లు పైబడినవారే ఈ వ్యాధికి గురయ్యేవారు. నేడు పాతిక సంవత్సరాలు నిండనివారు కూడా ఈ వ్యాధి ముఖంలో చిక్కుకొంటున్నారు. మరీ దారుణమేమంటే చక్కగా స్కూలుకు వెళుతూ ఆడుకోవలసిన 7-8 సం॥ల వయస్సు గల పిల్లలు ఇన్సులిన్ వాడాల్సి వస్తున్నది.

విదేశాలలో 11 శాతం మంది ఈ వ్యాధికి గురగుచున్నారు. మనదేశంలో 22 శాతం మంది వున్నారు. హైదరాబాదులో 16 శాతం మంది ఈ వ్యాధికి గురైనారనియు, 35 శాతం మంది త్వరలో ఈ వ్యాధికి గురికాగలరనియు అంచనా. ప్రస్తుతం దేశవ్యాప్తంగా 4 కోట్లమంది, ప్రపంచవ్యాప్తంగా 20 కోట్లమంది ఈ వ్యాధిగ్రస్తులున్నట్లుగా తెలుస్తుంది. ఒక సర్వే ప్రకారం 2025 నాటికి ప్రపంచంలో మధుమేహ వ్యాధిగ్రస్తుల సంఖ్య 33 కోట్లకు చేరవచ్చునని అంచనా.

కనుక ఈ మహమ్మారి నుండి త్వరగా విముక్తి పొందవలసిన అవసరం ఎంతైనా వుంది.

**ఈ వ్యాధి ఎలా వస్తుంది ?**

చాలా మంది ఆహారంలో బియ్యంతో వండిన అన్నం, రాగి సంకటి, గోధుమ పిండితో చేసిన చపాతీలు లేక జొన్నపిండితో చేసిన రొట్టెలు తింటారు. ఈ ఆహారంలో

పిండిపదార్థాలు లేక కార్బొహైడ్రేట్లు (Carbohydrates) వుంటాయి. ఇవి జీర్ణమై చక్కెరగా/ గ్లూకోజుగా మారుతాయి.

మన దేహంలో క్లోమగ్రంథి (Pancreas) ఇన్సులిన్ అనే హార్మోనును తయారు చేస్తుంది. ఇది శరీరంలో తయారయ్యే చక్కెరను సద్వినియోగం చేస్తుంది. రక్తంలోని కణాలకు అందిస్తుంది. ఈ పని సక్రమంగా జరిగినప్పుడు రక్తంలో చక్కెర పరిమాణం 80 మి.గ్రా/100 సి.సి.లుగా వుంటుంది. కొన్ని సందర్భాలలో క్లోమగ్రంథి సరిగా పనిచేయదు. ఇన్సులిన్ ఉత్పత్తి తగ్గును. రక్తంలోని చక్కెర/గ్లూకోజు సరిగా ఆక్సీకరణ చెందదు. అది కాలేయములో గ్లైకోజనుగ మారలేదు. శరీరానికి శక్తి లభించదు. దాని మూలంగా రక్తంలో చక్కెర పరిమాణం పెరుగును. ఆ పరిమాణం 180 మి.గ్రా/100 సి.సి. వరకు పెరిగినా అది రక్తంలోనే వుండును. ఆ పెరిగిన చక్కెరను మూత్రంలోనికి రాకుండా మూత్రపిండాలు నిరోధించును. కాని రక్తంలోని చక్కెర పరిమాణం 180 మి.గ్రా/100 సి.సి.ని మించిన ఆ చక్కెర మూత్రం లోనికి వచ్చును. కొన్ని అసాధారణ పరిస్థితులలో మూత్రపిండాల చక్కెరస్థాయి 180 మి.గ్రా/100 సి.సి.కి తక్కువగా వున్నను మూత్రంలోనికి దిగును. కనుక అలాంటి పరిస్థితులలో మూత్ర పరీక్ష ద్వారా చక్కెర వ్యాధిని నిర్ధారించుట కష్టమగును. కనుక రక్తపరీక్ష ద్వారా రక్తములోని చక్కెర పరిమాణాన్ని తెలుసుకొని చక్కెర వ్యాధి తీవ్రతను నిర్ధారించుట ఉత్తమమైన మార్గం.

**రక్తంలో చక్కెర పరిమాణం ఎంత వుండాలి ?**

రక్తంలో ఏమీ తిననపుడు చక్కెర పరిమాణం 80–110 మి.గ్రా/100 సి.సి. వున్నా, ఏమైనా తిన్న రెండు గంటల తర్వాత రక్తంలో చక్కెర పరిమాణం 120–160 మి.గ్రా/100 సి.సి. అయినచో చక్కెర వ్యాధి లేనట్లు లేదా అది అదుపులో వున్నట్లు అర్థం. పై స్థాయిని దాటిన చక్కెర వ్యాధి అధికంగా వున్నదని అర్థం.

**లక్షణాలు :** మధుమేహానికి మూడు ప్రముఖ లక్షణాలు వున్నాయి –

1) మాటిమాటికి మూత్రవిసర్జన (Polyuria)

2) అధిక దప్పిక (Polydipsia)

3) అధిక ఆకలి (Polyphagia)

అన్ని సందర్భాలలోను పై లక్షణాలన్నీ తప్పక వుండవలసిన అవసరం లేదు. పై మూడు లక్షణాలే గాక బరువు తగ్గుట, నీరసం, రాత్రిపూట కాళ్ళలో నొప్పి, చూపుకు సంబంధించిన దోషాలు, చర్మం పొడిగ వుండుట, దురద (ముఖ్యముగ జననేంద్రియముల వద్ద), అజీర్తి, పంటి చిగుళ్ళు మెత్తనై వాటి నుండి రక్తం వచ్చుట, సూక్ష్మక్రిముల వల్ల వ్యాధి వృద్ధియగుట (infection), బహిష్టు అణచబడుట, ఏదైనా గాయమైన త్వరగా నయం కాకపోవుట మొదలైన ఇతర లక్షణాలు కూడా వుండవచ్చు.

**ఉపద్రవాలు (Complications ) :** చక్కెర వ్యాధి చాలా ప్రమాదకరమైనది. ఎందుకంటే ఈ వ్యాధి ముదిరిన ఇతర శరీర అవయవాలు దెబ్బతినే అవకాశం వుంది. వ్యాధి ముదిరిన స్పృహ పూర్తిగా కోల్పోవుట జరగవచ్చు. రక్తనాళాలు క్షీణించి వాటి పనిలో మార్పు రావచ్చు. మూత్రపిండాలు దెబ్బతినవచ్చు. కంటిలోని రెటీనా పాడై అంధత్వం ఏర్పడవచ్చు. నాడీ మండలం దెబ్బతినుటవల్ల కాలివ్రేళ్ళు/పాదములు తొలగించవలసిన పరిస్థితి రావచ్చు. గుండె దెబ్బతినవచ్చు.

**కారణాలు :**

1. వంశపారంపర్యం ముఖ్యకారణంగా భావించబడును. తల్లిదండ్రులిద్దరూ చక్కెర వ్యాధి గ్రస్తులైన వారి పిల్లలకు ఈ వ్యాధి రావటానికి అవకాశాలు ఎక్కువ.
2. ఏ వయస్సువారికైనా ఈ వ్యాధి రావచ్చు. కాని సగం మంది రోగులకు 50 సంవత్సరములకు పూర్వమే ఈ వ్యాధి వచ్చును.
3. పురుషులకు స్త్రీలకంటె తక్కువ వయస్సులోనే ఈ వ్యాధి వచ్చును. స్త్రీలకు సాధారణంగా నడిమి వయస్సులో వచ్చును.
4. స్థూలశరీరము.
5. సూక్ష్మక్రిములవల్ల వచ్చు వ్యాధులు (Infections)
6. మానసిక ఆందోళన/ఒత్తిడి
7. శారీరక శ్రమ లేకపోవుట.
8. క్లోమగ్రంథి, కాలేయ గ్రంథి వ్యాధులు
9. పిట్యూటరీ గ్రంథి సరిగా పనిచేయకపోవుట
10. మెదడులో వున్న డయాబెటిక్ కేంద్రాల వ్యాధులు
11. ఎక్కువగా తీపి పదార్థాలు, పిండిపదార్థాలు, క్రొవ్వు పదార్థాలు తినుట
12. సారాయి / బ్రాంది / విస్కీ అధికంగా త్రాగుట
13. లవణాల మధ్య సమతుల్యత లేకుండుట.

**నివారణోపాయాలు :**

1. ఈ వ్యాధిని పూర్తిగా నయం చేయుటకు వీలుకాదు. కాని దానిని అదుపులో పెట్టుకోవచ్చు. అదుపులో పెట్టుకొనుటకు కేవలం మందులు మాత్రమే ఉపయోగపడవు. ఆహారనియమాలు పాటించాలి. వ్యాయామం చేయాలి. వీటిద్వారా 40% రోగులు మధుమేహాన్ని అదుపులో పెట్టుకొన్నట్లు తెలుస్తుంది.
2. సాధారణంగా బియ్యపు అన్నం తినటం మాని గోధుమ/జొన్న రొట్టెలు తీసుకొంటే వ్యాధి తగ్గుతుంది అని చాలామంది భావిస్తారు. కాని ఇది నిజం కాదు. ఏ ఆహారం తిన్నారనడం ముఖ్యం కాదు, ఎంత తిన్నారనేది ముఖ్యం.

3. ప్రతి వ్యక్తి సమీకృత ఆహారం తీసుకోవాలి. ఏ వ్యక్తి ఎన్ని కేలరీల ఆహారం రోజుకు తీసుకోవాలి అనేది అతని వయస్సు, ఎత్తు, స్త్రీ-పురుష భేదం, బరువుపై ఆధార పడుతుంది. ఈ విషయంలో డాక్టరు సలహా ఉపయోగపడుతుంది. నోవా నార్‌డిస్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్, రాజేష్ ఛేంబర్స్, 14/2 బ్రింటన్ రోడ్, బెంగుళూరు-560 025 వారు ఈ వ్యాధిపై ప్రచురించిన పుస్తకాలు సహాయ పడతాయి. రోజం తటికీ కావలసిన ఆహారాన్ని తగు పాళ్ళలో విభజించి వివిధ భోజన సమయాలలో తీసుకోవాలి. ప్రతిరోజు ఒకే రకం తీసుకోవాలంటే వెగటుగా వుంటుందని తలంచే వారు భోజన పదార్థాలను మార్చిమార్చి తినవచ్చు. కేలరీల దృష్ట్యా ఒక మధ్యసైజు చపాతీ = ఒక చిన్న గిన్నె అన్నం = ఒక మధ్యసైజు ఇడ్లీ = అరకప్పు గంజి. కనుక మధ్యాహ్నం భోజనంలో ఒక రోజు 2 చపాతీలు తినేవారు, మరొక రోజున ఆరు టేబుల్ స్పూన్ల అన్నం/2 ఇడ్లీలు తీసుకోవచ్చు.
4. ఉదయంపూట 2-3 రకాల ధాన్యాల (పచ్చపెసలు, అలసందలు, సజ్జలు మొదలైనవి) మొలకలను తినుట మంచిది.
5. ఆహారపదార్థాలు వండునపుడు ఒకే రకం నూనె వాడరాదు. 2-3 రకాల నూనెలు కలిపి వాడాలి.
6. **తినరానివి - త్రాగరానివి :** చక్కెర/బెల్లం గల ఆహారం, తేనె, మిఠాయిలు, చాక్లెట్లు, బిస్కట్లు, పేస్ట్రీలు, కేకులు, జాములు, దుంపకూరలు, తియ్యటి చట్నీ, నూనె గల ఊరగాయలు తినరాదు. హార్లిక్స్, బోర్నవిటా వాడరాదు. ఐస్‌క్రీము తినకూడదు. థమ్స్‌అప్, మజా, గోల్డ్‌స్పాట్, లిమ్కా, సారాయి, మద్యము, బ్రాందీ వంటివి త్రాగరాదు. అరటిపండు, మామిడి, ద్రాక్ష, సపోటా, పనస, సీతాఫలము మొ॥ పండ్లు తినరాదు.
7. కమలా, బత్తాయి, జామకాయ తినవచ్చు. మసాలా లేని మజ్జిగ త్రాగుట మంచిది.
8. కష్టతరమైన కసరత్తులు మంచిది కాదు. ప్రాణాయామమునకు సంబంధించిన సులభమైన అభ్యాసములు చేయుట మంచిది. 4-5 కి.మీ. పరగడుపున నడచుట మంచిది. రోజు రోజుకు నడిచే దూరాన్ని పెంచాలి. రోగి యువకుడై, అతని గుండె మామూలుగా పనిచేయుచున్నచో వడిగా నడచుట (Brisk walking) ఉపయోగకారి. దీనివల్ల దేహములో క్రొవ్వు అధికంగా ఏర్పడదు. క్రొవ్వు మధుమేహాన్ని పెంచుతుంది.
9. ఎప్పుడూ కడుపునిండుగ భోజనం చేయరాదు. పరిమిత ఆహారం తీసుకోవాలి.
10. ఇతర రోగుల సలహాలు అంత ప్రామాణికంగా వుండవు. కనుక ప్రతి నెల క్రమం తప్పకుండా డాక్టరు సలహా తీసుకోవాలి. నెలకొకసారి రక్తములో చక్కెర ఎంత వున్నదీ పరీక్ష చేయించుకోవాలి. అట్లే బరువు చూసుకోవాలి. అప్పుడప్పుడు మూత్ర

ములో అసిటోను, శ్వేతధాతువు (albumen), కీటోన్స్ వుంటాయి. మూత్రంలో అసి టోను, కీటోన్స్ వుంటే స్పృహ తప్పవచ్చు (Coma). అట్లే శ్వేత ధాతువు వుంటే మూత్రపిండములలో లోపం వుందని అర్థం. కనుక ఆ పరీక్షలను కూడా అప్పుడప్పుడు చేయించుకోవాలి. అట్లే కంటి డాక్టరుతో రెటీనా పరీక్ష, గుండెడాక్టరుతో గుండె పరిస్థితి పరీక్షలు చేయించుకోవాలి. ఈ పరీక్షలకు ఎక్కువ ఖర్చుయినను తప్పదు. భవిష్యత్తులో ఎలాంటి దుష్పరిణామాలు సంభవించకుండుటకు ఇది అవసరం.

11. పాదములు జాగ్రత్తగా కాపాడుకోవాలి. దీనికిగాను ఈ నియమాలను పాటించుట అవసరం.
    ఎ) సరైన సైజుగల, చర్మముతో తయారైన పాదరక్షలను వాడాలి. ధరించునపుడు వాటిలో పగుళ్ళు/మేకులు/చిన్నరాళ్ళు వుండరాదు. చర్మముతో తయారైన పాదరక్షలు వాడాలి. ఇంట్లోను, ఇంటి బయట పాదరక్షలు లేకుండా నడవరాదు. వీలైనంతవరకు ఉన్ని/నూలు మేజోళ్ళను వాడాలి. అవి పరిశుద్ధముగాను, మెత్తగాను, సరైన సైజులోను వుండాలి.
    బి) పాదాలను ఎల్లప్పుడు పొడిగా, వెచ్చగా వుంచాలి. వాటిని గోరువెచ్చని నీళ్ళు, సబ్బు ఉపయోగించి శుభ్రపరచుకోవాలి. వ్రేళ్ళమధ్య భాగమును కూడా పొడిగా వుంచాలి.
    సి) కాలివ్రేళ్ళ గోర్లను సమముగా కత్తిరించాలి.
    డి) వంకర గోర్లకు, కాళ్ళమీద కాయలు/పుండ్లు వున్నచో డాక్టరు సలహా తీసుకోవాలి.
    ఇ) ప్రతిరోజు క్రమముగా చురుకుగా నడవాలి. దీనివల్ల పాదాలలో రక్తప్రసరణ పెంపొందును.
12. కాళ్ళలో రక్తప్రసరణను పెంపొందింపజేయుటకు ఈ వ్యాయామం ఉపయోగకారి – "కుర్చీమీద కూర్చోవాలి. చేతులు కట్టుకొని 10సార్లు లేచి కూర్చొంటూ వుండాలి.
13. మధుమేహ రోగి ఇంకొక మధుమేహ రోగిని వివాహమాడరాదు. అలా జరిగితే వారికి కలిగే సంతానం తప్పకుండా మధుమేహ రోగానికి గురియగుదురు.
14. రక్తములో చక్కెర పరిమాణం అధికంగా వున్నా, గాయాలు, దెబ్బలు తగిలినా ఇన్సులిన్ వాడాలి. ఇన్సులిన్‌లో చాలా రకాలు వున్నాయి. కనుక ఏ ఇన్సులిన్ వాడాలి ? రోజుకు ఎన్ని మోతాదులు వేసుకోవాలి ? ఒక్కొక్క మోతాదుకు ఎంత పరిమాణం అవసరమవుతుందో డాక్టరు సలహా అవసరం. చాలా మంది ఒకసారి ఇన్సులిన్ వాడితే తర్వాత బిళ్ళలు వాడరాదని భావిస్తుంటారు. ఇది సరైన ఆలోచన కాదు. తర్వాత బిళ్ళలు వాడవచ్చు.

15. ఆయుర్వేదంలో మధుమేహాన్ని అదుపులో పెట్టుకోవడానికి ఈ ఉపాయాలు చెప్పబడ్డాయి–
   ఎ) పసుపులో ఉసిరికాయ రసంపోసి మర్ధించాలి. దీనిని రోజుకు రెండుసార్లు తీసుకోవాలి. మోతాదు : 3 నుంచి 5 గ్రాముల వరకు.
   బి) పెసరపప్పులో ఉసిరికాయ కలిపి వండి సేవించాలి.

## • చికిత్స •

**నేట్రంమూర్ 6×–12× :** అధికమూత్రం తరచుగా వచ్చుట – దప్పిక తీరని దాహం – శుష్కించుట – నిద్రలేమి – ఆకలి నశించుట –అధిక నీరసం – మానసికముగా క్రుంగుట – రోజు విడిచి రోజు అధికమగుట – తలనొప్పి సుత్తితో కొట్టినట్లుండుట – ఉప్పుకావాలని కోరుట – విచారం, ఏడ్పు – మలబద్ధకం – ఋతుస్రావం అణగారుట.

**నేట్రంసల్ఫ్ 3×–12× :** ఇది చక్కెర వ్యాధికి ప్రధానమైన మందు. క్లోమగ్రంథి స్రావం క్షీణించినపుడు దీనిని వాడవలెనని డా॥ స్క్ష్లర్ పేర్కొన్నాడు. ఉత్సాదులు క్రుంగుట – చిరచిరలాడుట – మితభాషిత్వం – నోరు, గొంతు పొడిగా నుండుట – అధిక దాహం – ఆకలి పెరుగుట – వర్షఋతువులో జలుబు చేయుట ఈ రోగి లక్షణాలు. ఈ మందు శరీరంలో వున్న అధిక నీటిని బయటికి పంపి ఐలెట్ ఆఫ్ లాంగర్‌హాన్స్ కణాల మీద ఒత్తిడి తగ్గించును. ఇన్సులిన్ ఉత్పత్తిలో దోహదపడును.

**కాలీమూర్ 3×–12× :** మధుమూత్రం (చక్కెరతోనున్న మూత్రం) అధికంగా వుండుట – ఎక్కువ బలహీనత – నిద్రమత్తు.

**కాలీఫాస్ 3×–12× :** నరముల శక్తి పూర్తిగ నశించుట–నిద్రలేమి–విపరీతమైన ఆకలి – అతిమూత్రం–ఈ లక్షణాలు వున్నప్పుడు దీనిని మధ్యమధ్య వాడాలి. దీనిని నేట్రంసల్ఫ్‌తో మార్చి వాడాలి. మెడుల్లా అబ్లాంగేటును[1], ఊపిరితిత్తులకు, జీర్ణకోశమునకు సంబంధించిన నాడిని తమ పని చేయునట్లు చేయును. ఇది పొట్ట, ఊపిరితిత్తులపై పనిచేయును.

**ఫెర్రంఫాస్ 6×–12× :** వడిగానున్న నాడి – శరీరములోని ఏ భాగములోనైనా నొప్పి – వేడిమి, రక్తము అధికముగా కూడుట – ఈ మందును మధ్య మధ్య వాడాలి.

**కాల్కేరియాఫాస్ 3×– 6× :** అధిక మధుమూత్రం – అధిక దాహం – బలహీనత – పొడిగానున్న నోరు, నాలుక – పొత్తి కడుపు కృంగివుండుట – పందిమాంసం, ఉప్పును అధికంగా తినగోరుట – ఊపిరితిత్తుల వ్యాధులు జబ్బును క్లిష్టపరచుట.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** డా॥ స్క్ష్లర్ ప్రకారం ఈ మందు, కాలీసల్ఫ్ ఈ వ్యాధికి ఉపయోగపడును.

*1. **మెడుల్లా అబ్లాంగేట్ :** కపాలమందుగల వెన్నెముక ఊర్ధ్వభాగం లేదా మెదడు యొక్క క్రింది భాగం (చిన్న మెదడు)*

**ఎ) చక్కెర వ్యాధిగ్రస్తుల ఇతర బాధలు**

**కాల్కేరియాసల్ఫ్ 6×** : పాదముల అడుగున మంట, దురద.

**కాలీఫాస్ 6×** : అరచేతులలోను, పాదముల అడుగున దురద, కాళ్ళ మంట.

**నేట్రంసల్ఫ్ 6×** : అరికాలు పాదపు అడుగు భాగంలో మండుతున్నట్లుండుట – ఈ మంట మోకాళ్ళకు వ్యాపించుట.

**బి) చక్కెరవ్యాధి / మధుమేహం - పాదాల సంరక్షణ**

ప్రతి సంవత్సరం నవంబరు 14వ తేదీన నిర్వహించబడే ప్రపంచ డయాబెటిస్ దినం, 2005 సంవత్సరములో 'మధుమేహం–పాదాల సంరక్షణ' అనే విషయాన్ని గురించి ప్రపంచమంతటా ప్రజలకు చైతన్యం కల్పించాలని సంకల్పించింది. ఇందుకు ఒక ముఖ్య కారణం ఉంది. ఆ కారణం కొన్ని అంచనాల ప్రకారం ప్రతి 30 సెకన్లకు ఒకరి కాలు తీసివేయటం కావచ్చు.

సాధారణంగా 10 సంవత్సరాలు లేక అంతకంటె ఎక్కువ సంవత్సరాలు మధుమేహంతో బాధపడుతున్నవారి కాళ్ళకు స్పర్శ తగ్గి పుండుపడటం, కుళ్ళటం జరుగుతూ ఉంటుంది. దానివల్ల వ్రేళ్ళు/కాలు తీసివేయటం (Amputation) మనం చూస్తూనే ఉంటాం. అలాంటివారి జీవితం ఎంత కష్టదాయకంగా ఉంటుందో ఊహించలేము. వారికే కాకుండా వారి కుటుంబ సభ్యులకు కూడా శారీరక, మానసిక వ్యథ మిగిలిపోతుంది. కనుక పాదాల న్యూరోపతి (నరాల తెగులు)ని గురించి తెలుసుకొని వాటి సంరక్షణకై తగు జాగ్రత్తలు తీసుకోవాలి.

**న్యూరోపతి లక్షణాలు :**

1) కాళ్ళల్లో మంటలు 2) కాళ్ళల్లో చురుకునొప్పి 3) తీవ్రమైన కాళ్ళ నొప్పులు – రాత్రిపూట నొప్పులు అధికమగుట – నడిస్తే తగ్గుట 4) చర్మం పాలిపోయి పగుళ్ళు వచ్చుట 5) కాలివ్రేళ్ళు, పాదాలు వంకరపోవుట 6) కాలిపుండ్లు చీముపట్టి అల్సర్స్‌గా మారుట 7) చర్మం ఎర్రబడి వెంట్రుకలు రాలిపోవుట.

**న్యూరోపతి కారణాలు :**

1) రక్తంలో గ్లూకోజ్ నియంత్రణలో లేకపోవుటవల్ల సార్‌బిటాల్ ఎక్కువై నాళాలలోనికి పోయి వాటిని ఉబ్బేటట్లు చేస్తుంది. 2) నరాలపై ఉండే పూత లోపించుట 3) రక్తప్రసరణ సరిగా లేకపోవుట మొదలైనవి.

పై కారణాలవల్ల జ్ఞాననాడి, చాలకనాడి, స్వపరిపాలనా నాడి మరియు వీటి మిశ్రమమునకు తెగులు ఏర్పడవచ్చు.

**పాద సంరక్షణకు గైకొనవలసిన చర్యలు :**

1) రోజూ అద్దంలో పాదాలను చూసుకోవాలి. పాదాలలో ఏమైనా పుండ్లు ఉన్నాయా, వాటికి చీముపట్టినదా అని గమనించాలి. అవసరమైతే చికిత్స చేయించుకోవాలి. బ్యాండేజ్ వేయించుకోవాలి. బ్యాండేజ్‌ను ప్రతిరోజూ మార్చాలి. కారణం నాడీమండల బలహీనత వల్ల స్పర్శజ్ఞానం లేకపోవుట, కాలు బొబ్బలెక్కి గాయాలగుట. 2) పాదములకు, కాలివ్రేళ్ళ మధ్య తడి ఉండరాదు. ఎప్పటికప్పుడు వాటిని శుభ్రపరచి పొడిగా ఉండేటట్లు జాగ్రత్తపడాలి. 3) కాళ్ళ పాదాలకు, వ్రేళ్ళకు ప్రతిరోజు కొబ్బరి నూనె పూయాలి. 4) మధుమేహ రోగులు ఎండలో బయటికి వెళ్ళరాదు. ఎండాకాలంలో మధ్యాహ్నం పూట ఎండ ఎక్కువగనున్నప్పుడు గరుకుగా ఉండు నేలపై నడవటం, మెట్లు ఎక్కటం వంటివి చేయరాదు. 5) సరైన మేజోళ్ళు, బూట్లు ధరించాలి. 6) చిరిగిన మేజోళ్ళు/బిగుతుగా నుండు బూట్లు ధరించరాదు 7) ఇంట్లోకాని, బయట కాని పాదరక్షలు లేకుండా నడవరాదు. పాదరక్షలు లేకుండా నడిచినపుడు ఏదైనా గుచ్చుకోవడం, గాయాలు కావడం, ఇన్‌ఫెక్షన్ రావటం జరగవచ్చు. పుండ్లు ఏర్పడవచ్చు. అంతేకాకుండా ఆనెలు తేలికగా ఏర్పడతాయి. డయాబెటిక్ రోగి చర్మం సున్నితంగా, పలుచగా ఉంటుంది. సూక్ష్మజీవులు చేరి ఇన్‌ఫెక్ట్ అయి గ్యాంగ్రీన్ (శరీర కణజాలం మరణించుట) ఏర్పడవచ్చు. ఫలితంగా ఆ భాగాన్ని తీసివేయవలసి రావచ్చు.

# 5

# మస్తిష్కమునకు సంబంధించిన వ్యాధులు

## (DISEASES RELATED TO MIND)

### 1. మానసిక స్థితి
### (Mental State)

మన ఆరోగ్యం మన మానసిక స్థితిపై ఆధారపడి వుంటుందని వైద్యశాస్త్ర నిపుణు లంతా నొక్కి వక్కాణిస్తున్నారు. మానసిక స్థితిపై ఆరోగ్యం, ఆరోగ్యంపై మానసిక స్థితి ఆధారపడి వుంటాయనటంలో ఎట్టి అతిశయోక్తి లేదు. ఒక విధంగా చూస్తే ఇవి రెండూ పూరకములు. మనం చదివే విషయాలు, మనం చూసే విషయాలు, మనం వినే మాటలు అన్నీ మన మనసుపై ప్రభావం కలగజేస్తూ వుంటాయి. కనుక మనం మంచి విషయాలే చదవాలి. మంచి దృశ్యాలనే చూడాలి. మంచి మాటలే వినాలి. గాంధీజీ గారి వద్ద ఉండే మూడు కోతుల బొమ్మ ఇదే విషయాన్ని చెబుతుంది – చెడ్డ మాటలు మాట్లాడకూడదు, చెడు దృశ్యాలను చూడకూడదు, చెడ్డ మాటలు వినకూడదు.

ఒకరి మానసిక స్థితి అతని జన్యువులపై ఆధారపడి ఉంటుంది. కాని కాల పరిస్థితుల ప్రభావం, జీవిత విధానం, వృత్తి ఉద్యోగాలు, వ్యాపకాలు అన్నీ దానిపై ప్రభావాన్ని కలిగిస్తాయి. అంతేగాకుండా కొన్ని లవణాలు లోపించడం వల్ల కూడ మానసిక స్థితిలో మార్పులు వస్తాయి. ఆ లవణాల సరఫరావల్ల మానసిక స్థితిలో ఆరోగ్యం చేకూరు తుంది. ఎలాంటి మానసిక స్థితి ఉన్నప్పుడు ఎట్టి లవణం వాడాలో క్రింద తెలుపబడింది.

#### • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× – 12× :** కోపం వల్ల కలిగే పరిణామాలు – సాధారణ విషయాల పట్ల ఉదాసీనత్వం – సహనం, ఆశ కోల్పోవుట – అతి చిన్న విషయాలు బాధ పెట్టుట.

**కాలీఫాస్ 6× – 30× :**

★ అధిక శ్రమవల్ల మెదడు శక్తికి మించి అలసట చెందుట – దీనివల్ల నిద్రపట్టక పోవుట, అస్తిమితం, మనసును పని / చదువు మీద కేంద్రీకరించ లేక పోవుట – ఆకలి నశించుట, క్రుంగిన మనసు, విసుగు చెందుట / ఎక్కువ నపుంసకత్వం, జ్ఞాపకశక్తి నశించుట.

★ పిల్లలలో చిరచిరలాడుట, విసుగు – నాడీ వ్యవస్థలో ఏర్పడే ఇబ్బందుల వల్ల తరచుగ వచ్చే అసహనం, భయం, చిరచిరలాడు స్వభావం, రాత్రి భయాలు – అరుస్తూ, బిగ్గరగ కేకలు వేస్తూ నిద్ర నుండి మేల్కొనుట, నిద్రలో నడచుట, తేలికగ ఉత్తేజం పొందుట, ఏమాత్రం శబ్దమైనా ఉలికి పడుట, బాగ నిద్రపోయినపుడు మాట్లాడుట, మేల్కొన్నప్పుడు ఎత్తుకొని రూము రూముకు తిప్పాలనుకొనుట, సులభంగా మేల్కొనుట, మేల్కొన్నప్పుడు అర్థంలేని ప్రేలుడు.

★ వ్యాపారంలోను, ధనమునకు సంబంధించిన విషయాల్లో నిరాశ.

★ ప్రజలతో కలియుటకు ఇష్టపడకుండుట.

★ నిరుత్సాహం, నిస్త్రాణ, శబ్దమంటే అమిత భయం పొందుట, ధ్వనిని ఏమాత్రం సహించలేకపోవుట.

★ మందబుద్ధి, శక్తి లేకపోవుట, పిరికితనం.

★ నిజముగ లేనివాటిని ఊహించుట, ఇంటిమీద బెంగ.

★ అనారోగ్యకరమైన జ్ఞాపకశక్తి – గతపు దృశ్యాలు వెంటాడుట, వాటిని తిరిగి పొందాలనుకొనుట.

★ నరాల అలసట వల్ల అనారోగ్యమును గూర్చి అమిత ఆందోళనతో అత్యధికముగ క్రుంగుట, విచారం / దుఃఖం, కోపం.

★ మానసిక భ్రమలు, తప్పుడు ప్రభావాలు, కల్పనలు.

★ అలసట, క్రుంగినస్థితి, శక్తి / బలం లేకుండుట.

★ పిచ్చి, సరైన తర్కశక్తి లేకపోవుట.

★ పిచ్చి వేరు–వేరు స్థాయిలలో.

★ విచారం / దుఃఖం వల్ల వెన్నెముకలోని నాడీ కేంద్రాలను వ్యాధిగ్రస్తం చేయుట.

★ పాక్షిక / సంపూర్ణమైన పక్షవాతంలో పరిస్థితిని మెరుగు పరచుటకు దీనిని వాడాలి.

★ స్థిమితం లేకుండుట, తేలికగ కోపం చెందుట.

★ నిట్టూర్పు, క్రుంగిపోవుట, ప్రతి విషయంలోను చెడును గూర్చియే ఆలోచించుట.

★ నిద్రలో నిట్టూర్చుట, మూలుగుట.

★ సిగ్గు పడుట / బిడియ పడుట, భావోద్రేకం వల్ల ముఖం ఎరుపెక్కుట.

★ రక్తనాళాల పైపొరకు సంబంధించిన నరాలను అదుపులో పెట్టు శక్తి లేకపోవుట.

★ తాకినా / అకస్మాత్తుగ ఏ ధ్వని అయినా ఉలిక్కి పడుట.

★ దుఃఖంతో బిగ్గరగ ఏడ్చుట – చిన్న వాటిని పెద్దవిగా చేయుట – దుఃఖం / విచారం తర్వాత కలుగు పరిణామాలు.
★ అన్నిరకాల మానసిక వ్యాధులుతగ్గి ఆరోగ్యం చేకూరు స్థితిలో ఈ మందును వాడాలి.
★ హస్త ప్రయోగం వల్ల కలిగే పిచ్చి.
★ ఈ వ్యాధి రోగి తన చర్యలో మందబుద్ధి కలవాడు కాదు. అతడు స్థిమితం లేనివాడు, విచారముగ నుండును. కొన్ని సందర్భాలలో తగాదా పడువాడుగా ఉండును.

**నేట్రంసల్ఫ్ 6× – 12× :** ఆత్మహత్య చేసుకోవాలనే భావన కలిగి యుండును. కాని ఆత్మహత్య చేసుకొనుటలో ఎంతో నిగ్రహం ప్రదర్శించుట – తలకు గాయాలు / దెబ్బలు కలుగుట, క్రింద పడుట వల్ల కలిగే మానసిక ప్రమాదాలు – సంగీతం భరించలేక పోవుట, అది అతనిని విచారకరంగా మార్చుట.

**మెగ్నీషియంఫాస్ 6× – 30× :** ఇంద్రియాల భ్రమలు – ఎక్కువగా మరచిపోవు స్వభావం – మందకొడితనం – స్పష్టంగా ఆలోచించలేకపోవుట– ఎలాంటి మానసిక శ్రమకు ఇష్టపడకుండుట.

**నేట్రంమూర్ 6× – 12× :** ఎక్కువ దుఃఖం – భవిష్యత్తుని గురించి ఆందోళన చెందుట – ఆహ్లాదకరంకాని వాటిని ఇష్టపడుట – ఓదార్పు వల్ల పరిస్థితి మరింత దిగజారుట – అనారోగ్యము గూర్చి అమిత ఆందోళనతో అత్యధికముగ క్రుంగియుండుట. ఆమత్వక్కులు పొడిగా యుండుట, వాటి క్షోభ – మలబద్ధకం, మలం గట్టిగ వుండుట – విచారం, గుండె వడిగా కొట్టుకొనుట, సాంగత్యాన్ని వదులుకొనుట – విసుగు చెందినట్లుగ వుండుట.

**నేట్రంఫాస్ 6× – 12× :** నరాల నొప్పులతో బాధపడుట – చిరాకు చెందుట – చిన్నవాటిపై విసుగు చెందుట – కుతూహలం కలిగియుండుట – భయపడుట – కుర్చీలు, బల్లలు మొదలగువాటిని మనుష్యులుగా భావించుట – తర్వాతి గది నుండి అడుగుల చప్పుడు వినుట.

**సైలీషియా 6× – 12× :** ఈ రోగి తాను ఒకే సమయమున రెండు చోట్ల వున్నట్లు భావించును – గుండుసూదులు (pins) కు సంబంధించి ఎప్పుడూ ఆలోచిస్తూ ఉండును – ఇంటిని గూర్చి, బంధువులను గూర్చి కోరిక కలిగియుండుట – విచారముగ, మొండిగ, ముక్కోపిగ వుండుట – సాగిలబడుట, నరాల బలహీనత – అస్థిమితం, భారీ కలలు – వీటికి సంబంధించిన లక్షణాలు వాతావరణ మార్పువల్ల, తుఫాను సమయమున, పౌర్ణమి రోజున అధికమగుట.

**కాల్కేరియాఫ్లోర్ 6× – 12× :** బాగ క్రుంగిపోవుట, ఆర్థిక నష్టం కలుగునని ఎట్టి ఆధారం లేకుండగనే భావించుట – ఎట్టి నిర్ణయం తీసుకొనకుండుట.

## 2. మెదడు అదురుపాటు
### (Brain Concussion)

మెదడుకు దెబ్బ తగులుట వల్ల దానిలోని రక్తనాళాలు తెగి మెదడులో అదురుపాటు సంభవించును. అదురుపాటు మెదడు ఏ ప్రాంతమున సంభవించునో, అచ్చట ఉన్న నరము ఏ అవయవము దాకా వెళ్ళునో ఆ అవయవములో కూడా కలత ఏర్పడును. మానసిక సమస్యల వల్ల కూడా ఈ విధంగా జరగవచ్చు.

**కాలీఫాస్ 6×** : ఉబ్బసపు పరిస్థితులు – పెద్దవైన కనుపాపలు – మెదడు కణాలు పనిచేయుట తగ్గిపోవుట – ఫలితంగా మెదడులో అదురుపాటు కలుగుట.

**ఫెర్రంఫాస్ 6×–12×** : జ్వరపు ఇబ్బందులపైన ఆధారపడిన మెదడు అదురుపాటు.

**మెగ్నీషియంఫాస్ 6×–12×** : మెదడు అదురుపాటు – కంటికి సంబంధించిన భ్రమలు.

**కాల్కేరియాఫాస్ 6×** : మెదడు అదురుపాటుతో పాటు తిమ్మిరి వున్నచో ఈ మందును మధ్య మధ్య వాడాలి.

**నేట్రంసల్ఫ్ 6×** : క్రిందపడుట, దెబ్బలవల్ల మెదడులో అదురుపాటు – ఇది చాలా కాలం నుంచి ఉండుట.

## 3. మెదడు అలసట
### (Brain Fag)

మెదడు కొన్ని సందర్భాలలో బాగా అలసట చెందుతుంది.

**కారణాలు** : 1) అధిక మానసిక శ్రమ 2) విశ్రాంతి, వినోదం లేకుండుట 3) ఒత్తిడి 4) మానసిక ఆందోళన 5) క్రుంగిపోవుట 6) ఆర్థిక ఇబ్బందులు 7) శారీరక అనారోగ్యం

**నివారణోపాయాలు** : 1) మానసిక ప్రశాంతత 2) యోగ – ధ్యానం 3) విశ్రాంతి గైకొనుట 4) వినోదం 5) కుటుంబ సభ్యులతో సరదాగా గడుపుట 6) పెద్దల సలహా తీసుకొనుట – వీలైన సందర్భాలలో ఆచరించుట.

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 3× - 12×** : నాడీ మండలం శక్తి పూర్తిగా నశించుట – చైతన్యం క్రుంగిపోవుట – రాత్రిపూట చెమట అధికంగా వుండుట – పాలిపోయిన ముఖం – పురుష లక్షణములు గల స్త్రీలో మీసము, గెడ్డం కలుగు శక్తి క్షీణించుట – అలవాటుగా మారిన శీతలత్వం – బలహీనత వల్ల కాళ్ళు – చేతుల ధమనులు సంకోచించుట – నిద్రలేమి, ఆకలి నశించుట – తిమ్మిరి.

**సైలీషియా 6× – 12× :** గాబరా – మనస్సును ఒక విషయముపై కేంద్రీకరించలేకపోవుట – కుతూహలముతో చూచుట – చదవాలన్నా, వ్రాయాలన్నా అలసట – ఆలోచించ లేకపోవుట – చాలా బలహీనత – త్వరగా అలసట చెంది విశ్రాంతి కోరుట – స్కూలుకు వెళ్ళు విద్యార్థినులలో మెదడు అలసట చెందుట – పద్యములు మొ॥ వాటిని అప్పుజెప్పు నపుడు గాబరా చెందుట – తన ఆలోచనలపై కేంద్రీకరించలేక పోవుటే ముఖ్య కారణం. ఆలోచించదలచును. కాని అలా చేయలేకపోవును.

**కాలీఫాస్ 6× :** కోల్పోయిన నాడీ శక్తిని తిరిగి పొందుట – తల వెనుక భాగాన మందస్థాయిలో నున్న భారీ నొప్పి – నిద్రమత్తు – విశ్రాంతి లేకపోవుట – నాలుక నుండి దుర్వాసనగల శ్వాస.

**నేట్రంమూర్ 6× :** నిద్రలేమి – విచారము – ముందు జరగబోవు చెడును గూర్చి ఆలోచిస్తూ ఉండుట – మాట్లాడిన తర్వాత అలసట– మెదడు కలత చెందుట (embarrassment)

**మెగ్నీషియంఫాస్ 6×–12× :** నరాల నొప్పి, వణకుట, సాధారణ బలహీనత మొదలగు లక్షణాలకు ప్రధానమైన మందు.

## 4. మెదడు వ్యాధులు
## (Brain Diseases)

మెదడులోని న్యూరోట్రాన్స్‌మీటర్స్ సంఖ్య తగ్గటం వల్ల, రక్తం గడ్డకట్టుట వల్ల అది సరిగా పనిచేయదు. మెదడులోని రక్తనాళాల / రక్తం మార్పు వల్ల రక్తం గడ్డ కడ్తుంది. ఈ కారణాల వల్ల మెదడు వ్యాధులు వస్తాయి. క్రుంగిపోవుట, అలసట మొదలగు సమస్యలు ఏర్పడుతాయి.

**నివారణోపాయాలు :**

1) మానసిక ప్రశాంతత అవసరం. ప్రాణాయామం, ధ్యానం ఉపయోగ పడును. 2) పౌష్టిక పదార్థాలు, పీచు ఉండే ఆహార పదార్థాలు తినాలి.

### • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12× :** వాపుకు సంబంధించిన బాధలు.

**కాలీఫాస్ 6× :** మెదడుకు రక్తసరఫరా తక్కువగుటచే మన శరీరభాగపు పనులు పూర్తిగ గాని, కొంత వరకుగాని పాడగుట – ఈ లక్షణముతో పాటు కపాలములో ద్రవము కూడా పెరిగినచో ఈ మందుతోపాటు కాల్కేరియాఫాస్‌ను కూడా వాడాలి. వాపువల్ల రక్తసరఫరా తగ్గి శరీరపు పనులు తగ్గిపోయినను, వ్యాధిని గుర్తించుటకు వీలులేనట్లు

ప్రారంభమై, తదుపరి వ్యాధి లక్షణాలు స్పష్టంగా కనబడుట – మెదడు / వెన్నెముకలో అదురుపాటు కలిగి అది ఏ అవయవమునకు ప్రాకునో ఆ అవయవములో అదురుపాటు కనిపించుట – దుర్వాసనగల విరేచనాలు – నిద్రలేమి – స్పృహ పూర్తిగగాని, కొంత వరకుగాని పోవుట.

**మెగ్నీషియంఫాస్ 6× – 12× :** కంపములతో కూడిన లక్షణాలు ఉండుట – వెన్నెముక స్పృహ పోయిన తర్వాత దృష్టిదోషాలు ఏర్పడుట.

**కాల్కేరియాఫాస్ 3× – 12× :** కపాలములో ద్రవం పెరిగిన దీర్ఘకాలపు వ్యాధి – బ్రహ్మరంధ్రం చాలా కాలంగా తెరచి ఉండుట – కపాలము క్రమముగా శుష్కించుట.

**కాల్కేరియాఫ్లోర్ 3× – 30× :** నూతనముగా జన్మించిన శిశువు తలపై కలిగిన రక్తపు కంతి.

**నేట్రంసల్ఫ్ 3× – 6× :** తలకు గాయాలు తగిలిన తర్వాత వచ్చు మానసిక బాధలు – తలవెనుక భాగాన తీవ్రమైన నొప్పి.

## 5. మెదడువాపు
## (Brain fever / Meningitis)

మెదడును, వెన్నెముకలోని మజ్జను చుట్టియుండు మెనింజస్ అను పొరల వాపును మెదడు వాపు అని అందురు. ఇది సామాన్యంగ 15 సంవత్సరములలోపు వయస్సు ఉన్న పిల్లలకు వస్తుంది. ఈ మధ్య కాలములో దోమకాటు ఎక్కువగా ఉండుటచే ఈ వ్యాధికి ఎంతోమంది గురై చనిపోతున్నారు.

**లక్షణాలు :**

1. తల పగిలిపోయేటట్లు నొప్పి
2. మెడ కండరములు బిర్రబిగియుటచే వంగకుండా ఉండుట
3. హెచ్చు జ్వరం
4. వాంతులు, విరేచనాలు
5. అవయవములు అసంకల్పితముగ కదలుట
6. శరీరం మెలికలు తిరిగి కొట్టుకోవటం (కంపనాలు)
7. శరీరంలో ఏదో ఒకవైపు పక్షవాతం – కంటి కండరాల పక్షవాతం వల్ల మెల్లకన్ను ఏర్పడుట / చూపు పోవుట
8. వ్యాధి ముదిరిన అపస్మారకస్థితి

**వ్యాధి నిర్ధారణ పరీక్ష :** పై లక్షణాలను బట్టియే కాకుండ అల్లోపతి వైద్యులు వెన్నుపూసలో నుండి సూదిని గ్రుచ్చి మస్తిష్కమేరు ద్రవం తీసి పరీక్ష చేయుదురు.

**కారణాలు :** ఇది వైరస్‌వల్ల వస్తుంది. జంతువులపై వాలిన దోమలు వైరస్‌ను పీల్చుకొని ఆరోగ్యవంతుని శరీరంలో చేరుట వల్ల ఈ వ్యాధి వస్తుంది. పందులను కుట్టిన దోమ మనిషిని కుట్టిన 7–10 రోజుల లోగా ఈ వ్యాధి వస్తుంది. మనుష్యుల నుంచి మనుష్యులకు ఈ వ్యాధి రాదు. ఈ వ్యాధి వర్షాకాలంలో ఎక్కువగా వస్తుంది. సాధారణంగా జూన్ నుంచి డిసెంబర్ ఆఖరివారం వరకు ఈ వ్యాధి వచ్చే అవకాశం ఉంది.

**నివారణోపాయాలు :**

1. దోమలు కుట్టకుండా దోమతెరలు వాడాలి. గాంధీగారు కూడా దోమతెర వాడేవారట.
2. ఇంటిలోనికి దోమలు రాకుండా కిటికీలకు, తలుపులకు సన్నటి జాలి (mesh) బిగించుకొనుట మంచిది.
3. దోమల నుంచి రక్షణ పొందుటకు ఇంట్లో జెట్, మస్కిటో కాయిల్ వంటివి వాడాలి. ఇంట్లో వేపాకు పొగ వేయాలి. గాంధీగారు దోమకాటు నుండి కాపాడుకొనుటకు శరీరానికి కిరోసిన్ పూసుకొనే వారట. కిరోసిన్ వాసనకు దోమలు దగ్గరకు రావు.
4. ఇంటి చుట్టుప్రక్కల నీరు నిలువలేకుండా చూడాలి. ఇంటి మురికి నీటి గుంటలలో (Drainage canals) నీరు నిలవ ఉంటే ఆ నీటిలో కిరోసిన్, వాడిన ఇంజన్ ఆయిల్ చుక్కలు వేయాలి.
5. వరి పొలాలకుదగ్గర, కొండ ప్రాంతాలలో ఉండే ప్రజలు దోమకాటు నుండి కాపాడుకోవాలి.
6. పందులను ఊరికి 5 కిలోమీటర్ల దూరంలో ఉంచాలి.
7. పిల్లలకు జ్వరం వస్తే వెంటనే చికిత్స చేయించుట మంచిది.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ :** మెదడువాపు ప్రథమదశ – తీవ్రముగానున్న జ్వరం – వడిగానున్న నాడి – సంధి – తెలివితప్పిన స్థితి.

**కాలీమూర్ :** శరీర ధాతువులందుగాని, గుల్లగానుండు భాగములందుగాని ద్రవం కూడుట.

**కాల్కేరియాఫాస్ :** కపాలములో ద్రవం పెరుగువ్యాధి (తరుణ, దీర్ఘకాలిక) – కపాలములో ద్రవం పెరుగు పరిస్థితులు – బ్రహ్మరంధ్రం తెరవబడియుండుట – ఉత్సాహం మొ॥వి క్రుంగిపోవుట – కపాలములో ద్రవం పెరుగు వ్యాధి వున్న కుటుంబాలలో ఈ మందును 2× పొటెన్సీలో పొడి రూపమున ఉదయాన, సాయంకాలం ఇవ్వాలి. ఈ పరిస్థితి ఏర్పడివున్నచో దీనిని ఆర్జంటమ్ నైట్రికమ్‌తో మార్చాలి – **(గ్రావోగి)**

**నేట్రంసల్ఫ్ :** మెదడు అడుగుభాగమున తలనొప్పి. మెడ వెనుక వైస్‌లో దేనినైనా పెట్టిన ఎంత నొప్పి కలుగునో అంత నొప్పి/దంతములతో కొరికినట్టి నొప్పి – తలకు దెబ్బలు తగిలిన తర్వాత ఈ పరిస్థితి ఏర్పడుట.

**ద్వాదశ లవణ మిశ్రమం :** ప్రతి మోతాదులోను ఫెర్రంఫాస్ 3×-1 మాత్ర, కాలిమూర్ 3×-1 మాత్ర, నేట్రంమూర్ 12×-1 మాత్ర, నేట్రంసల్ఫ్ 3×-1 మాత్ర, మెగ్నీషియం ఫాస్ 3×-1 మాత్ర కలిపి మొత్తం 5 మాత్రలను తీసుకోవాలి. ఈ విధంగా 15 నిమిషములకొక మోతాదు వాడాలి.

**వ్యాధి నిరోధకం :**

1) హోమియో బెల్లడోనా 30/200, ఇపెకాక్ 30/200 మార్చి-మార్చి వాడాలి. ఈ విధంగా 3 రోజులు వాడాలి. 2) బెల్లడోనా 200 + కాల్కేరియా కార్బ్ 200 + ట్యూబర్ క్యూలినమ్ 10 ఎం.ఎం. 3) వ్యాక్సిన్ : 3 సం॥ల లోపు పిల్లలకు - 0.5 ఎం.ఎల్. (2 మోతాదులు), 3-15 సు॥లలోపు పిల్లలకు - 10 ఎం.ఎల్ (2 మోతాదులు)

మొదటి మోతాదుకి, రెండవ మోతాదుకి మధ్య వ్యవధి : 14 రోజులు.

## 6. ఎండ / వడ దెబ్బ (Sun stroke)

ఎండ / వడదెబ్బ ప్రాణాంతకమైనది. దీనివల్ల వ్యక్తి చనిపోవచ్చు లేదా గురకతో పొర్లు కలుగును. కనుక తగు జాగ్రత్త తీసుకొనవలెను.

**లక్షణాలు :**

**A. ఎండ / వడదెబ్బ తగులుటకు పూర్వం :** వడదెబ్బ తగులుటకు ముందు కొన్ని లక్షణాలు కనిపిస్తాయి.

1. ఓపిక లేకుండుట
2. నీరసం
3. ఆకలి లేకుండుట
4. ఎక్కువ దాహం
5. తల భారం
6. గొంతు తడి ఆరిపోవుట
7. మానసిక ఆందోళన
8. కలత నిద్ర

**అప్పుడప్పుడు ఈ లక్షణాలు కనిపించును -**

1. ముక్కు నుండి రక్తం కారుట 2. కళ్ళు ఎర్రబడుట 3. కడుపులో వికారం 4. వాంతులు 5. విరేచనాలు.

**B. ఎండ / వడ దెబ్బకు గురైన కనిపించు లక్షణాలు :**

పై లక్షణాలకు చికిత్స జరగనిచో వ్యక్తి వడదెబ్బకు గురియగును. అప్పుడు వ్యక్తిలో ఈ లక్షణాలు కనిపించును -

1. వడదెబ్బ తగిలినపుడు రోగి సొమ్మసిల్లి పడిపోవును. మెదడు చేయు పనులు స్తంభించవచ్చు.

2. ముఖం ఉబ్బరించి నీలముగ మారును.
3. ఊపిరి సల్పుట కష్టమగును.
4. నాడి బలహీనంగా ఉండును. అది త్వరితంగా కొట్టుకొనును.
5. నరముల పటుత్వం తప్పును.
6. ఉష్ణోగ్రత 106° F నుండి 110°F వరకు పెరుగును.
7. ఎండవేడిమి భరించలేకపోవుట, తల తిరుగుట, ఎండ తగిలినపుడు తలనొప్పి, మతిభ్రమణం, మలబద్ధకం, అజీర్ణం మొ॥ లక్షణాలు చాలా కాలం బాధించును.

**కారణాలు :** ఎండలో ఎక్కువసేపు ప్రయాణం చేయుట / పని చేయుట, తగినంత నీరు త్రాగక పోవుట, శక్తికి మించి పనిచేయుట, విశ్రాంతి తీసుకొనకుండ పనిచేయుట, సారాయి త్రాగు అలవాటు అధికముగ ఉండుట, బలహీనత, జ్వరంగా ఉండుట, గాలి - వెలుతురు సరిగ లేని చోట ఉండుట, ఎండ నుండి రక్షణ పొందే ఉపాయం చేయక పోవుట మొదలగు కారణాల వల్ల మెదడు అడుగు భాగాన ఉండే ధాతువులలోని తేమ పూర్తిగ గ్రహింపబడుట లేదా మెదడులో రక్తం కూడుట లేదా సిరల గుల్ల ప్రదేశంలో రక్తం కూడుటవల్ల మెదడు వాపు వచ్చును.

**వడదెబ్బ తగలకుండ తీసుకొనవలసిన జాగ్రత్తలు :**

1. ఎండలో ప్రయాణం / పని చేయుట వీలైనంత వరకు తగ్గించుకోవాలి. ఎండలో ప్రయాణం / పని చేయవలసిన పరిస్థితి ఏర్పడితే తలపై టోపీ / తడిగుడ్డ పెట్టుకోవాలి.
2. ఎండలో పోవుటకు ముందు కొద్దిగ ఉప్పు కలిపిన నీటిని త్రాగాలి.
3. కోసిన ఉల్లిపాయ (Onion) ను దగ్గర ఉంచుకోవాలి.
4. తరచుగ నీరు త్రాగుచుండాలి. కూల్‌డ్రింక్స్ త్రాగరాదు. వాటి వల్ల దాహం తీరదు.
5. ఎండలో తిరిగిన వెంటనే చల్లని పానీయం త్రాగరాదు.
6. ఎండలో తిరిగేవారు తెల్లని కాటన్ వస్త్రాలు ధరించాలి. అవి వేడిని త్రిప్పి కొడతాయి.

## • చికిత్స •

వడదెబ్బ తగిలిన వ్యక్తిని నీడలోనికి తీసుకొని రావాలి. బట్టలు వదులుచేసి గాలి తగిలేటట్లు చేయాలి. శుభ్రమైన వేడినీటితో ముఖం, తల, ఛాతీ, వెన్నెముక, కాళ్ళు, చేతులు తుడవాలి. తర్వాత చికిత్స చేయాలి.

**నేట్రంమూర్ 6X :** ఇది వడదెబ్బకు ప్రధానమైన మందు. జ్వర లక్షణములు ఉన్నప్పుడు దీనిని ఫెర్రంఫాస్‌తో మారుస్తూ ఇవ్వాలి. మెదడు లక్షణాలు ఉన్నచో కాలీఫాస్‌తో మార్చాలి.

***ముఖ్య గమనిక :*** *ఇది వ్యాధి నిరోధకంగా కూడ పనిచేయును. కనుక ఎండాకాలంలో రోజుకు ఒక మోతాదు తీసుకున్నచో వడదెబ్బ నుండి రక్షణ పొందవచ్చు.*

# 7. మరచిపోవుట
## (Forgetfulness)

మరచిపోవుట అనేది భగవంతుడు ఇచ్చిన వరం. దీనివల్ల జీవితంలో విషాదకరమైన సంఘటనలను కొంత వరకు / పూర్తిగా మరచిపోయి మిగిలిన జీవిత కాలాన్ని ఆనందకరంగా గడపగలుగుతున్నాం. కాని వృద్ధాప్యంలో మరచిపోవుట సహజంగానే జరుగుతుంది. కొంతమందిలో ఈ మరచిపోవుట చాల అధికంగా ఉంటుంది.

జ్ఞాపకం లేకపోవుటను మరచిపోవుట అని అంటారు. జ్ఞాపకం, మరచిపోవుట రెండు మెదడుకు సంబంధించిన విషయాలు. మెదడులోని కణాల అమరిక / వాటిలో వచ్చిన మార్పుల వల్ల మరచిపోవుట జరుగుతుంది.

**కారణాలు:** 1) మెదడుకు దెబ్బ తగులుట 2) మెదడులో కంతులు (Tumors) ఏర్పడుట 3) మెదడులోని కణాల సంఖ్య తగ్గుట, వాటికి రక్తప్రసరణ సరిగ లేకపోవుట 4) సిగరెట్లు త్రాగుట 5) కొన్ని మందుల సైడ్ ఎఫెక్ట్స్.

### • చికిత్స •

**కాలిఫాస్ 6X :** జ్ఞాపకశక్తిని కోల్పోవుట – అక్షరాలు / శబ్దాలు వ్రాస్తున్నప్పుడు కొన్నిటిని విడిచిపెట్టుట – తప్పుడు శబ్దాలను ప్రయోగించుట – ఆలోచనల గాబరా – శారీరక శ్రమను గొప్ప పనిగ భావించుట.

**మెగ్నీషియంఫాస్ 30X :** మందబుద్ధి – స్పష్టంగా ఆలోచించలేకపోవుట – మానసిక శ్రమ చేయలేక పోవుట – నిరంతరం తనను గురించి మాట్లాడుట / మౌనంగా కూర్చొనుట – శారీరక / మానసిక శ్రమ చేయకపోవుట.

**కాల్కేరియాఫాస్ 12X :** జ్ఞాపకశక్తి మందగించుట – మానసిక ఆదుర్దా, దానికి సంబంధించిన ఇబ్బందులు – మానసిక శ్రమ చేయలేకపోవుట – అశక్తమైన బుద్ధిగల పిల్లలకు, చిరచిరలాడు స్వభావం, కోపపడు స్వభావం, మందబుద్ధి, చాల ఆలస్యంగ విషయాలను అర్థం చేసుకొనుట – ఈ లక్షణాలు ఉన్నవారికి ఈ మందు బాగ ఉపయోగకారి.

**నేట్రంమూర్ 6X :** మెదడు శక్తికి మించి అలియుటచే నిద్ర పట్టకపోవుట, అస్తిమితం, మనస్సును పని / చదువు మీద కేంద్రీకరించలేక పోవుట – ఈ లక్షణాలతో జ్ఞాపకశక్తి బలహీనంగా ఉండుట – తెలివి / బుద్ధికి సంబంధించిన ఎట్టి చిన్న పనైనా అలసటను కలిగించుట.

## 8. నిద్రకు సంబంధించిన బాధలు

**కాలీమూర్ 3x - 6x :** చిన్న శబ్దానికి కూడ ఉలిక్కి పడుట – నిద్రమత్తు, స్థిమితం లేని నిద్ర.

**కాలీఫాస్ 6x - 12x :** నరాల ఉద్రేకం వల్ల నిద్రలేమి – పిల్లలు నిద్రలో నడచుట – ఆవలించుట, సాగదీయుట, అలసట – పొట్ట గుంటలో ఖాళీగానున్న భావన – మూర్ఛకు సంబంధించిన ఆవలింత – రాత్రిపూట పిల్లల భయం – భయంతో అరచుట వల్ల గాఢమైన నిద్ర నుండి మేల్కొనుట – ఉదయాన మేల్కొనే కోరిక లేకుండుట – గాఢమైన నిద్ర తర్వాత కండరాలు అదురుచుండుట.

**కాల్కేరియాఫాస్ 6x :** ముసలివారిలో నిద్రమత్తు – విచారకరమైన ఆలోచనలు – ఉదయాన మేల్కొనుట కష్టంగా ఉండుట – పిల్లలు రాత్రిపూట అరచుట – నిరంతరం సాగదీయుట, ఆవలించుట.

**కాల్కేరియాసల్ఫ్ 3x - 6x :** ఆలోచనలతో రాత్రిపూట నిద్రలేకుండుటతో మేల్కొని యుండుట – పగటిపూట నిద్రవచ్చుట – భయంతో ఈడ్పు.

**ఫెర్రంఫాస్ 6x - 30x :** మెదడులో రక్తం అధికమగుటచే నిద్రలేకపోవుట – రాత్రి పూట స్థిమితం లేకుండుట – ఆందోళనకరమగు కలలు – మధ్యాహ్నం నిద్రమత్తు.

**కాలీసల్ఫ్ 3x -6x :** స్థిమితం లేని నిద్ర – తరచుగ మేల్కొనుట – ఉదయాన మేల్కొనుట.

**మెగ్నీషియంఫాస్ 3x-30x :** ఈడ్పులతో కూడిన ఆవలింతలు–మెదడుకు పోషణ లేక పోవుట లేక లభించుచున్న పోషకపదార్థాలు ఖర్చగుట వలన కలుగు నిద్రలేమి – నిద్రమత్తు.

**నేట్రంమూర్ 6x - 30x :** మెదడులో తేమ ఎక్కువగుటచే అధికమగు నిద్ర – సాధారణంగా లభించే నిద్రవల్ల తాజాదనం కలగకుండుట – ఉదయం లేచిన తర్వాత అలసటగ ఉండుట–రాత్రి ఆలస్యంగ నిద్రించుట–రాత్రిపూట స్థిమితం లేని నిద్ర లేమి, అసాధారణమైన చైతన్యంతో.

**నేట్రంఫాస్ 3x - 6x :** క్రిమి దోషం వల్ల నిద్రలో స్థిమితం లేకుండుట – అధికమైన నిద్రమత్తు – కూర్చొన్నప్పుడు నిద్ర వచ్చుట – దురద వల్ల నిద్ర లేకపోవుట – సులభంగా మేల్కొనుట – సంభోగ సంబంధమైన కలలు.

**నేట్రంసల్ఫ్ 6x :** నిద్రమత్తు తరచుగ కామెర్లకు పూర్వ సూచనగ వచ్చుట – పైత్యరస లక్షణాలు – చదువునపుడు, మధ్యాహ్నమునకు పూర్వం నిద్ర ఎక్కువగుట – అపానవాయువుచే కలుగు నొప్పి వల్ల మేల్కొనుట.

**సైలీషియా 6x - 12x :** రక్తం వడిగ ప్రవహించుట వల్ల నిద్రలేమి – గుండె కొట్టుకొనుట, నాడి తీవ్రంగ కొట్టుకొనుట, వేడిమి, నిద్రలో మాట్లాడుట, నిద్రలో కాళ్ళు, చేతులలో చివుక్కున లాగునట్టి నొప్పి – చెడు కలలు.

## 9. కలలు
### (Dreams)

**కాల్కేరియాఫ్లోర్ 6× - 30× :** విశదముగ నుండు కలలు - రానున్న ఆపదను సూచించునవి - కొత్త దృశ్యాలు, కొత్త ప్రదేశాలు.

**ఫెర్రంఫాస్ 6× - 12× :** ఆందోళనకరమైన కలలు - మధ్యాహ్నం తర్వాత నిద్రమత్తు.

**కాలీఫాస్ 6× - 12× :** నిప్పు, బందిపోటు దొంగలు, భూతాలు, క్రిందపడుట, నిరంతరం కలలలో కనిపించుట - విపరీతమైన కోరికలకు సంబంధించిన కలలు.

**కాలీసల్ఫ్ 3× - 6× :** చాల విశదముగ నుండు కలలు - పీడ కలలు.

**మెగ్నీషియంఫాస్ 3× - 6× :** ఇబ్బందికరమైన కలలతో నిద్రాభంగం - కపాలం వెనుక, మెడ వెనుక నొప్పి.

**నేట్రంమూర్ 3× - 200× :** ఇంట్లో బందిపోటు దొంగలు పడినట్లు కలలు - నిద్రలో ఉలిక్కిపడుట.

**నేట్రంఫాస్ 3× - 6× :** సంభోగ సందర్భమున కలలు.

**నేట్రంసల్ఫ్ 3× - 6× :** బరువైన ఆందోళనతో కూడిన కలలు - రాత్రిపూట ఆయాసం వల్ల మేల్కొనుట.

**సైలీషియా 6× - 12× :** చెడు కలలు.

## 10. చింత / వ్యాకులత
### (Anxiety Neurosis)

చింత మనిషిని క్రుంగదీస్తుంది. అది చాల అపాయకరమైనది. ప్రాచీన హిందీ కవియగు కబీరుదాసు చింతను చితి కంటే హేయమైనదిగా వర్ణించినారు. చితి నిర్జీవమైన శవాన్ని కాలుస్తుంది. కాని చింత సజీవమైన మానవుడ్నే కాల్చివేస్తుంది. అది మనిషిని పీల్చి పిప్పి చేస్తుంది.

**లక్షణాలు :** చాలామందిలో ఈ వ్యాధి ఉంటుంది. ఇది అనేక మందిలో అనేక రకాలుగ ఉంటుంది. కొంతమంది విపరీతమైన ఆందోళనతో బాధపడుతుంటారు. వారి చేతులు వణకుతాయి. పెన్ను పట్టుకోవటం కూడ వారికి కష్టమవుతుంది. వారు ఆఫీసుపని పూర్తి చేయలేరు. వారి కండరాలు బిగుసుకు పోతాయి. ఇది వారికి చాలా బాధాకరంగా ఉంటుంది.

కొందరికి చాలా అలసటగా ఉంటుంది. శక్తినిచ్చే ఆహారం, హార్లిక్స్, బోర్నవిటా వంటి పానీయాలు త్రాగినా వారి అలసట తగ్గదు. వారు చిన్న శబ్దాలకు కూడ ఉలిక్కి పడుతుంటారు. వారిలో భయం పెరుగుతుంది. కంగారు కంగారుగా ఉంటారు.

మరి కొంతమంది గుండె రైలు ఇంజనువలె వేగంగా కొట్టుకొంటుంది. వారిలో ఆందోళన ప్రారంభమవుతుంది. A.C. గదిలో ఉన్నా వారి దేహం నుండి వచ్చే వేడి ఎక్కువవుతుంది. వారు గుండెకు ఏమైనా అయిందేమోనని ఆందోళన చెందుతారు. వారిలో భయం ఆవరిస్తుంది. దీనిని కార్డియాక్ న్యూరోసిస్ అని అంటారు. వారు గుండెకు సంబంధించిన అన్ని పరీక్షలు చేయించుకొంటారు. డాక్టర్లు ఏమీ కాలేదని చెప్పినా నమ్మరు.

ఈ వ్యాధితో బాధపడేవారు తరచుగ మూత్ర విర్జనకు వెళ్ళవలసి వస్తుంది. కొంతమందికి పదే పదే మల విసర్జనకై మరుగుదొడ్డికి వెళ్ళవలసిన అవసరం ఏర్పడుతుంది. వారు ప్రయాణం చేయాలంటేనే భయపడుతూ ఉంటారు. వారి భయమంతా బస్సులో మూత్ర / మలవిర్జన పరిస్థితి ఏర్పడితే ఎలా అని? కొందరికైతే నిజంగానే అట్టి పరిస్థితి వస్తుంది. ఒక వైపున సిగ్గుతో కృంగిపోవాలి. మరొకవైపున ఆ పరిస్థితిని అధిగమించాలి.

ఇంకొందరిలో ఊపిరి ఆడక బాధ పడ్తారు. ఆయాసం అనిపిస్తుంది. కిటికీలు, తలుపులు అన్నీ తీసి ఉంచినా గాలి ఆడటం లేదని ఫిర్యాదు చేస్తూ ఉంటారు.

మరి కొంత మంది ప్రతిదానికీ భయపడుతూ ఉంటారు. ప్రతి దానికీ బాధ పడతారు. ఒక్కోసారి వారు దేనిని గురించి ఆందోళన చెందుతున్నారో, తెలియని పరిస్థితి. వారు దేనిమీదా దృష్టిని కేంద్రీకరించలేరు. వారిలో చిరాకు, విసుగు, అసహనం ఎక్కువగా ఉంటుంది. నిగ్రహం కోల్పోతారు. దేనికీ తట్టుకోలేరు. చివరి ఘడియలలో ఉన్నట్లు ప్రవర్తిస్తుంటారు.

**కారణాలు :** 1) జన్యుకారణం 2) రక్తసంబంధీకులలో వివాహాలు 3) దిగజారిన విలువలు 4) తల్లిదండ్రుల / వృద్ధుల పట్ల కుటుంబీకుల నిరాదరణ 5) పిల్లల పట్ల అతి గారాబం / కఠిన వైఖరి 6) పరుగుపందెం లాంటి జీవిత విధానం 7) ఆధునిక ఆహారపు అలవాట్లు 8) ఉమ్మడి కుటుంబాలు నాశనమగుట–సలహాలు, సంప్రదింపులకు అవకాశం లేకపోవుట.

**నివారణోపాయాలు :**

ఈ వ్యాధికి మందులకన్నా ఇతర విధానాలు అధిక ప్రయోజనకారిగా ఉంటాయి. వాటిని శ్రద్ధగా పాటిస్తే ఈ వ్యాధి తప్పక అదుపులోనికి వస్తుంది. అవి ఏవనగా –

1. జీవితం పట్ల ఆశావాద దృక్పథమును అవలంబించాలి.
2. ఒంటరితనం వదిలిపెట్టి పదిమందిలో కలసి ఉండే తత్త్వం అలవరచుకోవాలి.
3. సంగీతం, మంచి పాటలు వినే అలవాటు చేసుకోవాలి.

4. పిల్లలతో ఆడుకోవటం అలవరచుకోవాలి.
5. కాలం వేగంగా పరుగెత్తుతున్నది. తదనుగుణంగానే ఆదర్శాలు, అలవాట్లు, రుచులు మారుతున్నాయి. మారుతున్న వాటిని అర్థం చేసుకొని సర్దుబాటు తత్త్వాన్ని పెంచుకోవాలి.
6. అనుభవజ్ఞుల సలహాలు తీసుకొని పాటించాలి.
7. అవసరమైతే మానసిక శాస్త్రవేత్తల సలహాలు తీసుకోవాలి.
8. చేతనైన వ్యాయామం / శారీరక శ్రమ చేయాలి.

## • చికిత్స •

**ద్వాదశ లవణ మిశ్రమం :**

**ఉదయం పూట :** కాల్కేరియా ఫ్లోర్ – 1 మాత్ర + కాల్కేరియా ఫాస్ – 1 మాత్ర + కాల్కేరియా సల్ఫ్ – 1 మాత్ర + ఫెర్రంఫాస్ – 1 మాత్ర = మొత్తం 4 మాత్రలు.

**రాత్రిపూట :** కాలీఫాస్ – 1 మాత్ర + కాలీసల్ఫ్ – 1 మాత్ర + నేట్రంమూర్ – 1 మాత్ర + నేట్రంఫాస్ –1 మాత్ర + నేట్రంసల్ఫ్ –1 మాత్ర + సైలీషియా–1 మాత్ర=6 మాత్రలు.

# 11. క్రుంగిపోవుట
## (Depression)

నలుగురి నుండి ఒంటరితనం కోరుకొనుట, పనులలో ఆసక్తి కోల్పోవుట, జీవితంలో సంతోషాన్ని, ఆనందాన్ని కోల్పోవుట, బాధ, దిగులు, అసంతృప్తి, శరీరపు నొప్పులతోను, నిద్రలేమితోను బాధపడుట మొ॥వి వ్యక్తి క్రుంగిపోవుటను తెలుపును.

**లక్షణాలు :** 1) క్రుంగిపోయిన / డిప్రెషన్‌కు గురైన వ్యక్తి ఆలోచనలు అగమ్యగోచరంగా ఉంటాయి. 2) అతడు చిన్న విషయంలో కూడా నిర్ణయం తీసుకోలేడు. 3) అతనికి భవిష్యత్తు అంధకారమయంగా కనిపిస్తుంది. కనుక భవిష్యత్తుపై నిరాశ ఉంటుంది. 4) కొంతమందిలో నిరాసక్తి, ఆకలిలేమి, బరువు తగ్గుట ఉంటాయి. మరికొంత మందిలో ఆకలి, బరువు పెరుగుట లక్షణాలు ఉంటాయి. 5) కొంతమంది నిద్రలేమితో బాధపడు తుండగా మరికొంతమంది అతి నిద్రతో బాధ పడుతుంటారు. 6) వీరు కారణం లేకుండా భయాందోళనలకు గురి అవుతుంటారు. 7) అలసట, బద్ధకం, విసుగు, చిరాకు, బోర్ కొట్టడం, ఏకాగ్రత లోపం, కోపగించుకొనుట, దాంపత్య జీవితంపై ఆసక్తి సన్నగిల్లుట మొ॥ లక్షణాలు ఉంటాయి. 8) తప్పు చేశామనే భావనతో బాధ పడుతుంటారు. 9) కొంతమందిలో ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచనలు వస్తూ ఉంటాయి. వారిలో కొంతమంది అట్టి ప్రయత్నం కూడా చేస్తూ ఉంటారు.

**కారణాలు :** 1) వంశపారంపర్యత. 2) మెదడులోని సెరోటినిన్, నార్‌లపి నెఫ్రిన్ వంటి బయోలాజికల్ పదార్థాల లభ్యతలో తేడాలు వచ్చుట. 3) సరైన వ్యక్తిత్వం అభివృద్ధి చెందక పోవుట. 4) స్త్రీలలో స్వతంత్రత, ఆర్థిక స్వావలంబన లోపించుట. 5) తమ అభిప్రాయాలను, భావోద్వేగాలను అణచుకొనుట.

**నివారణోపాయాలు :**

1) బాధపెట్టే విషయాలను ఆత్మీయులతో చెప్పుకొనుట. 2) నలుగురితో కలసి బతుకుట నేర్చుకొనుట. 3) బాధలను, భావోద్వేగాలను మనసులోనే దాచుకోకుండా బయటకు రానిచ్చుట. 4) పౌష్టిక ఆహారం తీసుకొనుట. 5) ప్రశాంత వాతావరణంలో గడుపుట. 6) సంగీతం / పాటలు వినుట. 7) ఇంటి పెద్దల సలహా సంప్రదింపులు తీసుకొనుట. 8) మానసిక వైద్య నిపుణుల సలహా తీసుకొనుట.

**• చికిత్స •**

**ద్వాదశ లవణ మిశ్రమం :** కొంతకాలంపాటు వాడాలి.

| ఉదయం మోతాదు | రాత్రి మోతాదు |
|---|---|
| కాల్కేరియా ఫ్లోర్ 6× = 2 మాత్రలు<br>కాల్కేరియా సల్ఫ్ 6× = 1 మాత్ర<br>ఫెర్రంఫాస్ 6× = 1 మాత్ర | కాలీఫాస్ 6× = 2 మాత్రలు<br>నేట్రంమూర్ 6× = 1 మాత్ర<br>నేట్రంసల్ఫ్ 6× = 1 మాత్ర |
| మొత్తం = 4 మాత్రలు | మొత్తం = 4 మాత్రలు |

## 12. ఆవలింతలు
## (Yawning)

కొంతమంది ఎక్కువగా ఆవలిస్తూ ఉంటారు. అందువల్ల ఇది ఒక వ్యాధి అని భావించవచ్చు. ఒక వ్యక్తి ఆవలిస్తూ ఉంటే ప్రక్కవారు కూడా ఆవలిస్తూ ఉంటారు. అందుచే దీనిని అంటువ్యాధిగా భావించేవారూ ఉండవచ్చు. కాని ఇది వ్యాధి కానీ అంటువ్యాధికానీ కాదు.

ఆవలింతలు అలసిపోయిన శరీరానికి మేలు చేసే జీవభౌతిక చర్యలు. నిద్ర తక్కువవైనపుడు, బాగా విసుగు కలిగించే పరిస్థితులు ఏర్పడినపుడు మెదడు బాగా అలసిపోతుంది. అప్పుడు గుండెను బాగా కొట్టుకొనేటట్లు చేసి రక్తాన్ని తన వద్దకు అధికంగా తెప్పించుకొనుటకు లేదా రక్తంలో తక్కువగా ఉన్న ఆక్సిజన్ స్థాయిని పెంచే వేరే యంత్రాంగం ఏదీ లేదు. ఆవలింతలు ఆ పనిని చేస్తాయి.

ఆవలించినపుడు నోటి ద్వారా గాలిని ఎక్కువగా పీల్చుకొనుట జరుగుతుంది. ఆ గాలిలో ఎక్కువగా ఉన్న ఆక్సిజన్ రక్తంలో కలుస్తుంది. దీనివల్ల మెదడుకు తాత్కాలిక ఉపశమనం లభిస్తుంది.

ఆవలింతలను గురించి ఈ రెండు విషయాలు తెలుసుకొనుట అవసరం –

1. మనం అలసిపోయినట్లయిన ప్రక్కవారు ఆవలించినా మనకు ఆవలింతలు రావు.
2. మనం అలసిపోయి యున్నచో ప్రక్కవారు ఆవలించినంత మాత్రాన మనం కూడా ఆవలిస్తామనే నియమం ఏదీ లేదు.

## 13. అబ్సెసివ్ కంపల్సివ్ డిజార్డర్

**అబ్సెషన్స్ :** ఒక వ్యక్తి ప్రమేయం లేకుండానే అనేక రకాల ఆలోచనలు, దృశ్యాలు, అనుమానాలు పదేపదే మనసులో రావటాన్ని అబ్సెషన్స్ అంటారు.

**ఉదా :** 1. చేతులు కలుషితమయ్యాయని భావించుట.

2. ఊరికి వెళ్లేటప్పుడు టి.వి. ఆఫ్ చేశామా? లేదా? బీరువాకు తాళం సరిగా వేసామా, లేదా?
3. కోడలు అన్నం, కూరలు వండిన తర్వాత డైనింగ్ టేబుల్‌పై వాటన్నింటినీ ఒక పద్ధతిలో అమర్చుతూ ఉంటుంది. అత్తగారు ఆ విధంగా చేయరు.

**కంపల్షన్స్ :** కొంతమంది తమలో కలిగే అనవసరమైన, అహేతుకమైన, ఇబ్బందికరమైన ఆలోచనలను ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిస్తూ ఉంటారు. వీటిని కంపల్షన్స్ అని అంటారు. పైన పేర్కొన్న అబ్సెషన్స్ కంపల్షన్స్‌గా ఎలా మారుతాయో చూద్దాం.

**ఉదా :**

1) చేతులు కలుషితమయ్యాయని భావించి ఎన్నోసార్లు తాము చేతులు కడు క్కుంటూ ఉంటారు. అంతేగాకుండా కుటుంబంలోని వారి నందరినీ చేతులు కడుగు కోవలసిందిగా చెబుతూ ఉంటారు. అలా చెప్పినప్పుడు ఇతరులు పాటిస్తే తమ ఆందోళనకు తాత్కాలికంగా ఉపశమనం లభిస్తుంది. కాని ఇతరులు పాటించక ఆ పద్ధతిని విమర్శిం చినచో వారి ఆందోళన పెరుగుతుంది.

2) టి.వి. ఆఫ్ చేసినదీ లేనిదీ, బీరువాకు తాళం సరిగా వేసినదీ, లేనిదీ మరలా చూసి సంతృప్తి చెందినప్పుడు వారి ఆందోళనకు తాత్కాలికంగా ఉపశమనం లభిస్తుంది. కాని దీనివల్ల శ్రమ పెరుగుతుంది. సమయం అధికంగా వృథా అవుతుంది. ఏ బస్సు / రైలుకు వెళ్ళాలని భావిస్తూ ఉంటారో ఆ బస్సు / రైలు వెళ్ళిపోయియున్నచో ఆ ఆందోళన మరింత ఎక్కువవుతుంది.

3) వస్తువులు అన్నింటినీ ఒక పద్ధతిలో సమకూర్చటంలో కోడలుకు కొంత ఎక్కువ సమయం కేటాయించవలసి వస్తుంది. కాని ఆమె కోరిక నెరవేరుతుండటం వల్ల ఆమె ఆందోళన తగ్గవచ్చు. కాని ఆమె పద్ధతి నచ్చని కుటుంబ సభ్యులు ఆమె పద్ధతిని ఛాందస పద్ధతిగా భావించవచ్చు. వారు ఆమె పద్ధతిని వ్యతిరేకించటమే గాక ఆచరణలో కూడా వ్యతిరేతను కనబరచినచో ఆమె ఆందోళన పెరుగుతుంది.

**నివారణోపాయాలు :**

పై వ్యాధితో బాధపడే వారు ఇతర వ్యాపకాలను పెంచుకోవాలి. ఇతర వ్యాపకాల వల్ల వారు తమ వ్యాధి వల్ల కలిగే ఆందోళనను మరచిపోగలరు. ఆ విధంగా శాంతి లభిస్తుంది.

## • చికిత్స •

పై వ్యాధితో బాధపడుతున్న రోగుల ఇతర వ్యాధుల లక్షణాలను కలుపుకొని ద్వాదశ లవణమును ఎంపిక చేసుకొని చికిత్స చేయాలి. ఈ చికిత్స కొన్ని నెలలు పడ్తుంది. జాగ్రత్తగా ఉండాలి.

# 6

# కంటి వ్యాధులు

## (DISEASES OF THE EYE)

### 1. కన్ను
### (Eye)

కన్ను ఒక జ్ఞానేంద్రియం. అది జ్ఞానేంద్రియాలలో ప్రధానమైనది. అందుకే 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అని అంటారు. కళ్ళవలన మనం భగవంతుడు సృష్టించిన ప్రాణులను, అతడు నిర్మించిన విశ్వములోని సౌందర్యాన్ని చూసి ఆనందించ గలుగుతున్నాము.

కన్ను ఒక కెమెరా వంటిది. వాస్తవానికి అది కెమెరా కంటే గొప్పది. కెమెరాతో ఫోటోలు తీయునపుడు వస్తువునకు, దానికి మధ్యగల దూరాన్ని మనిషి సరిచేయవలసి వుంటుంది. కాని కన్ను తనంతట తానే వస్తువు దూరాన్ని బట్టి సర్దుకొంటుంది. దానివల్ల అది దగ్గరి వస్తువులనే గాక దూరపు వస్తువులను కూడ చూడగలుగుతుంది.

మనము చూసే కంటిలో ఈ భాగాలు ఉంటాయి – 1) కనుబొమ 2) పైన ఒక కనురెప్ప, క్రింద మరొక కనురెప్ప 3) కనురెప్ప మీద వెంట్రుకలు. 4) తెల్లగ్రుడ్డు (Sclera) 5) నల్లగ్రుడ్డు (Iris) 6) కనుపాప (Pupil) 7) పట్టకము / కటకము (Lens).

కనుగ్రుడ్డు యందు ఈ భాగములు ఉండును – 1) కార్నియా 2) నల్లగ్రుడ్డు 3) ఏంటీరియర్ చాంబరు 4) పోస్టీరియర్ చాంబరు 5) కటకము 6) విట్రస్ ద్రవము 7) దృష్టి కేంద్రీకరింపబడు ప్రదేశం 8) నేత్రనాడి 9) సిలియరి నాడి 10) ఓర సెర్రాట 11) రెటీనా (ఛాయాగ్రాహక భాగం) 12) కోరాయిడ్ 13) స్క్లెరోటిక్.

కన్ను ఎంతో ప్రధానమైన జ్ఞానేంద్రియం. కనుక భగవంతుడే దాని రక్షణకై అవసరమైన ఏర్పాట్లు చేశాడు. మన కళ్ళలోకి దుమ్ము, ధూళి మొ॥ వస్తువులు పడవచ్చు. ఏవైనా చిన్న పురుగులు కళ్ళలోనికి పోవచ్చు. పొరపాటున సూదులు గ్రుచ్చుకోవచ్చు. కత్తుల కాట్లు పడవచ్చు. అప్పుడు కంటికి ఏదైనా అపాయం జరగవచ్చు. ఆ అపాయం నుండి కంటిని కాపాడుటకు కనురెప్పలు, వాటికి వెంట్రుకలు ఏర్పాటు చేశాడు. ఏదైనా వస్తువు మన కంట్లో పడనున్న దనగానే అసంకల్పిత ప్రతీకార చర్య ద్వారా మనం కళ్ళు మూసుకొంటాము.

కంటిలో కొన్ని గ్రంథులు ఉంటాయి. అవి నీటిని ఉత్పత్తి చేస్తాయి. ఆ నీరు (కన్నీరు) కంటిలోని మలిన పదార్థాలను బయటికి పంపి కంటిని శుభ్రంగా ఉంచుతుంది.

మనం కూడా కొన్ని జాగ్రత్తలను పాటించి కంటి సంరక్షణకు పూనుకోవాలి. ఆ జాగ్రత్తలు–

1. మనం చదివే చోట మంచి వెలుతురు ఉండాలి. మనమేదైనా పుస్తకం చదువునపుడు మన వెనుక నుండి వెలుతురు మన ముందున్న పుస్తకముపై పడాలి. వెలుతురుకు ఎదురుగా కూర్చొని చదవరాదు. పడుకొని చదువరాదు. బస్సు / రైలులో ప్రయాణించునపుడు చదువరాదు.
2. టి.వి.కి దగ్గరగా కూర్చొని చూడరాదు. టి.వి. – ప్రేక్షకుల మధ్య తగినంత దూరం ఉండాలి. టి.వి.ని చీకట్లో చూడరాదు. ఒక లైటు వేసుకొని చూడాలి.
3. శుభ్రమైన మెత్తని గుడ్డతో కళ్ళను శుభ్రం చేసుకోవాలి.
4. కళ్ళ ఆరోగ్యానికి పనికివచ్చే కంటి వ్యాయామం చేయాలి. రోజుకు కొంతసేపైనా పచ్చని ప్రకృతిని చూస్తూ గడపాలి. కళ్ళకు మంచి విశ్రాంతి నివ్వాలి.
5. కనురెప్పలను తెరుస్తూ, మూస్తూ ఉండాలి. దీనివల్ల కళ్ళకు మంచి విశ్రాంతి లభిస్తుంది.
6. ఏదైనా కంటి వ్యాధి వచ్చిన అశ్రద్ధ చేయరాదు. వెంటనే వైద్యుని సంప్రదించవలెను.

## 2. కంటి వ్యాధులు – ద్వాదశ లవణముల చికిత్స

**ఫెర్రంఫాస్ 6× – 12× :**

★ కంటి ఏ భాగమునకైనా వాపు వచ్చుట – స్రావం / పుసి లేకుండుట.
★ కనుగ్రుడ్లులో నొప్పి – కళ్ళను త్రిప్పుట వల్ల నొప్పి అధికమగుట.
★ కళ్ళు మండుతున్నట్లుండుట – కనురెప్పల క్రింద ఇసుక రేణువులు మిరమిరలాడు తున్నట్లుండుట.
★ చదువునపుడు అక్షరాలన్నీ కలిసిపోయినట్లుండుట.
★ కృత్రిమ దీపాల వెలుగును సహించలేక పోవుట **(హెచ్.ఎఫ్.ఐవిన్స్)**
★ నీరసానికి ఈ మందు తీసుకొన్న వ్యక్తి కుడి కంటి క్రింది కనురెప్పపై నున్న కాయ (stye) ను ఈ మందు నయం చేసినట్లు గమనించాను. **(డా. రాబర్ట్ కూపర్)**
★ చన్నీటి వలన బాధకు ఉపశాంతి.
★ దెబ్బ వలన కళ్ళు వాచినపుడు, ఆపరేషన్ చేసిన తర్వాత కళ్ళ వాపుకు, నొప్పికి ఈ మందును అర్ధగంట కొకసారి ఇవ్వవలెను.

**కాలీమూర్ 3× - 6× :**

★ తెల్లని / పసుపు - ఆకుపచ్చ పుసి (కాలీసల్ఫ్ కూడా).

★ కళ్ళల్లో ఇసుక వున్నట్లు మిరమిరలాడుట.

★ కనురెప్పలపై పసుపుపచ్చని చీముగల పొక్కులు.

★ కార్నియా[1] పై పొక్కులు / బొబ్బలు.

★ కార్నియాకు సంబంధించిన పుండ్లను నయం చేయుటలో ఈ మందు చాలా మంచి పనిచేసింది **-హెచ్.సి. ఫ్రెంచ్**

★ పొక్కులు చదునుగా నుండు పుండ్లుగా మారుట.

★ కార్నియా (కనుగ్రుడ్డు ముందు భాగం), నల్లగ్రుడ్డు కనురెప్పలు, రెటీనా[2] వాచుట.

★ కేటరాక్ట్[3] కు కాల్కేరియా ఫ్లోర్ తర్వాత దీనిని వాడాలి.

★ ఈ మందును, ఫెర్రంఫాస్‌ను ఒకదాని తర్వాత మరొకదానిని వాడవలెను.

**కాలీఫాస్ 6× - 12× :**

★ డిఫ్తీరియా[4] తర్వాత చూపు సన్నగిల్లుట, కండరముల మధ్య సమన్వయం లోపించుట వల్ల కంటిమెల్ల ఏర్పడుట.

★ కంటిలో ఇసుక / కర్రపుల్ల ఉన్నట్లు అనిపించుట.

★ కనుగ్రుడ్లు, కనురెప్పల అంచులు బాధగా ఉండుట.

★ పూర్తిగా పొగలో ఉన్నట్లుగా కళ్ళు మండుట.

★ కళ్ళు లాగుచున్నట్లుండుట - కళ్ళ ముందు వ్రాత అలుక్కుపోయినట్లుండుట - కళ్ళముందు నల్లని మచ్చలు కనిపించుట - కళ్ళు వెలుతురును సహించలేక పోవుట - కనురెప్పలు వాలుట, కళ్ళు తేరిపార జూచుట (నాడీ వ్యాధుల వల్ల).

---

*1. **కార్నియా (Cornea) :** కనుగ్రుడ్డు ముందు భాగమందు గట్టిగ నుండు, పారదర్శకమగు ద్రవముగల భాగము.*

*2. **రెటీనా (Retina) :** కనుగ్రుడ్డు లోపల వెనుక భాగమున నుండు ఛాయా గ్రాహకమగు పలుచని పొర. దీని మీద మనము చూచునట్టి పదార్థముల బింబము పడి, నరాల ద్వారా మెదడుకు ఆ పదార్థములను గురించి తెలుపును.*

*3. **కేటరాక్ట్ (Cataract)** కంటిలోని కటకమునకు పాదర్శకత్వము క్రమేపీ పోవుటచే ఏర్పడు పొరను కేటరాక్ట్ / శుక్లము అని అందురు. దీనివల్ల మనం చూచునవి బుట్టతెరలో నుండి చూచి నట్లుండును.*

*4. **డిఫ్తీరియా (Diphtheria) :** ఇది అపాయకరమగు అంటువ్యాధి. గొంతు, మెడ వాచును. టాన్సిల్స్, అంగుడు, కొండనాలుక, ముక్కు రంధ్రములపై పొర వంటిది ఏర్పడును. దీనివల్ల ఊపిరాడదు. నొప్పి, వాపు ఉండును.*

**కాలీసల్ఫ్ 3× - 6× :**

- ★ కనురెప్పలపై పసుపు పచ్చని పొక్కులు.
- ★ కళ్ళ నుండి పసుపు పచ్చని / పసుపు - ఆకుపచ్చని పుసి.
- ★ కళ్ళ నుండి చీముతో నున్న నీళ్ళ వంటి స్రావం.
- ★ కేటరాక్ట్ - ఈ మందును నేత్రంమూర్‌తో మార్చి ఇవ్వవలెను.
- ★ నూతనముగ జన్మించిన శిశువు యొక్క కండ్ల కలక - పలచని పసుపు పచ్చని స్రావం / దుర్వాసనగల పలచని ఆకుపచ్చని సీరం కళ్ళ నుండి వెలువడుట - దీనికి ఇతర మందులు పనిచేయనప్పుడు ఈ మందు ఉపయోగపడును.
- ★ కార్నియా (శుక్లపటలము) పుండుకు అమూల్యమైన మందు.
- ★ కంటిలోని కార్నియాకు, నల్లగ్రుడ్డు (ఐరిస్)కు మధ్య భాగములో పుసి ఉన్నచో కాలీమూర్ కంటె ఇది చాలా శ్రేష్ఠమైన మందు **- హెచ్.సి. ఫ్రెంచ్**

**మెగ్నీషియంఫాస్ 3× - 6× :**

- ★ పై కనురెప్ప క్రిందికి వ్రాలుట.
- ★ వెలుతురును సహించలేక పోవుట.
- ★ కనుపాపలు చిన్నవగుట.
- ★ చూపు దెబ్బతినుట (దృష్టినాడి బలహీనత వల్ల) - ఈడ్పులుగల మెల్ల.
- ★ కళ్ళ ముందు మచ్చలు / చుక్కలు, రంగులు చూచుట.
- ★ కంటి లొత్తపై నుండు నాడుల బలహీనత వల్ల ఒకే వస్తువును రెండుగా చూచుట.
- ★ కళ్ళు లాగబడుట.
- ★ కంటి బాధలు వెచ్చదనముచే ఉపశాంతి పొందును. అవి చల్లదనముచే ఎక్కువగును.
- ★ కంటిరెప్పల నరాల బాధకు దీనిని కాలీఫాస్‌తో మార్చి ఇవ్వాలి.
- ★ కాంతి మెరుపును, కళ్ళ ముందు నల్లని మచ్చలను నరాల ఉద్రేకం వల్ల రెటీనా సహించలేక పోవుట.
- ★ రెటీనా భాగములో రంగు ఒకే చోట చేరుట (R.S.C.)
- ★ ఈ మందు కనురెప్పల, కనురెప్పల అంచుల, కనురెప్పల వెంట్రుకల నరముల నొప్పిని తరచుగా బాగు చేసింది.

**నేత్రంమూర్ 3× - 200× :**

- ★ కంటి కండర నీరసముచే చూపు దుర్బలముగ నున్నచో ఇది ముఖ్యమైన మందు.
- ★ కార్నియాపై పుండు.
- ★ కన్నీటి నాళముల అడ్డంకుల వల్ల శుద్ధమైన కన్నీరు ఎక్కువగా కారుట.

★ కన్నీటి నరాలనొప్పులు కన్నీటి ప్రవాహముతో నిశ్చిత కాలవ్యవధులలో తిరిగి వచ్చుట.

★ కళ్ళ నుంచి వచ్చే కన్నీరు చర్మాన్ని పుండు పడునట్లు చేయట లేక చిన్న పొక్కులు ఏర్పడునట్లు చేయుట.

★ కనురెప్పలపై నూకల వంటి పొక్కులు – కన్నీరు వుండదు.

★ కనురెప్ప అంచులు బాగా గట్టిపడుట, ఎర్రగా నుండుట.

★ రెటీనాపై తెల్లని మచ్చలు – ఈ లక్షణమున్నప్పుడు ఈ లవణ ద్రావణముతో బాహ్యంగా పిచికారీ చేయాలి.

★ గ్లకోమాలో కనుగుడ్డుపై ఒత్తిడి (tension) పెరిగిన ఈ మందును బాహ్యంగా పిచికారీ చేయవచ్చు. లోపలికి తీసుకోవచ్చు.

★ హ్రస్వదృష్టికి బాగా ఉపయోగపడును.

**నేట్రంఫాస్ 3× – 6× :**

★ కళ్ళ కలక పసుపు పచ్చని క్రీమువంటి స్రావముతో.

★ అప్పుడే పుట్టిన పిల్లల కండ్లకలక.

★ క్షయ వ్యాధిగ్రస్తుల కండ్లకలక.

★ ముసలమ్మల కంటి వ్యాధి – అధికముగ నున్న క్రీమువంటి స్రావము, కనురెప్పలు అతుక్కొనుట – మందగించిన చూపు – అతిసారము – ఈ లక్షణాలకు ఈ మందు బాగా ఉపయోగపడును – **ఢఫ్‌ఫీల్డ్**

★ ప్రేగుల క్షోభవల్ల, పురుగుల వల్ల కలుగు మెల్ల.

★ కంటిలోని కార్నియాకు, నల్లగ్రుడ్డుకు మధ్యన చీము చేరుట – ఉదయాన కనురెప్పలు రెండూ అతుక్కొని పోవుట – ఆమ్లపు వాంతి–మండుతున్న కన్నీరు – కళ్ళు రక్తమువలె ఎర్రగా నుండుట – మందగించిన చూపు (కళ్ళ ముందు తెర వున్నట్లు అనిపించుట).

★ వాతరోగము వున్నవారు కళ్ళముందు వెలుగును చూచుట – వారి కళ్ళల్లో లోతుగ రంధ్రం చేయునట్టి నొప్పి.

**నేట్రంసల్ఫ్ 3× – 6× :**

★ కళ్ళపై నొప్పి.

★ క్షయవ్యాధిగ్రస్తుల కంటి వాపులలో వెలుగును సహించలేక పోవుట.

★ కాలేయ దోషంవల్ల కంటి ఆమత్వక్కు పసుపుపచ్చగా నుండుట.

★ కనురెప్పలపై నూకల వంటి పెద్ద బొబ్బలు – కనురెప్పల అంచులు మండుట – కన్నీరు మండుట.

★ కంటిలోని కార్నియాకు, నల్లగ్రుడ్డుకు మధ్యలో చీము చేరుట.

**సైలీషియా 6× - 12× :**

★ కనురెప్పల అంచులపై కాయలు (styes)–వాపు ఎక్కువగా ఉన్నచో ఫెర్రంఫాస్ వాడాలి.

★ కార్నియాపై లోతైన పుండు.

★ అపారదర్శకమగు కార్నియా, కుడికన్ను కనురెప్ప నాడీ వ్యాధి.

★ కనురెప్పలు గట్టిపడుట, క్షయవ్యాధిగ్రస్తుల కంటివాపు, పసుపుపచ్చని పుసులు కారుట.

★ కంటిలోని కార్నియాకు, నల్లగ్రుడ్డుకు మధ్యలో చీము చేరుట.

★ వెలుగును సహించలేకపోవుట.

★ పాదాల చెమటను అణచుట వల్ల వచ్చిన కేటరాక్ట్ - రాత్రి కనబడకపోవుట - చూపు మసకగా నుండుట.

★ కనురెప్పల చుట్టూ సెగ్గడ్లు, ఆమత్వక్కు సంబంధమగు కంతి.

★ అన్యపదార్థం (Foreign body) దుమ్ము, ధూళి, పురుగు ఏదైనా కంటిలో పడి వాపు, నొప్పి కలుగుట.

★ కంటిగ్రుడ్డును తాటితో వెనక్కి లాగినట్లుండుట.

**కాల్కేరియాఫాస్ 6× :**

★ ఈడ్పులుగల కనురెప్పలవ్యాధి మెగ్నీషియం ఫాస్ వల్ల నయం కానిచో దీనిని వాడాలి.

★ క్షయ వ్యాధిలో కనుగ్రుడ్డు ముందుభాగం వాచుట.

★ ఇది కేటరాక్ట్‌ను అదుపులో పెట్టుటకు తోడ్పడును.

★ దంతోత్పత్తి సమయమున కళ్ళవాపు, కళ్ళు పొడిగా ఉండుట, కళ్ళు వెలుతురును సహించలేక పోవుట, కార్నియా అపారదర్శకత్వం, కనురెప్పల వాపు – **ఈ లక్షణాలకు ఈ మందు పనికిరాదు.**

★ క్షయ బాధితుల పిల్లల చూపు మసకగా వుండుట.

★ లూపస్[1] చర్మవ్యాధి, క్యాన్సర్, క్షయ, గౌట్‌తోపాటు కేటరాక్ట్ ఉన్నచో దీనిని వాడాలి.

★ హ్రస్వదృష్టికి, దీర్ఘదృష్టికి దీనిని 200× లో రోజుకు రెండుసార్లు వాడాలి.

**కాల్కేరియాసల్ఫ్ 3× - 6× :**

★ కార్నియాపై లోతైన పుండ్లు (సైలీషియా).

★ కండ్లకలక - కంటివాపు, చిక్కగా, పసుపు పచ్చగా నున్న రసి.

*1. **లూపస్ (Lupus) :** ముఖమందు, ముక్కుమీద, చెవులమీద పుండ్లు ఏర్పడును. పుండు ఒక వైపు మానుచున్నట్లుండును. రెండవవైపు వ్యాపించుచుండును. వీటిపై గోధుమ రంగు పక్కు కట్టును. ఈ వ్యాధి చాలా త్వరగా వ్యాప్తి చెందును. నొప్పి ఎక్కువగా ఉండును. కొద్ది వారాలలోనే ముక్కు, పెదవులు, కనురెప్పలు తినివేయబడును.*

★ కంటిలోనిచీము కంటిలోని గుల్లభాగాలు చేరినచో సైలీషియా తర్వాత దీనిని వాడాలి.

★ రెటీనా వాపు – కంటిలో ఏదో అన్యపదార్థం (Foreign body) వున్నట్లు అనుభూతి.

★ రెటీనా, నల్లగ్రుడ్డు మధ్య పుసి.

★ కనుగ్రుడ్డు మీద నీటి పొక్కులు లేచుట, కనుగ్రుడ్డు ముందు భాగం వాచుట – కండ్లకలక – మెడ గ్రంథులు వాచుట – కందిపోయిన కంతి.

★ నూతనముగ జన్మించిన వారి కంటి వాపులో ఈ మందు దుర్వాసనగల స్రావాన్ని తగ్గించును.

**కాల్కేరియాఫ్లోర్ 6× – 30× :**

★ కళ్ళముందు మిణుకుమిణుకు మనెడి అగ్నికణములు కనిపించుట.

★ కార్నియాపై మచ్చలు, కంటి కలక, కేటరాక్ట్, కనురెప్పల వాపు, కనురెప్పల గ్రంథుల వాపు, పాక్షిక అంధత్వం.

★ అధిక శ్రమవల్ల చూపు మందగించుట.

★ కేటరాక్ట్ వున్న ముసలివారి దృష్టిని బాగుచేయగలిగాను – **ఆర్.ఎస్.కోప్‌లాండ్**

## 3. చూపుకు సంబంధించిన కొన్ని దోషాలు
## (Some defects of sight)

| దోషం | చికిత్స |
|---|---|
| ★ డిఫ్తీరియా తర్వాత కంటి చూపు బలహీనపడుట | కాలీఫాస్ 6× |
| ★ కంటి కండరముల నీరసముచే చూపు దుర్బలముగ నుండుట. | నేట్రంమూర్ 6× |
| ★ చూపు మందగించుట – కళ్ళముందు ముసుగు ఉంచినట్లు | నేట్రంఫాస్ 6× |
| ★ రికెట్స్ వంటి శరీర నిర్మాణం గల పిల్లలలో వంశానుగతంగా చూపు మసకగా ఉండుట | కాల్కేరియాఫాస్ 6× |
| ★ పాక్షిక అంధత్వం | కాల్కేరియాఫ్లోర్ 6× |
| ★ పగలు కళ్ళు కనిపించకుండుట (Day Blindness) | సైలీషియా 6× |
| ★ రేచీకటి – రాత్రిపూట కళ్ళు కనిపించకుండుట (Night Blindness) | ఎ) నేట్రంఫాస్ 6× – కళ్ళు రక్తంవలె ఎర్రగా – కన్నీరు మంటగా |

| దోషం | చికిత్స |
|---|---|
| | బి) సైలీషియా 6× – అకస్మాత్తుగ వచ్చు ఈడ్పులతో కూడిన రేచీకటి – వెలుతురు చూడలేక పోవుట |
| ★ హ్రస్వదృష్టి (short sight, myopia) – దగ్గరి వస్తువులను మాత్రమే చూడగలుగుట | కాల్కేరియాఫాస్ 6× సరైన కళ్ళ జోళ్ళు/ లేజర్ చికిత్స |
| ★ దూరదృష్టి (Long sight, Hyper metropia) దూరపు వస్తువులను మాత్రమే చూడగలుగుట | " |
| ★ ప్రతి వస్తువు రెండుగా / రెండింతలుగా కనిపించుట – నరాల వ్యాధివల్ల (Diplopia) | మెగ్నీషియాఫాస్ 6× వేడినీటితో |
| ★ కళ్ళ ముందు నల్లమచ్చలు | కాలీఫాస్ 6× |
| ★ కంటికి ముందు నల్లని చిన్న మచ్చలు | మెగ్నీషియంఫాస్ 6× వేడినీటితో |
| ★ కంటికి ముందు అగ్నికణాలు (sparks) కంటికిముందు అగ్నికణాలు మెల్లగా కదులుతున్నట్లు | నేట్రంఫాస్ 6× కాల్కేరియాఫ్లోర్ 6× |
| ★ కంటిముందు అగ్నికణాలు, రంగులు, మెరుపు | మెగ్నీషియంఫాస్ 6× |

**జాగ్రత్త :** విటమిన్ 'ఎ' అధికంగా ఉండు ఆహారమును తినుటవల్ల కంటిచూపు పెరుగును. క్యారట్లలోను, మునగ ఆకులలోను, పండ్లలోను, ఆకుకూరలలోను 'ఎ' విటమిన్ అధికంగా ఉంటుంది. కనుక వాటిని అధికంగా తినాలి.

## 4. కండ్ల కలక
## (Ophthalmia/Conjunctivitis)

దీనిలో కనుగ్రుడ్లను, కంటిరెప్పలను కప్పి యుంచు ఆమత్వక్కు వాచును.

**లక్షణాలు :** 1) కళ్ళు ఎర్రగా మారును. 2) అధికంగా కన్నీరు కారును. 3) తెల్లగ్రుడ్లలో పొడిచినట్లు నొప్పి ఉండును. 4) పుసి కట్టును. 5) కళ్ళు అంటుకొనును. 6) కళ్ళల్లో ఇసుక వేసినట్లుండును. 7) కళ్ళల్లో మంటలు ఉండును. 8) కళ్ళు వెలుతురును చూడలేవు.

**కారణాలు :** కండ్లకలకకు ఈ కారణాలు చెప్పబడును – దుమ్ము, ధూళి వంటి అన్య పదార్థములు (foreign bodies) కళ్ళలోనికి వెళ్ళుట, పొగ కళ్ళలోనికి పోవుట, పొంగు, మసూచి వంటి రోగాలు, బలహీనత, దెబ్బ తగులుట.

**జాగ్రత్తలు :**

ఇది అంటువ్యాధి. దీని బ్యాక్టీరియా ఒకరి నుండి మరొకరికి సులభంగా సోకును. అందువల్ల కొన్ని సమయాల్లో కొన్నివేల మంది ఈ వ్యాధికి గురి అగుదురు.

ఈ వ్యాధి నుండి రక్షణ పొందుటకు ఈ జాగ్రత్తలు తీసుకోవాలి –

1. వేడినీళ్ళతో కళ్ళను కడగాలి.
2. కళ్ళకు వేసిలైను / ఆలివ్ ఆయిల్‌ను పూయాలి.
3. కళ్ళకు ఎక్కువ వెలుతురు, సూర్యరశ్మి సోకకుండ జాగ్రత్త వహించాలి.
4. చలిగాలి, తేమ, పొగ, దుమ్ముకు దూరంగా ఉండాలి.
5. ఒకేసారి కొన్నివేల మందికి ఈ వ్యాధి సోకిన వ్యాధి నిరోధకాన్ని పిల్లలు – పెద్దలు అందరూ తీసుకోవాలి. లక్షణాలను బట్టి మందును ఎంపిక చేయాలి.
6. హోమియోపతిలో యుఫ్రేషియా–30 సాధారణంగా వ్యాధి నిరోధకముగా వాడబడును.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6× – 12× :** ప్రథమ దశలో ఎరుపు, మంట, నొప్పి – కనురెప్పల క్రింద ఇసుక – చన్నీటితో కంటినొప్పి ఉపశమనం.

**కాలీమూర్ 6× :** ద్వితీయ దశలో – కంటి నుంచి తెల్లని / పసుపుపచ్చని – ఆకుపచ్చని పదార్థం స్రవించుట – ఈ పరిస్థితికి ఈ మందును కాలీసల్ఫ్‌తో మార్చి వాడాలి – కంటిలో ఇసుక పోసినట్లుండుట – ఈ స్థితికి ఈ మందును ఫెర్రంఫాస్‌తో మార్చాలి.

**కాలీసల్ఫ్ 6× :** తృతీయదశలో పసుపు – ఆకుపచ్చని పుసులు.

**నేట్రంఫాస్ 6× :** పసుపు పచ్చని మీగడ వంటి చీము స్రవించుటచే ఉదయం నిద్రలేచు సరికి కనురెప్పలు అంటుకొని ఉండుట – కళ్ళముందు తెర ఉన్నట్లనిపించుట అనగా చూపు మసకగా ఉండుట.

**నేట్రంసల్ఫ్ 6× :** దీర్ఘకాలముగా ఉన్న, మాననట్టి కంటి కలక – కాలేయ దోషం వల్ల కనుగ్రుడ్లు పచ్చనగుట – కనురెప్పల అంచులు మంటగా ఉండుట.

## 5. వెలుతురు సహించలేకపోవుట
## (Photophobia)

కొంత మందికి వెలుతురు అంటే భయం. కావున కళ్ళు తెరవడమంటే భయం. ఇది మెదడు పొరల టి.బి వ్యాధి లక్షణం.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6X :** కృత్రిమ దీపాల వెలుతురును సహించలేక పోవుట **(హెచ్.పి. ఇవిన్స్)**

**కాలీమూర్ 6X :** వెలుతురును సహించలేక పోవుట – నొప్పి, కన్నీరు ఒక మాదిరిగా ఉండుట. ఫెర్రంఫాస్‌తో దీనిని మార్చి మార్చి వాడాలి.

**కాలీఫాస్ 6X :** వెలుతురును సహించలేక పోవుట – నరాల ఆటంకాల వల్ల ఉద్రేకపడుట – కళ్ళు రెప్ప వాల్చకుండా చూచుట – కనురెప్పలు వాలుట.

**మెగ్నీషియంఫాస్ 6X :** వెలుతురును సహించలేక పోవుట – కనురెప్పలు క్రిందకు వ్రాలుట – కళ్ళ ముందు అగ్నికణాలు, రంగులు కనిపించుట – కనురెప్పలు అదురుట – ఈ మందును వేడినీటితో ఇవ్వాలి.

**నేట్రంసల్ఫ్ 6X :** వెలుతురును సహించలేక పోవుట – కనురెప్పల అంచులు మండుట.

**సైలీషియా 6X :** వెలుతురును సహించలేక పోవుట – అకస్మాత్తుగ ఈడ్పులతో వచ్చు రాత్రిపూట అంధత్వం.

**కాల్కేరియాఫాస్ 6X :** క్షయతత్త్వం కలవారులో వెలుతురును సహించలేకపోవుట.

## 6. రెటీనా వాపు
## (Retinitis)

రెటీనా / నేత్ర పటలం / కనుగ్రుడ్డు లోపలి కంచుకం కొన్ని వ్యాధులవల్ల వాచును.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6X :** రెటీనా వాపు – కళ్ళు బాగా ఎర్రగా తీవ్రమైన నొప్పితో ఉండుట – కంటిలో శ్లేష్మం ఉండుట / శ్లేష్మం లేకుండుట – రెటీనా నాళములలో క్రిక్కిరిసిన కణజాలం.

**మెగ్నీషియంఫాస్ 6X :** రెటీనా రంగు మారుట. వేడినీటితో మందును వాడాలి.

**కాల్కేరియా సల్ఫ్ 6X :** రెటీనా వాపు – కళ్ళల్లో ఏదో అన్యపదార్థం ఉన్నట్లు అనిపించుట.

## 7. రెటీనోపతి
## (Retinopathy)

చక్కెరవ్యాధి వలన కొన్ని సందర్భాలలో రెటినాలోని రక్తనాళాలు బలహీనపడతాయి. దీనిని డయాబెటిక్ రెటినోపథి అని అంటారు. ఇది ముఖ్యంగా చక్కెర వ్యాధివలన వచ్చును. రెటినాలోని రక్తనాళాలలో వచ్చు మార్పును/బలహీనతను రెటినోపథి అని అంటారు. దీనివల్ల రక్తనాళాలు రెటినాకు కావలసిన ప్రాణవాయువును, ఇతర పోషకాలను (Nutrients) అందించుటలో విఫలమగును. దీనిలో రెటినా వాపు ఉండదు.

**లక్షణాలు:** 1) రెటినాలో రక్తం గూడు కట్టుకొనుట. 2) కొవ్వు, నీరు చేరుట. 3) రెటినా సరిగా పనిచేయక చూపు తగ్గుట.

**హెచ్చరిక :** రెటినోపథి వ్యాధి లక్షణాలు పైకి కనిపించవు. తొలుత కొంచెం చూపు మందగిస్తుంది. సాధారణంగా రోగులు వయస్సు పైబడుతున్నదికదా చూపు తగ్గింది అని భావిస్తారు. ఆ విధంగా భావిస్తూ ఉంటే ఒక్కసారిగా చూపు పోయే ప్రమాదం ఉంది. కనుక చక్కెర వ్యాధిగ్రస్తులు తప్పక ప్రతి 6 నెలలకు ఒకసారి కంటిడాక్టర్‌ను సంప్రదించుట మంచిది.

## 8. కార్నియా / శుక్లపటలం వ్యాధులు
## (Diseases of Cornea)

కంటి నల్లగ్రుడ్డు యొక్క ముందు భాగాన్ని కార్నియా / శుక్లపటలం అని అంటారు. ఇది పారదర్శకమైనది. దానికి వచ్చు వ్యాధి లక్షణాలను బట్టి చికిత్స చేయాలి.

### • చికిత్స •

**కాలీమూర్ 6× :**

- ★ ఇది కార్నియా మృదువైన కణముల వాపుకు బాగ ఉపయోగపడును. **(డా. నోర్టన్)**
- ★ కార్నియాను ఆధారం చేసుకొని వ్యాపించు పుండ్లు.
- ★ రక్తనాళములకు సంబంధించిన వ్రణములు – తగినంత వాపు – తగినంత స్రావం తెల్లని శ్లేష్మంతో – ఈ స్రావం కొన్ని సందర్భాలలో కార్నియా పొరలలోనికి / ముందున్న గది లోనికి వ్యాపించును.
- ★ కార్నియాపై దీర్ఘంగా ఉన్న చీముగడ్డలను నయం చేయుటలో ఇది చాల మంచి పని చేస్తుంది. ఇది కార్నియా పైనున్న మచ్చలను కూడ నయం చేయును. **(హెచ్.సి. ఫ్రెంచ్)**

**కాలీసల్ఫ్ 3× :** కార్నియా చీముగడ్డ (abscess) చీము కార్నియా ముందు గదిలో చేరినచో ఇది కాలీమూర్ కంటె మంచి మందు. **(హెచ్.సి. ఫ్రెంచ్)**

**నేట్రంమూర్ 6× :**

- ★ కార్నియాపై బొబ్బ (blister) – కళ్ళ నుండి స్వచ్ఛమైన శ్లేష్మం / కన్నీరు ఎక్కువగా స్రవించుట.
- ★ కార్నియాపై తెల్లని మచ్చలు – ఈ పరిస్థితిలో మందును లోపలికి తీసుకొనుటయే గాక మచ్చలపై దీనిని ద్రవం రూపంలో పిచికారీ చేయాలి. అలా చేస్తే మచ్చలు అదృశ్యమగును.

**సైలీషియా 6× :** అపారదర్శకముగ నున్న కార్నియా.

**కాల్కేరియాఫాస్ 6×** : కార్నియా అపారదర్శకత్వం – క్షయ ప్రవృత్తి గలవారిలో కార్నియా వాపు, నొప్పి, వేడి, మంట.

**కాల్కేరియాసల్ఫ్ 6×** : కార్నియాపై లోతైన పుండ్లు / చీముగడ్డలు – చీము చిక్కగ, పసుపు పచ్చగ ఉండుట.

## 9. కనుగ్రుడ్లు ముందుకు తోసుకు వచ్చుట (Exophthalmic goitre)

ఇది కంటికి సంబంధించిన వ్యాధి. దీనిలో కనుగ్రుడ్లు మిటగ్రుడ్లు వలె ఉండును. దీనిలో గుండెదడ ఉండును. మెడయందలి థైరాయిడ్ వాచి పెద్దదగును. రోగి కృంగి కృశించును. రక్తనాళములందు ధనారింపు, వణకు ఉండును.

### • చికిత్స •

**నేట్రంమూర్** : గుండె వడిగా[1] / ధనారింపుగ కొట్టుకొనును. దీనివల్ల శరీరం వణకును. ఏమాత్రం శ్రమ కలిగినా హ్రస్వశ్వాస ఉండును.

**నల్లగ్రుడ్డు వాపు (Inflammation of Iris)** :

**చికిత్స** : **కాలీమూర్ 6×**

## 10. కంటి రెప్ప కురుపు (Stye / Hardeolum)

ఇది కంటి రెప్ప అంచులో చిన్న పొక్కు / మొటిమ రూపంలో వచ్చి బాధించును.

**నివారణోపాయం** : నొప్పి ఎక్కువగా ఉన్న కాపడం పెట్టాలి.

### • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12×** : డాక్టర్ రోబర్ట్ కూపర్ ఈ మందును నీరసానికి ఇచ్చిన ముగ్గురు వ్యక్తుల కుడికన్ను క్రిందివైపున్న కంటిరెప్ప కురుపును నయం చేసినట్లు తెలుసుకొని చాల ఆశ్చర్యపోయారు.

**సైలీషియా 12×** : కనురెప్పలపై కురుపు – ఈ మందును లోషన్‌గా పైపూతగా వాడవచ్చు. దీనివల్ల స్రావం త్వరగా, నొప్పి లేకుండా బయటికి వచ్చి వేయును.

*1. **గుండె వడిగా** : గుండె పెద్దదగుట వల్ల నాడి వడిగా / ధనారింపుగ కొట్టుకొనును. అప్పుడు నాడి నిమిషమునకు 110 నుండి 150 వరకు బలముగ కొట్టుకొనును.*

## 11. కనురెప్పల వ్యాధులు
### (Diseases of Eye-lids)

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6X :** కనురెప్పల క్రింద ఇసుక రేణువులు ఉన్నట్టి భావన.

**కాలీమూర్ 6X :** కనురెప్పలపై చీముగల పక్కులు – కనురెప్పలు వాచుట – దీనిని ఫెర్రంఫాస్‌తో మార్చి వాడాలి.

**కాలీఫాస్ 6X :** కనురెప్పల అంచులు పుండుగ, నొప్పిగ ఉండుట – కనురెప్పలు వాలుట.

**కాలీసల్ఫ్ 6X :** కనురెప్పలు పసుపు పచ్చని పక్కులతో

**మెగ్నీషియంఫాస్ 6X :** కనురెప్పలు క్రిందికి వాలుట – అవి వణకుట – బరువుగా ఉండుట.

**నేట్రంఫాస్ 6X :** ఉదయాన బరువుగా ఉండుట, కనురెప్పలు అతుక్కొనుట.

**నేట్రంసల్ఫ్ 6X :** కనురెప్పల అంచులు మండుట.

**సైలీషియా 6X :** కనురెప్పలపై కాయలు – కనురెప్పల చుట్టూ సెగ్గడ్డలు, కంతులు – కనురెప్పలపై గింజల సైజులో పులిపిరికాయలు – కనురెప్పలు గట్టి పడుట.

**కాల్కేరియాఫ్లోర్ 6X :** కనురెప్పలు గట్టి పడుట – కనురెప్పల గ్రంథులు పెద్దవగుట.

## 12. కళ్ళ ఎరుపు

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6X :** కళ్ళల్లో ఎక్కువ ఎరుపు, తీవ్రమైన మంటతో.

## 13. కళ్ళ బాధలు

**• చికిత్స •**

★ మంట ఉన్నట్లు భావన : **ఫెర్రంఫాస్ 6X**

★ మంట – కళ్ళ నిండుగా పొగ ఉన్నట్లు – **కాలీఫాస్ 6X**

★ తొలిచినట్టి నొప్పి (మేహవాత నొప్పి) – **నేట్రంఫాస్ 6X**

★ చీము పీల్చుటకు – **సైలీషియా 6X**

★ కళ్ళ అంతర్ గదిలో చీము – **కాల్కేరియాసల్ఫ్ 6X**

★ తెల్లని శ్లేష్మం / పసుపు పచ్చ - ఆకుపచ్చ పదార్థం (పుసి) - **కాలీమూర్ 6×**

★ ఇసుక ఉన్నట్టి భావన - **కాలీమూర్ 6×**

★ ఇసుక / కట్టెపుల్లలు ఉన్నట్టి భావన - **కాలీఫాస్ 6×.**

★ అన్యపదార్థం (Foreign body) ఉన్నట్టి భావన - **సైలీషియా 6×.**

## 14. కన్నీరు (Lachrymation)

**కాలీమూర్ 6×** - కన్నీరు - వెలుతురును సహించలేక పోవుట.

**నేట్రంమూర్ 6×** - కన్నీటి నాళాల అడ్డంకి వల్ల కన్నీటి ప్రవాహం.

**నేట్రంఫాస్ 6× :** మండుతున్న కన్నీరు.

## 15. మెల్లకన్ను (Strabismus, squint eye)

కంటి వ్యాధుల వల్ల మెల్లకన్ను వచ్చును. దానిని అదృష్టం అని భావించకుండా తగిన సమయంలో చికిత్స చేయించాలి.

### • చికిత్స •

**కాలీఫాస్ 6× :** డిఫ్తీరియా తర్వాత వచ్చు మెల్ల - ఈడ్పులులేని మెల్ల.

**మెగ్నీషియంఫాస్ 6× :** ఈడ్పులుగల మెల్ల కన్ను.

**నేట్రంఫాస్ 6× :** ప్రేగులలో క్షోభ / పురుగులవల్ల కలుగు మెల్ల.

## 16. నీటికాసులు (Glucoma)

కొంతమంది చక్కెర వ్యాధిగ్రస్తులలో కనుగ్రుడ్డులోని ద్రవం పరిమాణం పెరిగి ఒత్తిడి పెరుగుతుంది. దానిని నీటికాసులు (Glucoma) అని అంటారు. వాటివల్ల చూపు సరిగా కనిపించదు. సరైన సమయంలో వ్యాధిని గుర్తించి సరైన చికిత్స చేయించనిచో అంధత్వం ఏర్పడే ప్రమాదం ఉంది.

**నివారణోపాయాలు :**

1) రక్తంలోని చక్కెరను అదుపులో ఉంచుకోవాలి. 2) చక్కెర వ్యాధిగ్రస్తులు 6 నెలలకు ఒకసారి క్రమం తప్పకుండా కంటి వైద్యునితో పరీక్ష చేయించుకోవాలి.

**• చికిత్స •**

ఈ వ్యాధికి నేట్రంమూర్ 10× మంచి మందు. కొంతకాలం రోజూ ఉదయం, రాత్రి ఈ మందును తీసుకోవాలి. కనుగ్రుడ్డుపై ఒత్తిడి పెరిగినప్పుడు ఈ మందును బాహ్యంగా పిచికారీ చేయవచ్చు.

## 17. కంటిశుక్లం / కేటరాక్టు / అంతర కుసుమం (Cataract)

కంటిలోని కటకంలో పారదర్శక గుణం తగ్గిపోవుటను కంటి శుక్లం అని అంటారు. కొంతమంది దీనిని కంటిలోని పొర అని అంటారు.

**లక్షణం :** దృష్టి మందగించుట–ఏదేని వస్తువును చూసినపుడు బుట్ట తెరలో చూసినట్లుండును.

**కారణాలు :** 1) కంటికి దెబ్బ తగులుట. 2) ముసలితనం / వృద్ధాప్యం వచ్చుట.

**గమనిక :** 1) దీనికి ముఖ్య ఔషధం సక్కస్ సినరేరియా మారిటిమా అను ద్రావకం. దీనిని ఒక చుక్క కంటిలో ప్రతిదినం ఉదయం, సాయంత్రం వేయాలి. ఈ విధంగా కొన్ని నెలలపాటు చేసిన శుక్లపు పొర కరిగిపోయి చూపు బాగుపడును. 2) క్రింద పేర్కొన్న మందులు వాడాలి. అవసరం అని భావిస్తే ఆపరేషన్ చేయించుకోవాలి.

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 6× :** కుడిప్రక్క తలనొప్పి, కంటి చుట్టూ నొప్పి, లోపల నొప్పి, కళ్ళకు అలసటగా ఉండుట, అవి బలహీనంగా ఉండుట, కీళ్ళవాతం – ఈ లక్షణాలతో కేటరేక్ట్ ఉన్నచో ఈ మందు వాడాలి.

**నేట్రంమూర్ 30× :** శుక్లాలు ప్రథమ దశలో (ఆరంభ దశలో) మెత్తగా ఉండుట.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** ఆర్.ఎస్. కోప్ ల్యాండ్ అను మహాశయుడు ఈ మందుతో కేటరాక్ట్ ఉన్న ముసలి వ్యక్తి దృష్టిని బాగుచేసినట్లు తెలిపాడు.

**కాలీమూర్ 6× :** కాల్కేరియాఫ్లోర్ తర్వాత దీనిని వాడాలి.

**సైలీషియా 6× :** పాదముల చెమటను అదుపులో పెట్టిన తర్వాత కేటరాక్ట్‌ను, చూపు మసకగా ఉండుటను నయం చేయును.

**కాలీసల్ఫ్ 6× :** కేటరాక్ట్ – నేట్రంమూర్ తర్వాత దీనిని వాడాలి.

**కాల్కేరియాఫాస్ 6× :** చర్మపురుగ్మత, క్యాన్సర్, క్షయ / గౌట్ వ్యాధితో కనిపించు కేటరాక్ట్.

**ద్వాదశ లవణముల మిశ్రమం :** ప్రతి మోతాదులోను కాల్కేరియా ఫ్లోర్ 30×–2 మాత్రలు, సైలీషియా 30× – 2 మాత్రలు చొప్పున మొత్తం 4 మాత్రలు ఉదయం, రాత్రి వేసుకోవాలి.

# 7

# నాసికా వ్యాధులు

## (DISEASES OF NOSE)

### 1. జలుబు / పడిసెం
### (Cold / Catarrh)

జలుబు చలికాలం, వర్షాకాలంలో ఎక్కువ మందిని బాధించే సమస్య. దీనిని పడిసెం అని కూడ అంటారు. జలుబు చేసినప్పుడు జ్వరం రావడం కూడ సహజమే. జలుబు రావటానికి ముందు ముక్కు వద్ద దురదగా ఉంటుంది. తర్వాత తుమ్ములు వస్తాయి. గొంతు ఎండినట్లు ఉంటుంది. మంచినీళ్ళు తాగితే గాని పొడి తగ్గినట్లు అనిపించదు.

తుమ్ములతో ప్రారంభమైన జలుబు వల్ల కొద్ది గంటలలో ముక్కు వెంట నీరు కారుతుంది. నిద్ర సరిగా రాదు. వ్యాధి తీవ్రత ఒకటి రెండు రోజులలో తగ్గినా వ్యాధికారక క్రిముల వల్ల వ్యాధి కొనసాగుతుంది. ముక్కు దిబ్బడ వేసి గాలి పీల్చడం కష్టమవుతుంది. జ్వరం కొద్దిగా వస్తూ ఉంటుంది.

ఈ జలుబు పట్ల నిర్లక్ష్యం వహించినప్పుడు అది సైనసైటిస్‌గా మారవచ్చు, పార్శ్వపు తలనొప్పి (Migraine) రావచ్చు. తలభారం ఎక్కువ కావచ్చు. అసలు నిద్రరాదు. నిద్రమధ్యలో మెలకువ వచ్చి బాధ కలుగుతుంది. ఈ విధంగా 1– 2 రోజులలో తగ్గవలసిన జలుబు జ్వరం రూపం దాల్చి వారాలపాటు బాధించటం జరుగుతుంది.

జలుబు వల్ల చెవులు దిబ్బడ చేస్తాయి. బిగ్గరగా దగ్గవలసిన పరిస్థితి కూడా ఏర్పడుతుంది. కొందరిలో చెవిపోటు కూడా వస్తుంది. చెవిపోటుతో పాటు చీముకూడా రావచ్చు. కొందరిలో ఈ వ్యాధి శ్వాసనాళాల లోనికి, ఊపిరితిత్తుల లోనికి వ్యాపిస్తుంది. గొంతునొప్పి వస్తుంది. గొంతు బొంగురు పోతుంది. ఛాతీనొప్పి కలుగుతుంది. బ్రాంకైటిస్, న్యుమోనియా సమస్యలు ఉత్పన్నమగును. ఎడినాయిడ్స్, టాన్సిల్స్ ఉన్న వారిలో తరచుగా జలుబు, బాధ కలుగుతుంది.

జలుబు ఒకరి నుండి మరొకరికి వ్యాపించే వ్యాధి. కనుక కుటుంబంలో ఒకరికి జలుబు ఉన్నప్పుడు మిగిలినవారు జాగ్రత్త వహించాలి.

**కారణం :** జలుబుకు ముఖ్య కారణం వైరస్ అని చెప్పబడును.

**ఉద్రేకములు :** 1) చలిగాలిలో త్రిప్పుట / తిరుగుట 2) ఎక్కువ తేమలో తిరుగుట 3) వర్షములో తడచుట 4) తడిబట్టలతో ఎక్కువసేపు ఉండుట 5) వాతావరణ మార్పు 6) పాలిచ్చు తల్లులు జలుబు చేయు ఆహార పదార్థములు తినుట 7) వ్యాధి నిరోధక శక్తి తగ్గుట 8) పొగలాంటివి పీల్చుట 9) అలర్జీ మొ॥వి జలుబును ఉద్రేకపరచును

**నివారణోపాయాలు :**

1) సాధారణంగా జలుబు తనంతటదే తగ్గుననియు, కాని ఒక వారం సమయం పట్టునని చెప్పుదురు. 2) ఎన్ని మందులు వాడినా ఒక్కొక్కసారి తగ్గదు. కొంతమందికి సులభముగ జలుబు చేయు తత్త్వముంటుంది. వారు దీర్ఘకాలము జలుబుతో బాధ పడుతుంటారు. అట్టివారికి శరీర తత్త్వమును గమనించి లోతుగ పనిచేయు మందును వాడాలి. 3) ముక్కు దిబ్బడ వేసినపుడు

i) కాచి, వడబోసిన నీరు ఎక్కువగా ఎక్కువసార్లు వాడిన కొంత మేలు కలుగును.

ii) ముక్కులో వ్రేలుపెట్టి అందినంత వరకు తేనె పూస్తే రొంప పలచనై శ్లేష్మం బయటకు కారిపోతుంది. దానివల్ల ముక్కు రంధ్రాల గుండా శ్వాస ఆడుటకు వీలగును.

ii) ముఖానికి రెండు పూటలా నీటి ఆవిరి పట్టినను ఉపశమనం లభించును.

iv) చల్లని పదార్థాలు, చల్లని నీరు మానివేయాలి.

v) వేడి పదార్థాలు తినాలి – గోరువెచ్చని నీరు త్రాగాలి.

vi) వెచ్చగా ఉండే వస్త్రాలు ధరించాలి.

vii) విశ్రాంతి తీసుకోవాలి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 3× – 12× :** రక్తప్రసరణలో ఇబ్బందులు – తలలో జలుబు చేరుట (ప్రథమదశ) – జలుబుతో కూడిన జ్వరం – ముక్కు ద్వారాలలో మంట – శ్వాసపీల్చుట కష్టముగా నుండుట – జలుబు చేయు సూచన లభించగానే దీనిని వాడిన మంచి ఉపయోగం – దీనిని కాల్కేరియా ఫాస్‌తో మార్చి గంటకొక మోతాదు తీసుకొన్న మంచిది – ఫారింగ్స్ (నోటివెనుక, ముక్కు వెనుక భాగం) లో జలుబు – ముక్కులో రక్తం స్రవిస్తున్న చిన్నని పుండ్లను ఈ మందు నయం చేస్తుంది. ఈ మందు వాడకమును గురించి పెద్దల వాక్యాలు –

1. తెల్లని నురుగువంటి స్రావం వున్నప్పుడు ఫెర్రంఫాస్ 3× నన్నెప్పుడూ నిరాశ పరచలేదు .
**– డబ్ల్యూ.ఆర్. కింగ్**

2. ఆరంభములో నున్న జలుబుకు ఈ మందు బంగారమువంటిది.
**– డా॥ జే.పి. లాంబర్ట్**

**కాలీమూర్ 6× - 12× :** జలుబు బాగా ముదిరినపుడు తెల్లని, చిక్కని, పారదర్శకముకాని స్రావం - పొడిగానున్న జలుబు - తలలో చిక్కగా నున్న జలుబు - నాలుకపై తెల్లని / బూడిద రంగుగల పూత, సప్తపథ గుహను అతుకుకొని యుండు, తెల్లని / పసుపుపచ్చ - ఆకుపచ్చ పొక్కులు-స్రావం చీమువలె నుండుట, మంటగా నుండుట - ఆమత్వక్కులలో ద్రవంకూడుట - ముక్కు ముందు భాగములలో వున్న రంధ్రాలు వాచి ఎర్రగా ఉండుట - ముక్కు రంధ్రముల వెనుక ద్వారముల గుండా శ్లేష్మమును కాంద్రించుట - సిఫిలిస్ రోగుల ముక్కు పుండుపడి దుర్వాసనగల స్రావం వెలువడుట-కర్ణాంతర నాళము (గొంతు నుండి లోపలి చెవికి గల ఇంచుమించు 2 అం॥ పొడవుగల నాళము) మూత పడుటచే గల దీర్ఘకాలపు రొంప, జలుబు - స్రావం చిక్కగా, జిగటగా, అపారదర్శకముగా ఉండుట.

**కాల్కేరియాఫ్లోర్ :** జలుబు-పసుపు పచ్చని చిన్న ముద్దలు స్రవించుట - పొడిగా నుండు జలుబు - తలలో దిబ్బడ - ఈ మందును కాలీమూర్‌తో మార్చి వాడాలి - తుమ్మాలనుకొని తుమ్మలేక పోవుట - ముక్కు పుండుపడి జలుబు - ముక్కు ఎముకల ఎదుగుదల, వాటి రోగాలు - మృతి చెందిన ఎముక దుర్వాసన.

**నేట్రంమూర్ :** జలుబు-స్రావం నీళ్ళగా, పారదర్శకంగా, నురుగుతో ఉండుట - రక్తహీనత గల రోగుల దీర్ఘకాలపు జలుబు - స్రావం ఉప్పు రుచితో నుండుట - జలుబు వల్ల చిన్న పొక్కులు, ద్రవముతో నున్న పుండ్లు ఏర్పడుట - పుండ్లు పగిలి పలచని పక్కులను వదలుట - చల్లని గాలిలోనికి వెళ్ళినా, శ్రమించినా ముక్కు నుండి స్వచ్ఛమైన నురుగుగల నీరు కారుట - ఇన్‌ఫ్లూయంజా[1] -వంగినా, దగ్గినా ముక్కు నుండి రక్తస్రావం - ముక్కు రంధ్రముల వెనుక భాగపు ద్వారములు పొడిగా నుండుట - వాసన చూచు శక్తి నశించుట - రాత్రిపూట బట్టలు తీసిన తర్వాత, ఉదయాన తుమ్ముట-జ్వరపు బొబ్బలు - నుదుటి ఎముక యందు, ముక్కుకు దగ్గరగా నుండు రెండు గుల్ల ప్రదేశాల వాపు - ఫెర్రంఫాస్‌తో గంటకొకసారి మార్చి వాడాలి.

**కాలీసల్ఫ్ :** పలచని, పసుపు పచ్చని, బంకగానున్న, నీళ్ళవంటి స్రావం - సాయంకాలం / వెచ్చని గదిలో జలుబు ఎక్కువగుట - పొడి చర్మం - ఫెర్రంఫాస్ వాడినప్పుడు చెమట రానిచో దీనిని వాడాలి. అంగుడు వెనుక భాగం పైనగల ఫారింగ్సు ఆమత్వక్కు అత్యధిక ముగా నుండుట - నిద్రలో గురక పెట్టుట - నోటితో గాలి పీల్చుట.

**కాల్కేరియాఫాస్ :** అధిక నీరసముగల వ్యక్తుల జలుబుకు దీనిని మధ్య-మధ్య వాడాలి. తలలో జలుబు-ముక్కు నుండి గ్రుడ్డు తెలసొన వంటి స్రావం-తుమ్ములు-ముక్కు రంధ్రాలు మండుట-శ్వాసమార్గముల దీర్ఘకాలపు జలుబుకిది మంచి టానిక్‌గా పనిచేసిందనియు, చాలా సందర్భాలలో సింకోనా వలే పనిచేసిందనియు డా॥ ఎల్.ఏ. బుల్ వ్రాసారు -

*1. **ఇన్‌ఫ్లూయంజా (Influenza)** : విష పడిసెము. ఇది అంటువ్యాధి. దీనిలో జలుబు ఎక్కువగా ఉండును. దీనిలో తలనొప్పి, జ్వరం, నొప్పులు ఉండును.*

ముక్కుకొన మంచువలె చల్లగా నుండుట – స్క్రూపులా తత్త్వముగల పిల్లలలో వాచిన, పుండు పడిన అడినాయిడ్స్.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** జలుబు ముదురుట – చిక్కని, పసుపు పచ్చని, అపారదర్శకమైన, అధికమైన స్రావం – రక్తపు జీరతో నుండుట – శ్లేష్మ గ్రంథులను శుభ్రపరచుట – ముక్కు నుండి రక్తస్రావం.

**నేట్రంఫాస్ :** ఆమ్లం పెరుగుట, నాలుక మొదట్లో పసుపు పచ్చని పూత ఉండుట – అలాంటప్పుడు జలుబు ఉన్నచో దీనిని మధ్య మధ్య వాడాలి. స్రావం చిక్కగా, పసుపుపచ్చగా ఉండును. స్క్రూపులా తత్త్వముగల వారిలో ముక్కు పుండు పడి దుర్వాసన వచ్చుచున్నచో దీనిని వాడాలి.

**నేట్రంసల్ఫ్ :** బహిష్టు సమయాన ముక్కునుండి రక్తస్రావం – పొడి వాతావరణం నుండి తేమగల వాతావరణము లోనికి మారినపుడల్లా జలుబు ఎక్కువగుట – ఆకుపచ్చని స్రావం – కణాల ద్రవములలో నీరు అధికమైనపుడిది మంచి మందు.

**కాలీఫాస్ :** నాడీ బాధలు, దుర్వాసనగల స్రావము, శ్వాస, ముక్కు నుండి రక్తస్రావం, జలుబు తగ్గుతున్న సూచన, పసుపు పచ్చని పక్కులు, స్రావం, కొద్దిగా గాలిలో తిరిగినా తుమ్ముట, ముక్కు రంధ్రముల వెనుక భాగపు ద్వారముల ద్వారా కాంఢ్రించుట.

**మెగ్నీషియంఫాస్ :** వాసన తెలియకుండుట – పొడిగాను, వదులుగాను వుండు జలుబు – ముక్కు రంధ్రముల నుండి వడిగ, ఆకస్మికముగ, విస్తారముగ చీమిడి కారుట.

**సైలీషియా :** ముక్కు నుండి దుర్వాసనగల స్రావం – ముక్కులో బాధగా ఉండుట – దీర్ఘకాలంగా ముక్కు పొడిగా ఉండుట – మొండిగా నున్న పుండు ఏర్పడుట – మంటగా నుండి శరీర ధాతువులను నాశనం చేయునట్టి స్రావం – ముక్కు రంధ్రముల వద్ద, పెదవులపైన హెర్పస్ సంబంధమైన ద్రవపు పొక్కులు – ముక్కు కొనపై దురద.

**ద్వాదశ మిశ్రమం :** ఒక్కొక్క మోతాదుకు

ఫెర్రంఫాస్ 3× – 1 మాత్ర + కాలీమూర్ 3× – 1 మాత్ర + నేట్రంమూర్ 3× – 1 మాత్ర + కాలీసల్ఫ్ 3× – 1 మాత్ర + నేట్రంసల్ఫ్ 3× – 1 మాత్ర = మొత్తం 5 మాత్రలు 2 గంటలకొక మోతాదు.

## 2. సైనసైటిస్
## (Sinusitis)

సైనస్ అనగా కోటరం / గూడు / లొత్త / గుంట అని అర్థం. వీటిలో గాలి / ద్రవం / రక్తం ఉంటుంది. శరీరంలో అనేక అవయవాలలో ఇలాంటి సైనస్‌లు చాలా

ఉన్నాయి. ఇవి ముక్కు, కపాలం, క్షీరనాళికలు, లింఫ్ గ్రంథులు మొ॥ వాటిలో ఉన్నాయి. కాని ముఖంలో ముక్కు చుట్టూ ఉన్న సైనస్‌ల వాపుకే సైనసైటిస్ అనే పదం వాడుతారు. ఈ వ్యాధి మనిషిని చంపదు. కాని ఇది అమిత మరణ బాధను కలిగించును.

**లక్షణాలు :** 1) ముక్కు రంధ్రాలు దిబ్బడ వేయుట. 2) ముక్కు మొదట్లో / దూలంలో నొప్పి. 3) ముక్కులోనుండి నీటి వంటి స్రావం, ముక్కు దిబ్బడ వేయుట మారిమారి వచ్చుట. 4) తుమ్ములు – గురక. 5) నుదురు / దవుడ ఎముకల సైనస్‌లలో వాపు. 6) ముక్కు మూలమున తీవ్రమైన నొప్పి. 7) దీర్ఘవ్యాధిగ్రస్తులలో ముఖంలో తీవ్రమైన నొప్పి, తలనొప్పి / రెండు కనులొత్తల మధ్య, నుదుటి ఎముక యందుగల సైనస్ నొప్పి (Frontal sinus) 8) కొద్దిగా జ్వరం. 9) నోటితో గాలి పీల్చుట.

**కారణాలు :** 1) శరీర తత్త్వం 2) వ్యాధి నిరోధక శక్తి తగ్గినపుడు వైరస్ సంపర్కం 3) దుమ్ము ధూళి, గడ్డి / ఇతర రకముల పుప్పొడి ఎలర్జీ 4) చలిగాలిలో తిరుగుట 5) శీతల పానీయాలు త్రాగుట 6) ముక్కులో ఎడినాయిడ్స్ ఉండుట

**నివారణోపాయాలు :**

1) ఈ వ్యాధికి సోరా ముఖ్య కారణం. కనుక దానిని నిర్మూలించునట్టి సల్ఫర్ వంటి హోమియో మందును ఎక్కువ పొటెన్సీలో ఎక్కువ కాల వ్యవధిలో ఇవ్వాలి. 2) చల్లని వాతావరణం, చల్లని ఆహార పదార్థాలు, ఫ్రిజ్‌లో పెట్టిన చల్లని నీరు, ఐస్‌క్రీమ్ వంటివి జలుబును పెంచును. కనుక చల్లని వాతావరణంలోను, పొగమంచు పడుతున్నప్పుడు బయట తిరుగరాదు. చలికాలంలో వేడివస్త్రాలు ధరించాలి. వర్షంలో తడవరాదు. ఐస్‌క్రీము తినరాదు. చల్లని నీరు త్రాగకుండ గోరువెచ్చని నీటిని త్రాగాలి. 3) దుమ్ము, ధూళి, పోపువేసే పనులకు దూరంగా ఉండాలి. 4) చాలమంది రోగులు 20 – 25 సంవత్సరాలుగా ముక్కులో డ్రాప్స్ వేసుకొని తాత్కాలిక ఉపశమనం పొందుతున్నట్లు తెలుస్తుంది. కాని దీనివల్ల వారు వాసనను పసిగట్టే శక్తిని కోల్పోయినట్లు సమాచారం. కనుక ఈ విషయాన్ని ఈ వ్యాధిగ్రస్తులు తెలుసుకొని జాగ్రత్త పడాలి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12X :** జలుబు ప్రథమ దశ – జలుబు పట్టే పూర్వ సూచనలు ఉన్నప్పుడు

**కాల్కేరియాఫ్లోర్ 6X :** ముక్కు దిబ్బడ వేయుట – తుమ్మాలనే కోరిక నెరవేరకుండుట – ముక్కు రంధ్రముల వెనుక నుండు ఆమత్వక్కు పెద్దదగుట.

**కాల్కేరియాఫాస్ 6X :** నుదుటి ఎముకయందు గల సైనస్ నొప్పి (Frontal sinus) కు ఇది మంచి మందు. ముక్కుకొన మంచువలె చల్లన. స్క్రూఫులా తత్త్వంగల పిల్లల ముక్కు నొప్పి, వాపు, వేడిమి, ఎరుపు లక్షణాలతో ఉండుట – రక్తహీనుల, స్క్రూఫులా తత్త్వంగల

రోగుల దీర్ఘకాల జలుబుకు కూడ ఇది ఉపయోగపడును. ముక్కునుండి అల్బుమిన్ వంటి స్రావం – ముక్కులో పెద్దదైన కంతి – స్రావంతో పాటు పొక్కులు, అప్పుడప్పుడు రక్తజీరతో.

**కాల్కేరియాసల్ఫ్ 3× –12× :** చిక్కని పసుపు పచ్చని స్రావం –ముక్కు రంధ్రపు అంచులు బాధగ ఉండుట.

**కాలీమూర్ 6× :** ముక్కు బిగుసుకుపోవుట – నాలుకపై తెల్లని / బూడిద వర్ణపు పూత.

**కాలీఫాస్ 6× :** ఏమాత్రం చల్లని గాలి తగిలినా తుమ్ముట – వెనుకనున్న ముక్కు రంధ్రాల నుండి చిక్కని శ్లేష్మాన్ని కాంద్రించుట.

**కాలీసల్ఫ్ 6× :** ముక్కు దిబ్బడ వేయుట – ముక్కు రంధ్రాల నుండి పసుపు పచ్చని స్రావం – వాసన చూచు శక్తి కోల్పోవుట – ముక్కు దురదగా ఉండుట.

**మెగ్నీషియంఫాస్ 6× :** జలుబు లేకపోయినా వాసన చూచు శక్తి నశించుట – ముక్కు దిబ్బడ వేయుట, ముక్కు నుండి నీటి స్రావం అధికంగ విస్తారముగ వచ్చుట – జలుబు ఒకసారి పొడిగాను, మరొకసారి వదులుగాను మారిమారి వచ్చుట.

**నేట్రంమూర్ 6× :** రక్తహీనత కలవారి దీర్ఘకాలపు జలుబు – శ్లేష్మం ఉప్పు రుచిలో నుండుట – వాసన, రుచి జ్ఞానం కోల్పోవుట – ఎక్కువగ తుమ్ముట – ఉదయాన అధికమగు జలుబు – ముక్కు ఎర్రబడుట– ముక్కుపై మొటిమలు, బాధాకరమైన గ్రంథులు.

**నేట్రంఫాస్ 6× :** ముక్కుపై పొడిచినట్టి నొప్పి – కడుపులో మంట – కుడివైపు క్రింది దవుడ  బాధగ ఉండుట – ముఖం పాలిపోయి ఉండుట.

**నేట్రంసల్ఫ్ 6× :** ముక్కు రెక్కల దురద – ముక్కు దిబ్బడ వేయుట – ఉప్పు వంటి శ్లేష్మాన్ని కాంద్రించుట.

**సైలీషియా 6× :** ముక్కుకొన ఎరుపు – ముక్కు రంధ్రాల దురద – తుమ్ముట – దీర్ఘకాలపు జలుబు, ఆమత్వక్కు వాపు – ముక్కు కొనవద్ద సహించరాని దురద – సిఫిలిస్ / స్క్రూఫులా తత్త్వం కారణంగా ముక్కు ఎముకలు పుండు పడుట.

## 3. ముక్కు నుండి రక్తస్రావం

అప్పుడప్పుడు కొంతమంది ముక్కు నుండి రక్తం స్రవిస్తూ ఉంటుంది.

**కారణాలు :** 1) దెబ్బ తగులుట. 2) ముక్కుకు సంబంధించిన వ్యాధులు 3) బహిష్టు 4) వేడిని కలిగించు శ్రమ మొ॥ కారణాలు.

**నివారణోపాయాలు :** 1) తలపై తడిగుడ్డ / ఐస్‌తో నింపిన ప్యాక్‌ను ఉంచుట. 2) విశ్రాంతి.

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 6X :** ముక్కునుండి కొద్దిగా చీమిడి స్రవించుట, పొక్కులు, రక్తపుజీర.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** ముక్కునుండి రక్తస్రావం – ఒక ముక్కు రంధ్రం నుండి మాత్రమే శ్లేష్మం–ముక్కు పొడిగా ఉండుట–పొక్కులు ఏర్పడుట–ముక్కులో దురద–శ్వాసకు ఆటంకం.

**ఫెర్రంఫాస్ 6X – 12X :** పిల్లలలో ముక్కుల నుండి రక్తస్రావం – ప్రకాశవంతమైన ఎర్రని రక్తం కారుట.

**నేట్రంసల్ఫ్ 6X :** బహిష్టులో ముక్కునుండి రక్తస్రావం – వాంతి, విరేచనాలు.

**కాలీఫాస్ 6X :** ముక్కు నుండి కాఫీ గింజల వంటి రక్తం – బలహీనమైన, సున్నితమైన, ఆదుర్దా కలిగిన, విచారముగానున్న, ఇతరులతో కలవని వారిలో.

**కాలీమూర్ 6X :** మధ్యాహ్నం తర్వాత, ముక్కు నుండి నల్లని గడ్డలు ఉన్న రక్తం బంకతో స్రవించుట – రోగి తాను ఆహారం లేక చనిపోవాలని భావించుట.

**నేట్రంమూర్ 6X :** భవిష్యత్తుని గురించి నిరాశ కలవారిలో, కన్నీరు కార్చుటకు సిద్ధంగా ఉండు వారిలో, మెదడు త్వరగా అలసట చెందువారిలో, జ్ఞాపకశక్తి బలహీనముగా నుండు వారిలో వంగినా, దగ్గినా, ముక్కు నుంచి రక్తస్రావం.

## 4. తుమ్ము
## (Sneeze)

తుమ్ము ప్రతీకార చర్య. ఇది దగ్గుకు సన్నిహితం. ఇది ముక్కుకు సంబంధించినది. తుమ్ము రావడం అనేది ఆరోగ్యానికి మంచిదే. కాని రోజుకు 50–60 తుమ్ములు రావడం వ్యాధియే.

**లక్షణాలు :** 1) తుమ్ము వచ్చినప్పుడు నోరు మరియు ముక్కు నుండి అనియంత్రిత, ఆకస్మిక, వేగం గల, బలీయమైన గాలి ధ్వని చేస్తూ బయటికి వెళ్ళును. 2) ముక్కులోని ఆమత్వక్కు పొర ఉబ్బును. దురదగా ఉండును. 3) ముక్కు నుండి నీటివంటి స్రావం వెలువడును. 4) ముక్కులోను, కంటిలోను మంటగా ఉండును.

**కారణాలు :** 1) వంశపారంపర్యత. 2) ధూళి, పొగ, ఘాటైన వాసనలు (పోపు వాసన) చల్లటి పానీయాలు, ఫ్యానుగాలి, చల్లనిగాలి, తడి వాతావరణం, పుప్పొడి రేణువులు, మంచు, కొన్ని పదార్థాలు మొ॥ వాటి వల్ల ఎలర్జీ. 3) ముక్కుకు సంబంధించిన కణజాలాలలో లవణాల కలత.

**ముఖ్య గమనికలు :** 1) ఈ వ్యాధి సాధారణంగా ప్రతి సంవత్సరం జులై నుండి జూన్ వరకు ఎక్కువగ ఉంటుంది. 2) ఈ వ్యాధివల్ల రోగికి ఎక్కువ అసౌకర్యం, చికాకు

ఏర్పడినచో కొన్ని సంవత్సరాల తర్వాత ఈ వ్యాధి బ్రాంకైటిస్ / ఆస్త్మా (ఆయాసం / ఉబ్బసం) కలగవచ్చు.

**నివారణోపాయాలు :**

1. మంచినీరు తక్కువగా త్రాగేవారికి ఈ వ్యాధి ఎక్కువగా ఉంటుంది. కాబట్టి రోజుకు 3-4 లీటర్ల నీటిని గోరువెచ్చగా చేసి త్రాగాలి. చల్లని నీరు పనికిరాదు. కనుక ఫ్రిజ్ నీరు, కూల్‌డ్రింక్స్ త్రాగరాదు.
2. ఉదయం పూట 40-50 నిమిషాలపాటు వేగంగా నడవటం / జాగింగ్ చేయాలి. అప్పుడు మాట్లాడకుండా మనసును శ్వాసపై దృష్టి పెట్టి దీర్ఘశ్వాస తీసుకోవాలి.
3. ప్రతిరోజు ముఖానికి ఏదైనా నూనె రాసుకొని 10 ని॥ పాటు నీటి ఆవిరిని పట్టుకోవాలి.
4. పంచదార, స్వీట్స్‌కు దూరంగా ఉండాలి.
5. ఆహారాన్ని ఉప్పు లేకుండా తీసుకోవాలి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6×** : ముక్కు లోని ఆమత్వక్కు పొర పొడిగా, మంటగా ఉండుట - జ్వరం - ఈ మందును నేట్రంమూర్‌తో మార్చి ఇవ్వాలి.

**నేట్రంమూర్ 6×** : ముక్కు నుండి, కండ్ల నుండి నీటిస్రావం ధారాళంగా వెడలుట - తుమ్ములు విపరీతంగా వచ్చుట - ముక్కు వాసన చూచు శక్తిని కోల్పోవుట. (ఈ మందు వ్యాధి నిరోధకముగా పనిచేయును)

**మెగ్నీషియాఫాస్ 6×** : దీనిని వేడినీటితో తరచుగా ఇవ్వాలి. ఇలా చేస్తే తుమ్ములను రాకుండా చేయును. వచ్చిన వాటిని పోగొట్టును.

**సైలీషియా 12×** : తుమ్ములు ఉధృతముగా నుండును. స్రావముచే ముక్కు రంధ్రములు పుండుపడును. చన్నీటి వల్ల రాత్రి పడుకొన్నప్పుడు బాధ అధికమగును.

# 8

# చెవి సంబంధ వ్యాధులు

## (DISEASES OF THE EAR)

## 1. చెవి / కర్ణ వ్యాధులు

**చెవి ఎలా శబ్దం వింటుంది?**

శబ్దం జ్ఞానేంద్రియాలలో ఒకటి. చెవి ప్రధాన భాగాలు కపాలము / పుర్రె (skull) లో వుంటాయి. చెవి మూడు భాగాలుగా విభజింపబడ్తుంది –1) బయటి చెవి 2) మధ్యచెవి 3) లోపలి చెవి.

బయటి చెవి శబ్ద తరంగాలను గ్రహిస్తుంది. ఆ తరంగాలు వంకర గొట్టము ద్వారా కర్ణభేరి (Ear drum) ని తాకును. అప్పుడు కర్ణభేరి కంపిస్తుంది. తర్వాత మధ్య చెవిలోని ఎముకల గొలుసులోని మూడు ఎముకలు కూడ కంపిస్తాయి. ఈ కంపనము చెందిన ధ్వని తరంగాలు లోపలి చెవి పొరను చేరును. ఈ కంపనానికి కర్ణావృత్తిలోనున్న ద్రవం, దానిలో నున్న నాడీ కణాలు కంపించును. కంపనము చెందిన ద్రవం కర్ణావృత్తిలోని నాడుల అంత్య భాగములను ఉత్తేజపరచును. ఈ ధ్వని ఉత్తేజితములు శ్రవణనాడి ద్వారా పెద్ద మెదడులోని ధ్వని కేంద్రమును చేరును. అచ్చట శబ్ద జ్ఞానమగును.

**చెవి రోగములు :**

i) **చెవి పోటు** (Ear-ache) : ఇది చెవినరాల నొప్పి, జలుబు, చెవికి దెబ్బ తగులుట, చెవిలో ఏదైనా వస్తువుతో పొడుచుకొనుట (అగ్గిపుల్ల, పిన్నీసు మొ॥ పెట్టుకొనుట), స్నానం చేయునపుడు, ముఖం కడుగుకొనునపుడు నీరు చెవి లోనికి పోవుట, చెవిలో కురుపులు, చెవిలో ఎక్కువగ గుబిలి చేరుట, మసూచి, పొంగు వంటి వ్యాధులు సోకుట మొ॥ కారణాల వల్ల చెవిపోటు వచ్చును.

ii) **చెవి వాపు** (Otitis) : ఇది బయటి / బాహ్య చెవి వాపుతో ప్రారంభమగును. సాధారణముగ జలుబు వలన ఈ వ్యాధి వచ్చును. కొన్ని సందర్భాలలో ఈ వ్యాధి మధ్య చెవిలోనికి వ్యాపించును. కర్ణాంతర నాళము (Eustachian tube) వాచి నొప్పి పెట్టవచ్చు. దానివలన జ్వరం రావచ్చు. దాని లోపల చీము పట్టవచ్చు.

iii) **చెవి నుండి స్రావము / చీము కారుట** (Otorrhoea) : జ్వరములు, పొంగువలన చెవి నుండి స్రావము స్రవించును. పెద్దవారిలో చెముడు రావటానికి ముందు చెవి నుండి చీము స్రవించును.

iv) **చెవులు సరిగ వినిపించకుండుట** (Hardness of hearing) : జలుబు, చెవివాపు, చెవిలో హోరు, చెవిలో చీముపట్టుట, పొంగు, నరాల బలహీనత, పాదరసమున్న మందులు వాడుట మొ॥ కారణాల వల్ల చెవులు సరిగా వినిపించవు.

v) **చెవుడు** (Deafness) : తీవ్రమైన వ్యాధుల వలన చెవుడు వస్తుంది. కొంతమందికి పుట్టుకతో చెవుడు వస్తుంది. పుట్టుకతో వచ్చే చెముడుకు చికిత్స లేదు. పక్షవాతం, కర్ణభేరి వద్ద గుబిలి చేరుట మొ॥ కారణాల వల్ల చెవుడు వస్తుంది.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× - 12× :** జలుబు వల్ల చెవిపోటు, నొప్పి, మంట, ధనారింపుగ కొట్టినట్లుండు నొప్పి, ధ్వనులను భరించలేకపోవుట, రక్తాధిక్యత వల్ల వచ్చు చెవిపోటు – చెవినొప్పి, తీక్షణమైన కుట్టినట్లుండు నొప్పి – రక్తహీనత కలవారిలో అతి సంవేదన శీలత ఉండును. హన్‌టన్ ప్రకారం గుండె కొట్టుకొన్న ప్రతిసారి దాని అనుభూతిని చెవులలోను, తలలోను పొందవచ్చు. ఆ విధంగా నాడిని లెక్కించవచ్చు.

దీర్ఘకాలంగా మధ్య చెవి నొప్పి ఉండుట, చీము ఉండదు – మధ్యచెవి కర్ణభేరి గట్టి పడుట – చిన్న ఎముకలు బహుశా బిర్రబిగియవచ్చు.

వాన్‌స్టాల్ చెవిపోటుకు సంబంధించి ఫెర్రంఫాస్ 5 లక్షణాలు ఈ విధంగా పేర్కొన్నారు. 1) చెవిపోటు ఒకచోటున కేంద్రీకృతం కాకుండ బాగా వ్యాపించును. 2) చెవి భాగాలన్నీ గాఢమైన ఎరుపులో ఉండును. 3) ఆమత్వక్కు నుండి అధిక స్రావం వెలువడును. రక్తస్రావమయ్యే పరిస్థితి ఉండును. 4) స్రావం పూర్తిగా వెలువడినా నొప్పి తగ్గదు. 5) నొప్పి ఆకస్మికముగను, ఉద్ధృతముగను, కాలవ్యవధులలోను వచ్చును.

రోగి రక్తహీనత, నీరసం, వాపువల్ల చెవుడు, చీము కారుట, కోస్తున్నట్టి నొప్పి, ఒత్తిడి, రక్తాధిక్యత వల్ల చెవులందు ఘంటానాదం, బజ్‌మను ధ్వని, గట్టి శబ్దమగుట – కర్ణభేరి వాపు – ఆమత్వక్కు పొడిగా ఉండుట.

"చల్లగాలి తగులుట లేక నీటిలో తడచుట వల్ల చెవినొప్పి వచ్చిన, దీనికంటే మంచి మందు నాకు కనిపించలేదు" **– ఆర్.ఎస్.కోస్‌ల్యాండ్.**

చెవిపోటు ఉన్నప్పుడు ఈ మందును 6× లో అరగంటకు / గంటకు ఒకసారి, సరిగా వినపడనప్పుడు 6×లో రోజుకు 3సార్లు ఇవ్వాలి.

**కాలీమూర్ 3× - 6× :**

★ చెవిపోటు – తెల్లని / నెరసిన వెంట్రుక నాలుకపై ఉన్నట్లనిపించుట – కర్ణాంతర నాళముల వాపు వల్ల వచ్చిన చెముడు – బాహ్యచెవి పోటు వల్ల వచ్చిన చెముడు – ఈ రకముల చెవుడుకి ఇది ప్రధానమైన మందు.

★ చెవుడు-గ్రంథుల వాపు / ముక్కు చీదినపుడు చెవులలో ఏదో వస్తువు పగిలిన శబ్దం - నాలుకపై తెల్లని పూత.

★ దీర్ఘకాలపు చర్మవ్యాధి - మధ్యచెవి తడిగానుండు పొర - ధాతువులు మరణించి పొరలుగా రాలుట - ఇవి తడిగా ఉండుట.

★ వాపులలో చీము తెల్లగా నుండుట - కర్ణ రంధ్రం, కర్ణభేరి ఆమత్వక్కు నుండి నూకలు వంటివి అధికంగా రాలుట.

★ దీర్ఘకాలంగా ఉన్న మధ్యచెవి నొప్పి, వాపు - చెవులందు గంటానాదం, బజ్ శబ్దం లేక పెద్ద శబ్దాలు ఉన్నప్పుడు ఈ మందు బాగా పనిచేయును.

★ నూకల వంటి ఫారింగ్స్ - కర్ణాంతర నాళములు మూతపడుట - మధ్యచెవి ఆమత్వక్కు వెనుకకు లాగబడుట - బాహ్యరంధ్రం గోడలు శుష్కించుట.

★ ముక్కు, సప్తపథ, కర్ణాంతర నాళము నొప్పి (రెండవ / తర్వాతి దశ)కి కాలిమూర్ ముఖ్యమైన మందు.

★ ముక్కు చీదునపుడు చెవి బ్రద్ధలగుచున్నట్లుండుట.

**నేట్రంమూర్ 6X :** మధ్యచెవి వాపు వల్ల చెముడు-నీళ్ళ వంటి స్రావం-చెవులలో గర్జన -నాలుకపై బుడగలు-నోటిలో లాలాజలం ఎక్కువగా స్రవించుట-మధ్యచెవి, కర్ణాంతర నాళం నొప్పి-చెవుల నుండి చీము స్రవించుట-చెవిలో దురద, మంట-చెవిలో చురుకగు నొప్పి, నమలినప్పుడు చెవిలో ధ్వనియగుట - క్వయినా వాడిన పిమ్మట కలిగిన చెవుడుకు ఈ మందు మంచిది.

**కాలీఫాస్ 3X - 12X :**

★ వినికిడి మందగించుట - తలలో ధ్వనులు - దృశ్యనాడి శక్తిహీనత వల్ల కలుగు చెవుడు - గాబరా - శబ్దపథం దురద - సంవేదనశీలత్వం ఎక్కువగుట వల్ల ఎలాంటి ధ్వనిని భరించలేకపోవుట - నీరసం-నరాల బలహీనత - కర్ణభేరి వాపు - మధ్యచెవి చీము పట్టుట-చీము నీళ్ళవలే, మురికిగా, గోధుమ వర్ణములో, మిక్కిలి దుర్వాసనతో ఉండుట - వాపు ఎక్కువగా ఉండుట - సులభంగా రక్తం స్రవించుట - నూకలు ఏర్పడుటకు తక్కువ అవకాశం - చీము ఎక్కువగా స్రవించుట.

★ శుష్కించు పరిస్థితులు ఎక్కువగా ఉన్నట్టి, జీవశక్తి లేనట్టి ముసలివారి చెవి సంబంధ వ్యాధులకిది బాగా ప్రయోజనకారి. వారి ధాతువులు ఎండిపోయి పొలుసులుగా మారుచుండును **- హ్యూగ్టన్.**

★ చెవిలో తుమ్మెదల రొదను ఈ మందు మాన్పక పోతే మెగ్నీషియం ఫాస్‌ను వాడాలి.

**కాల్కేరియాసల్ఫ్ 6× :**

★ చెవి నుండి పదార్థం స్రవించుట – కొన్ని సమయాల్లో రక్తముతో కూడి యుండుట – దీనివల్ల వచ్చు చెవుడు.

★ మధ్యచెవి చీము పట్టుట, గ్రంథివాపు.

★ చెవి వెనుక భాగాన వాపు – చీము స్రవించు ప్రవృత్తి.

★ బయటి చెవులలో నొప్పి – చెవి చుట్టూ ఉండు ఎముకలు నొప్పిపెట్టుట, గాయపడుట – చెవి నొప్పి – మేహవాత నొప్పులతో కలిసి యుండుట.

★ క్షయవ్యాధిగ్రస్తుల పిల్లల గ్రంథులు వాచుట – వారికి దీర్ఘకాలంగా చెవి నుండి చీము కారుట – బాధాకరమైన దంతోత్పత్తి

★ మధ్యచెవి రంధ్రంలో చీముకారుట వల్ల చెవుడు వచ్చుట. **(కూపర్)**

**మెగ్నీషియంఫాస్ 3× – 6× :**

★ వినికిడి నరాల పేశముల వ్యాధుల వల్ల చెవుడు ఏర్పడుట / వినికిడి మందగించుట – ఇలాంటి సందర్భములో ఈ మందును కాలీమూర్‌తో కలిపి వాడాలి.

★ కణముల విభజనవల్ల మధ్య చెవిలో అధికమగు వ్యాధులకిది మంచి మందు**– డా. రౌండ్స్**

★ నరాల బలహీనతవల్ల వచ్చు చెవి నొప్పికి (ముఖ్యముగ కుడి చెవి వెనుక)

★ ఈ మందును వేడినీటితో ఇవ్వాలి.

**కాలీసల్ఫ్ 3× – 6× :**

★ చెవి పోటు – వాపు తర్వాత చిక్కని పసుపు పచ్చని / ఆకుపచ్చని ద్రవం స్రవించుట (ముఖ్యంగా కుడి చెవి నుండి) సాయంకాలం అధికమగుట.

★ చెవుల క్రింద తీక్షణమైన, కోయుచున్న నొప్పి.

★ మస్టాయిడ్ ఎముక[1] క్రింద చురుకైన, కుట్టినట్టి నొప్పి – నీళ్ళవంటి పదార్థం / పసుపు పచ్చని చీము స్రవించుట.

★ చెవుడు జలుబుతో కూడి యుండును. ఇది కర్ణాంతర నాళపు లైనింగ్‌కు, మధ్య చెవికి వాపును కలిగించును. చెవి నుండి పసుపు పచ్చని నీళ్ళవంటి స్రావం వచ్చును. నాలుకపై పసుపు పచ్చని పూత ఉండును. వేడిగానున్న గదిలో చెవుడు ఎక్కువగును. చీము వాసన గొల్పును.

★ కంతి / కాయ చెవి రంధ్రాన్ని మూసివేయును.

★ మధ్యచెవి నుండి చిక్కని స్రావం వెలువడుట – దీనివల్ల వాపు ఏర్పడుట.

★ చెవిచుట్టూ గజ్జి – చెవిలో చిటపట శబ్దాలు.

*1. **మస్టాయిడ్ ఎముక :** ఇది చెవి వెనుక ఉండును.*

**సైలీషియా 6x - 12x :**

- ★ కర్ణాంతరనాళముల, కర్ణభేరి రంధ్రం వాపు - జలుబు వల్ల వినికిడి మందగించుట.
- ★ బాహ్యచెవి వాపు, బాహ్యరంధ్రం వాపు.
- ★ సున్నితమైన మనస్తత్వం - ధ్వనులను భరించలేక పోవుట.
- ★ చెవిలో గర్జించు శబ్దాల వలన నిద్ర లేకపోవుట.
- ★ హిస్ యను శబ్దాలు చెవిలో వినిపిస్తున్నంత సేపు వినికిడి సరిగా ఉండకపోవుట - గట్టిగా మాట్లాడిన చెవులు తెరుచుకొనును.
- ★ చలివలన సరిగ వినబడదు. మనుష్యుల మాటలు సరిగా వినబడవు. కాని పిల్లనగ్రోవి ధ్వని వినబడును.
- ★ చీము దుర్గంధభరితముగా, పలుచగా ఉండి ఎముకలను నాశనం చేయగలుగుట.

**నేట్రంఫాస్ 6x :**

- ★ చెవులు బాధగా ఉండుట.
- ★ చెవి బయటిభాగంపై మెత్తని, పలుచని క్రీము వంటి గజ్జి-నాలుకపై పసుపు పచ్చని పూత.
- ★ ఒక చెవి ఎర్రగా, వేడిగా, తరచుగా దురదతో ఉండుట.
- ★ జీర్ణవ్యవస్థ సరిగా లేనందువల్ల, ఆమ్లాధిక్యత వల్ల చెవుల నుండి చీము కారుట.

**నేట్రంసల్ఫ్ 6x :**

- ★ చెవి పోటు - చెవిలో నుండి ఏదో ఒకటి బయటికి రావాలని ఉన్నట్లుగా నొప్పి ఉండును. తడి వాతావరణములో చెవిపోటు అధికమగును. గంటల శబ్దం చెవిలో మ్రోగుచుండును.

**కాల్కేరియాఫ్లోర్ 6x :**

- ★ మస్టాయిడ్ ఎముకకు చుట్టూ ఉండు పొర దెబ్బతినుట (హిగ్టన్) - మధ్యచెవిలో కాల్షియం పేరుకుపోవుట - దానిలో ధ్వనులు వినిపించుట.

## 2. చెవిపోటు / నొప్పి
**(Ear-ache)**

చెవిపోటుకు క్రింది మందులను లక్షణాలను బట్టి అరగంట / గంట వ్యవధిలో ఇవ్వాలి.

### • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6x - 12x :** జలుబు వల్ల వచ్చు చెవిపోటు - అది ఒకచోట ఉండకుండ చెవి భాగాలన్నీ వ్యాపించును. రక్తాధిక్యతవల్ల చెవి భాగాలన్నీ ఎర్రగ ఉండును. ఆమత్వక్కు

(తడిగ నుండు పొర) నుండి అధికస్రావం వెలువడును. కొన్ని సందర్భాలలో రక్తం కూడ కారును. నొప్పి ఆకస్మికముగను, ఉద్ధృతముగను, నిశ్చిత కాలవ్యవధులలోను వచ్చును. "చల్లగాలి తగులుట / నీటిలో తడచుట వల్ల చెవినొప్పి వచ్చిన దీనికంటె మంచి మందు లేదు" **(ఆర్.ఎస్.కోప్ ల్యాండ్)**

**కాలీమూర్ 3× - 6× :** చెవిపోటు-ముక్కు చీదినపుడు చెవులలో ఏదో వస్తువు బ్రద్దలగుచున్నట్లుండుట - చీము, నాలుకపూత తెల్లగ ఉండుట - కర్ణ రంధ్రం, కర్ణభేరి ఆమత్వక్కు (తడిగ నుండు పొర) నుండి నూకలు వంటివి అధికముగ రాలుట - ముక్కు, సప్తపథ, కర్ణాంతర నాళముల పోటు (ద్వితీయ దశలోను / ఆ తర్వాతి దశలలోను)కు ఇది మంచి మందు.

**నేట్రంసల్ఫ్ 6× :** చెవిపోటు - చెవిలో నుండి ఏదో వస్తువు బయటికి రావాలని ఉన్నట్లుండుట - గంటల శబ్దం చెవిలో మ్రోగుట - తడి వాతావరణంలో నొప్పి ఎక్కువగుట.

**నేట్రంమూర్ 6× :** చెవిలో చురుకగు నొప్పి - మధ్యచెవి, కర్ణాంతరనాళం నొప్పి - చెవిలో దురద, మంట - నమిలినపుడు చెవిలో ధ్వని అగుట.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** బయటి చెవులలో నొప్పి - చెవిచుట్టూ ఉండు ఎముకల నొప్పి - మేహవాత నొప్పులతో ఉండు చెవినొప్పి.

**మెగ్నీషియంఫాస్ 3× - 6× :** నరాల బలహీనత వల్ల వచ్చు చెవినొప్పి - ముఖ్యంగా కుడిచెవి నొప్పి - ఈ మందును వేడినీటితో ఇవ్వాలి.

**కాలీసల్ఫ్ 3× - 6× :** చెవిపోటు - వాపు తర్వాత చిక్కని పసుపు పచ్చని / ఆకుపచ్చని స్రావం స్రవించుట (ముఖ్యంగ కుడిచెవి నుండి) - సాయంకాలం స్రావం స్రవించుట అధికమగుట - చెవిచుట్టూ గజ్జి - చెవిలో చిటపట శబ్దాలు.

## 3. చెవి వాపు
## (Otitis)

లక్షణాలను బట్టి క్రింది మందులను ఉదయం, మధ్యాహ్నం, రాత్రి 3 మోతాదులు తీసుకోవాలి. మొదటిరోజున అవసరమని భావిస్తే 1 గంట / 2 గంటలకు 1 మోతాదు తీసుకోవచ్చు.

### • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× - 12× :** కర్ణభేరి వాపు - ఆమత్వక్కు పొడిగ ఉండుట - చలిగాలి తగులుట / నీటిలో తడచుట వల్ల చెవినొప్పి.

**కాలీమూర్ 3× - 6× :** కర్ణాంతర నాళముల వాపు, దీర్ఘకాలపు మధ్యచెవి వాపు - గంటానాదం / బజ్ శబ్దం - ముక్కు చీదునపుడు చెవి బ్రద్ధలగుట.

**నేట్రంమూర్ 6× :** కర్ణభేరి వాపు - వాపు ఎక్కువగ ఉండుట - చెవుల నుండి చీము ఎక్కువగ స్రవించుట - సులభంగా రక్తం స్రవించుట - చెవిలో తుమ్మెదల రొద.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** చెవి వెనుకభాగాన వాపు - చీము స్రవించు ప్రవృత్తి - చెవి నుండి పసుపు పచ్చని, వాసనగొల్పు చీము - నాలుకపై పసుపు పచ్చని పూత.

**సైలీషియా 6× - 12× :** కర్ణాంతర నాళముల, కర్ణభేరి రంధ్రం వాపు, బాహ్యచెవి వాపు, బాహ్య రంధ్రం వాపు - పలచని, దుర్గంధభరితమైన, ఎముకలను నాశనం చేయునట్టి చీము.

## 4. చెవి నుండి చీము కారుట
## (Otorrhoea)

ఈ వ్యాధిలో మందును ఎంపిక చేయుటలో చీము రంగు, వాసన ఎక్కువగ ఉపయోగపడును. కనుక ఆ విషయం దృష్టిలో పెట్టుకోవాలి.

**ఫెర్రంఫాస్ 6× - 12× :** చెవి ఆమత్వక్కు నుండి అధిక స్రావం - రక్తస్రావమయ్యే పరిస్థితి - స్రావం పూర్తిగ వెలువడినా నొప్పి తగ్గకపోవుట.

**కాలీమూర్ 3× - 6× :** చీము తెల్లగ ఉండుట - కర్ణరంధ్రం, కర్ణభేరి నుండి నూకలు వంటివి అధికముగ రాలుట - ముక్కు చీదినపుడు చెవి బ్రద్ధలగుచున్నట్లు ఉండుట.

**నేట్రంమూర్ 6× :** చెవి నుండి చీము - చెవిలో దురద, మంట - చెవిలో చురకగు నొప్పి - నమిలినపుడు చెవిలో ధ్వని.

**కాలీఫాస్ 3× - 12× :** చీము నీళ్ళవలె, మురికిగా, గోధుమ వర్ణములో, మిక్కిలి దుర్వాసనతో ఉండుట - చీము ఎక్కువగా స్రవించుట - చెవిలో తుమ్మెదల రొద.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** దీర్ఘకాలంగా చెవి నుండి చీము కారుట-చెవి నుండి పదార్థం స్రవించుట - కొన్ని సమయాల్లో రక్తముతో కూడి ఉండుట-మధ్య చెవిలో చీము కారుట.

**కాలీసల్ఫ్ 3× - 6× :** చిక్కని, వాసనగొల్పు పసుపు పచ్చని / ఆకుపచ్చని స్రావం (ముఖ్యంగా కుడి చెవినుండి) - సాయంకాలం అధికమగుట - నాలుకపై పసుపు పచ్చని పూత.

**సైలీషియా 6× - 12× :** చీము దుర్గంధభరితముగాను, పలచగాను ఉండి ఎముకలను నాశనం చేయుట-చెవిలో గర్జించు శబ్దాలు-ధ్వనులను భరించలేని సున్నితమైన మనస్తత్వం.

## 5. చెవిలో ధ్వనులు
## (Sounds in the ears)

★ ఘంటానాదం / గంటల శబ్దం – చెవిపోటు – చెవిలో నుండి ఏదో ఒకటి బయటికి రావాలని తలంచుట **– నేట్రంసల్ఫ్ 6×.**

★ ఘంటానాదం, బజ్‌మను ధ్వని, గట్టిశబ్దం – చెవిపోటు – ధ్వనులను భరించలేక పోవుట. **– ఫెర్రంఫాస్ 6× – 12×.**

★ ఘంటానాదం, బజ్ శబ్దం, పెద్ద శబ్దాలు – కర్ణరంధ్రం, కర్ణభేరి ఆమత్వక్కు నుండి నూకలు వంటివి అధికంగా రాలుట – తెల్లని చీము, నాలుకపై తెల్లని పూత **– కాలీమూర్ 3× – 6×.**

★ చెవిలో తుమ్మెదల రొద, మధ్య చెవి చీము పట్టుట, ఎలాంటి ధ్వనిని భరించలేకపోవుట **– కాలీఫాస్ 3× – 12×.**

★ చెవిలో తుమ్మెదల రొద – వినికిడి మందగించుట – నరాల బలహీనత వల్ల వచ్చు చెవి నొప్పి **– మెగ్నీషియంఫాస్ 3× – 6× (వేడినీటితో)**

★ హిస్‌మను శబ్దాలు వినిపిస్తున్నంత కాలం వినికిడి సరిగ ఉండక పోవుట **– సైలీషియా 6× – 12×.**

★ చిటపట శబ్దాలు **– కాలీసల్ఫ్ 3× – 6×.**

## 6. వినికిడి సరిగ వినిపించకుండుట
## (Hardness of Hearing)

**సైలీషియా 6×–12× :** చెవిలో హిస్‌మను శబ్దాలు వినిపిస్తున్నంత కాలం వినికిడి సరిగా ఉండకపోవుట – గట్టిగ మాట్లాడిన చెవులు తెరుచుకొనుట – చలివలన సరిగా వినబడకపోవుట – మనుష్యుల మాటలు సరిగా వినిపించవు. కాని పిల్లనగ్రోవి ధ్వని వినబడును.

## 7. చెముడు / చెవుడు
## (Deafness)

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6× – 12× :** చెవి వాపువల్ల చెవుడు – చెవులందు గంటానాదం, బజ్‌మను ధ్వని.

**కాలీమూర్ 3× - 6× :** కర్ణాంతర నాళముల వాపు వల్ల వచ్చిన చెవుడు - బాహ్య చెవిపోటు వల్ల వచ్చిన చెవుడు–ఈ రకముల చెవుడుకు ఇది ప్రధానమైన మందు. చెవులందు గంటానాదం, బజ్ శబ్దం, పెద్ద శబ్దాలు–ముక్కు చీదునపుడు చెవి బ్రద్ధలగుచున్నట్లు ఉండుట.

**నేట్రంమూర్ 6× :** మధ్యచెవి వాపు వల్ల వచ్చిన చెవుడు–క్వయినా వాడిన పిమ్మట కలిగిన చెవుడుకు మంచి మందు.

**కాలీఫాస్ 3× - 12× :** దృశ్యనాడి శక్తి హీనత వల్ల కలుగు చెవుడు - తలలో ధ్వనులు - ఎలాంటి ధ్వనిని భరించలేకపోవుట.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** మధ్యచెవి రంధ్రంలో చీము కారుట వల్ల చెవుడు కలుగుట.

**కాలీసల్ఫ్ 3× - 6× :** జలుబు వల్ల కలుగు చెవుడు - వేడిగానున్న గదిలో చెవుడు ఎక్కువ అగుట - వాసన గొల్పు చీము.

## 8. చెవులకు సంబంధించిన చర్మవ్యాధులు
## (Skin diseases of Ears)

★ దీర్ఘకాలపు చర్మవ్యాధి– మధ్య చెవి ఆమత్వక్కు ధాతువులు మరణించి పొరలు - పొరలుగ రాలుట - ఆ పొరలు తడిగా ఉండుట - చీము తెలుపు - నాలుకపై తెల్లని పూత **- కాలీమూర్ 3× - 6×**

★ చెవిచుట్టూ గజ్జి, చెవిలో చిటపట శబ్దాలు, కంతి / కాయ చెవి రంధ్రాన్ని మూసివేయుట **- కాలీసల్ఫ్ 3× - 6×**

★ చెవి బయటిభాగంపై మెత్తని, పలచని క్రీము వంటి గజ్జి - నాలుకపై పసుపు పచ్చని పూత **- నేట్రంఫాస్ 6×**

## 9. గవదలు / గవద బిళ్ళలు / గాలిబిళ్ళలు
## (Mumps)

ఇది ఒకవిధమైన అంటురోగము.

**లక్షణాలు :** 1) దీనిలో పెరోటిడ్ గ్రంథులు (చెవుల ముందుండును), లాలాజల గ్రంథులు వాచును. 2) జ్వరం, తలనొప్పి ఉండును. 3) దవడలు, మెడ కొయ్యబారి ఉండును. 4) నోరు తెరచుటకు కష్టపడవలసి వచ్చుట, ఏమియు నమలలేకపోవుట– ఈ లక్షణాలవల్ల ఆహారం తినుటకు ప్రయాసపడవలసి వచ్చుట 5) ఒక వైపున ఉన్న పెరోటిడ్ గ్రంథి మొదట వాచును. ఆ వాపు క్రిందికి దిగి రెండవది వాచును.

**కారణం :** వాతావరణ మార్పులు.

**ఉపరి లక్షణాలు (Secondary symptoms / Metastasis) :** ఈవ్యాధి అణగారిన స్త్రీలలో అండాశయముల వాపు / స్తనముల వాపు, పురుషులలో వృషణముల వాపు / క్లోమం (Pancreas) వాపు / మెదడు పొరల వాపు ఉండును.

**నివారణోపాయాలు :**

1) రోగిని ఎల్లప్పుడు పడుకోనివ్వరాదు. 2) వేడినీళ్ళ కాపడం పెట్టుట మంచిది. 3) చలిగాలి తగులనివ్వరాదు. 4) సులభముగ జీర్ణమగు ద్రవాహారం ఇవ్వాలి. 5) మెడను మెడ – క్యాప్‌తో కప్పి ఉంచాలి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 3× – 12× :** ప్రారంభ దశలో జ్వరం ఉన్నప్పుడు.

**కాలీమూర్ 3× – 6× :** పెరోటిడ్ గ్రంథి వాపు – మ్రింగునపుడు నొప్పి – జ్వరం లేనిచో ఈ మందే ఈ వ్యాధి లక్షణాలను తొలగించును.

**నేట్రంమూర్ 6× :** అధికంగా లాలాజలం ఊరుట / ఈ వ్యాధి స్థానం మారి వృషణముల (Testicles) వాపుగ మారుట.

# 9

# ఎముకల వ్యాధులు

## (BONE DISEASES)

## 1. ఎముకల వ్యాధులు

మానవ శరీరంలో ఎముకలు ఎంతో ప్రధానమైనవి. ఎముకలన్నీ కలిసి అస్థిపంజరమును ఏర్పరచును. అస్థిపంజరం వల్ల మనిషికి ఆకృతి లభిస్తుంది. మన శరీరంలో 206 ఎముకలు ఉంటాయి. ఎముక పై పొరను పెరి ఆస్టియం అని అంటారు. ఎముక లోపల మెత్తని మూలుగు (Bone Marrow) ఉంటుంది. ఇది రక్తమును తయారు చేయును. కొన్ని సందర్భాలలో ఎముకలకు కలిగే వ్యాధుల వల్ల వ్యక్తి బాధలకు గురియగును. వాటి చికిత్స క్రింద పేర్కొనబడినది.

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 6× - 12× :** ఎముక విరిగినపుడిది ఎముకలు అతుకు కొనేటట్లు చేయును. ఎముకలలో ఫాస్ఫేటు, సున్నం తక్కువై అవి బలహీనం గాను, మెత్తగాను ఉండుట – పిల్లలలో రికెట్సు, దొడ్డికాళ్ళు, ఎముకల వాపు – తలమీద బ్రహ్మరంధ్రం మూసుకొనక పోవుట – అచ్చుట నొప్పి – గూని ఏర్పడుట – ఎముకకు పుండు ఏర్పడుట – చీలమండలము పైన రంధ్రముపడు పుండ్లు, వాటి అంచులు రాపిడిచే గట్టిపడుట – పుండ్ల నుండి దుర్వాసన, మంటగల స్రావం.

**ఫెర్రంఫాస్ 12× :** ఎముకలోని మెత్తని భాగాలు ఎర్రగాను, వేడిగాను, నొప్పిగాను, వాపుగాను ఉండుట – ఎముకల వాపు – ఎముకలను చుట్టి యుండెడి పొర వాచుట – తుంటికీలు రోగం.

**కాలీఫాస్ :** ఎముకలు శుష్కించుట – దుర్వాసనగల స్రావం వెలువడుట.

**సైలీషియా 6× - 12× :** ఇది ఎముకల అన్ని వ్యాధులకు మంచి మందు. ఎముకలలో లోతు రంధ్రము (Fistula) గల పుండ్లు ఏర్పడి వాటి నుండి పసుపు పచ్చని, దుర్వాసనగల స్రావం వెలువడుట – ఎముకల చుట్టూ నున్న భాగాలు గట్టిగాను, వాపుతోను ఉండుట – కీళ్ళవాపు – ఎముక వాపు – చీము, విరేచనం, చెమట వాసన గొట్టుట – తుంటికీలు వ్యాధి – ఎముక మృతి చెందియున్న దాని ముక్కలను బయటికి పంపుటకు దీనిని మించిన మందు లేదు.

**ముఖ్య గమనికలు :** 1) దీనిని ఎముకల వ్యాధి ప్రథమ దశ ముగిసిన తర్వాతే వాడాలి. 2) మెర్క్యురీ (Mercury) వాడిన తర్వాత దీనిని వాడరాదు. 3) సిఫిలిస్ వ్యాధి వున్నవారికి దీనిని కాల్కేరియా ఫ్లోర్‌తో మార్చి వాడాలి. 4) ఎముకల కంతులకు దీనిని 3× లోపూత పూయాలి.

**కాల్కేరియాఫ్లోర్ 3× - 30× :** ఎముకలపై గట్టిగాను, ముతకగాను వున్న బుడిపెలు పడుట – అప్పుడే పుట్టిన బిడ్డల కపాలపు ఎముకలపై రక్తపు గడ్డ ఏర్పడుట – ఎముకల కముకు దెబ్బ – దెబ్బ తగిలిన తర్వాత ఎముక అధికముగా పెరిగి కంతి వలె ఏర్పడుట – ఎముకలు పుండుపడుట – నడుము ప్రదేశమున పుండ్లు ఏర్పడుట – ముక్కు ఎముకల వ్యాధి – దుర్వాసన కలిగిన స్రావం వెలువడుట – గట్టి ఎముకలు వాచుట – సిఫిలిస్ / పాదరసం దుర్వినియోగం వల్ల వచ్చు ఎముకల పుండ్లు – వెన్నెముక వాపు – ఎముకలకు సంబంధించిన అపాయకరమగు ఎదుగుదల – దంతములకు సరియైన పోషణ లేకపోవుట, దంతముల ఎముకల పుండు, దవుడలు పుండు పడుట, దంతములు వదులగుట – చేతి మణికట్టు వద్ద ఎముక వలె గట్టిగ నుండు ఎదుగుదల ఏర్పడుట – చీలమండ ఎముకలు చీము పట్టుట.

**మెగ్నీషియంఫాస్ :** వెన్నెముక వాపుకు దీనిని కాల్కేరియాఫ్లోర్‌తో మార్చి వాడాలి.

**నేట్రంసల్ఫ్ :** సైకోసిస్ – ఎముకల నొప్పి – కీళ్ళల్లో చీలిక, మోకాళ్ళు బిర్రబిగియుట.

## 2. వెన్నెముక వ్యాధులు
## (Diseases of Spine)

### • చికిత్స •

**కాలీమూర్ 6× - 12× :** వెన్నెముక నందలి మజ్జ శుష్కించు వ్యాధి[1] (Tabes dorsalis) – వెన్నుపాము[2] (spinal cord) ను నాశనం చేయుట.

**కాలీఫాస్ 6× - 12× :**

★ వెన్నుపాము మెత్తబడుటకుగల కారణం తెలియకుండుట – నాడీ కేంద్రాల పరమాణువులు మృతి చెందుట.

★ అకస్మాత్తుగ వెన్నుపాము వ్యాధిచే శరీరములో క్రింది సగభాగమునకు కలుగు పక్షవాతం, డిఫ్తీరియా వంటి క్షీణింపచేయు రోగాల వల్ల కలుగునట్టి వెన్నుపాము

*1. **వెన్నెముకనందలి మజ్జ శుష్కించు వ్యాధి (Tabes dorsalis) :** దీర్ఘకాలంగా శరీరంలో జీర్ణించిన సవాయి రోగం (Syphilis) వల్ల వెన్నుపాము క్షీణత చెందును. కండరముల సమన్వయం కోల్పోవును. నడకలో నిలకడ తప్పును. కీళ్ళు ఉబ్బి మృదులాస్థి క్షీణిస్తుంది*

*2 **వెన్నుపాము (spinal cord) :** శరీరం వెనుక వెన్ను ప్రాంతంలో వెన్నెముకలో ఎముకలు పూసలవలె ఒకదానిని ఆనుకొని ఇంకొకటి అమర్చబడి ఉంటాయి. ప్రతి వెన్నుపూసకు ఒక ఉంగరంలాంటి ఎముక కమాను ఉంటుంది. ఈ కమాన్లు కలసి వెన్నుపాము అవుతుంది.*

రక్తహీనత, దానివల్ల కలుగు నొప్పులు – ఈ నొప్పులు విశ్రాంతి వల్ల అధికమగును. కాని కదలుటకు ప్రయత్నించినప్పుడు ఇవి కనిపించును.

**కాల్కేరియాఫాస్ 6× – 25× :** వెన్నెముకకు సంబంధించిన రక్తహీనత –గూని[1] ఏర్పడుట, వెన్నెముక బలహీనత – మెడలో ఈడ్పువంటి నొప్పి, భుజం వెనుక నుండు రెక్క ఎముకల మధ్య నొప్పి, వీపునొప్పి, నడుము నొప్పులు, నడుము ప్రాంతమున గూని / కురుపు, ఆంత్రయోజక లింఫ్ గ్రంథుల క్షయవ్యాధి, రికెట్స్, మాడు పూడుక పోకుండుట – సున్నితంగ, శుష్కించిన పిల్లలు పుండ్లకు గురియగుట–చిరచిరలాడు స్వభావంకల పిల్లలు–శారీరక శ్రమవల్లను, బహిరంగగాలిలోను వారినొప్పులు అధికమగుట–వెన్నుపాము వాపు.

**నేట్రంఫాస్ 6× – 25× :** వెన్నుపాము బలహీనత – కాళ్ళు–చేతుల పక్షవాతపు బలహీనత, శక్తి నశించుట, బరువుగ నుండుట, ఆకలి – ఈ లక్షణాలన్నీ కొద్దిదూరం నడిచినా, మెట్లు ఎక్కినా కనిపించును. అంతేగాకుండా కాళ్ళు ముందుకు వెళ్ళకుండ చేయును.

**కాల్కేరియాఫ్లోర్ 6× – 12× :** వెన్నుపాము రక్తహీనత.

**సైలీషియా 6× – 12× :** వెన్నెముక ఆకారం దెబ్బతినుట, వెన్నుపాము ఎరుపు వాపు, వెన్నెముక చివరి 4వ పూస ఎముకల వాపు (వెన్నెముక గట్టిపడిన తర్వాత).

## 3. వెన్నెముక క్షోభ
## (Spinal Irritation)

వెన్నెముక సున్నితముగ, నొప్పిగ నుండుటతో నాడీ మండల నిస్త్రాణ (Spinal irritation) కలుగును.

### • చికిత్స •

**నేట్రంమూర్ 6× – 25× :**

★ తేలికగా అలసట చెందుట, చిన్నపాటి కష్టం చేసినా బలహీనత ఏర్పడుట, కాళ్ళు – చేతుల అస్తిమితం (కాళ్ళు – చేతులు నిరంతరం ఊగుచుండుట), వీపులో నొప్పి, వెన్నెముక సున్నితంగ ఉండుట.

★ నిద్రలేమి, అస్తిమితం, బలహీనత.

★ నడచునపుడు తలనొప్పి.

★ రుచి ఉప్పుగ నుండుట, ఆహారం హితవు కాకపోవుట.

★ చదివిన తర్వాత చూపు మందగించుట– కొన్ని సందర్భాల్లో సగం వస్తువు మాత్రమే కనిపించుట.

*1. **గూని (spinal curvature) :** ఈ వ్యాధిలో వెన్నుపాము ముందుకు / వెనుకకు/ ప్రక్కలకు వంగును.*

★ ఈ మందు తొలుత నాడీవ్యవస్థను ఉత్తేజపరచును. తద్వారా కండర సంకోచాలను తొలగించును – ఇది ఎర్రకణాలను, గ్రంథుల స్రావాలను, జీర్ణప్రక్రియను వృద్ధి పరచును – దీనివల్ల కండరాలు బలహీనంగా ఉన్నచోట ఈ మందును బాహ్యంగా రుద్దిన బాగ పనిచేయును. కాని తర్వాత నీరసం, రక్తహీనత, శుష్కించుటను కలిగించును.

★ చర్మం పొడిగ, కఠినంగ, పాలిపోయినట్లు ఉండును.

★ ఆమత్వక్కులు పొడిగ, చీలినట్లు, రక్తం లేక తెల్లబారినట్లుండును. మంటగ, పొడిగ / కొద్దిగ, తినివేయునట్టి స్రావములు.

★ నాలుక పొడిగ ఉన్నట్లు ఫిర్యాదు చేయబడుతుంది. కాని స్రావములు జిగురుగ నుండును. అవి ద్రవములు కావు.

★ వెన్నెముక నరముల శక్తి అంతయు పోవును. మానసిక, శారీరక నిస్త్రాణ, అలసట కలుగును. రోగి మందకొడిగ ఉంటాడు. అతనికి ఏ పని చేయుటకు ఇష్టం ఉండదు. అస్తిమితం, కోపం, తలనొప్పి, నిద్రలేమి మొ॥ లక్షణాలు ఉండును – ఉదయాన లేచునపుడు నడుములో పక్షవాతపు భావం – వీపు విరిగిపోయినట్లు అనిపించుట – కాళ్ళు బలహీనంగ ఉండుట, అవి వణకుట, ఉదయాన ఆ లక్షణాలు అధికమగుట – పాదములు బరువుగ ఉండుట.

★ మూత్రాశయం బలహీనంగాను, ఇబ్బందికరంగాను ఉండుట, సాధారణ విరేచనం తర్వాత మూత్రం బొట్లుబొట్లుగ పడుట.

★ వెన్నెముక, మూత్రకోశపు నిస్త్రాణవల్ల అలసట / శుష్కించుట కలుగుట.

**సైలీషియా 6× – 25 × :**

★ వెన్నెముక క్షోభ, దుర్గంధ భరితమైన పాదముల చెమట ఒకదాని తర్వాత మరొకటి వచ్చుట.

★ పిల్లలలో క్రిముల వల్ల వెన్నెముక క్షోభ – పౌర్ణమి సమయంలో ఈ బాధ ఎక్కువగుట.

★ వెన్నెముక క్షోభ, మెడ వెనుక భాగం బిర్రబిగియుట, తలనొప్పితో.

★ బలహీనంగా వున్న వీపు, కాళ్ళల్లో పక్షవాతపు భావం.

★ వీపులో మంట, వీపు మధ్యన నిరంతరం నొప్పి ఉండుట.

★ వెన్నెముక చివరిపూస బాధాకరంగ ఉండుట.

★ ఏమాత్రం శబ్దమైనా రోగి సున్నితంగా ఉండుట.

★ మొటైన, పసుపు పచ్చని గోర్లు – నిద్రపోయినపుడు కూడ పాదములు మంచువలె చల్లగ నుండుట.

★ అపరిశుభ్రంగా ఉండు చర్మం – కొద్దిపాటి గాయమైనా చీము పట్టుట.

★ వేడిమివల్ల బాగా ఉన్నట్లనిపించుట.

**కాలీఫాస్ 6× – 12× :** అధిక సంభోగం వల్ల నరముల శక్తి అంతయు పోవుట – తీవ్రమైన వెన్నెముక క్షోభ ఉండుట.

**కాల్కేరియాఫ్లోర్ 6× – 30× :**

★ నడుమునొప్పి, వెన్నెముక క్షోభను ఉత్తేజపరచుట, బలహీనంగా ఉండుట, లాగుచుండునట్టి, కటి ప్రదేశమందు బరువుగ కిందకు నొక్కుచుండు నొప్పులు.

★ మలబద్ధకం.

## 4. వెన్నెముక మెనింజైటిస్ పొరల వాపు
## (Spinal Meningitis)

కొన్ని సందర్భాలలో వెన్నెముకలోని మజ్జను చుట్టియుండు మెనింజైటిస్ పొరలు వాచును.

**• చికిత్స •**

**నేట్రంసల్ఫ్ 3× – 6× :**

★ మెడ వెనుక భాగమున, తలలోను తీవ్రమైన నొప్పులు.

★ మెడ వెనుక భాగమున లాగుచున్నట్టి నొప్పులు, వీపులో ఈడ్పులు, మానసిక క్షోభ, సంధి.

★ ఈ మందు ఈ వ్యాధికి సరైన మందు. ఈ మందు ఈ వ్యాధిని తగ్గించి నయం చేయును. ఈ వ్యాధిలో తలకు రక్తం అధికంగా చేరును. ఈ మందు రక్తతీవ్రతను తగ్గించును. **– జే.టి. కెంట్**

## 5. వీపునొప్పి – నడుము నొప్పి
## (Back-ache - Lumbago)

వీపు / నడుము నొప్పిని ఒక రోగమని చెప్పడం కంటే ఇతర రోగాలలో దీనిని ఒక లక్షణముగా భావించుట మంచిది. ఇది సాధారణంగా కీళ్ళవాపు, గర్భకోశము సరియైన స్థలములో లేకుండుట, మూత్రావయవముల రోగం వల్ల వస్తుంది. వెన్నెముక 33 వెన్నుపూసల సమాహారం. ఈ వెన్నుపూసల మధ్య మృదులాస్థి అనే చిన్న ఉపాస్థులు ఉండును. ఇవి ఎముక కన్న మెత్తగ, కీళ్ళవద్ద, ప్రక్కటెముకల చివరలందు ఉండును. ఈ ఉపాస్థుల గుండ్రని చదునైన వస్తువు (disc) క్రిందికి దిగజారుట వల్ల కూడ వీపు

నొప్పి / నడుము నొప్పి వస్తుంది. కొంతమంది కడుపులోను, చిన్న ప్రేగుల మొదటి భాగములోను పుండు / పుండ్లు ఉన్నచో ఆ నొప్పిని వీపునొప్పి / నడుము నొప్పిగా భావిస్తూ ఉంటారు. ఈ మధ్య అమీబా వల్ల కూడా వీపు / నడుము నొప్పి రావటం గుర్తించబడింది. ఫోమ్ పరుపులపై పడుకొనుట, కండరాలు శ్రమించుట, చలిగాలి సోకుట కూడా వీపు / నడుము నొప్పికి కారణాలు.

ఎప్పుడూ ముందుకే వంగి కూర్చొని ఆఫీసుల్లో పనిచేసే వారికి, స్కూటర్ల మీద ఎక్కువ ప్రయాణం చేసేవారికి, మెత్తటి పరుపుల మీద పడుకొనే వారికి ఎక్కువగా నడుము నొప్పి వస్తుంది. ఎక్కువగా శ్రమ చేసినపుడు నడుమ కండరాలు ఒత్తిడికి గురయి నడుము మధ్య భాగంలో నొప్పి వస్తుంది. ముందుకు వంగిన నడుము నొప్పి ఎక్కువగును. విశ్రాంతి ఉపశమనం కలిగించును.

వీపు / నడుము నొప్పికి గల కారణం తెలుసుకొని ఆ కారణానికి చికిత్స చేసిన వీపు / నడుము నొప్పి కూడా మాయమగును.

**నివారణోపాయాలు :**

★ ఫోమ్ పరుపులపై పడుకోరాదు. తల క్రింద దిండును ఉంచుకోరాదు.

★ గట్టినేల / రాతి బండ / బల్ల మొ॥ వాటిపై పడుకోవాలి.

★ నడుముపై కర్పూరతైలం వంటిది రుద్దాలి.

★ రోజుకు రెండు పూటలా వేడినీటి కాపడం పెట్టాలి.

★ చలిగాలి తగలకుండా కప్పి వుంచుకోవాలి.

★ నడుమును ముందుకు వంచే పనులు చేయరాదు.

★ కేవలం నడుమును వెనక్కి వంచే ఆసనాలు (భుజంగాసనం, ధనురాసనం, ఉష్ట్రాసనం మొ॥వి) మాత్రమే రెండు పూటలా చేయాలి.

## • చికిత్స •

**సైలీషియా 12× :** మెడ వెనుక భాగం బిర్రబిగిసి తలనొప్పి వుండుట – వీపులో లాగుచుండునట్టి నొప్పులు ఉండటం వల్ల కదలకుండా పడుకొని యుండవలసి వచ్చుట – నడుమున ఎల్లప్పుడు నొప్పి – వెన్నెముక చాలా సున్నితముగా ఉండుట – చేతిగోళ్ళు గరుకుగా ఉండుట – నొప్పులు రాత్రిపూట అధికమగుట.

**ఫెర్రంఫాస్ 12× :** కొన్ని సందర్భాలలో ఇది వీపు / నడుము నొప్పికి విశిష్టమైన మందు. వీపున, నడుములోను, మూత్ర పిండములపైన నొప్పులు – కదలినప్పుడు మాత్రము కీళ్ళ వాతము గల నొప్పులు – కండరాలు వాచి నొప్పి తీవ్రమగుట – కదలిక వల్ల నొప్పులు అధికమగుట.

**కాలీమూర్ 6X :** ఫెర్రంఫాస్ నయం చేయని నొప్పులకు దీనిని వాడాలి.

**కాలీఫాస్ 6X :** నొప్పులు కుంటితనం కలిగించును. నొప్పికి గురైన భాగాలు బలహీనంగా ఉన్నట్లు తోచును. నెమ్మదిగా కదిలిన నొప్పులు, బిగుసుకు పోవుట తగ్గును. చాలాదూరం నడచిన నొప్పులు అధికమగును. కూర్చొని లేచునపుడు, కదలుట ప్రారంభించినప్పుడు ఇలాంటి నొప్పి మరింత ఎక్కువగును.

**కాల్కేరియాఫాస్ 6X - 12X :** తిమ్మిరి, శీతలత్వం, చీమలు ప్రాకుతున్నట్టి భావన - ఈ లక్షణాలతో కూడిన నొప్పులు–రాత్రిపూట, విశ్రాంతి సమయాన నొప్పులు అధికమగును. మనిషిని క్షీణింపజేయు వ్యాధి వచ్చిన తర్వాత నొప్పులు వచ్చినచో దీనిని ఫెర్రంఫాస్‌తో మార్చి వాడాలి. ఉదయాన నిద్ర నుండి మేల్కొన్న తర్వాత నడుము నొప్పి వచ్చుట–జబ్బుచేసి నిస్త్రాణ చెందిన తర్వాత నడుము నొప్పివచ్చుట.

**కాలీసల్ఫ్ 6X :** సాయంకాలంపూట వెచ్చని గదిలో నొప్పులు అధికమగుట - బహిరంగ ప్రదేశంలోని చల్లగాలిలో ఉపశమనం - స్థలం మారే నొప్పులు.

**మెగ్నీషియంఫాస్ 12X :** వివిధ రకాల నొప్పులు - శూలనొప్పి, తొలుచుచుండు నొప్పి, ఆగి ఆగి వచ్చు నొప్పి, స్థానం మారునొప్పి, నరములకు సంబంధించిన నొప్పి - వేడిమివల్ల ఉపశమనం చెందు నొప్పి–ఈ మందును గంట కొకసారి వేడినీటితో ఇచ్చిన మంచి గుణం కనిపించును.

**కాల్కేరియాఫ్లోర్ 6X - 30X :** వెన్నెముకలో క్షోభను కలిగించు వీపు / నడుము నొప్పి - అలసిపోయినట్టి భావన - వెన్నెముక క్రింది భాగాన నొప్పులు - పొట్టనిండుగా నున్న భావన - మండుచున్నట్టి నొప్పి–ప్రేగులు బంధింపబడుట - కదలుటకు ప్రారంభించినపుడు నడుము నొప్పి ఎక్కువగుట - నిరంతర కదలిక వల్ల ఉపశమనం.

**నేట్రంమూర్ 3X - 30X :** వీపు, నడుములో నొప్పులు - గట్టిగా నున్న నేల / బల్ల / రాతిపై పడుకొన్న ఉపశమనం - నాలుక శుభ్రంగా ఉండుట, దానిపై వెంట్రుక / బొచ్చు ఉన్నట్టి భావన - నాలుక అంచుమీద నురగవంటి లాలాజలం చిన్న బుడగల వలె నుండుట - చాలాసేపు ముందుకు వంగి యుండుట వల్ల కలుగు నొప్పి - కముకు దెబ్బ వల్ల కలుగునట్టి నొప్పి - వీపు బలహీనం - ఉదయాన నొప్పులు ఎక్కువగుట - వెన్నెముక సున్నితంగా ఉండుట - మెడ బిర్రబిగిసినట్లుగాను, కృశించినట్లుగాను ఉండుట - ఎక్కువ బలహీనత, అలసట - పాదములు బరువుగా నుండుట - దేనినైనా ఆనుకొని కూర్చొన్న నడుము నొప్పికి ఉపశమనం.

**నేట్రంసల్ఫ్ 6X :** రాత్రంతా వీపునొప్పి - పుండు పడునట్లు చేయు నొప్పి - కుడివైపు మాత్రమే పడుకొనగలుగుట - వెన్నెముక పైన, అడుగున నొప్పి / బాధ - మెడ నొప్పి.

**నేట్రంఫాస్ 6X :** ఉదయాన మేల్కొన్న తర్వాత నడుము నొప్పి.

## 6. గూను

**(Spinal curvature / Hump Back, Hunch Back)**

మహాభారతంలో మథురా నగరానికి ప్రవేశించిన శ్రీకృష్ణుడు కుబ్జ అనే కన్యను ఉద్ధరించినట్లు ప్రసంగం ఉంది. కుబ్జ అంటే గూని కలది అని అర్థం. ఈ ప్రసంగాన్ని బట్టి గూని చాల పురాతనమైన వ్యాధి అని తెలుస్తుంది. దీనిలో వెన్నెముక విల్లువలె వెలుపలికి వంగును. అది ముందుకు / వెనుకకు, ప్రక్కలకు కూడ వంగవచ్చును.

**కారణం :** వెన్నెముక బలహీనత.

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 6X :** వెన్నెముక బలహీనత వల్ల కలుగుగూని – వీపునొప్పి, నడుమునొప్పి.

## 7. ఎముకలు విరుగుట

ఎంతోమంది విమానం / రైలు / బస్సు / కారు / వ్యాను / ఆటోలో ప్రయాణం చేస్తూ ఉంటారు. చాలా మంది ఆఫీసు / కళాశాల / స్కూలుకు వెళ్ళుటకు స్కూటర్ / మోపెడ్/ ద్విచక్ర వాహనాలు / సైకిళ్ళు మొదలగు ప్రయాణ సాధనాలను వాడుతున్నారు. ఈ విధంగా ప్రయాణ సాధనాల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. అంతేగాకుండా వాటిపై ప్రయాణం చేసే వారి అలక్ష్యం / అశ్రద్ధ / త్వరగా గమ్యస్థానం చేరాలనే ఉద్దేశ్యం మొదలగు కారణాల వల్ల ప్రమాదాలు జరగటం కూడా సహజమైంది. వార్తా పత్రికలు / టి.వి. చానెల్స్ చూసినా ప్రతిరోజూ ఏదో ఒకచోట ప్రమాదాల సంగతి కనిపిస్తుంది.

ఆ ప్రమాదాలలో కొంతమంది చనిపోతారు. మరికొంతమందికి గాయాలు ఏర్పడుతాయి. చాలామందికి ఎముకలు విరిగిపోతూ ఉంటాయి. ఆ విరిగిపోయిన ఎముకలు త్వరగా అతుకుటకు, అచ్చట కండ త్వరగా పట్టుటకు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.

**నివారణోపాయాలు :**

1. బరువును పెంచే ఆహారాన్ని గాక ఎముకలను త్వరగా అతుకునట్లు చేయునట్టి, అచ్చట త్వరగా కండపట్టుటకు సహాయపడునట్టి పౌష్టిక ఆహారం తినుట మంచిది. ఉదయపు టిఫెన్‌లో ఎక్కువగా పచ్చి కొబ్బరి, నువ్వుల ఉండ తినాలి. మధ్యాహ్నపు భోజనంలో చపాతీలు, వండిన కూరలు తినాలి. సాయంకాలం 6 గంటల లోపుగా పళ్ళ రసాలు / పండ్లు వాడాలి. ఇక రాత్రికి ఏమీ తినరాదు. ఈ విధమైన పౌష్టికాహారం తీసుకొనుటవల్ల శరీరం ఎముకలను అతికించే పనిలో లీనమవుతుంది.

2. అంతేగాక ప్రతిరోజు 1, 2 తమలపాకులు తినాలి. వాటిలో ఉండే కాల్షియం ఎముకలను త్వరగా అతుకుకొనుటలో సహాయ పడుతుంది. దీనివల్ల ప్రయోజనం కనిపించకపోతే క్రింద పేర్కొన్న చికిత్సను గురించి ఆలోచించాలి.

### • చికిత్స •

**ద్వాదశ లవణ మిశ్రమం :** ఈ మిశ్రమాన్ని రోజుకు 3సార్లు (ఉదయం, మధ్యాహ్నం, రాత్రి) చొప్పున కొన్ని రోజులు ఇవ్వాలి.

కాల్కేరియాఫాస్ 6× – 2 మాత్రలు + ఫెర్రంఫాస్ 6× – 2 మాత్రలు = మొత్తం 4 మాత్రలు.

## 8. ఎముకలు గట్టిపడుటకు

వయస్సుతో పాటు ఎముకలు బలహీనమవుతాయి. స్త్రీలకు ముట్లు పోయే సమయంలో కూడా ఎముకలు పెళుసుబారుతాయి. చాలామంది వైద్యులు కాల్షియం మాత్రలు వాడమనీ, పాలు త్రాగమనీ చెప్తుతారు. కాల్షియం మాత్రలు అధికమైనచో మూత్రంలో రాళ్ళు ఏర్పడే ప్రమాదం ఉంటుంది. వయస్సు వచ్చినవారు పాలు వాడరాదు. పాలవల్ల పెద్దగా ఉపయోగం ఉండదు. దానికి బదులుగా మజ్జిగ వాడటం మంచిది.

**నివారణోపాయాలు :**

1. పచ్చి కొబ్బరి, పచ్చి నువ్వులను మెత్తగా చేసి కొంచెం యాలకుల పొడి చల్లి తేనె / ఖర్జూర పండుతో తినాలి. చక్కెర వ్యాధిగ్రస్తులు తేనె / ఖర్జూరం పండు లేకుండా తినాలి.
2. పచ్చి కొబ్బరి, పచ్చి నువ్వులు వాడాలి. కనుక ఏ రోజుకారోజే చేసుకొనుట మంచిది.
3. విటమిన్ డి, ఎ ఎక్కువగా ఉండే ఆహారపదార్థాలు వాడాలి. విటమిన్–డి ఆహారంలోని కాల్షియంను శరీరంలో కలిసేటట్లు చేయును.
4. మెగ్నీషియం, పొటాషియం ఎక్కువగా ఉండే కూరగాయలు, చేపలు, పుల్లటి పెరుగు తీసుకోవాలి.
5. శారీరక వ్యాయామం చేయాలి.
6. వాహ్యాళి (Walking)

### • చికిత్స •

ఎముకల సంబంధమైన బాధలు లేకుండుటకు పై జాగ్రత్తలు పాటించలేనివారు వారమునకు ఒకసారి రాత్రిపూట ఈ విధంగా ద్వాదశ లవణముల మిశ్రమమును తీసుకొన వలెను.

కాల్కేరియాఫ్లోర్ 6×–2 మాత్రలు+కాల్కేరియాఫాస్ 6× –2 మాత్రలు = మొత్తం 4 మాత్రలు.

# 9. రికెట్స్
## (Rickets)

ఇది చిన్నపిల్లలలో ఎముకలు సరిగ ఎదగని వ్యాధి. ఈ వ్యాధి సాధారణంగ 6వ నెల మొదలు 2 సం॥ లోపు పిల్లలకు కలుగును.

**లక్షణాలు :**

1. శరీర పోషణ సరిగ లేకపోవుటచే ఎముకల చివరలందు దళసరెక్కి, మెత్తపడి తరచు వంగును.
2. ఎముకలు మెత్తపడుటచే, వాని శరీర బరువును కాలి ఎముకలు మోయలేక దొడ్డికాళ్ళు ఏర్పడును.
3. తొలుత శిశువు శరీరమంతయు నొప్పిగ ఉండును. అందుచే కదిపిన ఏడ్చును. తర్వాత కొద్దిగ జ్వరం కలుగును. తల, మెడపై విస్తారముగ చెమట పట్టును. కండర బిగి ఉండదు. నడవలేడు. పండ్లు ఆలస్యముగ వచ్చును. కోపంతో అస్థిమితంగ ఉండును. వెన్నెముక వంగి గూని కలగవచ్చును. తల పెద్దదిగ ఉండును. మాడు / బ్రహ్మరంధ్రం పూడుకొనదు. కడుపు పెద్దదగును. ఆకలి ఉండదు.
4. వ్యాధి ముదిరిన కొలది శిశువు ముడుచుకొని పోవును. ముసలి రూపు కలుగును.

**కారణాలు :**

1. 'డి' విటమిన్ లోపం. సూర్యరశ్మి దేహానికి తగులుట వల్ల ఈ విటమిన్ శరీరంలో తయారగును.
2. ఫాస్ఫేట్ ఆఫ్ లైమ్ తక్కువగుట.

**నివారణోపాయాలు :**

1. శిశువుకు పరిశుభ్రమైన ఆవుపాలతో, బార్లీనీరు, కాడ్‌లివర్ ఆయిల్ (ఒక చిన్న చెంచాడు) కలిపి ఇవ్వాలి.
2. శిశువు శరీరానికి నూనెరాసి, కొంతసేపు ఎండ తగులునట్లు చూడాలి.

### • చికిత్స •

**కాల్కేరియాఫాస్ 6× - 12× :** సున్నితమైన పిల్లలలో ఎముకలు మెత్తని స్పాంజివలె అగును. ఆహారంలో ఫాస్ఫేట్ ఆఫ్ లైమ్ తక్కువగుటచే ఈ పరిస్థితి ఏర్పడును. కపాలం మెత్తగ, పలచగ ఉండును. దానిని తాకిన ధ్వని అగును. మాడు / బ్రహ్మరంధ్రం ఆలస్యంగ పూడుకొనును. శిశువు పాలిపోయినట్లు, మట్టి వర్ణంతో ఉండును. ముఖములో మొటిమలు ఏర్పడును. దంతోత్పత్తి ఆలస్యమగును. శుష్కించును. ఎముకలు ప్రక్కకు వంగియుండును.

కాళ్ళుచేతులలో వాచిన బుడిపెలు – నడుమున / నడుము క్రింది భాగాన వెన్నెముకలో సంపూర్ణంగా / పాక్షికంగా నెరద ఏర్పడుట – విరిగిన ఎముకలు కలియకుండుట – వికారం క్రమ రూపంలో ఉండుట – వెన్నెముక ఎముకలకు క్షయ వ్యాధి కలుగుట – పిల్లలు క్రుంగినట్లుండుట – కపాలముపై గట్టి బుడిపెలు – దంతోత్పత్తి సమయమున కలుగు విరేచనాలు – ఎక్కువగ అపాన వాయువు వెలువడుట – చల్లదనం వల్ల వణకుట – శిశువు తలను సరిగ నిలబెట్టుకొనలేక పోవుట.

**ముఖ్య లక్షణాలు :**

1. మాడు పూడుకొనకపోవుట. 2. నీళ్ళ విరేచనాలు. 3. శుష్కించుట.

**కాలీఫాస్ 6x :** ఎముకలు క్షీణించుట – ప్రేగుల నుండి కుళ్ళిన దుర్వాసనగల స్రావం – అజీర్ణం – నరాలు క్రుంగుట.

**నేట్రంమూర్ 6x – 25x :** తొడలు బాగ శుష్కించినపుడు వ్యాధి ఆరంభ దశలో ఉన్నప్పుడు, ఎముకలు కొద్దిగ మెత్తగ ఉన్నప్పుడు ఈ మందు బాగ ఉపయోగపడును. **– (గిల్‌క్రైస్ట్)**

**సైలీషియా 6x – 50x :** మాడు తెరవబడి యుండుట – తల పెద్దదిగాను, మిగిలిన దేహం శుష్కించియు ఉండుట – పాలిపోయిన ముఖం – పొత్తికడుపు వాచినట్లుగాను, వేడిగాను ఉండుట – కాలి చీలమండలు బలహీనంగా ఉండుట – తలమీద విస్తారమైన చెమట – శరీరం పొడిగ ఉండుట – వెచ్చని వస్త్రాలను కప్పుకోవాలనుకొనుట – దుర్వాసనగల నీళ్ళ విరేచనాలు – మలములో జీర్ణంకాని పదార్థం–మానసిక / శారీరక అలసట – నొప్పి లేకుండుట–మంట, నొప్పి–గ్రంథులు, ఎముకలువాచుట, చీము పట్టుట – కణాలు వాచుట, నాశనమగుట – ధాతువుల నొప్పి, వేడిమి, వాపు – కురుపులు – చీముగడ్డలు – నెమ్మదిగ నయమగుట – తత్ఫలితంగా రాయిలాంటి గట్టితనం ఏర్పడుట.

**నేట్రంఫాస్ 6x – 30x :** తక్కువ పోషణ లభించు పిల్లలలో రికెట్స్ వ్యాధి కలుగునని భావించినపుడు ఈ మందు సిఫారసు చేయబడును – మట్టి రంగు విరేచనాలను నిరంతరం విసర్జించునపుడు, ఎక్కువ ఆమ్లత్వంతో రికెట్స్ వ్యాధితో బాధపడునపుడు ఈ మందును రోజుకు 4సార్లు ఇవ్వాలి.

## 10. పక్షవాతం
## (Paralysis)

మెదడు / వెన్నెముక వ్యాధులచే శరీరంలో ఒక భాగమందలి నరాల పని పూర్తిగగాని, కొంత వరకు గాని పోవుటచే ఇంద్రియముల పని / చలనశక్తి లేక రెండును పోవుటను పక్షవాతం అని అందురు.

**రకాలు :** పక్షవాతం అనేక రకాలుగా ఉంది –

1. కాళ్ళయందలి చలనశక్తి పోవుట – ఇది క్రమేపి పైకి వ్యాపించును.
2. కండరములు నిత్యం వణకుచుండుటతో కలుగు పక్షవాతం. దీని వల్ల కాళ్ళు – చేతులు వణకుచుండును. నడక సరిగ ఉండదు.
3. ఒకవైపు ముఖ కండరములకు కలుగు పక్షవాతం.
4. చిన్న పిల్లలకు కలుగు పక్షవాతం.
5. ఉపరిభాగ నరముల వ్యాధిచే కలుగు పక్షవాతం.
6. నాలుక, గొంతు, ముఖం–వీటి రెండు వైపుల సమానముగ కలిగి వృద్ధి చెందుచుండు పక్షవాతం.

**కారణములు :**

1. రక్తనాళాలు పగిలి మెదడులో రక్తం చేరుట / గడ్డలు ఏర్పడుట.
2. నాడీ వ్యవస్థకు హాని కలుగుట.
3. కండరములు పెద్దవగుట, బిర్రబిగియుట / ప్రతిక్రియలు తగ్గుట.
4. కొన్ని లవణాల లోపం.

## • చికిత్స •

**కాల్కేరియాఫాస్ 6× – 12× :** చల్లదనం, తిమ్మిరి, ప్రాకుచుండుట – కాళ్ళ బలహీనత – నరాల బలహీనత – క్షీణింపజేయు వ్యాధుల తర్వాత, తేమలో నిల్చొన్న తర్వాత వీపులో నలగ గొట్టినట్టి నొప్పి.

**కాలీఫాస్ 3× – 30× :**

★ ముఖపు పక్షవాతం– కొన్ని కండరాల ఉత్తేజక శక్తి నశించుట.

★ నోరు వికృతంగా మారుట – అది పక్షవాతమునకు గురికాని వైపుకు మరలుట.

★ ప్రాకునట్టి పక్షవాతం : వ్యాధి నెమ్మదిగ వృద్ధి చెందును. స్పర్శజ్ఞానం నశించును.

★ చాలక / కదలికకు సంబంధించిన పక్షవాతం : చాలకశక్తి నశించుట.

★ స్వరతంత్రుల పక్షవాతం : స్వరపేటికకు సంబంధించిన కండరాల పక్షవాతం వల్ల స్వరం నశించుట.

★ శుష్కింపజేయు పక్షవాతం : జీవశక్తులు తగ్గుట, విరేచనాలు కుళ్ళిన వాసనతో నుండుట.

★ పాక్షిక పక్షవాతం, వెన్నెముక క్రింది సగభాగం పక్షవాతం, ఒకవైపు కలుగు పక్షవాతం, ముఖపు పక్షవాతం, అకస్మాత్తుగ వచ్చు పక్షవాతం, శిశువుల పక్షవాతం – వీటన్నిటికీ ఇది ప్రధానమైన మందు.

**మెగ్నీషియంఫాస్ 3× - 30× :**

★ నిస్త్రాణ చెందుట, కూర్చోలేకపోవుట – చల్లని నీళ్ళల్లో నిల్చొనుట వలన ఇబ్బందులు కలుగుట **(కాల్కేరియాఫాస్).**

★ కండరముల పక్షవాతం – కాళ్ళు, చేతులు, తల వాటంతటవే కదలుట, వణకుట.

★ కండరాలకు చాలకశక్తిని ఇచ్చే వివిధ రకాల నరాల పేశములు వ్యాధిగ్రస్తమగుటచే కలుగు కండరాల పక్షవాతం.

★ తెల్లని నరాల పేశాల పక్షవాతం.

**నేట్రంఫాస్ 6× :**

★ మోకాళ్ళ క్రిందిభాగం బలహీనంగా ఉండుట.

★ నడిచేటప్పుడు కాళ్ళు ఎడంగా పెట్టడం.

★ తరచుగా కాళ్లు పట్టుతప్పుట.

**సైలీషియా 12× :**

★ వెన్నెముక నందలి మజ్జ శుష్కించుట వల్ల కలుగు పక్షవాతం.

★ కాళ్ళు – చేతులు వణకుట.

★ బలహీనత.

★ ఒకచోటు నుండి మరొక చోటునకు ప్రాకే నొప్పులు.

★ కీళ్ళ పక్షవాతపు బలహీనత.

★ వెనుకవైపున వుండు నరాలు, రక్తనాళాలు గట్టిపడుట – అది క్రమంగా వృద్ధిచెందుట.

# 10

# నరాల వ్యాధులు

## (NEURALGIA)

### 1. నరాల పోటు

నాడీ వ్యవస్థ టెలిఫోన్ వ్యవస్థ లాంటిది. నరము టెలిఫోన్ వైర్, మెదడు టెలిఫోన్ కేంద్రస్థానం. నరాలు మూడు రకాలు 1) జ్ఞాననాడులు (Sensory Nerves) : ఇవి చర్మం, అవయవములు మరియు కణజాలముల నుండి నొప్పి, వేడి, చల్లదనం వంటి జ్ఞానమునకు సంబంధించిన వర్తమానములను సేకరించి మెదడుకు పంపును. 2) చాలకనాడులు (Motor Nerves) : ఇవి మెదడు జారీచేసే ఆదేశాలను కండరాలకు పంపును. 3) మిశ్రమనాడులు (Mixed Nerves) : వీటిలో జ్ఞాననాడులు, చాలక నాడులు కలిసి ఉంటాయి. ఇవి మెదడుకు వర్తమానములు పంపును. అట్లే మెదడు ఆదేశాలను కండరాలకు పంపును.

ఒకటి లేదా పెక్కు నాడుల నొప్పిని నరాల పోటు (Neuralgia) అని అంటారు. ఏ నరం / నరాలలో నొప్పి కలుగునో ఆ నరం / నరాలకు సంబంధించిన అవయవాలలో నొప్పి కలుగుతుంది.

**లక్షణాలు :**

1. నొప్పి నరము / నరాలలో మాత్రమే ఉండును. ఇతర ప్రదేశాలలో ఉండదు.
2. నొప్పి తెరలు తెరలుగ వస్తుంది. ఉన్నట్లుండి వస్తుంది.
3. పొడిచినట్లు నొప్పి నరములలో మాత్రమే వస్తుంది.

**కారణాలు :**

1) రక్తక్షీణత 2) గౌటు 3) రుమాటిజమ్ 4) నాడులకు దెబ్బ తగులుట. 5) ఇతర అవయవాల ఒత్తిడి మొదలైనవి.

**నివారణోపాయాలు :**

1. బలవర్ధక ఆహారం తీసుకొని నరాల బలహీనతను పోగొట్టాలి.
2. నొప్పి ఉన్న స్థలములో వేడికాపడం పెట్టాలి. (వేడివల్ల ఉపశమనం ఉన్న కేసులలో)
3. సముద్రస్నానం మంచిది.

4. మలబద్ధకం ఉన్నచో దానిని నివారించుకోవాలి.
5. తగిన వ్యాయామం చేయుట మంచిది.

## • చికిత్స •

**కాలీమూర్ 6× - 12× :** నడుము నుండి పాదముల వరకు రాత్రిపూట వచ్చు ఈటె / బల్లెముతో పొడిచినట్టి నొప్పి - ఉపశమనం కొరకు రోగి లేచి కుర్చీలో కూర్చోవాలి.

**ఫెర్రంఫాస్ 6× - 12× :**

★ చలి / జలుబు వల్ల కలుగు నొప్పి - మేకును కొట్టినట్టి నొప్పి కలుగును.
★ రక్తం అధికముగ చేరుటవల్ల కలుగు నొప్పి / బాధ, వేడిమి, వాపు కలిగిన నొప్పి.
★ తలలో, కణతలలో / కంటిపైన / దవుడ ఎముకలో ఏమీ కనబడని నొప్పి (ఈ బాధకు ఫెర్రంఫాస్ సరిపోదు అని తలంచిన కాల్కేరియాసల్ఫ్‌ను ఇవ్వాలి).
★ కందిపోయిన ముఖంతోనున్న నరాల నొప్పి.
★ ముఖంనొప్పి, జ్వరపు లక్షణాలతో.
★ ముఖం నందు అధికమగు బాధ పొర్లు పొర్లుగ వచ్చుట.
★ కనుగ్రుడ్డు ఉండెడి ఎముకల గూడు లోపలివైపున, ముక్కులోన నరాల నొప్పి
★ స్తన గ్రంథుల నరాల నొప్పి.
★ కుడివైపున వుండు నొప్పి - ఉదయాన నొప్పి అధికమగుట.

**కాలీఫాస్ 6× - 12× :**

★ ఏ అవయవములో నైనా నరాల బాధ ఉండుట - క్రుంగిపోవుట, బలం క్షీణించుట, పైకి లేవలేకపోవుట / అట్లే వుండిపోవుట - నిల్చొన్నప్పుడు, నడుస్తున్నప్పుడు నొప్పి తక్కువగ ఉన్నట్లనిపించుట.
★ కోపమును, ధ్వనిని, వెలుతురును భరించలేక పోవుట - ఈ లక్షణాలతో నున్న నరాల బాధ - ఆహ్లాదకరమైన ఉత్తేజముతో నొప్పి తగ్గును / నొప్పి ఉన్నట్లు కూడ అనిపించదు.
★ మెదడు బుద్ధి కుశలతను అభివృద్ధి చేయుటకు ఈ మందు ఉపయోగపడును.
★ నరాల పదార్థాలలోని నరాల నొప్పి కుంటితనం, తిమ్మెరను కలిగించగా పక్షవాతం వచ్చునేమోనను భయం కలుగుట.
★ నెమ్మదిగ నడిచినచో నరాల నొప్పి తగ్గును - లేచినచో నొప్పులు ఎక్కువగును. ప్రశాంతంగా / ఒంటరిగా ఉన్నప్పుడు నొప్పులు అధికమైనట్లు తోచుట.
★ నరాల నొప్పి చెవులలో ఝుంకార శబ్దం, బలం లేక పోవుట అను లక్షణాలతో.

- ★ నరాల నొప్పులు అకస్మాత్తుగ వచ్చుట, తర్వాత నీరసం కలుగుట.
- ★ సయాటిక నరం నొప్పి.
- ★ ముఖం నొప్పి.
- ★ కుడివైపున వుండు నరాల నొప్పి – చల్లగనుండు పదార్థాలను (మంచు లేక చల్లని నీళ్ళ ప్యాక్‌ను) నొప్పి ఉన్నచోట పెట్టిన నొప్పి తగ్గును.
- ★ పై వరుస నుండు దంతముల నుండి చెవుల వరకు వ్యాపించు ఆకస్మికమైన నొప్పి.

**మెగ్నీషియంఫాస్ 6× – 25× :**

- ★ నొక్కి వేయునట్టి, లాగునట్టి ప్రక్కటెముకల నరాల నొప్పి.
- ★ జలుబువల్ల ఈడ్పులు వచ్చును, కాని జ్వరం ఉండదు.
- ★ తలలో నరాల నొప్పి – మెరుపువలె చటుక్కున కలుగు నొప్పి – చాల తీవ్రంగ వుండే నొప్పి.
- ★ జ్ఞానేంద్రియముల వల్ల కలుగు రస, రూప, గంధ, స్పర్శాదుల అనుభూతి తీవ్రంగ ఉన్నప్పుడు దేహంలోని ఏ అవయవంలోనైనా కలుగు నరాల నొప్పులు – తాళలేనంతటి నొప్పులు.
- ★ ఈడ్పులుగల నొప్పులు – కండర పేశముల చివరన నొప్పులు.
- ★ నమలుట / చలనం వల్ల నొప్పులు అధికమగుట.
- ★ కాల నియమం ప్రకారంగా వచ్చు నొప్పులు – తరుణ నొప్పులు, మెరుపువలె తళుక్కున వచ్చునట్టి నొప్పి / శూలనొప్పి నరం దారి అంతా వుండుట.
- ★ ఉత్తరం నుండి వీచే బలమైన గాలికి గురైనపుడు వచ్చే నరాల నొప్పి.
- ★ ఏ రకపు ఈడ్పులైనా, వ్యాధులైనా.
- ★ పగటిపూట – రాత్రిపూట నరాల బాధ.
- ★ విచిత్రమైన ముఖపు[1] నరాల వ్యాధి.
- ★ చల్లదనం వల్ల నొప్పి తగ్గినచో ఈ మందు పనికిరాదని తెలియును.
- ★ పొడిగా నుండు వేడిమివల్ల నొప్పి తగ్గును.
- ★ కుడివైపు నొప్పికి ఇది మంచి మందు.

**నేట్రంమూర్ 6× – 12× :**

- ★ కొన్ని నిర్ణీత సమయాల్లో నరాల నొప్పి తిరిగి తిరిగి వచ్చుట – అప్పుడు లాలాజలం / కన్నీరు స్రవించుట.

*1. మెదడు అడుగు భాగం నుండి 12 జతల కపాల నాడులు బయలు దేరును. వీటిలో అయిదవ నాడి ముఖమునకు పోవును.*

- ★ మెరుపువలె తళుక్కున వచ్చునట్టి నొప్పి / శూలనొప్పి, కండర పేశముల వెంబడి వుండుట.
- ★ కనుగ్రుడ్డు ఉండెడి ఎముకల గూడులో నరాల నొప్పి, కన్నీటితో.
- ★ 5వ జత నరము[1] (ముఖపు నరము)లో క్షోభ.
- ★ ముఖం నొప్పి, మలబద్ధకం – స్కూలు విద్యార్థినులలో చదువుట, వ్రాయుట వల్ల ఉదయాన ఈ నొప్పి ఎక్కువగుట.

**నేట్రంఫాస్ 6× – 12× :** ముఖపు నరాల నొప్పి – శూలనొప్పి, కుట్టుచుండు నొప్పి – కుడివైపున నుండు క్రింది దవుడ బాధగ నుండుట.

**నేట్రంసల్ఫ్ 6× – 12× :** తేమగ నుండు నివాస స్థానములలో ఉండుటచే కలుగు నరాల నొప్పి – నాలుకపై చిక్కని పసుపు పచ్చని / గోధుమ వర్ణపు పూత.

**కాల్కేరియాఫాస్ 6× – 12× :**

- ★ ఎముకలలో నరాల నొప్పి లోతుగ ఉండుట, విద్యుత్‌షాక్ వల్ల కలుగునట్టి నొప్పి వలె ఉండుట.
- ★ నరాల నొప్పి రాత్రిపూట ప్రారంభమగుట, కాల నియమం ప్రకారం తిరిగి వచ్చుట.
- ★ రాత్రి పూట, వాతావరణం బాగ లేనపుడు నొప్పులు అధికమగుట.
- ★ మల విసర్జన తర్వాత నొప్పులు అధికమగుట, ఎక్కువ కాలం ఉండుట.
- ★ ప్రాకినట్టి భావన, చల్లదనం, తిమ్మెరతో నున్న నొప్పులు.

**కాల్కేరియాసల్ఫ్ 6× – 12× :** ఈ మందు తరుణ బాధలకు పనిచేయునట్టి మెగ్నీషియం ఫాస్‌కు, పక్షవాతమునకు పనిచేయు కాలీఫాస్‌కు మధ్య నుండును. వయోవృద్ధులలో నరాల ధాతువులలో పునఃనిర్మించే శక్తి తక్కువగ ఉన్నప్పుడు ఈ మందు బాగ పనిచేయును.

**సైలీషియా 6× – 25× :**

- ★ నొప్పి ఎక్కువగ దంతములలో ఉండుట – నడుముకు, పొత్తికడుపుకు సంబంధించిన నరాల నొప్పి – వేడి దుస్తులను కప్పుట వల్ల నరాల నొప్పి తగ్గుట.
- ★ సారాయి త్రాగుట, కఠినమైన పని, నిర్బంధంలో ఉంచుటవల్ల కలుగు మొండి నరాల వ్యాధి.

## 2. తలత్రిప్పు / తల తిరుగుడు
### (Dizziness / Vertigo)

రోగికి తాను / తన చుట్టూ ఉండే వస్తువులు సుడిగుండం వలె తిరుగుచున్నట్లు భ్రమ కలిగించు స్థితిని తలత్రిప్పు / తలతిరుగుడు అని అంటారు.

*1. వెన్నెముకలో 31 జతల (కుడి, ఎడమ) నాడులు గలవు. అవి మిశ్రమ నాడులు. కంఠం 8 జతలు, వక్షఃస్థలం 12 జతలు, కటి 5 జతలు, త్రిక 5 జతలు మరియు అనుత్రిక 1 జత .*

**లక్షణాలు :**

1. రోగి నిల్చొన్నప్పుడు, పొర్లినపుడు లేక నడచినపుడు తన చుట్టూ ఉన్న వస్తువులు కదలినట్లు అనిపించుట.
2. నడువబోవునపుడు సమతాస్థితిని కోల్పోయి ప్రక్కకు పడబోవుట.
3. ప్రక్కనున్న ఏ వస్తువునైనా పట్టుకొనుటకు ప్రయత్నించుట.
4. రోగి కూర్చొన్నప్పుడు ఉన్నట్లుండి లేచిన కళ్ళ ముందు రంగులు తిరిగినట్లు కనిపించి కొంచెం సేపు స్పృహ తప్పినట్లు అనిపించుట.

**రకములు :** తలత్రిప్పు ముఖ్యంగా నాలుగు రకములు –

1. మెదడులో గడ్డలు ఏర్పడుట మొ॥ వ్యాధుల వల్ల నరములలో మార్పు వచ్చి కలుగు తలత్రిప్పు.
2. కంటికి శ్రమ కలుగుట మొ॥ కంటికి సంబంధించిన వ్యాధులు వచ్చుట వల్ల కలుగు తలత్రిప్పు
3. చెవికి మెనియర్స్[1] వ్యాధి వచ్చినందువల్ల వచ్చు తలత్రిప్పు.
4. జీర్ణమండలంలోని లోపాల వలన కలుగు అజీర్ణం కారణంగా వచ్చు తలత్రిప్పు.

**కారణములు :** 1) అధికముగ చదువుట, 2) అధికముగ మత్తు మందులు వాడుట, 3) రాత్రులందు నిద్రలేమి, 4) అజీర్ణం, 5) గుండె జబ్బులు, 6) మూత్రపిండముల వ్యాధులు, 7) తలకు దెబ్బ తగులుట, 8) మెదడులో గడ్డ / కంతి ఒత్తిడి, 9) రక్తక్షీణత, 10) తలకు రక్తాధిక్యత, 11) కంటివ్యాధి, 12) చెవి జబ్బు.

**నివారణోపాయాలు :**

1) సాత్విక ఆహారం తినుట, 2) వ్యాయామం, 3) మలబద్ధకం లేకుండ చేసుకొనుట.

**• చికిత్స •**

రోగి తలత్రిప్పుకు ద్వాదశ లవణ చికిత్స చేయునపుడు క్రింది విషయాలను గుర్తించుకొనుట అవసరం –

1. తలత్రిప్పు ఏ కారణమున వచ్చినది?
2. తలత్రిప్పు లక్షణాలేమిటి?
3. తలత్రిప్పు ఏ పరిస్థితులలో వస్తున్నది? కూర్చొని లేచినపుడా, ప్రక్కకు పొర్లినపుడా, నడచినపుడా, కళ్ళు మూసినపుడా మొ॥నవి.
4. వస్తువులు కుడివైపుకు తిరుగునా? ఎడమవైపుకు తిరుగునా?

*1. **మెనియర్స్ వ్యాధి :** చెవిలో హోరు / గుయ్యి మనటం ఉండి, క్రమేణ చెవుడుకు దారితీసే అంతర్గత కర్ణవ్యాధి*

5. తలత్రిప్పు ఎప్పుడు ఉద్రేకిస్తుంది? ఎప్పుడు ఉపశమనం పొందుతుంది?
6. తలత్రిప్పు సమయమున వాంతులు, నీళ్ళ విరేచనాల వంటి ఇతర లక్షణములేమైనా ఉన్నాయా?

**ఫెర్రంఫాస్ 6×–12× :** రక్తం వేగంగా తలకు చేరుట (రక్తప్రసరణాధిక్యత) వల్ల వచ్చు తలత్రిప్పు–వేడిమిచే ముఖం ఎర్రబడుట–గుండె బలముగ కొట్టుకొనుచున్నట్టి / నొక్కు చుందు నొప్పి–వంగినపుడు తలత్రిప్పు అధికమగుట–తలకు చల్లని నీరుతగిలిన ఉపశమనం.

**కాలీఫాస్ 6× :** వెన్నెముకకు సంబంధించిన వ్యాధి వల్ల, నాడీ కారణాల వల్ల, బలహీనత / నీరసం వల్ల కలుగు తలత్రిప్పు – తల తేలిపోతున్నట్లు అనిపించుట – రక్తహీనతవల్ల వచ్చు తలత్రిప్పు – లేచినా, పైకి చూసినా తలత్రిప్పు పెరుగుట, జీర్ణకోశమునకు సంబంధించిన కారణాలు లేకుండుట.

**కాలీసల్ఫ్ 6× :** లేచునపుడు, పైకి చూచునపుడు తలత్రిప్పు అధికంగా ఉండుట – సాయంత్రం వేడి గది యందు నొప్పి అధికంగా ఉండుట – వెనక్కి పడినట్లుండుట.

**నేట్రంసల్ఫ్ 6× :** పైత్యరసాధిక్యత వల్ల వచ్చు తలత్రిప్పు – నాలుకపై పైత్యరసపు / పసుపు పచ్చ పూత – జీర్ణవ్యవస్థ సరిగా లేకపోవుట – నోటిలో చేదు రుచి – కుడివైపుకు వాలిపోవాలనే కోరిక కలిగిన వ్యక్తి తలత్రిప్పు.

**నేట్రంఫాస్ 6× :** అజీర్ణం, ఆమ్లాధిక్యత వల్ల కలుగు తలత్రిప్పు – ఆకలి లేకపోవుట – పుల్లని వాంతి – నాలుకపై బంగారు వర్ణపు / పసుపు పచ్చ పూత – జీర్ణాశయంలో హైడ్రోక్లోరిక్ ఆమ్లం ఎక్కువై ఛాతీలో మంట కలుగుట.

**మెగ్నీషియంఫాస్ 6× :** కంటిదోషాల వల్ల వచ్చు తలత్రిప్పు – ఈ మందును వేడినీటితో తీసుకొనవలెను.

**కాల్కేరియాఫాస్ 6× :** నరాల బలహీనత కలిగి, అజీర్ణ లక్షణాలు లేని వ్యక్తి, ఆహారపు పోషకాలను సరిగా శోషణ చేసుకోలేని వ్యక్తి తలత్రిప్పుకు మంచి మందు. కాల్కేరియాఫాస్ 9× ను భోజనానంతరం వాడిన బాగుగా ఉపయోగపడును **(సి.ఆర్.ఫ్లూరీ).**

## 3. వివిధ రకముల తలనొప్పి – పార్శ్వపు నొప్పితో సహా
### (Various kinds of Headache including Migraine)

తలనొప్పి ఒక జబ్బుకాదు. ఇదొక వ్యాధి లక్షణం మాత్రమే.

**లక్షణాలు :** 1) తల పై భాగమున / వెనుక భాగమున, కళ్ళ పై భాగమున లేక తల ఏదో ఒక భాగమున కాని రెండు వైపుల కాని నొప్పి ఉండుట. 2) నొప్పి సూదులతో పొడిచినట్లు, తల బ్రద్ధలగునట్లు లేదా పెద్దదగునట్లు ఉండుట. 3) తల తిరుగుట, వమన వికారం, వాంతి మొ॥ లక్షణాలతో.

**కారణాలు :** అందరి తలనొప్పికి ఒకే కారణం ఉండదు. వివిధ వ్యక్తుల తలనొప్పికి వివిధ కారణాలు ఉంటాయి. కొందరికి 2 – 3 కారణాల వల్ల తలనొప్పి రావచ్చు. సాధారణంగా ఈ కారణాల వల్ల తలనొప్పి వస్తుంది.

1. అజీర్ణం.
2. అమితముగ భుజించుట.
3. మలమూత్రముల వేగములను అడ్డగించుట.
4. మలబద్ధకం.
5. ఎక్కువ శారీరక / మానసిక పరిశ్రమ చేయుట.
6. ఎండలో తిరుగుట.
7. అలసట చెందుట.
8. తేమ ప్రదేశంలో తిరుగుట.
9. రాత్రులందు ఎక్కువసేపు మేల్కొనుట.
10. విశేషముగ చదువుట.
11. బలహీనత.
12. రక్తపిత్తం.
13. టీ, కాఫీలు ఎక్కువగా త్రాగుట.
14. మంచినీరు తక్కువగా త్రాగుట.
15. గ్యాస్ట్రబుల్ ఎక్కువగా ఉండుట.
16. జలుబు.
17. మెడనొప్పి.
18. రక్తం తక్కువగా ఉండుట.
19. రక్తనాళాలు తలలో సన్నగిల్లుట.
20. కంటిచూపు సరిగా లేకపోవుట.

**నివారణోపాయాలు :**

1. ప్రతిరోజు మంచినీరు ఎక్కువగా త్రాగి 2 – 3 సార్లు సుఖ విరేచనం అయ్యేటట్లు జాగ్రత్త పడాలి.
2. ప్రతిరోజూ చన్నీటితో తలస్నానం చేయాలి. ఈ విధంగా చేసినప్పుడు తొలుత తలనొప్పి ఎక్కువ కావచ్చును. కాని 2 – 3 రోజులలో తలనొప్పి తగ్గుతుంది. తలలో రక్తప్రసరణ బాగా జరుగుతుంది. తలలో వేడి తగ్గుతుంది.
3. ఉదయం టీ, కాఫీలను మానుకోవాలి. పచ్చి కూరల రసం / పండ్ల రసం త్రాగాలి.

4. ఉదయపు టిఫెన్‌గా గింజల మొలకలు / పండ్లు తినాలి.
5. తలనొప్పిగా ఉన్నప్పుడు రెండు పాదాలను వేడి నీటిలో పెట్టాలి. తల / మాడుపై తడిగుడ్డ పెట్టి 15 నిముషాలు ఉండాలి.

## • చికిత్స •

ఈ ఆధునిక యుగంలో గ్రామాల్లోసైతం చిన్న బడ్డీకొట్టులో కూడా తలనొప్పి మాత్రలు అమ్మటం చూస్తూ ఉంటాం. తలనొప్పి వచ్చినప్పుడు అలాంటి ఒక మాత్ర కొని వేసుకొంటూ ఉండుట మనందరికీ తెలిసిన విషయమే. ఆ మందులు నొప్పి కొంత కాలంపాటు కనపడకుండ చేసి నొప్పి తొలగిపోయిందనే భ్రమలో పడవేస్తూ ఉంటాయి. కాని ద్వాదశ లవణ చికిత్సా విధానంలో తలనొప్పిని శాశ్వతంగా తొలగించవలయునంటే రోగికి / వైద్యునకు ఈ విషయాలు అన్నీ తెలిసి ఉండాలి –

1. తలలో ఏ భాగమున నొప్పి (తలపై భాగము, తల వెనుక భాగం, కుడిప్రక్క మొ॥)
2. ఎలాంటి నొప్పి (సుత్తితో కొట్టినట్లు, సూదితో గ్రుచ్చినట్లు మొ॥)
3. ప్రతి దినం వచ్చునా? / ఎన్ని రోజులకు ఒకసారి వచ్చును? ఏ ఋతువులో వచ్చును?
4. ఏ సమయమున వచ్చును? (రాత్రి / ఉదయం)
5. ఉద్రేకాలు – ఉపశమనాలు.
6. రోగ కారణాలు.
7. ప్రత్యేకముగానా / ఏదైనా రోగంతోనా?

**ఫెర్రంఫాస్ 3× – 30× :**

★ జలుబు, సూర్యుని వేడిమివల్ల వచ్చు తలనొప్పి.
★ కముకు నొప్పి, అదిమినట్లు నొప్పి / కుట్టినట్లు నొప్పి.
★ ముందుకు వంగుట / కదలుట వల్ల నొప్పులు అధికమగుట.
★ గౌటు తత్త్వంకలవారి తలనొప్పి (దీనికి ప్రత్యామ్నాయంగా నేట్రంసల్ఫ్ వాడాలి)
★ జీర్ణంకాని పదార్థాన్ని వాంతి చేసుకొనుటతో కూడిన తలనొప్పి.
★ రక్తప్రసరణాధిక్యతచే కలుగు తలనొప్పి – అదిమినట్లు నొప్పి, తల తాకితే పుండువలే ఉండుట – తలనొప్పి ఉన్నచోట ఏదైనా వస్తువును అదిమినచో నొప్పి తగ్గుట – నాలుకపై బొచ్చు ఉన్నట్లు అనిపించుట ఈ మందు వాడుటకు అదనపు సంకేతం.
★ పిల్లల తలనొప్పి
★ తలనొప్పి – తలలో గుండె కొట్టుకొనుచుండు నట్లుండుట – కుడివైపున అధికం.
★ ఎర్రని ముఖంతో నున్న తలనొప్పి – కళ్ళ ఎరుపు ముఖం అంతటా వ్యాపించుట.

★ అంధత్వమును కలిగించు తలనొప్పి – తీసుకొన్న ఆహారం అలాగే జీర్ణం కాకుండానే వాంతి అగుటతో.

★ మందముగా నున్న కుడివైపు తలనొప్పి – నడినెత్తి నుండి కుడివైపు కంటిలొత్త పైభాగం వరకు వ్యాపించు తలనొప్పి – తలకు రక్తం వడిగా ప్రసరించుట.

★ తలను కదిలించినా, వంచినా, శరీరపు ఏమాత్రపు కదలిక అయినా తలనొప్పిని అధికం చేయుట.

★ రక్తప్రసరణాధిక్యత వల్ల కలుగు తలనొప్పి, ముఖ్యంగా బహిష్టు సమయాన.

★ తల పైభాగం చల్లని గాలిని, ధ్వనిని, కుదుపు సహించలేక పోవుట – వెంట్రుకలను తాకినా భరించలేక పోవుట.

★ తలకు దెబ్బలు తగిలిన తర్వాత కలుగు తలనొప్పులను ఈ మందు నయం చేసింది.

**కాలీమూర్ 3× – 6× :**

★ వమనం, పాల వంటి తెల్లని కఫాన్ని కాండ్రించుటతో కూడిన తలనొప్పి

★ పార్శ్వపు తలనొప్పి – తెల్లని పూతతో నున్న నాలుక, బద్ధకంగా ఉన్న కాలేయం నుండి వచ్చిన తెల్లని కఫాన్ని వమనం చేసుకొనుట, బొచ్చుగల నాలుక, నాలుక మొదట్లో బూడిద / తెల్లని వర్ణం – ఆకలి లేకపోవుట లక్షణాలతో.

**కాలీఫాస్ 3× – 6× :**

★ నరాల బాధల వల్ల వచ్చు తలనొప్పి – ధ్వనిని భరించలేకపోవుట, చిరాకు, గాబరా, నెమ్మదిగా కదిలిన ఉపశమనం.

★ విద్యార్థుల, అలసట వల్ల శిథిలమైనవారి, కడుపులో మంట, అజీర్ణం మొ॥ జీర్ణకోశ సంబంధమైన లక్షణాలు లేనివారి తలనొప్పి.

★ నాలుక కొన్ని సందర్భాలలో గోధుమ – పసుపు పచ్చ పూతతో ఆవాలు రంగులో ఉండును. దుర్వాసనగల శ్వాస ఉండును.

★ తల వెనుక భాగమున, కళ్ళకు అడ్డముగా ఉండు తలనొప్పి, తల భారంగా ఉండుట. తినునపుడు నొప్పి తగ్గుట, అలసట, క్షీణించిన భావంతో కూడిన తలనొప్పి **(ఈ లక్షణాలకు ఫెర్రంఫాస్ తర్వాత దీనిని వాడాలి)**

★ నరాలకు సంబంధించిన తలనొప్పి, ఆలోచించుటలో గల అశక్తత, బలం లేకపోవుట, చిరాకు, నిద్రలేమి / నిరాశ లక్షణాలతో.

★ అలసట, ఆవలింతలు, సాగదీయుట, శక్తి క్షీణించుట, వెర్రి / ఉన్మాదం లక్షణాలతో కూడిన తలనొప్పి.

- ★ కడుపుగుంట బలహీనత, ఏమీలేని భావనతో కూడిన తలనొప్పి – పైత్యపు వాంతికి ముందు తలనొప్పి వచ్చుచున్నచో ఈ మందు వాడాలి.
- ★ చెవులలో ఝుంకార శబ్దం, నిల్చొనలేక పోవుటతో కూడిన నరాల తలనొప్పి – ఆనందకరమైన పరిస్థితులలో తలనొప్పి తగ్గుట.
- ★ నరాలకు సంబంధించిన లక్షణాలతో నున్న నాడీ సంబంధమైన తలనొప్పి – తినునపుడు, క్రుంగిపోయినపుడు తలనొప్పి తగ్గుట.
- ★ బాగా నిద్రపోయిన తర్వాత తలలో ధ్వనులు.
- ★ బహిష్టులో వచ్చు తలనొప్పి, ఆకలితో – ఎడమవైపున వున్న స్తనములో తీవ్రమైన నొప్పి – కదలికవల్ల, బహిరంగ ప్రదేశంలో తలనొప్పి ఎక్కువగుట.

**కాలీసల్ఫ్ :** వెచ్చని గదిలోను, సాయంకాలమున ఎక్కువగు తలనొప్పి – చల్లని బహిరంగ ప్రదేశమున తగ్గుట.

**మెగ్నీషియంఫాస్ 3× – 6× :**

- ★ తాళలేని తలనొప్పి – ఈడ్పులతో
- ★ నాడీ సంబంధమైన / మేహవాతపు తలనొప్పి– శూలనొప్పి / కుట్టినట్టి నొప్పి, స్థానం మారు నొప్పి, – ఆగి ఆగి వచ్చునట్టి / ఉద్ధృతముగ వచ్చునట్టి నొప్పి.
- ★ దృష్టిదోషాల వల్ల కలిగిన తలనొప్పి – అలసిపోయిన, క్షీణించిన, నరాల వ్యాధులతో నున్న వారి తలనొప్పికి ఈ మందు చాల ఉపయోగకారి.
- ★ కళ్ళముందు నిప్పు కణాలతో ఉన్న నరాలకు సంబంధించిన తలనొప్పి – కళ్ళముందు ఏదైనా ఒక వస్తువు రెండు వస్తువులుగా కనిపించుట / రెండింతలుగా కనిపించుటతో కూడిన తలనొప్పితో.
- ★ తల వెనుక భాగమున తలనొప్పి అధికమగుట – స్కూలుకు హాజరైనపుడు, మానసిక శ్రమ తర్వాత తలనొప్పి స్థిరంగా ఉండుట.

**నేట్రంమూర్ 3× – 12× :**

- ★ మందముగాను, భారంగాను ఉండు తలనొప్పి – ఎక్కువ కన్నీళ్ళు, నిద్రమత్తు, హాయిని ఇవ్వని నిద్ర.
- ★ మలబద్ధకంతో వచ్చిన తలనొప్పి – ప్రేగుల బద్ధకంవల్ల, ప్రేగుల ఆమత్వక్కు పొడిగా మారుట వల్ల మలబద్ధకం ఏర్పడినచో – అప్పుడు నాలుక స్వచ్ఛంగా ఉండును లేదా నాలుక శుద్ధమైన నీటి కఫంతో కూడి ఉండును. అంచులు నురుగుతో ఉండును. లాలాజలం ఎక్కువగ ఉండును – నుదుటి ఎముక యందు ముక్కుకు దగ్గరగ నున్న రెండు గుల్ల ప్రదేశాలలో (sinus) వాపు.

★ పారదర్శకమైన కఫం / నీటిని వాంతి చేసుకొనుట, దారంవలె సాగునట్టి కళ్ళెను కాంక్షించుటతో కూడిన తలనొప్పి.

★ ఈ మందు శరీర పోషణ లేనివారికి, ఎముకలకు సంబంధించిన ద్రవాలను నష్టపోయిన వారికి బాగా ఉపయోగకారి. ఈ మందును ఈ సందర్భాలలో వాడుట వల్ల బాగ ప్రయోజనం ఉండును –

1. దీర్ఘకాలపు పార్శ్వపు తలనొప్పి.
2. బహిష్టుకు ముందు, బహిష్టు సమయమున, బహిష్టు తర్వాత వచ్చు తలనొప్పి.
3. పాఠాలను శ్రద్ధగా చదువుకొనే స్కూలు బాలికల తలనొప్పి.
4. నిద్రలేవగానే ఉదయాన ప్రారంభమయ్యే తలనొప్పి మధ్యాహ్నం వరకు ఉండుట / సూర్యునితో పాటు తగ్గుట.
5. జలుబువల్ల వచ్చే తలనొప్పి.
6. పార్శ్వపు తలనొప్పి **– కింగ్.**
7. స్పృహకోల్పోవుట, కాళ్ళు – చేతులు అదరుటతో కూడిన ఒకవైపు తలనొప్పికి ఇది మంచి మందు.
8. ఇది సవాయి వల్ల వచ్చు తలనొప్పికి చక్కని మందు **– వాండర్‌గోల్జ్**

**నేట్రంసల్ఫ్ 3× – 6× :**

★ పైత్యరసంతో కూడిన నీళ్ళ విరేచనాలు / పైత్యరసాన్ని వాంతి చేసుకొనుట, నోటిలో చేదు రుచి లక్షణాలతోనున్న పార్శ్వపు తలనొప్పి.

★ శూలనొప్పి, తలత్రిప్పు, నాలుకపై పసుపు పచ్చ – బూడిదగ నున్న పూత.

★ తలనొప్పి బహిష్టు సమయమున వచ్చుట.

★ తలనొప్పి కాలనియమం ప్రకారం వచ్చుట – తలనొప్పి ప్రతి వసంత ఋతువులోను వచ్చుట – వసంత ఋతువు ప్రారంభం కాగానే తలనొప్పి తరచుగా వచ్చుట – అప్పుడు ఈ లక్షణాలు ఉండును : తలకు రక్తం పూర్తిగ చేరుట, నడినెత్తిపై వేడిమి, తలలోను, తల అంతటా ఒత్తిడి, మానసికంగా క్రుంగుట, విచారం, తలత్రిప్పు, మందకొడితనం, వాంతి – కదలికచేతను, చదువుట వల్ల తలనొప్పి అధికమగుట, ప్రశాంతంగ ఉండుట వల్ల తలనొప్పికి ఉపశమనం.

★ తల వెనుక భాగాన తలనొప్పి.

★ మెదడు అడుగు భాగాన తీవ్రమైన నొప్పులు – వైస్ యంత్రంలో పెట్టి అదిమినట్లు నొప్పి / కొరుకుకు తినునట్టి నొప్పి

★ నడచునపుడు రెండు చెంపలమీద కొట్టుచున్నట్లుండు నొప్పి.

★ తల పైభాగాన వర్ణించలేని నొప్పి – తల బ్రద్ధలగుచున్నట్లుండు నొప్పి.

★ గుండెవలె కొట్టుకొనుచున్నట్లుండు నొప్పి.

★ ఉదయాన నిద్రలేచిన తర్వాత తలనొప్పి ప్రారంభమై మధ్యాహ్నమునకు అధికమగును. రాత్రి నిద్రించు సమయానికి అది తగ్గును.

★ ధ్వనిని సహించలేడు. చీకటిగా నున్న గదిలో నిద్రించవలెను. వమన వికారం, వాంతి. ఇలాంటి అనేక కేసులను ఈ మందును 200 పొటెన్సీలో వాడి నయం చేసాను. **– డాక్టర్ ఏ.ఎమ్. డఫ్ఫీల్డ్**

**సైలీషియా 3× – 12× :**

★ తలనొప్పితోపాటు కపాలమును కప్పియుంచు చర్మంపైన బఠాణి సైజులో చిన్న ముడులు లేచుట.

★ తలకు రక్తం అధికంగా ప్రవహించుట వల్ల వచ్చునట్టి / నరాలకు సంబంధించిన మేహవాతపు తలనొప్పి.

★ అధిక మానసిక అలసట, అధిక వేడిమి, అధిక నాడీ శోషణ వల్ల వచ్చు తలనొప్పి.

ఇది ఈ క్రింది వారి తలనొప్పికి చక్కని మందు–

★ క్షయ స్వభావం కలవారు.

★ రికెట్సు – రక్తహీనత పరిస్థితులు – ఎముకలలో పుండు గలవారు.

★ పొడిచర్మం కలిగియుండుట, అధికంగా లాలాజలం కలిగియుండుట, నీళ్ళ విరేచనాలు, రాత్రి పూట చెమట పట్టుట లక్షణాలతో నరాల బాధలు గలవారు – చిరాకు పడువారు – అందమైన చర్మం, పాలిపోయిన ముఖం, తేలికరంగు గల ఛాయ, బిగిలేని కండరాలు లక్షణాలతో బలహీనంగా ఉన్నవారు.

★ అతి సున్నితమైన వారు, సరిగా శోషణ జరగకపోవుటచే సరైన పోషణ లేనివారు.

**నేట్రంఫాస్ 3× – 6× :**

★ ఉదయాన మేల్కొనగానే తలపైభాగమున తలనొప్పి – అంగటి వెనుక భాగాన క్రీమువంటి ఆకృతి – నాలుకపై పసుపు పచ్చని తేమ.

★ తలనొప్పి– కపాలం నిండుగా ఉన్నట్లు తీవ్రమైన నొప్పి.

★ తల ముందు భాగాన / వెనుక భాగమున తలనొప్పి, వమన వికారం / పుల్లని, బంకగానున్న పదార్థాన్ని వాంతి చేసుకొనుట.

★ చాలా తీవ్రమైన నొప్పి – తలపైభాగమున అధిక ఒత్తిడి, వేడిమి, తలబ్రద్ధలగుచున్నట్లుండుట. (ఫెర్రంఫాస్ చాలనిచో ఈ మందును ఇవ్వాలి)

★ పార్శ్వపు తలనొప్పి – పుల్లని నురుగు పైకి చిమ్మబడుట.

★ మద్యం / పాలు త్రాగిన తర్వాత వచ్చు తలనొప్పి.

**కాల్కేరియాఫాస్ 3× - 12× :**

★ తలలో చల్లగ ఉన్నట్లు అనిపించుట, తల తాకటానికి చల్లగ ఉండుట, ఈ లక్షణాలతో తలనొప్పి (ఫెర్రంఫాస్) - వేడిమి / చల్లదనంతో నొప్పి అధికమగుట.

★ నరాల వ్యాధులు ఉన్నట్టి, అస్థిమితత్వం కలిగిన పిల్లల, స్కూలు బాలికల తలనొప్పి.

ఈ మందు క్రింద పేర్కొన్న తలనొప్పులకు ఉపయోగకారి

1. జీర్ణకోశ వ్యాధుల వల్ల, మేహవాతంవల్ల వచ్చు తలనొప్పి. ఇది నడచుట / కదలిక వల్ల ఎక్కువగును.
2. తలనిండుగ ఉండుట, దానిపై ఒత్తిడి-హ్యాట్ ఒత్తిడి (బరువుచే) ఈ బాధలు ఎక్కువగుట.
3. చిరచిరలాడునట్టి, కోప స్వభావంగల పిల్లలు, చాలా కాలంగా బ్రహ్మరంధ్రం తెరవడియున్న వారి తలనొప్పి.
4. మానసిక పనులు చేయుట కష్టంగా ఉన్నవారి, కోపం కలవారి, ఏ పనీ చేయాలనే కోరిక లేనివారి తలనొప్పి, ప్రతి తలనొప్పితో మతిమరుపు, మందకొడితనం ఉండుట **- (కింగ్)**

**కాల్కేరియాసల్ఫ్ :** తలత్రిప్పు, వమన వికారంతోనుండు తలనొప్పి - కళ్ళు క్రుంగిపోయి నట్లుండుట - పూర్తి తలచుట్టూ నొప్పి - నుదుటి భాగమున తలనొప్పి ఎక్కువగనుండుట.

## 4. మాడునొప్పి

తలనొప్పి, మాడునొప్పి వేరు వేరు. మాడునొప్పి మాడు భాగంలోనే వస్తుంది.

**కారణం :** బస్సు ప్రయాణంలో, షాపింగుకు వెళ్ళినప్పుడు, ఎండలో తిరిగినప్పుడు, ఆందోళన చెందినప్పుడు, శరీరంలో నీటి పరిమాణం తగ్గినప్పుడు మాడు భాగమునకు అందే రక్తంలో నీరు తగ్గి మాడునొప్పి వస్తుంది.

**నివారణోపాయాలు :**

1. ప్రతిరోజూ గంటకొకసారి లేదా అరగంటకొకసారి నీరు త్రాగాలి.
2. మాడునొప్పి వచ్చినప్పుడు మాడును నీళ్ళతో తడపాలి. దానిపై నీళ్ళతో తడిపిన గుడ్డను వేయాలి.

## 5. మెడనొప్పి / మెడ కొయ్యబారుట
## (Cervical spondylosis) / (Stiff neck)

ఇది ముఖ్యంగ ఎముకల వ్యాధి. కాని దీని లక్షణాలన్నీ నరాలకు సంబంధించినవిగా ఉన్నాయి. కనుక దీనిని గురించి 'నరాల వ్యాధులు' అధ్యాయంలో చర్చించడమైనది.

**లక్షణాలు :**

1. మెడ కొయ్యబారి కదలనివ్వదు. అది ఒక వైపుకు వంగి ఉండును.
2. మెడ, తల వెనుక భాగం, భుజాలు, చేతులు, ఛాతీ, వీపులో నొప్పి ఉండును.
3. ఈ నొప్పి లాగుతున్నట్లు, సూదితో కుట్టినట్లు, మండుచున్నట్లు ఉండును.
4. తిమ్మిరిగ ఉండును.
5. కొందరిలో మెడనొప్పి వల్ల కళ్ళు తిరుగుట, తలనొప్పి ఉండును.
6. కొందరు పడిపోవుట కూడ జరుగుతుంది.

**కారణం :** మెడ ప్రాంతంలో వెన్నుపూసల మధ్య ఉన్న మృదులాస్థి క్షీణించుటచే వాటిలో మార్పులు వచ్చును. ఆ మార్పులవల్ల మెడ వద్ద ఉన్న నరాలలో కొంత ఒత్తిడి కలుగును. దానివల్ల నొప్పి కలుగును.

**నివారణోపాయాలు :**

1. ఈ బాధతో నున్నవారు గట్టినేల / బల్లపై తలగడ లేకుండా పడుకోవాలి.
2. తలను ముందుకు వంచి ఏ పనీ చేయరాదు. తలను నెమ్మదిగ ఎడమవైపుకు, ఆ తర్వాత కుడివైపుకు తిప్పాలి. తర్వాత పైకి ఎత్తాలి.
3. మెడకు సంబంధించిన తేలికపాటి ఆసనాలు చేయాలి.
4. మెడ చుట్టూ మెత్తని బెల్ట్ ధరించాలి.
5. ఎప్పుడు కూర్చొన్నా, ఎక్కడ కూర్చొన్నా మెడ ఒక లైనులో ఉండేటట్లు కూర్చోవాలి.
6. మెడ భాగానికి కొబ్బరినూనె రాసి వేడినీటి కాపడం పెట్టాలి.

**• చికిత్స •**

**ద్వాదశ లవణ మిశ్రమం :** ప్రతి మోతాదులోను కాల్కేరియాఫ్లోర్ 6× – 1 మాత్ర, కాల్కేరియాఫాస్ 12× – 1 మాత్ర, నేట్రంమూర్ 6× –1 మాత్ర, మెగ్నీషియంఫాస్ 6× –1 మాత్ర, సైలీషియా 12× – 1 మాత్ర మొత్తం 5 మాత్రలు తీసుకోవాలి. ఈ విధంగా ప్రతిరోజు ఉదయం, రాత్రి కొన్ని నెలలపాటు తీసుకోవాలి.

## 6. ముఖములో నొప్పి
## (Prosopalgia)

మెదడు అడుగు భాగం నుండి వెళ్లే 12 జతల కపాలనాడులలో ట్రైజెమినల్ / ట్రైఫేషియల్ నాడి ఐదవది. దీని శాఖలు నమలు కండరాలు, ముఖం, నోరు, నాలుకకు చేరును. దీనిలో నొప్పి వచ్చిన ట్రైఫేషియల్ న్యూరాల్జియా అంటారు.

**• చికిత్స •**

**నేట్రంమూర్ 6× - 12× :**

★ 5వ జత నరములో క్షోభ – దీనివల్ల ముఖం నొప్పి వచ్చుట. ఇందుకు మలబద్ధకం కారణం. స్కూలు విద్యార్థినులలో చదువుట, వ్రాయుట వల్ల ఈ నొప్పి ఎక్కువగుట.

★ కంటిగ్రుడ్డు ఉండెడి ఎముకల గూడులో నరాల నొప్పి ఉండును. కళ్ళనుండి కన్నీరు కారును. కొన్ని నిర్ణీత సమయాల్లో ఈ ముఖం నొప్పి మరలా – మరలా వచ్చును. ఆ నొప్పి వచ్చినప్పుడు లాలాజలం స్రవించుటగాని, కళ్ళ నుండి కన్నీరు కారుటకాని జరుగును. ఆ నొప్పి మెరుపువలె అకస్మాత్తుగ వచ్చును. నరపు పేశములలో (fibres) బల్లెముతో పొడిచినట్లు నొప్పి ఉండును.

**నేట్రంఫాస్ 6× - 12× :** ముఖపు నరాల నొప్పి బల్లెముతో పొడిచినట్లు / కుట్టుచున్నట్లు ఉండును. ఆ నొప్పితోపాటు కుడివైపున ఉన్న క్రింది దవుడలో పుండు వంటి నొప్పి కనిపించును.

**మెగ్నీషియంఫాస్ 6× - 25× :** ఒక విచిత్రమైన ముఖపు నరాల నొప్పి –రోగి పగలంతా ఆరోగ్యంగా ఉండును. కాని రాత్రిపూట ముఖపు నరాల వ్యాధి వచ్చును. చలి / చల్లదనం వల్ల ఈ నొప్పి వచ్చిన ఈ మందును వాడడం మానుకోవాలి, ఎందుకనగా వేడిమి వల్ల నొప్పి తగ్గుట ఈ మందు లక్షణం. ఇది కుడివైపున నున్న నొప్పికి మంచి మందు. ఉత్తరం నుండి బలమైన గాలి వీచినప్పుడు ఈ నొప్పి అధికమగును. ఈ నొప్పి నిర్ణీత సమయానికి వచ్చును. ఇది మెరుపు వలె అకస్మాత్తుగ రావచ్చు. ఈ నొప్పి ఈటె / బల్లెముతో పొడిచినట్లుండును.

**ఫెర్రంఫాస్ 6× - 12× :** ముఖం నొప్పి జ్వరపు లక్షణాలతో – ముఖం నందు విపరీతమైన బాధ పొర్లు పొర్లుగ వచ్చుట. కంటి ఎముకల గూడులోను, ముక్కులోను నరాల నొప్పి – నొప్పి కుడివైపున – ఉదయాన నొప్పి అధికం.

**కాలీఫాస్ 6× - 12× :** ముఖం నొప్పి – కుడివైపున – పై వరుస దంతముల నుండి చెవుల వరకు వ్యాపించు ఆకస్మికమైన నొప్పి – మంచు / చన్నీళ్ళ ప్యాక్‌ను నొప్పి ఉన్నచోట పెట్టిన నొప్పి తగ్గుట.

## 7. పార్కిన్‌సన్ వ్యాధి / వణకుడు రోగం
### (Parkinson Disease)

**లక్షణాలు :**

1. భావం కోల్పోయిన ముఖ వర్చస్సు.
2. వణకు.

3. చేతులలోను, కండరములలోను బిగువు లేకపోవుట.
4. నడచునపుడు ముందుకు వంగి త్వరగా నడవబోయి పడబోవుట.
5. ఏదైన వస్తువును ఆధారంగా పట్టుకొనకున్న పడిపోవుట.
6. వెన్ను ముందుకు వంగి తలవంచి చేతులు శరీరం నుండి దూరంగ ఉంచుటకు ప్రయత్నించు చుండుట.
7. మాట్లాడుటకు ప్రయత్నించునపుడు కష్టంగ ఉండుట. తర్వాత త్వరగా మాట్లాడుట.

**నివారణోపాయాలు :**

1) పౌష్టిక ఆహారం తినాలి. 2) శరీర మర్దన చేయాలి.

**• చికిత్స •**

**ద్వాదశ లవణ మిశ్రమం :** ప్రతిరోజు ఉదయం 1 మోతాదు, రాత్రిపూట 1 మోతాదు గోరువెచ్చని నీటితో ఈ క్రింది మాత్రలను తీసుకోవాలి. కాలీఫాస్ 6× –1 మాత్ర + మెగ్నీషియంఫాస్ 25× – 1 మాత్ర + నేట్రంమూర్ 12× –1 మాత్ర + సైలీషియా 6× – 1 మాత్ర – మొత్తం 4 మాత్రలు.

## 8. ప్రక్క ఎముకలలో నరాల నొప్పి (Intercostal Neuralgia)

మన దేహంలో 12 జతల ప్రక్కటెముకలు గలవు. అవి దేహం లోపల ప్రాణాధారమైన అవయవములను కాపాడును. అవి ఛాతీ అస్థిపంజరమునకు ఆధారం. వాటికి సంబంధించిన నరాలలో కొంతమందిలో నొప్పి కలుగును.

**• చికిత్స •**

**మెగ్నీషియంఫాస్ 6×–25× :** ప్రక్కటెముకల నరాలలో నొక్కివేయునట్టి, లాగునట్టి నొప్పి.

## 9. నరాల నిస్త్రాణ (Neurasthenia)

**లక్షణాలు :**

1. కొద్ది శ్రమకే ఎక్కువగ అలసిపోవుట
2. నిత్య కృత్యములే భారముగ తోచుట
3. ఏకాగ్రత లోపించుట
4. జ్ఞాపకశక్తి తగ్గుట

5. మనోధైర్యము తగ్గుట
6. మాటిమాటికి విసుగుకొనుట
7. చిర్రుబుర్రులాడుట
8. నిద్రలేమి
9. తలత్రిప్పు
10. తలనొప్పి
11. గుండెదడ
12. శరీరంలో నొప్పులు
13. హిస్టీరియా లక్షణాలు

**కారణాలు :**

1. దీర్ఘ వ్యాధులు (చక్కెర వ్యాధి, అధిక రక్తపోటు మొ॥వి)
2. తీవ్ర మనోవ్యాకులత
3. హస్తప్రయోగపు అలవాటు
4. వంశపారంపర్యత
5. టీ / కాఫీ / సారాయి ఎక్కువగ త్రాగుట
6. నరాల బలహీనత
7. మాటిమాటికి వచ్చు కాన్పులు
8. కండరాలు పనిచేసినపుడు లాక్టిక్ యాసిడ్ అధికముగ పేరుకుపోవుట
9. శక్తినిచ్చే పోషక పదార్థాలు ఆహారంలో లోపించుట మొ॥ కారణాలు

**నివారణోపాయాలు :**

1. బలవర్ధకమైన ఆహారం తీసుకోవాలి.
2. పొగత్రాగుట, మత్తుపానీయములు సేవించుట చేయరాదు. మాదక ద్రవ్యాలు వాడరాదు.
3. అధిక సంభోగం చేయరాదు.
4. మానసికోద్రేకము పనికిరాదు.
5. ప్రశాంతంగా జీవించాలి.
6. మానసికోల్లాసము పొందాలి.
7. ఆహారం కొద్దికొద్దిగ చాలసార్లు తీసుకోవాలి.
8. ఆహారంలో మాంసకృత్తులు, పీచు పదార్థాలు, నెమ్మదిగ జీర్ణమయ్యే ఆహార పదార్థాలు ఉండాలి. సోయాబీన్, రాజ్‌మా ఎక్కువ పోషక పదార్థాలను సమకూర్చును.

**• చికిత్స •**

**కాలీఫాస్ 6× – 6× :** ఈ వ్యాధికి ఇది మంచి మందు. అధిక సంభోగం వల్ల ఈ వ్యాధి వచ్చిన దీనిని వాడవచ్చును. వెన్నెముక క్షోభ వల్ల ఈ వ్యాధి ఉన్నట్లు తెలియును. త్రికాస్థి నడుముకు క్రింది భాగాన నొప్పి, నిద్రలేమి, కపాలం, వీపులోను, నడుము యందు నొప్పి, తరచుగ మూత్ర విసర్జన, మానసికముగ క్రుంగుట, వెన్నెముక క్షోభకు సంకేతాలు.

**(డా॥ జే.సి. నాటింగ్‌హామ్)**

## 10. నరాలు కొంకర్లు పోవుట

కొంతమందిలో ఒక్కొక్కసారి చేతి / కాలి వ్రేళ్ళు బిగుసుకుపోయి క్రిందకు వంగి పోతాయి. అప్పుడు వ్రేళ్ళమీద వ్రేళ్ళు ఎక్కుతుంటాయి. కొంతసేపు తర్వాత అవి మాములు స్థితికి వస్తాయి. కాని విపరీతమైన బాధ కల్గుతుంది.

**కారణం :** కాల్షియం లవణం లోపించుట.

**నివారణోపాయాలు :**

1. వారానికి 2, 3 సార్లు 1, 2 తమలపాకులు (సున్నం, వక్క లేకుండా) తీసుకొని వాటికి తేనె పూసుకొని తినాలి. తమలపాకులలో కాల్షియం బాగా ఉంటుంది.
2. తెల్లనువ్వులు + బెల్లం దంచి ఉండలుగా చేసి తినవచ్చు.
3. రాగిపిండి జావ చేసుకొని త్రాగవచ్చు. రాగులలో కూడా కాల్షియం ఎక్కువగా ఉంటుంది.

**• చికిత్స •**

కొద్దిరోజులపాటు దిగువ సూచించిన విధంగా ఈ మందులు తీసుకోవాలి.

**ఉదయం :** కాల్కేరియాఫ్లోర్ 6× – 4 మాత్రలు.

**రాత్రి :** కాల్కేరియాఫాస్ 6× – 4 మాత్రలు.

## 11. సయాటికా / తుంటి నరము నొప్పి / కాలుజాలు (Sciatica)

సయాటిక్ నరము (శ్రోణినాడి) పెద్ద నరము. ఇది కటి వలయం / నడుము క్రిందిభాగం నుండి తొడ వెనుకభాగం లోనికి పోవును. పిక్క (మోకాలు క్రింది వెనుకభాగం) నుండి నరము యొక్క శాఖలు పాదములలోని కండరాల వరకు వ్యాపించి యున్నవి. ఈ విధంగా రెండు కాళ్ళలో సయాటికా నరం ఉంటుంది. ఈ నరములో వాపు, పోటు వస్తే సయాటికా అంటారు. ఇది పురుషులకు ఎక్కువగా వస్తుంది. ఇది యవ్వనంలో వస్తుంది. ఇది కాలు వెనుక భాగంలో వస్తుంది.

**లక్షణాలు :**

1. సయాటిక్ నరములో బాధ, నొప్పి వున్నట్లుండి కాని క్రమంగా కాని రావచ్చు.
2. మంటలాంటి నొప్పి / నమలినట్లు నొప్పి ఉంటుంది. ఈ నరము నడుము భాగములో పూసల మధ్య ఒత్తిడికి గురైనపుడు కాలులో జాలుగా ఉంటుంది. నరము లాగుతూ, తిమ్మిరిగా, గుంజినట్లు ఉంటుంది.
3. నొప్పి తొడ వెనుక భాగమున ప్రారంభమై పాదముల వరకు వ్యాపిస్తుంది.
4. నరము భాగం తాకనివ్వదు.
5. ఈ నొప్పి కొన్ని నెలలు బాధిస్తుంది. క్రమంగా కండరాలు సన్నబడతాయి.

**కారణాలు :**

1. నడుము వద్ద వెన్నెముకకు సంబంధించిన చక్రిక (disc) పొడుచుకు వచ్చి నాడీ మూలములను నొక్కుట.
2. వాతావరణ మార్పులు.
3. కీళ్ళవాతం, సిఫిలిస్, గౌట్ మొ॥ వ్యాధులు.

**ఉద్రేకాలు :** 1) రాత్రిపూట 2) కదలిక 3) తుఫాను ముందు.

**నివారణోపాయాలు :**

1. విశ్రాంతి.
2. వెన్నెముకకు సంబంధించిన శలభాసనం వంటి ఆసనాలు (exercises) ఆరంభమున ఒక పూట, 10 రోజుల తర్వాత రెండు పూటలు చేయాలి.
3. క్రింద కూర్చొనకూడదు. వంగే పనులు చేయరాదు.
4. వెల్లకిలా పడుకోవాలి. మోకాళ్ళక్రింద లావు దిండు ఉంచుకోవాలి.
5. కూర్చొన్నప్పుడు నడుము నిటారుగా ఉండాలి.

## • చికిత్స •

**కాలీఫాస్ 6× – 12× :** సయాటిక్ నరపు వ్యాధి – లాగుతున్నట్టి నొప్పి – జడత్వం / తిమ్మెర – బిర్రబిగియుట – అధికమైన అస్థిమితం – నొప్పి – నరాల బలహీనత – చలనమునకు సంబంధించిన ఉత్తేజన లేకుండుట – నెమ్మదిగ నడచుట వల్ల ఉపశమనం – నరముల శక్తి అంతయు పోవుట దీనివల్ల అలసట, ఏ పని చేయుటకు ఇష్టం లేకపోవుట, అస్తిమితం, కోపం, తలనొప్పి, నిద్రపట్టక పోవుట మొ॥ లక్షణాలు ఏర్పడుట.

**నేట్రంసల్ఫ్ 6× :** సయాటికా–గౌట్‌కు సంబంధించిన లక్షణాలు ఉండుట. తుంటి కీలులో నొప్పి–తన సీటునుండి లేచునపుడు/శయ్యలో కదులునపుడు నొప్పులు అధికమగుట.

**మెగ్నీషియంఫాస్ 6X :** సయాటికా నొప్పి – తాళలేని నొప్పి, ఈడ్పుల నొప్పి – ఈ నొప్పి వేడిమి వల్ల ఉపశమనం చెందుట.

**నేట్రంమూర్ 6X :** కుడి తుంటికీలు, మోకాలు నందు మరలా – మరలా వచ్చునట్టి బాధాకరమైన నొప్పి – తొడ వెనుక భాగపు కండర స్నాయువులు (Ham-strings) బాధతో ముడుచుకుపోవుట. కాలు శుష్కించుట – తాకిన బాధాకరముగ ఉండుట– వీపు మీద / వెల్లకిల పడుకొనినపుడు ఆ నొప్పులు మరలా వచ్చుట లేక నొప్పులు అధికమగుట – పగటిపూట కూడా – మధ్యాహ్నమునకు మరింత ఎక్కువగుట – వేడిమి వల్ల ఉపశమనం – క్వినైన్ వాడిన తర్వాత వచ్చు దీర్ఘకాలపు సయాటికా.

**సైలీషియా 6X – 12X :** సయాటికా (దీర్ఘకాలపు) – కదిలిన నొప్పి అగుట – తుంటిలో నొప్పి – నడచినప్పుడు పిక్కలు[1] చాల హ్రస్వముగ నున్నట్లు భావించుట.

**కాల్కేరియాఫాస్ 6X :** నొప్పితో ప్రాకుట – నొప్పి ముళ్ళు గ్రుచ్చుకొనుచున్నట్లుండుట – చల్లని వాతావరణంలో నొప్పి మరలా వచ్చుట – తుంటి ఎముకలో చీల్చునట్టి, శూలనొప్పి.

## 12. నిద్రలేమి
## (Insomnia / Sleeplessness)

ప్రతి ప్రాణికి విశ్రాంతి అవసరం. విశ్రాంతి క్రొత్త ఉత్సాహాన్ని ఇస్తుంది. విశ్రాంతి తర్వాత ప్రాణి చురుకుగ పనిచేయగలుగుతుంది. సాధారణంగ నిద్రలో ప్రతి ప్రాణికి పూర్తి విశ్రాంతి లభిస్తుంది. అహోరాత్రాలు పనిచేసే గుండె, ఊపిరితిత్తులు మొ॥ వాటికి విశ్రాంతి కలుగుతుంది. సాధారణంగా పెద్దవారి కంటె చిన్నవారిలో నిద్రపోయే సమయం ఎక్కువగ ఉంటుంది. అనేక కారణాల వల్ల కొందరు నిద్రలేమితో బాధ పడుతూ ఉంటారు.

**కారణాలు :**

1. మానసిక వ్యథలు, ఆందోళనలు
2. ఆకలి
3. మలబద్ధకం
4. కాళ్ళు – చేతులు చల్లగ ఉండుట
5. కాఫీ, టీలు అధికంగ త్రాగుట
6. అనారోగ్యం
7. కుటుంబ సమస్యలు
8. ఆతురత మొ॥ కారణాలు. ఈ కారణాల వల్ల రక్తప్రసరణ అధికమై నిద్ర పట్టదు

**నివారణోపాయాలు :**

1. కాళ్ళు - చేతులు వెచ్చగా ఉంచుకోవాలి.
2. కప్పుకొని పడుకొనుట మంచిది.
3. నిద్రించుటకు ముందు వెచ్చని నీటితో స్నానం చేయాలి.
4. నిద్రించుటకు 3 గంటల ముందే సాయంత్రపు భోజనాన్ని ముగించాలి.
5. కాఫీ, టీలు త్రాగరాదు.
6. నిద్రించునపుడు ప్రశాంతంగా ఉండాలి.
7. కాళ్ళు, పాదాల మంట వల్ల నిద్రరానిచో పాదాలను 15 నిముషాలు వేడినీటిలో ఉంచాలి. తర్వాత చన్నీటితో పాదాలను కడుగుకొని నిద్రించాలి.

## • చికిత్స •

**మెగ్నీషియంఫాస్ : (జే.సి.మోర్గన్)** అలసట / మెదడుకు పోషణనిచ్చు పదార్థాల కొరత వల్ల నిద్రలేమి - నరాల బలహీనత, భావోద్వేగం వల్ల నిద్రలేమి.

**ఫెర్రంఫాస్ 6×-12×:** రక్తం అధికముగ చేరుట వల్ల నిద్రలేమి - హాయిగా నిద్రపోయే వారు కూడ మేల్కొని యుండుట - రాత్రిపూట విశ్రాంతి లేని నిద్ర - కుతూహలకరమైన కలలు - మధ్యాహ్నం తర్వాత నిద్రమత్తు.

**కాలీమూర్ 6×:** ఏమాత్రం శబ్దమైనా ఉలిక్కిపడుట - నిద్రలేమి, విశ్రాంతి లేని నిద్ర.

**కాలీఫాస్ 3×-30×:**

★ సాధారణంగా దిగులు, ఉత్తేజం, వ్యాపారపు ఇబ్బందులు, నరాల కారణాల వల్ల నిద్రలేమి.

★ అధికంగా శ్రమించుట వల్ల నిద్రలేమి.

★ చిరచిరలాడుట, మానసికముగ క్రుంగుట, తరచుగ మూత్ర విసర్జన లక్షణాలతో.

★ పిల్లల నిద్రలేమికి ఈ మందును వరుసగ వాడాలి.

★ ఆవలింతలు, సాగదీయుట, అలసట; నిప్పు, బందిపోటు దొంగలు, క్రిందపడుట, భూతాలు మొదలైనవాటి కలలు, పిల్లలు రాత్రిపూట భయపడుట, గాఢనిద్ర నుండి మేల్కొనుట, భయంతో కేకలు వేయుట.

★ కామాతురత గల కలలు.

★ గాఢంగా నిద్రపోయిన తర్వాత కండరాల అదరుపాటు.

**నేట్రంఫాస్ 6×:** నిద్రమత్తు భావన ఉన్నా నిదురపోలేక పోవుట.

**కాలీసల్ఫ్ 3×-6×:** చాలా వివరాలతోనున్న కలలు.

**నేట్రంమూర్ 6×-30×:**

- ★ మెదడులో అధికంగా తేమచేరుట వల్ల నిద్రలేమి.
- ★ నిద్రమత్తు–సాధారణంగా నిద్రపోయినట్లు నిద్రపోవుటవల్ల శక్తి/చైతన్యం కలగ కుండుట.
- ★ అధికంగా, ఎల్లప్పుడూ నిద్రించాలనే కోరిక ఉండుట
- ★ నిద్రమత్తు – నోటి నుండి చొంగ బొట్లుబొట్లుగా కారుట
- ★ నరాల ఉద్రేకం వల్ల నిద్రలేమి – కాళ్ళ చల్లదనంతో
- ★ విశ్రాంతి లేని నిద్ర, ఆలస్యంగా పడుకొనుట, నిద్రలో తరచుగా అదరుట.

**నేట్రంసల్ఫ్ 3×-6×:** నిద్రమత్తు రాబోవు కామెర్లకు సంకేతం – నాలుకపై బూడిదరంగు/గోధుమ – ఆకుపచ్చ పూత, ఇతర పైత్యాధిక లక్షణాలతో – ఆయాసం వల్ల మేల్కొనుట.

**కాల్కేరియాఫ్లోర్ 3×-12×:** ఆహ్లాదకరంకాని, విశదంగా ఉన్న కలలు – రానున్న అపాయం, చావు, క్రొత్త దృశ్యాలు/ప్రదేశాలు మొదలైన వాటిని సూచించు కలలు.

**కాల్కేరియాఫాస్ 6×-12×:** వృద్ధుల దుఃఖకరమైన ఆలోచనలతో కలుగు నిద్రమత్తు, ఉదయాన కష్టంగా లేచుట – నిరంతరం సాగదీయుట, ఆవలించుట – పిల్లలు రాత్రులందు కేకలువేయుట.

**గమనిక :** నిద్రలేమిని నివారించే ఏ మందైనా మెదడులోని కణముల ఉత్తేజక శక్తిని పూర్వస్థితికి తెస్తుంది. దానివల్ల ధమనులు సంకోచిస్తాయి. తత్ఫలితంగా మెదడుకు ప్రవహించే రక్తపు ప్రవాహం తగ్గుతుంది. ఆ విధంగా ఆరోగ్యప్రదమైన నిద్ర వస్తుంది.

## 13. మూర్ఛ
## (Epilepsy)

ఇది నరములకు సంబంధించిన వ్యాధి. స్త్రీ, పురుష భేదం లేకుండా ఎవరికైనా రావచ్చు.

**లక్షణాలు :**

1. **ఆరా :** మూర్ఛ రావటానికి పూర్వం ఆ రోగులకు కొన్ని భ్రమలు కలుగును. వారు లేని వాటిని వున్నట్లుగా భావిస్తారు. ఆ భ్రమలను 'ఆరా' అని అంటారు. కంటి ముందు వింత వింత బొమ్మలు, వివిధ రంగులు కనిపించుట, చెవులకు విపరీతమైన ధ్వనులు వినిపించుట, నోటికి క్రొత్తక్రొత్త రుచులు తగులుచున్నట్లు, ముక్కు దుర్వాసన చూస్తున్నట్లు, చర్మం క్రింద పురుగులు ప్రాకినట్లు, తలనొప్పి, తలత్రిప్పు వున్నట్లు, ఛాతీపై పెద్ద బరువున్నట్లు వారు భ్రమింతురు. కాని ఒక్కొక్క మూర్ఛ రోగికి ఒక్కొక్క భ్రమయే కలుగును. అది మూర్ఛ రాబోతున్నదని ఒక సూచన/హెచ్చరిక.

*1. పిక్క : మోకాలు క్రింది వెనుకభాగం.*

**2.** మూర్ఛ అకస్మాత్తుగా వచ్చును. నిల్చున్నవాడు స్మారకం లేక పెద్ద కేక వేసి కూలిపోవును.

**3.** మూర్ఛ రోగి కాళ్ళు–చేతులు చాచి ధనుస్సు ఆకారంలో వెనుకకు వంగును. తల ప్రక్కకు/వెనుకకు తిరిగిపోవును. కాళ్ళు–చేతులు కొట్టుకొనును. అనగా వాటిలో కంపనములు వుండును. ముఖం వికృతంగా మారిపోవును. కనుగ్రుడ్లు కనురెప్పల క్రిందకు పోయి తెల్లగ్రుడ్లు మాత్రమే కనిపించును. వెలుతురు చూడలేకపోవును. దీనివల్ల రోగికి దెబ్బలు, గాయములు తగలవచ్చు. నోటి వెంట నురుగులు వచ్చును. నాలుక కరచుకొనును. దీని వల్ల పుండ్లు పడి రక్తస్రావం జరగవచ్చు. బొటనవ్రేళ్ళు గుప్పెళ్ళలో పట్టి గట్టిగా పట్టుకొనును. దంతములు గట్టిగ బిగబట్టి యుండును. మలమూత్రములు అప్రయత్నముగా వెడలుచుండును. శరీరమంతా చెమటలు పట్టును.

**4.** కొన్ని నిమిషముల తర్వాత రోగతీవ్రత తగ్గిపోవును. నిద్ర పోయి మగత వచ్చును. మరికొన్ని నిమిషాల తర్వాత పూర్తిగా స్పృహలోనికి వచ్చును.

**కారణములు :** మూర్ఛ వచ్చుటకు గల కారణం సరిగా తెలియదు. సాధారణంగా దానికి గల కారణాలు ఈ విధంగా పేర్కొనబడును – 1) వంశపారంపర్యత 2) క్రిములు 3) శారీరక, మానసిక ఉద్రేకము 4) మెదడుకు సంబంధించిన వ్యాధులు (మెదడువాపు, మెదడులో ట్యూమర్), 5) భయం 6) అజీర్ణం 7) వాతప్రకోపం 8) తలకు దెబ్బతగులుట 9) ఆల్కహాలు/సారాయి/మద్యం సేవించుట, 10) సిఫిలిస్ వ్యాధి.

**నివారణోపాయాలు :**

1) మూర్ఛ వచ్చినప్పుడు ఆ రోగి ముఖముపై చల్లని నీటిని చల్లవలెను. అతనికి దెబ్బ తగలకుండా కాపాడాలి. దంతముల మధ్య గుడ్డ పెట్టి నాలుక కొరకకుండా చూడాలి. అతని దుస్తులు తొలగించి అతనికి గాలి తగులునట్లు చూడవలెను. 2) మందుల అవసరం లేకుండానే కొన్ని సందర్భాలలో మూర్ఛరోగం నయంకావచ్చు. కాని ఆ తర్వాత కూడా కొంతకాలంపాటు మందులు వాడుట మంచిది. లేనిచో మూర్ఛ మరలా రావచ్చు. 3) మూర్ఛ రోగికి మందులకన్నా ప్రశాంత వాతావరణం ముఖ్యం. అందుకు గాను అతనిని ఎల్లప్పుడు ఆనందంగా, ప్రసన్నంగా వుంచాలి. అతనికి దుఃఖం కలిగించుట లేక దుఃఖమును కలిగించు విషయములను చెప్పుట చేయరాదు. అతనికి సత్‌సాంగత్యం చాలా అవసరం. 4) మూర్ఛరోగి కాఫీ, టీ, బీడీ, సిగరెట్లు వాడరాదు. 5) మూర్ఛరోగి మసాలాలు మానుకోవాలి. సాత్విక ఆహారం భుజించాలి. పండ్లు, శాకాహారం మంచిది.

**మూర్ఛకు, అపస్మారకమునకు గల భేదములు :**

మూర్ఛ, అపస్మారం/హిస్టీరియా ఒకే విధంగా కనిపిస్తాయి. కాని అవి రెండూ వేర్వేరు జబ్బులు. వాటి భేదములు క్రింద పేర్కొనబడినవి.

**మూర్ఛ** (Epilepsy)

1. స్త్రీ, పురుషులకెవరికైనా రావచ్చు.
2. లేతవయస్సు వారికైనా రావచ్చు.
3. రోగి వెంటనే స్పృహ తప్పిపడిపోతాడు.
4. రోగి ముఖం పాలిపోయి వుండును.
5. రోగికి ఆరా వుంటుంది. బంతి/చెండును గురించి ఎలాంటి భ్రమ వుండదు.
6. రోగి పడిపోవుటకు పూర్వం పెద్ద పెద్ద కేకలు వేయును.
7. మూర్ఛ వచ్చినపుడు అనేక లక్షణాలు కనిపించును.
8. మూర్ఛ సామాన్యంగా రాత్రిపూట వచ్చును.
9. ఫిట్టు కొద్దినిమిషాలు మాత్రమే వుంటుంది.
10. ఫిట్టు తర్వాత మగత వచ్చి రోగి గాఢ నిద్ర పోవును.

**అపస్మారకం** (Hysteria)

1. సాధారణంగా స్త్రీలకే వస్తుంది.
2. లేతవయస్సు వారికి రాదు.
3. రోగి పూర్తిగా స్పృహ కోల్పోడు.
4. రోగి ముఖం గాంభీర్యం చుకొని మామూలుగా వుండును.
5. రోగికి ఎలాంటి ఆరా వుండదు. కాని కడుపులోని ఒక బంతి/చెండు మెదడులోనికి పోయినట్లు భావించును.
6. రోగి ఎలాంటి కేక వేయకుండా పడిపోవును.
7. అపస్మారకములో ఆ లక్షణాలేవీ వుండవు.
8. అపస్మారకం రాత్రిపూట వచ్చుట చాలా అరుదు.
9. ఫిట్టు చాలా సేపు వుంటుంది.
10. అపస్మారకంలో మగతగాని నిద్రగాని వుండదు. ఫిట్టు తగ్గగానే రోగి లేచి కూర్చొనును.

## • చికిత్స •

**కాలీమూర్ 3× - 6× :** ఇది మూర్ఛకు ఒక ప్రధానమైన సిద్ధౌషధం, గజ్జి మొదలగు చర్మవ్యాధులను అణచినపుడు లేక ఆ వ్యాధులను అణచిన తర్వాత వచ్చు మూర్ఛకు ఈ మందు బాగా ఉపయోగపడును.

**కాలీఫాస్ 3×-6× :** మూర్ఛలో కంపములు, పాలిపోయిన ముఖం, శరీరం చల్లబడుట, నాడికొట్టుకొనుట మొదలైన లక్షణాలు వున్నచో ఈ మందు ఉపయోగకారి.

**మెగ్నీషియంఫాస్ 3×-6× :** మూర్ఛలో కంపముల వలన అవయవములు ముడుచుకొని పోవుట, తలవెనుకకు తిరిగిపోవుట, రోగి తన బొటనవ్రేళ్ళను గుప్పెళ్ళలో పెట్టుట, పళ్ళు బిగబట్టుట, కాళ్ళు-చేతులు వంకరపోవుట, కొయ్యబారుట మొదలైన లక్షణాలున్నచో ఈ మందును వేడినీటితో ఇవ్వాలి.

**ఫెర్రంఫాస్ 3×-12× :** రక్తం తలకు వడిగా ప్రవహించుట వల్ల వచ్చు మూర్ఛకంపములు - దీనిని కాలీమూర్‌తో మార్చి ఇవ్వాలి.

**నేట్రంఫాస్ 3×-6× :** ప్రేగులలో పురుగులు వుండుట వల్ల వచ్చు కంపములకు శ్రేష్ఠమైన మందు. దీనిని ఇతర మందులతో మార్చి వాడాలి.

**నేట్రంసల్ఫ్ 3×-20× :** తలకు తగిలే దెబ్బలవల్ల వచ్చు ఈడ్పులకు బాగా పనిచేయును.

**సైలీషియా 6×-12× :** రాత్రియందు కలుగు మూర్ఛ - కంపములు రాకపూర్వం శరీరము చల్లగా వుండును. ఈడ్పులు జీర్ణకోశపు వెనుక భాగమున గల కూడలినుండి పైకి ఎగబ్రాకును. నాష్ ప్రకారం అమావాస్యకు ఎక్కువగు మూర్ఛకిది బాగా ఉపయోగపడును. ఛాప్‌మన్ ప్రకారము రాత్రిపూట, పౌర్ణమియందు ఎక్కువగు మూర్ఛలకిది మంచి పనిచేయును.

**కాల్కేరియాఫాస్ 3×-6× :** ముష్టి మైథునం వంటి దురలవాటుకు లోనైనవారికి, రక్తహీనులకు వచ్చు మూర్ఛకు పనిచేయును.

## 14. హిస్టీరియా / అపస్మారకం
### (Hysteria)

హిస్టీరియా/అపస్మారకము యుక్తవయస్సు వచ్చిన స్త్రీలకు వచ్చును. పురుషులకు ఈ వ్యాధి చాలా అరుదుగా వస్తుంది.

**లక్షణాలు :**

1. స్పృహ పూర్తిగా పోదు
2. ఉదరము నుండి ఛాతీ ద్వారా మెదడులోనికి ఒక చెండు ప్రాకుచున్నట్టి భావన కలుగుట
3. కంపములు
4. కడుపుబ్బరం
5. మూత్రబంధనం
6. తలనొప్పి
7. వాంతులు
8. గట్టిగ అరచుట
9. కడుపునొప్పి

10. మ్రింగలేకుండుట
11. కాలేయములో నొప్పి
12. మాటలాడలేకపోవుట.
13. చూపు మందగించుట.
14. వింతచేష్టలు – తనలోతాను నవ్వుట/ఏడ్చుట/గొణుగుట
15. ఇతరులను చూసి అకారణముగ వెక్కిరించుట
16. మానసిక ఆందోళన

**కారణాలు :**

1. దీర్ఘకాల మనోద్రేకం
2. దీర్ఘకాల మనోవ్యథ
3. దుఃఖం
4. తగిన శారీరక శ్రమ/వ్యాయామం లేకుండుట
5. జీవశక్తి (vitality) తగ్గిపోవుట
6. వంశపారంపర్యత

**నివారణోపాయాలు :**

1. హిస్టీరియా ఫిట్టు రాగానే రోగి శరీరముపైనున్న దుస్తులను వదులుచేసి అతనికి గాలి తగిలేటట్టు చేయాలి.
2. రోగి ముఖముపై చల్లని నీరు చల్లాలి.
3. రోగిని స్నేహితులకు, అతడు అలవాటుపడిన పరిసరాలకు దూరంగా వుంచాలి.
4. రోగికి విశ్రాంతినివ్వాలి. అతనికి ప్రశాంత వాతావరణం కల్పించాలి.
5. మసాలాలు లేని శాకాహారమిచ్చుట ఉత్తమం.

## • చికిత్స •

క్రింది మందులను లక్షణాలనుబట్టి 2 గంటలకొకసారి ఇవ్వాలి.

**కాలీఫాస్ 3×–30× :** అత్యధికముగ తేలికగా ఉత్తేజం చెందునట్టివారిలోను, ఆవేశపడు వ్యక్తులలోను తమ భావాల/ అణచబడిన భావాలవల్ల అకస్మాత్తుగ తీవ్రముగ వచ్చు స్త్రీల హిస్టీరియా – నవ్వు, ఏడ్పుకు సంబంధించిన ఫిట్స్, అపస్మారక మునకు సంబంధించిన ఆవలింతలు, కంపనములు, ఈడ్పులు, లోలోపల గొణగుట, స్పృహ కోల్పోవుట, సంధి లక్షణాలు – గొంతులో నుండి బంతిలేస్తున్నట్లనిపించుట.

**నేట్రంమూర్ 6×–30× :** ఎట్టి కారణము లేకుండగానే అమితముగా క్రుంగుట – ఏడ్పు స్వభావం, ఓదార్పు వలన ఏడ్పు అధికమగుట – మలబద్ధకం – ప్రాముఖ్యం లేని

స్వల్ప విషయాలపై కోపపడుట, చిరచిరలాడుట – బహిష్టు ఆలస్యముగా వచ్చుట/ బహిష్టు రక్తస్రావం తక్కువగా వుండుట – రాత్రిపూట గుండెదడతో లేచుట – సంతోషంవల్లగాని, పాత ఆలోచనల వల్లగాని రాత్రిపూట నిద్రనుండి మేల్కొన్న నిద్ర మరలా రాకపోవుట – తరచుగా తలనొప్పి, చిన్న సుత్తులతో కొట్టినట్టి నొప్పి – మానసిక శ్రమను యిష్టపడకుండుట – జ్ఞాపకశక్తి లేకపోవుట – హిస్టీరియా సంబంధమగు ఈడ్పులు/ కంపములు – బలహీనత – చెమట పట్టగానే ఈ లక్షణాలు తగ్గుట – ఈ మందును కాలీఫాస్‌తో మార్చిన మంచిది.

**కాల్కేరియాఫాస్ 6×** : రక్తక్షీణత గలవారికి లక్షణాలను బట్టి పైమందులలో దేనినైనా దీనితో మార్చి వాడాలి.

## 15. భయం
## (Fear)

భయం మానవ సహజ లక్షణంగా కనిపిస్తుంది. ప్రాచీన కాలం నుండి భయం అనేది మానవునిలో ఉంటున్నది. కాని కాలాన్ని బట్టి భయం స్వరూపం మారుతున్నది. మనిషి – మనిషికి భయపడే వస్తువులో తేడా ఉంటుంది. భయానికి స్త్రీ–పురుషుల భేదం కాని, వయస్సు తేడా కాని ఏమీ ఉండదు. చీకటి, ఘర్షణలు, గుంపులు లేక ఒంటరితనం కొంతమందికి భయము కలిగించును. విద్యార్థులకు పరీక్షలంటే భయం. కొంతమందికి బల్లి/కప్ప అంటే కూడ భయం. కొంతమంది కలలలో దొంగలు/భూతాలు/ రాక్షసులను చూసినా భయపడతారు. నీళ్ళంటే భయపడేవారు ఉన్నారు.

### • చికిత్స •

**కాలీఫాస్ 6×–30×** : ఇంట్లో కన్నంవేసి దొంగలు పడతారనే భయం – గుంపులో/ ఒంటరిగ ఉండాలన్న భయం – భవిష్యత్తును గూర్చిన భయం – ఇంటిమీద బెంగవల్ల భయం – ఆరుబయట తీవ్రభయం – 'నీరు' అనే శబ్దమన్నా రాత్రిపూట భయపడుట **(మెగ్నీషియంఫాస్)** – ఎత్తైన భవనములన్నా, పరీక్షలన్నా భయం – నరాల వ్యాధులలో అమిత భయం.

**నేట్రంమూర్ 6×–30×** : ప్రతి చిన్న విషయానికి అనవసరంగా భయపడుట – గుంపు, దొంగలంటే భయం – నడచునపుడు క్రింద పడతానని భయం – విషం పెట్టుదురని భయం – భవిష్యత్‌మీద అమిత భయం.

**నేట్రంసల్ఫ్ 6×–30×** : శబ్దాల వల్ల భయం – ఆత్మహత్య చేసుకొను స్వభావం.

**కాల్కేరియాఫాస్ 6×–30×** : దుర్వార్తలన్నా, చీకటి అన్నా భయం.

**కాల్కేరియాఫ్లోర్ 6×-30× :** పేదతనం అన్నా భయం – ఆర్థికంగా నాశనమగుదునని భయం.

**కాల్కేరియాసల్ఫ్ 6×-30× :** చావు అంటే భయం – చీకటి అంటే భయం.

**సైలీషియా 6× - 30× :** క్రిందకు పడిపోవుదునేమో అని భయం – పదునైన వస్తువుల వల్ల హాని కలుగునేమో అని భయం.

## 16. కోపం (Anger)

"తన కోపమే తన శత్రువు" అని మన పెద్దలు చెప్పియున్నారు. దీనిని బట్టి కోపము వల్ల ఎట్టి అనర్థాలు సంభవించునో తెలియుచున్నది. కోపం అనేది కొత్తదేమీ కాదు. ప్రాచీన ఆదిమ మానవుని నుండి నేటి మానవుని వరకు ఇది సుపరిచితమే. ప్రతి వ్యక్తికి ఏదో ఒక సందర్భములో కోపము రాకమానదు. కోపపడని సందర్భమంటూ ఏ వ్యక్తి జీవితములోను కనిపించదు. కోపపడుటకు అనేక కారణాలు వుంటాయి. నేటి యుగములో ఈ కారణాల స్వరూపం కూడా మారిపోయింది.

**నివారణోపాయం :**

కోపం వచ్చినప్పుడు నిగ్రహించుకొన్నచో కొన్ని సందర్భాలలో కోపం తగ్గిపోతుంది. అందుకే మన పెద్దవారు కొద్దిగా నీరు త్రాగమంటారు లేదా 1 నుండి 10 వరకు అంకెలు లెక్కపెట్టమంటారు. ఇలా చేస్తే కొంత సమయం గడుస్తుందనియు, ఆ సమయంలో కోపం తగ్గవచ్చునియు వారి భావన.

**• చికిత్స •**

కోపం వచ్చినప్పుడు, ఆ తర్వాత కలుగు రుగ్మతలకు ఈ మందులు వాడవచ్చు.

**కాల్కేరియాఫాస్ 6×-200× :** తనకు ఎదురుచెప్పిన వచ్చు కోపము.

**నేట్రంమూర్ 6×-200× :** లోలోపల దుఃఖించుట – చిర చిర లాడుట – ఓదార్చిన కోపము అధికమగుట.

**ఫెర్రంఫాస్ 12× :** కోపము వచ్చినపుడు వణకుట.

**కాలీమూర్ 6×, నేట్రంఫాస్ 6× :** చిన్న విషయాలకు కూడా కోపపడుట.

**కాల్కేరియాసల్ఫ్ 6×, కాలీసల్ఫ్ 6× :** తొందరగా కోపపడుట.

**సైలీషియా 12× :** ఎల్లప్పుడు కోపము, ఆవేశము – చిన్న విషయాలను కూడా జ్ఞాపకముంచు కొనుట – ఎదురు మాట్లాడిన సహించలేకపోవుట.

# 17. సంధి - త్రాగబోతుల వాగుడు
## (Delirium)

తీవ్ర శారీరక వ్యాధిచే గాని, మానసిక వ్యాధివల్ల గాని మెదడు అడుగు భాగాన నీరు ఎక్కువ అగును. అప్పుడు ఒత్తిడి ఎక్కువై నాడీమండలంలో అదరుపాటు సంభవించును. సంధి లక్షణాలు (మానసిక, శారీరక ఆందోళన, అస్థిమితం, అనుమానం మొదలైనవి) కన్పిస్తాయి. అప్పుడు క్రింది మందులను లక్షణాలను బట్టి 2 గంటలకొకసారి వాడాలి.

**నివారణోపాయాలు :**

1) రోగిని ప్రశాంతంగా వుంచాలి. 2) అనవసరమైన శబ్దాలను నివారించవలెను. 3) జ్వరము, సంధి లక్షణాలు కనిపించినప్పుడు తలపై ఐస్‌బ్యాగ్‌పెట్టాలి.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 12× :** ఎక్కువగా జ్వరమున్నప్పుడు వాడనగును. ముఖం ఎర్రగానుండుట – నాడి వడిగా కొట్టుకొనుట – తలదిమ్ము, తలనొప్పి అధికముగా వుండుట – ఈ లక్షణాలతోనున్న సంధి.

**నేట్రంమూర్ 3×-6× :** ఏ సమయములోనైనా వచ్చు సంధి – ఉలికిపాటు – అస్థిరమైన సంధి – గొణగుట – నాలుకపై బుడగలతోనున్న నురుగు – వెయ్యి చిన్న సుత్తులతో కొట్టినట్లుగా తలనొప్పి – త్రాగబోతుల వాగుడుకు ముఖ్యమైన మందు. ఈ మందు పనిచేయనిచో కాలీఫాస్ వాడాలి.

**కాలీఫాస్ 6× :** త్రాగబోతుల వాగుడు – త్రాగబోతుల బాధలు (భయం, నిద్రలేమి, విశ్రాంతి లేకపోవుట, అనుమానం, ఇష్టమొచ్చినట్లు మాట్లాడుట, లేనివాటిని ఉన్నట్లు భావించుట మొదలైనవి). ఈ వ్యాధిలో కోల్పోయిన మెదడు స్థిరత్వాన్ని తిరిగి సంపాదించుటకు ఈ మందు బాగా ఉపయోగపడును.

# 11

# కండరాల వ్యాధులు

## (DISEASES OF MUSCLES)

## 1. ఈడ్పులు, కంపములు మొదలైనవి
### (Spasms, Convulsions etc.)

**1. కంపములు (Convulsions) :** ఇచ్ఛాధీన కండరములు శరీరమంతటగాని, ఒక భాగమందుగాని దగ్గరకు ముడుచుకుపోవును. ఆ భాగమున పట్టు వదులుగ అగును. ఆ భాగమున కంపములు ఉద్ధృతమగును. స్పృహ ఉండవచ్చును/లేకపోవచ్చును.

**2. ఈడ్పులు (Spasms) :** ఇవి అనేక రకములు –

1) నాడీమండల వ్యాధి స్థితులచే కలుగునవి (Idiopathic spasms)
2) అన్నవాహికకు కలుగు వ్యాధులందు సానుభూతిగ కలుగు పొర్లు (Sympathetic spasms). అజీర్ణం, పొంగు, మసూచి, టైఫాయిడ్ మొదలగు జ్వరములందు ఈ కంపములు కలుగును.
3) కొన్ని కంపములు నమలుటకు ఉపకరించు కండరములకు మాత్రమే కలుగును. వాటిని Trismus spasms అని అందురు.
4) కొన్ని కంపములు రక్తం విషపూరితమగుటచే కలుగును. వాటిని Toxic spasms అని అందురు.

**3. ధనుర్వాతం (Tetanus) :** ఇది అంటు వ్యాధి. సాధారణముగా ప్రాణాపాయకరమైనది. కండరములు ఎడతెగకుండా బిగ్రబిగించి కంపములు/పొర్లు ఉండును. పొర్ల యందు శరీరం విల్లు వలె వంగి, రోగి మడమల మీద, తలమీద ఆనును. పళ్ళుబిట్టకరయును. అలసిపోవుటవల్ల లేక ఊపిరాడకపోవుటవల్ల రోగి చనిపోవచ్చును. కాని మనసు చివరవరకు బాగుగనే యుండును.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6×–12× :** దంతములు వస్తున్న పిల్లలలో జ్వరంతోపాటు వచ్చు కంపములు.

**కాలీఫాస్ 6×–12× :** ★ భయం వల్ల కలుగు కంపములు–పాలిన/కమిలిన రంగుగల ముఖాకృతి కలిగిన వారలలో ★ వెర్రి/అపస్మారకం ఈడ్పులు–స్పృహ లేకుండుట, మెల్లగ గొణుగుట.

**మెగ్నీషియంఫాస్ 6×–25× :** ★ దేహంలో కాళ్ళు, గొంతు, స్వరపేటికలు గల భాగం మొదలైన దేహ అవయవములలో కండరములు బాధాకరముగ, అప్రయత్నముగ దగ్గరకు ముడుచుకుపోవుట.

★ రచయితల కంపములు
★ కండరములు ముడుచుకుపోవుట, అదురుచుండుట, ఈడ్పులు
★ నోటిమూలలు బిర్రబిగియుట, కంపములు
★ మింగే ప్రయత్నం చేయునపుడు గొంతుకు ఈడ్పులు వచ్చుట, ఈడ్పులతో కూడిన నత్తి
★ కండరం దీర్ఘకాలం ముడుచుకుపోయి బిర్రబిగియుట – కండరములు తీవ్రంగా ముడుచుకుపోవుట – కండరాలు బిర్రబిగియుట – ఈ విధంగా చాలాకాలం/కొంతకాలం తర్వాత వచ్చుట.
★ ధనుర్వాతం – దీనికి ఈ మందుతో చిగుళ్ళను రుద్దాలి.

**కాల్కేరియాఫాస్ 6×–12× :** దంతములకు సంబంధించిన కంపములు – జ్వరం లేకుండుట – మెగ్నీషియంఫాస్ పనిచేయనపుడు దీనిని వాడాలి.

★ బాల్యం/యౌవనం/వృద్ధాప్యంలో సున్నపు లవణాలు పనిచేయకపోవుటవల్ల వచ్చే కంపములు (fits).
★ రక్తహీనత కలవారు/పాలిపోయినవారు/క్షయతత్త్వం కలవారికి ఈ మందు బాగా పనిచేస్తుంది.
★ అన్ని రకాల కండరములు బాధాకరముగ, అప్రయత్నముగ దగ్గరకు ముడుచుకుపోవుటవల్ల కలుగు నొప్పులకు మెగ్నీషియాఫాస్ పనిచేయనపుడు దీనిని వాడాలి.

## 2. పిక్కల కండరాల నొప్పులు
## (Pains of Calves)

మోకాలు క్రింద, దాని వెనుక భాగమున ఉండు కండర భాగమును కాలిపిక్క అని అంటారు. కూర్చొనునపుడు శరీరం దీనిమీదనే ఆనును. కొంతమంది ఈ పిక్కల నొప్పులతో బాధపడుతుంటారు.

**కారణములు :**

1) పౌష్టిక ఆహారలోపం 2) ఎక్కువగా పనిచేయుట/నడచుట. 3) ఉప్పు, మెగ్నీషియం వంటి లవణాల లోపం.

**నివారణోపాయములు :**

1) ముతకబియ్యంతో వండిన అన్నం తినాలి. 2) మధ్యాహ్నం భోజనంలో పాలకూర వంటి దానిని ఎక్కువగా పెట్టుకొనితినాలి. దీనివల్ల లవణాల లోపం నశిస్తుంది. 3) పిక్కలకు కొబ్బరినూనె రాసి మర్దనచేయాలి. తర్వాత 10 నిమిషాలపాటు వేడినీటి కాపడం పెట్టుకోవాలి.

**• చికిత్స •**

**కాల్కేరియాసల్ఫ్ 6X :** పిక్కలలో ఈడ్పులు (కంపములు) – తుంటి ఎముక క్రింది భాగపు నొప్పి – బాగా దాహం, ఆకలి ఉండుట – వమన వికారం, తలత్రిప్పు.

**నేట్రంమూర్ 6X :** మోకాళ్ళలోను, పిక్కలలోను బలహీనత – కాలివ్రేళ్ళ మధ్య చీలికలు – భవిష్యత్తుని గురించి నిరాశ, ఉత్సాహం క్రుంగిపోవుట.

## 3. పిక్కల కండరాలు ముడుచుకుపోవుట
## (Cramps in Calves)

పిక్క కండరాలు ముఖ్యంగా రాత్రిపూట అప్రయత్నంగా ముడుచుకొనిపోవును. ఆ సమయమున విపరీతమైన బాధ ఉండును.

**కారణం :** నాడుల, కండరాల క్రియాశీలత్వానికి కారణభూతములైన లవణాల లోపం.

**నివారణోపాయం :** ఈ వ్యాధి ప్రారంభదశలో వున్నప్పుడు పాదపు వేళ్ళను వెనుకకు వంచిన బాధ తాత్కాలికముగా తగ్గును.

**• చికిత్స •**

**మెగ్నీషియంఫాస్ 3X–6X :** ఇది ఈ వ్యాధికి ముఖ్య మందు. దీనిని వేడినీటితో తీసుకోవాలి.

**కాల్కేరియాఫాస్ 6X–12X :** రక్తక్షీణతగలవారికి దీనిని వాడాలి. దీనిని మెగ్నీషియం ఫాస్‌తో మార్చి వాడిన సత్ఫలితాలు లభించును.

## 4. వ్రాతగాండ్ల కండరాల ఈడ్పు
## (Writers' Cramp)

నిత్యం వ్రాయుచుండెడి వారిలో వ్రాయుటకు ఉపయోగపడెడి కండరములలో బాధ కలుగును. అప్పుడు అవి దగ్గరకు ముడుచుకుపోవును. దీనిని ఈడ్పు అని అందురు. దీనివల్ల ముంజేతిలోను, హస్తంలోను, వ్రేళ్ళలోను కండరములందు బాధ కలుగును.

**• చికిత్స •**

**నేట్రంఫాస్ 6X :** వ్రాయునప్పుడు చేయి వణకుట – ఈడ్పు నొప్పి – చేతివ్రేళ్ళ కీళ్ళ వాత రోగములో నొప్పులు – చేతి మణికట్టులో నొప్పి.

**కాలీమూర్ 6X :** వ్రాయునప్పుడు చేతులు బిర్రబిగియుట/కొయ్యబారుట.

**మెగ్నీషియంఫాస్ 6X :** దీనిని తరచుగా వాడి ఫలితం పొందవచ్చు.

**కాల్కేరియాఫాస్ 6X :** చేతివ్రేళ్ళలోను, మణికట్టులోను ఈడ్పువంటి నొప్పి – రక్తక్షీణత గలవారికి ఈ మందు బాగా పనిచేయును.

# 12

# కీళ్ళ వ్యాధులు

## (JOINTS' DISEASES)

### 1. కీళ్ళవాపు (Arthritis)

కీళ్ళవాపును ఆర్థరైటిస్ అని అంటారు. ఇది అనేక రకాలు – 1) ఎముకల ఆర్థరైటిస్ (Osteo arthritis). దీనిలో పెద్ద కీళ్ళు దెబ్బతినును. 2) కీళ్ళవాతము గల ఆర్థరైటిస్ (Rheumatoid arthritis). దీనిలో చిన్న కీళ్ళు దెబ్బతినును. దీనిలో కీలు బిర్రబిగియుట (Ankylosis) కూడ జరుగును. 3) కీళ్ళవాతమునకు సంబంధించిన జ్వరం. ఇది గుండెను పాడుచేయును. కనుక దీనిని ప్రమాదకరమైనదిగా భావిస్తారు.

కీళ్ళవాపుకు ఈ కారణాలున్నాయి – 1) వంశపారంపర్యం 2) గాయాలు 3) సుఖవ్యాధులు 4) లావుగానుండుట 5) చల్లని వాతావరణం 6) సమతుల్యత లేని ఆహారం తీసుకొనుట 7) రక్తంలో యూరిక్‌యాసిడ్ అధికమగుట మొదలైనవి.

కీళ్ళవాపు సాధారణంగా 20, 40 ఏళ్ళ మధ్య వయస్సు వున్నవారికి సంక్రమిస్తుంది. పురుషుల కంటే స్త్రీలకే ఈ వ్యాధి అధికంగా వస్తుంది. దీని ముఖ్య లక్షణాలు – వాపు, ఎరుపు, నొప్పి, కదలిక తగ్గుట.

మొదట బరువు తగ్గుట, ఏ పని చేసినా, ఎక్కువ ఆలోచించినా అలసట, హుషారు లేకుండుట మొదలైన లక్షణాలుంటాయి. స్త్రీలలో బహిష్టు సరిగా రాకుండుట, గుండెదడ, చెమట పట్టుట, రక్తక్షీణత లాంటి లక్షణాలు కూడా వుంటాయి.

కీళ్ళదగ్గర మృదులాస్థి అనేది వుంటుంది. అచ్చట వూరే సైనోవియల్ ద్రవం కీళ్ళవద్ద కందెన వలె పనిచేయును. కాని జీర్ణక్రియలో మార్పుల వలన, ఆమ్లతత్వము వల్ల యూరేట్స్[1] పేరుకొనును. వీటివల్ల మృదులాస్థి క్షీణించును. సైనోవియల్ ద్రవం తగ్గి పోవును. వీటివల్ల కీళ్ళచుట్టూ వుండు ధాతువులలో వాపు కనిపిస్తుంది. అప్పుడు కొద్ది

*1. **యూరేట్స్ :** దేహములో రక్తకణాల విచ్ఛిన్నం మామూలుగనే జరుగుతుంటుంది. దానివల్ల యూరిక్ యాసిడ్ ఉత్పన్నమై మూత్రపిండాల ద్వారా విసర్జితమగును. కాని రక్తకణాల విచ్ఛితి అధికంగా వున్నా, మూత్రపిండాలు సరిగా పనిచేయకపోయినా యూరిక్ యాసిడ్ దేహంలోనే వుండిపోవును. ఆ యూరిక్ యాసిడ్ లేక యూరేట్స్ కీళ్ళల్లో కేంద్రీకృతమైనచో అక్కడ నొప్పి వచ్చును.*

జ్వరం రావచ్చు. తర్వాత వాపు కీలులో వుండే ఎముకల కలయిక వద్దకు చేరును. దీనివల్ల కీలు కదలకుండా పోవును. క్రమంగా కీలు వద్ద నుండి ఎముకల కొనలు అరిగిపోయి వ్రేళ్ళల్లో వంకరలు వస్తాయి. వ్రేళ్ళ నుండి వ్యాధి చేతి కండరాలలోనికి సోకును. క్రమంగా మణికట్టు, చీలమండ, మోచేతికీళ్ళు, మోకాళ్ళు, భుజాలు కూడా ఈ వ్యాధికి గురియై వెన్నెముక వరకు పోవచ్చు. వ్యాధి లక్షణాలు అప్పుడప్పుడు తగ్గిపోయినట్లుండి తిరిగి బాధిస్తూ ఉంటాయి.

**నివారణోపాయాలు :**

1) కీళ్ళ నొప్పులకు, స్థూలకాయం తగ్గించుటకు సైకిలు త్రొక్కుట మంచి వ్యాయామం. ఇది ప్రాణవాయువును వాడుకొనే సామర్థ్యాన్ని పెంచుతుంది. దీనివల్ల లాక్టిక్ యాసిడ్ తక్కువగ వినియోగింపబడ్తుంది. దీనివల్ల మంచి జరుగుతుంది. లాక్టిక్ యాసిడ్‌ను ఎంత తక్కువగా వినియోగించుకొంటామో అంత శ్రేష్ఠం. 2) నొప్పిగానున్నచోట వేడినీళ్ల కాపడం పెట్టుట ఉపయోగకారి 3) కొబ్బరినూనెతో మర్దన చేయాలి. 4) ఆయుర్వేదంలో ధన్వంతరి తైలంతో మర్దన చేయుట మంచిది.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12× :** తరుణ వ్యాధి ప్రథమ దశలో కీళ్ళు వాచి ఎర్రగా నొప్పిగా వున్నప్పుడు, కదలినప్పుడు నొప్పి ఎక్కువగా వున్నప్పుడు దీనిని వాడాలి. నొప్పితోపాటు జ్వరం వున్నచో దీనిని తొలుత గంటకు ఒక మోతాదు చొప్పున వాడాలి. ఆ తర్వాత దీనిని అప్పుడప్పుడు వాడవచ్చు.

**కాలీమూర్ 6× :** తరుణ వ్యాధిలో వాపు, నాలుకపై తెల్లనిపూత వున్నప్పుడు దీనిని వాడాలి. కదలిక నొప్పిని పెంచుచున్నచో ఫెర్రంఫాస్ 12× తర్వాత ఇది బాగా ఉపయోగపడును.

**నేట్రంమూర్ 3×-6× :** దీర్ఘకాలపు వ్యాధి – కీళ్ల దగ్గర యూరేట్స్ చేరి వుండుట – కీళ్ళ దగ్గర ద్రవము ఎండిపోయి నడచునపుడు శబ్దాలు వచ్చుట – కీలును చుట్టియుండెడి పొర వాచుట (Synovitus), గౌటు (కాలిబొటనవ్రేళ్ళ కీళ్ళు, పెద్ద కీళ్ళు మొదలైనవి వాచుట) – తొడ వెనుక భాగమున వుండు కండర స్నాయువులు దగ్గరకు ముడుచుకొనిపోవుట (Hamstrings) వల్ల కలుగు నొప్పి.

**నేట్రంఫాస్ 6× :** వ్రేళ్ళ కీళ్ళ నొప్పి – మూత్రం గాఢమైన ఎరుపులోనుండుట – నొప్పులు అకస్మాత్తుగా గుండెకు చేరుట – మోకాళ్ళ కీళ్ళవాపు, నొప్పి.

**మెగ్నీషియంఫాస్ 3×-6× :** తాళలేనంతటి ఈడ్పులుకలిగిన నొప్పులకు ఎంపిక చేసిన మందు. మధ్య-మధ్య దీనిని వాడాలి. వేడి కాపడం, అదుముట/ఒత్తుట వల్ల నొప్పి తగ్గును.

**కాలీసల్ఫ్ 3×-6× :** కీళ్ళల్లో చీముపట్టుట, ఒక కీలు నుండి మరొక కీలునకు వ్యాపించు కీలు నొప్పి - సాయంకాలమందు, వేడివల్ల నొప్పులు ఎక్కువగుట-చల్లగాలిలో ఉపశమనం - కుక్క గొడుగువలె ఉబ్బెత్తు పెరుగుదల వుండే కీళ్ళ వాపు.

**సైలీషియా 12× :** వంశపారంపర్యంగా వచ్చు కీళ్ళ నొప్పులకు ఇది బాగా పనిచేయును. భుజములో నొప్పి - కీళ్ళు చీముపట్టుట - రాత్రిపూట, చలివలన ఎక్కువగుట - వేడివలన, వేడి గదిలో ఉపశమనం - ఈ లవణం కీళ్ళలో చేరిన సోడియం యూరేట్‌ను సోడియం సిలికేటుగా మార్చును. సోడియం సిలికేటు నీటిలో కరుగును. దానిని లింఫ్ కణాలు గ్రహించి బయటికి పంపును.

**నేట్రంసల్ఫ్ 3×-6× :** ఊబ శరీరం కలవారికి ఇది మంచి మందు - గౌట్ తరుణ దశలో ఈ మందును ఫెర్రంఫాస్‌తో మార్చాలి. దీర్ఘకాలపు గౌటు వ్యాధికి ఈ మందొక్కటే చాలు. కీళ్ళ వాపు - వ్రేళ్ళ కీళ్ళ వాపు - నొప్పులు అకస్మాత్తుగ గుండెకు చేరుట - తడి వాతావరణములో నొప్పులు అధికమగుట - పైత్యరసము అధికముగా వెడలుట - మూత్రం గాఢమైన ఎరుపులో వుండుట - రోగి త్రాగుడు, ఖరీదైన ఆహారాన్ని మానాలి.

**కాల్కేరియాఫాస్ 3×-6× :** వాతావరణం సరిగా లేనపుడు, రాత్రిపూట గౌటు వ్యాధి నొప్పి ఎక్కువగుట - పుట్టిన శిశువుకు సాధారణముగ మెడయందు ద్రవపు కంతి యుండి ఉబ్బుట - మోకాలి చిప్ప ఎముక వాచుట-కీళ్ళు బిర్రబిగిసి వుండుట - కూర్చొని లేచి నడచుటకు ప్రయత్నించినపుడు, అలసట చెందినపుడు నొప్పులు అధికమగుట - నిదానముగా నడచినపుడు తగ్గుట - 2 గంటలకొకసారి ఈ మందును వాడాలి.

**కాల్కేరియాఫ్లోర్ 3×-12× :** మోకాలి, మోచేతి కీలు వద్ద వాపు - లోపలి ద్రవము ఎండిపోవుట - చేతివ్రేళ్ళ గెనుపుల మీద గట్టి ముడులు - గౌటువల్ల కీళ్ళు వాచుట. ఈ మందును నేట్రంసల్ఫ్‌తో మార్చి ఇవ్వాలి.

**ద్వాదశ మిశ్రమం :**

ప్రతి మోతాదులో ఫెర్రంఫాస్ 6× - 1 మాత్ర + కాలీమూర్ 3×-1 మాత్ర + కాల్కేరియాఫాస్ 3×-1 మాత్ర + నేట్రంఫాస్ 3×-1 మాత్ర + నేట్రంసల్ఫ్ 3×-1 మాత్ర - మొత్తం 5 మాత్రలు రోజుకు 3-4 సార్లు.

## 2. తుంటి కీలు వ్యాధి
## (Hip Joint Disease)

తొడయొక్క ఊర్ధ్వభాగమును తుంటి అని అందురు. అది నడుము/కటితో కలియు ప్రాంతము. క్షయవ్యాధి వల్ల కొన్ని సందర్భాల్లో తుంటి కీలు వ్యాధిగ్రస్తమగును. దీనివల్ల

ప్రథమ దశలో నొప్పి కలుగును. రోగి కుంటుతూ నడచును. తర్వాత క్రమంగా బాధ ఎక్కువగును. కాలువాచును. అందువల్ల కాలును తిప్పటం కష్టమగును. నడచుట కూడా కష్టమగును. కొన్ని కేసులలో చీము ఏర్పడి వాచును. తర్వాత నడచుట మరింత కష్టమగును. కొన్ని లవణాల లోపంవల్ల ఈ విధంగా జరుగుతుంది. ఈ లవణాలను ఇచ్చుటవల్ల వ్యాధి నయమగును. లేనిచో ఎముక నాశనమగును. కదలికలు కష్టమగును. కాలు పొట్టిదగును.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 3×-12× :** ప్రథమ దశలో కోమలమైన భాగాలు వేడిమి, వాపు, ధనారింపుగ నొప్పి.

**కాలీమూర్ 6× :** ద్వితీయదశ - పుండు వాపు ప్రారంభమగుట,

**కాల్కేరియాసల్ఫ్ 6× :** చీము కారుట.

**నేట్రంసల్ఫ్ 6× :** సైకోటిక్ తత్త్వము కలవారిలోను, ఊబ శరీరము కలవారి ఎడమ తుంటి కీలు వ్యాధి - తేమవల్ల వ్యాధి ఎక్కువగుట.

**కాల్కేరియాఫాస్ 6× :** వ్యాధి తృతీయ దశలో - ఎముకను మరింత నాశనము కాకుండా వుంచి, చీము పట్టకుండా చేసి క్రొత్త వ్యవస్థ ఏర్పడేటట్లు చేయుటకు ఈ మందు ఉపయోగపడును.

**సైలీషియా 12× :** క్షయతత్త్వము కలిగిన, రికెట్స్ వ్యాధిగ్రస్తులైన పిల్లలలో, వ్యాధి తృతీయ దశలో ఎముక చీముపట్టుటను, నాశనమగుటను తగ్గించుటకు, క్రొత్త వ్యవస్థను రూపొందించుటకు, కుట్టినట్టి నొప్పిని, దురదను, మంటను తగ్గించుటకు ఈ మందును వాడాలి.

## 3. మోకాలు నొప్పి
## (Knee Pain)

మోకాలు అనునది తొడ ఎముక చివర, కాలి ఎముక మొదలున గల కీలు. ఇది ఒక మడతబందు కీలు. ఈ కీలు కొందరిలో నొప్పికి గురి అగును.

**కారణాలు :** 1) మోకాలి కీలునందు ఉండు మృదులాస్థి నశించుట. 2) కీలు చుట్టూ ఉండు పొర వాచుట. 3) కీళ్ళ వద్ద నుండు కందెన వంటి ద్రవం (Synovial fluid) ఎండిపోవుట. 4) కీలు వద్ద యూరిక్ యాసిడ్ చేరుట 5) కీలువద్ద ఉన్న మెత్తని కణజాలం రాచుకొనుట. 6) ఎక్కువ బరువు 7) త్రాగునీటిలో ఫ్లోరైడ్ శాతం ఎక్కువగా ఉండుట.

**నివారణోపాయాలు :**

1) బరువు ఉంటే తగ్గించుకోవాలి. 2) మలబద్ధకం లేకుండా జాగ్రత్త పడాలి. 3) నువ్వుల నూనె/కొబ్బరినూనెతో మర్దన చేసుకోవాలి. వేడికాపడం 15 నిమిషములపాటు పెట్టాలి. తర్వాత మోకాళ్ళకు తడిగుడ్డ చుట్టుకోవాలి. 4) కాఫీ, టీ మానుకోవాలి. 5) ఉదయం టిఫెన్‌లో మొలకెత్తిన గింజలు, నువ్వుల ఉండతినాలి. 5) మధ్యాహ్నం పూట గోధుమ రొట్టెలు, వండిన కూరలు, రాత్రిపూట గోధుమ రొట్టెలు, పచ్చికూరలు తినుట మంచిది.

## • చికిత్స •

**కాల్కేరియాఫ్లోర్ 12×-25× :** మోకాలి కీలువాపు - కీలు నందు స్రవించు ద్రవం తక్కువగుటవల్ల మోకాలు నొప్పి - నడచునపుడు శబ్దములు వినబడుట - మోచేతి కీలు నందు సైనోవియల్ ద్రవం లేకపోవుట - వ్రేళ్ళపై ఎముక బుడిపెలు పెరుగుట.

**సైలీషియా 6×-12× :** మోకాలి చుట్టూ ఉండు సైనోవియం పొర ఉబ్బి నొప్పిపుట్టుట - మోకాలును నొక్కిన నొప్పి ఎక్కువగుట.

**కాల్కేరియాఫాస్ 12×-25× :** నడచుట వలన మోకాళ్ళ నొప్పులు అధికమగుట - వ్యాధి సోకిన భాగం చల్లగాను, వాటిపై చీమలు ప్రాకుచున్నట్లుండుట.

**ద్వాదశ లవణ మిశ్రమం :** ప్రతిరోజు రాత్రిపూట ఒక మోతాదు తీసుకొనవలెను. ఆ విధంగా చాలాకాలం తీసుకోవాలి. ప్రతి మోతాదులోను క్రింది మందులు ఒక్కొక్క మాత్ర చొప్పున ఉండాలి. కాల్కేరియాఫ్లోర్ 25× + సైలీషియా 6× + కాల్కేరియాఫాస్ 12× + ఫెర్రంఫాస్ 3× + కాలీమూర్ 3×.

# 4. గౌటు
## (Gout)

ఇది చాలా బాధాకరమైన దీర్ఘవ్యాధి. దీనిలో ముఖ్యంగా బొటనవ్రేళ్ళు, కీళ్ళు, చిన్న కీళ్ళు వాచి చాలా నొప్పిగ ఉండును. ఈ వ్యాధి క్రమముగ పెద్ద కీళ్ళకు, లోపలి అవయవాలకు వ్యాపించును. దీనివల్ల కీళ్ళు బిర్రుగ, ఎర్రగ అగును. కండరాలు, మృదులాస్థి వాచును. తీవ్రనొప్పి ఉండును. కీళ్ల మీద ముడులుగా ఏర్పడును.

**కారణాలు :** 1) వంశపారంపర్యత 2) శరీరములో యూరిక్ ఆమ్లం యొక్క జీవక్రియలో లోపం-దీనివల్ల యూరిక్ ఆమ్లలవణాలు, కణజాలములు కీళ్ళలో సుద్దవలె పేరుకొంటాయి.

## • చికిత్స •

**కాల్కేరియాఫాస్ 6× :** గౌటు-కాళ్ళ తిమ్మెర-బాధకు గురైన భాగాలలో చీమలు ప్రాకుతున్నట్టి భావన - మోకాళ్ళలో నొప్పులు-అవి నడస్తున్నప్పుడు ఎక్కువ అగుట.

**కాలీమూర్ 6× :** నరాల వ్యాధులవల్ల వచ్చు గౌటు వ్యాధి-కదలినప్పుడు నొప్పి ఎక్కువ అగుట-నాలుకపై తెల్లని పూత-కాళ్ళు, పాదముల వాపు.

**నేట్రంమూర్ 6× :** కాలనియమం ప్రకారం వచ్చు గౌటు-ఎక్కువగా బలహీనత, అలసట - కీళ్ళల్లో దీర్ఘకాలంగా ఉంటున్న మేహవాత వ్యాధి-కాళ్ళు, పాదములు తరచుగా తిమ్మిరెక్కుట-చీలమండ కీళ్ళ బలహీనత.

# 13

# గ్రంథుల వ్యాధులు

## (GLANDULAR AFFECT)

## 1. గ్రంథుల వ్యాధులు

స్రావము స్రవించు లేదా విసర్జన క్రియను సలుపు కణముల నిర్మాణమును గ్రంథి యని అందురు. ఈ గ్రంథులు అనేకము గలవు. కొన్ని గ్రంథులు స్రావమును ఉత్పత్తి చేయును. వీటిని Exocrine glands అని అందురు. వీటి స్రావము నాళముల ద్వారా పైకి వెడలును. కొన్ని గ్రంథుల స్రావము ఎట్టి నాళముల సహాయం లేకుండా రక్తములో నేరుగా కలియును. వాటిని వినాళికా గ్రంథులు (Endocrine glands) అని అందురు. పిట్యూటరీ, థైరాయిడ్, ఎడ్రినల్ గ్రంథి మరియు బీజకోశములు ఇట్టి గ్రంథులు. కాలేయము, క్లోమము పెద్ద గ్రంథులు. కొన్ని గ్రంథులు ఎట్టి స్రావమును ఉత్పత్తి చేయక వడగట్టు కార్యక్రమమును నిర్వర్తించును. వీటిని శోషక గ్రంథులు అని అందురు. స్తన గ్రంథులలో స్తన్యము తయారగును. ప్రోస్టేట్ గ్రంథి వీర్యమును ఉత్పత్తి చేయును. Salivary glands లాలాజలమును స్రవించును. చెమటను విసర్జించు గ్రంథులు Sweat glands. చంకలలోను, మెడయందును, గజ్జలలోను మొదలైన చోట్ల గ్రంథులు కలవు.

కొన్ని లవణాల లోపం వల్ల లేక సూక్ష్మజీవుల వల్ల కొన్ని గ్రంథులు వాచును. వాపు చెందిన కొన్ని గ్రంథులకు చీముపట్టును. దీనివల్ల బాధ కలగవచ్చు, బాధ లేకపోవచ్చు.

### • చికిత్స •

**కాలీమూర్ 3×-6× :** ఇది గ్రంథుల వాపులకు, గొంతులోని గ్రంథుల వాపులలో ద్రవము కూడినను ముఖ్య ఔషధం. మెడలోని గ్రంథులు వాచిన ఈ మందును బాహ్యాపూతగా కూడా వాడవచ్చు. క్షయతత్త్వము గల రోగుల గ్రంథులు వాచినా, ఉదర కుహరమందలి గ్రంథులు వాచినా ఈ మందును ఇవ్వాలి. కొన్ని సందర్భాలలో ఈ గ్రంథుల వాపు నీళ్ళ విరేచనాలతో కూడియుండును. వాపు, జ్వరము వున్నప్పుడు ఈ మందును ఫెర్రంఫాస్‌తో మార్చి యివ్వాలి.

**నేట్రంమూర్ 3×-6× :** దీర్ఘకాలంగా లాలాజల గ్రంథులు వాచి లాలాజలమును అధికముగా ఉత్పత్తి చేయుట - శోషరస గ్రంథుల వాపు దీర్ఘకాలంగా వుండుట - క్రొవ్వుకు సంబంధించిన గ్రంథుల వాపు.

**నేట్రంసల్ఫ్ 3×-6× :** సైకోటిక్ తత్త్వము గల రోగుల గ్రంథుల వాపు.

**మెగ్నీషియంఫాస్ 6× :** మెడ యందలి థైరాయిడ్ గ్రంథి వాపు.

**సైలీషియా 3×-12× :** చీముపట్టు గ్రంథుల ప్రక్రియను తగ్గించుటకు దీనిని వాడాలి. క్షయతత్త్వము గల రోగుల గ్రంథులు వాచినా అవి గట్టిపడినా ఈ మందు ఉపయోగకారి. ఆ గ్రంథులు వాచినా, వాపు లేకపోయినా ఈ మందును వాడవచ్చు.

**కాల్కేరియాఫాస్ 3×-12× :** గ్రంథుల వాపు దీర్ఘకాలంగా వున్నచో దీనిని మధ్య-మధ్య వాడాలి. క్షయతత్త్వముగల రోగుల మెడకు సంబంధించిన గ్రంథుల వాపునకు, చిన్న శ్వాసనాళముల వాపునకు, మెడయందలి థైరాయిడ్ గ్రంథి వాపునకు ఇది మంచి మందు. దుర్వాసనగల నీళ్ళ విరేచనాలతో ప్రారంభమయ్యే క్షయకు ఈ మందు బాగా ఉపయోగపడును.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** శోషరస గ్రంథులు చీమును వెలువరించుచున్నచో - గ్రంథులు పుండు పడినచో.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** గ్రంథులు బాగా గట్టిగా వుండుట -గ్రంథులు రాళ్ళవలె తయారగుట - గ్రంథుల వాపు దీర్ఘకాలంగా వుండుట - కీళ్ల స్నాయువులు గట్టిపడుట - ఆడవారి స్తనములలో ముడులు, గింజలు లాంటివి ఏర్పడుట - నాడీ ముడుల నొప్పి-స్తన గ్రంథి కంతుల వాపు, నరాల నొప్పిలాంటి నొప్పితో, సీరము వంటి ద్రవాన్ని స్రవింపజేయుట.

**ఫెర్రంఫాస్ 6×-12× :** గ్రంథుల వాపు తరుణ స్థితిలో నున్నప్పుడు నాలుక క్రిందగల కంతి వాపుకు ఏ మందు ఉపయోగపడనపుడు డాక్టర్ బి.స్మిట్జ్ ఫెర్రంఫాస్‌ను1వ పొటెన్సీలో వాడి నయం చేసెను.

**నేట్రంఫాస్ 6× :** గ్రంథుల వాపునకు ఇది ముఖ్యమైన మందు - మెడయందలి థైరాయిడ్ గ్రంథి వాపునకు ఇది బాగా పనిచేయును.

## 2. బోద / ఏనుగు కాలు
## (Elephantiasis/Filariasis)

ఈ వ్యాధిలో కాలు, చేయి, స్తనము, శిశ్నము, వృషణములు మొదలైనవి ఏదియో ఒక అవయవమందు శోషరస గ్రంథులలో (Lymph glands) ఆటంకం కలుగుటచే ఉబ్బి, తదుపరి చర్మం దళసరెక్కును. అప్పుడప్పుడు జ్వరం వచ్చుచుండును.

**కారణం :** శోషరస గ్రంథులలో ఫైలేరియా (Filaria) అను పురుగులు ఉండును. అవి దారంవలె శోషరస గ్రంథులలో పరాన్న జీవులుగా ఉంటాయి. కొంతమందిలో అవి లింఫ్ కణాలలో అడ్డంకి కలిగించి బోదకాలును కలిగిస్తాయి. దోమలు ఈ వ్యాధిని ఒకరి నుండి మరొకరికి వ్యాపింపచేస్తాయి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12× :** కాలివాపు, జ్వరం – ఈ మందును రోజుకు 4 సార్లు వాడాలి. దీనిని కాలిమూర్‌తో మార్చి వాడాలి.

**కాల్కేరియాసల్ఫ్ 3× :** దీనిని ఉదయం, రాత్రి ఇవ్వాలి.

**ద్వాదశ లవణ మిశ్రమం :** ప్రతి మోతాదులోను కాలీమూర్ 3×–1 మాత్ర, కాలీసల్ఫ్ 3×–1 మాత్ర, నేట్రంసల్ఫ్ 3×–1 మాత్ర, సైలీషియా 12×–1 మాత్ర, కాల్కేరియాసల్ఫ్ 3×–1 మాత్ర చొప్పున మొత్తం 5 మాత్రలు తీసుకోవాలి. ఈ మందులను భోజనానికి ముందు వాడాలి.

# 14

# సంధాయక ధాతువుల వ్యాధులు
## (DISEASES OF CONNECTIVE TISSUES)

### 1. మేహవాతం
### (Rheumatism)

సంధాయక ధాతువుల (connective tissues) వ్యాధులను మేహవాతం అని అంటారు. మేహవాతం వల్ల కీళ్ళల్లో/కండరాలలో నొప్పి కలుగుతుంది. కదలికలో కష్టం ఏర్పడుతుంది.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 12×–25× :**

★ మేహవాత జ్వరం[1] ప్రారంభం కాగానే ఈ మందును క్రమం తప్పకుండా వాడాలి.

★ బాధాకరముగనుండు కీళ్ళవాతం (తరుణవ్యాధి) ప్రథమ దశ – ఏమాత్రం కదిలినా నొప్పి కలుగుట/నొప్పి అధికమగుట.

★ కీళ్ళవాతం ముఖ్యంగా భుజాలకు సంబంధించినది – ఛాతీ పైభాగం వరకు నొప్పులు విస్తరించును – ఒక కీలు తర్వాత మరొక కీలునకు ఈ వ్యాధి సోకును.

★ తరుణ / తరుణ – దీర్ఘవ్యాధి స్థితుల మధ్యస్థితిలో నుండు కండరాల మేహవాతమునకు ఇది మొట్టమొదటిసారిగా వాడవలసిన మందు – కదలిక వల్ల నొప్పి అధికమగుట – వేడిమివల్ల తగ్గుట.

★ శరీరపు ప్రతి అవయవం నొప్పిగా వుండుట (ముఖ్యంగా కీళ్ళల్లో) – కదలిక వల్ల నొప్పి అధికమగుట.

★ నడుము నొప్పి, బిర్రబిగిసిన వీపు మొదలగునవి – చలి వల్ల బిర్రబిగిసిన మెడ.

★ రాత్రిపూట నొప్పులు అధికముగా నుండుట – దీనివల్ల సరిగా నిద్రలేకపోవుట – విశ్రాంతి తర్వాత మొదటిసారిగా కదిలినపుడు చెప్పుకోదగినంత బిర్రబిగియుట (Armot)

★ కదిలినా/కదలాలనే భావన కలగగానే నొప్పి ఎక్కువగుట.

★ చేతులు వాచుట, అవి నొప్పిగా వుండుట.

*1. **మేహవాత జ్వరం :** దీనిలో సూక్ష్మజీవులు తొలుత గొంతు, టాన్సిల్స్‌పై దాడి చేయును. తర్వాత కీళ్ళ పైన, గుండె పైన ప్రభావాన్ని కలిగించును.*

**కాలీమూర్ 12x :**

★ మేహవాత జ్వరపు ద్వితీయ దశ – కీళ్ళచుట్టూ చెమర్చుట జరుగుట.

★ ఈ మందు పనిచేయని ధాతువులను పనిచేసేటట్లు చేసి విసర్జక మరియు శోషణ వ్యవస్థను మామూలు స్థితిలోనికి తెచ్చును. వాపును నివారించును.

★ కదలికవల్ల మేహవాతపు, గౌటు నొప్పులు ఎక్కువైన, నాలుకపై తెల్లని/బూడిదరంగు చారలున్నా ఈ మందు పనిచేస్తుంది.

★ అవయవాల వాపు.

★ కదలినప్పుడు నొప్పులు కలిగినా/అధికమైనా, ఫెర్రంఫాస్ వాటన్నింటినీ పూర్తిగా తొలగించనిచో ఈ మందును వాడాలి.

★ దీర్ఘకాలంగా మేహవాతం వున్నా, వాపు వున్నా, అన్ని రకాల కదలికలు నొప్పులను అధికం చేసినా, నాలుకపై బూడిదరంగు/తెల్లని రంగు పూత వున్నా, లేక తెల్లని స్రావాలు వున్నా ఈ మందు ఉపయోగకారి.

**కాలీఫాస్ 6x :**

★ తరుణ, దీర్ఘకాలిక మేహవాతం – కదలికవల్ల నొప్పులు మాయమగుట – విశ్రాంతి తర్వాత ఉదయాన లేచినపుడు, కూర్చొన్న స్థానం నుండి తొలుత లేచినపుడు నొప్పులు తీవ్రమగుట.

★ చాలా నొప్పిగ వున్న మేహవాతం – లేచుటకు ప్రయత్నించిన మొదటిసారి అవయవాలు బిర్రబిగియుట – నడచిన కొలదీ నొప్పి తగ్గుట – ఏ మాత్రం శ్రమ చేసినా/అలసట కలిగినా నొప్పి ఎక్కువగుట.

★ బిర్రబిగియుట, పక్షవాతపు ప్రవృత్తి.

★ కుంటితనం కలిగించు నొప్పులు–నెమ్మదిగా కసరత్తు చేయుటవల్ల ఆ నొప్పులు తక్కువగుట.

**నేట్రంఫాస్ 6x :**

★ వేడిమి, ఎర్రదనం, నొప్పి, ఉబ్బుట అను లక్షణాలు గల మేహవాతానికి ఈ మందువల్ల చక్కని ఫలితాలు లభించినట్లు డాక్టర్ గౌలన్ పేర్కొన్నాడు.

★ సంక్లిష్టం (complicated) కాని మేహవాతం, పసుపుపచ్చని నాలుకపూత, ఆమ్ల లక్షణాలు/క్షయతత్త్వం/గ్రంథుల వాపు లక్షణాలతో వున్న ఈ మందు బాగా పనిచేస్తుంది.

★ కీళ్ళ మేహవాత నొప్పులు అధికమైన పుల్లని చెమటతో నున్న

★ తరుణ/దీర్ఘకాలపు గౌట్, దీర్ఘకాలపు కీళ్ళ మేహవాతం

★ ఈ మందు ధాతువుల యూరిక్ యాసిడ్‌పై పనిచేసి అది హాని చేయకుండా చేయును.

★ ఎక్కువగ బిర్రబిగియుట, కీళ్ళలో శబ్దం కలుగుట, సాయంకాలానికి నొప్పులు అధికమగుట – జె.డబ్ల్యు.వార్డ్

**కాలీసల్ఫ్ 6× :**

★ కీళ్ళవాతం నిశ్శబ్దముగ ఒక చోటు నుండి మరొక చోటునకు విస్తరించును.

★ మేహవాతపు తలనొప్పి.

★ కీళ్ళలో నొప్పులు తరుణ/దీర్ఘకాలపు – నొప్పి ఒక చోట స్థిరపడి, తర్వాత మరొక స్థానం మారుట.

★ దీర్ఘకాలపు కీళ్ళవాతం – సాయంకాలమున, వెచ్చని గాలిలో నొప్పులు అధికమగుట – చల్లని గాలిలో నొప్పులు తక్కువగుట.

★ వీపులోను, మెడవెనుక భాగాన/అవయవాలలో నొప్పులు.

★ ఒకచోటు నుండి మరొక చోటునకు మారునట్టి మేహవాత నొప్పులకు ఈ మందును వాడి మంచి ఫలితాలు పొందాను. **(డాక్టర్ స్లైజెల్‌మన్)**

★ మేహవాత నొప్పులైనా, నరాల నొప్పులైనా తెల్లవారుజామున 3 గం॥లకు ప్రారంభమై నిదుర నుండి లేచునంతవరకు ఉండును.

**మెగ్నీషియంఫాస్ 6×–12× :**

★ కీళ్ళ మేహవాతము (తరుణ)నకు, తీవ్రమైన నొప్పులకు దీనిని మధ్యమధ్య వాడాలి.

★ మేహవాత జ్వరంలో తాళలేనంతటి నొప్పి, ఈడ్పు నొప్పి వుండును.

★ ఏమాత్రం తాకినా ఈ నొప్పులు అధికమగును. వెచ్చదనం, కఠినమైన ఒత్తిడివల్ల నొప్పులు తక్కువగుట **(పుష్లమన్)**

**కాల్కేరియాఫాస్ 6×–12× :**

★ రాత్రిపూట మేహవాతం అధికమగుట

★ వేడిమి/చల్లదనం వల్ల నొప్పులు ఉద్రేకించును.

★ వాతావరణ మార్పువల్ల నొప్పులు మరింత ఎక్కువగును.

★ కీళ్ళ మేహవాతం, తిమ్మిరి/శీతల భావం, నొప్పికి గురైన భాగాలలో ప్రాకునట్టి నొప్పి, చీమలు ప్రాకుతున్నట్లు అనిపించుట.

★ తిమ్మెర భావం, కుంటితనం.

★ ప్రతి జలుబు కీళ్ళ మేహవాతాన్ని తెచ్చును.

★ కపాలపు ఎముకలలో నొప్పులు.

★ తేమవల్ల మెడ బిగ్రబిగియుట.

★ అవయవాలలో నొప్పి, బాధ.

★ తుంటి ఎముక ఊర్ధ్వభాగాన నొప్పి – వాతావరణం మారినప్పుడల్లా ఈ నొప్పి ఎక్కువగుట.

**నేట్రంమూర్ 6×-30× :** వ్యాధి లక్షణాలను ఈ మందు లక్షణాలతోను, నాలుక లక్షణాలతోను పోల్చుకొని కాలీమూర్ తర్వాత దీనిని రెండవ మందుగా వాడాలి. దీర్ఘకాలపు కీళ్ళ మేహవాతం, కీళ్ళలో శబ్దం కలుగుట.

**నేట్రంసల్ఫ్ 6×-25× :** మేహవాతపు నొప్పులు – మెడ, వీపు కొయ్యబారుట, వాటిలో నొప్పులు – కీళ్ళలో నొప్పులు ముఖ్యంగా కాలివ్రేళ్ళలోను, చేతివ్రేళ్ళలోను, మణికట్టులోను నొప్పులు – తాను కూర్చొన్న సీటు నుండి పైకి లేచినపుడు/శయ్యలో ఇటు, అటు కదిలినపుడు నొప్పులు అధికమగుట. **(పెర్కిన్స్)**

## 2. కోరియా / నృత్యవాతం
## (Chorea/St. Vitas's Dance)

ఈ వ్యాధి పెద్దవారికంటె పిల్లలలోను, బాలురకంటె బాలికలలోను ఎక్కువగా కనిపించును. సాధారణముగ 15 సంవత్సరాల లోపు వయస్సు కలిగిన పిల్లలు ఈ వ్యాధిచే బాధపడుచుందురు.

**లక్షణములు :** ప్రారంభమున రోగి నిరుత్సాహముగ, విచారముగ, స్థిమితము లేకుండా వుండును. ముఖం వికృతంగాను, అవయవములు మెలివేసుకొని, వంకరలు తిరిగి చంచలమైన కదలిక కలిగియుండును. రోగి తన అవయవములను కదిలించుటకు ప్రయత్నించిన కొలదీ వంకరలు ఎక్కువగును. అవయవములేవియూ అతని అధీనమున ఉండవు. రోగి తన చేతిని నోటివద్దకు తీసుకొని వెళ్ళాలని తలంచిన ఆ చేయి తల, ముఖం మీదకు వెళ్ళును. నడచుటకు ప్రయత్నించినచో కాలు వెనుకకు/ఒక ప్రక్కకు పోవును. మాట్లాడుటకు ప్రయత్నించినచో మాట సరిగారాదు. చేతితో దేనినీ పట్టుకొనలేడు.

రోగము ముదిరినచో పై లక్షణాలన్నియూ ఉద్ధృతమగును. రోగి అతి ప్రయాసతోగాని కూర్చొనలేడు, పరుండలేడు, నడువలేడు, మాట్లాడలేడు, తినలేడు. ఊపిరి పీల్చుకొనుట కూడా కష్టమే. దీనివల్ల సరిగా నిద్ర కూడా పట్టదు. గాఢ నిద్రలో కూడా అవయవములు ఎలాంటి ప్రయత్నం లేకుండానే కదలుచున్నచో రోగము చాలా ఎక్కువగా వున్నదని భావించవచ్చును.

ఈ రోగము పెద్దవారికి వచ్చినచో నిద్రలేమి, సంధి, పిచ్చిపిచ్చి భ్రమలు కలుగును. శరీర ఉష్ణోగ్రత 105° వరకు పెరుగును. కొన్ని సందర్భాలలో ప్రాణం కూడా పోవచ్చు.

**కారణములు :**

1. నత్తివాడు, కుంటివాడు మొదలగు వికలాంగులను పిల్లలు అనుకరించుట.
2. బలవర్ధక ఆహారం లభించకపోవుట
3. అనారోగ్య పరిస్థితులలో పెంపకం

4. అజీర్ణ దోషములు
5. మలబద్ధకం
6. క్రిములు
7. పంటి రోగములు
8. రక్తహీనత
9. భయం
10. దుఃఖం
11. ఋతుస్రావం సరిగ లేకపోవుట
12. పొంగు
13. కోరింతదగ్గు
14. మేహవాతపు వ్యాధులు
15. హిస్టీరియాతో బాధపడు తల్లులకు జన్మించుట
16. వసంత ఋతువు
17. అధిక మానసిక శ్రమ
18. నీతిబాహ్యామైన ప్రవర్తన

**నివారణోపాయాలు :**

1. రోగము ప్రారంభ స్థితిలోనున్నచో కొద్దిపాటి పరిశ్రమ చేయవచ్చు. లేనిచో ప్రశాంతత, విశ్రాంతి, నిద్ర రోగికి చాలా అవసరం.
2. పరిశుభ్రమైన గాలి తగులనియ్యవలెను.
3. అవసరమైనచో స్థలం మార్చాలి.
4. పిల్లలైనచో వారిని బడికి పంపరాదు. బడిలో ఇతర పిల్లల హేళనకు వారు గురైన తీవ్ర మనస్తాపమును పొందుదురు. అంతేగాకుండా ఒక్కొక్కప్పుడు పాఠ్యాంశాలు ఆవేశమును కలిగించవచ్చు. దీనివల్ల వారి రోగం పెరగవచ్చు.
5. రక్తమును వృద్ధి చేయు ఆహారమును, మందులను ఇవ్వవలెను.
6. మలబద్ధకం లేకుండా చూడవలెను. అందుకుగాను రోగి ఎక్కువ నీరు త్రాగునట్లు, పీచుపదార్థములు అధికముగా గల ఆకుకూరలు, పండ్లు మొదలగునవి తినునట్లు జాగ్రత్త వహించాలి. అప్పటికీ మలబద్ధకమున్నచో ఎనీమా చేయించుకోవాలి.
7. రోగికి మంచి దుస్తులు వేయాలి. లేనిచో ఇతరుల దుస్తులతో పోల్చుకొని బాధ పడుదురు. దీనివల్ల రోగం మరింత పెరుగును. కనుక రోగిని సదా మంచి దుస్తులతో వుంచాలి.

## • చికిత్స •

**కాల్కేరియాఫాస్ 6×–12× :** స్క్రాఫ్యుల తత్త్వము గల పిల్లలకు, బాగా వికాసం పొందని, యౌవనం రాని (అనగా 13–14 సం॥ల) బాలబాలికల కొరియా వ్యాధికి ఇది మంచి మందు. ఇది మెగ్నీషియంఫాస్‌కు సహచరి. రక్తక్షీణత గల పిల్లలకు దీనిని మెగ్నీషియంఫాస్‌తో మార్చి వాడాలి. దీనిని రోజుకు 3–4 సార్లు వాడాలి.

**మెగ్నీషియంఫాస్ 6× :** ఇది నరముల వ్యాధులకు ప్రధాన ఔషధము. కాళ్ళు–చేతులు అప్రయత్నముగా కదలుట – ఆకారం మారుట – రోగి సానుభూతి కొరకు మౌనంగా దిక్కులు చూచుట – వృత్తికి సంబంధించిన ఈడ్పులు – రచయితల కండరములు బాధాకరముగ అప్రయత్నముగ దగ్గరకు ముడుచుకుపోవుట – పియానో, వయొలిన్ వాయించు వారి ఈడ్పులు – ఈ లక్షణాలకిది మంచి మందు. దీనితర్వాత కాల్కేరియాఫాస్ వాడాలి. దీనిని 2 గంటలకొకసారి యివ్వాలి.

**సైలీషియా 12× :** క్రిములవల్ల ఈడ్పులు వచ్చుట – భయం కలిగించు కలల వల్ల నిద్రాభంగ మగుట – కళ్ళు వికృతంగా మారుట – పాలిపోయిన ముఖం – అత్యధికమగు ఆకలి – ముక్కు రంధ్రముల క్షోభ (irritation) – మలబద్ధకం – అధిక దాహం – ముఖం, కాళ్ళు – చేతులు ఉబ్బుట.

**నేట్రంమూర్ 6× :** భయం తర్వాత, ముఖముపైనున్న పుండ్లను అణచుటవల్ల, ఆటంకాలను లెక్కచేయకుండా దూకుటవల్ల వచ్చు కోరియా – మలేరియా వ్యాధిగ్రస్తులలోను, రక్తహీనులలోను పూర్ణిమరోజున కుడివైపున ఎక్కువగా అదరుట– దాహం, జ్వరం వుండుట.

**నేట్రంఫాస్ 6× :** కోరియా వ్యాధి క్రిములవల్ల వచ్చినా, అజీర్ణ దోషములున్నా, ఆమ్ల లక్షణాలు వున్నా, నాలుకమీద పసుపుపచ్చని పూత వున్నా ఈ మందు ఉపయోగపడును. సైలీషియా కూడా మంచి మందు.

**కాలీఫాస్ 6× :** మనో వ్యాకులత, నరముల బలహీనత, చాంచల్యం, వాత రోగాలకు దివ్య ఔషధం. మానసిక శ్రమ, లైంగిక శ్రమ వల్ల వచ్చు కోరియాకు మంచి టానిక్.

# 15

# చర్మ వ్యాధులు
## (SKIN DISEASES)

## 1. చర్మం – పరిచయం
## (Skin – An Introduction)

చర్మం శరీరంలోని అన్ని అవయవాలలోకెల్లా పెద్దది. ఇది పంచ జ్ఞానేంద్రియాల్లో ఒకటి. మనకు స్పర్శజ్ఞానం కలిగించును. ఉష్ణోగ్రతను క్రమపరచును. చర్మం 1 మి.మీ. మందంతో శరీరాన్ని కప్పును. కాని అరచేతులు, అరికాళ్ళు, వీపున రెండు అంస ఫలకముల మధ్యనున్న చర్మం ఎక్కువ దళసరిగా ఉండును.

చర్మానికి రెండు భాగాలు ఉండును – 1) బాహ్య చర్మం (Epidermis) 2) అంతశ్చర్మం (Dermis). బాహ్యచర్మానికి నాలుగు పొరలు ఉంటాయి. దీని నాలుగవ/చివరి పొరను మాల్ఫీజియన్ పొర అంటారు. మన శరీరానికి రంగునిచ్చే మెలానిన్ పదార్థం బాహ్యచర్మంలోనే ఉంటుంది. మెలానిన్ పదార్థలోపం వున్నచో వెంట్రుకలు తెల్లగా మారును.

అంతశ్చర్మం పైభాగమున బుడిపెల వంటి ఉబ్బెత్తు భాగాలు ఉంటాయి. వీటిలో రక్తనాళాలు, జ్ఞాననాడి కొనలు ఉంటాయి. ఈ బుడిపెల అంతశ్చర్మం క్రింద రోమకూపములు, వాటికి సంబంధించిన తైలగ్రంథులు (Sabacious glands), స్వేద గ్రంథులు (Sweat glands) ఉంటాయి.

రోమకూపముల అట్టడుగు భాగమున నున్న బుడిపెను రోమబుడిపె అని అంటారు. ఇందలి కణములు విభజన చెందుటచే రోమములు ఏర్పడును. ఈ రోమములు కొంత పొడవు వరకు పెరిగి రాలిపోవును. వెంటనే అచ్చట క్రొత్త రోమములు ఏర్పడును. అట్లు ఏర్పడకపోయిన బట్టతల అగును.

చర్మంలో స్వేదగ్రంథులు ఉంటాయి. అవి సన్నని నాళాలు. మెలికలు తిరిగి యుండును. అవి అంతశ్చర్మమున ఉండును. బాహ్యచర్మంపై వెలుపలికి తెరచుకొనును. అవి రక్తంలోని నీటిని, యూరియాను, లవణాలను వేరు చేసి స్వేదం (చెమట) రూపంలో బయటికి పంపును. వేసవిలో ఎక్కువ చెమటపోస్తుంది. చెమట రూపంలో దేహంలోని వేడిమి బయటకు పోతుంది. ఆ విధంగా దేహం చల్లబడుతుంది. చలికాలం, వర్షాకాలంలో

దేహం ఉష్ణోగ్రత తక్కువగా వుంటుంది. కనుక చెమట ఎక్కువగా పోయదు. చెమట ద్వారా మాలిన్యాలు బయటికి పంపివేయబడును. చలికాలం, వర్షాకాలంలో చెమట ద్వారా మాలిన్యాలు ఎక్కువగ తొలగించబడవు. కనుక మూత్రపిండాలు మూత్రాన్ని అధికంగా ఉత్పత్తి చేసి మాలిన్యాలు తొలగించే కార్యక్రమాన్ని చేపట్టును.

## 2. సాధారణ చర్మవ్యాధులు
## (Common Skin Diseases)

### • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6X :** చర్మపు నొప్పి, వేడి, ఎరుపు, వాపు–మొటిమలు, వేడిమి, రక్త ప్రసారదోషం.

**కాలీమూర్ 6X :** మొటిమలు, పక్కులు, దద్దుర్లు, ఉలిపిరికాయలు, బొటనవ్రేళ్ళ వద్ద తిత్తులు వాచుట మొదలైన చర్మవ్యాధులు – అపరిశుభ్రమైన శోషరసాన్ని వాక్సిన్‌గా వాడిన తర్వాత వచ్చు చర్మవ్యాధులకు ఫెర్రంఫాస్‌తో దీనిని మార్చి వాడాలి.

**కాలీఫాస్ 6X :** గజ్జి, బట్టతలకు సంబంధించిన చర్మవ్యాధులు, రాచపుండ్లు, అపాయకరమైన పొక్కులు, చల్లదనం/తేమవల్ల చేతివ్రేళ్ళు/కాలివ్రేళ్ళు ఒరియుట.

**కాలీసల్ఫ్ 6X :** చర్మవ్యాధులను అణచుట వల్ల కలుగునట్టి పొడితనం – కాఫీ, టీ వంటి వేడి పానీయాలంటే భయం – గజ్జి, దద్దుర్లు, సోరియాసిస్, చుండ్రుకు ఉపయోగపడును.

**మెగ్నీషియంఫాస్ 6X :** మంగలిగజ్జి, బొబ్బలు, దురదగల దద్దుర్లు, తెల్లని పొక్కులు, చుండ్రు, కపాలముపై చీముపొక్కులు, మొటిమలు – క్రిమికీటకాలు కుట్టుట వల్ల కలుగు దద్దుర్లు – మోకాళ్ళు, చీలమండలు, మోచేతుల వద్ద దద్దుర్లు అధికంగా ఉండుట.

**నేట్రంమూర్ 6X–12X :** దద్దుర్లు, గజ్జి, ఒరియుట, పురిటిలోని శిశువుకు కలుగు చర్మవ్యాధి, పెద్ద ద్రవపు పొక్కులు, చుండ్రు, ఉలిపిరికాయలు, క్రిమికీటకములు కుట్టుట.

**నేట్రంఫాస్ 3X–6X :** పిల్లలలో చర్మం ఒరియుట, నొప్పి, క్రొవ్వుకు సంబంధించిన గ్రంథుల వాపు, వ్యాక్సినేషన్ వల్ల కలుగు దద్దుర్లు, మెడ యందలి థైరాయిడ్ గ్రంథి వాచుట, గజ్జి, చర్మం పైపైనే ఎర్రబడుట.

**నేట్రంసల్ఫ్ 6X :** పిల్లలలో చర్మం ఒరియుట – పైత్యరస లక్షణాలు – తట్టు – పసుపు పచ్చని నీళ్ళవంటి స్రావం – ఉబ్బు / వాపు – ఉలిపిరికాయలు.

**సైలీషియా 6X :** పొంగు / తట్టు, దురద, శోషరసంతో నిండిన చిన్న పొక్కులు – అవి త్వరగా మృతి చెందుట – చిన్న పుండ్లు అధిక చీమును స్రవింపజేయుట – మెత్తని

భాగాలను తినునట్టి పుండ్లు – రాచపుండ్లు – చర్మం చీము పట్టుట – మొటిమలు, పగటిపూట మండుట – బొబ్బలతో కూడిన చర్మవ్యాధి – సర్పి – చర్మమందు కలుగు పగుళ్ళు – గులాబిరంగు మచ్చలు – విసర్పి, చీము పట్టుట – కురుపులు గుంపుగ లేచుట – అపాయకరమైన పొక్కులు – చేతివ్రేళ్ళ గోర్ల వ్యాధులు – తేలికగ చీలుట / పగులుట.

**కాల్కేరియాఫాస్ 6×–12× :** చర్మపు పగుళ్ళు – ఒరియుట – చర్మపు దురద – గజ్జి, మచ్చలు, సర్పి, చర్మమును వికృతముగ మార్చు / తినివేయు పుండ్లు – దురదతో నుండు చర్మవ్యాధి – పోతరపు పొక్కులు / మొటిమలు చర్మంపై గుండ్రని మచ్చలు – ఆల్బుమిన్‌తో కూడిన చిన్న పొక్కులు.

**కాల్కేరియాసల్ఫ్ 6×–30× :** పిల్లల తలపై తేమగల వేడిచే కలిగిన పుండ్లు – అధికముగ స్రావం స్రవించుట / పసుపుపచ్చని చీముగల పక్కులు – వాపు – మొటిమలు, వాటి తలలపై పదార్థం కూరుట – అరికాళ్ళు అంతటా దద్దుర్లు – దురద – చీమును స్రవింపజేయు కాలివ్రేళ్ళ / చేతివ్రేళ్ళ మధ్య భాగం.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** చర్మపు పగుళ్ళు – అరచేతుల చీలికలు – గుదము వద్ద రంధ్రం ఏర్పడుట – చర్మం గట్టి పడుట – అంచులు గట్టిగ నుండుట – రాచపుండ్లు – చేతివ్రేళ్ళ గోర్లు పెళుసుగా నుండుట – పళ్ళు కూడ పెళుసుగ నుండుట – గజ్జి – సోరియాసిస్.

## 3. మరికొన్ని చర్మవ్యాధులు
## (Some more skin diseases)

1. **వృద్ధులకు కలుగు దురదతో నుండు చర్మవ్యాధి (Prurigo) :** తీవ్రమగు దురదతో నుండు దీర్ఘ చర్మవ్యాధి. చిన్న పొక్కులు లేచి, ఆ భాగం వాచి, అమిత దురదగ ఉండును. ఎక్కువ దురదచే ప్రతిరోజు నిద్రాభంగం కలుగును. ఇది సాధారణముగ కాళ్ళు–చేతుల మీద, గుదము చుట్టూ, వృషణములమీద, స్త్రీ జననేంద్రియం మీద కలుగును. వృద్ధులలో ఈ వ్యాధి వచ్చిన **కాల్కేరియాఫాస్ 6× ను కాలీఫాస్ 6×తో** మార్చి వాడాలి.
2. **చర్మంపైన ఏర్పడు నిరపాయకరమైన పసుపు పచ్చ – నీరు కావి వర్ణంగల మచ్చలు (Freckles) :** సూర్యరశ్మి సోకిన ఈ మచ్చలు ఎక్కువగును. **కాల్కేరియాఫాస్ 6×** ను వాడితే ఈ వ్యాధి తగ్గుతుంది.
3. **అవయవములను తినివేయు చర్మవ్యాధి (Lupus) :** ఇది ముఖమందు, ముక్కు, చెవుల మీద ముఖమును వికారంగా మార్చునట్టి క్షయతత్వ సంబంధమగు చర్మవ్యాధి.

ఒక వైపు పుండు మానుచుండును. రెండవ వైపు వ్యాపించు చుండును. వీటిపై గోధుమ రంగు పక్కు కట్టును. ఈ వ్యాధి త్వరగ వ్యాపించును. నొప్పి అత్యధికముగ నుండును. కొద్ది వారాలలోనే ముక్కు, పెదవులు, కనురెప్పలు తినివేయబడును.

**• చికిత్స •**

**నేట్రంఫాస్ 6×** : దీనిని లోపలకు, బయటికి వాడాలి.

**కాల్కేరియాఫాస్ 6×–12×** : క్షయ వలన మెడపై నున్న గ్రంథులు కొద్దిగ వాచుట.

**కాలీమూర్ 6×** : జీర్ణవ్యాధుల, ప్రేగుల వ్యాధుల మొండి కేసులలో ప్రధానమైన మందు.

**4. కంతి రూపంలో నున్న కణజాలం (Nodes)** : చేతి మరియు కాళ్ళ వ్రేళ్ళ మధ్య మృదువుగానుండు భాగంలో నీలముగా / రోజా రంగులో ఉండే చిన్న ఉబ్బులు ఒక రకపు గుండె జబ్బులో కనబడును. అవి తీపు పుట్టించును.

**• చికిత్స •**

**1. కాల్కేరియాసల్ఫ్ 6×–30×  2. సైలీషియా 6×**

**5. సన్ ఎలర్జీ** : కొంతమందిలో ఎండపడితే చర్మం నల్లగా పేడు కట్టినట్లుగా మాడి ఉంటుంది. ఎండ తగలని / బట్ట క్రింది భాగాలు బాగానే ఉంటాయి.

**కారణం :** దేహంలోని నీరు ఎండకు ఆవిరై పోవుట వల్ల దాని పరిమాణం బాగా తగ్గుట.

**నివారణోపాయం :** రోజూ 3–4 లీటర్ల నీరు త్రాగాలి. ఎండలో తిరిగినా / పని చేస్తున్నా మూత్రం తెల్లగా, సాఫీగా వచ్చేటట్లు నీరు త్రాగాలి.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6×** : ఆసనాల వల్ల, వేడిమి వల్ల రక్తనాళికలు సంకోచించుట, చర్మం మండుట – ఈ మందు వేడిమిని తగ్గిస్తుంది.

## 4. దద్దుర్లు
### (Eruptions / Urticaria / Nettle Rash)

ఒక్కొక్కసారి శరీరంమీద ఎర్రటి దద్దుర్లు ఏర్పడును. వాటివల్ల దురద, మంట కలగవచ్చు. వాటికి వాపు ఉండవచ్చు. అవి కొన్ని నిమిషాలు / గంటల తర్వాత పూర్తిగ తగ్గిపోవును. అవి తర్వాత మరల వస్తుంటాయి.

**కారణములు :** 1) కొన్ని పదార్థాలను తినుట 2) జలుబు 3) మలబద్ధకము 4) కొన్ని పురుగులు శరీరంపై ప్రాకుట 5) కొన్ని వస్తువులను తాకుట.

**• చికిత్స •**

**కాలీమూర్ 6X :** పొట్ట అవ్యవస్థ వల్ల కలిగే దద్దుర్లు – బహిష్టు కాలచక్రం సరిగ లేకుండుట, సీరం – ఫైబ్రిన్ కలిసిన స్రావం – నాలుకపై తెల్లని పూత.

**కాలీసల్ఫ్ 6X :** చలిగాలి / ఇతర కారణాల వల్ల దద్దుర్లు అకస్మాత్తుగ తగ్గుట – గోర్ల అనారోగ్య స్థితి, వాటి పెరుగుదల ఆగిపోవుట – పుండ్లు, చర్మం పొలుసులు ఊడిపోవుట.

**నేట్రంమూర్ 6X – 12X :** ముఖ్యంగా కీళ్ళ వద్ద నుండు దద్దుర్లను మాన్పును. దీర్ఘకాలంగా వున్న దద్దుర్లు – శారీరక శ్రమ / శరీరం వేడెక్కినప్పుడు అధికంగా వచ్చు దద్దుర్లు – గ్రుచ్చుకొనునట్టి నొప్పి – చోడి గింజలను పోలిన దద్దుర్లు.

**నేట్రంసల్ఫ్ 6X :** మంట, దురదలతోనున్న దద్దుర్లు – పైత్యరస సంబంధమైన దద్దుర్లు.

**కాలీఫాస్ 6X :** నాడీ క్షోభ వల్ల కలుగు దద్దుర్లు.

## 5. వ్రణములు, కురుపులు, పుండ్లు, గుల్లలు, సెగ్గడ్డలు (Abscesses)

దెబ్బ తగులుట, ముల్లు / గాజు పెంకు వంటి పదునైన వస్తువులు గ్రుచ్చుకొనుట, ఇతర కారణాల వల్ల వ్రణములు ఏర్పడును. వ్రణం ఏర్పడిన చోటు తొలుత వాచును. ఆ తర్వాత చీము పట్టును. చీము తొలగిన తర్వాత వాపు తగ్గి నయమగును.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 12X :** కురుపులు[1], రాచపుండ్లు[2], గోరుచుట్టు మొ॥ చీము పట్టు వాటిలో జ్వరం, వేడిమి, కొట్టుకొనుచుండునట్టి నొప్పి, వాపు వున్నచో ఈ మందును తొలుత వాడాలి. దీనిని ఎంత త్వరగా యిస్తే అంత మంచిది. ఇది వ్యాధిని పెరగకుండా చేయును.

**కాలీమూర్ 6X :** కురుపులు, రాచపుండ్లు, గోరుచుట్టు, వ్రణములు – వీటి ద్వితీయ అవస్థలో ఈ మందు ఉపయోగపడును. ద్వితీయ అవస్థ అనగా వాపు వుండి చీము పట్టని స్థితి. ఇది ముఖ్యంగా స్తనములపై ఉండే వ్రణాలకు ఉపయోగపడును. రాచపుండ్లకు, కురుపులకు, ఇతర చీము పట్టు వాటికి కూడా దీనిని వాడవచ్చు. చీము పట్టటానికి ముందు వాపు ఏర్పడకుండా యిది నిరోధించును. దీనిని పైపూతగా కూడా వాడవచ్చు.

**సైలీషియా 6X :** చీము కనిపించిన వెంటనే దీనిని ఇవ్వాలి. ఇది చీము పట్టునట్లు చేయును. ఇది కంతి (tumour) ని త్వరగా పక్వస్థితికి తెచ్చును. ఇది తరచుగా దానిని

*1. **కురుపు (Boil) :** ఇది వాచి చీము కారును*

*2. **రాచపుండు (Carbuncle) :** ఇది సెగ్గెడ్డకన్న పెద్దదిగా ఉండును. దీనికి అనేక తూట్లు పడి చీము కారును.*

పగులునట్లు చేయును. కాలిమూర్ స్తనాల వ్రణాలలో చీము పట్టునట్లు చేసి, చీమును బయటికి వెళ్ళగొట్టలేనిచో సైలీషియాను ఇవ్వాలి. వ్రణం చితికిపోయినను గుల్లగా నున్న చోట ద్రవం చేరే వరకు ఈ మందును కొనసాగించాలి. కనిపించని కురుపులను (Blind boils) నయం చేయుటకు ఈ మందు ఉపయోగపడును. గోరుచుట్టులో సైలీషియా చీము పట్టుటలో సహాయపడును. ఇది క్రొత్తగోరు ఏర్పడునట్లు చేయును. "రెండు గంటలకొకసారి దీనిని ఇచ్చి 24 గంటలలో కంతిని నయం చేయవచ్చు" **(ఏ.పి. డేవిస్).**

**కాల్కేరియాసల్ఫ్ 6× - 30× :** దీనిని సైలీషియా తర్వాత వాడాలి. బాధకు గురైన ధాతువుల మందకొడితనం వల్ల చీము స్రవించుట కొనసాగినచో ఈ మందును వాడాలి. ఇది కురుపులను; వాచి, చీముతో నున్న స్తనాలను (gathered breasts), గోరు చుట్టును చీమును స్రవింపజేయుచున్నచో నయం చేయును. చీము ఉండి, అది బయటకు వెళ్ళుటకు మార్గం ఉన్నచో ఈ మందును వాడాలి అని తెలియజేయును. "దీనిని 12× లో వాడిన గోరుచుట్టును నయం చేయును" – **(W.E.L.)**

**ఈ మందుకు, సైలీషియాకు గల తేడా :**

| కాల్కేరియాసల్ఫ్ | సైలీషియా |
|---|---|
| 1. ఇది చీము పట్టుటను ఆపి వ్రణాలను నయం చేయును. | ఇది చీము పట్టుటను ప్రోత్సహించి, వ్రణాన్ని పక్వస్థితికి తెచ్చి దానిని నయం చేయును. |
| 2. దీనిలో దుర్గంధం ఉండదు | దీనిలో దుర్గంధం ఉండును. |

**జాగ్రత్తలు:** ఇది హెపార్‌సల్ఫ్ (హోమియో) వలె పనిచేయును. కాని దీని పని లోతుగను, తీవ్రముగను ఉండును. ఇది గుదము వద్ద బాధాకరముగ నున్న వ్రణమును, చిగురు కురుపును (Gum - boil) నయం చేయును.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** ఈ మందు క్రింది సందర్భాలలో బాగా ఉపయోగపడును.

1) చీము పట్టుట వల్ల ఎముకకు నష్టం కలుగజేయుట.

2) ఎముకపై క్రొత్తగా ఎముక పదార్థం ఏర్పడుట.

3) గాయపు / వ్రణపు అంచులు గట్టిగా ఉండుట.

గోరుచుట్టుకు ఈ మందును పైపూతగా వాడిన మంచి ఫలితం కనిపించును.

"కటి ప్రదేశమందలి పుచ్చిపోయిన ఎముకకు ఏర్పడే పుండును నయం చేయుటలో ఇది అమూల్యమైన మందు" **– సౌత్ విక్.**

"ఎంతో కాలంగా వున్న స్తనముల చీము వెళ్ళే మార్గంలోని రంధ్రాలను బాగు చేయుటలో దీనిని అమూల్యమైన మందుగా గుర్తించాను" **– జే.డబ్ల్యు. వార్డ్,** ఎం.డి.

**కాల్కేరియాఫాస్ 6× - 12× :** పై మందు, పైన పేర్కొన్న సందర్భాలలో పని చేయకున్నచో దీనిని మధ్య-మధ్య వాడాలి - రోజుకు 3 సార్లు.

**నేట్రంసల్ఫ్ 6× :** అనేక సంవత్సరాలుగా మానని రంధ్రాలుగల పుండ్ల నుండి నీటి వంటి చీము స్రవించుచు, వాటి చుట్టూ వెడల్పాటి నీలపు అంచు వున్నను దీనిని వాడాలి. దీని ఒక మోతాదు మంచి ఫలితాన్ని ఇస్తుంది. పుండ్లు నయమగును. చీము స్రవించు మార్గాలు ఆరిపోవును. గోరుమూలం చుట్టూ ఉన్న వాపు, చీము పట్టుట నయమగును.

**కాలీఫాస్ 6× :** రోగి అధిక నీరసంతో వున్నను, అతని పుండు నుండి స్రవించు చీము అనారోగ్యపు లక్షణాలతో వున్నను ఈ మందు ఉపయోగపడును. చీము రసిగా ఉన్నను, రక్తముతో కూడి ఉన్నను, దుర్వాసనతో మురికిగా నున్నను ఇది ఉపయోగకారి. స్తనముల వాపులో చీము గోధుమ వర్ణంలో మురికిగాను, దుర్వాసనతో ఉన్న ఇది బాగా పనిచేయును.

**గమనికలు :**

1. పై మందులను శస్త్రచికిత్స తర్వాత, ప్రమాదాలు జరిగినపుడు కూడా వాడవచ్చు.
2. చక్కెర వ్యాధిగ్రస్తులు (Diabetic patients) కూడా వీటిని లక్షణాలను బట్టి వాడుకొనవచ్చు.
3. ఇంట్లో లభించే పదార్థాలతో సెగ్గడ్డలకు చికిత్స చేయాలనుకొనే వారు మెంతులను నానబెట్టి రుబ్బుకోవాలి. ఆ ముద్దను వేడిచేసి సెగ్గడ్డలకు పూసిన వాటి నుండి చీము కారిపోవును. తర్వాత ఆ సెగ్గడ్డలు మానిపోవును.

## 6. పుండ్లు, పుండ్లు ఏర్పడుట
## (Ulcers and Ulcerations)

**ఫెర్రంఫాస్ 6× - 12× :** గ్రంథుల పుండ్లు - బలముగా కొట్టుకొనుచుండు నొప్పి, పుండు నొప్పి, ఎరుపు, వేడిమి, రక్తం అధికముగ కూడుట.

**కాలీమూర్ 6× :**

- ★ పుండు - ఫైబ్రిన్ [1] గల స్రావం.
- ★ స్త్రీ గర్భకోశపు ద్వారం పుండు పడుట - చిక్కని, తెల్లని, మృదువైన స్రావం.
- ★ పుండు ఏర్పడిన అన్ని సందర్భాలలోను నాలుక వాచుట / మురికిగా నున్న, తెల్లని నాలుక - నాలుకపై పిండి వంటి పొరలు-ఫైబ్రిన్‌గల స్రావం-మానుచున్న పుండులో మాంసం అత్యధికముగ పెరుగుట - పుండుపై నూకలు అత్యధికముగ ఏర్పడుట.
- ★ కార్నియా పుండు పడుట.

*1. ఫైబ్రిన్ (Fibrin) : రక్తం గడ్డ కట్టుటకు కారణమైన ప్రోటీను.*

**కాలీసల్ఫ్ 3× – 6× :** క్షయచే కలుగు పుండ్లు – వాటి నుండి నిరంతరం పసుపు పచ్చని చీము, లింఫ్ స్రవించుట.

**నేట్రంఫాస్ 3× – 6× :** పొట్ట / ప్రేగులకు పుండు పడుట – సవాయి / సిఫిలిస్ పుండ్లు – వాటిపై పసుపు పచ్చని పూత – ఆ పూత సగం ఎండిన క్రీమువలె ఉండును.

**సైలీషియా 3× – 12× :**

★ కాళ్ళ పుండ్లు లోతుగ పాతుకొని యుండుట – ఎముకల చుట్టూ నుండు తెల్లని పీచువంటి పొర బాధకు గురియగుట.

★ పుండ్లు స్పాంజివలె మెత్తగ నుండుట – అవి మందకొడిగా వ్యాపించుట, రాపిడిచే గట్టిపడిన పుండు అంచులు, రంధ్రం పడిన పుండ్లు – పలచని, దుర్వాసనగల, రసి వంటి పసుపు పచ్చని ద్రవం స్రవించుట.

★ కష్టపడి పనిచేయునట్టి, సరైన పోషణ లేని ప్రజలలో పుండ్లు నెమ్మదిగ వ్యాపిస్తున్నప్పుడు

★ మోకాలి ఎముక ఒరిపిడికి గురియగుట వల్ల పుండ్లు పడుట.

★ దీనిని పైపూతగా కూడ వాడవచ్చు. సైలీషియా వున్న ఎండుగడ్డి కషాయం తీసుకోవచ్చు.

★ చీము ఎక్కువగా పట్టు సందర్భాలలోను, స్క్రూఫులా తత్త్వంకలవారికి, గ్రంథుల వాపు, చీము కారుచున్నప్పుడు ఈ మందును అనేక మోతాదులుగ ఇవ్వవలెను.

**కాల్కేరియాఫాస్ 3× –12× :** ఎముక పదార్థం పుండు పడియున్నచో దీనిని మధ్య–మధ్య వాడాలి.

**కాల్కేరియాసల్ఫ్ 3× – 6× :**

★ గ్రంథులు పుండు పడుట.

★ పుండ్లు తెరుచుకొని యుండుట (Open).

★ ఒరిపిడి, మొటిమలు, గాయములు, కాల్పులు, వేడి ద్రవములు చర్మంపై పడుటచే కలుగు పుండ్లు, కముకు దెబ్బలు మొ॥ వాటిచే చీము స్రవించు పుండ్లు ఏర్పడుట.

★ కాళ్ళ పుండ్లు – పసుపు పచ్చని సీరం, రసి కల పదార్థం స్రవించుట.

**కాల్కేరియాఫ్లోర్ 3× – 12× :** ఎముకలు పుండు పడుట – సిరలు ఉబ్బుట వల్ల కలుగు పుండ్లు – గట్టి అంచులతో ఉబ్బెత్తుగ ఉండు పుండ్లు – చర్మం గాఢమైన ఊదా రంగులోనికి మారుట.

**నివారణోపాయాలు :**

1. చితికిన పుండ్లను శుభ్రంగా కడగాలి.
2. పుండుకు మురికి తగులకుండుటకు, ఈగలు సోకకుండుటకు శుభ్రమైన గాజు గుడ్డతో కట్టు కట్టాలి. ఈ విధంగా ప్రతిరోజు చేయాలి.
3. ఎక్కువ ప్రోటీన్లు ఉన్న ఆహారం, పాలు, పాల పదార్థాలు, గ్రుడ్లు వాడాలి.
4. బాగా ఉడికిన, తేలికగా జీర్ణమయ్యే ఆహారపదార్థాలను తినాలి.
5. పాలు రెండుసార్లు తీసుకోవాలి.
6. కారం, చింతపండు వాడటం మానుకోవాలి / తగ్గించాలి.

## 7. పులిపిరి / ఉలిపిరి కాయలు
**(Warts)**

చర్మంపై మాంసపు ఎదుగుదలను పులిపిరి / ఉలిపిరి కాయ అని అంటారు. ఉలిపిరికాయలు అనేక రకాలుగా ఉంటాయి. కొన్ని మొనదేలి ఉంటాయి. కొన్ని గుండ్రంగా, మెత్తగా ఉంటాయి. కొన్ని గట్టిగా ఉంటాయి. ఇవి శరీరం మీద ఎక్కడైనా రావచ్చు. ఇవి గట్టిగ / మెత్తగ / తొడిమ కలిగి ఉండును.

**కారణాలు :** 1) హోమియోపతిలో సైకోసిస్ మియాజము దీనికి కారణభూతం. 2) గాయాలైన పుడు వైరస్ చర్మంలోని కణాలలోనికి ప్రవేశిస్తుంది. లైంగిక స్పర్శద్వారా వ్యాపిస్తుంది. 3) రోగ నిరోధక శక్తి తగ్గుట. 4) దయాబెటిస్ / ఎయిడ్స్ వంటి రోగాలకు గురియగుట.

**నివారణోపాయాలు :**

1. కొంతమంది సెలిసిక్ యాసిడ్ ఆయింట్‌మెంట్, నైట్రస్ ఆక్సైడ్ ఉపయోగించి ఈ ఉలిపిరి కాయలను తొలగిస్తారు. మరి కొంతమంది ఉలిపిరి కాయలను కరెంటు / లేసర్ కిరణాల సహాయంతో కాల్చివేస్తారు. కొన్ని సందర్భాలలో వాటిని శస్త్రచికిత్స చేసి తొలగిస్తారు. కాని ఆ ఉలిపిరి కాయలు ఆ స్థలములోనో / మరొక చోటనో మళ్ళీ పుట్టును.
2. వీటికి హోమియోపతి / ద్వాదశ లవణ చికిత్సలో మాత్రమే నమ్మకమైన చికిత్స లభిస్తుంది. ఈ విధానాలలో ఉలిపిరికాయల స్వరూపం, అవి లేచిన చోటు, రోగి ఇతర లక్షణాలను దృష్టిలో పెట్టుకొని మందు వాడాల్సి ఉంటుంది. కొన్ని సందర్భాలలో కొద్ది రోజులలోనే వీటిని నివారించుట జరగగా మరికొంత మందికి చాలా కాలం పట్టవచ్చు. మందు పొటెన్సీ ఎంపికపై కూడ ఈ విషయం ఆధారపడి ఉంటుంది.

**• చికిత్స •**

**కాలీమూర్ 6× :** చేతుల మీద వచ్చు పులిపిరి కాయలు – ఈ మందును 3× పొటెన్సీలో ద్రావణం చేసి పైపూతకు వాడవచ్చును.

**నేట్రంమూర్ 6× – 30× :** అరచేతులలో వచ్చు పెద్దవైన, సున్నితమైన పులిపిరికాయలకు లేదా వాటి పొక్కులకు ఈ మందును 3× పొటెన్సీలో పైపూతగా వాడవచ్చు.

**నేట్రంసల్ఫ్ 6× – 200× :** తేమకు అధికంగా గురి అగుటవల్ల వచ్చు పులిపిరి కాయలకు ఇది మంచి మందు. పులిపిరి కాయల నుండి ఇది నీటిని తీసివేసి అవి ముడుచుకు పోవునట్లు చేయును. కంటిచుట్టూ, తల, ముఖం, ఛాతీ, చేతులు మొ॥ చోట్ల వచ్చు ఉలిపిరి కాయలకు ప్రధానమైన మందు.

**సైలీషియా 12× – 30× :** గట్టిగ / మెత్తగ / తొడిమతో ఉండు ఉలిపిరి కాయలకు – చీము స్రవించు చుండును.

## 8. తామర
## (Ring worm)

తామర శరీరపు చర్మంమీద ఏ భాగములోనైనా వృత్తములవలె వ్యాపించి పక్కులు గట్టి పొలుసువలె కనిపించును. ఇది ఫంగస్ సంపర్కం వల్ల కలుగును. అంటువ్యాధి. చర్మం తడిగా ఉన్నచోట వస్తుంది. ముఖ్యంగా చంకలో, స్తనాల క్రింది భాగాన, నడుము చుట్టూ, గజ్జలలో, కాళ్ళమీద వస్తుంది. ఇది బాగా దురదగా ఉంటుంది.

**• చికిత్స •**

**నేట్రంసల్ఫ్ 30× – 200× :** సాధారణంగా ఈ మందును 200× పొటెన్సీలో ఒక డోసు ఇచ్చిన వ్యాధి నయమగును. అలా నయం కానిచో హెచ్చు పొటెన్సీలలో వారానికి ఒకసారి ఇవ్వాలి. 3× పౌడరును పైపూతకు వాడవచ్చు.

**నేట్రంమూర్ 30× – 600× :** ఎండాకాలములో ఎక్కువగ ఉన్నప్పుడు దీనిని పెద్ద పొటెన్సీలలో లోపలికి, పైకి వాడాలి.

**కాలీసల్ఫ్ 3× – 30× :** తలమీద, గడ్డంపైన ఉండి పొలుసులతో ఉన్నప్పుడు దీనిని ఇవ్వాలి.

## 9. గజ్జి
## (Eczema)

గజ్జి ఒక చర్మవ్యాధి. ఇది వయస్సుతో నిమిత్తం లేకుండా అందరికీ వస్తుంది. చంటి బిడ్డలలో, పిల్లలలో నొసలు, బుగ్గలు, తల, చెవుల వెనుక భాగములో, కీళ్ళ

మడతల వద్ద, అప్పుడప్పుడు పిరుదుల వద్ద, జననేంద్రియముల మీద గజ్జి రావచ్చు. తొలుత చర్మం కొంచెం ఎఱ్ఱబడును. అచ్చటకొద్దిగా వాపు, వెచ్చదనం ఉంటుంది. ఆ తర్వాత నొప్పి, ఎక్కువ వాపు, జ్వరం రావచ్చు. నీటి పొక్కులు, చీము పొక్కులు / పచ్చని స్రావం. ఈ విధంగా గజ్జి శరీరంపై వ్యాపిస్తుంది.

**లక్షణాలు :**

1. ఈ వ్యాధి జ్వరంతో ప్రారంభమగును.
2. ఆకలి తగ్గును.
3. రోగి పాలిపోయి నీరసించి యుండును.
4. శరీరం ఎఱ్ఱబడును.
5. నీటి పొక్కులు చిన్న పెసరబద్ద సైజులో గుంపులు గుంపులుగా లేస్తాయి.
6. ఈ పొక్కులు చితికి రసి కార్చును. ఆ రసి ఎండిపోయి పచ్చని అట్ట కట్టును.
7. రోగి వస్త్రములకు రసి అంటుకొన్నచో ఆ వస్త్రములపై కూడ ఆ రసి ఎండిపోయిన తర్వాత అట్ట కట్టును.

**రకాలు :** గజ్జి అనేక రకాలుగ ఉంటుంది. కొన్ని రకాలు క్రింద పేర్కొనబడ్డాయి.

1. చర్మం ఎఱ్ఱగ కందినట్లు ఉండుట – మంట – దురద – చర్మం పొరలుగ ఊడిపోవుట.
2. మొదట చర్మంపై అక్కడక్కడ దద్దుర్లు రావచ్చు. తర్వాత చర్మం రాలిపోయి పుండ్లు కనిపిస్తాయి. తిరిగి పొక్కులు ఏర్పడతాయి.
3. చిక్కని ద్రవం స్రవించుటవల్ల చర్మం పైభాగం తడిగ ఉంటుంది. తర్వాత అది ఎండిపోయి పొలుసులు ఏర్పడును. ఆ పొలుసులను తీస్తే లోపల ఎఱ్ఱని పుండ్లు కనిపిస్తాయి.
4. తలపై చీము పొక్కులు వస్తాయి. పొక్కులు పగిలి చీము కారుస్తాయి. అప్పుడు పొక్కులు పసుపు పచ్చగ / ఆకుపచ్చగ / గోధుమ రంగులో కనిపిస్తాయి.
5. దద్దుర్ల చర్మం దళసరై పొలుసులు ఊడిపోతాయి. ఆ తర్వాత చీము పొక్కులు ఏర్పడవచ్చు.
6. అరచేతిలో, అరికాలులో చర్మం పగిలి బీటలు వారుతుంది. కొద్దిగ నీరులాంటి స్రావం రావచ్చు. కొంత కాలమునకు ఆ పగుళ్ళు ఊడిపోయి చర్మం నునుపు ఎక్కుతుంది.

**కారణాలు :**

1. వంశపరంపరగా రావచ్చు.
2. ఎక్కువ వేడి / చలి / రాపిడి వలన.

3. మూత్రముతో తడిసిన దుస్తులు శిశువుల శరీరానికి తగులుట.
4. సరియగు ఆహారం లేకపోవుట.
5. శిశువులు పాలు త్రాగే వారైనచో పాల దోషమేదైనా ఉండుట.
6. అజీర్ణం / అతిమూత్ర వ్యాధి / గౌటు తత్త్వం / గనేరియా వ్యాధిచే బాధపడుచుండుట.
7. వాక్సినేషన్ దుష్ఫలితాలు.
8. విష కీటకాలు / జంతువులు కరచుట.
9. కొన్ని లోషన్స్ / క్రీములు వాడుట.
10. గుడ్డలు ఉతుకునపుడు వాడు కొన్ని బట్టల సబ్బుల వల్ల.
11. కొన్ని లవణాల లోపం.
12. హోమియోపతి వైద్య విధానం ప్రకారం సోరా ఈ వ్యాధికి ముఖ్య కారణం.

**నివారణోపాయాలు :**

1. శిశువులు మూత్రంతో తడిసిన పక్క బట్టలను ఎప్పటికప్పుడు తీసివేయాలి.
2. వెన్న, జున్ను, బంగాళాదుంపలు, పచ్చళ్లు, టీ, కాఫీ వంటి పానీయాలను మానివేయాలి.
3. తీపి పదార్థాలు తినుట మంచిది కాదు.
4. ఉప్పును తగ్గించాలి.
5. రోగికి పుష్టిగల సాత్విక ఆహారం ఇవ్వాలి.
6. నిమ్మ, నారింజ, బత్తాయి మొ॥ పండ్లు, పాలు మంచివి.
7. చర్మ రోగాన్ని అణచిపెట్టుటకు ఎట్టి ప్రయత్నం చేయరాదు. అలా చేస్తే ఉబ్బసం వంటి భయంకరమైన రోగాలు వచ్చే అవకాశం ఉంటుంది.
8. చర్మ రోగాన్ని తగ్గించాలనే ఉద్దేశ్యంతో ఎలాంటి పూత మందును వాడరాదు. అలా చేస్తే ఇతర వ్యాధులు వచ్చే అవకాశం ఉంటుంది.
9. దద్దుర్లు, పుండ్లకు రాత్రిపూట పడుకొనేటప్పుడు కొబ్బరినూనె పూయాలి. దీనివల్ల దురద తగ్గుతుంది.

## • చికిత్స •

**కాలీమూర్ 6× – 12× :** చిన్నపిల్లల తలపైన, ముఖంమీద పొలుసు ఊడెడి దద్దుర్లు – అశుభ్రమైన లింపు వ్యాక్సిన్‌ను వాడిన తర్వాత వచ్చు దద్దుర్లుకు దీనిని ఫెర్రంఫాస్‌తో మార్చి – మార్చి వాడాలి. గర్భాశయ వ్యాధుల తర్వాత వచ్చు గజ్జి – నాలుక పొడిగ ఉండుట – చర్మంపై పిండి వంటి పొలుసులు – నాలుకపై తెల్లని పూతతో అల్బుమిన్ వంటి స్రావం – చిన్న బొబ్బలు – దీర్ఘకాలంగా ఉన్న మొండి గజ్జికి ఈ మందు అద్భుతంగా పనిచేసిన సందర్భాలు అనేకం ఉన్నాయి.

**కాలీసల్ఫ్ 6× - 12× :** పసుపు పచ్చని స్రావం వెలువడుట - అకస్మాత్తుగ అణచివేయబడిన గజ్జికి మంచి మందు.

**నేట్రంమూర్ 6× - 12× :** తెల్లని పొలుసులు - నీళ్ళవంటి పదార్థాలతో నున్న దద్దుర్లు - అత్యధికంగా ఉప్పు తినుట వల్ల వచ్చు గజ్జికి దీనిని వాడాలి.

**నేట్రంఫాస్ 3× - 6× :** ఆమ్లత్వ లక్షణాలు - స్రావములు క్రీమువలె, తేనె రంగులో - బంగారు పసుపు పచ్చ రంగులో నున్న పక్కులు - చిన్న పిల్లల చెవుల వద్ద చిన్న పొక్కులు.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** సిరలలో రక్తం అధికమగుట వల్ల వచ్చు గజ్జి - తేమ వాతావరణములో గజ్జి అధికమగుట - రాత్రిపూట గజ్జి బాధలు తక్కువగుట - చర్మం గట్టిగా నగుట, చర్మంలో చీలికలు - ఈ లక్షణాలతో నున్న పొలుసులతో కూడిన గజ్జి - మొలల కారణంగా గుదము వద్ద వచ్చు గజ్జి.

**నేట్రంసల్ఫ్ 6× :** ద్రవంగల చిన్న పొక్కులు, దద్దుర్లు - వీటి నుండి పసుపు పచ్చని, నీళ్ళవంటి స్రావం వెలువడుట - పసుపు పచ్చని పొలుసులు.

**కాల్కేరియాఫాస్ 6× :** చర్మంపై దద్దుర్లు - పసుపు పచ్చని తెల్లని పక్కులు - తెల్లని సొనలాంటి ఆల్బుమిన్‌ను కలిగి యుండుట - రక్తహీనత - వాతావరణ మార్పువల్ల శుష్కింపజేయు గజ్జి వచ్చుట.

## 10. గాయములు, దెబ్బలు
### (Wounds)

ఆధునిక కాలంలో జీవితం బిజీగా మారుతున్నది. నెమ్మదిగా కూర్చొని భోజనం చేయటానికి కూడా అవకాశం లభించని ఈ యుగంలో అనేక మంది రవాణా సాధనాలను వాడుతున్నారు. స్కూళ్ళు, కాలేజీలకు వెళ్ళే విద్యార్థులకు సైకిళ్ళు, ద్విచక్ర వాహనాలు (Two wheelers) అత్యంత అవసరం అవుతున్నాయి. వాటిని వాడితేనే వారు స్కూళ్ళు / కాలేజీలు / ట్యూషన్లు సమయానికి చేరుకోగల పరిస్థితి ఏర్పడుతున్నది. ప్రయాణీకులకు, సరుకు రవాణా చేయటానికి బస్సులు, లారీలు, ఆటోలు మొ॥వి బాగ ఉపయోగ పడ్తున్నాయి. దీనివల్ల ప్రతిరోజు రోడ్డు జామ్‌లే కాకుండా రోడ్డు ప్రమాదాలు కూడ సంభవిస్తున్నాయి. డ్రైవర్ల నిర్లక్ష్యం, వారు వేగంగా నడపటం, ఇరుకైన రోడ్లు, రవాణా సాధనాలు అధికం కావటం, రోడ్డు నియమాలు పాటించక పోవుట మొ॥ కారణాల వల్ల ప్రమాదాల సంఖ్య విపరీతంగా పెరుగుతున్నది. ఈ ప్రమాదాలలో కొంతమంది మరణించటం, మరికొంత మంది గాయపడటం / దెబ్బలకు గురియగుట జరుగుతున్నది. ఇంకొంత మందికి ఎముకలు విరగటం / వికలాంగులు కావటం కూడ జరగవచ్చు.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6X - 30X :** చితకకొట్టబడిన గాయాలకు, ఎముకలు విరుగుట, మెత్తని భాగాలకు కలిగే గాయాలు / దెబ్బలు మొ॥ వాటికి తొలి మందు - కోతలు, క్రిందపడుట, గ్రుద్దులు, తాజాగా జరిగిన గాయాలు, బెణుకులు - వీటికి మొదటి మందు. ఈ మందు నొప్పిని, రక్తప్రసార దోషములను, వాపును / జ్వర లక్షణాలను నివారించును - ఈ మందును పూతగా కూడ వాడవచ్చు - స్నాయువుల / కండరాల బంధనముల ప్రయాసను తొలగించును. విరిగిన ఎముకల అంచుల రాపిడి వలన కలుగు ధ్వనులు.

**కాలీమూర్ 6X :** విరిగిన, కములునట్లు దెబ్బ కొట్టబడిన అవయవముల వాపుకు - వాపుతో నున్న కోతలకు దీనిని వాడాలి. బెణుకులను పుష్కలంగా పెరిగిన కణజాలమును, మానుతున్న గాయం చుట్టూ అత్యధికముగా వచ్చే మాంసపు కండను తగ్గించుటకు దీనిని రెండవ మందుగా వాడవచ్చు. చితక కొట్టబడిన గాయము నయమైన తర్వాత చర్మముపైన మిగిలిన రక్తపు గూళ్ళను ఈ మందు తొలగిస్తుంది. కోకా బట్టర్‌తో ఈ మందును వాడిన బాగా ప్రయోజనకరముగ నుండును.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** చితకకొట్టబడిన గాయములు, కోతలు మొ॥వి నిర్లక్ష్యము చేయబడగా చీము పట్టుట, గాయములు చీమును స్రవింపజేయుట

**కాల్కేరియాఫ్లోర్ 6X :** ఎముకలు, కాలి ముందు అంచులు చితకకొట్టబడగా ఏర్పడిన గాయాలకు.

**సైలీషియా 6X :** చీము పట్టుచున్న, చీము పట్టునట్లు బెదిరించు, నిర్లక్ష్యం చేయబడిన గాయాలు - చిక్కని, పసుపు పచ్చని పదార్థాన్ని స్రవింప చేస్తున్న గాయాలు - చీము లోతుగా వుండుట - ఈ మందును తొలుత వాడి, తర్వాత కాల్కేరియాసల్ఫ్‌ను వాడాలి.

**నేట్రంసల్ఫ్ 6X :** కపాలమునకు గాయములు కలుగుట వలన కలుగు దుష్పరిణామములు - తలకు దెబ్బ తగులుట వలన వచ్చు మానసిక ఇబ్బందులు.

## 11. కాలిన గాయములు
## (Burns)

శరీర భాగమునకు వేడిమి, నిప్పు, మంట, సెగ, ఆమ్లము, విద్యుచ్ఛక్తి, ఎక్స్/రేడియమ్ కిరణాల స్పర్శ వలన గాయము / గాయములు అగును.

**నివారణోపాయాలు :**

1. నిప్పు అంటుకొన్న మనిషి పరుగెత్తరాదు. క్రింద పడి దొర్లవలెను. పైన ఉండే దుస్తులు సాధ్యమైనంత వరకు తీసివేయాలి. మంట వ్యాపించకుండ లావుపాటి కంబళిని / పరుపును కప్పాలి.

2. విద్యుద్ఘాతము సంభవించినప్పుడు విద్యుత్ సరఫరాను ఆపివేయాలి.
3. రోగ నిరోధక శక్తి తక్కువగా ఉన్న వారిలోను, విటమిన్ 'సి' తక్కువగా ఉన్నవారిలోను గాయాలు త్వరగా మానవు. అట్టివారు పుల్లటి పండ్లరసాలను త్రాగవచ్చు. చక్కెర వ్యాధి లేనివారు ఆ రసాలలో తేనె వేసుకోవచ్చు.

## • చికిత్స •

**కాలీమూర్ 6× - 12× :** కాలిన గాయాలు - సలసల కాగే నీరు చర్మముమీద పడుటచే ఏర్పడిన బొబ్బలు[1] - బొబ్బ నుండి తెల్లని / బూడిద వర్ణపు స్రావము చెమర్చుట - ఈ మందును పైకి కూడ వాడవచ్చు.

**కాల్కేరియాసల్ఫ్ 6× - 12× :** గాయముల నుండి చీము కారుచున్నచో.

**నేట్రంఫాస్ 6× :** గాయముల నుండి చీము కారుచున్నచో - ఈ మందును పైపూతగా కూడా వాడవచ్చు.

**నేట్రంమూర్ 6× - 12× :** బొబ్బలు ఏర్పడినప్పుడు వాడాలి.

# 12. పొంగు
## (Measles)

ఇది ఒక అంటువ్యాధి. సాధారణముగ చిన్న బిడ్డలకు వస్తుంది. పెద్దలలో చాల అరుదు. ఒకసారి వచ్చిన వారికి తిరిగి రాదు.

**లక్షణములు :**

**పొంగు కలుగబోవు ముందు కనిపించు లక్షణములు :**

i) **జలుబు లక్షణాలు :** కళ్ళనుండి, ముక్కునుండి నీటివంటి స్రావం విస్తారంగా వచ్చుచుండుట.

ii) **దగ్గు లక్షణాలు :** హ్రస్వముగను, బాధాకరముగను, పొడిగను ఉండు దగ్గు.

iii) **కళ్ళ లక్షణాలు :** నీటితో కూడియుండుట, కొద్దిగానో, గొప్పగానో వాచుట.

**పొంగులో లక్షణాలు :**

i) తొలి రోజున జ్వరము, తలనొప్పి, ఒడలు నొప్పులు తీవ్రముగ నుండుట - ఉష్ణము 103° ఉండుట.

ii) నాలుగవ రోజున ముఖం మీదను, మెడమీదను దద్దుర్లు బయలుదేరి శరీరమంతటా వ్యాపించుట - దద్దుర్లు ఎర్రగను, చిన్నవిగను, గుండ్రముగను ఉండి నొక్కిన తెల్లగ మారుట, తడి లేకుండుట.

---

*1. బొబ్బ - దీనిలో ద్రవము చర్మము అడుగున చేరును.*

iii) ఆ దద్దుర్లు 2-3 రోజులలో పైకి లేచును - ఆ విధంగా మూడు రోజులు ఉండుట.
iv) ఆ తర్వాత జ్వరం తగ్గుట - దద్దుర్లు అణగిపోయి నల్లబడుట.
v) మొత్తము వ్యాధి తగ్గుటకు 15 రోజులు పట్టుట.

**పొంగు తర్వాత :** పొంగు తర్వాత కొందరిని అతిసారం / నీళ్ళ విరేచనాలు, దగ్గు, న్యుమోనియా, కంటి వ్యాధులు, కీళ్ళ వాపులు మొ॥ వ్యాధులు బాధిస్తాయి.

**పొంగుకు, స్కార్‌లెట్ జ్వరమునకు గల తేడాలు :**

| పొంగు | స్కార్‌లెట్ జ్వరం |
|---|---|
| 1. జ్వరం తగిలిన 4 లేక 5వ రోజున దద్దుర్లు / పొక్కులు బయలుదేరును. | జ్వరం ప్రారంభమైన 1 లేక 2 రోజులలోనే దద్దుర్లు /పొక్కులు లేచును. |
| 2. దగ్గు ముఖ్య లక్షణం. | గొంతు నొప్పి ముఖ్య లక్షణం. |

**నివారణోపాయాలు :**

1. దద్దుర్లు / పొక్కులు పైకి వచ్చుటకు వేడినీటిలో ముంచిన దూదిని శరీరంపై రుద్దాలి.
2. కళ్ళపై వెలుతురు పడనీయరాదు.
3. గదిని శుభ్రంగా ఉంచాలి.
4. బార్లీ గంజిని, పలచని పాలను ఇవ్వాలి.

**వ్యాధి నిరోధకము :** పొంగుకు సాధారణంగా మందు వాడుట తక్కువ. కాని పొంగు విశేషముగ ప్రబలినపుడు ఫెర్రంఫాస్ 6× ను వారం రోజులు ఇచ్చిన వారికి పొంగు తగలకుండా కాపాడును లేదా తగిలినా తేలికగా తేలిపోవును.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× :** పొంగు అన్ని దశలలోను ముఖ్యంగా పొంగు వ్యాధి కలుగుటకు ముందు కలుగు బాధలకు, లోతులేనట్టి వ్యాధికి, ఛాతీ, కళ్ళు, ముక్కు / చెవుల వాపుకు సంబంధించిన బాధలకు మంచి మందు.

**కాలీమూర్ 6× :** గొంతు బొంగురుపోవునట్లు చేయు దగ్గునకు, గ్రంథుల వాపులకు - తెల్లని / బూడిద వర్ణపు పూతతో నాలుక ఉండుట - ఈ లక్షణాలకు రెండవ మందుగా ప్రయోజనకారి. పొంగు తర్వాత వచ్చు నీళ్ళ విరేచనాలు, తెల్లని / తేలిక రంగుగల నీళ్ళ విరేచనాలు, తెల్లని పూతతో నాలుక వుండుట - గొంతువాపుతో చెవుడు కలుగుట.

**కాలీసల్ఫ్ 6× :** అణచబడిన దద్దుర్లు - దద్దుర్లు అకస్మాత్తుగ తగ్గుట - చర్మము కఠినముగను, పొడిగను మారుట - ఈ మందు దద్దుర్లు తిరిగి వచ్చునట్లు చేయును.

**నేట్రంమూర్ 6× :** పొంగులో కన్నీరు / లాలాజలం అధికంగా ఉన్నచో ఈ మందును మధ్య - మధ్య వాడాలి.

## 13. ఆటలమ్మ / చిన్నమ్మవారు
(Chicken - Pox)

ఆటలమ్మ అంటువ్యాధి. బహుళ వ్యాపకం. ఇది మసూచి కన్న తక్కువ ఉద్ధృత మైనది. దీని పొక్కులు మసూచి పొక్కులు వలె ఉంటాయి. కనుక కొంతమంది వీటి పొక్కులను చూసి మసూచి పొక్కులు అని భావిస్తుంటారు. వీటి మధ్య ఉన్న తేడాను తెలుసుకొనుట మంచిది. తేడాను గమనించండి.

| మసూచి | ఆటలమ్మ |
|---|---|
| 1. పొక్కులు సాధారణముగ ముఖం మీద వచ్చును. | పొక్కులు దేహ భాగాలపైనే వస్తాయి. ముఖముపై అరుదు. |
| 2. జ్వరం వచ్చిన తర్వాత పొక్కులు వస్తాయి | జ్వరం ఉద్ధృతి తక్కువ. |
| 3. పొక్కులలో చీము ఉంటుంది. | పొక్కులలో చీము ఉండదు. నీరుంటుంది. |
| 4. పొక్కులు మధ్యలో గుంటలు పడి ఉండును. | పొక్కులు మొనదేలి ఉండును. |
| 5. మూడు రకాలు. | రకాలు లేవు. |

ఆటలమ్మ ఒక వారంలో సమసిపోతుంది. దానిలో మసూచిలో వలే మచ్చలు, గుంటలు పడవు.

**నివారణోపాయాలు :**

1. ఎక్కువ విశ్రాంతి అవసరం.
2. పుష్టికరమైన మితాహారమును ఇవ్వాలి.

### • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× :** ఆటలమ్మకు ఈ మందు బాగా పనిచేయును. కొన్ని సందర్భాలలో వ్యాధి లక్షణాలను బట్టి కాలీమూర్, కాల్కేరియాసల్ఫ్, నేట్రంసల్ఫ్, సైలీషియాతో దీనిని మార్చి వాడాలి.

## 14. మసూచికం / స్ఫోటకం / పెద్దమ్మవారు
(Small Pox)

ఇది అపాయకరమగు అంటువ్యాధి. ప్రపంచమంతటా ఈ వ్యాధి ప్రస్తుతం నిర్మూలింప బడింది.

**లక్షణాలు :**

1. ఈ వ్యాధి జ్వరంతోను, చీము పొక్కులతోను ప్రారంభమగును.

2. 3/4వ రోజున ఎర్రని మచ్చలు / గట్టి పొక్కులు మొదట ముఖం మీద, మెడమీద కనబడును. తర్వాత శరీరము మీద, కాళ్ళ మీద ఏర్పడును.
3. 8వ రోజుకు పొక్కులు ఎదుగును. పొక్కులందలి నీరు క్రమముగ చీముగ మారును. పొక్కు కేంద్రం సొట్టగను, చుట్టూ ఎర్రగను అగును. పొక్కులు కనిపించినపుడు జ్వరం కొద్దిగ తగ్గి, మరల పెరుగును.
4. సుమారు 8 రోజులకు పొక్కులు పగిలి చీము కారును. తర్వాత పక్కు కట్టును. ఆ పక్కులు కూడ రాలి సొట్టలు ఏర్పడును.
5. 12 రోజులకు తీవ్ర జ్వరం, చలి, తలనొప్పి, వాంతులు కలుగును.

### • చికిత్స •

**కాలీమూర్ 3×–6× :** ఇది ఈ వ్యాధికి ప్రధానమైన మందు. ఈ మందు చీము పొక్కుల ఏర్పాటును నియంత్రిస్తుంది. డాక్టర్ సౌందర్ దీనిని ఈ వ్యాధి నిరోధకం అని గట్టిగ చెప్పారు. వ్యాధి సోకిన ముందు / తర్వాత కాలీమూర్‌ను 3× పొటెన్సీలో తీసుకొన్న అతని రోగులెవరికీ మసూచికం సోకలేదని తెలుస్తుంది.

**ఫెర్రంఫాస్ 3×–12× :** జ్వరం అధికంగ ఉంటే ఈ మందును కాలీమూర్‌తో మార్చి వాడాలి.

**కాలీఫాస్ 6× :** దుర్వాసన గొలుపు పరిస్థితులు – గాఢమైన వాసన – ఎక్కువగ క్షీణించుట – అధిక నీరసం – స్పృహ పూర్తిగగాని కొంతవరకు గాని పోవుట – అధిక నీరసం ఉండుట – రక్త కణాల విచ్ఛేదనాన్ని తెలుపుట.

**నేట్రంమూర్ 6×–30× :** చొంగ కారుట – చిన్న గుండ్రని చీము పొక్కులు ఒక దానితో మరియొకటి కలసిపోవుట – నిద్రమత్తు.

**కాల్కేరియాసల్ఫ్ 3×–6× :** చీము పొక్కులు చీమును స్రవింపజేయుట.

## 15. మేఖలిక విసర్పిణి / సర్పి
## (Herpes Zona / Zoster)

విసర్పి / సర్పి వైరస్ వల్ల వస్తుంది. ఇది ఏ శరీరపు అవయవములో వచ్చునో దానిని బట్టి దానికి పేరుండును. జననేంద్రియములపైన వచ్చు సర్పిని హెర్పస్ జెనిటాలిస్ (Herpes geneitalis), పెదవుల మీద వచ్చు సర్పిని హెర్పస్ లేబియాలిస్ (Herpes labialis), నడుముపై వచ్చు సర్పిని హెర్పిస్ జోస్టర్ (Herpes zoster), కనురెప్ప, శుక్లపటలం, నుదుటిపై వచ్చు సర్పిని హెర్పస్ జోస్టర్ ఆఫ్తాల్‌మికస్ (Herpes zoster ophthalmicus) అనియు అందురు.

**లక్షణాలు :** 1) ఇది చర్మవ్యాధి. 2) దీనిలో పెద్ద / చిన్న ద్రవపు పొక్కులు లేచును. 3) పొక్కులోని ద్రవం మొదట నీటివలె ఉండును. తర్వాత పక్కు కట్టును. 4) 2-3 వారాలు పై విధంగా ఉన్న తర్వాత నరము పొడుగునా బొబ్బలు లేచును. జ్వరం, చలి, తలనొప్పి, నరము నందు నొప్పి, మంట, బిర్రబిగియుట ఉండును. 5) ఈ వ్యాధి సాధారణముగ శరీరంలో ఒక వైపు కలుగును.

**• చికిత్స •**

**కాలీమూర్ 6X :** శరీరపు సగభాగమున నరము పొడుగున నీటిపొక్కులు గుంపులు, గుంపులుగ లేచి తీవ్రమగు వాపుతో బాధాకరముగ నుండుట - నాలుకపై తెల్లని పూత.

**నేట్రంమూర్ 6X :** ఏ వ్యాధిలోనైనా హెర్పస్ దద్దుర్లు లేచిన దీనిని రెండవ మందుగా వాడాలి.

**కాల్కేరియాఫాస్ 6X :** తరుణ/దీర్ఘకాలపు హెర్పస్ దద్దుర్లకు ఈ మందును ఎంపిక చేసిన మందుతో మార్చిమార్చి వాడాలి.

## 16. విసర్పి
## (Erysipelas)

ఇదొక చర్మ వ్యాధి.

**లక్షణములు :**

1. ఈ వ్యాధి ప్రారంభమగుటకు పూర్వం అలసట, ఆకలి లేకపోవుట, నిద్రలేమి, జ్వరం, తలనొప్పి, మలబద్ధకం, వికారం, వాంతి వుండును.
2. తర్వాత ముఖం మీద, తలపైన, మెడమీద, పొత్తికడుపుపైన ఎర్రని దద్దుర్లవలె పొక్కులు బయలుదేరును. నొక్కినచో ఈ పొక్కులు తాత్కాలికముగా అణగిపోవును. ఈ పొక్కులు ఒకవైపు నుండి మరొక వైపునకు ప్రాకును. సాధారణ వ్యాధియైనచో 10-15 దినములలో తగ్గిపోవును.
3. రోగము తీవ్రస్థాయిలో వున్నచో జ్వరం 102°-104°ల వరకు పెరుగును. శరీరము యొక్క ఇతర భాగాలకు ఈ వ్యాధి వ్యాపించును. ఈ పొక్కులు వాచును, మండును, చీము పట్టి రసి కారును. కొన్ని సందర్భాలలో సంధి లక్షణాలు కనిపించును.
4. చివరి దశలో పొక్కులు పక్వమై, పగిలి రసి కారును. పుండ్లయి మాంసమును కూడా క్రుళ్ళజేయును. తీవ్రమైన పైత్యలక్షణములు కనిపించును.

**కారణములు :** 1) గాయములు తగులుట, 2) టీకాలు వేయబడుట, 3) బొడ్డుకోయుట, 4) జీర్ణకోశ దోషాలు, 5) చలిగాలి సోకుట, 6) పరిశుభ్రమైన గాలి, వెలుతురు లేనిచోట నివసించుట, 7) స్త్రీల ఋతుసమయం అగుట, 8) ఉప్పు, కారము ఎక్కువగా తినుట.

**నివారణోపాయాలు :**

1) రోగికి చలిగాలి తగలనివ్వరాదు.
2) రోగి వాడిన గుడ్డలను ఇతరుల గుడ్డలతో కలపకుండా వేరుగా వుంచాలి. డెట్టాల్ కలిపిన గోరువెచ్చని నీటితో ఆ గుడ్డలను ఉతకాలి.
3) రోగికి తేలికయైన, ఉద్రేకం కలిగింపని, కారం, మసాలాలు లేని సాత్విక ఆహారం పెట్టాలి.
4) రోగిని బాగుగా గాలివీచునట్టి, ప్రకాశవంతమైన గదిలో వుంచాలి.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 3×-12× :** ప్రారంభంలో చర్మం గులాబి రంగులో వుండి జ్వరం, నొప్పి, వాపు యొక్క తీవ్ర లక్షణాలతోనున్నపుడు పనిచేయును.

**నేట్రంసల్ఫ్ 6× :** ఇది ప్రధాన ఔషధము. కోమలమైన, ఎర్రని, మెరుస్తున్న బొబ్బలు లాగా వుండు విసర్పి - చర్మం బాగా పొంగరించుట - పసరు పడవచ్చు/పడకపోవచ్చు (అనగా పైత్యరసపు వాంతికావచ్చు/కాకపోవచ్చు అని అర్థం)

**కాలీమూర్ 3×-6× :** చిన్నపొక్కులుగల విసర్పికి ముఖ్యమైన మందు - విసర్పి పెద్ద బొబ్బలు లేచుట.

**నేట్రంఫాస్ 6× :** కోమలమైన, ఎర్రని, మెరియుచున్న, ముళ్ళు గ్రుచ్చుకొనునట్లుండు విసర్పి - బాధతో, వాపుతోనున్న చర్మముపై గుల్లగానుండు చోట్ల ద్రవం కూడును.

**కాలీసల్ఫ్ 6× :** చివరిదశలో పొక్కులు చితికి రసికారుటకు ఈ మందు సహాయపడును.

**కాలీఫాస్ 6× :** రోగపు ఆఖరిదశలో ఈ మందు ఉపయోగపడును. ఆ దశలో పొక్కులు చితికి పుండ్లు పడును. స్రావము నుండి దుర్వాసన వెలువడును. మాంసము కుళ్ళు స్థితిలో వుండును.

**నేట్రంమూర్ 6× :** రోగము బాగా ముదిరినపుడిది బాగుగా పనిచేయును.

## 17. సోరియాసిస్
### (Psoriasis)

ఇది దీర్ఘకాలపు చర్మవ్యాధి. అంటువ్యాధి కాదు. ఇది వస్తూ పోతూ ఉంటుంది. దీనిలో ఎర్రటి మచ్చలు పుట్టి క్రమేణా అవి నల్లగా మారి, వాటి మీద నుంచి ఎండిన పొగడపువ్వుల వంటి తెలుపు/బూడిద రంగుగల పొలుసులు రాలుతుంటాయి. నీటి పొక్కులు/చీము పొక్కులు ఉండవు. దురద, మంట, బాధ ఎక్కువగా ఉండును. దురద అధికమై గీకుతుంటే పొలుసులు అధిక సంఖ్యలో రాలిపోవును.

సోరియాసిస్ రోగులలో చర్మపు కణముల వృద్ధి వేగం ఇతరులలోని కణముల వృద్ధి వేగం కంటె పదిరెట్లు ఎక్కువగ ఉండును. ఇది అన్ని వయస్సుల వారికి రావచ్చు. కాని యౌవనంలో ఉండే వారికి ఎక్కువగా వస్తుంది. ఈ వ్యాధిలో ఏర్పడు మచ్చలు గుండ్రంగా/ఆకారం లేకుండా ఉండును. దీని మచ్చలు సాధారణంగా అరిచేతులలోను, అరికాళ్ళయందు, మోచేతులలోను, మోకాళ్ళలోను, కపాలపు ఎముకలను కప్పియుంచు చర్మంపైన వచ్చును. ముఖం సాధారణంగా ఈ వ్యాధికి గురికాదు. కొంతమందిలో ఒక మచ్చ మరియొక మచ్చతో కలిసియుండును. ఈ వ్యాధికి సరైన కారణం ఇంతవరకు తెలియలేదు. ఈ వ్యాధిలో అనేక రకాలు గలవు. వాటిలో కీళ్ళ నొప్పులు గల సోరియాసిస్ ప్రధానమైనది. సోరియాసిస్ చికిత్సకు కొన్ని నెలలు/సంవత్సరాలు పట్టచ్చు. ఎందుకనగా మొండిగ నుండు సోరియాసిస్ ప్రదేశములు తరచు పగిలి, నెరదలు బారి, దళసరి పొలుసుతో కప్పబడియుండును.

### • చికిత్స •

**కాలీసల్ఫ్ 6X :** ఈ మందు ఎక్కువగా పొలుసులు ఊడుచున్న అనేక మంది రోగుల వ్యాధిని నయం చేసింది.

**కాల్కేరియా ఫ్లోర్ 6X :** కాళ్ళు–చేతుల సోరియాసిస్ – అసాధారణంగా కాళ్ళు–చేతులలో రక్తం అధికంగా చేరుట వల్ల ఏర్పడిన గాఢమైన ఎర్రని మచ్చ.

## 18. కంతులు, కేన్సర్ / క్యాన్సర్
## (Tumours, Cancer)

శరీరంలో కొన్ని కణాలలో విభజన అదుపు లేకుండా అత్యధికంగా జరిగి కణాలు ఒకచోట చేరి కంతిలాగా ఏర్పడును. ఈ విధంగా కణముల నూతన ఎదుగుదల కంతి అని తెలియుచున్నది. ఇది సహజ ధాతువులను పోలియుండును. ఇది శరీరమునకు ఉపయోగపడే పనిని చేయదు. ఇది శరీరం నుండి బలాన్ని తీసుకొని ఎదుగుచుండును.

ఈ కంతులు రెండు రకాలు – 1) అపాయకరం గాని కంతులు 2) అపాయకరమగు కంతులు. అపాయకరంగాని కంతులు చుట్టూవున్న ధాతువులలోనికి వ్యాపించవు. వీటిని శస్త్రచికిత్సచే తొలగించిన సాధారణముగ మరల కలగవు. అపాయకరమగు కంతులను క్యాన్సర్ కంతులు లేక పుట్టువ్రణములు అని అంటారు. ఇవి త్వరితముగ వృద్ధి పొంది అపాయం కలిగిస్తాయి. ఇవి రక్తం/లింఫ్ ద్వారా శరీరమంతా పాకుతాయి. అక్కడ మళ్ళీ పిలకలు వేస్తాయి. పీత/ఎండ్రకాయ ఇసుకలో బొక్కపెట్టినట్లు ఈ కంతులు శరీరాన్ని తొలచివేస్తాయి. కనుకనే వీటిని క్యాన్సర్ అని అంటారు. క్యాన్సర్ అనే మాటకు ల్యాటిన్‌లో

crab (ఎండ్రకాయ) అని అర్థం. ఈ క్యాన్సర్ కంతులు చుట్టూవున్న ధాతువులలోనికి వ్యాపించి, వాటిని నాశనం చేయును. శస్త్రచికిత్స, కీమోథెరపి[1], రేడియేషన్ థెరపీ ద్వారా వీటిని తొలగించినా సాధారణంగా మరలా వచ్చే ప్రమాదం ఉంటుంది. కనుక ద్వాదశలవణ చికిత్స ఆరంభం నుండి వాడిన సత్ఫలితం కలగవచ్చు.

ఇదివరకటి కంటే నేడు క్యాన్సర్ వ్యాధిగ్రస్తుల సంఖ్య పెరుగుచున్నది. పట్టణ స్త్రీలు రొమ్ము క్యాన్సర్‌తోను, గ్రామీణ ప్రాంతపు స్త్రీలు గర్భాశయద్వారపు క్యాన్సర్‌తోను ఎక్కువగ బాధపడుచున్నారు.

**నివారణోపాయాలు :**

1. అధిక బరువు ఉన్నవారిలో ఈస్ట్రోజన్, ఇన్సులిన్ స్థాయి ఎక్కువగా ఉంటుంది. ఈస్ట్రోజన్, ఇన్సులిన్ రెండూ కేన్సర్ కారక కణాలను ఎక్కువగా అభివృద్ధి చేస్తాయి. కనుక అధిక బరువు ఉన్నవారు బరువు తగ్గించే చర్యలు గైకొనాలి.
2. మెనోపాజ్‌కు గురయ్యేముందు శారీరక వ్యాయామం చేయుట ద్వారా రొమ్ము కేన్సర్ నుండి కాపాడుకోవచ్చు.
3. క్యాబేజి, కాలిఫ్లవరు, మొలకెత్తిన విత్తనాలు అధికంగా తీసుకోవాలి.
4. పిల్లల్ని కనటం, పాలిచ్చి పెంచడం కూడా క్యాన్సర్‌ను రక్షిస్తాయి.

## • చికిత్స •

**కాలీమూర్ 3×–6× :** ఈ మధ్యనే స్తనాలలో ఏర్పడిన క్యాన్సర్ కంతులు – కోమలత్వం ఆ కంతుల ముఖ్య లక్షణం – స్తనాలలో క్యాన్సర్ కంతులు గుత్తులవలె ఉండుట, అవి మృదువుగ ఉండుట – ఈ లక్షణాలకు కాలీమూర్ 3×ను వాడాలి. **(ఇ.జి.జోన్స్)**

**కాలీఫాస్ 3×–30× :** క్యాన్సర్ నొప్పి, దుర్వాసన గల స్రావం, చర్మం రంగు మారుట– క్యాన్సర్ కంతి తొలగింపబడి, అది నయమగు స్థితిలోనున్నప్పుడు ఈ మందు ఉపయోగపడును.

**కాలీసల్ఫ్ 6×–30× :** చర్మపు ఆమత్వక్కు పొరకు దగ్గరగా నుండు క్యాన్సర్ కంతి – దాని నుండి పలచని, పసుపుపచ్చని, సీరం అధికంగా స్రవించుట.

**నేట్రంమూర్ 6×–12× :** నాలుక క్రింద కలుగు మెత్తని కంతి – క్రింది పెదవి మధ్యలో కలిగిన లోతైన అల్సర్ – మలేరియా తర్వాత వచ్చు గర్భకోశ కేన్సర్.

**ఫెర్రంఫాస్ 12× :** క్యాన్సర్ కంతి నొప్పికి ఇది మరొక మందు. నాలుక క్యాన్సర్ దీనివల్ల నయమైంది.

*1. **కీమోథెరపి :** నోటిలోనికి మందులు వేసుకొనుట ద్వారాను, నరాలలోకి ఇంజక్షన్లు ఎక్కించుట ద్వారాను కేన్సర్‌ను నయం చేయుటను కీమోథెరపీ అని అంటారు. దీనివల్ల వ్యాధి నిరోధక శక్తి తగ్గుతుంది.*

**కాల్కేరియాఫాస్ 6×** : స్క్రుపులా తత్త్వం కలవారి క్యాన్సర్ కంతు – ఇల్లాలి మోకాలువద్ద గల ఆమత్వక్కు క్యాన్సర్ – తరుణ/దీర్ఘకాలపు ఆమత్వక్కునకు సంబంధించిన కంతులు – థైరాయిడ్ గ్రంథి పెరుగుట.

**కాల్కేరియాసల్ఫ్ 6×** : సీరం వాపులు, ఆమత్వక్కుకు సంబంధించిన కంతులు – గాయం/పుండు పై భాగమున అధికముగా నూకల వంటివి ఏర్పడుట – అధికముగా చీముపట్టుట.

**కాల్కేరియాఫ్లోర్ 6×–30×** :

- ★ అప్పుడే పుట్టిన శిశువుల తలలపై ఉండు రక్తపు కంతులు – స్త్రీ స్తనములోని ముడులు, గింజలు, గట్టి గ్రంథులు – కనురెప్పలపై కంతులు – కనురెప్పలోపలి అంచు నందుండు క్రొవ్వు గ్రంథులు పెరుగుట – గట్టిగ వున్న దవుడ ఎముక వాచుట –
- ★ సాగునట్టి కండరపేశముల బడలికవల్ల మణికట్టు వెనుక భాగాన నాడీకణములు సమూహముగ ఏర్పడి పొరలుచే కప్పబడుట.
- ★ కండరములను అంటిపెట్టుకొని ఉండు తంతుయుత కణజాలం/పొరలతో కూడిన అస్థిబంధకములు/కండరముల చివరి భాగం – వీటిని ఆధారం చేసుకొని గట్టివాపులు ఏర్పడుట.
- ★ పెద్ద ప్రేగుకు సంబంధించిన అంధనాళం వద్ద గట్టిగ నుండు ముద్దలు.
- ★ ఎముకలను కప్పియుంచు తెల్లని పీచువంటి పొరలలో ద్రవం కూరుట.

**సైలీషియా 6×–200×** : గ్రంథులు పెద్దవగుట – దీర్ఘకాలంగా లింఫ్ గ్రంథులు పెద్దవగుట – వాపులు, ముద్దలు, కంతులు మొదలైనవి గట్టిపడుట, అవి చీము కారునట్లు ఉండుట – పైపెదవి, ముఖం గట్టిగనుండుట – గర్భకోశమునకు సంబంధించిన క్యాన్సర్ – కంపుకొట్టెడు, గోధుమరంగుగల చీముతోనున్న, మంచువలె చల్లగనున్న, రసి వంటి తెల్లని కుసుమ.

**నేట్రంఫాస్ 6×** : నాలుక క్యాన్సర్–ఆమ్లస్థితి వల్ల థైరాయిడ్ గ్రంథి పెద్దదగుట (Goitre).

## 19. గోరుచుట్టు
## (Whitlow)

బొటనవ్రేలు/ఇతర వ్రేళ్ళ గోరుకు సర్పివైరస్ సంక్రమణవల్ల గోరుచుట్టు ఏర్పడును. గోరుచుట్టు ఉండు వ్రేలులో వాపు వచ్చి చీముపట్టి పుండగును. ఇది రెండు రకములు. మొదటిరకములో వ్రేలిగోరు క్రిందనే వాపు వస్తుంది. విపరీతమగు నొప్పి ఉంటుంది. 2,3 రోజుల తర్వాత చర్మం క్రింద చీము ఏర్పడును. వాపు, చీము వ్రేలి కొంత భాగం వరకు ప్రసరిస్తుంది.

రెండవ రకపు గోరుచుట్టులో వ్రేలి లోపల వాపు పూర్తిగవచ్చి రాత్రింబవళ్ళు నొప్పితో బాధిస్తుంది. నొప్పి మోచెయ్యి భుజం వరకు వ్యాపిస్తుంది. వాపు కూడా వ్రేళ్ళు, చేతిమణికట్టు వరకు వ్యాపిస్తుంది. చర్మం ఎరుపెక్కుతుంది. అది నీరుపట్టి కొయ్య బారుతుంది. లోపలి ఎముకల చుట్టూ చీము పట్టి అన్ని దిక్కులకు వ్యాపిస్తుంది. దీనితో వ్రేలిభాగం మెత్తగ అవుతుంది. చర్మం పొరలుగ విడిపోతుంది. అప్పుడు జ్వరం, నిద్రలేమి, ఆకలి మాంద్యం, నొప్పులు (తలలో, వీపులో, అన్ని అవయవాలలోను) సంధి లక్షణాలు ఉండును.

**నివారణోపాయం :**

గోరుచుట్టుపైన వేడిగ కాపడం పెట్టవచ్చు. ఇందుకుగాను పిండిని వేడిగా ఉడికించి, వేడిగా కట్టు కట్టుతారు.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 12× :** గోరుచుట్టు ప్రథమదశ – వేడి, ఎరుపు, నొప్పి.

**కాలీమూర్ 6× :** వాపు, నొప్పి – చీము పట్టకపోవుట –దీనిని ఫెర్రంఫాస్‌తో మార్చివాడాలి. అలా చేసినచో చీము పట్టకుండా ఉంటుంది.

**సైలీషియా 6×–12× :** చీము పట్టిన వెంటనే దీనిని ఇవ్వాలి. ఈ మందు కురుపును త్వరగా పక్వస్థితికి తెచ్చును. చీమును బయటికి పంపును. చీము బయటికి పూర్తిగా వెళ్ళు వరకు ఈ మందును వాడాలి.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** సైలీషియా తర్వాత పుండు మానువరకు దీనిని వాడాలి.

## ౨౦. కుష్టువ్యాధి
## (Leprosy)

ఇది అసహ్యాకరమైన చర్మవ్యాధి. అంటురోగం. ఇది మైకోబాక్టీరియా లెప్రసీ అనే బాక్టీరియా వలన వస్తుంది. ఇది చర్మంపైగాని, నరములందుగాని చిన్న కంతులు/కాయలు వంటివి ఏర్పడును. చర్మంపై నిగనిగలాడెడి పొలుసును కలిగించును. ఇది ముఖ్యంగా చేతివ్రేళ్ళ, కాలివ్రేళ్ళలో మొదలై శరీరము నంతయు తినివేయును.

**• చికిత్స •**

**సైలీషియా 12×–200× :** చర్మం మీద కంతులు, రాగి రంగు మచ్చలు – ఈ మందును క్రమంగా పొటెన్సీని పెంచుతూ వాడాలి.

**ద్వాదశ లవణ మిశ్రమం :** చాలాకాలం రోజుకు 3మోతాదులు (ఉదయం, మధ్యాహ్నం, రాత్రి) ఇవ్వాలి. ప్రతి మోతాదులో ఈ మందులన్నిటినీ ఒక్కొక్క మాత్ర చొప్పున కలపాలి. కాల్కేరియాఫాస్ 12× + కాల్కేరియాసల్ఫ్ 12× + కాలీమూర్ 30× + కాలీఫాస్ 12× + నేట్రంమూర్ 3× + నేట్రంఫాస్ 3× = మొత్తం 6 మాత్రలు.

## 21. బొల్లి / తెల్ల మచ్చలు
(Leucoderma)

శరీరంపై కలుగు తెల్లని మచ్చలను బొల్లి అని అంటారు. శరీరమునకు రంగును ఇచ్చు పదార్థం తక్కువగుటచే ఇట్లు కలుగును. ఇది చూపులకు ఆకర్షణ రహితమే కాని ఆరోగ్యమునకు ఆటంకం కాదు. అయినప్పటికీ రోగి మానసిక బాధకు లోనగును. ప్రారంభంలో చిన్న మచ్చలుగా ఏర్పడి తర్వాత పెద్దగా శరీరమంతా వ్యాపించును. ఇవి శరీరపు అన్ని భాగాలలో ఏర్పడును.

**నివారణోపాయాలు :**

1. చర్మాన్ని సూర్యరశ్మికి తగులనీయరాదు.
2. మాంసాహారం తినరాదు.
3. మత్తుపదార్థాలు, వేపుడు కూరలు, పులుపు పదార్థాలు, పానీయాలు మానవలెను.
4. మంచి పౌష్టిక ఆహారం తినాలి. ఆకుకూరలు, కాయగూరలు, పండ్లు బాగా తినాలి. ఆకుకూరల రసం త్రాగితే మంచిది.
5. లేత వేప ఆకులను నూరి ఆ మచ్చలున్న భాగంపై రుద్ది స్నానం చేస్తే మంచిది. అప్పుడప్పుడు ఆ మచ్చలపై నిమ్మరసం రాయాలి.
6. వ్యాధి నయమగుటకు 1–5 సంవత్సరాలు పట్టును. కనుక ఎంతో ఓపికతో పై నియమాలన్నీ పాటించాలి.

**• చికిత్స •**

**ద్వాదశ లవణ మిశ్రమం :**

1. రోజుకు 3 మోతాదులు (ఉదయం, మధ్యాహ్నం, రాత్రి) – ప్రతి మోతాదులో ఈ మందులన్నీ ఒక్కొక్క మాత్ర చొప్పున తీసుకోవాలి. కాల్కేరియాఫాస్ 3× + కాలీమూర్ 3× + కాలీసల్ఫ్ 3× + నేట్రంమూర్ 3× = మొత్తం 4 మాత్రలు.
2. పైపూతకు నేట్రంఫాస్ 3×, కాల్కేరియాఫాస్ 3× ను గ్లిసరిన్/కొబ్బరినూనెలో కలిపి తెల్లమచ్చలు ఉన్నచోట పూయాలి.

## 22. చలికాలంలో చర్మం తెల్లబడకుండా ఉండుటకు

చలికాలంలో చర్మం తెల్లబడుతుంది. అందుకు ముఖ్యకారణం సబ్బులు వాడుట. మామూలుగానే చలికాలంలో చర్మం పొడిగా వుంటుంది. చర్మానికి సబ్బులు వాడటం

వలన వాటిలోని రసాయనిక పదార్థాలవల్ల చర్మం మరింత పొడిగా, బిరుసుగా మారుతుంది. దీనివల్ల పాత చర్మపు పొర పాడవటమేగాక కొత్త చర్మపు పొర పుట్టదు. అందుచే చర్మం తెల్లగా, పగిలి ఉంటుంది.

**తెల్లబడకుండుటకు ఉపాయాలు :**

1. సబ్బులు వాడటం పూర్తిగా మానుకోవాలి. ముఖానికి కొంతమంది రకరకాల క్రీములు వాడుతూ ఉంటారు. దీనివల్ల భవిష్యత్తులో కొన్ని అనారోగ్య పరిస్థితులు ఏర్పడే అవకాశం ఉంటుంది. కనుక వాటిని కూడా వాడరాదు.
2. స్నానం చేసేముందు శరీరానికంతటికీ కొద్దిగా కొబ్బరినూనె రాయాలి. స్నానానికి వెళ్ళేటప్పుడు ఒక మెత్తటి టవలును తీసుకొని వెళ్ళాలి.
3. శరీరాన్ని నీటితో తడిపిన తర్వాత, టవలును నీటితో తడిపి, పిండి శరీరాన్నంతా దానితో రుద్దుకోవాలి. శరీరపు మురికి అంతా ఆ టవలుకు అవుతుంది.
4. రుద్దడం అయ్యాక మరలా నీరు పోసుకొని పొడి టవలుతో తుడుచుకోవాలి.
5. ఈ విధంగా ప్రతిరోజు స్నానం చేయాలి.
6. ఈ విధంగా చేయుటకు ఇబ్బందులు ఉన్నవారు స్నానానికి గ్లిసరిన్ ఉండే సబ్బులు వాడాలి. గ్లిసరిన్ సబ్బు ధర చాలా ఎక్కువగా ఉంటుంది.

## 23. మొటిమలు
## (Acne/Pimples)

చర్మంలో చెమట/స్వేదగ్రంథులు ఉంటాయి. వాటి నుండి సీబమ్ అనే పదార్థం వెలువడుతుంది. అది బాక్టీరియాతో చేరి కొన్ని రసాయనిక చర్యలకు లోనైన, వెంట్రుకల కుదుళ్ళు ఒక రకపు ఇన్ఫెక్షన్‌కు  గురియగును. దీనివల్ల సీబమ్ అనే పదార్థాన్ని ఉత్పత్తి చేసే సెబేసియస్ నాళాలు పూడుకొని పోతాయి. దీనివల్ల లోపల నుండి గట్టి పొక్కులు ఏర్పడుతాయి. వాటి కొనలు నల్లగా/తెల్లగా ఉంటాయి. వాటిని మొటిమలు అని అంటారు. యువతీ యువకులలో ఇవి ఎక్కువగా ఉంటాయి. వారి ముఖం, ఛాతీ, వీపు మీద ఇవి లేచును. ఇవి ప్రథమ దశలో చాలా ఎర్రగా ఉండును.

**కారణం :** మలబద్ధకం, బహిష్టుదోషాలు మొదలైన కారణాలవల్ల స్వేదగ్రంథులు మూసుకుపోవుట.

**నివారణోపాయాలు :**

1. మొటిమలను గిల్లటం/పిండడం చేయరాదు. ఇలా చేస్తే మచ్చలు/గుంటలు ఏర్పడుతాయి.

2. ముఖానికి పైపూత మందులు రాయకూడదు.
3. సబ్బులకు బదులుగా సున్నిపిండి వాడాలి.
4. మెత్తటి గుడ్డతో రుద్దుకోవాలి.
5. కొబ్బరినూనెలో నిమ్మరసం వేసి దానితో మొటిమలు ఉన్నచోట రాయాలి. 20-25 నిమిషాలపాటు అలాగే ఉంచి కడిగివేయాలి. బంకమట్టి ప్యాక్ స్వేద రంధ్రాలను తెరిచేటట్లు చేయుటలో చాలా ఉపయోగకారి. హోమియోపతిలో మొటిమల ఉద్ధృతిని తగ్గించుటకు ఆల్కహాలు కలిపిన బెర్బరిస్ అక్విఫోలియా అను మదరు టించరును వాడుదురు.
6. వెన్న, నెయ్యి, నూనె ఉండే క్రొవ్వు పదార్థాలు తినరాదు.
7. అధికంగా నీటిని త్రాగి మలబద్ధకం లేకుండా జాగ్రత్త వహించాలి.
8. బహిష్టు సంబంధమైన దోషాలున్న యువతులు వాటి నివారణకు అవసరమైన చికిత్స చేయించుకోవాలి.
9. మెంతి ముద్దను మొటిమలకు పూసిన అది కాలిపోవును.
10. ఉదయాన క్యారెట్ జ్యూస్, సాయంకాలం పండ్ల రసాలు త్రాగాలి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12× :** నుదుటి మీద, గడ్డం మీద ఎర్రగా నుండుట – మొటిమల ప్రథమ దశ.

**కాలీమూర్ 6× :** ముఖంపై మొటిమలు – చిక్కని, తెల్లని పదార్థం – నొప్పి లేకుండుట – జీర్ణ/జననేంద్రియ వ్యవస్థ సరిగా లేనందున కలుగు మొటిమలు – చీము పట్టకుండా చేయును.

**కాల్కేరియాఫాస్ 6× :** ముఖం జిడ్డుగా (oily), దురదగా వుండు యువతుల, పిల్లల ముక్కు మీద మొటిమలు వున్నచో ఈ మందు బాగా ఉపయోగపడును – రజస్వల అయినపుడు – మానసిక శ్రమ వల్ల తలనొప్పి కలిగిన తర్వాత మొటిమలు వచ్చుట.

**సైలీషియా 3×-12× :** గడ్డం/ముక్కు మీద ఉండే చీముతో కూడిన మొటిమలు – ఇవి దురదగాను, నొప్పిగాను, వాపుతోను వుండును.

**కాలీఫాస్ 6× :** గడ్డం మీద దురదగా వుండే మొటిమలు.

**కాల్కేరియాసల్ఫ్ 6× :** ముఖంపైన చీముతో వుండు మొటిమలు – గడ్డం క్రింద వుండు మెత్తని, పసుపు రంగు పదార్థం వెలువడు మొటిమలు.

**నేట్రంమూర్ 12× :** పాలిపోయినవారికి, మలబద్ధకం వున్నవారికి ఇది మంచి మందు.

**ద్వాదశ మిశ్రమము :** కాల్కేరియాసల్ఫ్ 3× – 1 మాత్ర + కాలీమూర్ 3× – 1 మాత్ర + కాలీఫాస్ 3× – 1 మాత్ర + సైలీషియా 12×–1 మాత్ర = మొత్తం 4 మాత్రలు – రోజుకు 2–3 సార్లు.

## 24. దురద
## (Itching)

చాలామంది దురదతో బాధపడుతుంటారు. కొంతమంది బయటికి పోవాలంటేనే సిగ్గుపడుతుంటారు. నలుగురిలో దురదతో గోక్కొనుట ఎంతో అసహ్యకరంగా భావిస్తారు. కాని గోక్కోకుండా ఉండలేరు. కొంతమందికి దురదకు బదులు దద్దుర్లు, మరికొంతమందికి పొక్కులు వస్తాయి.

**కారణములు :**

1) కొంతమందికి మలవిసర్జనం సరిగా కాదు. మలం బయటికి పోకుండా ప్రేగులలోనే నిలువ వుండుటవల్ల బ్యాక్టీరియాకు కారణభూతమవుతుంది.
2) మరికొందరికి చెమట సరిగా పోయదు. ఆ చెడు చర్మంలోనే ఉంటుంది. ఇది కూడా దురదకు కారణంగా మారుతుంది.
3) చర్మాన్ని శుభ్రంగా ఉంచుకొనే ప్రయత్నం చేయకపోవుట.

**నివారణోపాయాలు :**

1) మలబద్ధకం లేకుండా జాగ్రత్త పడాలి. అందుకు నీరు బాగా త్రాగాలి.
2) స్నానానికి వెళ్ళేముందు దురదగా ఉండేచోట నిమ్మరసం రాసి 5-10 నిమిషాలు ఆగి స్నానం చేయాలి.
3) స్నానానంతరం దురదలువచ్చే చోట కొబ్బరినూనెరాస్తే కొంత ఉపశమనం లభిస్తుంది.
4) దురద ఎక్కువగా ఉంటే రోజుకు 2 సార్లు చర్మానికి ఆవిరిపట్టాలి.
5) ఆహారంలో సగభాగం పండ్లు/పండ్లరసాలు ఉంటే మంచిది.

## 25. ఎయిడ్స్
## (Sweat)

నేడు మానవాళిని పట్టి పీడిస్తున్న సమస్య ఎయిడ్స్.

శిశువులకు గర్భంలో ఉన్నప్పుడు/జనన సమయంలో/ తల్లిపాలు త్రాగుతున్నప్పుడు హెచ్.ఐ.వి. వ్యాధి సోకవచ్చు. అట్లే రక్తమార్పిడి సమయంలో కూడా హెచ్.ఐ.వి. సోకవచ్చు. సాధారణంగా హెచ్.ఐ.వి. సోకిన శిశువులలో ఏడాదిలోగానే అది ఎయిడ్స్‌గా మారుతుంది. రెండేళ్ళ వయస్సుకే వారు మృత్యువాత పడతారు. కొద్దిమందిలో మాత్రం హెచ్.ఐ.వి. అలాగే ఉండి వ్యాధి లక్షణాలు లేకుండా ఉంటారు. 15-35 సంవత్సరాల వారు ఎక్కువగా ఈ వ్యాధికి గురగుచున్నారు. 2005 నాటికి ప్రపంచవ్యాప్తంగా హెచ్.ఐ.వి. సోకినవారు 40 మిలియన్లు (4 కోట్లు).

ప్రపంచ ఆరోగ్య సంస్థ ఎయిడ్స్ వ్యాధి గ్రస్తుల లక్షణాలు తెలిపింది. అవి –

1. బరువు తగ్గిపోవుట/ఎదుగుదల నిలిచిపోవుట.
2. తీవ్రమైన విరేచనాలు/జ్వరం/దగ్గు నెలకుపైగా ఉండుట.
3. శరీరంలో కనీసం రెండుచోట్ల లింపు/శోషరసపు గ్రంథులు 0.5 సెం.మీ. కంటె ఎక్కువ పరిమాణంలో ఉండుట.
4. నోటిలోనూ, గొంతులోనూ కాండిడల్ ఇన్‌ఫెక్షన్ వస్తుండుట.
5. చెవిలోనూ, గొంతులోనూ పదేపదే ఇన్‌ఫెక్షన్లు వస్తుండుట.
6. చర్మానికి సోకే సాధారణమైన అంటు వ్యాధులు.

**• చికిత్స •**

లక్షణాలను బట్టి ద్వాదశలవణములను ఎంపిక చేసి వాడాలి. దీనివల్ల వ్యాధి నిరోధక శక్తి పెరుగగలదు. ద్వాదశ లవణముల ఎంపికకు ద్వితీయ అధ్యాయంలోని మందులను గురించి జాగ్రత్తగా అధ్యయనం చేయాలి.

## 26. చెమట / స్వేదం
## (Sweat)

చర్మంలో స్వేదగ్రంథులు ఉంటాయి. వీటినుంచి స్రవించు ద్రవమును చెమట/ స్వేదం అని అంటారు. ఇది శరీర ఉష్ణోగ్రతను కాపాడుతుంది. ఇది ఎండాకాలంలో అధికంగా స్రవించి చర్మానికి చల్లదనం ఇస్తుంది. ఇది బయటి వేడిని చర్మంలోనికి రాకుండా కాపాడుతుంది. చలికాలంలో తక్కువ చెమట స్రవించి శరీరపు ఉష్ణోగ్రతను కాపాడుతుంది.

కొన్ని వ్యాధులవల్ల కొంతమందిలో చెమట ఎక్కువగాను, మరికొంతమందిలో తక్కువగాను పట్టుతుంది. కొందరిలో చెమట దుర్వాసనగా ఉంటుంది.

**• చికిత్స •**

**సైలీషియా 12× :** క్షయ వ్యాధిగ్రస్తులలో రాత్రిపూట చెమట అధికంగా ఉండుట – పిల్లలలో తలకు చెమట ఎక్కువగా పట్టుట –పాదాలలో, చంకలలో దుర్వాసనగల చెమట.

**నేట్రంమూర్ 6× :** రాత్రిపూట విపరీతమైన చెమట – విడుపు జ్వరాలలో చెమట.

**కాలీఫాస్ 6× :** భయంగల వారిలోని చెమట సైలీషియావల్ల నయంకాకున్న ఈ మందును వాడాలి. శరీరంమీద చల్లని, బంకలాంటి చెమట – శుష్కించుటవల్ల రాత్రిళ్ళు చెమట.

**నేట్రంఫాస్ 6× :** చెమట పుల్లని వాసనతో.

# 27. చెమటకాయలు
## (Prickly heat, Miliaria)

వేసవిలో చర్మంమీద చెమట ఎక్కువగా పడుతుంది. దానివల్ల చర్మం (ముఖ్యంగా వీపు, మెడ, భుజములు) మీద చెమటకాయలు లేచును. చర్మం అట్టకట్టిపోవును.

**లక్షణాలు :** 1) చెమటకాయలు ఎర్రగా ఉండును. 2) అవి చాలా దురదగా ఉండును. గోకటం మొదలుపెడితే మరీమరీ గోకాలని అనిపిస్తుంది.

### • చికిత్స •

**నేట్రంమూర్ 6×-30× :** చర్మం మంటగా, దురదగా ఉండును.

**కాల్కేరియాఫాస్ 3×-6× :** శరీరమంతా వివిధ రకాల పుండ్లు - దురద - చీమలు కుట్టినట్లు, ప్రాకుతున్నట్లు ఉండుట - అజీర్ణం వలన జీర్ణాశయంలో కలత.

# 16

# మూత్రపిండముల వ్యాధులు
## (KIDNEY DISEASES)

### 1. మూత్రపిండములు – పరిచయం
### (Kidneys - An Introduction)

కటి / నడుము పై భాగమున వెన్నెముకకు రెండువైపులా కడపటి జత ప్రక్క ఎముకలకు క్రింద, జీర్ణాశయమునకు వెనుక రెండు మూత్రపిండములు చిక్కుడుగింజల ఆకారములో ఉంటాయి. కుడివైపున ఉండు మూత్రపిండం కొంచెం క్రిందుగా ఉంటుంది.

మూత్రపిండముల అంచులనుండి మూత్రనాళములు (ureters) అనబడు సన్నని గొట్టములు బయలుదేరును. అవి కటివలయంలో కండరములచే నిర్మితమైన మూత్రాశయం (urinary bladder) ను చేరును. మూత్రపిండములలో తయారైన మూత్రం మూత్రాశయం చేరును. మూత్రాశయం కొంతవరకు నిండిన తర్వాత మూత్రాశయనాళం వద్ద ఉన్న సంవరణి కండరం (sphincter muscle) సడలును. అప్పుడు మూత్రం బయటకు వస్తుంది.

మూత్రపిండములు మూత్రం ద్వారా మన శరీరములోని మలినాలను (జీవరసాయన వ్యర్థాలు, శరీరానికి అవసరం లేని ఇతర పదార్థాలు) బయటికి పంపుతూ అవి బహిష్కార్య అవయవములుగా పేర్కొనబడుచున్నవి. మూత్రపిండములు తయారుచేసిన మూత్రం వాటి ప్రక్కన ఉండే మూత్ర నాళికల ద్వారా మూత్రాశయం చేరుతుంది. అక్కడ కొంచెంసేపు నిలవ ఉండి తగిన పరిమాణం కాగానే మూత్రనాళం (యురెత్రా) ద్వారా బయటికు పోవును.

ప్రతిగంటకు సుమారు 19 గాలన్ల రక్తం మూత్రపిండాల ద్వారా ప్రసరిస్తుంది. మూత్రపిండాలు యూరియాను రక్తం నుండి వేరు చేసి మూత్రం ద్వారా బహిష్కరిస్తాయి. మనం త్రాగునీటిలో ఎక్కువైన లవణాలను కూడా మూత్రపిండాలు మూత్రం ద్వారా బహిష్కరిస్తాయి. పురుషులలో మూత్రం పురుషాంగం ద్వారా బయటికి పోతుంది. స్త్రీలలో మూత్రనాళం యోనిలోనే తెరచుకొంటుంది. మూత్రనాళాన్ని సంవరణి కండరాలు పట్టి ఉంచుతాయి. అవి తెరచుకొన్నప్పుడే మూత్ర విసర్జన జరుగుతుంది.

# ౨. మూత్రమార్గపు ఇన్‌ఫెక్షన్
## (Urinary Tract Infections)

మూత్రపిండాలు, మూత్రనాళికలు, మూత్రాశయం, మూత్రవిసర్జన నాళం – వీటి సముదాయమే మూత్ర వ్యవస్థ లేదా మూత్ర మార్గం.

మూత్రమార్గం ఇన్‌ఫెక్షన్‌కు గురికాకుండా ఉంచుటకు శరీరంలో ఎన్నో ఏర్పాట్లు ఉన్నాయి – 1) సంవరణి కండరాలు స్థిరంగా మూత్రమార్గాన్ని మూసి ఉంచుతాయి. కనుక బాక్టీరియా మూత్రమార్గం ద్వారా బయటికి ప్రయాణించలేదు. 2) మూత్రనాళం పొడవుగా ఉంటుంది. అందువల్ల బాక్టీరియా ప్రయాణానికి ఎక్కువ సమయం పడుతుంది. స్త్రీలో పురుషుని కంటే మూత్రనాళం పొడవు తక్కువగా ఉంటుంది. కనుక వారు తరచుగా ఇన్‌ఫెక్షన్‌కు గురి అవుతుంటారు. 3) మూత్రనాళికలు మూత్రాశయపు గోడలలోనికి తెరుచుకొనే చోట రెండు కండర నిర్మిత కవాటాలు ఉంటాయి. అవి మూత్రం వ్యతిరేక దిశలో ప్రయాణం చేయకుండా చేస్తాయి. అంతేగాక అవి బాక్టీరియాను మూత్రాశయంలో ఎగువకు, మూత్రపిండాల లోనికి వెళ్ళకుండా అడ్డుకొంటాయి.

ఇన్ని ఏర్పాట్లు ఉన్నప్పటికీ కొంతమందిలో మూత్రావయవములు చెడిపోతుం టాయి. ప్రతి ఐదుమంది స్త్రీలలో ఒకతైనా తన జీవితకాలంలో ఒకసారైనా మూత్రవ్యాధికి గురవుతుంటుంది. ఒకసారి వస్తే చాలామందిలో తరచుగా వస్తూ ఉంటుంది.

**మూత్రవ్యవస్థలో వివిధ రకాల ఇన్‌ఫెక్షన్స్ :**

1. **యురేత్రైటిస్ :** ఇది మూత్రనాళ ప్రవేశద్వారానికి సోకే ఇన్‌ఫెక్షన్. ఈ ఇన్‌ఫెక్షన్‌కు కారణాలు : i) లైంగిక వ్యాధులకు కారణమైన సూక్ష్మక్రిములు, ii) మలంలో ఉండే సూక్ష్మక్రిములు.

   **లక్షణం :** మూత్ర విసర్జన మొదలు పెట్టినప్పుడు అధిక మంట, తర్వాత, ఆ మంట తగ్గును.

2. **సిస్టయిటిస్ :** ఇది మూత్రాశయంనకు సోకును. మూత్ర విసర్జన పూర్తిగా జరుగని సందర్భాలలో ఇది వస్తుంది. ఈ ఇన్‌ఫెక్షన్‌కు కారణం – మూత్రనాళం మూత్రాశయం లోనికి తెరుచుకొనే చోట అదనంగా ఉండే కవాటాలు మూత్రవిసర్జన పూర్తిగా జరుగకుండా అడ్డుకొనును.

   **లక్షణం :** మూత్రవిసర్జన ప్రారంభించిన కొంతసేపటికి మంట, కొంతమందిలో ఈ లక్షణం కనిపించకుండా జ్వరం, పొత్తికడుపులో నొప్పి ప్రధానంగా ఉంటాయి. మరికొంతమందిలో ఇవి కూడా కనిపించవు. వారిలో మూత్రం వాసన ఘాటుగా ఉండుట లేదా మూత్రం ముదురురంగులో ఉండుట/ మబ్బుగా ఉండుట/రక్తం కలిసిన రంగులో ఉండుట జరుగును.

3. **యురిటరైటిస్ :** ఈ ఇన్‌ఫెక్షన్ మూత్రపిండాల నుంచి మూత్రాశయానికి ప్రయాణించే నాళికలకు సోకును.
4. **పైలోనెఫ్రైటిస్ :** ఇది మూత్రపిండాలకు సోకే ఇన్‌ఫెక్షన్.

**బాధల లక్షణాలు :**

**A. దీర్ఘకాలంగా ఉన్నచో :**

1. నడుమునొప్పి
2. లోపభూయిష్టమైన మూత్ర విసర్జన.
3. సాధారణంగా సాయంకాలమున ఉష్ణోగ్రత పెరుగుట – చలి, వణకు ఉండుట.

**B. తరుణంగా ఉన్నచో :**

1. పొత్తికడుపు, మూత్రనాళాల మార్గం, నాభి క్రింద మార్గం, మూత్ర విసర్జన మార్గం – ఇవన్నీ తీవ్రమైన నొప్పితో యుండుట.
2. మూత్ర విసర్జనకు ముందు, తర్వాత మూత్రవిసర్జన నాళంలో తీవ్రమైన మంట, కొన్ని సందర్భాలలో ఈ నొప్పి ఎంత తీవ్రంగా ఉండునంటే రోగి భయంతో మూత్ర విసర్జనకు ప్రయత్నించును.
3. మూత్రం బాగా అణచిపెట్టబడుట/కొద్దిగా ఉండుట/బొట్లుబొట్లు పడుట.

**కారణాలు :**

1. పుట్టుకతో వచ్చిన / ప్రాప్తించిన అవయవ అసంగతములు (anamolies).
2. వ్యాధుల వల్ల / స్వాభావిక అసంగతముల వల్ల మూత్రాశయనాళం చిన్నదగుట.
3. మూత్రాశయపు వెనుకభాగం యోని యొక్క ముందు భాగంలోనికి చొచ్చుకు పోవుట.
4. రాళ్ళ వల్ల మూత్రమార్గమునకు ఆటంకములు ఏర్పడుట.
5. ప్రోస్టేటు గ్రంథి పెద్దదగుట.
6. బాక్టీరియా, వైరస్, ఫంగస్, ఇతర పరాన్న జీవులు.
7. మసాలాలు, మద్యం, కాఫీ మొ॥వి వాడుట.
8. పౌడర్లు/వాటిలో వాడే రసాయనాలు.
9. నైలాన్‌తో తయారయ్యే లోదుస్తులు.
10. గోచీలు వాడుట.
11. సంభోగ సమయంలో జనించే ఒరిపిడి.
12. శరీరం గాయపడినప్పుడు మింగే మందుల ప్రభావం.
13. అధిక రక్తపోటు.

14. రోగనిరోధకశక్తి తగ్గుట.
15. వైద్యసలహా లేకుండా వాడే యాంటిబయాటిక్స్, నిద్రమాత్రలు మొ॥వి.
16. సంభోగ సమయంలో స్త్రీలు వాడే డయాఫ్రమ్‌లు.

**ముఖ్య గమనిక:** కొంతమంది జ్వరానికి చికిత్సకై డాక్టరు వద్దకు వెళ్ళుతుంటారు. వాళ్ళు డాక్టరు గారికి తమ U.T.I. ని గురించి తెలుపరు. దీనివల్ల జ్వరానికి చేసే చికిత్స ఫలితాన్ని ఇవ్వదు. కాని U.T.I. ని గురించి తెలుసుకొన్న డాక్టరు దానికి చికిత్స చేస్తే జ్వరం కూడా నయమైనట్లు తెలిసింది. ఇలాంటి అనేక సంఘటనలు కలవు.

**నివారణోపాయములు :**

1. నీరు ఎక్కువగా త్రాగాలి. దీనివల్ల మూత్రం పోయునప్పుడు మంట ఉండదు.
2. మూత్ర విసర్జన తర్వాత జననేంద్రియాలను శుభ్రపరచుకొనుట.
3. మూత్రవిసర్జన చేసిన ప్రతిసారీ మూత్రాన్ని పూర్తిగా బయటికి పోనిచ్చుట.
4. మగవారు సున్తీ చేయించుకొనుట.
5. మూత్ర విసర్జన తర్వాత వెనుకనుంచి ముందువైపునకు కడుగుకొనుట.
6. రక్తపోటును నివారించుట.
7. ఫాస్ట్‌ఫుడ్స్, క్రొవ్వు ఉండే ఆహారపదార్థాలు తినరాదు.
8. మద్యం సేవించరాదు, ధూమపానం చేయరాదు.
9. వైద్య సలహా లేకుండా నిద్రమాత్రలు వాడరాదు.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6×-12× :**

★ సంవరణి కండరపు బలహీనతచే మూత్ర విసర్జన అదుపులో లేకుండుట.
★ పిల్లలో శయ్యామూత్రం.
★ కండరాల బలహీనత వల్ల శయ్యామూత్రం, ముఖ్యంగా స్త్రీలలో దగ్గినప్పుడల్లా మూత్రం ధారగా చిమ్మబడుట.
★ మూత్రకోశపు వాపు (ప్రథమదశ), నొప్పి, వేడిమి/జ్వరం.
★ మూత్రం అణచిపెట్టబడుట, వేడిమి.
★ (తేలికపాటి) మూత్రం అధికంగా విసర్జించబడుట.
★ పగటిపూట మూత్రం విసర్జించాలనే కోరికను ఆపుకోలేకపోవుట – నిల్చొన్నపుడు ఈ కోరిక అధికమగుట – ఈ కోరికతో పాటు మూత్రవిసర్జన నాళం, మూత్రాశయపు ద్వారం వెంబడి నొప్పి.

★ చిన్న పిల్లలలో మూత్రబంధనం – దగ్గినప్పుడల్లా మూత్రం ధారగా చిమ్మబడుట **– (ఎమ్.డిస్పెరే).**

★ మూత్రాశయ ద్వారం, శిశ్నపు చివర క్షోభచే శయ్యా మూత్రం, మూత్రం అధికముగా విసర్జింపబడుట.

**కాలీమూర్ 6X :**

★ మూత్రకోశపు వాపు (ద్వితీయదశ) – వాపువల్ల ధాతు కణముల మధ్య చెమర్చుట – స్రావం తెల్లగ ఉండుట, తెల్లని శ్లేష్మం.

★ దీర్ఘకాలపు మూత్రకోశపు వాపు.

★ మూత్రం గాఢమైన రంగులో ఉండుట – యూరిక్ యాసిడ్ దానిలో ఉండుట – కాలేయపు అమితమైన స్తబ్ధత్వం, నిష్క్రియత.

**కాలీఫాస్ 3X – 6X :**

★ నీరసంగా నున్న వారిలోను, పూర్తిగ శక్తి కోల్పోయిన వారిలోను మూత్రకోశపు వాపు.

★ తరచుగ మూత్ర విసర్జన / అధికమూత్ర విసర్జన.

★ మూత్ర విసర్జన మంటగ నుండుట – నాడీ బలహీనత.

★ నరాల బలహీనత కారణంగా మూత్రవిసర్జన అదుపులో లేకుండుట.

★ మూత్ర విసర్జన నాళం నుండి రక్తస్రావం.

★ సంవరణి కండరం పక్షవాతానికి గురియగుట–మూత్రమును నిలుపుకొను శక్తి లేకపోవుట.

★ కాస్త వయస్సు వచ్చిన పెద్దపిల్లలలో శయ్యా మూత్రం.

★ మూత్రం పసుపుపచ్చగా ఉండుట.

★ మూత్ర విసర్జన నాళంలో దురద, కోయుచున్నట్టి నొప్పి.

★ మూత్రాశయంలో కోయుచున్నట్టి నొప్పి.

**కాలీసల్ఫ్ 6X :**

★ మూత్రమందు కాల్షియం ఆక్సలేటు ఉండుట.

**మెగ్నీషియంఫాస్ 6X :**

★ మనిషి నిల్చొన్నప్పుడు / నడుస్తున్నపుడు మూత్రవిసర్జన చేయాలనే నిరంతర కోరిక.

★ ఈడ్పులతో కూడిన మూత్రబంధనం.

★ కంకరరాళ్ళు.

★ క్యాథటర్ (మూత్రం బయటికి తీయు గొట్టం) ను వాడిన తర్వాత నొప్పి – కండరాలు సంకోచించుట లేదనే భావన ఉండుట.

★ శిశువు అధిక మూత్రాన్ని విసర్జించుట.

**నేట్రంఫాస్ 3× - 6× :**

* ★ పిల్లలలో మూత్రవిసర్జన అదుపులో లేకుండుట – హైడ్రోక్లోరిక్ ఆమ్లం జీర్ణాశయంలో ఎక్కువై ఛాతీలో మంట కలుగుట.
* ★ అధిక మూత్ర విసర్జన.
* ★ మూత్రం గాఢమైన ఎరుపురంగులో ఉండుట, చిన్నకీళ్ళవ్యాధి.
* ★ తరచుగా మూత్రం విసర్జించుట – చక్కెరవ్యాధి.
* ★ మూత్రాశయపు నిస్రాణ.
* ★ కంకరరాళ్ళు.
* ★ మూత్రకోశపు ఆమత్వక్కు వాపు.

**నేట్రంసల్ఫ్ 6× :**

* ★ మూత్రంలో ఇసుక, కంకరరాళ్ళు, లిథిక్ శిలలు / ఇటుక పొడి వంటి రంగు గల పదార్థం, చిన్న కీళ్ళ వ్యాధితో.
* ★ తెలికపాటి అధికమూత్ర వ్యాధి – చక్కెర వ్యాధిగ్రస్తుడైనచో మూత్రం అధికంగా స్రవించుట.
* ★ మూత్రంలో పైత్యరసం.
* ★ రాత్రిపూట శయ్యామూత్రం / మూత్రబంధం.

**సైలీషియా 12× - 200× :**

* ★ మూత్రంలో చీము కణాలు[1], శ్లేష్మం.
* ★ మూత్రంలో యూరిక్ యాసిడ్ ఎర్రని ఇసుకవలె ఉండుట.
* ★ ప్రేగులలో పురుగులు ఉండుట చేతను, కొరియా నృత్యంలోను శయ్యామూత్రం.
* ★ రాత్రిపూట మూత్ర విసర్జనకై మేల్కొనవలసి వచ్చుట.

**కాల్కేరియాసల్ఫ్ 6× :**

* ★ దీర్ఘకాలంగా ఉన్న మూత్రాశయపు వాపు, చీము ఏర్పడుట.
* ★ ఎర్రని మూత్రం, క్షయ సంబంధమైన జ్వరం.
* ★ మూత్రపిండముల వాపు, స్కార్లెట్ జ్వరం.

**కాల్కేరియాఫాస్ 3× - 6× :**

* ★ మూత్రం అధికంగా ఉండుట.
* ★ యువకులలోను, ముసలివారిలోను శయ్యామూత్రం ఉన్నప్పుడు దీనిని మధ్య–మధ్య వాడాలి.

*1. **చీము కణాలు :** మూత్రంలో చీము కణాలు 10 లోపున ఉన్నచో పెద్ద ప్రమాదం ఏమీ ఉండదని వైద్యులు చెబుతారు.*

★ మూత్రంలో గులకరాళ్ళు, రాళ్ళు, ఫాస్ఫేట్లు ఉండుట.

★ మూత్రంలో ఉన్ని వంటి మడ్డి ఉండుట.

**నేట్రంమూర్ 3× - 6× :**

★ అధిక మూత్రవ్యాధివల్ల శుష్కించుట.

★ స్కర్వీ తర్వాత మూత్రాశయం నుండి కలుగు రక్తస్రావం.

★ మూత్రవిసర్జన తర్వాత కోయుచున్నట్టి నొప్పి.

★ మూత్రాశయపు వాపు.

★ నడచినా, దగ్గినా మూత్రం అప్రయత్నముగా వెడలుట.

★ మూత్రవిసర్జన తర్వాత మూత్రవిసర్జన నాళంలో కోయుచున్నట్టి నొప్పి.

★ మూత్రం ఆపుకోలేకపోవుట.

**కాల్కేరియాఫ్లోర్ 6× - 30× :**

★ అత్యధిక మూత్రం - తరచుగా మూత్ర విసర్జన.

★ మూత్రం కొద్దిగా, గాఢమైన రంగులో ఉండుట - అది దుర్వాసన వెదజల్లును.

**అపోహ :** కొంతమంది ఎర్రగా ఉన్న మూత్రాన్ని చూసి మూత్రంలో రక్తం పోతున్నదని భయపడుతుంటారు. కాని యూరిక్ యాసిడ్ వల్ల మూత్రం ఎర్రగా ఉండే సందర్భాలు ఉంటాయి. మూత్ర పరీక్ష ద్వారా విషయం స్పష్టం కాగలదు.

## 3. మూత్రపిండముల వాపు
## (Nephritis)

**లక్షణాలు :**

★ జ్వరం, వాంతి వికారం, వాంతులు, తలనొప్పి, ఒళ్ళునొప్పులు, ఆయాసం.

★ మూత్రం పరిమాణం తగ్గుట / అణచబడుట, మూత్రం రంగు మారుట.

★ పొగబారినట్లు/ రక్తంతో / చీముతో మూత్రం వచ్చుట.

★ మూత్ర విసర్జన సమయంలో నొప్పి, మంట; నడుములో, వెన్నెముకలో నొప్పి.

★ తొలుత కనురెప్పలు వాచును. తర్వాత ముఖం, కాళ్ళు - చేతులు, పొట్ట, శరీరమంతటా వాపు కనిపించును.

★ మూత్రంలో ఆల్బుమిన్, కొన్ని చీము కణాలు, కొన్ని ఎర్రని రక్తకణాలు కనిపించును.

★ రక్తపోటు బాగా పెరుగుట.

★ మలబద్ధకం.

★ సంధి.

**కారణాలు :**

1. చలి/తడి గాలి సోకుట.
2. కొన్ని జ్వరాల తర్వాత
3. మూత్రపిండాల భాగాలలో దెబ్బతగులుట.
4. కొన్ని మందుల దుష్ప్రభావం
5. మత్తుపానీయాలను సేవించుట మొ॥ కారణాలు.

**నివారణోపాయాలు :**

1. విశ్రాంతి అవసరం.
2. రోగిని వెచ్చని స్థలములో ఉంచాలి.
3. ఆహారంలో ఉప్పును పూర్తిగా మానివేయాలి.
4. రోగికి పండ్లరసం, పాలు, బార్లీ గంజి ఆహారముగా ఇవ్వాలి.
5. రోగి ఎక్కువ నీటిని త్రాగాలి.
6. మాంసం, సారాయి, మసాలా పదార్థాలు, ధూమపానం విసర్జించాలి.

**• చికిత్స •**

ఈ వ్యాధి చాలా అపాయకరమైనది, ఇది B.P.ని పెంచును. కొన్ని సందర్భాలలో మరణమునకు కారణభూతమగును. కనుక దీనికి వెంటనే చికిత్స చేయించుట మంచిది.

**ఫెర్రంఫాస్ 6× - 12× :** ప్రథమ దశలో ఉన్న మూత్రపిండాల వాపులకు, నొప్పికి, జ్వరానికి ఈ మందు ఉపయోగపడును. దీర్ఘకాలంగా ఈ వ్యాధి ఉన్నప్పుడు మూత్రపిండాలకు రక్తం అధికంగా చేరుచున్నచో దీనిని వాడాలి.

**కాలీమూర్ 6× :** ద్వితీయావస్థలో నున్న మూత్రపిండాల వాపు – మూత్రమున ఆల్బుమిన్, మురికిగా నుండు పచ్చని పదార్థం ఉండుట.

**నేట్రంమూర్ 3× - 6× :** అంటువ్యాధి సోకిన తర్వాత కలుగు మూత్రపిండాల వాపు – మూత్రపిండాల ప్రాంతంలో ఒత్తిడి, నొప్పి – మూత్రం ఎర్రగా ఉండుట – మూత్రమందు ఇటుక పొడి వంటిది ఉండుట.

**కాలీఫాస్ 3× - 6× :** నాడీవ్యవస్థ క్రియాశీలతలో కలత వచ్చుట వల్ల మూత్రపిండాలు వాచుట – మూత్రంలో ఆల్బుమిన్ వున్నచో దీనిని కాల్కేరియాఫాస్‌తో మార్చి వాడాలి.

**కాల్కేరియాఫాస్ 3× - 30× :** మూత్రమందు ఆల్బుమిన్ అధికంగా ఉన్నచో ఈ మందును ఇతర మందులతో మధ్య మధ్యన కాని తీవ్ర లక్షణాలు తగ్గిన తర్వాత కాని ఇవ్వాలి. ఇది నశించిన ధాతువులను తిరిగి ఏర్పడుటకు తోడ్పడును.

## 4. మూత్రాశయపు వాపు
(Cystis)

**లక్షణాలు :** తరుణస్థితి యందు పొత్తి కడుపులో నొప్పులు, మూత్రాశయంలో తీవ్రమైన బాధ, చలి, జ్వరం ఉండును. ఇది దీర్ఘవ్యాధిగా మారిన తర్వాత కొంత నొప్పి ఉండును. పొత్తికడుపు బరువుగా ఉండును. మలమూత్ర విసర్జన తరచుగ జరుగుచుండును. మూత్రం క్షారస్వభావం కలిగి యుండును. అది మబ్బురంగులో ఉండును. దానినుండి దుర్వాసన వచ్చును. దానిని విసర్జించుట కష్టముగా నుండును. అది సన్నగాను, బొట్లుబొట్లుగాను ఉండును. దానిలో ఆల్బుమిన్, చీముకణాలు ఉండును.

**కారణాలు :** 1) ఇన్‌ఫెక్షన్, 2) గనేరియా వ్యాధి

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6×–12× :** మూత్రాశయపు వాపు ప్రథమదశ–నొప్పి, వేడిమి/జ్వరం ఉండుట.

**కాలీమూర్ 3× – 6× :** మూత్రాశయపు వాపు ద్వితీయదశ – వాపు ఏర్పడుట – ధాతు కణముల మధ్య చెమర్చుట – స్రావం చిక్కగ ఉండుట – తెల్లని శ్లేష్మం (mucus) – “ఈ వ్యాధికి దీనికి మించిన మందు లేదు” **(పెల్టీయార్)**. ఈ మందు దీర్ఘకాలపు వ్యాధికి కూడ ప్రధానమైన మందు. మూత్రం గాఢమైన రంగులో ఉండును. మూత్రంలో యూరిక్ ఆసిడ్ ఉండును. ఇది కాలేయపు స్తబ్ధతను, క్రియాశూన్యతను తెలుపును.

**కాలీఫాస్ 3×–6× :** నీరస పరిస్థితులు ఉన్నప్పుడు, పూర్తిగ శక్తి పోయినప్పుడు కలుగు మూత్రాశయపు వాపునకు దీనిని వాడాలి. మూత్రం పసుపుపచ్చగ ఉండును. మూత్ర విసర్జన నాళములో దురద. మూత్రాశయంలోను, మూత్ర విసర్జన నాళములోను కోయుచున్నట్టి నొప్పి.

**నేట్రంమూర్ 3× – 6× :** మూత్రాశయపు వాపు – నడుస్తున్నపుడు, దగ్గినపుడు తెలియకుండానే మూత్రం పడుట – మూత్ర విసర్జన తర్వాత మూత్రనాళంలో కోయుచున్నట్టి నొప్పి.

## 5. అతిమూత్రం / మూత్రం ఎక్కువగా వెడలుట
(Polyurea / Diuresis)

వయసు పెరిగేకొద్దీ చాలామంది రాత్రిపూట 2 నుండి 6సార్లు మూత్ర విసర్జనకు వెళ్ళుతూ ఉంటారు. ఇది ఎంతో బాధాకరముగాను, కష్టదాయకముగాను ఉంటుంది.

**కారణాలు :**

1. రాత్రిపూట భోజనంతో పాటు నీరు బాగా త్రాగి పడుకొనుట.

2. కొంతమంది పడుకొనేటప్పుడు నీరు త్రాగుట ఆరోగ్యకరమని భావించి ఆ విధంగా చేయుట.
3. వాతావరణం చల్లగా ఉండుట.
4. ఏ.సి. గదులలో ఎక్కువసేపు ఉండుట.
5. ప్రోస్టేటు గ్రంథి పెరుగుట.

**నివారణోపాయాలు :**

1. 60 సం॥లు పైబడినవారు సాయంకాలం 4 గం॥ల తర్వాత నీరు త్రాగుట మానుకోవాలి.
2. రాత్రి భోజనంతో / రాత్రి భోజనం తర్వాత నీరు త్రాగరాదు. బాగా దాహం ఉన్నట్లయితే 2 – 3 గుటకల నీరు త్రాగాలి.
3. రాత్రిపూట పడుకొనుటకు ముందు మూత్ర విసర్జన చేయాలి.

**• చికిత్స •**

**మెగ్నీషియంఫాస్ 6X :** పిల్లవాడు ఎక్కువ మూత్రం విసర్జించుట – వ్యక్తి నిల్చొన్నప్పుడు / నడుచునప్పుడు నిరంతరం మూత్రం పోయాలనే గాఢమైన కోరిక కలిగియుండుట – మూత్రంలో కంకరరాళ్ళు ఉండుట.

**కాల్కేరియాఫాస్ 6X :** మూత్రం అధికముగా ఉండుట – మూత్రంలో ఇసుక, రాళ్ళు, ఫాస్ఫేట్లు, ఉన్నె వంటి మడ్డి ఉండుట.

**నేట్రంఫాస్ 6X :** మూత్రం అధికముగా పోయుట – పిల్లలు మూత్రం ఆపుకోలేకపోవుట – తరచుగ మూత్ర విసర్జన చేయుట – చక్కెర వ్యాధిగ్రస్తులకు చాలా ఉపయోగకారి. కీళ్ళవాపుతో బాధపడువారి మూత్రం గాఢమైన ఎరుపు రంగులో ఉండుట.

**నేట్రంసల్ఫ్ 6X :** తేలికపాటి అధికమూత్రం వెడలుట – చక్కెరవ్యాధిగ్రస్తుడైనచో అధిక మూత్ర విసర్జన మరింత ఎక్కువగా ఉండుట – మూత్రంలో పైత్యరసం, కంకరరాళ్ళు ఉండుట.

**ద్వాదశ లవణముల మిశ్రమం :**

| భోజనానికి 1 గంట ముందు | | భోజనం తర్వాత 1 గంటకు | |
|---|---|---|---|
| మెగ్నీషియంఫాస్ 6x : | 2 మాత్రలు | నేట్రంఫాస్ 6x : | 2 మాత్రలు |
| కాల్కేరియాఫాస్ 6x : | 2 మాత్రలు | నేట్రంసల్ఫ్ 6x : | 2 మాత్రలు |
| **మొత్తం :** | **4 మాత్రలు** (వేడినీటితో) | **మొత్తం :** | **4 మాత్రలు** |

## 6. మూత్రబంధనం
## (Retension and Suppression of Urine)

**లక్షణాలు :** మూత్రబంధనం వల్ల పొత్తికడుపు వాచును. నొప్పి కలుగును. ఈ స్థితి నుండి కాపాడనిచో రోగి శరీరపు ఇతర భాగాలలోనికి మూత్రం వెళ్ళి సంధి లక్షణాలు కలిగించును.

**కారణాలు :**

1. టైఫాయిడ్ లాంటి జబ్బులవలన మూత్రవిసర్జన శక్తి పోవుట.
2. మూత్రనాళం సన్నగిల్లుట / మూత్రనాళంలో రాళ్ళు చేరుట – వీటివల్ల మూత్ర ప్రవాహానికి ఆటంకం ఏర్పడుట.

**నివారణోపాయాలు :**

1. రోగిని వెచ్చని ప్రదేశంలో ఉంచాలి.
2. మూత్రాశయంలో మూత్రం చేరినా, అది విసర్జింపబడకున్నా మూత్రాశయంపై కాపడం పెట్టాలి.
3. మూత్రం తయారగుట అణగారినప్పుడు నడుముపై కాపడం పెట్టాలి.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6× - 12× :** చిన్నపిల్లలలో మూత్రబంధనం, జ్వరంతో – దగ్గినప్పుడల్లా నియంత్రణ లేకుండానే మూత్రం చిమ్ముట –**(ఎమ్. డిస్పెరీ)**–మూత్రబంధనానికి వాడదగిన మందు.

## 7. మూత్రపిండాల్లో పోటు – రాళ్ళు
## (Renal Colic and Calculus)

మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడుట అధికంగా యువకులలోను, వృద్ధులలోను కనిపిస్తుంది. మూత్రపిండములలో / మూత్రాశయంలో ఉండు రసాయనిక పదార్థాలు కొంతమందిలో స్ఫటికముగా ఏర్పడును. అవి ఇటుక పొడి / ఇసుకవలె ఉండును. అవి ఇంకను పెద్దవిగ ఉన్న రాళ్ళు అని అంటాం. ఈ రాళ్ళు గుండ్రంగా ఉండవు. వాటి అంచులు మొనదేలి యుండును. అవి చుట్టూ వున్న ప్రదేశమునకు గ్రుచ్చుకొని రక్తస్రావం అగును. నొప్పి పుట్టును. ఈ రాళ్ళు మూత్రపిండమునుండి మూత్రనాళం గుండా క్రిందికి పోవు నప్పుడు విపరీతమైన బాధ కలుగును. నొప్పి నడుములో ప్రారంభమై తొడలలోనికి, తర్వాత వృషణముల లోనికి వ్యాపిస్తుంది. రోగి శరీరం ముడుచుకొని విలవిల తన్ను కొనును. వికారం, చలితో పాటు మూత్రబంధనం ఉంటుంది. రోగి బాధను భరించలేక సొమ్మసిల్లవచ్చు.

మూత్రాశయంలోనికి వచ్చిన రాయి అక్కడే ఉండవచ్చు లేదా మూత్రాశయం ద్వారం ద్వారా బయటికి నెట్టివేయబడును. అప్పుడు అమితమైన బాధ కలుగవచ్చు. మూత్రాశయంలో రాయి ఉన్నప్పుడు మూత్రాశయం బరువుగా తోచును. మూత్రాశయ ద్వారంలో నొప్పి, మూత్ర బంధనం ఉండును. మూత్రంలో రక్తం పడవచ్చు.

మూత్రపిండాలలో కనిపించే రాళ్ళు ప్రధానంగా మూడు రకాలు – 1) కాల్షియం ఆక్సలేటు 2) ట్రిపిల్ ఫాస్ఫేటు 3) యూరిక్ యాసిడ్.

**మూత్రపిండములలో రాళ్ళ వల్ల కలుగు బాధకు, ఇతర వ్యాధులలోని బాధకు గల తేడా :**

మూత్రపిండములలో రాళ్ళు ఉన్నప్పుడు కలుగు బాధకు, గాల్‌బ్లాడర్‌లో రాళ్ళు ఉన్నప్పుడు కలుగు బాధకు, అపెండిసైటిస్ బాధకు తేడా ఉండును. గమనించండి –

1. మూత్రపిండములలో రాళ్ళున్నప్పుడు కలుగు బాధతో పాటు జ్వరం / కామెర్లు ఉండవు.
2. గాల్‌బ్లాడర్‌లో రాళ్ళు ఉన్నప్పుడు బాధతో పాటు, కామెర్లు ఉండును.
3. అపెండిసైటిస్‌లో బాధతో పాటు జ్వరం ఉండును.

**కారణాలు :**

1. మనం తీసుకొనే ఆహారంలో ఎ, డి విటమిన్లు ఎక్కువగా ఉండుట.
2. కాల్షియం మెటబాలిజం.
3. పారాథైరాయిడ్‌గ్రంథి అధికంగా పనిచేయుట.
4. యూరిక్ యాసిడ్ అధికంగా ఉండుట.

**నివారణోపాయాలు :**

1. నీరు, మజ్జిగ ఎక్కువగా త్రాగాలి.
2. మానుకోవలసినవి :
   i) కూరగాయలు : బెండకాయ, టమోటా, ముల్లంగి, కాలీఫ్లవర్ మొ॥వి.
   ii) ఆకుకూరలు : తోటకూర, బచ్చలికూర, చుక్కకూర, పాలకూర.
   iii) పండ్లు : సపోటా.
   iv) పప్పుధాన్యాలు : జీడిపప్పు, వేరుశనగ.
   v) ఇతరములు : కాఫీ, టీ, మాంసాహారం, నిలవ ఉంచిన ఆహారం, మద్యం.

## • చికిత్స •

అల్లోపతి విధానంలో రాళ్ళు తొలగిస్తారు. కాని మరలా రాళ్ళు ఏర్పడే ప్రమాదం ఉంటుంది. కనుక ఆహారనియమాలను జాగ్రత్తగా పాటిస్తూ లక్షణాలను బట్టి ద్వాదశ లవణాలను ఎంపికచేసి వాడుకొన్న ఈ వ్యాధి నుండి విముక్తి పొందవచ్చు. రాళ్ళు పెద్దసైజులో ఉన్నచో సర్జన్‌ను సంప్రదించి రాళ్ళు తొలగింప చేసుకోవచ్చు.

**కాలీమూర్ 3× - 6× :** మూత్రంలో యూరిక్ యాసిడ్ నిలువ ఉండుట - దీనిచే మూత్రం గాఢమైన రంగులో ఉండుట - కాలేయం అమిత స్తబ్ధతతోను క్రియాశూన్యత తోను ఉండుట.

**కాలీసల్ఫ్ 6× :** మూత్రమందు కాల్షియం ఆక్సలేటు ఉండుట.

**మెగ్నీషియంఫాస్ 3× - 6× :** మూత్రమందు కంకరరాళ్ళు ఉండుట - నిల్చొన్నప్పుడు / నడుచునప్పుడు నిరంతర మూత్ర విసర్జన చేయాలనే కోరిక ఉండుట - ఎక్కువ మూత్రాన్ని విసర్జించుట.

**నేట్రంఫాస్ 6× - 12× :** మూత్రంలో కంకరరాళ్ళు ఉండుట - తరచుగ మూత్ర విసర్జన చేయుట - చక్కెర వ్యాధిగ్రస్తులు - మూత్రాశయపు నిస్త్రాణ - కీలువాపు గల వారి మూత్రం గాఢమైన ఎరుపులో ఉండుట.

**నేట్రంసల్ఫ్ 6× - 12× :** మూత్రంలో ఇసుకమడ్డి, కంకరరాళ్ళు, లిథిక్ శిలలు, ఇటుకపొడి వంటిది ఉండుట - చిన్నకీళ్ళ వ్యాధి - అధిక మూత్రవ్యాధి (తేలికపాటి) చక్కెరవ్యాధిగ్రస్తులలో - మూత్రంలో పైత్యరసం.

**కాల్కేరియాఫాస్ 6× :** మూత్రంలో కంకరరాళ్ళు, ఫాస్ఫేట్లు, ఉన్ని వంటిది ఉండుట - నేట్రం సల్ఫ్ తర్వాత దీనిని మధ్య మధ్య ఎక్కువగా వాడాలి. దీనిని వాడుట వల్ల రాళ్ళు ఏర్పడకుండ నిరోధించును.

## 8. మూత్రంలో శ్వేతధాతువు పోవుట
## (Albuminuria)

రక్తంలో ఆల్బ్యూమిన్ ఉంటుంది. ఇది గ్రుడ్డులోని తెల్లని సొన వంటిది. ఇది ప్రోటీన్లలోని పదార్థం. ఇది రక్తానికి చాలా అవసరం. కాని మూత్రపిండములు సరిగా పనిచేయనప్పుడు అవి అల్బ్యూమిన్‌ను కూడ రక్తం నుండి వడగట్టి మూత్రంలోనికి పంపును. దీనివల్ల అనేక బాధలు కలుగును.

**లక్షణాలు :** 1) జ్వరం, 2) దాహం, 3) వమన వికారం, 4) మాటిమాటికి మూత్రానుమానం ఉండుట, కాని మూత్రం రాకపోవుట, 5) ముఖం, పాదం, చేతులు వాచుట, 6) రక్తం తక్కువగా ఉండుట, 7) హృదయం వాచుట.

**కారణాలు :** 1) మేహవాతం, స్కార్లెట్ జ్వరం, ఇన్‌ఫ్లూయంజా జ్వరం, న్యుమోనియా/ సన్నిపాత జ్వరం వచ్చుట, 2) గర్భం దాల్చుట, 3) చలిగాలి తగులుట, 4) మాంసాహారాన్ని ఎక్కువగా తినుట, 5) మద్యం సేవించుట.

**నివారణోపాయాలు :**

1) మాంసం, మద్యం, సుగంధ ద్రవ్యాలు విసర్జించాలి. 2) ఉప్పు తగ్గించాలి.

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 3× - 30× :** మూత్రమందు ఆల్బుమిన్ అధికముగా ఉండుట.

## 9. శయ్యామూత్రం / పడకలో మూత్ర విసర్జన
### (Bed Wetting/Enuresis)

సాధారణముగా పిల్లలు, రాత్రిపూట పడుకొన్నప్పుడు పడకలో మూత్ర విసర్జన చేయుదురు. కొంతమంది 17–18 సం॥ వరకు శయ్యామూత్రం చేయుదురు. కొంతమంది వృద్ధులలో కూడా ఈ వ్యాధి కనిపిస్తుంది.

**కారణములు:** 1) ప్రేగులలో పురుగులు, 2) భయం, కలలు, అజీర్ణం, 3) మూత్రాశయపు కండరముల బలహీనత, 4) మూత్రపిండములలో రాళ్ళు, 5) గనేరియా మొ॥, 6) వృద్ధులలో నాడీ దుర్బలత.

**జాగ్రత్తలు :**

**A) చేయరానివి :**

1. మాంసం, మసాల ద్రవ్యాలు, ఖరీదైన భోజనం మానుకోవాలి.
2. కాఫీ, టీ, పాలు త్రాగరాదు.
3. నిద్రించుటకు ముందు నీరు త్రాగరాదు, చన్నీటి స్నానం చేయరాదు.
4. మెత్తని పరుపుపై పరుండరాదు.
5. వెల్లకిల పడుకోరాదు.

**B) చేయవలసినవి :**

1. వేన్నీళ్ళస్నానం
2. వ్యాయామం
3. వెచ్చని దుస్తులు ధరించుట
4. పెద్దవారిచే/పిల్లలచే నిద్రపోవుటకు ముందు వీలైతే అర్ధరాత్రి సమయాన మూత్ర విసర్జన చేయించాలి.
5. పిల్లలను దండించరాదు / భయపెట్టరాదు.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6× - 12× :** మూత్రాశయ ద్వారం, శిశ్నాగ్రం క్షోభ చెందుటచే శయ్యా మూత్రం–మూత్రమును అధికముగా విసర్జించుట - పిల్లలలో శయ్యా మూత్రం -

కండరాల బలహీనత వల్ల ముఖ్యంగా స్త్రీలలో శయ్యామూత్రం – దగ్గినప్పుడల్లా మూత్రం ధారగా చిమ్ముట.

**కాలీఫాస్ 6X :** సంవరణి కండరం (sphincter muscle) పై పక్షవాతం ప్రభావం చూపుట వల్ల మూత్రమును ఆపుకోలేకపోవుట – దీని వల్ల ఎక్కువ వయస్సు వచ్చిన పిల్లలలో శయ్యామూత్రం – మూత్రం పసుపుపచ్చగా ఉండుట – మూత్రాశయంలో దురద – మూత్రాశయంలోను, మూత్రవిసర్జన నాళంలోను కోయుచున్నట్టి నొప్పి.

**నేట్రంసల్ఫ్ 6X :** రాత్రిపూట శయ్యామూత్రం – మూత్రంలో పైత్యరసం – చక్కెర వ్యాధిగ్రస్తులలో అధికమూత్రం – మూత్రంలో రాళ్ళు, చిన్న కీళ్ళ వ్యాధి.

**సైలీషియా 6X :** పురుగుల వల్ల, కొరియా వ్యాధి వల్ల శయ్యామూత్రం – రాత్రిపూట మూత్ర విసర్జనకు లేవవలసి వచ్చుట – మూత్రంలో ఎర్రని యూరిక్ యాసిడ్ నిలువ ఉండుట.

**కాల్కేరియా ఫాస్ 6X :** బాగా వయసు వచ్చిన పిల్లలలోను, ముసలివారిలోను, శయ్యామూత్రం – మూత్రంలో కంకరరాళ్ళు, ఫాస్ఫేట్లు, ఉన్ని వంటి మడ్డి ఉండుట – మూత్రం అధికంగా ఉండుట – ఎంపిక చేసిన మందుతో పాటు దీనిని మధ్య మధ్య వాడాలి.

## 10. ఆడిసన్ వ్యాధి
## (Addison's Disease)

ఈ వ్యాధిలో మూత్రపిండముల ఊర్ధ్వభాగమందలి గ్రంథులు వ్యాధిగ్రస్తమగును. దీని వల్ల శరీరము, ఆమత్వక్కులు కంచు రంగులోనికి మారును. రక్తపోటు తగ్గును, నీరసము కలుగును.

### • చికిత్స •

**నేట్రంమూర్ 3X–6X :** పోషణ సరిగా లేనప్పుడు మూత్రపిండాల ప్రాంత ములో ఆందోళన, వేడిమి, ముఖం పాలిపోవుట – చేతుల వెనుక వైపున గోధుమ రంగు మచ్చలు – మానసికంగాను, శారీరకంగాను శక్తిని అధికముగా కోల్పోవుట – కాళ్ళు వణకుట – మసక చూపు – ఆకలి లేకపోవుట – వమన వికారం – వాంతి – మాంసమును అపేక్షించుట – మలబద్ధకం – ఎక్కడికైనా వెళ్ళాలన్నా, ఏదైనా పనిచేయాలన్నా అయిష్టం – తరచుగా ఆవలింతలు వచ్చుట – ఒళ్ళు విరచుట – కాళ్ళు, చేతుల శీతలత్వం – మానసిక దిగులు – చిరాకు పడుట – లేచినా, నడచుటకు ప్రయత్నించినా తలత్రిప్పు.

# 17

# వెంట్రుకల వ్యాధులు

## (DISEASES OF HAIR)

## 1. వెంట్రుకలు / కేశములు / రోమములు
(Hair)

జుట్టు కేవలం అందం కోసం కాదు. దానివల్ల అనేక ప్రయోజనాలు ఉన్నాయి. తలకు దెబ్బలు తగలకుండా జుట్టు మెత్తని ఆచ్ఛాదనంలా రక్షిస్తుంది. ఎండవేడి తగలకుండా, అతినీలలోహిత కిరణాలు పడకుండా కాపాడుతుంది. దేహంలో ఒక్కొక్క అవయవంలో ఉండే రోమాలకు ఒక్కొక్క ప్రయోజనం ఉంటుంది. చర్మం పైన నూగువలె ఉండే రోమాలు నొప్పిని తెలిపే స్పర్శావయవములుగా పనిచేయును. ముక్కురంధ్రాలలోను, చెవి రంధ్రాలలోను పెరిగే సూక్ష్మరోమాలు బయటి వాతావరణం లోని హానికరమైన పదార్థాలు శరీరంలోనికి చేరకుండా చేయును. కనుబొమలపై ఉండే వెంట్రుకలు తలనుంచి కారే చెమటను కళ్ళలోనికి జారకుండా అడ్డుకొంటాయి. ఛాతీపై నుండు రోమాలు దాని అడుగున నుండు శరీర భాగాలను సంరక్షిస్తాయి. అంతేగాకుండా అవి వాటిని చలి నుండి కాపాడును. జననేంద్రియములపై నుండు రోమాలు జననేంద్రియముల సూక్ష్మ భాగాలను సంరక్షించును. రోజుకు 100 వెంట్రుకలు ఊడి, 100 వెంట్రుకలు పెరుగుట ఆరోగ్య లక్షణం. అలా జరగకుండా కేవలం ఊడుతూ ఉంటే అనారోగ్య లక్షణం. అందుకు క్రింది జాగ్రత్తలు పాటించాలి.

**కొన్ని జాగ్రత్తలు :**

1. వెంట్రుకలను అధికంగా దువ్వరాదు. దువ్వటం వల్ల వెంట్రుకల కుదుళ్ళ నుంచి అధికంగా తైలయుత పదార్థం (సీబం) విడుదల అవుతుంది. దీనికి మామూలు నూనెల కంటే జిడ్డుతనం ఎక్కువ. కనుక స్వేదగ్రంథులను మూసివేస్తుంది. దీనివల్ల తలలో గడ్డలు, పొక్కుల వంటివి తయారయ్యే అవకాశం ఉంటుంది. అంతేగాకుండా చుట్టుప్రక్కల వాతావరణంలో ఉండే మురికి, ఇతర మలిన పదార్థాలు తలపై పేరుకుపోయి అవాంఛిత లక్షణాలను కలిగించవచ్చు.
2. వారానికి ఒకసారి / రెండుసార్లు తలస్నానం చేసి తలవెంట్రుకలను శుభ్రంగా ఉంచుకొనే ప్రయత్నం చేయాలి. తలస్నానం చేయునప్పుడు తలకు నూనె

పూసుకొని ఒక గంటసేపు ఆరనిచ్చి తలస్నానం చేయాలి. తల తడిగా ఉన్నప్పుడే మరలా తలకు నూనె పట్టించుకొనరాదు. ఆరిన తరువాత నూనె పట్టించుకోవచ్చు.

3. ప్రతిరోజూ చన్నీటితో తలస్నానం చేయుట మంచిది. దానివల్ల వెంట్రుకల కుదుళ్ళు గట్టిపడతాయి. వేడినీళ్ళ తలస్నానం జుట్టు ఊడునట్లు చేయును. తలస్నానానికి షాంపూలు వాడరాదు. వాటిలోని రసాయనాలు జుట్టును చిట్లునట్లు చేయును.
4. పౌష్టిక ఆహారం జుట్టు ఊడటాన్ని నిరోధిస్తుంది. కనుక అందరూ అలాంటి ఆహారం తీసుకోవాలి.

## 2. చుండ్రు
## (Dandruff / Scurf)

తల వెంట్రుకల మొదట్లో సెబేసియస్ గ్రంథులు ఉంటాయి. వాటినుండి సెబమ్ అనే స్రావం/పదార్థం వెలువడుతుంది. దానిలో నూనె, కొలెస్టరాల్, మృతి చెందిన కణాలు ఉంటాయి. సెబేసియస్ గ్రంథులు తక్కువగా పనిచేసినప్పుడు స్రావం కొద్దిగా స్రవిస్తుంది. దానిలో కొద్దిపాటి నూనె, కొలెస్టరాల్ వెలువడుతుంది. అది చర్మానికి అతుక్కొని జిడ్డుగా తయారవుతుంది. తర్వాత ఎండి తెల్లని పొలుసులు ఏర్పడును. సెబేసియస్ గ్రంథులు బాగా పనిచేసిన ఎక్కువ స్రావం వెలువడును. ఎక్కువ స్రావంలో ఎక్కువ నూనె, ఎక్కువ కొలెస్టరాల్ ఉంటాయి. వాటిని ఎప్పటికప్పుడు శుభ్రం చేయనిచో అవి తలపై నున్న చర్మానికి అంటుకొని ఎండి పచ్చని పొక్కులుగా మారుతాయి. ఆ పొక్కులు రాలి క్రింద పడతాయి. ఆ పొరలను చుండ్రు అని పిలుస్తారు. ఈ చుండ్రు వ్యాధి ముదిరిన ఒక రకపు గజ్జిగా మారును.

**లక్షణాలు :**

1. తరచుగ దురద, మంట ఉండుట.
2. తలపై తడారిపోయి వెంట్రుకలు ఊడుచుండుట.
3. తల వెంట్రుకలు ఊడి బట్టతల అగుట.
4. తలపై స్రావములచేత తడిగ ఉండుట.

**నివారణోపాయాలు :**

1. తలను శుభ్రంగా ఉంచాలి.
2. ఆముదపు / కొబ్బరినూనెలో నిమ్మకాయరసం కలిపి తలకు అంటుకొని కొద్దిసేపుండి తలస్నానం చేయాలి.
3. పొడి వెంట్రుకలకు చుండ్రు ఉన్నచో మెంతిముద్దను వెంట్రుకలకు పూసి ఆరనిచ్చి తల స్నానం చేయాలి.

4. జిడ్డు వెంట్రుకలకు చుండ్రు ఉన్నచో నిమ్మకాయరసం కలిపిన మెంతిముద్దను వెంట్రుకలకు పట్టించి ఆరనిచ్చి తలస్నానం చేయాలి.
5. చుండ్రు సమస్య ఉన్నవారు రోజూ తలస్నానం చేయుట మంచిది. చన్నీటితోనే తలస్నానం చేయాలి. వేడినీటిని వాడిన వెంట్రుకల కుదుళ్ళకు నష్టం వాటిల్లును. చన్నీటితో స్నానం చేయలేనివారు అప్పుడే బావినుండి చేదిన / బోరు నీరు వాడాలి. దీనివల్ల దురద ఉండదు. పేలు పట్టవు.
6. షాంపూ వాడటం మానుకోవాలి. కుంకుడుకాయ రసం వాడాలి.
7. వెంట్రుకలు ఆరగానే నూనె పట్టించుకోవచ్చు. నూనె తలను ఎండ వేడినుండి కాపాడుతుంది. అంతేగాక వెంట్రుకలను నల్లగా ఉంచుతుంది.

**• చికిత్స •**

**కాలీఫాస్ 6X :** కపాలంపై పసుపుపచ్చని / తెల్లని పొలుసులు – వెంట్రుకలు రాలుట – క్రింది పెదవి పొడిగాను, పొలుసులతోను వుండుట – "ఈ మందును ప్రతి 4 గంటలకు ఒకసారి లోపలికి వాడి ఎన్నో కేసులను నయం చేసాను. తలను శుభ్రం చేయుటకు ఎలాంటి లోషన్‌ను వాడకుండా, తలకు ఎట్టి మలాం పూయ కుండానే ఈ ఫలితాన్ని సాధించాను." **– (ఎ.పి. డేవిస్)**

**నేట్రంమూర్ 6X :** కపాలమును కప్పియుంచు చర్మంపై తెల్లని పొలుసులు, సరైన పోషణ లేకపోవుట వల్ల వెంట్రుకలు రాలుట.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** చాలా చుండ్రు – తలత్రిప్పు, తలను త్వరత్వరగా త్రిప్పిన వమన వికారం.

**కాలీమూర్ 6X :** చుండ్రు – తెల్లని, పాలవంటి కఫాన్ని కాండ్రించుట – నాలుకపై తెల్లని పూత.

**కాలీసల్ఫ్ 6X :** చుండ్రు తలపై బొబ్బలు – నోటిలో మంట – క్రింది పెదవి వాచుట.

**మెగ్నీషియంఫాస్ 6X :** చాలా చుండ్రు – చిన్న గుండ్రని చీము పొక్కులు – కపాలమును కప్పియుంచు కేశములు గల చర్మం ముతకగా ఉండుట.

## 3. బట్టతల
## (Bald Head)

సాధారణముగా ప్రతిరోజూ 40 నుండి 100 వరకు వెంట్రుకలు ఊడిపోతూ సుమారు అన్నియే మొలుస్తూ ఉంటాయి. అంతకన్నా ఎక్కువ వెంట్రుకలు ప్రతిరోజు

ఊడిపోతూ తిరిగి వచ్చే వెంట్రుకల సంఖ్య చాలా తక్కువైన బట్టతల వస్తుంది. కొంతమంది తలలో ఉన్నట్లుండి కేశములు కుదుళ్ళుగా వీడిపోయి అక్కడ మచ్చ లాగ నిలిచిపోవును. దానిని 'అలోపేషియా ఏరియాటా' అని అంటారు. ఇది 5 నుండి 25 సంవత్సరముల వయస్సు ఉన్న వారికి వస్తుంటుంది.

**కారణాలు :**

1. దీర్ఘవ్యాధులు
2. టైఫాయిడ్ జ్వరం తగ్గిన తర్వాత
3. క్యాన్సరు చికిత్సకు వాడిన కొన్నిరకముల అల్లోపతి ఔషధముల దుష్ప్రభావముల (side effects) వల్ల

**నివారణోపాయాలు :**

1. తలకు గాలి, వెలుతురు తగులునట్లు జాగ్రత్త వహించుట
2. తలకు శుభ్రమైన కొబ్బరినూనెను పూసుకొనుట
3. వారానికి ఒకసారైనా తలంటుకొని గోరువెచ్చని నీళ్ళతో స్నానం చేయుట
4. తడి తలకు నూనె పట్టించుకొనకుండుట
5. తల ఆరగానే నూనె పట్టించుకొనుట
6. మానసిక ఆందోళన లేకుండ ఉండుట

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 6×** : తలపై బట్టతల పొడ (bald spots) – చాలా పెద్ద తల – ఎముకలు వేరుగా ఉండుట – కపాలంపై సాయంకాలం దురద – తల పై భాగమున స్ఫోటకపులాతత్వం గల పుండ్లు.

**సైలీషియా 6×** : తల వెనుక భాగాన బట్టతల – ఈ వ్యాధికి దీనిని నేట్రంమూర్ 12× తో మార్చి ఇవ్వాలి.

## 4. వెంట్రుకలు రాలుట, వెంట్రుకలలో పేలు, వెంట్రుకలు తెల్లబడుట

**కాల్కేరియాసల్ఫ్ 6×** : చాలా చుండ్రు – వెంట్రుకలు రాలిపోవుట – తలత్రిప్పు – తలను త్వరత్వరగా త్రిప్పిన వమన వికారం – తలపై జిలపొక్కులు – దువ్వినప్పుడు సులభంగా రాలిపోవుట.

**నేట్రంసల్ఫ్ 6×** : దువ్వుతున్నప్పుడు వెంట్రుకలకు నొప్పిగ ఉండుట – కపాలంపై నుండు పొర సహించలేకపోవుట – తామర వలన వెంట్రుకలు ఊడుట.

**సైలీషియా 6× :** వెంట్రుకలు రాలిపోవుట (జ్వరం తర్వాత) – కపాలం యొక్క వెనుక భాగమున దుర్వాసన గల దద్దుర్లు / బొబ్బర్లు / పొక్కులు –వెంట్రుకల అంచులు పగులుట – లాలాజల గ్రంథులు చీము పట్టుట – చిన్నతనమందే తెల్లవెంట్రుకలు వచ్చుట.

**కాల్కేరియాఫాస్ 3× – 30× :** దీర్ఘకాల వ్యాధి / జ్వరం / ప్రసవం తర్వాత వెంట్రుకలు ఊడుట–వెంట్రుకలు పలచగా ఉండుట–ఈ మందును నేట్రంమూర్ 6×తో మార్చి ఇవ్వాలి.

**కాలీసల్ఫ్ 3× – 6× :** దువ్వినపుడు రాలుట–చుండ్రు పసుపుపచ్చని పొలుసులతో ఊడుట.

**నేట్రంమూర్ 6× – 30× :** వెంట్రుకలు దువ్వినా, పట్టుకొన్నా రాలు చుండ్రు – తెల్లని పొలుసులు ఊడుట – తల ముందుభాగం, పార్శ్వభాగం ఎక్కువగా రాలుట – తలలో పేలకు బాగా పనిచేయును.

## 5. పేను కొరుకుడు
## (Alopecia)

పేను కొరుకుడు వ్యాధికి పేలతో ఎట్టి సంబంధం వుండదు. తలమీద చిన్న–చిన్న అతుకులతో (patches) వెంట్రుకలు రాలిపోవుటను పేను కొరుకుడు వ్యాధియని అంటారు. కొన్ని సూక్ష్మక్రిములు వెంట్రుకల మొదట్లో చేరి కుదుళ్ళను నాశనం చేయుట వల్ల ఈ వ్యాధి వచ్చును.

### • చికిత్స •

**కాలీఫాస్ 6×, కాల్కేరియాఫాస్ 6× :** పేను కొరుకుడు వ్యాధికి ఈ రెండు మందులను మార్చి మార్చి రోజుకు 3 సార్లు వాడాలి.

**సైలీషియా 12 ×, నేట్రంమూర్ 3× :** వృద్ధుల పేను కొరుకుడు వ్యాధికి పై మందులను మార్చి–మార్చి ఇవ్వాలి.

# 18

# చేతుల, కాళ్ళ వ్యాధులు

# (DISEASES OF EXTREMITIES)

## 1. చేతులకు సంబంధించిన వ్యాధులు
## (Diseases of Hands)

### i) భుజాల నొప్పి (Omalgia)

భుజములను పైకెత్తుటకు ఉపయోగించు డెల్టాయిడ్ కండరములలో లోపం వలన భుజాలు పైకి ఎత్తుటకు రాదు.

**నివారణోపాయం :**

భుజాలకు వెచ్చని గుడ్డను చుట్టుట / కాపడం పెట్టుట చేయాలి.

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 6× :** భుజాల (shoulders) లోను, రెక్కగూడుల (shoulder-blades) లోను పుండువంటి నొప్పి; ఆ నొప్పి చేతులంతటా ఉండుట – భుజాలలో శూలనొప్పి.

**ఫెర్రంఫాస్ 6× – 12× :** భుజాలలో కీళ్ళ వాతపు (Rheumatic) నొప్పి – అరచేతులు వేడిగ ఉండుట.

**మెగ్నీషియంఫాస్ 6× – 12× :** భుజాలలో శూలనొప్పి, కుడివైపున అధికం – ఈ మందును వేడినీళ్ళతో తీసుకోవాలి.

**సైలీషియా 6× – 12× :** భుజాలు భారంగా ఉండుట – భుజాల మధ్య పుండుగ ఉండుట – రాత్రిపూట భుజాల నొప్పి.

### ii) మణికట్టు / మణిబంధం (wrist) నొప్పి

మణికట్టు అనునది ఒక కీలు. ఇది మోచేతికి (Fore arm), చేతికి మధ్య నుండును. దీనికి 8 ఎముకలు గలవు. కొంతమందిలో ఇది అప్పుడప్పుడు నొప్పిగ ఉండును.

**• చికిత్స •**

**కాల్కేరియాఫ్లోర్ 6×–30× :** మణికట్టు వెనుకవైపున నాడీకణముల సమూహం కూడుట.

**కాల్కేరియాఫాస్ 6X :** మణికట్టులో ఈడ్పువంటి నొప్పులు.

**ఫెర్రంఫాస్ 6X – 12X :** కుడి మణికట్టులో కీలు నొప్పి.

**నేట్రంఫాస్ 3X – 6X :** మణికట్టు నొప్పి – వ్రాయునప్పుడు ఈడ్పులతో కూడిన నొప్పి.

## iii) చేతుల బాధలు

**కాల్కేరియాఫాస్ 6X :** ముంజేతుల నొప్పి.

**ఫెర్రంఫాస్ 6X – 12X :** చేతులు వాచుట, బాధాకరముగా ఉండుట. చేతి వెనుకవైపున వున్న స్నాయువు (కండరములను, ఎముకలను కలుపునది) లలో పటపట శబ్దం.

**కాలీసల్ఫ్ :** చేతులలో ఈడ్పులు – వేడినీళ్ళతో ఉపశమనం.

**మెగ్నీషియంఫాస్ 6X – 12X :** చేతులలో శూలనొప్పి – కుడివైపున అధికం.

**నేట్రంఫాస్ 3X – 6X :** చేతుల బలహీనత, అలసట – చేతి వెనుకవైపున ఉన్న చాచుటకు ఉపయోగించు కండరములు సంకోచించుట.

**సైలీషియా 6X – 12X :** చేతుల పక్షవాతం – అలసిపోవునట్లుగా – చేతులు భారంగాను, నొప్పితోను ఉండుట.

## iv) చేతులు వణకుట

**మెగ్నీషియం ఫాస్ 6X :** చేతులు వాటంతటవే కదలుట.

**నేట్రంసల్ఫ్ 3X – 6X :** చేతులు వణకుట.

**సైలీషియా 6X – 30X :** చేతులు వణకుట – దుర్వాసన గల చెమటతో.

## v) చేతులపై చర్మం ఎరుపెక్కి పుండు పడుట

**కాలీమూర్ 3X – 6X :** శీతాకాలమున వచ్చు ఈ వ్యాధికి ఇది మంచి మందు.

## vi) చేతులలో దద్దుర్లు

**కాలీసల్ఫ్ 3X – 6X :** పొలుసులతో కూడిన దద్దుర్లు / బొబ్బలు – వేడినీళ్ళతో ఉపశమనం.

## vii) వ్రాయునప్పుడు కలుగు బాధలు

**కాలీమూర్ 3X – 6X :** వ్రాయునప్పుడు చేతులు బిర్రబిగియుట.

**నేట్రంఫాస్ 3X – 6X :** వ్రాయునప్పుడు ఈడ్పులతో కూడిన నొప్పి.

**సైలీషియా 6X – 30X :** వ్రాయునప్పుడు కండరం బిర్రబిగియుట, చంకలలో దుర్వాసన గల చెమటతో.

### viii) అరచేతుల బాధలు

**ఫెర్రంఫాస్ 6x – 12x :** అరచేతులు వేడిగ ఉండుట.

**కాలీఫాస్ 3x – 6x :** అరచేతులలో దురద.

### ix) చేతివ్రేళ్ళు

**కాల్కేరియాఫ్లోర్ 3x – 12x :** చేతివ్రేళ్ళ ఎముక అధికముగా పెరిగి కంతివలె ఏర్పడుట.

**కాల్కేరియాఫాస్ 3x – 30x :** చేతివ్రేళ్ళల్లో, ముఖ్యంగా బొటనవ్రేళ్ళల్లో ఈడ్పువంటి నొప్పులు.

**కాల్కేరియాసల్ఫ్ 3x – 30x :** చేతివ్రేళ్ళు బిర్రబిగియుట.

**కాలీఫాస్ 3x – 6x :** చేతివ్రేళ్ళ చివరన తిమ్మిరి.

**నేట్రంమూర్ 3x – 6x :** వ్రేళ్ళు వాచుట – నీటితో నిండిన బొబ్బలు లేచుట.

**కాలీమూర్ 6x :** బొటనవ్రేలు వద్ద గల ద్రవపు తిత్తి వాచి బాధపెట్టుట.

## 2. అరచేతిలో నొప్పిని కలిగించే కార్పల్ టన్నెల్ సిండ్రోమ్

ప్రతి వందమందిలో ముగ్గురు ఈ వ్యాధి బారిన పడుతున్నారు. పురుషుల కంటే మహిళలు ఎక్కువగా దీనికి గురవుతున్నారు.

**లక్షణాలు :**

1. చేతివ్రేళ్ళల్లో తిమ్మిరి, మొద్దుబారుట, నొప్పి, కండరాల బలహీనత ఉండుట. మీడియన్ నరం ఉండే బొటనవ్రేలు, చూపుడు వ్రేలు, మధ్యవ్రేలు, ఉంగరపు వ్రేలు సగభాగంలోను ఈ లక్షణాలు కనిపించుట. అరుదుగా అరచేతిలో కూడా ఈ లక్షణాలు ఉండుట.
2. వ్యాధి ప్రారంభంలో ఈ లక్షణాలు రాత్రిపూట కనిపించుట – చెయ్యిని విదిలిస్తే అప్పటికి నొప్పి తగ్గుట – చిటికెన వ్రేలులో వ్యాధి లక్షణాలు కనిపించకపోవుట.
3. దేనినైనా గట్టిగా పట్టుకొన్నప్పుడు (బ్రష్‌తో పళ్ళు తోముకొనుట / పెన్నుతో వ్రాయుట) ఈ లక్షణాలు కనిపించుట.
4. చేతి మణికట్టులో ఉండే మీడియన్ నరం మీద చిటికె వేస్తే హస్తంలో కరెంటు షాకు కొట్టినట్లు అనిపించుట.

**కారణాలు :** బాహువు / ముంజేయి నుంచి మీడియన్ నరం కార్పల్ టన్నెల్[1] ద్వారా ప్రయాణిస్తుంది. హైపోథైరాయిడిజం, రుమాటాయిడ్ ఆర్థరైటిస్, గర్భధారణ, మణికట్టుకు

దెబ్బలు తగులుట, ఎముకల ఉపరిభాగంలో బొడిపెల వంటివి (బోన్‌స్పర్స్) పెరుగుట, టెండాన్ పొరలలో వాపు వచ్చుట మొ॥ కారణాల వల్ల కార్పల్ టన్నెల్[1]లో ఖాళీ తగ్గిపోతుంది. దానివల్ల ఆ నరం మీద ఒత్తిడి పెరుగుతుంది. అప్పుడు కార్పల్ టన్నెల్ సిండ్రోమ్ వ్యాధి ఏర్పడుతుంది. మధుమేహం, ధూమపానం, మద్యపానం, రక్తసరఫరాకు ఆటంకం కలుగుట వల్ల ఈ వ్యాధి కలగవచ్చు.

**నివారణోపాయాలు :**

1. చేతులను, అరచేతులను సాగదీస్తూ వ్యాయామం చేయుట, కండరాలను బలపరచే వ్యాయామం చేయుట మంచిది. వీటివల్ల కీళ్ళల్లో ఒత్తిడి పెరుగుతుంది. కండరాలకు శ్రమను తట్టుకొనే శక్తి లభిస్తుంది.
2. వేడి కాపడం, ఐస్‌ప్యాక్ మార్చి మార్చి వాడాలి.
3. ఏ పని చేస్తే నొప్పి ఎక్కువగా ఉంటుందో, ఆ పనిని అతి తక్కువ సార్లు చేయాలి.
4. ధూమపానం చేసే అలవాటు ఉన్నవారు దానిని మానుకోవాలి.
5. పెన్నులాంటి వస్తువును పట్టుకొనేటప్పుడు అన్నివ్రేళ్ళనూ వాడాలి.
6. ఏదైనా పని చేయునప్పుడు మణికట్టును సాధ్యమైనంత వరకూ తిన్నగా (straight), వంపు లేకుండా ఉంచాలి.
7. ఏదైనా పని చేయునప్పుడు తక్కువ ఒత్తిడిని ఉపయోగించాలి.
8. తల క్రింద చేతులు ఉంచుకొని నిద్రపోరాదు.
9. బి-విటమిన్ అధికంగా ఉండే ఆహారం తినాలి.
10. ఆహారంలో ఉప్పును తగ్గించాలి.

## • చికిత్స •

**ద్వాదశ లవణ మిశ్రమం :** కొంతకాలంపాటు ఈ మందులను వాడాలి.

**ఉదయం :** కాల్కేరియాఫ్లోర్ 6× – 2 మాత్రలు + కాల్కేరియాఫాస్ 6× – 1 మాత్ర + ఫెర్రంఫాస్ 6× – 1 మాత్ర = మొత్తం 4 మాత్రలు.

**రాత్రి :** కాలీసల్ఫ్ 6× – 1 మాత్ర + మెగ్నీషియం ఫాస్ 10× –2 మాత్రలు + నేట్రంఫాస్ 6×–1 మాత్రం = మొత్తం 4 మాత్రలు (వేడినీటితో)

*1. **కార్పల్ టన్నెల్ :** కార్పల్ స్నాయువు క్రింద త్రోవ. ఇది మణికట్టు ముందు ఉంటుంది. దీనిలో నుంచి మీడియన్ నాడి, కండర బంధనములు చేతిలోకి పోతాయి.*

# 3. కాళ్ళ వ్యాధులు
## (Diseases related to legs)

| వ్యాధి లక్షణం | మందు |
|---|---|
| ★ తొడలలో పుండువంటి నొప్పి | – కాల్కేరియాఫాస్ |
| ★ తొడలలో లాగుచున్న నొప్పి | – నేట్రంఫాస్ |
| ★ తొడ ఊర్ధ్వభాగమున నొప్పి | – కాలీఫాస్ |
| ★ ఎడమ తొడ ఊర్ధ్వ భాగమున చురుకగు నొప్పి | – నేట్రంసల్ఫ్ |
| ★ కాళ్ళలో ఈడ్పులు | – కాలీసల్ఫ్ |
| ★ కాళ్ళలో రాత్రిపూట నరాల నొప్పి | – మెగ్నీషియంఫాస్ |
| ★ కాళ్ళనొప్పి పరుపుమీద పడుకొన్న తర్వాత | – మెగ్నీషియంఫాస్ |
| ★ కాళ్ళనొప్పి కండరాలు పుండు పడుట వల్ల | – మెగ్నీషియంఫాస్ |
| ★ కాళ్ళనొప్పి విద్యుత్తు మెరుపువలె ఉండుట | – మెగ్నీషియంఫాస్ |
| ★ కాళ్ళనొప్పి విద్యుత్తు మెరుపువలె ఉండి నడుము వద్ద నుండి పాదాల వరకు వ్యాపించుట | – కాలీమూర్ |
| ★ కాళ్ళు వాటంతటవే అస్థిమితంగా అదరుట | – నేట్రంమూర్ |
| ★ కాళ్ళ తిమ్మెర, చీమలు ప్రాకుతున్నట్లు | – కాల్కేరియాఫాస్ |
| ★ కాళ్ళ, పాదముల తిమ్మెర | – నేట్రంమూర్ |
| ★ మోకాళ్ళ బలహీనత | – నేట్రంమూర్ |
| ★ మోకాళ్ళలోను, చీలమండలం లోను శూలనొప్పి | – కాల్కేరియాఫాస్ |
| ★ మోకాళ్ళలోను, చీలమండలంలోను, మోకాలి ఎముకల లోను, పాదముల బంతి – గుంటలోను నొప్పి. | – నేట్రంఫాస్ |
| ★ కాళ్ళ, పాదముల వాపు, బాధలేకుండుట, దురద ఎక్కువ | – కాలీమూర్ |
| ★ పాదముల అలసట, ఉబ్బుట | – నేట్రంఫాస్ |
| ★ పాదముల గౌటు నొప్పి (తరుణ, దీర్ఘకాలపు) | –నేట్రంసల్ఫ్ |
| ★ పాదముల మంట (రాత్రిపూట) | – కాలీఫాస్ |
| ★ పాదముల అడుగున మంట, మోకాళ్ళ వరకు వ్యాపించుట | – నేట్రంసల్ఫ్ |
| ★ శీతాకాలమున పాదముపై నున్న చర్మం ఎరుపెక్కి పుండు పడుట | – కాలీమూర్ |
| ★ పాదములలో స్థిమితం లేకపోవుట | – కాలీఫాస్ |
| ★ పాదముల అడుగుభాగమున పక్షవాతపు లాగునట్టి నొప్పి, దురద | – కాలీఫాస్ |

| **వ్యాధి లక్షణం** | **మందు** |
|---|---|
| ★ కాలివ్రేళ్ళ దురద | – **నేట్రంఫాస్** |
| ★ కాలివ్రేళ్ళ మధ్య చీలికలు | – **నేట్రంమూర్** |
| ★ పిల్లల దొడ్డి కాళ్ళు, నడక నెమ్మదిగ నేర్చుకొనుట | – **కాల్కేరియాఫాస్** |
| ★ కాలివ్రేళ్ళ మధ్య చీలికలు | – **నేట్రంమూర్** |
| ★ దూరం నడిచినప్పుడు, పాదాలలోను, కాలివ్రేళ్ళలోను నొప్పి | – **సైలీషియా** |
| ★ కాళ్ళ బలహీనత, వెన్నెముక రక్తహీనత వల్ల నడచునపుడు కాళ్ళమధ్య సందు ఏర్పడుట | – **నేట్రంఫాస్** |
| ★ చాలకశక్తి తగ్గుట, పాదములు కోమలముగ తయారగుట, కొద్దిగా కదిపినా నొప్పులు ఎక్కువగుట | – **మెగ్నీషియంఫాస్** |
| ★ చాలకశక్తి కోల్పోవుట, వ్యక్తి తడబడుట, అడుగు తప్పుగపడుట, కీళ్ళవాతం వల్ల కుంటితనం, విశ్రాంతి తర్వాత బిర్రబిగియుట | – **కాలీఫాస్** |
| ★ పిల్లల దొడ్డికాళ్ళు, నడక నెమ్మదిగ నేర్చుకొనుట | – **కాల్కేరియా ఫాస్** |

## 4. కాళ్ళు, చేతుల ఎముకల వ్యాధులు

| | |
|---|---|
| ★ తుంటి ఎముక ఊర్ధ్వ భాగమున ఎముకల కలయిక | – **కాల్కేరియాఫాస్** |
| ★ ఎముకలు చీముపట్టుట – చేతివ్రేళ్ళ ఎముక అధికముగా పెరిగి కంతివలె ఏర్పడుట, పుండు ఉండుట / లేకపోవుట – కాలివ్రేళ్ళ, చేతివ్రేళ్ళ ఎముకలు స్థానం తప్పుట – దెబ్బచే ఎముకపై గాయం / దెబ్బ కలుగుట | – **కాల్కేరియాఫ్లోర్** |

## 5. కాళ్ళు, చేతుల కండరాల బాధ

| | |
|---|---|
| ★ తీవ్రమైన అనారోగ్యం తర్వాత కండరాల బలహీనత | – **కాలీఫాస్** |
| ★ కండరాల సంకోచంతో ఈడ్పులు | – **మెగ్నీషియంఫాస్** |
| ★ ప్రక్కటెముకల కండరాల నొప్పి | – **మెగ్నీషియంఫాస్** |
| ★ చేతి వెనుకవైపున సాచుటకు ఉపయోగించెడి కండరాల సంకోచం | – **నేట్రంఫాస్** |

## 6. కాళ్ళు, చేతుల కీళ్ళ వ్యాధులు

| | |
|---|---|
| ★ తుంటి నుండి మోకాళ్ళ వరకు నొప్పి (ఆమ్లాధిక్యత వల్ల), చేతివ్రేళ్ళ కీళ్ళవాపు, నొప్పులు గుండెకు చేరుట, కీళ్ళల్లో పుండు వంటి బాధ | – **నేట్రంఫాస్** |

★ ఆమ్లాధిక్యత కలవారి కీళ్ళు శబ్దం చేయుట – ఎడమ తుంటిలో గుచ్చినట్లున్న నొప్పి – **నేట్రంసల్ఫ్**

★ దీర్ఘకాలపు కీళ్ళవాతం – కదిలినప్పుడల్లా కీళ్ళు శబ్దం చేయుట – కీళ్ళ వద్ద దద్దుర్లు – **నేట్రంమూర్**

★ ఫంగస్ వల్ల కీళ్ళు వాచుట – **కాలీసల్ఫ్**

★ కీళ్ళనొప్పి – **మెగ్నీషియంఫాస్**

★ మోచేతి కీలువాపు – కీళ్ళల్లో శబ్దమగుట – ఇది వాటి లోని నూనె తక్కువైనదని తెలుపును – చేతివ్రేళ్ళ కీళ్ళు గౌటువల్ల పెద్దవగుట – **కాల్కేరియాఫ్లోర్**

★ తుంటి కీలు వ్యాధి, నొప్పి, గుండె వలె కొట్టుకొనుట, కోమల భాగాల వాపు, వేడిమి – **ఫెర్రంఫాస్**

★ తుంటి కీలు వ్యాధిలో చీము వెలువడుటకు – **కాల్కేరియాసల్ఫ్**

దీనితో పాటు ఫెర్రంఫాస్ వాడాలి. పూర్తిగా విశ్రాంతి తీసుకొన్నచో వ్యాధి నయమగును.

★ తుంటి కీలు వ్యాధిలో చీమును నియంత్రించుటకు, నిరోధించుటకు – మోకాలు కీలును చుట్టియుండెడి పొర వాచుట (చంకలలో చెమట) తుంటి వద్ద, మోకాళ్ళ వద్ద, భుజాల వద్ద గల కీళ్ళనొప్పి, కూర్చొన దలచినపుడు నొప్పి ప్రారంభమగుట – **సైలీషియా**

★ తుంటి కీలు వ్యాధి (ద్వితీయదశ) – **కాలీమూర్**

★ తుంటి కీలు వాపు (తృతీయ దశ) – **కాల్కేరియాఫాస్**

★ మోకాలి కీలువాపు, కీలును చుట్టి యుండెడి పొర వాచుట (దీర్ఘకాలంగా) – **కాల్కేరియాఫ్లోర్**

## 7. కాళ్ళల్లో తిమ్మిర్లు, మంటలు

కొంతమంది కాళ్ళల్లో తిమ్మిర్లు, మంటలు ఉంటాయి. చక్కెర వ్యాధిగ్రస్తులు, రక్తం తక్కువగా ఉన్నవారు, బాగా లావుగా ఉన్నవారు, రక్తనాళాలు బాగా మూసుకు పోయినవారు ఈ వ్యాధితో బాధపడుతుంటారు.

**కారణాలు :** 1) రక్తప్రసరణ సరిగా లేకపోవుట. 2) బి$_1$ విటమిన్ లోపం.

**నివారణోపాయాలు :**

1) రెండు బేసిన్లు తీసుకోవాలి. ఒక దానిలో వేడినీరు, మరొక దానిలో చన్నీరు తీసుకోవాలి. వ్యక్తి కుర్చీలో కూర్చొని ఒకసారి తన కాళ్ళను వేడినీటిలో 5 నిమిషాల పాటు ఉంచాలి. తర్వాత కాళ్ళను ఆ వేడినీటిలోనుంచి తీసి చన్నీటిలో 2 నిమిషాల పాటు ఉంచాలి. ఈ విధంగా మార్చి–మార్చి రెండుసార్లు చేయాలి. అలాచేస్తే

రక్తం కాళ్ళ పైకి, కాళ్ళ క్రిందకూ వస్తూ పోతూ ఉంటుంది. ఈ విధంగా రక్తప్రసరణ మెరుగవుతుంది.

2) ముడి బియ్యం అన్నం తినటం వల్ల బి$_1$ విటమిన్ లోపాన్ని సవరించవచ్చు.

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 6X :** పిరుదుల తిమ్మిరికి బాగ ఉపయోగపడును.

**ద్వాదశ లవణ మిశ్రమం :** ఉదయం, రాత్రి ఈ మందుల మిశ్రమాన్ని కొద్దిరోజులపాటు తీసుకోవాలి.

కాల్కేరియాసల్ఫ్ 6× - 2 మాత్రలు + నేట్రంసల్ఫ్ 6× - 2 మాత్రలు = మొత్తం 4 మాత్రలు

## 8. కాళ్ళ మడిమల నొప్పులు
## (Pains of Heels)

మడిమ చుట్టూ / క్రింది భాగాన నొప్పి వచ్చుటను మడిమ శూల అని అంటారు. బాగా లావుగా ఉండేవారు ఎక్కువగా మడాల నొప్పులకు గురి అవుతూ ఉంటారు. ఉండవలసిన బరువుకంటే ఎక్కువగా ఉన్న శరీరపు భారాన్ని మోయవలసి వచ్చుటచే కాళ్ళమడిమలపై ఎక్కువ ఒత్తిడి కలుగుతుంది. ఆ ఒత్తిడి మడిమల ఎముకలపైన, కండరాలపైన పడుతుంది. అందువలన నొప్పి వస్తుంది. వాకింగ్ చేయుట వల్ల బరువు, తద్వారా మడిమల నొప్పి తగ్గుతుందేమోనని తలంచి చాలామంది వాకింగ్ చేస్తూ ఉంటారు. దానివల్ల నొప్పులు ఇంకా ఎక్కువ అవుతాయి.

ఎత్తు మడిమలు ఉన్న చెప్పులు ధరించే స్త్రీలు కూడా మడిమ నొప్పులతో బాధపడుతుంటారు.

**కారణాలు :**

1. మడిమలో ఉండు ఎముక పెరుగుట.
2. మడిమలోని కణజాలాలు గట్టిపడుట.
3. మడిమ ఎముక గౌటు
4. మడిమ ఎముక పుచ్చుట
5. మడిమ ఎముక మీద కంతి ఏర్పడుట
6. మడిమ కీళ్ళవాపు
7. మడిమ కీళ్ళు కృశించుట.

**నివారణోపాయాలు :**

1. బరువు అధికముగా ఉన్నవారు వాకింగ్ చేయరాదు.
2. ఎత్తు మడాల చెప్పులు వేసుకొనే స్త్రీలు వాటిని వేసుకొనుట మానాలి. వారు మెత్తని చెప్పులు వేసుకొనుట మంచిది.

3. మడాల నొప్పులతో బాధపడేవారు రాత్రి పడుకొనుటకు ముందు ఈ విధంగా చేయాలి – ఒక బేసిన్‌లో వేడినీరు తీసుకోవాలి. ఆ బేసిన్‌లో 10 – 15 నిమిషాల పాటు పాదములను ఉంచాలి. నిద్రలేచిన వెంటనే అడుగులు వేయుట కష్టంగా ఉంటే మరొక సారి ఆ విధంగా చేయాలి.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 12× :** మడిమ వాచి నొప్పిగ ఉండుట – దీనిని కాలీమూర్ 3× తో మార్చి ఇవ్వాలి.

**నేట్రంసల్ఫ్ 3× – 30× :** చురుకైన, తీక్షణమైన, చీల్చుచున్నట్టి నొప్పి – నడక వలన నొప్పి ఎక్కువగుట, మర్దన వలన తగ్గుట.

**కాల్కేరియాఫాస్ 12× – 30× :** మడిమ నందు పుండు – ఎడతెగని నొప్పి – ఎముకలు బలహీనముగా ఉండుట.

**నేట్రంమూర్ 3× – 30× :** మడిమకు పగుళ్ళు – నడచుట వలన నొప్పి ఎక్కువగుట.

**కాల్కేరియాఫ్లోర్ 3× – 30× :** ఎముక పెరుగుదల / గౌట్ వల్ల నొప్పి – విశ్రాంతి, వాతావరణ మార్పువలన నొప్పి ఎక్కువగుట – వేడి కాపడం వలన నొప్పి తగ్గుట.

**సైలీషియా 12× – 30× :** మడిమ ఎముక పుచ్చుట – కుట్టుచున్నట్టి నొప్పి – నిలబడిన అధికమగు నొప్పి.

## 9. చేతి, కాలి / వ్రేళ్ళ మధ్య, గజ్జలలో పాయుట (ఒరుపులు)
## (Chilblains / Intertrigo)

నీటిలో ఎక్కువగా ఉండేవారికి / పనిచేసేవారికి (గృహిణులు, పనిమనుషులు, చాకలివాండ్లు మొ॥ వారికి), కాలివ్రేళ్ళ మధ్య ఖాళీ ఎక్కువగా లేని వారికి ఎక్కువగా ఈ వ్యాధి వస్తుంది. వారి వ్రేళ్ళ సందులలో నీరు చేరి ఫంగస్ కలుగుతుంది. అది ఇన్‌ఫెక్షన్‌గా మారి దుర్వాసన వస్తుంది. దురదగా ఉంటుంది. ఇది చలికాలం / వర్షాకాలంలో వస్తుంది.

**లక్షణాలు :**

1. చర్మం కమిలి ఎర్రబడి, వాచి, దురదగాను, మంటతో నుండుట.
2. పొక్కులు లేచి పుండ్లగుట.
3. ఇది సాధారణముగ పాదముల యందు, చేతుల వెనుక భాగమందు, వ్రేళ్ళయందు, ఒకప్పుడు చెవుల యందు కలుగుచుండును.
4. ఇది చలికాలంలో సున్నితంగా వుండేవారికి, బలహీనులైన పిల్లలకు వస్తుంది.

**కారణాలు :**

1. వాతావరణ మార్పువల్ల, చలికాలపు చలివల్ల రక్తప్రసరణ సరిగా లేని అవయవాల వద్ద ఈ రోగం కలుగును.
2. అవయవముల రాపిడి, దుస్తుల రాపిడి వల్ల.

**జాగ్రత్త :** తగు పరిశ్రమ చేసి రక్తప్రసరణ సరిగా జరుగునట్లు జాగ్రత్త గైకొనవలెను.

**నివారణోపాయాలు :**

1. పని పూర్తయిన తర్వాత కాలివ్రేళ్ళ మధ్య దూది/మెత్తని గుడ్డతో శుభ్రంగా తుడవాలి.
2. కాలివ్రేళ్ళ సందులలో పొడి పసుపును రెండుపూటలా అద్దాలి.
3. తడిలోనికి వెళ్ళటానికి ముందు కాలివ్రేళ్ళ మధ్య కొబ్బరినూనె రాయాలి. దాని వల్ల నీరు కాలివ్రేళ్ళ మధ్య నిలవదు.
4. కాలివ్రేళ్ళ మధ్య దూది ఉంచిన వాటి మధ్య ఖాళీ ఉండి గాలిఆడుతుంది. దుర్వాసన రాదు.
5. తగు పరిశ్రమ చేసి రక్తప్రసరణ సరిగా జరుగునట్లు జాగ్రత్త గైకొనవలెను.

**• చికిత్స •**

**కాలీఫాస్ 6X :** నరాల వ్యాధులు గల వ్యక్తుల కాలివ్రేళ్ళ మీదను, చేతులపైన, చెవులమీద వచ్చు ఈ వ్యాధి–దురద, నొప్పి, ముళ్ళు గ్రుచ్చుకొనుచుండు నట్లుండుట – ఈ మధ్యనే వచ్చిన వ్యాధి–చీము కారనట్టి పుండ్లు–ఆదుర్దా, విచారం, ప్రతిదానిలోను చీకటి కోణం చూచుట, ఇతరులతో కలవలేకపోవుట లక్షణాలుగలవారికి ఈ మందు బాగా ఉపయోగకారి.

**నేట్రంసల్ఫ్ 6X :** ఈ వ్యాధికి ఉపయోగపడును. పైత్యరస లక్షణాలున్నా, చర్మం ఒరిసినా ఉపయోగపడును.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** పచ్చని చీముకారుతున్న పుండ్లకు వాడాలి – దీనిని పై పూతకు కూడా వాడవచ్చు.

**సైలీషియా 6X :** చీము కారుచున్నప్పుడు దీనిని లోపలకు, పైకి కూడా వాడవచ్చు.

**కాలీమూర్ 6X :** వాపు వున్నపుడు వాడదగును – ప్రధానమైన మందు.

**నేట్రంమూర్ 6X :** తొడలకు, వృషణముల తిత్తికి మధ్య మంటగా నుండు స్రావం, చర్మం ఒరియుట.

## 10. కాళ్ళు పగులుట / పాదములు చీలుట
## (Cracks in Soles)

మడిమలు, పాదములు చీలి మంటగా, నొప్పిగా ఉండును. కొందరిలో బాగా లోతుగ చీలి రక్తం కూడ వచ్చును.

**కారణాలు :** శరీరంలో అన్నిటికంటే పాదాలు చివరన ఉండుట వల్ల రక్తప్రసరణ సరిగా ఉండదు. చలికాలం లోను, నీటిలో నానినపుడు, ఫంగస్ సోకుట వల్ల ఈ సమస్య మరింత తీవ్రమవుతుంది. పాదాలను శుభ్రం చేయక పోవుట వల్ల పాదాలలో పగుళ్ళు వస్తాయి. ఈ పగుళ్ళలో మట్టి చేరి కొత్త చర్మం ఏర్పడదు. ఉన్న చర్మం బిరుసెక్కి పగిలి పోవును.

**నివారణోపాయాలు :**

1. పాదాలకు కొబ్బరినూనె / ఆముదం రాయాలి.
2. ఆ తర్వాత పాదాలను వేడినీటిలో 20–25 నిమిషాలు ఉంచాలి. దీనివల్ల పాదాలపై నున్న మట్టి కరిగి నీటిలోనికి పోతుంది. మొద్దుబారిన చర్మం మెత్తబడుతుంది.
3. పాదాలను తీసి ఏదైనా బ్రష్‌తో పగిలిన భాగంపై రుద్దాలి. నానిన చర్మం సులభంగా ఊడి వస్తుంది. ఊడిన చర్మాన్ని తీసివేసి పాదాలను శుభ్రం చేయాలి. ఆ పాదాలకు కొబ్బరినూనె/ఆముదం కొద్దిగా రాయాలి. ఇలా చేయుటవల్ల చర్మం రోజంతా బిరుసెక్కకుండా ఉంటుంది.
4. రోజూ బూట్లు వాడినా పాదాలకు పగుళ్ళు రావు.
5. పగుళ్ళు లేనివారు అవి రాకుండా ఉండాలంటే పాదాలకు కొబ్బరినూనె రాసుకొని తర్వాత స్నానానికి వెళ్ళాలి. స్నానం చేసేటప్పుడు పాదాలను బ్రష్‌తో రుద్దాలి. మట్టిపోయి శుభ్రంగా ఉంటాయి. స్నానానంతరం కొంచెం కొబ్బరినూనె తేలికగా రాయాలి. దానివల్ల అక్కడ మెత్తగా ఉంటాయి.

**• చికిత్స •**

**కాల్కేరియాఫ్లోర్ 6× :** పాదములు / చేతులలో పగుళ్ళు ఉన్నచో ఇది ముఖ్య ఔషధముగా ఉపయోగపడును.

**కాల్కేరియాసల్ఫ్ 3× - 6× :** పగుళ్ళనుండి చీము వస్తున్న దీనిని వాడాలి. దీనిని సైలీషియాతో మార్చాలి.

**నేట్రంమూర్ 3× - 6× :** దీనిని కాలివ్రేళ్ళ మధ్య చీలికలకు వాడాలి.

**బాహ్య చికిత్స :**

1) చీలిన ప్రాంతాన్ని శుభ్రపరచాలి.
2) ఎంపిక చేసిన మందును వేసిలైనులో కలిపి చీలిన ప్రాంతానికి పూయాలి.

# 11. ఆనెలు / ఆనికాయలు
## (Corns)

అరికాళ్ళలో గాని, అరిచేతులలోగాని, వ్రేళ్ళపైనగాని ఒత్తిడి / రాపిడి కలిగే ప్రదేశంలో పెరిగే గట్టి కొమ్ము వంటి ముద్దలను ఆనెలు అని అంటారు. ఇవి గుండ్రంగా ఉంటాయి.

**కారణం:** నిరంతరం బూట్లు వేసుకొనుట వలన కాళ్ళలోను, సుత్తి / సమ్మెట పట్టుకొనుట వల్ల అరిచేతులలోను ఆనెలు వచ్చును.

### • చికిత్స •

**కాల్కేరియాఫ్లోర్ 3× - 30× :** ఇది ఆనెలకు సిద్ధౌషధం. ఈ మందును 6× నుండి క్రమంగా పొటెన్సీ పెంచుతూ వాడాలి.

**ద్వాదశ లవణ మిశ్రమం :** ప్రతి మోతాదులోను కాల్కేరియాఫ్లోర్ 3× - 1 మాత్ర, కాలీమూర్ 3× - 1 మాత్ర, నేట్రంమూర్ 3× - 1 మాత్ర, సైలీషియా 12× - 1 మాత్ర కలిపి మొత్తం 4 మాత్రలు తీసుకోవాలి. ఈ విధంగా ప్రతిరోజూ ఉదయం, రాత్రి కొన్ని రోజుల పాటు తీసుకోవాలి.

# 19

# గోళ్ళ వ్యాధులు

## (NAIL DISEASES)

కొమ్ముతో గోరు ఏర్పడును. ఈ గోర్లు చేతిౖవేళ్ళ / కాలి ౖవేళ్ళ కొనన ఏర్పడి ఉంటాయి. కొన్ని కారణాల వలన ఈ గోర్లకు కొన్ని రకాల వ్యాధులు వస్తాయి.

1. గోళ్ళ రంగు మారుట
2. గోళ్ళపై తెల్లని మచ్చలు ఏర్పడుట
3. గోళ్ళు పెళుసుగా ఉండుట
4. గోళ్ళు చర్మంలోనికి పెరుగుట
5. గోళ్ళు మెత్తగా, మందముగా, అడ్డ దిడ్డంగా పెరుగుట
6. గోరుచుట్టు మొ॥నవి.

**కారణాలు :**

1. కాల్షియం, ఐరన్, కెరాటిన్ పదార్థాలు తక్కువగుట
2. రక్తహీనత

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 6×** : చేతిౖవేళ్ళ గోళ్ళ మూలమున (root) నొప్పి, వాపు, వేడిమి, పుండు – గోళ్ళు వికృతంగా ఉండుట.

**నేట్రంసల్ఫ్ 6×** : గోర్ల క్రింద ముళ్ళు గ్రుచ్చుకొనుచున్నట్టి నొప్పి, వాపు – కాలిౖవేళ్ళ దురద.

**నేట్రంమూర్ 6×** : గోరువద్ద చర్మం సన్నగా పొప్పర ఊడుట (Hang nails) – చేతిగోర్లు పొడిగాను చీలికలతో ఉండుట.

**సైలీషియా 6× – 12×** : గోరుచుట్టు – చేతిౖవేళ్ళ మొనల్లో చీము స్రవిస్తున్నట్టి భావన – చీమును అదుపు చేసి క్రొత్త గోర్లను పెరుగునట్లు చేయుట – కాలిౖవేళ్ళ గోరు ప్రక్క ధాతువులోనికి వ్యాపించి వాపును కలిగించుట – గోర్లు విరుగుట, తేలికగా పగులుట – వాటిపై తెల్లని మచ్చలు ఏర్పడుట.

**కాలీసల్ఫ్ 6×** : గోర్ల అనారోగ్య స్థితి – వాటి పెరుగుదలకు ఆటంకం కలిగించుట (సైలీషియా)

# 20

# సుఖ వ్యాధులు

## (SEX DISEASES)

### 1. సెగ / గనేరియా
### (Gonorrhoea / Gonorrhea)

ఇది సుఖరోగాలలో ఒకటి. అంటువ్యాధి. ఈ వ్యాధి గొనొకాకస్ సూక్ష్మక్రిమి వలన కలుగును. ఈ వ్యాధి గల స్త్రీతో సంభోగము చేసిన పురుషునకు ఈ వ్యాధి సోకును. ఈ వ్యాధి గల పురుషుల మూత్ర మార్గములో నొప్పి, వేడి, మంట, వాపు వుండును. అతని పురుషాంగం గుండా చీము కారును. స్త్రీలలో తరచుగా ఈ వ్యాధి ఏ లక్షణములు కనబడకుండా వచ్చును. కాని అండాశయ నాళము (Fallopian tube) నొప్పిగాను, వాపుతోను వుండును. అండాశయం వాచును (Oophoritis). మరియు ఆ ప్రాంతంలో చీము గడ్డ ఏర్పడును. దీనివల్ల మూత్ర విసర్జన బాధగా వుండును. యోని నుండి చీము వచ్చును. ఈ వ్యాధి గలవారికి కీళ్ళనొప్పులు, గుండెజబ్బులు మొ॥వి వచ్చును. ఈ వ్యాధి గల తల్లిదండ్రులకు పుట్టిన శిశువుకు కండ్ల కలక వస్తుంది.

**సెగరోగపు దశలు :** సెగరోగపు దశలు మూడు వుంటాయి.

**ప్రథమ దశ :** సెగరోగముతో బాధపడుతున్న స్త్రీతో సంభోగించిన పిమ్మట వారము రోజుల లోపుగా పురుషాంగమునకు చివర ఒక విధమైన దురద బయలుదేరి, వృద్ధియై లేపనము బాధాకరముగా నుండును. మూత్ర విసర్జన చేయునపుడు బాధ అధికమై క్రమక్రమముగా భరింపరాని స్థితికి చేరుకొనును. రెండు–మూడు రోజుల తర్వాత మూత్రద్వారం ఎర్రబడి, వాచి, తడిగా మారును. శుక్లము / వీర్యము వెళ్ళు మార్గములోను, వృషణములలోను, గజ్జల లోను లాగుచున్నట్లు బాధ వుండును. మూత్ర విసర్జన తర్వాత మంటతో కూడిన బాధ కలుగును. ఈ బాధ, మూత్ర ద్వారపు వాపు, ఎరుపు దినదినము అధికమగును. తొలుత స్వచ్ఛముగాను, జిగురుగాను వుండు స్రావము అధికముగా వెడలుచు మూత్రద్వారపు ప్రక్కలను అంటుకొనును. కట్టుకొనిన బట్టను మరకలు చేయును. శిశ్నాగ్రము వాచి, ఎర్రబడి, వెచ్చగా నుండి బాధ కలిగించుచుండును. ఈ బాధ రాత్రులందు లేపనము వలన అధికమై నిద్రాభంగం కలిగించును.

**ద్వితీయ దశ :** ఒక వారము తర్వాత స్రావము అధికముగను, చిక్కగను, పసుపు–తెలుపు రంగులో వెలువడును. మూత్రవిసర్జన సమయమందు, లేపన సమయమందు బాధ ఎక్కువగును. మూత్ర ద్వారము ముడుచుకుపోవును. మూత్రము ఒక ధారగా కాకుండా చీలికలుగా వచ్చును. ఈ దశ వారము / రెండు వారములు వుండును.

**తృతీయ దశ :** ఈ దశలో వాపు, ఎరుపు, బాధ తగ్గును. మూత్ర విసర్జనము, లేపనము కూడా బాధ లేకుండ యుండును. స్రావము మాత్రం వెడలుచుండును. దాని రంగు తెల్లగా మారును. అది జిగురుగా వుండును. దానిని గ్లీట్ (Gleet) అని అందురు. దీనికి వైద్యము ఎక్కువ కాలము పట్టును. దీనికి చికిత్స జరగనిచో మూత్రద్వారము సన్నగిల్లి, ముడుచుకొని పోయి మూత్రబంధనం కలిగించును. గ్లీట్ నివారణ కానంతవరకు స్రావము వెడలుచుండును.

**కఠినమైన కేసులు :** కఠినమైన కేసులలో ఈ వ్యాధి మూత్రపు తిత్తినుంచి మూత్ర పిండమునకు, స్త్రీలలో గర్భాశయమునకు వ్యాపించును. స్రావము పురుషులలో మూత్ర ద్వారము నుంచి, స్త్రీలలో భగరంధ్రము / గర్భాశయం నుంచి వెలువడును.

**వ్యాధి కారణములు :**

1. ఈ వ్యాధిచే బాధపడువారితో సంభోగించుట. వారు వాడిన వస్త్రములను, పక్కబట్టలను ఇతరులు వాడుట.
2. ఈ రోగులు మూత్రమును విసర్జించుచోట, ఇతరులు మూత్రమును విసర్జించుట.
3. మూత్ర విసర్జన చేయునపుడు మర్మావయవములకు విస్తారమైన చలిగాలి తగులుట.
4. క్షయరోగతత్త్వము / కొన్ని చర్మరోగములు కలిగియుండుట.
5. వారసత్వం.
6. కుసుమ వ్యాధి / తెల్లబట్ట కల స్త్రీలతో సంభోగించుట.

**సెగరోగము వలన కలుగు ఇతర బాధలు :**

1. శిశ్నాగ్ర చర్మము వాపు, ఎరుపు, దురద, పొక్కులు.
2. శిశ్నము వంకర తిరిగి బాధ కలుగుట.
3. మూత్రపు తిత్తి వాపు, బాధ.
4. శిశ్నాగ్ర చర్మము ముందుకు వచ్చుట.
5. శిశ్నాగ్ర చర్మము ఎక్కువగా వెనుకకు లాగుకొని పోవుట.
6. వృషణములు వాచి పెద్దవగుట.
7. నేత్ర వ్యాధులు.
8. మేహవాతపు నొప్పులు, కీళ్ళనొప్పులు.

9. సురుగుడు కాయలు, ఇతర చర్మవ్యాధులు.
10. పుంసత్వము క్షీణించుట, నపుంసకత్వము.
11. స్త్రీలలో ఋతుశూల, కుసుమ, వంధ్యత్వం.
12. ముక్కు, శ్వాసకోశము, జీర్ణకోశము, కాలేయము, గుండె మొ॥ వాటికి సంబంధించిన రోగములు.

**రక్తసెగ :** సెగలో మూత్రకోశము నుంచి రక్తస్రావమైనా, రక్తము చుక్కలు–చుక్కలుగా పడినా / మూత్రము, స్రావము రక్తమిశ్రితమైనా రక్తసెగ అని అందురు.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× – 12× :** ఈ వ్యాధి యొక్క ప్రథమావస్థలో స్త్రీ – పురుషులిద్దరకు ఈ మందు వాడదగును. మూత్రకోశము వాచి, ఎర్రబడి బాధగా వుండుట – మూత్రపిండములు, ప్రోస్టేటు గ్రంథి వాచి బాధపెట్టుట – పగటివేళ మూత్రం కొద్దికొద్దిగా చుక్కలు చుక్కలుగా పడుచుండుట – మూత్రం అప్రయత్నముగా వెడలుచు కొంచెం ఎరుపురంగులో వుండుట – జ్వరం వుండుట. – స్రావము తెల్లగా వెడలుట – అండముల వాపు, బాధ, స్త్రీలలో గర్భాశయము, భగరంధ్రము, మర్మావయవములు వాచి, ఎర్రబడి బాధగా నుండుట – ఈ వ్యాధిలో చీమును బయటకు గెంటుటకు మూత్రవాహికను నొక్కగూడదు. అట్లు చేసినచో చికిత్సకు ఆటంకం ఏర్పడును. మేడమెట్లు ఎక్కినను, నడచినను వ్యాధి నివారణకు ఆటంకం కలుగును. జీర్ణించిన సెగరోగములో గ్లీటు స్రావము తెల్లగా నున్నపుడు ఈ మందు పనిచేయును. మూత్ర విసర్జన సమయమున మంటను, మూత్ర కోశము నుంచి రక్తస్రావమును, మూత్రములో శ్వేతధాతువు, యూరిక్‌యాసిడ్ పోవుటను ఈ మందు నివారించును. ఈ మందును కాలీమూర్‌తో మార్చి వాడవలెను.

**నేట్రంఫాస్ 6× – 12× :** డాక్టరు స్క్యూస్లరు వ్రాసిన గ్రంథము యొక్క 25వ ముద్రణలో దీనిని సెగరోగమునకు ప్రధాన ఔషధముగా పేర్కొనుట జరిగింది. పురుషులలో సంభోగానంతరము రాత్రులందు మూత్రవిసర్జనకు తొందర కలుగును. ఎక్కువగా తినకవలసి వచ్చును. కూర్చుండిన కొంతసేపటికి వచ్చును. ఆగి ఆగి మూత్రము వచ్చును. మూత్ర విసర్జన సమయమున మూత్రకోశము మంటగా నుండును. మూత్రములో శ్వేతధాతువు పోవును. మూత్రము వాసనగా యుండి ముదురు ఎరుపురంగు మడ్డితో కలిసియుండును. మలవిసర్జన సమయమున ప్రోస్టేటు స్రావము పడుచుండును. మల విసర్జనానంతరము మూత్రద్వారమున దురద, మంట, మర్మావయవములపై పొక్కులు – వృషణముల చిక్కము, మలాశయము దురదగా యుండుట – వృషణములలోను, రేతోవాహికలోను లాగుచున్నట్టి నొప్పి – బాధతో కూడిన లేపనములు–శిశ్నము, అండములు వాచుట–స్వప్నములు లేని వీర్యస్కలనము – కొన్ని సమయాల్లో సంభోగ వాంఛ ఎక్కువ, కొన్ని సమయాల్లో తక్కువ.

**కాలీమూర్ 3× – 6× :** సెగరోగములో ఇది ముఖ్యమైన మందు. జననేంద్రియ భాగము చర్మం క్రింద బాగా వాచినపుడు ధాతుకణముల మధ్య భాగములు బాగా చెమర్చినా ఇది సిద్ధౌషధం. స్రావము చిక్కగా, తెల్లగా / తెలుపు–పసుపు పచ్చగా వుండును. నాలుకమీద తెల్లని పూత –గ్లీటు గజ్జితో నున్నపుడు (గజ్జి కనిపించవచ్చు / కనిపించకపోవచ్చు) లేక గ్రంథులు వాచినపుడు ఇది బాగా పనిచేయును – పులిపిరికాయలు / సురుగుడు కాయలు వుండుట.

**కాలీఫాస్ 3× – 6× :** రక్తసెగ అనగా సెగస్రావములో రక్తము పడునపుడు ఇది చాలా మంచి మందు. అలాంటపుడు రోగిని మట్టముగా (Horizontal position) పడుకోబెట్టి శిశ్నముమీద మంచుగడ్డ పెట్టుట / చన్నీళ్ళు పోయుట చేయాలి. పురుషులలో శిశ్నాగ్ర భాగము గాని, దానిని కప్పెడి చర్మముగాని, స్త్రీలలో క్లిటోరిస్ యొక్క చివరిభాగము వాచుటగాని జరిగిన ఈ మందు బాగా పనిచేయును.

**సైలీషియా 6× :** చాలా కాలము నుంచి వున్నట్టి సెగ – చిక్కని, దుర్వాసన గల చీము స్రవించుట – కసరత్తు చేస్తున్నపుడు కూడా చల్లగా వున్నట్లు అనిపించుట – పురుషులలో శిశ్నాగ్ర భాగముగాని, దానిని కప్పెడి చర్మముగాని, స్త్రీలలో క్లిటోరిస్ యొక్క చివరిభాగము గాని వాచుట – ప్రతిరోజు ఉదయాన మలవిసర్జనకై తినుకునపుడు మూత్ర విసర్జన నాళము నుండి కొద్దిపాటి పలచని, నీళ్ళవంటి స్రావమును, ప్రాస్టేటు స్రావమును స్రవించుట – వృషణముల తిత్తి దురదగా వుండుట, దానిపై కొన్ని తడిగానున్న మచ్చలు ఏర్పడుట – ఎల్లప్పుడూ మలబద్ధకం వుండుట – బాగా తినకగా మలములో కొన్ని గట్టి వుండలు పడుట – ఎప్పుడో ఒకసారి వదులుగా నుండు విరేచనం – విరేచనానంతరం గుదము వద్ద కొద్దిగా మంట – లోగడ వున్న ఉత్సాహం తగ్గుట – సంభోగేచ్ఛ తగ్గుట – సంభోగానంతరం కముకు నొప్పి (Bruised pain) వచ్చుట.

**కాలీసల్ఫ్ 6× :** పురాతన సెగ రోగము – గ్లీట్ – బంకగాను, పసుపుపచ్చ / ఆకుపచ్చగాను ఉండు స్రావము.

**నేట్రంమూర్ 6× :** దీర్ఘకాలపు సెగరోగము – స్రావము పారదర్శకముగా, నీళ్ళవలే బంకగా నుండుట – గనేరియాలో చర్మం పొరలు వూడుట ఈ మందు ముఖ్య లక్షణం. ఈ మందును కాల్కేరియాఫాస్‌తో మార్చి–మార్చి వాడాలి. మూత్రనాళము బాధతో వుండుట – సిల్వర్ నైట్రేట్ ఇంజక్షన్లు వాడినా సెగరోగము తగ్గనిచో దీనిని వాడాలి.

**కాల్కేరియాఫాస్ 6× – 12× :** దీర్ఘకాలపు గనేరియా రక్తహీనత, బుడ్డ (వరిబీజము)

**కాల్కేరియాసల్ఫ్ 6× :** దుర్వాసనగా నున్న స్రావమును విస్తారముగా స్రవించు గనేరియా.

**నేట్రంసల్ఫ్ 6× :** దీర్ఘకాలపు గనేరియా – చిక్కని పసుపు పచ్చ – ఆకుపచ్చ స్రావము – కొద్దిపాటి నొప్పి – ప్రోస్టేటు గ్రంథి వాపు – పులిపిరి కాయలు – ప్రతిగంట / రెండు గంటలకు ఒకసారి ఈ మందును 3× పొటెన్సీలో కొద్దిపాటి నీటిలో కలిపి ఇవ్వాలి.

# 2. సవాయి
## (Syphilis)

సవాయి రోగము కూడ సెగవలె అంటువ్యాధి. ఈ వ్యాధిచే బాధపడువారితో సంభోగించుట వలన ఇది సాధారణంగా కలుగుచుండును. ఈ వ్యాధి రెండు రకములుగా వచ్చును.

**మొదటి రకము :** సంభోగమునకు పిమ్మట సుమారు 15 దినములలో అంగము మీద చిన్న పొక్కు బయలుదేరి, ఎర్రగా గట్టిగా యుండి నాలుగు రోజులలో క్రమముగా ఎదిగి, నీరుపట్టి చితుకును. అంచులు గట్టిగాను, ఎత్తుగాను వుండును. మధ్య పల్లముగా నుండి స్రవించుచుండును. కాని బాధ ఎక్కువగా వుండదు.

**రెండవ రకము :** సంభోగము తర్వాత 4 – 5 రోజులకు అంగము మీద పొక్కులు బయలుదేరును. ప్రారంభమున అవి నీరు పట్టియుండును. తర్వాత అవి పుండు పడి రసి కారును. అవి గట్టిగా వుండవు. కాని బాధ ఎక్కువగా వుండును.

పై పుండు ఏర్పడిన సుమారు నెల రోజులకు / మానిన తర్వాత గజ్జలలో వాపు బయలుదేరి మాంసగ్రంథులు వాచి కదుము గట్టి బిళ్ళవలె లేచును. దీనినే 'సవాయి బిళ్ళ' (Bubo) అని అందురు. ఇది కురుపు క్రింద కూడ తయారగును. దీనిని Hard Chancre అని అందురు. ఈ దశలో బాధలు ఎక్కువగా వుండును. తలనొప్పి, జ్వరము ప్రారంభమగును. పుండు నుండి చీము, రసి కారును. మాంసగ్రంథులు వాచుట, కీళ్ళనొప్పులు మొదలగునవి కొద్దిగా ప్రారంభమగును. ఇంజెక్షన్లు, అల్లోపతి మందులు వాడిన పై బాధలు కొంత ఉపశమించును. కాని వ్యాధి నివారణయైనదని భావించుట పెద్ద పొరపాటు కాగలదు.

సవాయి రోగము దేహములోనే దాగియుండును. కొన్ని నెలల / సంవత్సరముల తర్వాత రోగము విజృంభించును. వివిధ అవయవములందు సహించరాని బాధలు కలుగును. కీళ్ళనొప్పులు వృద్ధియగుట, మేహవాతపు నొప్పులు, వృషణములు వాచి గట్టిపడుట, శిరోబాధలు, గొంతునొప్పి, నోటిలోను, నాలుకమీద పుండ్లు, చర్మముపై మచ్చలు, శరీరముపై దురద, వివిధ రకముల పొక్కులు, గోళ్ళు చెడిపోవుట, గోళ్ళమీద మచ్చలు, అరచేతులలో పొక్కులు, నేత్ర రోగములు, చెవిలో పోట్లు, మూత్రవ్యాధులు, ఆకలి తగ్గుట, నిద్రలేమి, స్వరభేదము, రక్త క్షీణత మొ॥ బాధలు కలుగును. గర్భిణీ స్త్రీకి గర్భస్రావము కూడా కలుగవచ్చు. దీనితో బాధలు అంతము కావు. మరికొంత కాలము గడచిన తర్వాత పై రోగములన్నియు తీవ్రరూపం దాల్చును. మెదడు, నాడీమండలము, ముక్కు, నోరు, కళ్ళు, వెన్నెముక, కాలేయము, గాలిగొట్టము, చెవులు, ఆసనము, మర్మావయవములు మొ॥ అవయవములన్నియు చెడిపోయి భయంకర రూపము దాల్చును.

కనుక వ్యాధి జీర్ణించక ముందే ప్రారంభావస్థలోనే సిగ్గుపడక సరైన వైద్యుని సంప్రదించి చికిత్స పొందవలెను. ద్వాదశ లవణ చికిత్సకునితో నమ్మకమైన చికిత్స లభించగలదు.

**కారణములు :**

1. రోగి వాడిన బట్టలను వాడుట, అతను ఉపయోగించిన పాత్రలను శుభ్రపరచకుండా యితరులు వాడుట.
2. ఈ వ్యాధిచే బాధపడువారితో సంభోగించుట.
3. ఈ రోగులు మూత్ర విసర్జన చేసిన ప్రదేశమున మూత్ర విసర్జన చేయుట.
4. వారసత్వము.
5. ట్రైపోనియం పొల్లిడమ్ అనే బ్యాక్టీరియా వలన
6. వివిధ అవయవాలలో లవణాల లోపం వలన కలిగే వ్యాధి నిరోధక శక్తి లేమివల్ల బాధలు ఎక్కువగుట.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12× :** ఈ మందు సవాయి రోగము ప్రథమదశలో గ్రంథుల వాపు, సవాయి బిళ్ళలు, జ్వరము, తలనొప్పి, వేడిమి, కీళ్ళనొప్పులు, మేహవాతపు నొప్పులు, నరముల బాధ, నరములు లాగుట మొ॥ బాధలకు పనిచేయును. కళ్ళవాపు, ఎరుపు, మంట, నీరు కారుట, కళ్ళలో ఇసుక పడినట్లుండుట, వెలుతురును చూడలేకపోవుట, కాచబింబము పైన పుండ్లు, ముక్కునుంచి రక్తస్రావము, పండ్లపోటు, ఇగుళ్ళ వాపు, ఇగుళ్ళ నుంచి రక్తస్రావము, నోటి పూత, పుండ్లు, నాలుక వాపు, గొంతులో పుండ్లు, బాధ మొ॥ వాటికి ఈ మందును కాలీమూర్‌తో మార్చి ఇవ్వాలి. మూత్ర విసర్జన సమయములో మంట, నొప్పి, అండముల వాపు, ప్రోస్టేటు గ్రంథి వాపుకు ఈ మందును వాడవలెను. ఈ రోగికి అజీర్ణము, నీళ్ళ విరేచనాలు, రక్తహీనత వుండును.

**కాలీమూర్ 3× - 6× :** సవాయి రోగము జీర్ణించిన దశలో ఈ మందు ప్రధాన ఔషధము. తెల్లని, చిక్కని స్రావము గల మెత్తని సవాయి పుండు (soft chancre)కు ఈ మందును లోపలకు, పైకి కూడా వాడవచ్చు.

కళ్ళు వాచి, ఎర్రబడి, కళ్ళల్లో ఇసుక పోసినట్లుండి బాధ పెట్టుట, కళ్ళ కలక, వెలుతురును చూడలేకపోవుట, కేటరాక్ట్ ఏర్పడుట, కాచబింబముపై మచ్చలు, పుండ్లున్న కళ్ళనుండి చిక్కని చీము వంటి స్రావము వచ్చుట, చెవుడు, చెవి నుంచి తెల్లని చిక్కని స్రావము కారుట, చెవిలో శబ్దములు, ముక్కునుండి దుర్వాసనతో కూడిన స్రావము, ముక్కులో పుండ్లు, ముక్కు దిబ్బడ, ముక్కునుంచి మధ్యాహ్నం తర్వాత / రాత్రి రక్తస్రావము, నోటిలో పుండ్లు, గుటక వేయలేకపోవుట, గొంతునొప్పి, దగ్గుతో చిక్కని కఫము, తలనొప్పి,చుండ్రు, తలలో కురుపులు, మెడ గ్రంథులు వాచుట, మేహవాత నొప్పులు, నాలుకపై తెల్లని పూత.

**కాలీఫాస్ 3× – 6× :** కుళ్ళిన లక్షణాలతో నున్న సవాయి పుండ్లు – మెత్తని భాగములను తినునట్టి పుండ్లు – దుర్వాసనతో నున్న స్రావము.

**కాలీసల్ఫ్ 6× :** బాగా జీర్ణించిన సవాయి రోగము – దీని బాధలు సాయంత్రమున, వెచ్చని గదిలో ఉద్రేకించును.

**నేట్రంమూర్ 6× :** దీర్ఘకాలపు సవాయి – సీరం సంబంధమగు ద్రవములు కారుట, స్రావము చిక్కని చీమువలె నుండక, పలచని నీటివలె వుండుట – చర్మము ఎండిపోయినట్లుండుట – నాలుక శుభ్రంగా వుండుట.

**నేట్రంసల్ఫ్ 3 × – 6× :** గుదము వద్ద ఉబ్బెత్తుగా పులిపిరి కాయలు – ఈ మందును లోనికి, పైన వాడవచ్చు.

**సైలీషియా 6× – 30× :** ఇది సవాయి రోగపు తృతీయావస్థలో బాగా ఉపయోగపడును. ముక్కు దురద – రొంప పట్టి, దుర్వాసన గల స్రావము వెడలుచుండును. ముక్కుయందు పుండ్లు పడి రక్తము స్రవించుచుండును. ముక్కు ఎముకకు కూడా వ్యాధి వ్యాపించి ఎముకను తినివేయుచుండును. సవాయికి సంబంధించిన కంటి వ్యాధులుండును.

**కాల్కేరియాసల్ఫ్ 3× – 30× :** సవాయి జీర్ణించిన కేసులలో కురుపులకు చీము పట్టకుండా చేయుటలో ఈ మందు ఉపయోగపడును. దీనిని సైలీషియాతో మార్చి వాడాలి.

**కాల్కేరియాఫ్లోర్ 6× – 12× :** సవాయి రోగము ప్రథమ దశలో ఉపయోగకారి. గట్టిగా నుండు సవాయి బిళ్ళను ఇది మాన్పును.

# 21

# పురుషుల వ్యాధులు

## (DISEASES OF MEN)

### 1. హస్తప్రయోగం / స్వయంకృత రతి ప్రేరేపణ
### (Masturbation)

దీనిలో లైంగిక సుఖం కొరకు భాగస్థుడు / భాగస్థురాలు లభించనపుడు జననేంద్రియముల స్వయం ప్రేరేపణ జరుగును. పురుషులు జరుపు ఈ క్రియను ముష్టిమైథునం / హస్తప్రయోగం అని అంటారు. దీనిలో పురుషుడు పురుషాంగం మీది చర్మాన్ని ముందుకు వెనుకకు సాగదీయటం జరుగును. పురుషాంగమును ఏదైనా లోతులో గుచ్చడాన్ని కూడ హస్తప్రయోగం అని అంటారు.

ఇందు స్త్రీ క్లైటోరిస్[1] మీద రాపిడి పెట్టటం / యోని క్రింది నిలువుపెదవులకు రాపిడి పెట్టటం జరుగును. దీనిలో చన్నులు, చూచుకములతో ఆడుట కూడ జరుగవచ్చు. ఈ అలవాటు ప్రమాదకరమైనది కాదు. నపుంసకత్వాన్ని కలుగజేయదు. కాని నాడీమండల దుర్బలత ఏర్పడును. మానసికంగా తప్పు చేస్తున్నట్టి భావన కలుగును.

**• చికిత్స •**

**కాల్కేరియాఫాస్ 200×** : స్క్రూఫులాతత్త్వం గల పిల్లల ఈ అలవాటు, జననేంద్రియాలు గుండెవలె కొట్టుకొనుట, వారి ఇంద్రియ లోలుపతను తెలుపును. ఈ మందు అట్టి వారికి బాగా ఉపయోగపడును. ఈ మందును రాత్రిపూట కొన్ని రోజులపాటు తీసుకోవాలి.

### 2. శుక్రనష్టం / వీర్యస్రావం
### (Spermatorrhoea)

రతిలో కాకుండా అప్రయత్నముగా వీర్యం నిష్క్రమించుటను శుక్రనష్టం / వీర్యస్రావం (Spermatorrhoea) అని అంటారు.

---

1. **క్లైటోరిస్ (Clitoris)** : యోని పై భాగమున చిన్న పొడుగాటి ఉబ్బే స్వభావం గల కణజాలం. దీనియందు ఇంద్రియలాలసను పెంచే నరాలు అధికంగా ఉండును.

**• చికిత్స •**

**నేట్రంఫాస్ 6× - 25× :**

- ★ ప్రతిరోజు రాత్రి శుక్రం అప్రయత్నముగా స్ఖలనమగుట - సంభోగ వాంఛ ఇంచుమించుగ పూర్తిగా నశించుట.
- ★ శుక్రం / వీర్యం పలచగా, నీళ్ళవలె ఉండుట-నిలువ వున్న మూత్రంవలె వాసన వచ్చుట.
- ★ తొలుత కామాతురతను పెంచు కలలు వచ్చుట - తర్వాత రాత్రిపూట ఒకసారి / రెండుసార్లు వీర్యస్ఖలనం జరుగుట - ఈ విషయం తెలియకుండుట.
- ★ శుక్రస్ఖలనం తర్వాత వీపు బలహీనత - మోకాళ్ళు వణకుట.

**కాలీఫాస్ 6× - 12× :**

- ★ అధికమైన సంభోగ ఉద్రేకం వల్ల నరాల బలహీనత ఎక్కువగుట.
- ★ సంభోగములో పాల్గొన్న సంభోగ భావనను అణచివేసినా నరాల బలహీనత అధికమగుట.
- ★ నరాల బలహీనతతో నపుంసకత్వం, రాత్రి నిద్రలో మూత్రం తెలియకుండ పోవుట, ఇతర స్రావాలు స్రవించుట.
- ★ అత్యధిక సంభోగ వాంఛ.
- ★ రాత్రిపూట శుక్రస్ఖలనం బాధాకరముగా నుండుట.
- ★ సంభోగం తర్వాత పూర్తిగా శక్తి పోవుట, చూపు బలహీనమగుట.

**నేట్రంమూర్ 6× - 12× :**

- ★ ప్రోస్టేటు గ్రంథి నుండి స్రావం స్రవించుట.
- ★ రతియందు గాక, ఇతరత్రా శుక్రం స్ఖలనమగుట - దీని తర్వాత చల్లదనం, అలసట కలుగుట, సంభోగ వాంఛ అధికమగుట, నపుంసకత్వం.

**సైలీషియా 6× - 12× :** పక్షవాతపు వ్యాధితో శుక్రస్ఖలనం - సంభోగ సంబంధమైన ఆలోచనలు నిరంతరం ఉండుట.

**కాల్కేరియా ఫ్లోర్ 6× - 12× :**

- ★ వీర్యం, ప్రోస్టేటు గ్రంథి స్రావం నిరంతరం బొట్లు బొట్లుగా పడుట - వృషణములు /బుడ్డలు సన్నబడుట.

## 3. వృషణముల వ్యాధులు
## (Diseases of Testicles)

వృషణములు (Testicles) రెండు. వీటిని వాడుక భాషలో బీజములు, వట్టకాయలు, విత్తులు అని పిలిచెదరు. ఇవి వృషణముల తిత్తి (scrotum)లో వుండును. వీటిలో శుక్రం / వీర్యం తయారగును.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6× - 12× :** వృషణముల వాపు ప్రథమ దశ – వేడిమి, ఎర్రదనం, నొప్పి, ఉబ్బుట అను లక్షణములు గల వాపు.

**కాలీమూర్ 3× - 6× :** గనేరియా వ్యాధిని అణచివేయుట వల్ల వృషణములు వాచిన ఇది ముఖ్యమైన మందు. చిన్నపిల్లల వృషణముల తిత్తిలో గాని, శుక్రవాహిక నాళములందు గాని ద్రవం కూడిన దీనిని వాడాలి.

**కాల్కేరియాఫాస్ 6× :** వృషణముల వాపు, వృషణముల తిత్తిలో ద్రవం చేరిన నేట్రంమూర్ తర్వాత కొన్ని సందర్భాలలో ఈ మందును వాడాలి.

**కాల్కేరియాఫ్లోర్ 6× - 30× :** వృషణములకు నీరు పట్టినా, అవి వాచినా దీనిని వాడవచ్చు.

**నేట్రంమూర్ 3× - 200× :**

★ వృషణముల తిత్తి, శిశ్నాగ్రభాగం / క్లైటోరిస్‌ను కప్పియుంచు చర్మం ఉబ్బి నీరు పట్టుట. ఈ లక్షణాలకు ఈ మందుతో పాటు నేట్రంసల్ఫ్ కూడా వాడాలి.

★ శుక్రవాహక నాళం, వృషణాలు పుండుపడి చాలా బాధాకరంగా ఉండుట – వృషణాలలో నొప్పి – వృషణముల తిత్తిపై చాలా అధికంగా దురద – జననేంద్రియంపై వెంట్రుకలు పెరుగు ప్రదేశమున వెంట్రుకలు పెరుగకుండుట.

## 4. వృషణాల వాపు / అండకోశవృద్ధి (Orchitis)

కొన్ని సందర్భాలలో వృషణాలు వాచును.

**లక్షణాలు :** ఈ వ్యాధిలో నొప్పి, వాపు వుండి వృషణాలు ఎర్రగా ఉంటాయి.

**కారణాలు :** 1) హెర్నియా 2) బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ 3) గనేరియా 4) శుక్రవాహక సిరలవాపు 5) ఎపిడైటెమిస్ వాపు, దెబ్బ, 6) గవద బిళ్ళల వాపు.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 12× :** వృషణాలు వాచి వేడిగా, ఎర్రగా, బాధగా ఉండుట – జ్వరం – జీర్ణం కాని ఆహార పదార్థం వాంతి యగుట.

**కాలిమూర్ 6× :** సెగ / గనేరియా వ్యాధిని అణచిపెట్టుట వల్ల వృషణాలు వాచిన ఇది ప్రధానమైన మందు.

**కాల్కేరియా ఫాస్ 6× :** బీజాలు / వృషణాల వాపు – బలహీనత, రక్తక్షీణత – కాలిమూర్ తర్వాత దీనిని వాడాలి.

**కాల్కేరియా ఫ్లోర్ 12×** : బీజాలు / వృషణాలు గట్టిపడినపుడు ఈ మందును 3×లో పైపూతగా వాడాలి.

## 5. బుడ్డ / వరిబీజం
## (Hydrocele)

వృషణములు పెద్దవగుటను బుడ్డ / వరిబీజము అని అందురు.

**లక్షణాలు :**

1. వాపు, నొప్పి ఉంటుంది.
2. నడిచేటప్పుడు, పడుకొనేటప్పుడు క్రిందికిలాగుతూ ఉంటాయి.

**కారణాలు :**

1. కొన్ని అవరోధములవల్ల శుక్రవాహక నాళములందు నీటిలాంటి ద్రవం ఒకచోట చేరుట.
2. గనేరియా
3. ఏ కారణం లేకుండా
4. సాధారణంగా సైకిలు త్రొక్కుట వల్ల, దూకుటవల్ల ఈ వ్యాధి వస్తుందని భావిస్తారు. ఇది భ్రమ మాత్రమే.

**నివారణోపాయాలు :**

1. కొంతమంది బుడ్డ నుండి నీరు తీస్తూ ఉంటారు. ఇది తప్పు పద్ధతి.
2. అల్లోపతిలో చిన్న శస్త్రచికిత్స చేసి శుక్రవాహక నాళములలోని అడ్డంకులను తొలగించి క్రొత్తదారిని ఏర్పాటు చేస్తారు.
3. సరైన సైజు లంగోటా వేసుకొనుట మంచిది.

### • చికిత్స •

**కాల్కేరియాఫ్లోర్ 6× – 12×** : వృషణములు, వృషణాల తిత్తి నీరు, సీరంకు సంబంధించిన పదార్థాలు చేరుటవల్ల ఉబ్బుట – వాపు.

**కాల్కేరియా ఫాస్ 6×** : బుడ్డ వున్నప్పుడు ఈ మందును మధ్య మధ్య వాడాలి.

**సైలీషియా 6×** : ఆహార పోషణ సరిగా లేని క్షయతత్త్వము గల పిల్లలకు దీనిని మధ్య – మధ్య వాడాలి. తరుణ వ్యాధులకు, దీర్ఘవ్యాధులకు దీనిని వాడవచ్చు.

**నేట్రంమూర్ 3× – 6×** : వృషణాల తిత్తిలోనికి నీరు, సీరంకు సంబంధించిన పదార్థం చేరుట వల్ల అది వాచుట.

# 6. ప్రోస్టేటు గ్రంథి వాపు
## (Prostatitis)

ప్రోస్టేటు / పౌరుష గ్రంథి పురుషులలో మూత్రాశయ గ్రీవం / మెడ మరియు మూత్రమార్గమును చుట్టుముట్టి యుండును. ఇది బాదంకాయ ఆకారంలో ఉంటుంది. దీని స్రావం శుక్రంతో కలియును : శుక్రకణాలను రవాణా చేయును. ఈ గ్రంథి అతివృద్ధి వలన విసర్జనకు ఆటంకం ఏర్పడును. మూత్రం ధారాళంగారాదు. పోసిన తర్వాత ఇంకా పోయాలనిపిస్తుంది. రాత్రిపూట చాలా ఇబ్బంది ఏర్పడుతుంది. అప్పుడు కాథెటరు అను సాధనమును ఉపయోగించి మూత్రమును బయటకు తీయుదురు. కాథెటరు వంపు తిరిగిన సన్నని ఇనుప / రబ్బరు గొట్టం. దీనిని శరీరంలోని ఏ కుహరం (cavity) లోనైనా దోపుటకు వీలగును.

**కారణము :** ప్రోస్టేటు గ్రంథి అతివృద్ధికి ముఖ్యకారణం వయస్సు మళ్ళిన వారిలో లైంగిక హార్మోన్లలో మార్పు.

**నివారణోపాయం :** పరగడుపునే నీరు బాగా త్రాగాలి. ఎందుకనగా అప్పుడే ప్రేగులు శుభ్రం చేసుకొనే కార్యక్రమం ప్రారంభమవుతుంది. నీరు కణాలలోని మురికిని బయటికి నెట్టివేస్తుంది. ఎండ వేడిమినుండి కాపాడుతుంది. జీర్ణరసాయనాలను ఉత్పత్తి చేయుటకు తోడ్పడుతుంది. ఒత్తిడి నుంచి కాపాడుతుంది.

### • చికిత్స •

**ఫెర్రంఫాస్ 12× – 30× :** తరుణవ్యాధి – జ్వరం, వాపు, క్షోభ – మూత్రబంధనం/ మూత్ర విసర్జన కష్టంగా ఉండుట.

**కాల్కేరియాఫ్లోర్ 12× :** ప్రోస్టేటు గ్రంథి పెద్దదై, గట్టిగ ఉండుట.

**నేట్రంసల్ఫ్ 6× :** ఈ మందు ప్రోస్టేటు గ్రంథి వాపు అనేక కేసులను నయం చేసింది. మూత్రంలో చీము, ఆమం వచ్చినప్పుడు దీనిని వాడాలి. ఈ వ్యాధికి ఇతర మందులు వాడినను ఈ మందును మధ్య–మధ్య వాడాలి. కాల్కేరియాఫ్లోర్‌తో ఈ మందును కొబ్బరినూనెలో కలిపి పెరీనమ్[1]కు పూయాలి. వేడినీటి కాపడం పెట్టాలి.

**నేట్రంమూర్ 6× :** మల విసర్జన సమయమున /యువతులలో మాట్లాడునప్పుడు ప్రోస్టేటు స్రావం వెలువడుట.

**సైలీషియా 12× – 200× :** మూత్ర విసర్జన నాళం నుండి చిక్కని చీము దుర్వాసనతో వెడలుట – మల విసర్జన సమయంలో ముక్కిన ప్రోస్టేటు గ్రంథి స్రావం వెడలుట.

*1. **పెరీనమ్ (Perineum) :** పురుషులలో వృషణముల సంచి మరియు ఆసనం మధ్య నున్న ప్రాంతం. స్త్రీలలో యోని పరిసర ప్రాంతం మరియు ఆసనం.*

# 7. నపుంసకత్వం
## (Impotency)

సంభోగశక్తి నశించుటను నపుంసకత్వము అని అందురు. దీనివల్ల పురుషాంగము గట్టిపడక యోనిలో ప్రవేశించదు. లైంగికక్రియ జరుపలేకపోవును. కొన్ని సందర్భాలలో పురుషాంగమును యోనిలోనికి ప్రవేశపెట్టుటకు ముందే వీర్యస్కలనమగును.

**కారణములు :**

1. అధిక సంభోగము
2. మధుమేహము
3. వెన్నెముకకు దెబ్బ తగులుట
4. హస్తప్రయోగము
5. మానసికముగా క్రుంగుట
6. సారాయి అధికముగా తీసుకొనుట

**నివారణోపాయం :** మంచి జీవితము గడపాలి. వివిధ ప్రకటనలను నమ్మి వాటి కొరకు డబ్బు ఖర్చు పెట్టుట వృథా.

### • చికిత్స •

**కాలీఫాస్ 3× – 30× :** అధిక మానసిక శ్రమ, హస్తప్రయోగము వలన పురుషాంగము లేపన శక్తిని కోల్పోయి వీర్యస్కలనమగుట.

**నేట్రంఫాస్ 3× – 30× :** కలలు లేకుండగనే వీర్యస్కలనమగుట–వీర్యము నీళ్ళవలె పలుచగా నుండుట–సంభోగవాంఛ క్షీణించుట / పెరుగుట–కోరిక వున్నా లేపన శక్తి లేకపోవుట.

**నేట్రంమూర్ 3× – 30× :** వృషణాలలో నొప్పి, ఒరిబీజము (Hydrocele) – వీర్యస్కలనాలు – వీర్యము పలచగా నుండుట – ప్రోస్టేటు గ్రంథి నుండి స్రావం స్రవించుట – అధిక నిస్త్రాణ – కోరిక వున్నా శక్తి లేకుండుట.

**సైలీషియా 6× – 30× :** నిత్యము సంభోగమునకు సంబంధించిన ఆలోచనలు – తరచు రాత్రిపూట స్కలనములు – సంభోగము తర్వాత నీరసము – ఒరిబీజము – శిశ్నాగ్ర భాగమున నొప్పి – దానిపైన వుండు చర్మము వాచుట – మల విసర్జన సమయమున ప్రోస్టేటు స్రావము వెలువడుట.

**కాల్కేరియా ఫాస్ 6× :** బీజముల వాపు – రక్తక్షీణత గలవారిలో గనేరియా, ఒరిబీజం – మూత్ర విసర్జన సమయమున ప్రోస్టేటు గ్రంథియందు చురుకైన నొప్పి, తెల్లని స్రావము వెలువడుట –హస్తప్రయోగము–వృద్ధులలో ఈ లక్షణాలున్న, మందును 30× లో వాడాలి.

# 8. పురుషులలో సంతానలేమి

1970 వరకూ వంధ్యత్వ చికిత్స దాదాపుగా ఆడవారికి సంబంధించినదిగా ఉండేది. కాని 1980 నుంచి పురుషుల లోపాలను గురించి కూడా ఆలోచించడం ప్రారంభమైనది.

పురుషుల సంతానలేమికి ముఖ్యంగా రెండు విషయాలు చెప్పబడతాయి –

1) తగినన్ని వీర్యకణాలు లేకపోవుట,

2) వీర్య/శుక్ర దోషాలు.

1. **తగినన్ని వీర్యకణాలు లేకపోవుట :** అండంతో కలిసి ఫలదీకరణ చెందేది ఒక్క వీర్యకణమే. కాని అండంపై పొరను చీల్చడానికి అనేక కోట్ల వీర్యకణాలు అవసరం అవుతాయి. కొంతమందిలో వీర్యకణాలు అసలే వుండవు. అలాంటప్పుడు డోనార్ (దాత) వద్దనుండి వీర్యకణాలు గోప్యంగా తెచ్చుకొనే ఆధునిక పద్ధతిని అవలంబించాల్సి ఉంటుంది. కొంతమందిలో వీర్యకణాల సంఖ్య తక్కువగా ఉంటుంది. దానిని మందుల ద్వారా మెరుగుపరచే అవకాశం ఉంటే ఆలోచించాలి. లేకపోతే నవీన పద్ధతులు అవలంభించాలి.

2. **వీర్యం / శుక్రం దోషాలు :**
   1. నురుగుతో ఉండుట
   2. రంగు మారి ఉండుట
   3. దుర్గంధం వచ్చుట
   4. చిక్కగా ఉండుట
   5. వీర్యం రక్తం వంటి ధాతువులతో కలిసి ఉండుట
   6. స్కలన సమయంలో అధిక దుర్బలత్వం

**కారణములు :** పై దోషాలకు అధిక మైథునం, అకాల మైథునం, అయోని మైథునం, అసలు శృంగారం జరపకపోవుట, ఆహారంలో ఉప్పు, కారం, పులుపు అధికముగా ఉండుట; చింత, దిగులు, వయస్సు అధికముగా ఉండుట మొ॥ కారణాలు.

**నివారణోపాయాలు :**

1. సుఖవ్యాధులు లేకుండా చూసుకొనుట
2. వీర్యదోషాల నివారణ
3. వీర్యకణాల సంఖ్యను పెంపొందించుకొనుట

# 22

# స్త్రీల వ్యాధులు

# (DISEASES OF WOMEN)

## 1. ఋతుస్రావం మొదలయ్యే ముందు ఏర్పడే లక్షణ సముదాయం

## (Pre Menstrual Syndrome – P.M.S.)

**లక్షణాలు :** దీనిలో సాధారణంగా కనిపించే లక్షణాలు –

**మానసిక లక్షణాలు :** విసుగు, చిరాకు, ఆందోళన, కోపం మొ॥వి.

**ఇతర లక్షణాలు :** పొత్తికడుపులోను, నడుములోను నొప్పి, శరీరంలో నీరు చేరి బరువుగా ఉండుట, కాళ్ళవాపు, తలనొప్పి, పార్శ్వపు తలనొప్పి (migraine), స్తనాల నొప్పి.

ఈ లక్షణాలు ఋతుస్రావం మొదలయ్యే ముందు సాధారణంగా 2 నుండి 14 రోజుల వరకూ ఉంటాయి. ఇవి అందరి స్త్రీలలోను, ఒకేరకమైన తీవ్రతలో ఉండాలని ఏమీ లేదు.

**కారణాలు :**

1. రోగి మానసిక ఆలోచనా సరళి
2. పైరిడాక్సిన్ అనే విటమిన్ లోపం
3. ఈవెనింగ్ ప్రిమ్‌రోజ్ ఆయిల్ వంటి ఆయిల్స్ తగ్గుట
4. హార్మోన్ల లోపం

## 2. ఋతుచక్రం సరిచేయుటకు

## (To Regularise Periods)

ఋతుచక్రం మారుట ప్రకృతిలోనే కాదు, నేటి స్త్రీలలోను బాగా కన్పిస్తున్నది. ఇది ఆధునిక సభ్యత ప్రసాదించిన వరం. కన్యలే కాకుండా, పెండ్లయిన స్త్రీలు కూడా ఈ సమస్యకు గురవుతున్నారు. మెన్సస్ సరిగా రాక డాక్టర్లను సంప్రదించగానే హార్మోన్ల లోపం అని ఏవో మందులు వ్రాసి ఇస్తారు. అవి వాడినా మెన్సస్ రాకపోతే పాతపాటే.

ఋతుచక్రం సరిగా రాకపోవటానికి గల మూల కారణంవైపు ఎవ్వరూ వెళ్ళుట లేదు. హార్మోన్లను ఎండోక్రైన్ గ్రంథులు ఉత్పత్తి చేస్తాయి. ఈ పని చేయాలంటే ఆ ఎండోక్రైన్ గ్రంథులకు పౌష్టిక ఆహారం ఎప్పుడూ లభించాలి. కనుక ఆహార నియమాలను ఈ విధంగా మార్చుకొంటే ఋతుచక్రం మామూలుగా వస్తుంది.

**ఉదయం :** 1) వండిన టిఫిన్లు తినడం మానాలి. ఆకుకూరలు, కూరగాయలు వేసి చేసిన వెజిటబుల్ జ్యూస్‌ను త్రాగాలి. 2) జ్యూస్ త్రాగిన గంటకు 4, 5 రకాల మొలకెత్తిన గింజలను తినాలి. ఈ గింజలకే హార్మోన్ల ఉత్పత్తి బాగా అవుతుంది.

**మధ్యాహ్నం :** ఉడికించిన ఆహారం ఎక్కువ కూర పెట్టుకొని తినాలి.

**సాయంకాలం 4 గం॥లకు :** ఒక గ్లాసు బత్తాయి / నారింజ / దానిమ్మ రసం.

**సాయంకాలం 6 గం॥ల లోపు :** పొట్టనిండా పండ్లు తినాలి. ఉడికినవి ఏమీ తినరాదు.

## 3. మెన్సస్‌లో నొప్పి / బహిష్టు నొప్పి / ఋతుశూల (Dysmenorrhoea)

స్త్రీలు సాధారణంగా తరచుగా ఈ సమస్యతో బాధపడుతుంటారు. చాలామంది స్త్రీలు బహిష్టు సమయంలో నొప్పికి గురవుతుంటారు. కొంతమంది స్త్రీలలో నొప్పితో పాటు కళ్ళు తిరుగుట, పడిపోవుట ఉంటుంది.

| నొప్పి స్వరూపం | కారణాలు |
|---|---|
| 1. ఋతు సమయానికి 2, 3 రోజుల ముందు నడుములో, పొత్తికడుపు (క్రింది పొట్ట)లో నొప్పి ప్రారంభమై రక్తస్రావం అయిన తర్వాత నొప్పి తగ్గుట. | 1. గర్భసంచికి సంబంధించిన ఇన్‌ఫెక్షన్ ఉండుట. |
| 2. నడుములో ఒకప్రక్క (చట్టగా నుండు వైపు) నొప్పి విపరీతంగా మొదలై పొత్తికడుపు పైకి ప్రాకుట. | 2. మలబద్ధకం, కడుపు ఉబ్బరం, గ్యాస్ ఇబ్బందులు. |
| 3. నొప్పి | 3. ప్రేగులలోని ఇబ్బంది సున్నితముగ తయారైన గర్భసంచిపై ఒత్తిడి కలుగ చేయుట / గర్భకోశానికి, అండకోశానికి కంతులు ఉండుట. |

**నివారణోపాయాలు :**

1. ప్రతిదినం తగిన వ్యాయామం చేయాలి.
2. చన్నీటి స్నానం చేయుట అలవాటు చేసుకోవాలి.
3. సులభంగా జీర్ణమయ్యే ఆహారం తీసుకోవాలి.
4. కాఫీ, టీలు త్రాగుట మానుకోవాలి.
5. మలబద్ధకం లేకుండా చూసుకోవాలి, సాఫీగా విరేచనమయ్యేటట్లు చూసుకోవాలి. ఏదైనా ఇబ్బంది ఉన్నచో ఎనీమా చేసుకోవటం ఉత్తమమైన మార్గం.
6. బహిష్టుసమయంలో నొప్పిగా ఉన్నచోట నూనె రాసి వేడినీటి కాపడం 5–6 నిమిషాలు పెట్టుకోవాలి. తర్వాత కుండలోని నీరు / చన్నీళ్ళతో తడిపిన గుడ్డను 2–3 నిమిషాలు ఉంచాలి. ఈ విధంగా వేడినీరు – చన్నీరు మార్చి–మార్చి 2 – 3 సార్లు చేయాలి.
7. మంచి నీటిని రోజంతా త్రాగాలి.
8. రాత్రి భోజనమునకు బదులుగా సాయంకాలమే పండ్లను తినాలి.

పై జాగ్రత్తలు పాటించినను నొప్పి తగ్గనిచో క్రింది మందులు నొప్పి లక్షణాన్ని బట్టి వాడాలి.

## • చికిత్స •

ఋతుశూల వున్నప్పుడు లక్షణాలను బట్టి క్రింది మందులు అవసరాన్ని బట్టి అరగంటకొకసారి, గంటకొకసారి, 2 గం॥ కొకసారి వాడాలి. ఋతువుల మధ్యకాలములో కూడా అదేమందును, శరీరతత్త్వాన్ని బట్టి వాడాలి. కాని అప్పుడు మందును బట్టి, శరీర తత్త్వాన్ని బట్టి, వ్యాధి తీవ్రతను బట్టి 2 రోజులకు ఒక డోసు, లేక 3, 4 రోజులకొకసారి డోసు ఇచ్చిన చాలును.

**కాల్కేరియాఫాస్ 6× – 12× :** యౌవనములో ఋతుశూలలను గురించి ఏ మాత్రము జాగ్రత్త వహించని స్త్రీకి ఇది మంచి మందు. బహిష్టుకు ముందు, బహుష్టు సమయాన తీవ్ర రతి వాంఛ, ప్రసవ సమయము వంటి నొప్పులు, తీవ్రమైన నడుమునొప్పి, తల తిరుగుడు, సంభోగ ఉద్రేకము, గుండె కొట్టుకొనుచున్నట్లుండు తలనొప్పి – మలమూత్రముల విసర్జన సమయాన ఈడ్పులు – నడినెత్తిపై వేడిమి, బరువు.

**కాలీఫాస్ 6× :** బలహీనముగా నుండునట్టి, కన్నీరు కార్చు స్వభావము కలిగిన, విసుగు చెందు స్వభావము కలిగినట్టి, సున్నితమైన స్త్రీల బహిష్టుసమయాన కలుగు అధిక నొప్పికి ఇది మంచి మందు.

**మెగ్నీషియంఫాస్ 6× – 25× :** ఋతుస్రావమునకు ముందు వచ్చు సాధారణ ఋతుశూల / ఎక్కువ బాధాకరముగా నుండు ఋతుశూలకు ఈ మందు ప్రధానమైనది. వేడిమి వల్ల

ఉపశమనము లభించును. కదలికవల్ల నరాల బాధ, కందరములు అమిత బాధతో ముడుచుకొని పోవునట్టి నొప్పి అధికమగుట.

**నేట్రంమూర్ 12× :** బహిష్టు స్రావము చాలా తక్కువగాను, నల్లగాను వుండుట – దానికి ముందు నుదుటి తలనొప్పి, పెదవులపై జ్వరపు బొబ్బలు, ఎండాకాలమున దద్దుర్లు – యోనిలో మంట – గర్భాశయములో కోస్తున్నట్టి, మండుతున్నట్టి నొప్పి, బ్రద్ధలు చేయు తలనొప్పి, తరచుగా వణకుడు.

**నేట్రంసల్ఫ్ 6× – 12× :** ఋతుశూల తీక్షణముగా నుండుట, కడుపులో వేకువజామున గిల్లుచున్నట్టి నొప్పి–ముక్కునుండి తీవ్రముగా రక్తస్రావమగుట–చిన్న పొక్కులతో నున్న యోనివాపు–చేతులు వణకుట / అదరుట–కాళ్ళల్లో నిస్త్రాణ–ఋతుస్రావము అధికముగా నుండుట.

## 4. బహిష్టు సమయమున వచ్చు తలనొప్పి

**ఫెర్రంఫాస్ 3× – 3× :** రక్తప్రసరణాధిక్యతచే కలుగు తలనొప్పి – తలపై భాగమున చల్లని గాలిని, ధ్వనిని, కుదుపును సహించలేకపోవుట – వెంట్రుకను తాకినా భరించలేకపోవుట.

**నేట్రంమూర్ 3× – 12× :** బహిష్టుకు ముందు, బహిష్టు సమయాన, బహిష్టు తర్వాత వచ్చు తలనొప్పి.

**నేట్రంఫాస్ 3× – 6× :** బహిష్టు సమయాన తలనొప్పి.

**కాలీఫాస్ 3× – 6× :** బహిష్టు సమయాన తలనొప్పి – ఆకలి ఉండుట, ఎడమ వైపు స్తనములో తీవ్రమైన నొప్పి.

## 5. కుసుమ / తెల్లబట్ట
**(Leucorrhoea)**

సంభోగమునకు ముందు ఉద్దీపనగా యోని నుండి తెల్లటి, జిగటవంటి ద్రవము కారును. దీనిని కుసుమ అని అందురు. దీనివల్ల బట్ట తెల్లగా అవుతుంది. కనుక వాడుక భాషలో దీనిని తెల్లబట్ట అని అందురు. కొన్ని సమయాల్లో ఈ కుసుమ తెలుపు – పచ్చ / ఆకుపచ్చ / నలుపు / నీలం రంగులో ఉంటుంది. ఈ కుసుమ ఆరోగ్య సూచకము. ఇది పురుషాంగము యోనిలో సులువుగా జారుటకు తోడ్పడుతుంది. కాని ఈ కుసుమ విస్తారముగా అగుట చేతను, నొప్పి కలిగించుటవల్లను ఆరోగ్య సమస్యగా మారును. అప్పుడు అశ్రద్ధ చేయరాదు. అశ్రద్ధ చేసినచో స్రావము చీముగా మారును. యోని వద్ద పుండు పడవచ్చు.

**కారణాలు :**

1. సోరా, సైకోసిస్ / సిఫిలిస్ తత్త్వము
2. క్షయ తత్త్వము
3. చలి
4. సూక్ష్మక్రిములు
5. అశుభ్ర ఆహారము
6. ఉత్తేజకరమగు పదార్థములను తినుట
7. అనారోగ్యము
8. అధిక సంభోగము.
9. అధిక ఋతుస్రావము
10. గర్భాశయము, జననేంద్రియ వ్యాధులు
11. ఆరోగ్య నియమాలను పాటించకుండుట
12. మాటిమాటికి గర్భవిచ్ఛిత్తి కలుగుట
13. క్యాన్సర్
14. లావుగా వుండుట

**లక్షణాలు :** రోగిలో తలనొప్పి, ముఖము పాలిపోవుట, మలబద్ధకము, అజీర్ణము మొ॥ లక్షణాలు కనిపించును.

## • చికిత్స •

**కాలీమూర్ 12X :** పాలవలె తెల్లగా నుండు కుసుమ – క్షోభ కలిగించని కుసుమ

**కాలీఫాస్ 6X :** పసుపు పచ్చని స్రావము – బొబ్బలు కలుగుట –మూత్ర విసర్జన మంటగా వుండుట.

**కాలీసల్ఫ్ 6X :** పసుపుపచ్చ, ఆకుపచ్చ, బంకగానున్న / నీటి వంటి స్రావము.

**నేట్రంమూర్ 6X – 12X :** బహిష్టకు–బహిష్టకు మధ్య / బహిష్టు తర్వాత నీళ్ళవంటి, క్షోభ కలిగించు, కుట్టునొప్పి గల స్రావము వెలువడుట – మూత్ర విసర్జన మంటగా నుండుట, ఉదయాన నడచిన తర్వాత పసుపు పచ్చని స్రావము, తలనొప్పి, శూల, యోని ద్వారము వద్ద దురద – సిల్వర్ నైట్రేట్ ద్రావణమును స్థానికంగా వాడిన తర్వాత కటి క్రింది భాగములో నొప్పి.

**నేట్రంఫాస్ 6X – 12X :** క్రీము రంగు / తేనెరంగు ఆమ్లము / నీటి వంటి కుసుమ – గర్భకోశము నుండి స్రవించు స్రావములు పుల్లని వాసనతో మంటను కలిగించుట.

**నేట్రంసల్ఫ్ 6X :** మంటగాను, అవయములను తినునట్టి కుసుమ.

**కాల్కేరియాఫాస్ 6× - 12× :** ఈ మందు కుసుమ వ్యాధికి టానిక్ వంటిది. లక్షణాలను బట్టి మందును వాడుతూ దీనిని మధ్య మధ్య వాడాలి. ఆల్బుమిన్ వంటి స్రావముండును, బహిష్టు తర్వాత కుసుమ అధికముగా నుండును. గ్రుడ్డు తెల్లసొన వలె వుండును. మర్మాంగములలో బలహీనత వుండును. మలమూత్రముల విసర్జన తర్వాత స్రావము అధికమగును. అవయవములు గుండెవలె కొట్టుకొనును. ఇంద్రియ భోగ వాంఛ వుండును. రోగికి జలుబు చేయు స్వభావం వుండును.

**సైలీషియా 6× - 12× :** బహిష్టుకు బదులుగా కుసుమ - ఋతుశూల తర్వాత కుసుమ - మూత్ర విసర్జన సమయమున, మొండి మలబద్ధకము తర్వాత కుసుమ - శరీరమున ఉండవలసిన సహజోష్ణము లోపించుట - ఆహారలోపం వల్ల / తిన్న ఆహారము సరిగా శోషణ చెందకపోవుట వల్ల బలహీనముగాను, అతి సున్నితముగాను వున్న స్త్రీల కుసుమకు ఈ మందు బాగా ఉపయోగపడును.

## 6. అధిక ఋతుస్రావం
## (Menorrhagia / Over bleeding)

ఋతు సమయము కానప్పుడు / ఋతు సమయంలోను కొంతమంది యోనిలో నుండి అధిక రక్తస్రావము జరుగవచ్చు.

**లక్షణాలు :**

1. **ఋతు సమయము కానప్పుడు :** అలసట, ఆకలిలేమి, కూర్చొనుటకు, నిల్చొనుటకు శక్తి లేకపోవుట మొదలగునవి.
2. **ఋతు సమయములో :** ముఖము కాంతిహీనముగా వుండుట, కళ్ళు లోనికి పోవుట, కాళ్ళు-చేతులు చల్లబడుట, దృష్టి మందగించుట, నరాల బలహీనత, చెవులలో హోరు, అప్పుడప్పుడు స్పృహ తప్పుట మొదలగునవి.

**కారణాలు :**

1. **ఋతు సమయము కానప్పుడు :** గర్భాశయములో గడ్డలు[1] (fibroids), ప్రసవానంతరము మావి పూర్తిగా పడకుండుట, గర్భసంచికి దెబ్బతగులుట, హార్మోన్ల సంతులనం కోల్పోవుట మొ॥ కారణాలు.
2. **ఋతు సమయములో :** గర్భసంచి కదలిపోవుట, గర్భాశయములో గడ్డలు, ఎక్కువసార్లు కాన్పులు జరుగుట, మానసిక ఆందోళన, హార్మోన్ల సంతులనం కోల్పోవుట మొ॥ కారణాలు.

*1. గర్భాశయపు గడ్డలు : ఇవి గర్భాశయపు గోడలలో పెరుగుతూ వుంటాయి. వీటివల్ల గర్భసంచి నుండి రక్తస్రావము జరుగవచ్చు.*

**నివారణోపాయాలు :**

1. రోగికి విశ్రాంతి అవసరము. ఆమెకు శారీరక, మానసిక శ్రమ లేకుండా చూడాలి.
2. రోగిని ఎల్లప్పుడు వెచ్చని స్థలములో ఉంచాలి.
3. రోగి వేడిగా నుండు పానీయాలను త్రాగరాదు, వేడి ఆహారం తినరాదు.
4. సాత్విక ఆహారము తినాలి. ఉద్రేకము కలిగించు పదార్థములు తినరాదు.
5. రక్తస్రావము అత్యధికముగా నున్నచో రోగి పడుకొనునపుడు మంచము కాళ్ళ వైపున ఎత్తు పెంచాలి.
6. అధిక ఋతుస్రావం కలవారు ఐస్‌ముక్కలను ఒక గుడ్డలో పేర్చి పొత్తి కడుపు భాగమున 15 – 20 ని॥పాటు ఉంచాలి. అలా 3, 4 సార్లు చేయవచ్చు.
7. తొట్టిస్నానం అధిక ఋతుస్రావాన్ని తగ్గిస్తుంది. తొట్టిలో నీళ్ళుపోసి అందులో పిర్రలు ఆనించి కూర్చోవాలి. కాళ్ళను బయటికి వ్రేలాడదీయాలి. దానివల్ల పొత్తి కడుపునుండి తొడలవరకు ఉండు భాగం నీళ్ళలో ఉండును. మిగతా భాగం తడవకుండా ఉండును.

   ఈ విధంగా 20 ని॥ పాటు ఉండాలి. పొట్ట ఖాళీగా ఉన్నప్పుడే ఈ స్నానం చేయాలి. ఈ విధంగా 2 – 3 నెలలు చేయాలి.

### • చికిత్స •

స్రావమునకు కారణమును కనిపెట్టి, శరీరతత్త్వము ననుసరించి మందునివ్వాలి.

**కాల్కేరియా ఫ్లోర్ 6X :** సిరల బిగువు సడలుట వలన అత్యధిక రక్తస్రావమగుట – కటినుండి తొడలకు, కాళ్ళకు దిగజారే నొప్పులు.

**కాలీఫాస్ 6X :** నరాల వ్యాధులతో బాధపడే స్త్రీలలో కొన్ని సందర్భాలలో అత్యధికముగా గాఢమైన ఎరుపు / నలుపు – ఎరుపు మిశ్రమముగా నుండు రక్తముతో రక్తస్రావము – కడుపు నిండుగా, బరువుగా వుండుట, తలనొప్పి, బాగా అలసట, నిద్రమత్తు, నడుమునొప్పి, అత్యధిక రతి వాంఛ.

**నేట్రంమూర్ 6X – 12X :** బహిష్టు చాలా ముందుగా వచ్చినప్పుడు బహిష్టు స్రావము ఎక్కువగుట – నిద్రాభంగము, దొంగల కలలు, తలనొప్పి, లేచినప్పుడు నడుమునొప్పి.

## 7. ఋతుస్రావం అణచబడుట
## (Amenorrhoea)

గర్భధారణ వలన బహిష్టు ఆగిపోవును. అట్లుగాక ముట్లు అణగు కాలము వరకు బహిష్టు సక్రమముగా కానిచో అది అనారోగ్యమునకు సంకేతము. ఇందుకు అనేక కారణములు గలవు – 1) రక్తహీనత 2) క్షయవంటి దీర్ఘకాలిక రోగము

3) శరీరము లావెక్కుట 4) ఋతు సమయములో చలిగాలి తగులుట 5) అలసట కలిగించు ప్రయాణము 6) భయాందోళనలు 7) అనుకోని మనస్తాపము మొదలైనవి.

**• చికిత్స •**

ఈ వ్యాధికి గల కారణము తెలుసుకొని చికిత్స చేసిన మంచి ఫలితము కలుగును. సాధారణంగా రక్తహీనత ఈ వ్యాధికి ముఖ్య కారణముగా భావించబడును. కనుక దానికి చికిత్స చేసిన ఈ వ్యాధి దానంతటదే నిర్మూలమగును.

**కాలీమూర్ 6× - 12× :** చాలా కాలముగా అణచబడిన బహిష్టు స్రావము - రోగి నాలుకపై తెల్లని పూత - బహిష్టు చాలా ఆలస్యంగా లేక త్వరత్వరగా వచ్చుట.

**కాలీఫాస్ 6× - 12× :** బహిష్టు స్రావము అణచబడుట–ఉత్సాహాదులు క్రుంగిన వారిలో, అలసట, నరాల బలహీనత కలవారిలో, బక్కచిక్కిన, ఏడ్చునట్టి, సున్నితమైన స్త్రీలలో –దుర్వాసనగల స్రావము, పొత్తికడుపు బరువుగాను, నిండుగాను వుండుట–నరాల బలహీనత కలవారిలో–తలనొప్పి, అలసట, నిద్రమత్తు, వీపునొప్పి, తీవ్రమైన సంభోగ వాంఛ వుండుట.

**కాల్కేరియా ఫాస్ 6×-12× :** బాగా వయస్సు వచ్చిన వారిలో బహిష్టులు ఆలస్యముగా వచ్చుట –బలహీనత, ఎప్పుడూ కూర్చొనవలయునని తలంచుట, లేచి నడవటాన్ని ద్వేషించుట, కీళ్ళనొప్పులు.

**కాలీసల్ఫ్ 6× :** చాలా ఆలస్యంగా బహిష్టు అగుట - బహిష్టు స్రావము చాలాకాలము అగుట, తలనొప్పి, వణకుడు, ఎక్కువ బలహీనత.

**నేట్రంమూర్ 6× :** కన్యలలో బహిష్టు అగపడకపోయినా లేక చాలాకాలం తర్వాత కొద్దిపాటి స్రావం కనిపించినా ఇది పనికి వచ్చును.

## 8. రతి వాంఛలు
## (Sexual Desires)

స్త్రీలు అందరిలోను రతివాంఛ ఒకే విధంగా ఉండదు. కొందరిలో రతిపట్ల అయిష్టత ఉంటుంది. బహుశా రతిలో రక్తస్రావం, నొప్పి, అసంతృప్తి, అసహ్యం మొ॥ కారణాలు కావచ్చు. మరి కొంతమందిలో రతివాంఛ అధికంగా ఉంటుంది. అది అణచుకోలేని విధంగా, అవధులు లేనిదిగా ఉంటుంది.

**• చికిత్స •**

**రతిపట్ల అయిష్టత**

**నేట్రంమూర్ 6× - 30× :** రతిపట్ల వ్యతిరేకత, అసహ్యం, రతి సమయంలో, స్కలన సమయంలో నొప్పి –యోని పొడిగ, మంటగ ఉండుట, దానిలో చురుకైన నొప్పి - బహిష్టు తర్వాత రతికి అయిష్టత.

**ఫెర్రంఫాస్ 6× - 12× :** రతి సమయంలో యోనిలో నొప్పి - పరీక్ష నిమిత్తం యోనిని తాకనివ్వకుండుట.

**రతివాంఛ అధికం**

**కాల్కేరియా ఫాస్ 6× - 30× :** పట్టశక్యం కాని రతివాంఛ - ఎన్నిసార్లు రమించినా తీరని కోరిక - ఉదయం పూట అమిత రతి వాంఛ - తర్వాత స్రావమగుట.

**కాలీఫాస్ 6× - 30× :** రతి కోరిక అధికం - బహిష్టు తర్వాత ఈ కోరిక అధికమగుట.

**సైలీషియా 12× :** రతికోరిక ఎక్కువ-రతి సమయంలో వమన వికారం/వాంతి వచ్చినట్లుండుట-రతి తర్వాత జననేంద్రియాల అధికబలహీనత, అలసట-దీనివల్ల కాళ్ళు, చేతులలో నొప్పులు.

## 9. గర్భధారణ
## (Pregnancy)

స్త్రీ అండము పురుష బీజకణముతో కలిసి ఫలదీకరణము చెందినపుడు గర్భధారణ జరుగును.

**గర్భవతి స్త్రీ లక్షణాలు :**

1. ఆరోగ్యవతిగా నున్నప్పుడు బహిష్టు ఆగిపోవుట.
2. వేవిళ్ళు (వమన వికారము, వాంతులు) అగుట.
3. పిండము కదులుతున్నట్లు అనిపించుట
4. కడుపు పెద్దదగుట
5. స్తనములు ఉబ్బుట
6. స్తనాగ్రములకు రంగు వచ్చుట
7. కడుపుపైన పగుళ్ళవలె గీతలు కనిపించుట
8. పిండము యొక్క హృదయము నిమిషమునకు 120 - 140 సార్లు కొట్టుకొనుట.

**పుట్టబోవు బిడ్డ ఆడుబిడ్డా లేక మగబిడ్డా ?** పుట్టబోవు బిడ్డ ఆడుబిడ్డా లేక మగబిడ్డయా అని చెప్పుట కష్టము. 3 నెలల తర్వాత స్కానింగ్ చేయించిన తెలియునని చెప్పుదురు. చాలామంది స్త్రీలు తమకు పుట్టబోయే బిడ్డ ఆడు బిడ్డ అని తెలుసుకొని గర్భవిచ్ఛిత్తి చేయించుకొంటున్నారని తెలిసి ప్రభుత్వము వారు స్కానింగ్ ఫలితాలను సాధారణ పరిస్థితులలో డాక్టర్లు తెలుపకూడదని ఆదేశించి యున్నారు.

అండములో x రకము క్రోమోజోములు, శుక్రకణములో x, y క్రోమోజోములు వుంటాయి. x రకము క్రోమోజోములు గల శుక్రకణము అండమును చేరిన ఆడబిడ్డ, y రకము క్రోమోజోములు గల శుక్రకణము అండమును చేరిన మగశిశువు పుట్టును.

**పిండములో మార్పులు :** తల్లిగర్భములో పిండము సాధారణముగా 280 దినములు వుండును. అది దినాదినాభివృద్ధి చెందును. ఆ అభివృద్ధి ఇలా వుండును –

| పిండము వయస్సు | పిండములో వచ్చు మార్పు |
|---|---|
| 8 వారములు పూర్తగుట | పిండము 1 $\frac{1}{2}$" పొడవు – తల, మొండెము, కాళ్ళు, చేతులు, చేతి వ్రేళ్ళు, కాలివ్రేళ్ళు ఏర్పడును. నోరు తెరిచియుండును. ఎముకలు ఏర్పడవు. |
| 12 వారములు | పిండము 3 $\frac{1}{2}$" పొడవు – ఆడ, మగ భేదము ఏర్పడును. |
| 16 వారములు | పిండము 6.7" పొడవు – ఎముకలు ఏర్పడును. జుట్టు ప్రారంభమగును. |
| 20 వారములు | పిండము 10" పొడవు – తలపైన, శరీరముపైన జుట్టు ఏర్పడుట, నోటిలో పండ్లు వచ్చుటకు ఏర్పాట్లు జరుగును. శిశువు కదలుట, ఆ కదలికలు తల్లికి తెలియుట – ప్రసవించు వరకు ఆ కదలికలు వుండుట. |
| 24 వారములు | పిండము 12" పొడవు – సుమారు అర కిలో – బిడ్డ ఆకారము బాగుగా ఏర్పడుట, దవుడ యందు పండ్లు వచ్చుట ప్రారంభమగుట, గర్భాశయము పెద్దదగుట. |
| 28 వారములు | 1 $\frac{1}{2}$ కిలో బరువు |
| 32 వారములు | శిశువు పొడవు 17", బరువు 2 కిలోలు – తల్లికి పొత్తి కడుపు బరువుగా వున్నట్లు తోచుట. |
| 36 వారములు | పిండము సుమారు 18" పొడవు – సుమారు 2 $\frac{1}{2}$ కిలోల బరువు. |
| 38 వారములు | పొత్తికడుపు పరిమాణము తగ్గినట్లు కనిపించును. పిండము తల ప్రసవించుటకు సిద్ధముగా క్రిందికి దిగుచున్నదని అర్థము. |
| 40 వారములు | పొడవు 20 - 24", బరువు 3 – 4 కిలోలు ప్రసవించు సమయము వచ్చును. |

## 10. గర్భవతి తీసుకొనవలసిన జాగ్రత్తలు

గర్భవతికి అనేక వ్యాధులు రావచ్చు. వాటి నుండి నివారణ పొంది ఆరోగ్య వంతుడైన శిశువును ప్రసవించుటకు కష్టమైనా కొన్ని జాగ్రత్తలను పాటించాల్సిన అవసరం వుంది. చక్కని ఆరోగ్యకరమైన బిడ్డను కనటములోనే స్త్రీ జీవితానికి సార్థకత వుంటుంది. ఈ సార్థకత స్త్రీ త్యాగముపైన ఆధారపడి వుంటుంది. ఆ జాగ్రత్తలలో కొన్ని ఈ విధంగా వుంటాయి –

1. తల్లి మనసంతా పుట్టబోయే బిడ్డను గురించి మాత్రమే ఆలోచిస్తూ వుండాలి. ఆమె ఆలోచనంతా సకారాత్మకం (positive) గా వుండాలి. ఆమె మనసు ప్రశాంతంగా వుండాలి. దిగులు, విచారమును దరిచేరనీయరాదు. సమస్యలను, ఆర్థిక ఇబ్బందులను దూరంగా వుంచాలి.
2. ఆమె పడుకొనే గది ఆహ్లాదకరంగాను, గాలి వెలుతురు వచ్చేటట్లుగా వుండాలి. పడుకొనే గది గోడలపై అందమైన పిల్లల ఫోటోలు వుంచాలి.
3. గర్భవతి ఆందోళనను, ఉద్రేకమును పెంచే దృశ్యాలను చూడరాదు. అలాంటి విషయాలు గల పత్రికలను, పుస్తకాలను చదువరాదు.
4. సాత్వికమైన ఆహారం తీసుకోవాలి. ఉప్పు, కారము, మసాలా దినుసులు, నూనె మొ॥ తగ్గించాలి. అనాస, బొప్పాయి తినరాదని అంటారు.
5. మలబద్ధకము లేకుండా జాగ్రత్త పడాలి. అందుకుగాను పీచు అధికంగా వుండే కాయగూరలు, ఆకుకూరలు వుండే ఆహారాన్ని, పండ్ల (fruits) ను తినాలి. అట్లే అజీర్తి విరేచనాలు, జిగట విరేచనాలు కలగకుండా చూడాలి.
6. గర్భవతి వదులుగా వుండు దుస్తులను ధరించాలి.
7. గుర్రపుస్వారి, సైకిలు త్రొక్కుట, దుముకుట, గతుకుల రోడ్లపై బండ్లలో పోవుట, ఎద్దుల బండిపై ప్రయాణము, కొండలు ఎక్కుట మంచిది కాదు.
8. ఎక్కువ శ్రమ కలిగించు పనులు (బరువులు ఎత్తుట, తిరుగలిలో విసరుట మొ॥వి) చేయరాదు.
9. మేడమెట్లు ఎక్కుట, దూర ప్రయాణము చేయుట, వర్షములో తడచుట పనికిరాదు.
10. సంభోగము కూడ సాధ్యమైనంత వరకు తగ్గించాలి. ఆఖరు మూడునెలల్లో పూర్తిగా మానివేయాలి. (ఈ మధ్య చివరి నెలలలో అప్పుడప్పుడు జరిగే సంభోగం వల్ల కాన్పు సులభముగ జరుగునని తెలుసుకోవడమైనది) లోగడ గర్భస్రావమైన స్త్రీ విషయములో మొదటి మూడు నెలలు కూడా సంభోగము మానివేయుట మంచిది.
11. గర్భవతికి విశ్రాంతి అవసరమే కాని ఆమె సోమరిగ వుండనక్కరలేదు. ఇంటి పనులు మామూలుగా చేసుకోవచ్చు. ఉద్యోగము చేస్తున్న స్త్రీ అయితే ఉద్యోగము మానుకోనక్కరలేదు. 7 నెలల తర్వాత ఉద్యోగమునకు సెలవు పెట్టవచ్చు.
12. గర్భధారణ సమయములో మందులు ఎక్కువగా వాడరాదు. ఏ మందైనా తీసుకోదలచినచో డాక్టరు సలహా తీసుకోవాలి.
13. గర్భిణి నెల-నెల అనుభవమున్న డాక్టరుకు చూపించుకొని తగు సలహా తీసుకోవాలి.
14. కాన్పుకు ప్రసూతిశాలలో చేరుట మంచిది. సమయమునకు ముందే కాన్పు జరిగినచో ఆ బిడ్డను ఇంక్యుబేటరులో వుంచుట మంచిది. ఇంక్యుబేటరులో శిశువుకు తల్లి గర్భములో లభించే స్వాభావికమైన వాతావరణము వుంటుంది. కనుక ఎలాంటి ఇబ్బంది వుండదు.

అంతేగాకుండా సర్జరీ చేసి బిడ్డను బయటికి తీయవలసి వచ్చినా ప్రసూతిశాలలో అనుభవమైన డాక్టరు, సిబ్బంది సేవలు, సామాగ్రి, మందులు మొ॥వి లభిస్తాయి.

15. గర్భం దాల్చినప్పటి నుండి ప్రసవించు వరకు ఈ మందులను ఉదయం ఒకసారి, సాయంత్రం ఒకసారి వేసుకోవాలి.

కాల్కేరియాఫ్లోర్ 6× – 1 మాత్ర + కాల్కేరియాఫాస్ 6× – 1 మాత్ర + మెగ్నీషియం / మ్యాగ్ ఫాస్ 6× – 1 మాత్ర + కాలీఫాస్ 6×–1 మాత్ర మొత్తం 4 మాత్రలు (వేడినీటితో) ఈ మందుల వాడకం వల్ల క్రింది ప్రయోజనాలు కలుగును

1. గర్భకోశ సామర్థ్యమును పెంచి గర్భస్రావం కాకుండా రక్షణ లభించును.
2. సాధారణంగా గర్భిణీలో రక్తహీనత వలన నిస్త్రాణ, బడలిక వుంటుంది. ఈ మందులు ఆ బాధలు లేకుండా కాపాడును.

## 11. వేవిళ్ళు (Morning Sickness)

వేవిళ్ళు గర్భధారణ తొలి సూచనలు. వేవిళ్ళు వచ్చిన స్త్రీలకు పులుపు మీద అపేక్ష వుంటుంది. వారు ఆవకాయ, నిమ్మకాయ పచ్చళ్ళు / ఊరగాయలు కావాలని అంటారు. వేవిళ్ళు వచ్చునప్పుడు వమన వికారము, వాంతులు, అజీర్తి, ఆహారముపై అయిష్టము, నోట నీరూరుట, నోరుచేదు, మలబద్ధకము మొ॥ లక్షణాలు వుండును. వెల్లకిల పడుకొనిన ఈ బాధలు తగ్గును. పై లక్షణాలు ఎక్కువగా వున్నచో వైద్యము చేయించాలి.

### చికిత్స

**ఫెర్రంఫాస్ 6× – 12× :** గర్భిణిగా నున్నప్పుడు తీసుకొన్న ఆహారము తీసుకొన్నట్టుగా, జీర్ణము కాకుండానే పుల్లని రుచితో / పుల్లని రుచి లేకుండా వాంతి అగును.

**కాలీమూర్ 6× – 12× :** గర్భిణీగా నున్నప్పుడు తెల్లని కఫాన్ని వాంతి చేసుకొనుట.

**నేట్రంమూర్ 6×–12× :** గర్భిణిగా నున్నప్పుడు నీళ్ళవంటి, నురుగుతో నున్న కఫాన్ని వాంతి చేసుకొనుట.

**నేట్రంఫాస్ 6× :** గర్భిణిగా నున్నప్పుడు పుల్లని పదార్థాలను వాంతి చేసుకొనుట – ఆమ్ల స్రావముల వల్ల వంధ్యత్వము.

## 12. గర్భధారణ సమయమున ఉత్పన్నమగు బాధలు

**మూత్రావరోధం :** గర్భధారణ సమయంలో మూత్రం జారీ కావడంలో అవరోధం ఏర్పడవచ్చు. కొందరిలో మూత్రం రావడం పూర్తిగా ఆగిపోవచ్చు. కొంతమందిలో చాలాసార్లు మూత్ర విసర్జనకు వెళ్ళవలసి రావచ్చు.

**కుంగుబాటు :** సాధారణముగా కొంతమంది స్త్రీలు మానసికంగా క్రుంగిపోవటం జరుగుతుంది. వారు ఏవేవో ఊహించుకొంటూ భయపడుతారు. వారికి ప్రసవమంటే భయం ఉంటుంది. ఆమె బంధువులూ, స్నేహితులు వారికి ధైర్యం చెప్పి ఉత్సాహపూరిత వాతావరణం కల్పించటం మంచిది.

**ఋతువు :** ఇది చాలా అసాధారణ సమస్య. దీనిలో కొంత మంది బాగా నీరసించటం జరుగుతుంది.

**తలత్రిప్పు :** కొంతమందికి 4 – 5 నెలలప్పుడు తలత్రిప్పు, తల భారంగా ఉన్నట్లు అనిపించుట, తలలో నొప్పి రావచ్చు. దీనివల్ల నిరుత్సాహం, ఏ పనులూ చేయలేకపోవుట, నిద్రలేమి, ముందుకు వంగినప్పుడు దృష్టి మందగించుట, పడిపోవుట, కళ్ళముందు మెరుపులు కనిపించుట, గుండెదడ, భయం, వణకు మొ॥ లక్షణాలు ఉంటాయి. ఉదయంపూట ఇవి ఎక్కువగా ఉండును.

**• చికిత్స •**

పై బాధలకు లక్షణాలను బట్టి మందులు వాడాలి.

## 13. గర్భధారణ సమయమున కలుగు నొప్పులు

**A. పురీషనాళము యోనిలోనికి దిగజారుట (Rectocele) :**

దీనిలో యోని కండరం గాయపడుటచే పురీషనాళము / గుదము యోని గోడ వెనుక వైపునకు చొచ్చుకొనిపోవును. మలబద్ధకము సాధారణ లక్షణము. ఒక్కసారిగా ప్రేగులు శుభ్రము చేయబడవు. ఈ వ్యాధికి కాల్కేరియాఫ్లోర్ 12× ఉపయోగపడును.

**B. గర్భాశయము వెనుకకు వంగుట (Retroversion) :**

స్త్రీ గర్భకోశము సహజముగా ముందుకు మూత్రకోశము మీదకు, పొత్తికడుపు వైపుకు కొలదిగ వంగియుండును. కాని ఈ వ్యాధిలో అది వ్యతిరేక స్థితిని పొందును. అనగా గర్భకోశము / గర్భాశయము వెనుకకు నడుము వైపునకు వంగియుండును. గర్భకోశ ద్వారము (మెడ) ముందుకు వచ్చును.

దీనివల్ల మూత్ర విసర్జన బాధాకరముగా నుండును. పురీషనాళముపై ఒత్తిడి కలిగి, మలవిసర్జన వాంఛ తరచుగా కలుగుచు, మలము వెడలుట కష్టముగానుండును / సాధ్యము కాదు.

**నివారణోపాయాలు :**

ఎలాంటి శ్రమయైనా పై బాధలను ఎక్కువ చేయును. కనుక రోగులు ఎలాంటి బరువులను ఎత్తరాదు. ఎలాంటి శారీరక శ్రమ చేయరాదు. మలవిసర్జన సమయమున

తినకరాదు. దగ్గు వలన కడుపుక్రింద ఒత్తిడి పెరుగుతుంది. కనుక దగ్గుకు వెంటనే చికిత్స పొందాలి.

**• చికిత్స •**

కాల్కేరియాఫ్లోర్, నేట్రంమూర్ మొదలైన మందులను లక్షణాలను బట్టి వాడాలి.

**C. స్త్రీ గర్భకోశపు మెడ / ద్వారము వాపు (Cervicitis)** : దీనిలో గర్భాశయపు ద్వారము (మెడ) నొప్పి, ఎరుపు, మంటతో కూడిన వాపుతో ఉండును.

**లక్షణాలు :** తరుణ వ్యాధిలో గర్భాశయము ఎర్రగాను, వాపుతోను వుండును. తాకుటకు మృదువుగా వుండును. చీముగల స్రావముండును. నడుమునొప్పి, కడుపునొప్పి వుండును.

దీర్ఘకాలపు వ్యాధిలో సంభోగ సమయమున వీపునొప్పి, కడుపుక్రింద నొప్పి వుండును. సంభోగానంతరము రక్తస్రావము వుండును. కొన్ని సమయాలలో క్యాన్సర్ లేక కంతులు వుండును.

**కారణాలు :**

1. సరిగా నిర్వర్తించని గర్భస్రావము.
2. శిశువు ప్రసవ సమయములో కలుగు ఇన్‌ఫెక్షన్.
3. గనేరియా వంటి సుఖవ్యాధి.

**నివారణోపాయాలు :**

1. గాలి, వెలుతురు వుండు గదిలో రోగిని వుంచాలి.
2. మంచి పోషక ఆహారాన్ని ఇవ్వాలి.
3. వ్యక్తిగత ఆరోగ్య నియమాలను పాటించాలి.

**• చికిత్స •**

కారణాన్ని బట్టి, లక్షణాన్ని బట్టి మందును వాడాలి.

**కాలీమూర్ 6×** : స్త్రీ గర్భకోశపు మెడ / ద్వారము వాపు ఈ లక్షణాలతో వుండుట – గ్రంథుల / తిత్తులనుండి చిక్కని, తెల్లని, సాధువైన / మృదువైన క్షారస్వభావము గల స్రావము స్రవించుట–గర్భాశయము అతిగా వాచుట –ఈ వాపు చాలాకాలము నుండి వుండుట.

## 14. గర్భకోశము యోనిలోనికి దిగజారుట
## (Prolapse of Uterus)

ఈ వ్యాధిలో గర్భకోశపు గోడ యోనిలోనికిగాని, ఇంకను క్రిందకు గాని దిగజారును. దీనిలో మూడు దశలుండును.

1. **మొదటి దశ :** దీనిలో గర్భకోశపు ద్వారము (మెడ) యోనిలోనికి కొద్దిగా చొచ్చుకొని పోవును.
2. **రెండవ దశ :** గర్భకోశపు ద్వారము (మెడ)యోని రంధ్రపు మధ్య వరకు చొచ్చుకొని పోవును.
3. **మూడవ దశ :** గర్భకోశపు ద్వారము (మెడ) యోని రంధ్రపు బయటివరకు చొచ్చుకొని పోవును.

**కారణాలు :** కటి ప్రదేశమున నుండు కండరాలు సాగుట వల్ల వాటి బిగి తగ్గుట దీనికి ముఖ్య కారణం. కండరాలు సాగుటకు ఈ కారణాలు గలవు – a) బిడ్డకు జన్మనిచ్చే టపుడు కలిగే గాయము. b) గర్భధారణ సమయము పెరుగుట c) ప్రసవించిన శిశువు పెద్దగా నుండుట. d) ఒక కాన్పు తరువాత మరొక కాన్పు వెంట–వెంటనే జరుగుట – నిరక్షరాస్యత అధికముగా గల మనదేశములో ఇది సహజము.

**లక్షణాలు :**

1. యోనిలో ఏదో దిగబడుతున్నట్లు రోగి ఫిర్యాదు చేయుట.
2. శారీరక శ్రమ తగ్గుట వల్ల కడుపు క్రింద ఒత్తిడి పెరుగును. దీనివల్ల బాధ ఎక్కువగును. పడుకొన్నప్పుడు బాధ తగ్గును.
3. రోగి ఉదయమునుండి సాయంకాలము వరకు పనిచేసిన తర్వాత నడుము నొప్పి వచ్చును.
4. వేడిమి, ఎర్రదనము, నొప్పి, ఉబ్బుట అను లక్షణాలు గల వాపు.
5. మూత్రమును ఆపుకొను శక్తి లేకపోవుట / మూత్రము చుక్కలు చుక్కలుగా పడుట.
6. మలబద్ధకము.

## • చికిత్స •

ఈ వ్యాధికి మూడు దశలు గలవని పైన తెలుపుట జరిగింది. మొదటి దశలోమాత్రమే ద్వాదశ లవణ చికిత్స ద్వారా నయము చేయుటకు వీలగును. రెండవ, మూడవ దశలో శస్త్రచికిత్స అవసరమగును.

మొదటి దశకు ద్వాదశ లవణ చికిత్స –

**కాల్కేరియాఫ్లోర్ 12× :** ఈ మందు గర్భకోశ సంధాయక ధాతువులకు శక్తినిచ్చి, కండరాలు సాగకుండా చేయగలదు.

**నేట్రంఫాస్ 6× :** గర్భకోశము యోనిలోనికి దిగజారుట – మలవిసర్జన తర్వాత బలహీనత, క్రుంగిపోవు లక్షణాలతో.

**నేట్రంమూర్ 6× :** ఉదయము పూట గర్భకోశము దిగజారుట – పడుకొన్నా, కూర్చొన్నా బాగుండుట – మూత్ర విసర్జన నాళములో కోయుచున్నట్టి నొప్పి.

**కాల్కేరియాఫాస్ 6× :** సన్నగా, నీరసముగా వుండు స్త్రీలలో గర్భకోశము దిగజారుట – లక్షణాలను బట్టి ఎంపిక చేసిన మందుతో దీనిని మధ్య మధ్య వాడాలి.

# 15. గర్భకోశపు / గర్భాశయపు బాధలు

**A. గర్భాశయపు వాపు (Metritis)** : దీనిలో గర్భాశయపు నొప్పి, వేడిమి, ఎరుపు, వాపు వుండును.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6X :** జ్వరము, నొప్పి, రక్తాధిక్యత.

**కాలీమూర్ 6X :** రక్తాధిక్యత, గర్భాశయము ఎక్కువగా పెద్దదగుట (దీర్ఘ కాలమునుండి) చిక్కని, తెల్లని స్రావముతో.

**కాల్కేరియాఫ్లోర్ 6X :** నొప్పి దీర్ఘకాలంగా ఉండుట.

**B. గర్భాశయము స్థానము తప్పుట (Uterine displacement)** : దీనిలో గర్భాశయము స్థానం తప్పును.

**• చికిత్స •**

**నేట్రంఫాస్ 6X :** గర్భాశయం స్థానం తప్పుట – కీళ్ళనొప్పులతో.

**కాల్కేరియాఫ్లోర్ 6X :** గర్భాశయము క్రిందికి దిగుతున్నట్లుండుట – మానసిక ఆందోళన, గర్భాశయ ప్రాంతమున, తొడలలో లాగుతున్నట్టి నొప్పులు – ఈ మందును కాలిమూర్ 12×తో 2 గంటల కొకసారి మార్చి యివ్వాలి.

**కాల్కేరియాఫాస్ 6X :** గర్భకోశము ముందుకు / వెనుకకు నడుము వైపు వంగుట – కీళ్ళ వాత నొప్పులు వుండుట.

**C. యోని వాపు (Vaginitis)** : దీనిలో యోని నొప్పి, వేడిమి, మంట, తీపు, వాపు వుండును.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6X :** యోని వాపు – యోని కండరము ముడుచుకొనుట – సంభోగము వల్ల యోనిలో నొప్పి – యోని ఎక్కువ పొడిగాను సున్నితము గాను వుండుట – యోని కండరాలు ముడుచుకొని యుండుటవల్ల ఈడ్పులు.

**D. బాహ్య జననేంద్రియం వాపు (Vulvitis)** :

**• చికిత్స •**

**నేట్రంసల్ఫ్ 6X :** బాహ్య జననేంద్రియము వాపు – అధికముగా నుండు పుండ్లతో.

**E. గర్భకోశము నుండి స్రావాలు :**

**• చికిత్స •**

**కాలీమూర్ 6X :** గర్భకోశమునుండి చిక్కని, తెల్లని స్రావం – గర్భకోశము పెద్దదిగా వుండుట (దీర్ఘకాలము నుంచి).

**కాలీఫాస్ 6X :** గర్భకోశము నుండి పలుచని ముదురు ఎరుపు / నలుపు రంగు స్రావం.

**నేట్రంఫాస్ 6X :** గర్భకోశము, యోనినుండి వచ్చు స్రావములన్నియూ పసుపుపచ్చగా, మంటగా, నీళ్ళ వలె, పులుపు వాసనతో వుండుట.

**F. మూత్రవిసర్జన నాళములో నొప్పి :**

**• చికిత్స •**

**నేట్రంమూర్ 6X :** కోయుచున్న నొప్పి – కుసుమ నీళ్ళవలె వుండుట – గర్భకోశమందు మంట – దీనిని కాల్కేరియాఫ్లోర్‌తో మార్చి వాడాలి.

**G. స్త్రీ గర్భకోశపు మెడ ద్వారము పుండుపడి పై భాగపు ధాతువు పోవుట** (Erosion of Cervix) : కొంతమంది స్త్రీల గర్భకోశపు ద్వారము పుండుపడి పై భాగపు ధాతువు పోవును. ఇది యోని రంధ్రమును పరిశీలించు సాధనము (speculum) ద్వారా యోనిని పరీక్షించునపుడు మాత్రమే తెలియును.

**లక్షణాలు :** ఈ వ్యాధిలో అధికముగా శ్లేష్మము గల స్రావము స్రవించును. ఇన్‌ఫెక్షన్ సోకినచో దానిలో చీము కూడా వుండును. ఈ వ్యాధి దీర్ఘకాలముగా నున్నచో గర్భకోశపు ద్వారము గట్టిగాను, లావుగాను తయారగును. ఈ వ్యాధితో నున్న స్త్రీ ఉదరపు నొప్పి, అసౌకర్యము, కుసుమ వ్యాధి, పీడించుచున్న వీపునొప్పి మొ॥ లక్షణాలతో బాధపడును.

**• చికిత్స •**

**కాలిమూర్ 6X :** గర్భకోశపు ద్వారము పుండుపడి దానినుండి చిక్కని, తెల్లని స్రావము వెడలుట.

**H. స్త్రీ గర్భకోశపు మెడ ద్వారపు క్యాన్సర్ (Carcinoma of the Cervix) :** ఈ వ్యాధికి గల అసలు కారణము ఇంతవరకు తెలియదు. కాని సంభోగము దీని ప్రధాన కారణము. పెళ్ళికాని స్త్రీలలో ఈ వ్యాధి కనిపించేదే కాదు. చిన్న వయస్సులోనే వివాహమాడే స్త్రీలు, బీద కుటుంబాలకు చెందిన స్త్రీలు ఈ వ్యాధికి గురియగుదురు.

**లక్షణాలు :**

1. **రక్తస్రావము :** సంభోగము తర్వాత చాలా కొద్దిగా రక్తస్రావమగుట – ఈ స్రావము కొద్దిరోజులపాటు వుండుట – స్త్రీ ముట్లుడుగు కాలము కానిచో గర్భకోశపు ద్వారపు

క్యాన్సర్ అని భావించాలి. యోనినుండి రక్తస్రావము అధికమైనచో డాక్టరమ్మను సంప్రదించాలి. చేతివ్రేలు పెట్టి గర్భకోశమునకు కాన్సర్ వున్నదీ లేనిదీ డాక్టరమ్మ తేలికగా చెప్పగలదు.

2. **స్రావము (Discharge) :** గర్భకోశమునకు క్యాన్సర్ వున్నచో స్రావము రక్తపు మరకలతోను, దుర్గంధ భరితముగను వుండుట – ముట్లుడుగు కాలపు స్రావమైనచో నీటివలె వుండుట.
3. **శోషణ (Cachexia) :** రక్తహీనత, ఆకలిలేమి, తలనొప్పి, బరువు తగ్గుట (కొన్ని సందర్భాలలో అతి ఎక్కువగా బరువు తగ్గుట), సాధారణ అస్వస్థత మొ॥ లక్షణాలు.
4. **నొప్పి (Pain) :** వీపు / నడుము నొప్పి – క్యాన్సర్ ఏ అవయవమునకు సోకునో ఆ అవయవములో నొప్పి వుండును.

## 16. గర్భస్రావం / గర్భపాతం
## (Abortion / Miscarriage)

గర్భిణిలో గర్భకోశమును భరించలేనపుడు 28 వారాలకు పూర్వమే ఆమె గర్భము బయటికి నెట్టబడుటను గర్భపాతము / గర్భస్రావము అని అంటారు. ఈ మధ్యకాలములో దాదాపుగా 40% గర్భిణీ స్త్రీలకు గర్భపాతము అవుతున్నదని అంటారు. దీనిని బట్టి ఆధునిక జీవన విధానం, ఆహారపు అలవాట్లు నేటి స్త్రీ పై ఎంత దుష్ప్రభావం చూపుతున్నదీ అర్థమవుతుంది. కొంతమందికి గర్భస్రావమగుట సహజ స్వభావముగా ఉంటుంది. కాని ఒకసారి గర్భస్రావమైనచో మరలా గర్భస్రావమగుననే భయం అక్కరలేదు.

**కారణాలు :**

1. ఏదైనా ప్రమాదములో క్రిందపడుట.
2. భయం, దుఃఖం మొ॥ వాటివల్ల.
3. సిఫిలిస్ తత్త్వము వల్ల నాడీ వ్యవస్థ సరిగా పనిచేయకపోవుట.
4. మానసిక అశాంతి, అలజడి మొ॥ కారణాలు.

**నివారణోపాయాలు :**

1. గర్భిణి పాటించవలసిన నియమాలను తు.చ. తప్పకుండా పాటించాలి. ధనము, పదవి, హోదా, చదువు వీటన్నింటిని దూరంగా పెట్టి ప్రతి గర్భిణీ వాటిని అనుసరించాలి.
2. గర్భిణి తల్లిదండ్రులు, బంధుమిత్రాదులు ఆమెను అనవసర భయానికి గురి చేయరాదు. ఆమె ఆహ్లాదకరమైన వాతావరణములో వుండేటట్లు సహకరించాలి.

**• చికిత్స •**

**కాలీఫాస్ 6× :** గర్భస్రావము సహజ స్వభావముగా నున్న, నాడీ వ్యాధులతో బాధపడుతున్న గర్భిణీ స్త్రీలకు ఇది మంచి మందు. దీనిని ఉదయం, సాయం కాలం 4 – 4 మాత్రలు చొప్పున రెండు మోతాదులు వాడాలి. దీనివల్ల గర్భస్రావం అగునేమో అను భయం తొలగును.

గర్భస్రావము జరిగియున్న స్త్రీ కొద్దిరోజుల పాటు గంటకు ఒక మోతాదు చొప్పున వాడాలి. దీనివల్ల నాడీ సంబంధమైన రుగ్మతలన్నీ తగ్గును.

**కాల్కేరియాఫ్లోర్ 6× :** గర్భకోశము నుండి విస్తారముగా రక్తస్రావమై, కటి ప్రదేశమందు బరువుగా క్రిందకు నొక్కు నొప్పులుండి గర్భస్రావము అగునేమో అను భయమున్నప్పుడు దీనిని వాడాలి. గర్భస్రావము కాకుండా కాపాడును. గర్భస్రావమైన స్త్రీ దీనిని వాడిన గర్భకోశములో వ్యాకోచించిన / సాగిన నాడులు, సంకోచించి మామూలు స్థాయికి తెచ్చును.

**గమనిక :** కొందరిలో పదే–పదే గర్భస్రావం అవుతూ ఉంటుంది. అందుకు గల కారణాలు : 1) క్రోమోజోముల లోపం, 2) హార్మోన్ల లోపం.

## 17. వంధ్యత్వము
## (Sterility)

పెళ్ళి జరిగి రెండు సంవత్సరములు గడిచినప్పటికీ సంతానం కలగనిచో భార్యాభర్తలలో ఎవరిలోనైనా లోపం వుండవచ్చును. 25 సంవత్సరాలు దాటిన తర్వాత వివాహం చేసుకొన్న వారిలో 6 నెలల నుండి 12 నెలల లోపల గర్భం రానిచో వారిలో ఎవరిలోనైనా లోపం వుందని అనుమానించాలి. ఇలాంటి స్థితిని వంధ్యత్వం అని అంటారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో టోటల్ ఫెర్టిలిటీ రేటు (TFR) గణనీయంగా తగ్గినదని తాజా అధ్యయనాలు తెలుపుతున్నాయి. భార్యాభర్తలు పరీక్షలు చేయించుకొని ఎవరిలో ఎలాంటి లోపం వున్నదో తెలుసుకొని దానికి సంబంధించిన చికిత్స చేయించుకొని మందులు వాడిన వారి వంధ్యత్వం తొలగి సంతానం కలగటానికి వీలుంటుంది. సాధారణంగా అమ్మాయిలలో లోపం ఎక్కువగా వుంటుందని భావిస్తాం. కాని తాజా లెక్కల ప్రకారం పురుషులలో కూడా సమస్యలు ఎక్కువేనని తెలుస్తుంది.

**కారణాలు :**

1. మర్మావయవము నుండి వెడలుచున్న కొన్ని స్రావముల వలన పురుష బీజములు నశించుట – గత కాలముకంటే ఈ మధ్య బీజకణాల కౌంట్ బాగా తగ్గిపోయినట్లు, తాజా అధ్యయనాలు తెలుపుతున్నాయి.

2. గర్భాశయము స్వస్థానము తప్పుట.
3. గర్భాశయములో పుండ్లు, కంతులు.
4. అండాశయం వ్యాధులు.
5. బహిష్టు దోషములు.
6. సుఖ వ్యాధులు.
7. కుసుమ.
8. గర్భనిరోధక సాధనములను ఎక్కువ కాలము వాడుట వలన ఇన్‌ఫెక్షన్ కలిగి ఫాలోపియన్ నాళములలో ఆటంకములు ఏర్పడుట.
9. పురుషుని శుక్రము / వీర్యములో శుక్ర / వీర్యకణాలు లేకపోవుట / అతి తక్కువగా వుండుట.
10. అవయవముల లోపములు.
11. అధిక శ్రమ, చింత, వ్యాకులత, మనఃశాంతి లేకుండుట, (పురుషులలో) ఎక్కువగా పొగత్రాగుట.
12. అధిక బలహీనత.

**ఇతర కారణాలు :**

1. **పౌష్టిక ఆహారం తీసుకొనకపోవుట :** అనేక కారణాల వల్ల పౌష్టిక ఆహారం తీసుకోలేక పోతున్నాం. క్రిమిసంహారక మందులు, రసాయన ఎరువులతో పండించిన ఆహార పదార్థాలను, కూరగాయలను, పండ్లను తినవలసి వస్తున్నది. కలుషిత జలాలతో పండించిన గడ్డి మేసే జంతువుల పాలు త్రాగాల్సిన పరిస్థితి. మనం వంటలలో వాడే నూనెలు, కారం, పసుపు మొ॥వన్నీ కల్తీకి గురవుతాయి. అలాంటివి తిన్న శరీరంపై వీటన్నిటి ప్రభావం ఉంటుంది.
2. **మారిన జీవిత విధానం :** ఉరుకులు, పరుగులు ఎక్కువయ్యాయి. ఉద్యోగాల, వ్యాపారాల ఒత్తిడి ఎక్కువవుతున్నది. నిదానంగా భోజనం చేసే వీలు కూడా ఉండదు. ఇతర దేశాలు / చోట్ల భార్యభర్తలు వుండవలసిన పరిస్థితులు ఎక్కువ – కంప్యూటర్‌కు అతుక్కొని పోవడం వల్ల స్థూలకాయం వచ్చుట. రాత్రి ఆలస్యంగా భోజనం చేయుట – ప్రొద్దున్నే ఏమీ తినకుండా పరుగెత్తుట – వ్యాయామం లేకపోవుట.
3. కాలుష్యం.

## • చికిత్స •

వంధ్యత్వమునకు గల కారణములు తెలుసుకొని, తత్సంబంధమైన మందును వాడాలి.

**నేట్రంఫాస్ 6× - 30× :** యోనినుండి స్రవించు స్రావాలలో ఆమ్లాధిక్యత వుండుటచే శుక్రకణాలు చనిపోవుట.

**నేట్రంమూర్ 6× :** ఋతువు తొందరగా అగుట, ఋతుస్రావము అధికముగా అగుట.

**సైలీషియా 12× :** కుసుమ పాలవలె తెల్లగానుండుట, అధిక బలహీనత వల్ల జననేంద్రియాలు తమ పనిని సక్రమముగా నిర్వర్తించలేకపోవుట.

**కాలీఫాస్ 6× :** బహిష్టు సమయములో స్తనాలు వాచి చీము పట్టుట.

**కాల్కేరియాఫాస్ 6× - 12× :** స్తనాలు పెద్దవయినట్లు భావన - స్తనాగ్రాలు నొప్పిగా వుండుట.

## 18. ప్రసవం
## (Labour)

ప్రసవము ప్రకృతి సహజ కార్యం. ఆరోగ్యముగా నుండు గర్భిణీ స్త్రీ ఎలాంటి ఒడుదుడుకులు లేకుండా పండంటి బిడ్డకు జన్మనిచ్చును. ప్రసవము మూడు దశలలో జరుగును.

**ప్రథమ దశ :** ప్రసవ సమయము ఆసన్నమైనపుడు శిశువు వెలుపలికి వచ్చుటకు వీలుగా తల క్రిందికి దిగియుండును. ప్రథమదశలో గర్భకోశ కండరములు ముడుచుకొనుట చేత శిశువు ముందుకు నెట్టబడును. అప్పుడు కాన్పు నొప్పులు ప్రారంభమగును. కాన్పు నొప్పులు పావు గంటకు / అర గంటకు ఒకసారి వచ్చి తగ్గిపోతుంటాయి. కొన్ని సమయాల్లో దొంగనొప్పులు ఉండవచ్చు. కాన్పు నొప్పులకు, దొంగనొప్పులకు గల తేడాను ఈ విధంగా తెలుసుకోవచ్చు–

| కాన్పు నొప్పులు | దొంగ నొప్పులు |
|---|---|
| 1. వీపు, నడుములో కనిపించును. | పొత్తి కడుపులో కనిపించును. |
| 2. ఒకే కాలవ్యవధి (పావుగంట / అరగంట) | ఎప్పుడైనా రావచ్చు, పోవచ్చు. |
| 3. ప్రతి నొప్పితో ఉమ్మి సంచి పగిలి కొద్దికొద్దిగా ఉమ్మి బయటికి వచ్చును. ఇది ప్రసవమునకు సహకరించును. | – |

ఈ నొప్పులకు కాల పరిమాణము వ్యక్తినిబట్టి మారును. తొలి కాన్పులో ఎక్కువ సమయం పట్టవచ్చు.

**జాగ్రత్తలు :**

1. ఈ దశలో స్త్రీకి మలవిసర్జన కావించాలి.
2. భోజనం పెట్టవచ్చు లేదా పాలు ఇవ్వవచ్చు.
3. స్త్రీని ప్రశాంతంగా వుండునట్లు చూడాలి.

**ద్వితీయ దశ :** ఈ దశలో నొప్పులు ఎక్కువై శిశువు బయటికి వచ్చును. సాధారణంగా 1–2 గంటలలో ప్రసవము పూర్తి కావచ్చు. సాధారణంగా తొలుత తల కనిపిస్తుంది. తర్వాత భుజములు, శరీరము, కాళ్ళు వరుసగా గర్భకోశము నుండి బయటికి వచ్చును. బొడ్డు త్రాడు (బిడ్డను, మావిని కలుపునట్టిది) యోని నుండి ముందరకు వచ్చును. శిశువు బయటికి రాగానే నోటిలో వున్న ఉమ్మి నీటిని తుడిచివేయాలి. బొడ్డు త్రాడును శుభ్రమైన కత్తితో కోయాలి. బిడ్డకు అన్ని అంగములు సరిగా వున్నదీ లేనిది చూడాలి.

తల బయటికి వచ్చినప్పటి నుండి శిశువు శ్వాసిస్తుంది. ఏడుస్తుంది. శ్వాసకార్యము కనిపించనిచో బిడ్డను తలక్రిందలు చేయాలి. అప్పుడు స్రావములు నోటినుండి బయటికి వెళ్ళి శిశువు శ్వాసించును. ఏడ్వనిచో ముఖముపై, ఛాతీపై చల్లనీళ్ళు చల్లాలి. బిడ్డను చన్నీటిలో ముంచాలి. తర్వాత వేడినీటిలో ముంచాలి. ఇలా మార్చి మార్చి చేసిన శిశువు ఏడ్చును.

బిడ్డను గోరువెచ్చని నీటితో స్నానము చేయించాలి. బిడ్డకు బట్టలు వేసి తల్లివద్ద పడుకోబెట్టి తల్లిప్రాలు త్రాపించాలి. బొడ్డు త్రాడునకు డ్రెస్సింగు చేయించాలి.

**తృతీయ దశ :** ప్రసవానంతరము ఒక అరగంటకు తల్లి గర్భాశయము నుండి మావి బయటకు వస్తుంది. అలా రానిచో పొత్తికడుపుపై ఒత్తాలి / రుద్దాలి. ఆ తర్వాత మర్మేంద్రియమును శుభ్రముగా తుడిచి దానిపై శుభ్రమైన గుడ్డను వేయాలి. ఆ గుడ్డ యోని నుండి వెలువడే స్రావములను పీల్చుకొంటుంది. ఆ గుడ్డ తడిసిన వెంటనే మార్చాలి.

**జాగ్రత్తలు :**

1. ప్రసవానంతరము తల్లికి పాలు, బార్లీ, సగ్గుబియ్యం జావలాంటి ద్రవాహారం ఇవ్వాలి. 3 రోజుల తర్వాత తల్లి ఆరోగ్యమును బట్టి పథ్యము పెట్టవచ్చు.
2. తల్లి, బిడ్డను వుంచిన గది శుభ్రంగా వుండాలి. ఆ గది గాలి, వెలుతురు వచ్చేదిగా వుండాలి. ఆ గదిలోనికి వెళ్ళేవారు కూడా శుభ్రంగా వుండాలి.
3. తల్లికి, బిడ్డకు కాపడం పెట్టవలసిన అవసరం లేదు. ఎట్టి పరిస్థితులలోను బిడ్డ బొడ్డుపైన కాపడం పెట్టకూడదు.
4. తల్లికి 10 దినముల విశ్రాంతి అవసరం.
5. 7వ నెలలో పుట్టిన పిల్లలను వెంటిలేటర్లలో ఉంచాలి. అలాచేస్తే వారికి తల్లి గర్భంలో లభించే వాతావరణం లభిస్తుంది. వారికి ఎట్టి బాధలు కలగకుండా వారి ఎదుగుదలకు తోడ్పడుతుంది.

**సుఖ ప్రసవానికి మందులు :**

ఎట్టి నొప్పులు లేకుండా సుఖ ప్రసవమగుటకు నొప్పి స్వరూపాన్ని బట్టి క్రింది మందులు వాడాలి.

**కాలీఫాస్ 3× :**

- ★ నొప్పులు బలహీనంగాను, ఆలస్యంగాను వచ్చునప్పుడు.
- ★ ఫలవంతమైన నొప్పులు వచ్చునట్లు చేసి ప్రసవం సుఖదాయకంగా అగుటకు.
- ★ గర్భకోశ ద్వారమును పెద్దది చేయుటకు, ఉదరకుహర కండరాలలో శిశువును బయటికి పంపు శక్తిని పెంచుటకు.
- ★ 15 నిమిషములకు ఒకసారి 10 మాత్రలు చొప్పున.

**మెగ్నీషియంఫాస్ 6× :**

- ★ నొప్పులు నీరసముగాను, హ్రస్వముగాను (కొద్దిసేపు మాత్రము) వుండి ఆగి - ఆగి వచ్చుట.
- ★ గర్భకోశ ద్వారము బిర్రబిగిసియుండుట.
- ★ కాళ్ళ కండరాలు ముడవ లాగుచుండుట.
- ★ శిశువును బయటికి పంపు ప్రయత్నము ఎక్కువగా జరుగుట.
- ★ మందును వేడి నీటితో కలిపి తరచుగా ఇవ్వాలి.

**కాల్కేరియాఫ్లోర్ 6× :**

- ★ గర్భకోశ గోడలలోని సంధాయక ధాతువుల శక్తిని పెంచి, అవి సంకోచించునట్లు చేసి శిశువును బయటికి నెట్టే ప్రయత్నం అధికంగా చేయుట.
- ★ దీనిని గంటకు ఒకసారి కాలీఫాస్‌తో మారుస్తూ వాడాలి.

## 19 (A) బాలింతరాలు బాధలు - మందులు

| మందు | బాధ | మందు ఎలా వాడాలి |
|---|---|---|
| 1. ఫెర్రంఫాస్ 3× | ప్రసవానంతర నొప్పులు - యోని దగ్గర ఏర్పడిన చీలిక - గాయాలు - వాపులు - సూతికా జ్వరము రాకుండా కాపాడుటకు | 1) లోపలికి, పైకి.<br>2) 10 మాత్రలను 100 మి.లీ. వేడినీటిలో వేసి జననేంద్రియాలను శుభ్రపరచుట.<br>3) 2 - 3 రోజులపాటు రోజుకు 2 మోతాదులు. |
| 2. మెగ్నీషియంఫాస్ 6× | మావి బయటికి వచ్చునట్లు చేయుటకు- గుర్రపు వాతము రాకుండా చేయుటకు. | మందును వేడినీటితో ఇవ్వాలి. |

| మందు | బాధ | మందు ఎలా వాడాలి |
|---|---|---|
| 3. కాల్కేరియాఫ్లోర్ 6× | మావి, రక్తపు గడ్డలు బయటికి వచ్చుటకు. | మావి బయటికి వచ్చుట ఆలస్యమైనచో 2 గం॥లకు ఒకసారి. |
| 4. కాలీఫాస్ 30× | మతిభ్రమణము కలుగుట - సూతికా జ్వరం. | కొన్ని రోజులు ఉదయం, రాత్రి |
| 5. సైలీషియా 30× | గర్భకోశము నుండి స్రావము వెలువడుట–ఉదరభాగము కండరాల బిగి తగ్గి వ్రేలాడు చుండుట. | రోజుకు 3 మోతాదులు ఉదయం, మధ్యాహ్నం, రాత్రి - ఈ విధంగా కొన్నిరోజులు. |
| 6. నేట్రంసల్ఫ్ 6× | గర్భకోశము గర్భముదాల్చుటకు ముందున్న పరిమాణమునకు ముడుచుకొని పోవుటకు, యోని మీద హెర్పస్ పుండ్లు, దురద. | రోజుకు 3 మోతాదులు ఉదయం, మధ్యాహ్నం, రాత్రి - ఈ విధంగా కొన్నిరోజులు. |
| 7. కాలీమూర్ 6× | సూతికాజ్వరము వచ్చిన వాడ వలసిన మందు. చీము ఏర్పడక పూర్వము స్తనాల వాపును తగ్గించును. | రోజుకు 3 మోతాదులు ఉదయం, మధ్యాహ్నం, రాత్రి - ఈ విధంగా కొన్నిరోజులు. |
| 8. నేట్రంమూర్ 6× | వెంట్రుకలు రాలిపోవుట | రోజుకు 3 మోతాదులు ఉదయం, మధ్యాహ్నం, రాత్రి - ఈ విధంగా కొన్నిరోజులు. |
| 9. కాల్కేరియాఫాస్ 6× | నీరసం, రక్త క్షీణత | రోజుకు 3 మోతాదులు ఉదయం, మధ్యాహ్నం, రాత్రి - ఈ విధంగా కొన్నిరోజులు. |
| 10. కాలీసల్ఫ్ 6× | స్తనములు చీముపట్టుట, స్తనము లలో గట్టికంతులు, స్తనాగ్రములు చీలుట, పుండ్లుపడుట, శిశువు పాలు త్రాగకుండుట, వాంతి చేసుకొనుట, తల్లి గుదం వద్ద రంధ్రం. | రోజుకు 3 మోతాదులు ఉదయం, మధ్యాహ్నం, రాత్రి - ఈ విధంగా కొన్నిరోజులు. |

## (B) తల్లిపాలు

ప్రపంచంలోని వైద్యులంతా తల్లిపాలు చాలా శ్రేష్ఠమైనవని ఘోషిస్తున్నారు. వాటిలో వ్యాధినిరోధక శక్తి ఎక్కువగా వుంటుంది. కనుక తల్లిపాలు త్రాగే శిశువు త్వరగా అనారోగ్యానికి గురికాడు. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకొని ఏ బాలింతరాలు కూడ తన అందము పాడవుతుందని బిడ్డకు తన చనుబాలు త్రాపకుండా వుండరాదు. తల్లి మొదటి పాలగు కొలస్ట్రమ్ (Colostrum) ను కూడా పిండివేయరాదు. దానిని శిశువుకే త్రాపించాలి. దానివల్ల బిడ్డకు వ్యాధి నిరోధక శక్తి ఏర్పడుతుంది.

తల్లికి ఏదైనా తీవ్ర అనారోగ్యం ఏర్పడి బిడ్డకు తన పాలు ఇవ్వలేని సమయములో కూడా డబ్బాపాలు ఇవ్వరాదు. ఆవుపాలు శ్రేష్ఠమైనవి. కారణం అవి పలచగా ఉంటాయి. ఆవుపాలు దొరకనిచో గేదెపాలకు శుద్ధమైన నీరు కలిపి బిడ్డకు త్రాపించాలి. సీసాలో పాలుపోసి త్రాపించటముకన్నా ఉగ్గుగిన్నెలో పాలుపోసి త్రాపించుట మంచిది. ఇది రాత్రిపూట కష్టమైనా బిడ్డమీద గల ప్రేమతో ఇలా చేయుట ఉత్తమం. నిజమైన ప్రేమ త్యాగంలోనే ఉన్నది కదా !

**తల్లిపాలను అధికం చేయుటకు వాడవలసిన మందులు :**

**కాల్కేరియాఫాస్ 6X :** తల్లి స్తనాలలో పాలు బాగా ఉత్పత్తి అగుటకు సహాయపడును. అంతేకాకుండా తల్లిపాలు పుల్లగా, పలచగా, నీలంగా, రుచిలేకుండా వుండుటచే శిశువు పాలను త్రాగుటకు ఇష్టపడనిచో ఈ మందును తల్లికి ఇచ్చిన తల్లిపాలు రుచికరముగా మారును. శిశువు పాలు త్రాగుటకు ఇష్టపడును. ఈ మందును భోజనానికి అరగంట ముందు ఇవ్వాలి.

**నేట్రంసల్ఫ్ 6X :** పాలు అధికముగా వున్నచో, తగ్గించుటకు.

**నేట్రంమూర్ 6X :** పాలు అధికముగాను, నీలంగాను, ఉప్పుగాను వుండుట.

**కాల్కేరియాఫ్లోర్ 6X :** పాలు తక్కువగా వుండుట.

## (C) స్తనాల వాపు
### (Mastitis)

తల్లి తన బిడ్డకు పాలిచ్చేటప్పుడు బిడ్డ తల్లి స్తనాలను కొరుకుతాడు. అప్పుడు స్తనాగ్రములు చీలవచ్చు. పాలు స్రవించు గ్రంథులకు హాని కలగవచ్చు. వాటిలో బ్యాక్టీరియా చేరి వాపు కలిగించును. అవి బాధగా, ఎర్రగా కూడా ఉంటాయి. కొన్ని సందర్భాలలో స్తనాలలో గడ్డలు వుండుట వల్ల కూడా వాపు రావచ్చు.

**జాగ్రత్త :** బిడ్డకు పాలిచ్చిన వెంటనే తన స్తనాలను శుభ్రంగా కడుగుకొనవలెను.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6× :** వాపు (ప్రథమదశ) – జ్వరము.

**కాలీమూర్ 6× :** వాపు (ద్వితీయదశ) – చీము ఏర్పడినచో ఫెర్రంఫాస్‌తో మార్చి వాడాలి.

**కాలిఫాస్ 6× :** చీము గోధుమ రంగుతో, అసహ్యముగ, ఎక్కువ దుర్వాసనతో.

**సైలీషియా 12× :** స్తనాగ్రము లోపలికి ముడుచుకొనుట వలన బిడ్డ పాలు త్రాగలేకపోవుట – లోతైన పుండ్లు సున్నితంగా, నొప్పి, చీముతో వుండుట – వాటినుండి పలుచని నీళ్ళవంటి స్రావము దుర్వాసనతో వుండుట.

**కాల్కేరియా సల్ఫ్ 6× :** చీము వెళ్ళిన తర్వాత పుండు మానుటకు.

## (D) క్రొత్తగా పుట్టిన శిశువు వ్యాధులు

**ఫెర్రంఫాస్ 12× :** శిశువు బొడ్డు త్రాడును మెడకు చుట్టుకొని, తల్లి గర్భసంచి యోని గోడల మధ్య నలిగి బయటికి వచ్చునపుడు శిశువుకు కొన్ని ఒత్తిడులు కలుగును. వాటిని మాన్పుటకు ఈ మందు ఉపయోగపడును.

**కాల్కేరియాఫాస్ 6× :** శిశువు ఏడ్చుట – పాలు ఉప్పగా వుండుట వల్ల బిడ్డ వాటిని త్రాగిన వెంటనే పెరుగు గడ్డలవలె వాంతి చేసుకొనును.

**నేట్రంమూర్ 6× :** నిరంతర జ్వరం – నోటిపూత.

**సైలీషియా 12× :** తల్లిపాలు సహించకపోవుట – త్రాగిన వెంటనే వాంతి చేసుకొనుట.

## 20. స్తనాలలో గడ్డలు
### (Tumors in Breasts)

స్త్రీ ఛాతీయందు రెండు స్తనాలు వుండును. ఆమె రజస్వల అయిన తర్వాత వాటి పరిమాణం పెరుగును. ప్రసవం తర్వాత వాటినుండి పాలు వచ్చును.

కొంతమంది ఆడవాళ్ళలో చిన్న వయస్సు వారైనా, పెద్దవయస్సు వారైనా చిన్న – చిన్న గడ్డలు / కంతులు ఏర్పడును. బహిష్టు సమయములో అవి వాచి, నొప్పిని కలుగజేయును. కొన్ని గడ్డలు / కంతులు కేన్సర్‌కు సంబంధించినవిగా మారును. వాటిని కొంతమంది శస్త్రచికిత్స చేసి తొలగింతురు. కాని అవి తిరిగి రావటానికి అవకాశము వుంటుంది. ఒక స్తనములోని క్యాన్సర్ గడ్డలను తొలగిస్తే మరొక స్తనములో అట్టి గడ్డలు రావచ్చు.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6× – 12× :** జ్వరము, వాపు, నొప్పి ఉండుట – ఈ మందును కొద్దిపాటి నీటిలో కలిపి వాపుగా వున్న చోట పూయవచ్చు.

**కాలీమూర్ 6× :** ఎక్కువ వాపు, జ్వరము వుండుట – దీనిని ఫెర్రంఫాస్‌తో మార్చి వాడిన చీము ఏర్పడకుండా వుండును.

**కాల్కేరియాఫ్లోర్ 6× – 30× :** గడ్డలు రాయి మాదిరిగా గట్టిగా వుండి బాధ కలిగించుట – స్తనాగ్రములు చీలి వుండుట – దీనిని 3×లో పై పూతగా కూడ వాడవచ్చు.

**కాలీఫాస్ 6× :** బహిష్టు సమయములో స్తనాలు వాచి, చీముపట్టుట.

**కాల్కేరియాఫాస్ 6×–12× :** స్తనాలు పెద్దవయినట్లు అనిపించుట–స్తనాగ్రాలు నొప్పిగా వుండుట.

**కాల్కేరియాసల్ఫ్ 6× – 12× :** చీము స్రవించిన తర్వాత పుండును మాన్పుటకు – రోగి వేడిని సహించలేడు – ఎంపిక చేసిన మందు పనిచేయనపుడు దీనిని వాడాలి.

**సైలీషియా 6× – 200× :** చీము ఏర్పడినప్పుడు దానిని బయటికి పంపుటకు ఉపయోగపడును. చీము వెడలక పూర్వము 3× లోషనును, చీము వెడలిన తర్వాత 30×/200× లోషనును వాడాలి. రోగి చలిని సహించలేకపోవుట.

## 21. గర్భసంచి తీసివేయడం మంచిదా ?

ఈమధ్య కాలంలో చాలామంది గైనకాలజిస్ట్‌లు స్త్రీలలో నడుమునొప్పి, ఋతుస్రావం ఎక్కువగుట, తెల్లమైల (కుసుమ) అగుచున్నచో వారి గర్భసంచి తీసివేయు చున్నారు. చాలామంది మహిళలు కూడా బహిష్టు సమస్యల నుండి విముక్తి లభిస్తుందని గర్భసంచి తీసి వేయించుకోవటానికి సుముఖత వ్యక్తం చేస్తుంటారు. కాని అలా చేయించుకోవటం వల్ల వచ్చే ఇబ్బందులే ఎక్కువ. చూడండి –

ఎప్పుడో రావలసిన 'ముట్లు ఆగుట' వల్ల వచ్చే కష్టాలు త్వరలోనే ప్రారంభం అవుతాయి : వెంట్రుకలు తెల్లబడతాయి : చర్మం ముడతలు పడుతుంది.

గర్భసంచి తొలగించాల్సిన దారుణమైన పరిస్థితులు ఉన్నప్పుడే ఆ పనిని చేయించాలి. ఆపరేషన్ అవసరం లేని మార్గాలు అనేకం ఉన్నాయి. శారీరక పరిశుభ్రతను పాటించాలి. నీళ్ళు బాగా త్రాగాలి. పోషక ఆహారం తినాలి. వేడినీళ్ళతో కాపడం పెట్టాలి.

## 22. స్త్రీలలో సంతానలేమి

స్త్రీలలో సంతానలేమికి సాధారణంగా ఈ కారణాలు చెప్పబడును – 1) అండం ఉత్పన్నం కాకపోవుట 2) అండాలు సరిగా విడుదల కాకపోవుట, 3) గర్భాశయంలో

సిస్ట్స్ (మూసుకుపోయిన తిత్తులు) ఏర్పడుట, 4) గర్భాశయ ముఖద్వారం నుంచి వెలువడే స్రావంలో వికృతులు, 5) మూత్రమార్గం అంగానికి క్రింద ఉండి వీర్యం గర్భాశయ ముఖద్వారం వరకూ వెళ్ళకపోవుట, 6) వీర్యకణాల సంఖ్య తక్కువగా ఉండుట, 7) వీర్యదోషాలు 8) హార్మోన్ల సంతులనం సరిగా లేకపోవుట, 9) బుడగలు, 10) థైరాయిడ్ గ్రంథి సమస్యలు, 11) గర్భాశయంలోని లోపలిపొర గర్భసంచిలో కాకుండా వేరే చోట ఉండుట, ఇది గర్భసంచి పొర వైచిత్ర్యం, 12) సంభోగం నొప్పిగా ఉండుట.

**• చికిత్స •**

సమస్యను బట్టి చికిత్స ఆధారపడుతుంది. మందులతో ఉపయోగంలేని సందర్భంలో ఆధునిక వైద్యసలహాలు పాటించాలి.

## 23. స్త్రీ ముట్లు ఆగిపోవుట* (Menopause)

స్త్రీలో ముందున్న ఋతుక్రమము తప్పి, ముట్టుకు, ముట్టుకు మధ్య వ్యవధి పెరిగి, చివరికి 12 నెలలు దాటినా ఋతుస్రావము కాక పోవుటను ముట్లు ఆగిపోవుట అని అందురు. దీనిని ఋతు నివృత్తి, ఋతుచక్రము ఆగిపోవుట, ముట్లు ఎండిపోవుట అనికూడా అంటారు. దీనిలో స్త్రీ లైంగిక హార్మోన్లలో కూడా మార్పులు జరుగును.

ఇది ప్రతి స్త్రీ జీవితములోను తప్పకుండా జరిగే సంఘటన . ఈ సంఘటన సాధారణంగా 45 సం॥ వయస్సులో జరుగును. దీనిలో బహిష్టు ఆగిపోవటంతోపాటు చాలామంది స్త్రీలు అసౌకర్యమునకు గురి అగుదురు. వారి అసౌకర్య లక్షణాలు –

1. దేహమంతటా వేడిసెగలు
2. మెదడులో ధనారింపుగా నొప్పి
3. తలలో రక్తము అధికముగా చేరుట – తల వెనుక భాగాన నొప్పి – కుడికన్ను వైపునకు అది ప్రాకుట
4. చెవులలో తొలుచునట్టి నొప్పి
5. బలహీనత, నరాల బలహీనత
6. క్రుంగిపోవుట

*స్త్రీకి మెనోపాజ్ లక్షణాలు వచ్చినట్లే 40 సం॥ వయస్సు గల పురుషునిలో కూడా ఆ లక్షణాలు కనిపిస్తున్నాయి అని ఆధునిక పరిశోధనల్లో కనుగొనుట జరిగింది. పురుషునిలో బహిష్టు జరుగుట ఉండదు. కనుక బహిష్టు ఆగిపోవుట అను లక్షణం ఉండదు. కాని మెనోపాజ్ వచ్చిన పురుషునిలో పురుషుల హార్మోన్ లభించును.

7. నిద్రలేమి
8. గర్భకోశము యోనిలోనికి దిగజారుట.

ఎలాంటి అసౌకర్యమున్నా, ఇది మాత్రం శృంగారానికి, రతిక్రీడకు అవరోధం కాదు.

**జాగ్రత్తలు :** వ్యాయామం చేయుట మంచిది. దీనివల్ల గర్భకోశము యోనిలోనికి దిగజారుట మొ॥ అసౌకర్యములు తొలగును.

## • చికిత్స •

లక్షణాన్ని బట్టి మందును ఎంపిక చేసి వాడాలి.

**ఫెర్రంఫాస్ 12×** : వేడి సెగలు – తలలో రక్తమధికముగా చేరుట – రక్తప్రసరణ నిదానంగా జరుగుట–నిద్రపట్టకపోవుట – పాదములు చల్లగా నుండుట – రక్త క్షీణత.

**కాలీఫాస్ 6×** : క్రుంగిపోవుట, అలసట, నరాల బలహీనత, బలహీనముగాను, ఏడ్పు స్వభావముతోను, సున్నితముగాను వుండు స్త్రీలు – అలసట, నిద్రమత్తు, వీపునొప్పి, ఆతురత, అస్థిమితము, తిమ్మిరి, గర్భకోశము ఖాళీగా వున్నట్లుండుట.

**నేట్రంమూర్ 6× – 12×** : తలనొప్పి, లేచునపుడు నడుమునొప్పి.

**కాల్కేరియాఫ్లోర్ 12×** : గర్భకోశము నుండి అధికముగా రక్తము స్రవించుట, కటిక్రింది భాగాన నొప్పులు – గర్భకోశపు ద్వారము (మెడ) యోనిలోనికి కొద్దిగా చొచ్చుకొని పోవుట.

**మెగ్నీషియంఫాస్ 6×** : ఋతు సంబంధమైన సమస్యలు, నొప్పులు, కండరాలు లాగుచున్నట్లుండుట.

**కాల్కేరియాఫాస్ 6×** : బలహీనత, రక్తక్షీణత వున్నప్పుడు ఈ మందును, లక్షణాలను బట్టి నిర్ణయించిన మందుతో మధ్యమధ్యన వాడాలి.

# 23

# శిశువుల వ్యాధులు

## 1. పురిటిలోని శిశువుకు కలుగు చర్మవ్యాధి (Pemphigus)

ఈ వ్యాధిలో వాపుతో నుండు చీము పొక్కులు గుంపులు–గుంపులుగా లేచును. నోటి ఆమత్వక్కులో కూడ ఇవి ఏర్పడవచ్చు. దీనివల్ల ఉడికించిన బంగాళాదుంప పై పొట్టును ఒలిచినంత సులభముగా చర్మం పై పొట్టు ఊడిపోవును.

### • చికిత్స •

**నేట్రంమూర్ 6×** : బొబ్బలనుండి ద్రవం స్రవించుచుండుట – పెద్దబొబ్బలు నీటి వంటి ద్రవంతో ఉండుట.

**నేట్రంసల్ఫ్ 6×** : నీరసించిన పిల్లల దేహమంతటా నీటి పొక్కులు ఉండుట.

## 2. పురిటిలోని శిశువుకు కలుగు కండ్లకలక

**నేట్రంఫాస్ 1×** : క్రొత్తగా పుట్టిన శిశువుకు ఈ మందును లోపలికి పైకి వాడవచ్చు. ఈ మందుతో కళ్ళను కడగవచ్చు.

**కాలీసల్ఫ్ 1×** : నెలలోపు శిశువు కండ్ల కలకకు – పలచని, పసుపుపచ్చని స్రావం / రసితో కనురెప్పలు అతుకుకొనుట.

## 3. పిల్లలలో కామెర్లు

పుట్టిన శిశువులలో కామెర్లు రావటం సర్వసాధారణమైన విషయం. సూర్యకాంతి లోపంచే అట్లు జరుగును. ట్యూబ్‌లైట్ కాంతిలో పగలు–రాత్రి శిశువును 2 – 3 రోజులు పడుకోబెట్టిన కామెర్లు తగ్గును. విరేచనం తెల్లగా అవుచున్నచో పైత్యరసం ఆహారనాళిక లోనికి వెళ్ళటం లేదని భావించాలి.

**కారణాలు :** 1) జన్యు కారణాలు, 2) మేనరిక వివాహాలు చేసుకొన్న వారి సంతానం కావుట, 3) సరైన పోషణ లేకపోవుట, 4) నరాల బలహీనత మొ॥నవి.

**నివారణోపాయాలు :**

1. లక్షణాలను బట్టి మందు వాడాలి.
2. వైద్యసలహాపై హెపటైటిస్ – బి వ్యాక్సిన్ తీసుకోవాలి.

## 4. పిల్లల రోదనం / ఏడ్పు & కారణాలు (Crying of Children & Reasons)

**లక్షణాలు :** చంటిపిల్లలు సాధారణంగా శ్వాసకోసం ఏడుస్తారు. ఒక గంట పాటు ఏడిస్తే మంచిదే కాని ఆ సమయం పెరిగితే ఆలోచించాలి. పిల్లలకు రోదనం/ఏడ్పు ఒక ఆయుధం. వాళ్ళు ఏ వస్తువు కావలయునన్నా, ఏ బాధ ఉన్నా ఏడుస్తూ ఉంటారు. వాళ్ళు మాట్లడలేరు, చెప్పలేరు. కనుక తల్లిదండ్రులు, బంధువులు, ఇతరులు వారి ఏడ్పుకు గల కారణం తెలుసుకొని కారణ నివృత్తికి ప్రయత్నం చేయలేరు. కారణం ఏదో ఊహించుకొని కారణ నివృత్తికి ప్రయత్నం చేసినా పిల్లలను సంతృప్తి పరచలేరు. వారు ఏదో ఊహించుకొని ఏదో వస్తువును ఇచ్చినా చాలా సందర్భాలలో పిల్లలు సంతృప్తి చెందక ఆ వస్తువులను పారవేయుదురు. వారు తమ ఏడ్పును ఎక్కువ చేయుదురు. రోజుకు ఒక గంట సేపు ఏడ్చినా ఫరవాలేదు. 2 – 3 గంటల పైగా ఏడ్చిన చికిత్స అవసరం.

**కారణాలు :** 1) ఊపిరి కొరకు, 2) ఏమియు తోచకపోవుట, తనను గురించి ఎవ్వరూ పట్టించుకోలేదనే బాధ, 3) కోపం, 4) ఆకలి, 5) కడుపునొప్పి, 6) దంతాలు వస్తున్నప్పటి బాధలు (విరేచనాలు మొ॥) 7) ఒత్తిడి, 8) దుస్తులు బిగుతుగా ఉండుట, 9) చీమలు, దోమలు మొ॥వి కుట్టుట, 10) మూత్రం పోసుకొనుట వల్ల గుడ్డలు తడిగా అగుట, 11) మల విసర్జన, 12) చల్లని గాలి / వేడి వాతావరణం మొ॥ కారణాలు.

**నివారణోపాయాలు :**

తల్లికి సాధారణంగా పిల్లవాని బాధలు / ఇబ్బందులు అర్థం అవుతాయి. అర్థమైనంత వరకు పిల్లవాని ఏడ్పుకు గల కారణాలను తొలగించాలి. ప్రశాంత వాతావరణం కల్పించాలి. పాట పాడాలి. ఊపాలి. మూత్ర విసర్జన పిల్లవాని ఏడ్పుకు కారణమైనచో తడిచిన గుడ్డలను తొలగించాలి. మలవిసర్జన కారణమైన మలాన్ని తొలగించి గుడ్డలు మార్చాలి. ఆకలివల్ల ఏడుస్తున్నచో పాలుపట్టడం/ఆహారాన్ని అందించాలి. దుస్తులు బిగుతుగా నున్నచో వదులు చేయాలి. చీమలు కుట్టుట వల్ల ఏడ్చుచున్నచో చీమలు తొలగించాలి / ఆ ప్రదేశాన్ని మార్చాలి. దోమకాటు నుండి రక్షణ ఇవ్వటానికి పిల్లల దోమతెర వాడాలి లేదా ఇతర మార్గాలు అవలంభించాలి. చల్లని గాలివల్ల ఏడుస్తున్న పిల్లవానికి వెచ్చని గుడ్డలు తొడగాలి. వీలైతే ఫ్యాను ఆపు చేయటం / గది తలుపులు మూసి వేయటం వంటి పనులు చేయాలి. వెచ్చని వాతావరణం వల్ల ఏడుస్తున్న, వాతావరణాన్ని చల్లబరచే పనులు చేయాలి.

ఉద్యోగినులుగా నున్న తల్లులు తమ పిల్లల సంరక్షణను ఇతరులకు అప్పగించి పాలసీసాలు, బిస్కెట్లు ఏర్పాటు చేసి వెళతారు. సంరక్షకులు ఎంత ప్రేమ హృదయులైనా తల్లిప్రేమను అందివ్వలేరు గదా ! కొంతకాలానికే పిల్లలు తల్లిదండ్రులను గుర్తిస్తారు. వారు కనిపించకపోయినా, అతనితో మాట్లాడకపోయినా పిల్లవాడు ఏడుస్తాడు. కొంతమంది పిల్లలకు ఆముదం పడ్తుంటారు. దానివల్ల సాఫీ విరోచనం అవుతుందని వారి ఆలోచన. ఇది మంచి పద్ధతి కాదని నేటి వైద్యులు చెబుతారు. దానివల్ల ప్రేగులు తమ సహజశక్తిని కోల్పోతాయి. అంతేగాకుండా విరేచనాలతోపాటు శరీరానికి అవసరమైన కొన్ని లవణాలు కూడా బయటికి పోతాయి. పిల్లలు ఎక్కువగా ఏడుస్తూ వుంటే వారిని చేతులలోనికి తీసుకుని అటూ ఇటూ కదిలిస్తూ పాటలు పాడుతూ ప్రశాంత వాతావరణాన్ని కల్పించాలి. కొందరు తల్లులు పిల్లలకు ఏడుస్తున్నపుడు తేనె/పంచదార నీళ్ళు పట్టిస్తారు. ఇది కూడా మంచి పద్ధతి కాదు. ఎందువలననగా ఆ నీటితోపాటు బ్యాక్టీరియా కూడా దేహం లోనికి ప్రవేశించే అవకాశం ఎక్కువగా ఉంటుంది. కనుక వారు ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొని వ్యవహరించాలి. ఇంతచేసినా జన్యుకారణాల వల్ల, బాధల వల్ల, ఇతర కారణాల వల్ల ఏడుస్తూ ఉంటారు. అలాంటి సందర్భాలలో క్రింది మందులు చాలావరకు ఉపయోగపడతాయి.

### • చికిత్స •

**కాల్కేరియాఫాస్ 3X – 6X :** చాలా సందర్భాలలో ఈ మందు బాగా ఉపయోగపడును. దంతసమస్యలను, ఆ సమయమున వచ్చు విరేచనాలను కూడా ఇది అరికట్టును.

**మెగ్నీషియంఫాస్ 6X :** పై మందు వల్ల మేలు జరగనిచో దీనిని ఇవ్వాలి. ఈ మందు సాధారణంగా పిల్లల కడుపునొప్పిని తొలగించును.

**నేట్రంమూర్ 6X :** ఓదార్పును ఇష్టపడని పిల్లలకు – రక్తక్షీణత గల శిశువులకు – వారి అజీర్ణమునకు, చిరచిరలాడుటకు.

**కాలీఫాస్ 6X :** ఆతురత, భయం, కృంగుట, నాడీ, కండర సంబంధమైన నొప్పుల వల్ల ఏడ్చుట.

## 5. దంతోత్పత్తి
## (Dentition)

పిల్లలకు సాధారణముగా 6–8 నెలల వయస్సులో క్రింది వైపున దంతములు వచ్చుచుండును. అంతకుముందు లేక పై భాగమున దంతములు వచ్చు పిల్లలు కూడా వుందురు. ఈ దంతములను పాలపళ్ళు (Milk teeth) అని అందురు. ఈ పళ్ళు ఎన్నో నెలలో వచ్చునో అన్నో సంవత్సరమున ఊడి క్రొత్త పళ్ళు వచ్చును. ఈ క్రొత్త పళ్ళను శాశ్వతపళ్ళు (Permanent teeth) అని అందురు. ఆరోగ్యవంతునిలో 16 పళ్ళు పైన, 16 పళ్ళు క్రింద ఉండును.

పిల్లలకు దంతములు వచ్చునపుడు వారి దేహములో కొన్ని లవణాలు లోపించును. దీనివల్ల పిల్లలలో కొన్ని బాధలు, కొన్ని వికారాలు కలుగును. వారిలో ఆకుపచ్చ విరేచనాలు, వాంతులు తరచుగా అగును. వారు తలనొప్పి, జ్వరం, కంపనాలతో బాధ పడుదురు. వారు పాలు సరిగా త్రాగలేరు. వారికి నిద్ర కూడా సరిగా పట్టదు. వారి నోటినుండి లాలాజలం కారుచుండును. అందువల్ల వారు అస్థిమితంగాను, కోపంగాను కనిపింతురు. కొంతమంది శుష్కింతురు. కనుక వారిదంతోత్పత్తి సమయమున లక్షణాలను బట్టి రోజుకు 3 – 4 సార్లు మందు వాడాలి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× – 12× :** జ్వరం, కందిపోయిన / ఎర్రని ముఖం, మెరుస్తున్న కళ్ళు, పెద్దవైన కనుపాపలు, అమితమైన అస్థిరత్వం, చిరాకు లక్షణాలతో నున్న దంతోత్పత్తి బాధలు – వడిగా నున్న శ్వాస, గట్టిగాను, పొడిగాను నున్న దగ్గు, బొంగురుతనం, అస్థిరత్వం లక్షణాలు వున్నప్పుడు ఈ మందు బాగా ఉపయోగపడునని రావో (Raue) చెప్పారు.

**మెగ్నీషియంఫాస్ 3× – 6× :** దంతోత్పత్తిలో జ్వరం లేకుండా కంపనాలు వున్నచో దీనిని ఫెర్రంఫాస్‌తో మార్చి వాడాలి. ఈడ్పులతో కూడిన శూల, అధికముగా వదులైన విరేచనాలున్నచో ఈ మందు మహత్తరమైనది అని జే.సి. మోర్గన్ అన్నారు.

**కాల్కేరియాఫాస్ 3× – 6× :** దంతోత్పత్తి సమస్యలకు ఈ మందు ప్రధానమైనది. పిల్లలకు దంతములు వచ్చుట ఆలస్యమైనపుడు దీనిని ఇవ్వవలెను. ఇది దంతోత్పత్తికి అవసరమైన కాల్షియమ్‌ను దేహానికి అందించి దంతోత్పత్తిని వేగిరపరచును. దంతోత్పత్తి సమయమున ఉత్పన్నమయ్యే భయంకరమగు బాధలను తొలగించుటలో ఇది చక్కని మందు. వదులుగా నుండునట్టి, శుష్కించిన, తల ఎముకలు కలియని, నడచుట నేర్చుకోని/ నడచుట మరచిపోయిన పిల్లలకిది మంచి మందు. తొందరతో, శబ్దము చేస్తూ పైకి చిమ్మునట్టి చీము వంటి విరేచనాలు, వాంతులు.

**నేట్రంమూర్ 6× :** నిద్రలో గాని, మేలుకొన్నప్పుడు గాని నోటి నుండి లాలాజలం కారుచున్నపుడు ఈ మందు పనిచేయును. దీనిని రోజుకు 3 సార్లు వాడాలి.

**సైలీషియా 6× – 12× :** పెద్ద తలలు కలిగిన, ఎముకల అంచులు కలియని, తలపైన అధిక చెమట పట్టునట్టి, పెద్ద పొత్తికడుపు, అందమైన చర్మం, సున్నితమైన మనస్సు, సరియైన శోషణ లేనందువల్ల సరిగా పోషణ లేనట్టి పిల్లలకు ఈ మందు బాగా ఉపయోగపడును.

**కాల్కేరియాఫ్లోర్ 3× – 6× :** ఇది దంతోత్పత్తిలో బాగా సహకరించును. దంతోత్పత్తి సమయమున వచ్చు వాంతులకు, ఎముకలకు ముఖ్యంగా దంతములకు సరైన పోషణ

లేకపోవుటలో ఈ మందు బాగా ఉపయోగపడును. "శ్వాసను పీల్చునపుడు కలుగు కంపములకు, నిరంతర ఏడ్పుకు, క్షణకాలము పాటు స్పృహ కోల్పోవుటకు ఇది మంచి మందు" **(జే.డబ్ల్యూ.వార్డ్).** ఇది దంతాల మీద ఎనామిల్ తక్కువగా వున్నప్పుడు, దంతాలు గరుకుగా వుండి, ముక్కలు ముక్కలుగా విడిపోవునపుడు ఈ మందును వాడాలి.

## 6. అంగటి వాపు / మాంస సంతానిక / డిఫ్తీరియా (Diphtheria)

ఇది ఒక విధమైన అంటురోగం. కొంతమంది పెద్దవారు అప్పుడప్పుడు ఈ వ్యాధిచే బాధపడుచుందురు. కాని ఇది ఎక్కువగా చిన్న పిల్లలకే వచ్చును. 2 సం॥ లోపు శిశువులకిది వచ్చిన ప్రమాదకరము.

**లక్షణాలు :** ఈ వ్యాధి రెండు రూపాలలో వచ్చును 1) సాధురూపం, 2) భయంకర రూపం. ఇది సాధురూపములో వచ్చిన అంత ప్రమాదకరం కాదు. త్వరలో నెమ్మదించును. ఈ రూపములో గొంతునొప్పి, ఏమియూ మ్రింగలేకపోవుట, శరీర భాగాలలో నొప్పులు, మంటలు వుండును.

భయంకర రూపంలో వచ్చు వ్యాధి చలి, జ్వరం, వణకుడుతో ప్రారంభమగును. తర్వాత ఈ లక్షణాలు కనిపించును - 1) నాడి వేగంగా కొట్టుకొనుట, 2) శరీరం వేడిగా వుండుట, 3) ముఖం ఎర్రగా వుండుట, 4) గొంతునొప్పి, 5) మెడ కొయ్యబారుట, 6) మెడ గ్రంథులు వాచి పెద్దవగుట, 7) ఏమియు మ్రింగలేక పోవుట, 8) టాన్సిల్స్ వాచుట, 9) దగ్గు మొ॥నవి.

ఈ వ్యాధి ఇంకను ముదిరినపుడు కనిపించు లక్షణాలు - 1) నిరంతరం వాంతి చేసుకొనుట, 2) సంధి, 3) మగత, 4) ముక్కునుండి రక్తం స్రవించుట, 5) నాడి క్షీణించుట, 6) శ్వాసావరోధం, 7) మూత్రములో ఆల్బుమిన్ (శ్వేత ధాతువు) పోవుట మొ॥వి. ఈ లక్షణాలు కొన్ని సందర్భాలలో పక్షవాతం / మృత్యువునకు దారి తీయవచ్చు.

**కారణాలు :** ఈ వ్యాధి ఒక క్రిమి వల్ల సోకును. ఈ క్రిమి నుండి జనించు విషం శరీర మంతటా వ్యాపించి రక్తమును పాడుచేసి ఈ వ్యాధిని కలిగించును. ఈ వ్యాధి అనేక రకాలుగా ఇతర పిల్లలకు వ్యాపించును. పిల్లలను ముద్దుపెట్టుకొనుట వల్ల, పాలసీసాల వల్ల, పాలలో కలుపు నీరు కలుషితమగుట, ఒక యింటినుండి మరొక యింటికి వెళ్ళు పిల్లలు మొ॥ కారణాల వల్ల ఈ వ్యాధి ఒక చోటునుండి మరొక చోటునకు వ్యాపించును.

**నివారణోపాయాలు :**

1. రోగి గదిని శుభ్రంగా వుంచవలెను.

2. రోగి వాడిన వస్తువులను వేడినీటిలో కడగాలి.
3. చలిగాలి తగలకుండా చూడవలెను.
4. రోగి గదియందు గంధకపు పొగను వేయాలి.
5. వాంతియున్నప్పుడు రోగికి మంచు గడ్డను ఇవ్వాలి.
6. రోగికి పుష్టికరమైన, తేలికగా జీర్ణమగు ఆహారమివ్వాలి.
7. రోగి నోటిద్వారా ఆహారాన్ని మ్రింగలేనపుడు ఆసనము ద్వారా దానిని పంపాలి.

## • చికిత్స •

**ఫెర్రంఫాస్ 6× – 12× :** జ్వరము ప్రారంభ దశలో నున్నప్పుడు దీనిని వాడదగును.

**కాలీమూర్ 6× :** ఇది డిఫ్తీరియా అన్ని సందర్భాలకు పనికివచ్చే ఒకే ఒక మందు. దీనిని ఫెర్రంఫాస్‌తో మార్చి వాడాలి. టాన్సిల్స్ వాచుట, దొంగపొరలు ఏర్పడుట, నాలుక తెల్లగా వుండుట మొ॥ లక్షణాలు వున్నప్పుడు ఈ మందు ఉపయోగకారి. డిఫ్తీరియా కణాలు క్షోభకు గురైనపుడు ఈ మందును పరమాణువుల రూపంలో వాడాలి. అనగా ఒక గ్లాసు నీరు తీసుకొని మందు 6× పొటెన్సీ మాత్రలను వేయాలి. ప్రతి రెండు గంటలకు ఒక మోతాదు ద్రావణాన్ని వాడాలి. దీనిని పుక్కిలించుట మంచిది.

**కాల్కేరియాఫ్లోర్ 6× – 12× :** డిఫ్తీరియా శ్వాసనాళమునకు వ్యాపించునపుడు ఈ మందును, కాల్కేరియాఫాస్‌తో మార్చి వాడాలి.

**కాల్కేరియాఫాస్ 6× :** డిఫ్తీరియా చెమర్చుట – చెమర్చుట తర్వాత ఒక తెల్లని మచ్చ మిగిలిపోవును. ఆ మచ్చ పెద్దదై దొంగపొరలు ఏర్పడును. ఈ కారణముచే గుటక వేయుట కష్టమగును. శ్వాస వాసన కలిగియుండును. ధాతువులు మృతి చెందినపుడు పక్షవాతం కూడా రావచ్చును.

**కాలీఫాస్ 6× :** రోగి శక్తిని కోల్పోయి నిస్త్రాణ అధికముగా నున్నపుడు ఇది చెప్పుకోదగ్గ మందు. డిఫ్తీరియా తర్వాత దృష్టిలోపం ఏర్పడుట, ముక్కుతో మాట్లాడుట, శరీరపు ఏదో భాగానికి పక్షవాతం వచ్చుట, మెల్లచూపు ఏర్పడుట, నోటినుండి దుర్వాసన వెలువడుట వంటి లక్షణాలున్నచో ఈ మందును వాడాలి.

**నేట్రంమూర్ 6× :** డిఫ్తీరియా, ముఖం ఉబ్బుట, అది పాలిపోయి వుండుట, అధికంగా నిద్రమత్తు, నీళ్ళ వంటి విరేచనాలు, నోటినుండి నీరు కారుట, నీళ్ళ వంటి ద్రవాన్ని వాంతి చేసుకొనుట, నాలుక ఆరిపోవుట, గురక, ఆయాసం మొ॥ లక్షణాలకు ఈ మందు ఉపయోగకారి. పై లక్షణాలు అదృశ్యం కాగానే ఈ మందును వాడుట మానుకోవాలి.

**నేట్రంఫాస్ 6× :** టాన్సిల్స్‌పై పసుపుపచ్చని, క్రీము వంటి పూత పూయబడుట, నోటి వెనుకభాగం పసుపుపచ్చని క్రీముతో వుండుట, నాలుకపై పూత తడిగాను, బంగారు

రంగులోను వుండుట దొంగ డిఫ్తీరియాను తెలుపును. ఇలాంటి దొంగ డిఫ్తీరియాకు నేట్రంఫాస్ మంచి మందు.

**నేట్రంసల్ఫ్ 6× :** డిఫ్తీరియాలో దీనిని మధ్య – మధ్య వాడాలి. ఆకుపచ్చని పదార్థం / నీటిని వాంతి చేసుకొనుట, పొట్టలో ప్రత్యేకమైన శ్లేష్మం కూడుట వంటి లక్షణాలకు ఈ మందు బాగా ఉపయోగపడును.

**సూచన :** "డిఫ్తీరియా వ్యాధికి లక్షణాలను బట్టి పై మందులు మాత్రమే వాడాలి. సున్నపునీరు, కార్బాలిక్ ఆమ్లం, ఐస్‌నీరు వంటి వాటిని వాడరాదు. ఎందుకనగా ఇవి పై మందుల ప్రభావాన్ని నిరోధించును." – **స్క్యూష్లర్.**

## 7. పిల్లలు మట్టి, చాక్‌పీసులు, బొగ్గులు, బియ్యం మొదలైనవి తినుట

పిల్లలు మట్టి తినటం ఈనాటిది కాదు. భాగవతంలో యశోద మట్టి తిన్న నోటిని చూపమనగా బాలకృష్ణుడు తన నోటిలో యావత్ విశ్వాన్ని చూపి ఆశ్చర్యపరిచాడు కదా! కాని ఈ విధంగా పిల్లలు మట్టి తినటం సమర్థనీయం కాదు. అట్లే మరికొంతమంది పిల్లలు చాక్‌పీసులు, బొగ్గులు, బియ్యం తింటూ ఉంటారు. కొంతమంది పిల్లలు గోడలకు ఉండే సున్నం నాకుతూ ఉంటారు. ఇది పిల్లల వ్యాధికి సంకేతం మాత్రమే. వారు పౌష్టిక ఆహారం, కొన్ని ద్వాదశ లవణాల లోపం వలన అలా చేస్తున్నారని తలంచాలి. అందువల్ల వారికి పౌష్టిక ఆహారం, లోపించిన ద్వాదశ లవణాలు ఇచ్చిన వారు ఈ దురలవాటును మానుకొంటారు. ద్వాదశ లవణాలను ఎంపిక చేయుటలో వారి ఇతర లక్షణాలను దృష్టిలో పెట్టుకోవాలి. చాలా సందర్భాలలో కాల్కేరియాఫాస్ 3× ఉపయోగకారి.

## 8. పిల్లలు అన్ని కూరగాయలూ తినరు

పిల్లలు అన్ని కూరగాయలూ, పౌష్టిక పదార్థాలు ఎక్కువగా ఉండే కాయధాన్యపు కూరలు తినటం లేదని తల్లులు ఎంతో బాధపడుతుంటారు. ఇది వారికి ఆందోళన కలిగించే విషయం. కాని కారణం తెలుసుకొంటే వారి ఆందోళన కొంతైనా తగ్గగలదు.

పిల్లల నాలుకపై ఉండే రుచి గ్రంథులకు, పెద్దల నాలుకపై వుండే రుచి గ్రంథులకు చాలా తేడా ఉంటుంది. పిల్లల రుచి గ్రంథులు చాలా సున్నితంగా ఉంటాయి. కనుక తిండి విషయంలో ఎంతో మొండిగా వ్యవహరిస్తూ ఉంటారు. వారి ఇష్టాలు, అయిష్టాలు బలంగా ఉంటాయి. వయస్సు పెరిగే కొద్దీ, ఇతర పిల్లలను చూసి కొంత మార్పు చెందుతారు. కనుక తల్లులు ఎంతో తెలివిగా వారితో ప్రవర్తించాలి. వారు చాలా ఆకలిగా ఉన్నప్పుడు వారికి ఇష్టంలేని కూరలను కొద్దిగా (1 లేదా 2 స్పూన్లు) పెట్టాలి. వారు

తిన్నారు కదా అని ప్రతిరోజు పెట్టకూడదు. ఒకవారం తర్వాత మరలా పెట్టడానికి ప్రయత్నించాలి. నెమ్మదిగా పరిమాణం పెంచుకొంటూ రావాలి. వారు తిన్నప్పుడు చాక్లెట్ / టాఫీ / బొమ్మ ఇచ్చి వారిని సంతోషపెట్టాలి. ఇలాచేస్తే వారు ఇష్టంలేని వాటిని కూడా తింటారు.

## 9. ముక్కు కాయలు / ఎడినాయిడ్స్ (Adenoids)

అడినాయిడ్స్ / ముక్కుకాయలు / కొయ్యగండలు ముక్కుకు, నోటికి మధ్య లేచును. ఇవి పిల్లలలో వచ్చును. ఇవి బాగా పెరిగి పెద్దవైనచో పిల్లలు ముక్కుతో శ్వాస పీల్చలేక నోటితో పీల్చెదరు. దీనివల్ల వారి పెరుగుదల ఆగిపోవును.

**నివారణోపాయం :**

1. జలుబు రాకుండా చూసుకోవాలి.

### • చికిత్స •

**కాల్కేరియాఫాస్ 6×-12× :** సన్నగా, బలహీనంగా వుండు పిల్లలకు ఇది మంచి మందు.

**సైలీషియా 12× :** పై మందు వలన గుణం ఆగిపోయిన దీనిని వాడవలెను.

**ద్వాదశ మిశ్రమం :** ఫెర్రంఫాస్ 3× - 1 మాత్ర + కాలీమూర్ 3× - 1 మాత్ర + కాల్కేరియాఫాస్ 3× - 1 మాత్ర + నేట్రంమూర్ 3× - 1 మాత్రం మొత్తం 4 మాత్రలు రోజుకు 3 మోతాదుల చొప్పున 2 నెలలపాటు వాడాలి.

## 10. పిల్లలలో ఆటిజం స్వభావం

ఆటిజం స్వభావం ఉండే పిల్లలలో ఈ లక్షణాలు కనిపిస్తాయి -

1. తలను తలుపుకు బాదుకొనుట.
2. ఒంటరిగా ఉండుట.
3. బ్లేడుతో కోసుకొనుట.
4. ఇతరులతో సంభాషించు స్వభావం లేకుండుట.
5. నేర్చుకొనే ప్రక్రియ లేకుండుట.
6. అసాధారణ ప్రవర్తన.
7. ఎవరినీ అడిగి కావలసిన వస్తువులను తీసుకొనకుండుట.

ఈ లక్షణాలు ఉన్నప్పుడు తల్లిదండ్రులు అలాంటి పిల్లల పట్ల సానుభూతి పూర్వకంగా వ్యవహరించవలెను.

# 24

# వివిధములు

## 1. ప్రయాణ బాధలు
(Travel Sickness)

ఆధునిక యుగంలో ప్రయాణం సర్వసాధారణమైన విషయం. చాలామంది బస్సు / కారు / రైలు / విమానం / ఓడలో ప్రయాణం చేస్తూ ఉంటారు. వారిలో కొంతమంది రకరకాల బాధలతో బాధపడుతుంటారు. వమన వికారం, చెమట పట్టుట, వాంతి చేసుకొనుటకు ప్రయత్నించుట (Retching), తలత్రిప్పు, స్పృహపోవుట (Fainting), బలహీనత, పూర్తిగా శక్తిపోవుట, వాంతి, పాలిపోవుట (Pallor) మొ॥వి.

**కారణాలు :** 1. తత్త్వ సంబంధమైనది 2. మధ్య చెవిలో ఏర్పడు కలత 3. చదువుట.

**• చికిత్స •**

**ప్రయాణమునకు ముందు :** ఈ మందులను కలిపి రెండు మోతాదులు తీసుకొనవలెను. మోతాదుకు మోతాదుకు మధ్య 2 గంటల వ్యవధి ఉండాలి. ప్రతి మోతాదులో నేట్రంమూర్ 6× - 2 మాత్రలు, కాలీఫాస్ 6× - 2 మాత్రలు వేడి నీటితో తీసుకోవాలి.

**ప్రయాణములో :** ప్రయాణంలో వాంతి అగు లక్షణాలు కనిపించిన నేట్రంఫాస్ 6× - 2 మాత్రలు, నేట్రంమూర్ 6× - 2 మాత్రలు, మొత్తం 4 మాత్రలు తీసుకోవాలి. అవసరాన్ని బట్టి 15 నిమిషాలు / 30 నిమిషాలకు ఒకసారి 2 - 3 మోతాదులు వాడాలి.

## 2. ప్రయాణపు బడలిక

సరదా / వ్యాపారం / విద్య / ఉద్యోగం మొ॥ అవసరాలకు బస్సు / రైలులో ప్రయాణం చేస్తూ ఉంటారు. ప్రయాణం చేసేటప్పుడు మూత్ర విసర్జన చేయాల్సి వస్తుందేమోనని చాలామంది నీరు త్రాగరు. అంతేగాకుండా ఏవో చిరుతిండ్లు తింటూ ఉంటారు. శరీరంలో వున్న నీరు ఒకవైపు గాలికి ఆవిరి అవుతుంటుంది. మరొకవైపు తిన్న ఆహారపు జీర్ణక్రియకు అవసరమవుతుంది. ఈ పనులకు కావలసిన నీరు శరీరంలో తగ్గిపోతుంది. అందువల్ల కొంతమందిలో తలనొప్పి, మాడునొప్పి రావచ్చు. వేడిచేసినట్లుగా ఉండుట, గొంతు ఎండిపోవుట, గొంతు ఇన్‌ఫెక్షన్ వచ్చుట జరుగవచ్చు.

**నివారణోపాయాలు :**

1. ఎక్కువ దూరపు ప్రయాణమైనచో నీళ్ళ సీసాను దగ్గర ఉంచుకోవాలి. పొట్టలో ఆహారం కొంచెం ఖాళీ అయినప్పటి నుండి 40 – 50 నిమిషాలకు ఒకసారి 1/2 లేక 3/4 గ్లాసు నీరు త్రాగాలి. ఆ నీరు శరీర అవసరాలకు సరిపోతుంది. కనుక వెంటనే మూత్రం రాదు. (మూత్ర వ్యాధి ఉంటే తప్ప).
2. ప్రయాణంలో చిరుతిండ్లు తినటం కన్నా పండ్లు తినుట మంచిది.

## 3. వాపు
## (Inflammation)

ఇది సూక్ష్మజీవి సంపర్కము వలన గాని / గాయముల వలన గాని శరీరానికి బెడద కలిగినప్పుడు క్షేమ కవచమై, నాశ కణజాలములకు హద్దునొసగే ప్రక్రియ. దీనిని సూచించు విస్పష్ట వికారములు – నొప్పి, వేడిమి, ఎరుపు / కందిపోవుట, వాపు.

**• చికిత్స •**

**ఫెర్రంఫాస్ 6X :** శరీరములో ఏ భాగమందైనను రక్తము అత్యధికముగా నుండుట – నొప్పి, వేడి, మంట, వాపు గల తలముల నుండి, మరియు గాయముల నుండి ప్రోటీన్లు ఎక్కువగా గల కణముల యొక్క శిథిల పదార్థము గల ద్రవము వెలువడుటకు ముందు ఈ మందును వాడాలి.

**కాలీమూర్ 6X :** వ్యాధి ద్వితీయ దశ – క్రొత్తగా కణముల పెరుగుదల – అపారదర్శకమైన తెల్లని స్రావము.

**కాలీసల్ఫ్ 6X :** పసుపుపచ్చని, క్రొవ్వు పదార్థాలు గల శిథిలమైన స్రావం వెలువడుట.

**కాల్కేరియాసల్ఫ్ 6X :** వ్యాధి తృతీయ దశ – వాపు తగ్గుట, దుర్వాసన గల స్రావము అధికముగా స్రవించుట.

**సైలీషియా 6X :** తక్కువగా నుండు నరాల క్షోభకు పనికివచ్చును.

## 4. తిమ్మిరి
## (Numbness)

శరీరముయొక్క ఏ భాగములోనైనా తిమ్మిరి రావచ్చు. తిమ్మిరి వచ్చినచోట మొద్దుబారి ఉండును. అచ్చట స్పర్శాది గుణాలు ఉండవు.

**కారణం :** రక్తప్రసరణ సరిగా లేకపోవుట.

### • చికిత్స •

**మెగ్నీషియంఫాస్ 3× :** ఇది అన్నిరకాల తిమ్మిరికి మంచి మందు. దీనిని వేడినీళ్ళతో ఇవ్వాలి.

**కాల్కేరియాఫాస్ 3× :** కాళ్ళ తిమ్మిరి – చీమలు కుట్టినట్లు ఉండుట – మెగ్నీషియంఫాస్ సరిగా పనిచేయనపుడు దీనిని వాడాలి.

**సైలీషియా 12× :** పాదాల తిమ్మిరి – చీమలు ప్రాకుతున్నట్లు ఉండుట.

## 5. వ్యాక్సినేషన్ (Vaccination)

వ్యాక్సినేషన్‌లో ఏవైనా చెడు ఫలితాలు ఉన్నచో కాలీమూర్ 6× వాడాలి. దాని తర్వాత సైలీషియా 6× ఇవ్వవచ్చు.

## 6. నిరోధకములు (Preventives)

వ్యాధి – చికిత్స కన్నా దానినివారణ మిన్న (Prevention is better than cure) అని ఆంగ్లములో సామెత ఉంది. ద్వాదశ లవణ చికిత్సలో కొన్ని వ్యాధులకు నివారణ మందులు కలవు. వ్యాధి రాకముందే వాటిని వాడిన వ్యాధి నుండి నివారణ పొందవచ్చు.

1. **తుమ్ములు (Sneeze) :** చాలామంది శీతాకాలం / వర్షాకాలంలో తుమ్ములతో విపరీతంగా బాధపడుతుంటారు. ఈ తుమ్ములు వారిలో కాలనియమం ప్రకారం (Periodical) వస్తూ ఉంటాయి. కనుక ఏ కాలంలో / సీజన్‌లో వారు తుమ్ములతో బాధపడుతుంటారో, ఆ కాలం / సీజన్ ప్రారంభమగుటకు ఒక నెల ముందు రోజు ఉదయం, రాత్రి 2 మోతాదులు తీసుకోవాలి. ప్రతి మోతాదుకు నేట్రంమూర్ 6× – 2 మాత్రలు + ఫెర్రంఫాస్ 6× – 2 మాత్రలు.

2. **గర్భనిరోధకం (Birth Control / Contraceptive) :** కొంతమంది స్త్రీలు ఆర్థిక, సాంఘిక మొ॥ కారణాల వల్ల గర్భధారణ అవసరం లేదని భావింతురు. నేడు మార్కెట్లో అనేక రకాలైన మాత్రలు / పద్ధతులు చెప్పబడుచున్నవి. కాని ద్వాదశ లవణ చికిత్సలో అత్యంత సులభమైన, సురక్షణను కల్పించే మందు కలదు. దానిని క్రింది విధంగా వాడాలి.

   **బహిష్టుకు ముందు** 3 రోజులు వరుసగా నేట్రంమూర్ 3× – రోజుకు 3 మోతాదులు

   **బహిష్టు తర్వాత** 3 రోజులు వరుసగా నేట్రంమూర్ 200× – రోజుకు 3 మోతాదులు

**3. వడదెబ్బ (Brain-fever / Sun-stroke) :** వడదెబ్బ చాలా ప్రాణాంతకం. కనుక ఎండాకాలంలో కుటుంబ సభ్యులు ముఖ్యంగా ఎండలో బయటికి వెళ్ళువారు ఈ మందులను ఒక మోతాదు తీసుకోవాలి. ఫెర్రంఫాస్ 3× – 1 మాత్ర + కాలీమూర్ 3× – 1 మాత్ర + నేట్రంమూర్ 12× – 1 మాత్ర + నేట్రంసల్ఫ్ 3× – 1 మాత్ర + కాలీఫాస్ 3× – 1 మాత్ర + మెగ్నీషియంఫాస్ 3× – 1 మాత్ర = మొత్తం 6 మాత్రలు.

**4. కంటికలక (Conjunctivitis) :** కొన్ని ఋతువులలో ఇది ఒక ప్రాంతమంతా అంటువ్యాధిగా ఉండును. సాధారణంగా అందరిలోను దానికి సంబంధించిన ఒకే లక్షణాలు ఉంటాయి. ఈ మందులను ప్రతి మోతాదులోను తీసుకోవాలి.

ఫెర్రంఫాస్ 3× – 2 మాత్రలు + కాలీమూర్ 3× – 2 మాత్రలు + కాలీసల్ఫ్ 3× – 2 మాత్రలు = మొత్తం 6 మాత్రలు.

ఈ విధంగా తొలుత గంటకు 1 మోతాదు చొప్పున 3 మోతాదులు, ఆ తర్వాత పరిస్థితిని బట్టి మోతాదులను నిర్ణయించుకోవాలి.

**5. తట్టు / పొంగు (Measles) :** కాలీమూర్ 6× ను 2 – 3 రోజులపాటు వాడాలి. రోజుకు 3 మోతాదులు ఇవ్వాలి. మోతాదుకు 4 మాత్రలు చొప్పున ఇవ్వాలి.

## 7. విషప్రాణుల కాట్లు
## (Bites of Poisonous Animals)

కొన్ని విషప్రాణులు (కీటకాలు, తేలు, మండ్రగబ్బ, జెర్రి మొ॥) మానవుని కరచిన పుడు చాలా నొప్పిగా వుండును. ఆ నొప్పిని తగ్గించుటకు క్రింది చికిత్స ఉపయోగపడును.

### • చికిత్స •

**నేట్రంమూర్ 3× :** ఈ మందు నొప్పిని త్వరగా తగ్గించును. నొప్పిగా నున్న చోట తడిచేసి నేట్రంమూర్ 3× పొడిని వేసి గట్టిగా రుద్దవలెను. పొడిలేనిచో మాత్రలను పొడిచేసి వాడవచ్చు. దీనిని లోపలికి 15 నిమిషముల కొక మోతాదు చొప్పున నొప్పి తగ్గువరకు వాడాలి.

**సైలీషియా 12× :** కోపముతో వుండు ప్రాణులు కరచినపుడు పై విధంగా లోపలికి, పైకి వాడాలి.

**ఫెర్రంఫాస్ 12×, కాలీమూర్ 6× :** కుట్టిన చోట వాపు, ఎరుపు, నొప్పి వున్నప్పుడు ఈ మందులను 15 నిముషములకొకసారి మార్చి–మార్చి వాడాలి.

# 8. దురలవాట్లవలన కలుగు దుష్ఫలితాలు (Bad Effects of Addictions)

మద్యం, నల్లమందు మొ॥వాటిని సేవించుట, పొగ త్రాగుట వల్ల కొన్ని దుష్ఫలిత ములు కలుగును. ఆ దుష్ఫలితాలను తొలగించుటకు క్రింది మందులు వాడాలి.

1. **కాలీఫాస్ 6X :** త్రాగుడు వలన కలుగు నిద్రలేమి, విశ్రాంతి లేకుండుట, అనుమానం, ప్రేలాపన లక్షణాలకు ఇది ఉపయోగకారి.
2. **నేట్రంఫాస్ 6X :** త్రాగుడు వల్ల కలుగు జీర్ణాశయ వ్యాధులకు ఈ మందు ఉపయోగపడును.
3. **కాల్కేరియాఫాస్ 3X, నేట్రంమూర్ 3X :** పొగత్రాగుట మాన్పుటకు ఈ మందులను రోజు మార్చి రోజు మార్చాలి. రోజుకు 4 – 5 మోతాదులు వాడాలి.
4. **కాలీఫాస్ 3X, నేట్రంఫాస్ 3X :** నల్లమందు సేవించుటను మాన్పుటకు వీటిని 2 గంటలకొకసారి మార్చి ఇవ్వాలి.
5. **మెగ్నీషియంఫాస్ 3X :** చాలాకాలము నుండి నల్లమందు తీసుకొనుచున్నచో దాని దుష్ఫలితాలను పోగొట్టుటకు దీనిని వాడాలి.

# వస్తుగుణ దీపిక
## (MATERIA MEDICA)

## 1. కాల్కేరియా ఫ్లోరికా / ఫ్లోర్
## Calcarea Fluorica/Fluor

**రసాయనిక నామం :**

కాల్షియం ఫ్లోరైడ్, కాల్కేరియా ఫ్లోరేటా.

**ఈ లవణం మన దేహంలో లభించు చోట్లు :**

ఎముకల పైభాగం, దంతముల ఎనామిల్, సాగెడు తంతువులు, చర్మం.

**ఈ లవణం ఉపయోగపడు రోగాలు :**

ఈ మందు ముఖ్యంగా ఈ వ్యాధులలో ఉపయోగపడును – రక్తనాళములు ఉబ్బుట, ధమనులలోను, సిరలలోను కంతులు ఏర్పడుట, మొలలు (piles) ఏర్పడుట, ఎముకలకు ముఖ్యముగా పండ్లకు పోషణ సరిగా లేకపోవుట, దెబ్బ తగులుట వల్ల ఎముకలలో అసామాన్యమైన వృద్ధి కనిపించుట, పొట్ట దిగజారి వ్రేలాడుచుండుట, గర్భకోశం స్థానం తప్పుట.

చిక్కని స్రావముతోనున్న దీర్ఘరొంపలకు/జలుబుకు, ముక్కులు దిబ్బడవేయుట, ముక్కులో కాయలు లేచుట (Adenoids), పిల్లలలో దురదతో కూడియుండు నులిపురుగు లక్షణాలు కనిపించుట, గండమాల (Scrofula), నంజు (Beri-beri), మలబద్ధకము (Constipation), మలబద్ధకముతో కూడిన తలనొప్పి, పంటి రోగములు, చెవిలో ధ్వనులు

**ఉద్రేకము / ఎక్కువగుట (Aggravation) :**

1. తేమ వాతావరణం.
2. చల్లగాలి.
3. విశ్రాంతి సమయం.

**ఉపశమనము / తగ్గుట (Amelioration) :**

1. శీతల ఉపచారములు.
2. వెచ్చని కాపడం.
3. తోముట/మర్దన (Massage).

**మందు లభించు పొటెన్సీ :**

3× నుండి 1000× వరకు.

**ఏ పొటెన్సీ ఎప్పుడు వాడాలి ?**

1. ఎముకల వ్యాధులలో పెద్ద పొటెన్సీలు.
2. ఎముక ఎదుగుదల, గుదము వద్ద కలుగు నెరద, మూలశంక/మొలలు, సిరలు ఉబ్బుట, గోరుచుట్టు (Whitlow), కణుపుజేష్ఠ, ఆసనములో పుండ్లు మొదలైన వ్యాధులలో దీనిని పైపూతగా వాడవచ్చు.

వినిపించుట, రాత్రులు మూత్రం అధికముగా వెళ్ళుట, మూత్రవిసర్జనకు తొందర కలుగుట, మూత్ర ద్వారములో మంట, పోటు ఉండుట, వృషణములు వాచుట, నీరు పట్టుట, విసర్పి (Erysipelas), కోరింతదగ్గు (Whooping cough), గొంతులో మంట, నొప్పి, గుటక సరిగా వేయలేకపోవుట మొదలగు లక్షణాలతోనున్న డిఫ్తీరియాకు, కింక వాతమునకు, ఉబ్బసమునకు ఈ మందు బాగా పనిచేయును.

ఈ మందును ఫెర్రంఫాస్‌తో కలిపి ఇచ్చిన ఉబ్బు వ్యాధి తగ్గును. రక్తనాళముల కంతులు మానును. దీనిని కాలీమూర్‌తో కలిపి వాడిన గుండెదడతో గుండె పెద్దదగుటను నివారించును.

3. ద్వాదశ లవణ చికిత్స వైద్య పితామహుడగు స్కూష్లర్ 12× ను సిఫార్సు చేసెను. 3×, 6× కూడా ప్రయోజనకారిగా ఉన్నట్లు గమనించబడింది.

**మయాజమ్** (Miasm) :

ట్యూబర్క్యులర్,
సిఫిలిటిక్.

**మానసిక స్వభావం :**

తేలికగా ఉత్తేజం పొందుట, ఉష్ణమును సహించలేకపోవుట.

**మందు పనిచేయు కాలం :**

సరిగా తెలియదు.

## మార్గదర్శక లక్షణాలు
## Guiding Symptoms

**1. మనస్సు (Mind) :** అధికముగా క్రుంగిపోవుట. ధనమునకు అధిక విలువ ఇచ్చుట. ధనం లేదని దుఃఖం. ధనం ఉన్నచో అది పోవునేమో అని అనుమానం – ఆ అనుమానమునకు ఎట్టి ఆధారం లేకపోవుట – ఎట్టి నిర్ణయం తీసుకొనలేకపోవుట.

**2. తల (Head) :** నూతనముగా జన్మించిన శిశువు కపాలములో కణత దగ్గర ఉన్న ఎముకల మీద రక్తపు కంతులు లేచుట. నడినెత్తి ఎముకలకు కముకు దెబ్బలు తగులుట. కపాల ఎముకల పైభాగమున నుండు పొర క్రింద రక్తపు కంతి కలుగుట. నడినెత్తిపై అంచులు గట్టిగనుండు పుండ్లు.

**తలనొప్పి** : మధ్యాహ్నము తర్వాత వికారముతో నుండు తలనొప్పి సాయంకాలమునకు తగ్గుట. మలబద్ధకం వలన తలనొప్పి. తలలో లాగుచున్నట్లు, పీకుచున్నట్లు ఉండుట, కిర్రుమను బాధాకర ధ్వని అగుట – దీనివలన నిద్రాభంగం కలుగుట.

**3. కళ్ళు (Eyes) :** కళ్ళు అగ్నికణముల వలె మిణుకు మిణుకు మనుట. కళ్ళ ముందు నిప్పురవ్వలు కనిపించుట. కంటి తెల్లనిభాగం (Cornea)పై మచ్చలు. కండ్లకలక. కనురెప్పపై కురుపులు. కళ్ళను వాడిన తర్వాత చూపు అల్లుకుపోవుట (Blurred vision). కనుగ్రుడ్ల నొప్పి – కళ్ళను మూసుకొని కనుగ్రుడ్లను నెమ్మదిగా నొక్కిన ఈ నొప్పి

తగ్గును. శుక్లము (Cataract) ఏర్పడుట అనగా కంటిలోని కటకపు పారదర్శకత్వం తగ్గుట. కనురెప్ప యొక్క మృదులాస్థి యందుండు చర్మ చమురు గ్రంథులు పెద్దవగుట. కొద్దిపాటి అంధత్వం (Blindness) ఏర్పడుట. కళ్ళ అధిక శ్రమ వల్ల చూపు మసకగానుండుట. కనురెప్పల కంతులు. కనురెప్పల అంచులు గట్టిగా నుండుటచే తెల్లగ్రుడ్డు (కార్నియా) పుండు పడుట.

**4. చెవులు (Ears) :** కర్ణభేరి యందు కాల్కేరియా సంబంధమైన పదార్థములు కూడుట. చెవులు గింగురుమనుట, చెవి నుండి చీముకారుట, మాట సరిగా వినబడకపోవుట, చెవిపోటు. (ఎముకపై నుండు పొర వ్యాధికి గురైనచో చెవి వెనుకనుండు ఎముక వ్యాధి)

**5. ముక్కు (Nose) :** శిరస్సు నందు జలుబు – తుమ్మాలనిపించుట, కాని తుమ్ము రాదు. ముక్కు జలుబుచే దిబ్బడ వేయుట – శ్లేష్మం పొడిగానుండుట – ముక్కు పుండుపడి దుర్వాసనగల స్రవం స్రవించుట (K.P.) – స్రావం విస్తారముగ, చిక్కగ, ఆకుపచ్చగ, ముద్దగ, పసుపుపచ్చగ నుండుట – ముక్కు ఎముకల వ్యాధులు – ముక్కు ఎముకల పెరుగుదల – మృతి చెందిన ముక్కు ఎముక నుండి దుర్వాసన వచ్చుట – ముక్కు వెనుక భాగమందును, గొంతుక యందును ఎడినాయిడ్స్ ఎదుగుట – పసిపిల్లలందు అపాయకరమగు లస్కా టాన్సిల్సు, ముక్కు రంధ్రముల వెనుక భాగానగల జిగురుపొర/ఆమత్వక్కు విపరీతముగ ఎదుగుట (C.P.).

**6. ముఖం (Face) :** నొప్పి/పంటి నొప్పితో కూడిన దౌడ వాపు. దవుడ ఎముకపై గట్టిగా నుండు వాపు. చల్లదనంచే కలుగు చిన్న పుండ్లు. పెదవులపై హెర్పస్ వంటి పుండ్లు. దౌడ ఎముక, కోర దంతముల పుప్పి – నల్లని దుర్వాసన గల రక్తం వంటి స్రావం స్రవించుట. బయటి వైపున ఎముక ఉబ్బుట. పెదవులపై చీలికలుండుట.

**7. నోరు (Mouth) :** చిగురు కురుపు (Gum boil). దవుడపై గట్టి వాపు. దవుడ ఎముకపై రాతివలె నుండు గట్టి వాపు. చలివల్ల నోటి మూలలందు పుండ్లు. నోరు ఎక్కువ పొడిగానుండుట. వంశానుగతపు సవాయి రోగం (Syphilis) వల్ల నోటిలోను, గొంతులోను పుండ్లు పడుట.

**8. నాలుక (Tongue) :** నాలుక పగుళ్ళు (Cracks) – నొప్పి ఉండవచ్చు, లేకపోవచ్చు. నాలుక వాచి గట్టిపడుట (Sil).

**9. దంతములు (Teeth) :** చిన్న పిల్లలలో ఆలస్యంగా దంతములు వచ్చుట. దంతములపై నుండు పింగాణీ పదార్థం (Enamel) చెడిపోవుట/తక్కువగా నుండుట. దంతములు అస్వాభావికముగా వదులుగానుండుట. నొప్పి ఉండవచ్చు లేకపోవచ్చు. దంతములకు పోషణ సరిగా లేకపోవుట. ఏదైనా ఆహారం దంతములకు తగిలిన పంటినొప్పి వచ్చుట. దంతములు వదులుగా నుండుటచే కలుగు పంటి నొప్పి.

**10. గొంతు/కంఠం (Throat) :** శ్వాసనాళం వరకు వ్యాధిగ్రస్తమైన వచ్చు డిఫ్తీరియా. కొండనాలుక (Uvula) పొడవగుట వల్ల గొంతు కండరముల బిగి సడలుట, గొంతులో గిలిగింతలు. కొండనాలుక పొడవై గొంతులో గిలిగింతలు పెట్టుట వల్ల దగ్గు వచ్చుట. గొంతు పొడిగాను, మంటగాను వుండుట. వేడి పానీయముల వల్ల మంట తగ్గుట. ఉదయాన పసుపు పచ్చని, ముద్ద వంటి కళ్ళెను కాండ్రించి ఉమ్మివేయుట. గొంతు బొంగురుపోయి, గురకగా నుండుట. టాన్సిల్సు వాచి గట్టిపడుట. గొంతులో బిగి తగ్గుట (N.M.).

**11. జీర్ణకోశం (Stomach) :** జీర్ణం కాని ఆహారం వాంతియగుట – కళ్ళె/గల్లు (Mucus)ను కాండ్రించుటచే ఎక్కిళ్ళు వచ్చుట –ఎక్కిళ్ళచే నీరసం–పగటిపూట ఎక్కిళ్ళు మరలా – మరలా వచ్చుట. కడుపు వాయుపూరితముగా నుండుటచే పిత్తులు/అపాన వాయువు వెలువడుట. కాలేయమందు (Liver)తీవ్రమగు నొప్పి–కదలికచే ఆ నొప్పి తగ్గుట.

**12. కడుపు/పొత్తికడుపు/ఉదరకుహరం (Abdomen) :**

**మలబద్ధకం :** ప్రేగులు తమ అశక్తత వల్ల మలమును విసర్జించుటకు కష్టపడవలసి వచ్చుట.

**గుదం దగ్గర పగుళ్ళు :** గుదం దగ్గర పగుళ్ళు ఏర్పడి నొప్పిగా ఉండుట.

**మొలలు :** రక్తస్రావంతో కూడిన మొలలు (Haemorrhoids) - పైకి కనిపించని మొలలు – వీటివల్ల తరచుగా నడుము నందు, సాధారణముగా వెన్నుపాము అడుగుపూస వరకు నొప్పిగా నుండుట, మలబద్ధకం ఏర్పడుట – తలలో రక్తపు ఒత్తిడిని పెంచునట్టి మొలలు.

★ నుసిపురుగులు (pinworms) ఉన్నట్లుగా గుదం దురదగా వుండుట.

★ కడుపు కుడివైపున, రొమ్ము ఎముకల క్రింది భాగమున నొప్పిగా నుండుట – అటువైపు పడుకొన్న నొప్పి అధికమగుట.

★ ప్రేవుల క్రింది భాగం అధిక వాయు పూరితమగుట.

★ గౌటు[1]తత్త్వం కలవారిలో విరేచనాలు.

**13. మూత్రావయవములు (Urinary Organs) :** మూత్రం అధిక పరిమాణంలో – తరచు మూత్ర విసర్జన వాంఛ. ముదురు రంగులోనున్న, దుర్వాసనతో నున్న కొద్దిపాటి మూత్రం. మూత్రంలో శుక్లం, ప్రోస్టేటు గ్రంథి స్రావం కలిసిపోవుట. మూత్రవిసర్జన సమయమున అంగం చివర మంట, పోటు.

**14. పురుష జననేంద్రియాలు (Male Sexual Organs) :** వృషణాలు/బీజాలు (Testes) శుష్కించుటతో వీర్యం (Semen), ప్రోస్టేటు ద్రవం నిరంతరం కొద్దికొద్దిగా స్రవించుట. వృషణాలు గట్టిపడి ముడులవలె నుండుట.

*1. **గౌటు :** సుద్ద వంటి పదార్థం చేరుటవల్ల కాలి బొటనవ్రేళ్ళ కీళ్లు మొదలగునవి వాచి ఎక్కువ నొప్పిగా ఉండుట.*

★ **బుడ్డ** (Hydrocele) : బీజాలలో నీరు చేరి పెద్దగా/బుడ్డగా నగుట.

★ లైంగిక కోరిక ఉంటుంది. కాని సంభోగం సరిగా చేయలేదు.

**15. స్త్రీ జననేంద్రియాలు (Female Sexual Organs) :**

**బహిష్టు** (Menses) : బహిష్టులో స్రావం ఎక్కువగా వెలువడును. యోని యందు సిర కంతులు ఏర్పడును. గజ్జలలో లాగుచున్నట్టి నొప్పి వుండును. అది తొడలలోనికి వ్యాపిస్తుంది.

**కుసుమ** (Leucorrhoea/Whites) : కుసుమ ఎక్కువగా ఉండి ధాతువులను తినివేయును. గర్భకోశ ద్వారం (Cervix) ఒరియునట్లు చేయును.

**గర్భిణి :** ఇది గర్భిణీకి మంచి మందు. గర్భిణీకి దీనినిచ్చిన మలబద్ధకంను నివారించును. ఆమె ఆయాసపడకుండా, సుఖంగా ప్రసవించును. ఇది ప్రసవాంతరపు బాధలను నివారించును. గర్భాశయం సరిగా ముడుచుకొనునట్లు చేయును. దీనిని C.P., K.P., M.P. లతోపాటు వాడాలి. అలా చేసినచో మరలా మరలా గర్భస్రావం కాకుండాను, సుఖప్రసవం జరుగునట్లును చేయును.

గర్భకోశమందు కంతిని, స్తనములందు గట్టి ముడులను, గట్టిగానున్న సవాయి పుండును ఈ మందు నివారించును.

**16. శ్వాసావయవములు (Respiratory Organs) :** స్వరపేటిక (larynx) గులగా, పొడిగా, బొంగురుగానుండుట. గొంతులో ఏదో వస్తువు ఉన్నదను భావనతో దగ్గి కాండ్రించుట. బిగ్గరగా చదివిన తర్వాత గొంతు బొంగురుపోవుట. నిజమైన క్రూప్ వ్యాధికి ముఖ్యమైన మందు. ఉబ్బస వ్యాధిలో బాగా కష్టపడిన తర్వాత పచ్చని రంగు కళ్ళె చిన్న ముద్దగా పడుట – దగ్గువచ్చుట. కొండనాలుక పెద్దదగుటచే పరుండునపుడు స్వరపేటిక గిలిగింతలు పెట్టినట్లుం డుట. ఎపిగ్లాటిస్[1] మూసుకుపోయినట్లుండి ఊపిరిపీల్చుట కష్టముగానుండుట.

**17. రక్తప్రసరణావయవములు (Circulatory Organs) :** ఈ మందును F.P.తో కలిపి వాడిన ధమనుల ఉబ్బు వ్యాధి, రక్తనాళముల కంతులు మానును. **గుండె :** ఈ మందును K.M.తో కలిపి వాడిన గుండెదడతోపాటు గుండె పెద్దదగుటను నివారించును.

**సిరలు :** ఈ మందు సిరల పుండ్లను మాన్పును. ఉబ్బిన సిరలకు ఇది ప్రధానమైన మందు.

**18. మెడ (Neck) :** మెడ మీద, మెడ ప్రక్కల గ్రంథులు రాతివలె గట్టిగానుండుట – చిన్న చిన్న థైరాయిడ్ గ్రంథులు ఏర్పడుట.

*1. **ఎపిగ్లాటిస్** (Epiglottis) : ఉపజిహ్వ. నాలుక వెనుకనుండు పల్చని ఆకువంటి ఉపాస్థి. (మింగునపుడు ఇది శ్వాసనాళ (larynx) ద్వారమును మూయును. అందుచే ఆహారపానీయములు శ్వాసనాళములలోనికి పోజాలవు.*

**19. వీపు (Back) :** వీపు నొప్పి, వెన్నెముక క్షోభను అధికం చేయుట – దీనివల్ల బలహీనమైన, లాగుచున్నట్టి, కృశింపజేయు నొప్పి.

**20. నడుము (Small of back) :** నడచుటకు ప్రారంభించినపుడు నడుమునొప్పి ఎక్కువగా ఉండి కొంత దూరం నడచిన తర్వాత తగ్గుట – ఇది దీర్ఘకాలంగా ఉండుట.

నడుము క్రింది భాగాన (Sacrum) నొప్పి – మండుతున్నట్లుండే నొప్పి – మలబద్ధకం, బెణుకువల్ల కలుగు నడుము నొప్పి.

**21. కాళ్ళు చేతులు (Extremities) :** మణికట్టు వెనుక వైపున లింపు గ్రంథి పెద్దదగుట లేక ద్రవంతో కూడిన కంతులు పెరుగుట – గోరుచుట్టు, కణుపుజెష్ఠ (3X) – చేతి వ్రేళ్ళలోను, కీళ్ళలోను గౌటు సంబంధమైన వాపు (M.P.) – పుట్టు వ్రణం లేక ఎముక కురుపుచే ఎముక వాచుట. **మోకాలినొప్పి :** మోకాలి కీలు వాచుట – కీలు వద్ద ద్రవమును స్రవించెడి పొర వాపు – ఈ వాపు దీర్ఘకాలం నుంచి ఉండుట – నడచునపుడు కీళ్ళ యందు శబ్దమగుట – వ్రేళ్ళ ఎముకలు సులభముగా స్థానం తప్పుట – ఎముకలకు చీముపట్టుట – వెన్నుపాము/రెక్క గూళ్ళపై ఎముక సంబంధమైన కంతులు – మోచేతి కీలు ఉబ్బుట – కీళ్ళలో శబ్దం – కీళ్ళ వద్ద నుండు ద్రవం తక్కువగా ఉన్నదని సూచించుట – కీళ్ళ పొర వాచుట (దీర్ఘకాలపు) – ఎముక సంబంధమైన బుడిపెలు – ఎముక పెరుగుట (పుప్పితో/పుప్పి లేకుండా) గాయాలు/దెబ్బలచే.

**22. నాడీమండలము (Nervous System) :** రోజంతయు, ముఖ్యంగా ఉదయాన బలహీనంగా ఉండుట – అలసట.

**23. నిద్ర – కలలు :** ఆపదలు రాబోతున్నట్టి స్పష్టమైన కలలు – క్రొత్త దృశ్యాలు/ప్రదేశములకు సంబంధించిన కలలు.

**24. జ్వరం (Fever) :** ఒక వారం లేక అంతకంటే ఎక్కువ కాలం ఉండుట – దప్పిక – పొడిగా ఉండుట – నాలుక గోధుమ రంగులో.

**25. చర్మం (Skin) :** చర్మం దళసరిగాను, గట్టిగాను ఉండుట. అరచేతుల చర్మం చీలినట్లుండుట. చర్మం చేప పొలుసులవలె నుండుట. చీము, రసితో కూడిన కురుపులు (Sil, C.S.). ఇది చాలా కాలం నుంచి వున్న సిరల పుండ్లు మాన్పును. **గజ్జి :** సిరలలో రక్తాధిక్యతచే వచ్చు గజ్జి తేమవలన ఎక్కువగును – రాత్రిపూట తగ్గును – మూలశంక (Piles) తర్వాత గుదమువద్ద గజ్జి వచ్చుట. చదునుగ/కొలది ఉబ్బెత్తుగ, నూతనముగ పెరుగునట్టి పసుపు పచ్చని వర్ణం గల పొలుసులతో కూడిన గజ్జి – గోరుచుట్టు.

**26. ధాతువులు (Tissues) :** గ్రంథులు రాతివలె గట్టిగా అగుట. ఇవి కంటిరెప్ప మృదులాస్థి యందు, మణిబంధ మందు లేక స్తనమందు ఏర్పడును – ఇవి పైకి గట్టిగాను,

లోపల మెత్తగాను ఉండును – మోకాలి ఎముకలపై గట్టిగా, గరుకుగా నుండు ఉబ్బులేర్పడుట – గుండె జబ్బుచే శరీరానికి నీరుపట్టుట – రక్తక్షీణత – వాపులు.

★ ముడులు/నాడీ కణముల సముదాయం ఏర్పడుట.

★ సాగునట్టి తంతువులు అధికముగా సాగుటవల్ల జిగురుపొర కంతులు ఏర్పడుట.

★ మొండి పుండ్లు – ఎముక/ఎనామిల్ వాపు – ఎముక ఉపరిభాగం చెమర్చి వెంటనే గట్టిపడి ముడిరూపం దాల్చుట – ఎముకల నుండి చీముకారుట – పిప్పి, ధాతువు మృతిచెందుట (ఇది మంటతోను, త్రవ్వుచుండునట్టి నొప్పి, వేడిమితో ఉండుట) – పలచని, మంట కలిగించు, రసి వంటి కఫం.

## 2. కాల్కేరియా ఫాస్ఫారికా / కాల్కేరియాఫాస్ / కాల్కుఫాస్
## (Calcarea Phosphorica / Calcarea Phos / Calc Phos)

**రసాయనిక నామం :** కాల్షియం ఫాస్ఫేట్, ఫాస్ఫేట్ ఆఫ్ లైమ్.

**ఈ లవణం ఆవశ్యకత :** ఈ లవణం దేహం సరిగా ఎదుగుటకు, అది బాగా పుష్టి చెందుటకు అవసరం.

**ఈ లవణం మనదేహంలో లభించు చోట్లు :** ఇది మన దేహంలో రక్తం, లాలాజలం, జీర్ణరసాలు, ఎముకలు, దంతములు మొ॥ వాటిలో ఉండును.

**ఈ లవణం ఉపయోగపడు రోగాలు :** ఆహారం బాగా తీసుకొన్నా ఒంటబట్టని పిల్లలకు ఈ మందు సంజీవని వంటిది. ఇది చిక్కిపోయి నిలవలేని పిల్లలకు, వెన్నెముక బలహీనంగా ఉండి వంగిపోయిన, ముఖ్యంగా ఎడమకు వంగిన పిల్లలకు, మెడ చాల బలహీనంగా ఉండి, తలకు ఆధారమివ్వలేని పిల్లలకు, గుంటలు పడి వదులుగా నున్న పొట్టగల పిల్లలకు, నాభి / బొడ్డు నుండి రక్తం స్రవించు శిశువులకు, దొడ్డికాళ్ళు (రికెట్స్) గల పిల్లలకు, మాడు త్వరగా పూడని పిల్లలకు ఈ మందు బాగా ఉపయోగపడును.

**ఉద్రేకం / ఎక్కువగుట (Aggravation):** వాతావరణం మార్పు, శీతల వాతావరణమునకు గురియగుట, రాత్రి మంచు కురియుట, చల్లదనం, తేమ, కదలిక, మానసిక శ్రమ, బాధను గురించి ఆలోచించుట.

**ఉపశమనం / తగ్గుట (Amelioration):** ఎండా కాలం, వెచ్చని వాతావరణం, వేడి, విశ్రాంతి, పడుకొనుట, పొడిగాలి.

**మందు లభించు పొటెన్సీ :** 3× నుండి 200× వరకు.

**ఏ పొటెన్సీ ఎప్పుడు వాడాలి?**

★ ముసలివారికి : 12×

★ దంతములు వచ్చు

పిల్లలకు దంతములు వచ్చు సమయమున వచ్చు విరేచనములకు, ఇతర సమస్యలకు ఇది మంచి మందు. వేసవి కాలమున చిన్న పిల్లలకు కలుగు వాంతులకు, విరేచనములకు, కలరాలో వచ్చు విరేచనములకు ఈ మందు బాగా ఉపయోగపడును.

తల్లిపాలు బిడ్డకు రుచించనిచో, పాలిచ్చు తల్లి ఈ మందు తీసుకొన్న పాలరుచి మారి బిడ్డ ఆ పాలను ఎంతో రుచిగా త్రాగును. అంతే కాకుండా శిశువుకు పాలిచ్చు తల్లికి ఈ మందు నిచ్చిన పాల ధారను పెంచును.

మట్టి, రాళ్ళు, సున్నం, బలపాలు, బియ్యం తినే పిల్లలకు, గర్భిణీస్త్రీలకు ఇది మంచి మందు. జ్ఞాపకశక్తి తగ్గుట, మానసిక శ్రమను తట్టుకోలేక పోవుట, చికాకు, విసుగు వున్నప్పుడు ఈ మందు బాగా ఉపయోగపడును. రాత్రిపూట నిద్రలో అరచునట్టి, నుసి పురుగులతో బాధ పడుతున్నట్టి పిల్లలకు ఇది మంచి మందు.

లేత ప్రాయం కలిగిన వారి రక్తక్షీణతకు, వెనువెంటనే పిల్లలను కనుచూ చాలా కాలం స్తన్య పానమిచ్చు తల్లుల నీరసానికి ఇది చక్కని మందు.

పిల్లలకు, బాలింతలకు, మూత్ర పిండపు రాళ్ళు కరిగించుటకు : 3× (ఇందుకు పెద్ద మోతాదులు నిరుపయోగమైనవి, హాని కరమైనవి)

**మందు పనిచేయు కాలం :** 60 రోజులు.

**మయాజిమ్ :** సోరా

**స్వభావం :** చలిని సహించలేక పోవుట.

**హెచ్చరిక :**

1. నరముల జబ్బుతో చిరచిరలాడువారికి పెద్ద పొటెన్సీలు వాడరాదు.
2. ఈ మందును ఎక్కువ కాలం తీసుకొంటే మూత్ర పిండాలలో రాళ్ళు ఏర్పడే అవకాశం ఉందనీ, తద్వారా నొప్పి వస్తుందని స్క్యూష్లర్ చెప్పారు. కనుక ఈ మందును **అవసరాన్ని బట్టి పొదుపుగా వాడుకోవాలి.**

ఆడపిల్లలకు మొటిమలు వస్తున్నా, రజస్వలలో కండరాలు వాటంతటవే అదురుచున్నా, వివాహితులైన యౌవనులకు స్కలన దోషాలున్నా, స్త్రీల జననేంద్రియం ఉద్రిక్తతకు గురగుచున్నా, ముష్టిమైథునమునకు అలవాటు పడియున్నా ఇది నివారించును. చీము వస్తున్నా, ముక్కులో కాయలు పెరుగుచున్నా, దీర్ఘకాలంగా నున్న టాన్సిల్స్ వాపుకు, గొంతు నొప్పికి దీనిని ఆలోచించాలి.

స్త్రీలలో గర్భసంచి వుండవలసిన చోట లేనప్పుడు, గర్భసంచి నొప్పులతోపాటు నడుము నొప్పి వస్తున్నప్పుడు, యోనిలోపల మంటగా నున్నప్పుడు, బహిష్టు త్వరత్వరగా వచ్చి నీరసించి పోవునపుడు, ఋతుస్రావం, కుసుమ విస్తారముగా నున్నప్పుడు ఈ

మందు బాగా ఉపయోగపడును. రక్తం క్షీణించిన గర్భిణీస్త్రీలకు ఇది టానిక్ వంటిది. ఇది ప్రసవకాలపు ప్రసవాంతరపు నొప్పులను తగ్గించును.

మూత్రంలో ఫాస్ఫేట్స్ పోవుచున్నా, గాల్‌తిత్తి (పిత్తకోశం) యందు రాళ్ళు ఏర్పడుచున్నా ఇది మంచి మందు. రాళ్ళు ఏర్పడిన వాళ్ళ నొప్పికి, అవి క్రొత్తగా ఏర్పడకుండా చేయుటకు ఇది ఉపయోగపడును.

మోకాలు నందు నీరు కనిపించినా, మోకాలి చిప్పయందు నీరు పట్టినా దీనిని సూక్ష్మ మోతాదులో వాడిన బాగా పనిచేయును.

ఊపిరితిత్తుల క్షయ వ్యాధికి (శుష్కించుట, రాత్రులందు చెమట పట్టుట, నోటి నుండి రక్తస్రావం కలుగుట, విరేచనములు మొ॥ లక్షణాలు) ఇది తక్కువ పొటెన్సీలో మంచి మందు. శ్వాసనాళ శాఖల వాపు చాలా కాలం నుంచి వున్నా, వ్రణములు, పుండ్లతో కూడిన వ్యాధి ఉన్నా దీనిని ఆలోచించాలి.

పదాలు తప్పుగా వ్రాయువారికి, వ్రాసిన దానినే మరలా వ్రాయువారికి ఇది బాగా ఉపయోగపడును.

శరీరంలో మెత్తని కంతులు ఏర్పడుట, కన్ను, ముక్కు, నోరు, యోని మొదలైన వాటి నుండి ఆకుపచ్చ / తెల్లని స్రావం వెలువడునపుడు ఇది ఉపయోగకారి.

బాహ్యాచర్మంపై పక్కులు కట్టుట, చీమలు మొ॥వి ప్రాకుచున్నట్లుండుట, చల్లగ నుండుట, తిమ్మిరిగ నుండుట మొ॥ లక్షణాలలో ఇది బాగా పనిచేయును. చర్మంపై ఏర్పడు గుండ్రని మచ్చలను తగ్గించుటకు ఇది ఉపయోగపడును.

## మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు (Mind) :**

★ జ్ఞాపకశక్తి క్షీణించుట.

★ మానసిక ఆందోళన, బాధలు.

★ మానసిక శ్రమ చేయలేక పోవుట.

★ పిల్లలు చిరచిరలాడు స్వభావం, మందబుద్ధి కలిగియుండి విషయమును నెమ్మదిగా అర్థం చేసుకొనుట.

★ ప్రేమభంగం, విచారం వలన వచ్చు రోగములు.

★ దుఃఖం, నిరాశ, బాధలో రోగి ఒంటరిగా ఉండాలనుకొనుట.

★ ఇంటి దగ్గర ఉండాలని తొలుత తలంచుట, తర్వాత బయటికి పోవాలనుకొనుట.

**2. తల (Head) :**

**తలనొప్పి :**

★ రక్తక్షీణత, విరేచనాల వలన తలనొప్పి వచ్చుట – వాతావరణ మార్పు వలన చెవుల వెనుక భాగమున, నడినెత్తిపైన నొప్పి వచ్చుట – మానసిక శ్రమ వలన తలనొప్పి – రజస్వినులగు విద్యార్థినులలో విరేచనములతో కూడిన తలనొప్పి – జెల్లీలు, పుల్లని వస్తువులు తినుట వల్ల వచ్చు విరేచనములు – చన్నీటి స్నానానంతరం తలనొప్పి – అపాన వాయువు వెలువడిన తరువాత తలనొప్పి – ముసలివారిలో తలతిరుగుడు (K.P.) ఆకస్మికముగ తుమ్మిన తలనొప్పి తగ్గుట – తర్వాత ముక్కు రంధ్రములు పుండు పడుట – తలపైన వేడిగా ఉండుట.

★ దీర్ఘకాలముగా తలయందు నీరు చేరుటచే పెద్దదిగా నుండుట (Hydrocephalis)

★ తలపైన పుండ్లు దురదతో ఉండుట (తరుణవ్యాధి / దీర్ఘవ్యాధి)–అచ్చటచ్చట బట్టతల గుర్తులు.

★ పునికె / మాడు / బ్రహ్మరంధ్రం చాలాకాలం మానక పోవుట వల్ల తల మెత్తగా నుండుట.

★ తలలోను, పైన చల్లగా ఉన్నట్టి భావన.

★ పిల్లలు నిటారుగ నిలవలేక పోవుట.

**3. కళ్ళు (Eyes) :**

★ రెటీనా[1]కు పక్షవాతం వచ్చుట వల్ల చూపు మసకగా నుండుట / గ్రుడ్డితనం వచ్చుట – కేటరాక్ట్.

★ స్క్రొప్యులా[2], రికెట్స్ (దొడ్డికాళ్ళు) తత్త్వంగల చిన్న పిల్లలందు పుట్టుక నుండియు చూపు మసకగా నుండుట.

★ కనురెప్పల ఈడ్పులు – మెగ్నీషియంఫాస్ పనిచేయునపుడు ఇది బాగా ఉపయోగపడును.

★ **కేటరాక్టు** – వెలుతురు ఏమాత్రం చూడకలేకపోవుట (F.P) – కంటి ముందు మిణుకు మిణుకు మనుట / నిప్పు వంటి వలయాలు కనిపించుట – గ్యాస్‌లైట్‌ను చూడలేక పోవుట.

★ **కార్నియా[3]** మీద పుండ్లుండుట.

---

*__1. రెటీనా (Retina) :__ కనుగ్రుడ్డు లోపల వెనుక భాగమున నుండు ఛాయాగ్రాహకమగు పల్చని పొర. దీనిమీద మనం చూచెడి వాటి బింబం పడి, నరముల ద్వారా మెదడుకు తెలుపబడును*

*__2. స్క్రొఫ్యులా (Scrofula) :__ గ్రంథులు పెద్దవగుటతోను, క్షయ స్వభావముతోను నుండు తత్త్వము*

*__3. కార్నియా (Cornea) :__ కాచబింబం / శుక్లపటలం – ఇది కనుగుడ్డు ముందు భాగమందుండును. ఇది గట్టిగ నుండు పారదర్శకమగు ద్రవంగల భాగం.*

★ మెల్లకన్ను.
★ కళ్ళ నుండి నీరు కారుట.
★ కళ్ళ కలక.
★ చిన్నపిల్లలలో దంతములు వచ్చునపుడు కళ్ళు వాచి పొడిగా నుండుట.

**4. చెవులు** (Ears) :

★ చెవి చుట్టూ నుండు ఎముకలు నొప్పిగాను, బాధగాను ఉండుట.
★ చెవి తమ్మెలు (వెలుపలి చెవులు) చల్లగా నుండుట.
★ చెవి రంధ్రమందు గుబిలి.
★ చెవి నుండి చీము / రసి కారుట.
★ చెవి నొప్పి, వాపు, మంట, దురద.
★ చెవులలో పొడుచుచున్నట్లు శబ్దాలు, ధ్వనులు.
★ చెవులు దిబ్బడ వేయుట.
★ చెవులకు ఏమీ వినిపించక పోవుట – వాపు వల్ల బుడగల వంటి శబ్దాలు – వెంటనే వినికిడి మెరుగవుట.
★ కర్ణనాళం నుండి వాసనలేని స్రావం, దానిలో తెల్లని పొక్కులు / పొరలు, తైలయుతమైన మెత్తని పిండి వంటి పదార్థం.
★ చెవిరంధ్రం ఎర్రగా వాచినట్లుగా, దురదగా, వేడిగా, సున్నితముగా ఉండుట.
★ రోగి శ్లేష్మ గ్రంథుల బాధలతో ఉండుట.

**5. ముక్కు :**

★ ముక్కులో సీమశుద్ధ, బలపం, పిక్క మొ॥ అన్య పదార్థమేదో (Foreign body) వున్నట్టి అనుభూతి.
★ ముక్కు కొన మంచువలె చల్లగ నుండుట.
★ పాలిపోయిన పిల్లలలోను, రక్తక్షీణతగల వారిలోను జలుబు చేయు స్వభావం అధికముగా నుండుట.
★ ముక్కులోపల వ్రేలాడెడి కాయలు (Polyps) ఉబ్బి యుండుట, తుమ్ములు అధికముగా వచ్చుట.
★ ముక్కు నుండి తెల్లని, చిక్కని స్రావం స్రవించుట – ఇది ఆరుబయట గాలిలో ఎక్కువగుట.
★ ముక్కు రంధ్రములు వాచి పుండు పడుట.

★ ముక్కు కొనవద్ద, ఇరువైపుల సైనస్ బాధ ఎక్కువగా నుండుట.

★ మధ్యాహ్నం తర్వాత ముక్కు నుండి రక్తస్రావమగుట.

★ నుదురునందు తలనొప్పి, ముక్కు మొదటి యందు నొక్కుచున్నట్లుండుట, ఒక వైపున / రెండు వైపుల కన్నుల చుట్టూ నొప్పి యున్నప్పుడు ఈ మందు బాగా ఉపయోగపడును.

★ ముక్కు పుండుపడి, దుర్వాసనగల స్రావం వెలువడునపుడు ఈ మందును కాల్కేరియా ఫ్లోరుతో కలిపి వాడవలెను.

★ శ్లేష్మం / చీమిడిలో పొక్కులు, అప్పుడప్పుడు రక్తం ఉండుట.

**6. ముఖం :**

★ వయస్సు వచ్చిన పిల్లలలో ముఖ్యంగా ఆడపిల్లలలో ముఖం నిండా రాగి రంగు వంటి మొటిమలు అధికంగా ఉండుట.

★ ముఖంపై చల్లని చెమట.

★ చర్మంపై గుండ్రని మచ్చలు.

★ శరీరం గోధుమరంగులో / పచ్చగా వుండుట.

★ ముఖం పాలిపోయి, మురికిగా, జిడ్డుగా నుండుట.

★ పై దవడ ఎముక నొప్పిగా ఉండి రాత్రిపూట ఉద్రేకించుట.

★ చెవి దగ్గరి గ్రంథులు, క్రింది దవడ గ్రంథులు వాచుట.

★ చెవినొప్పి – చెవినొప్పివల్ల ముఖంలో నొప్పి ప్రాకుచున్నట్లుండుట.

★ దీర్ఘకాలంగా క్షయ సంబంధమైన చర్మవ్యాధి (గుండ్రని మచ్చలు) ఉండుట.

★ సూర్యరశ్మి సోకిన ఎక్కువగు పసుపు పచ్చ – నీరు కావి మచ్చలు.

**7. నోరు** (Mouth) **:**

★ ప్రాతః కాలమున నోటిలో చేదు రుచి – తలనొప్పితో.

★ టాన్సిల్స్ వాపు వల్ల నోరు తెరచుట కష్టముగా నుండుట.

★ పై పెదవి వాచి బాధాకరముగా నుండుట.

**8. నాలుక** (Tongue) **:**

★ నాలుక వాచి, గట్టిపడి, మొద్దుబారి, బిర్రబిగిసి, తెల్లగ చీలి యుండుట – దానిపై చిన్న పుండ్లు / పొక్కులు.

★ నాలుక చివర పుండ్లు.

★ చిగుళ్ళు వాచి, పాలిపోయి, మంటగా, నొప్పిగా ఉండుట.

**9. దంతములు** (Teeth) :

★ దంతములు నిదానముగా పెరుగుట.

★ దంతములు రాత్రిపూట ఎక్కువగా సలుపుట.

★ పంటినొప్పి చల్లని / వెచ్చని వస్తువుల వల్ల, నమలుట వల్ల ఎక్కువగుట – అవి త్వరగా పుచ్చిపోవుట.

★ దంతములు వచ్చునపుడు ఆకుపచ్చని విరేచనాలగుట.

★ దంత సమస్యలకు ఇది మంచి మందు.

★ పండ్లు వచ్చు సమయమందు కలుగు ఈడ్పులు / కంపములకు మెగ్నీషియంఫాస్ తర్వాత ఈ మందు ఉపయోగపడును.

★ పంటినొప్పి, చీల్చునట్టి, తొలుచునట్టి నొప్పితో – రాత్రిపూట ఈ నొప్పి అధికమగుట.

★ చిగుళ్లు నొప్పిగా, వాపుగా ఉండుట / పాలిపోయిన చిగుళ్లు.

**10. గొంతుక** (Throat) :

★ బాహ్య గ్రంథులు నొప్పిగా యుండుట.

★ రాత్రింబవళ్ళు బొంగురుగా నుండుట.

★ స్వరపేటిక యందును, నాలుక వెనుక భాగమందును మంట.

★ కంఠం, ఛాతీ యందు సూదితో కుట్టుచున్నట్లుండుట.

★ టాన్సిల్స్ వాచుట, వాటిపై పుండ్లు పడుట – ఇతర పానీయములను త్రాగునప్పటి కన్నా నీటిని త్రాగునపుడు గొంతునొప్పి ఎక్కువ.

★ సాయంకాలమున దగ్గుతో కూడిన గొంతునొప్పి ప్రారంభమై, రాత్రి పడుకొన్న తర్వాత ఎక్కువై ప్రాతఃకాలమున ఆహారం తీసుకొనునపుడు నొప్పి అదృశ్యమగును.

★ గొంతు నుండి జిగురువంటి స్రావమును తరచుగ కాండ్రించుట.

★ మాట్లాడునపుడు నిత్యం గొంతుకను సర్దుకొనుచు కాండ్రించుట – గొంతు వ్యాధి యందు గొంతుకు తగిన బిగి లేకపోవుట.

★ నిత్యం మాట్లాడువారి / పాటలు పాడువారి గొంతు నొప్పికి మంచి మందు.

★ కొండనాలుక వాచి ఎర్రగా నుండుట.

★ దీర్ఘకాలంగా ఉన్న టాన్సిల్స్ వాపు, గొంతులో మంట, నొప్పి – మ్రింగునపుడు ప్రతి వైపు నుండి అధిక నొప్పి.

**11. జీర్ణకోశం :**

★ గుండె మంట.

★ అసాధారణమైన ఆకలి ఉన్నప్పటికీ జీర్ణం చేసుకొనలేక పోవుట.

★ జీర్ణకోశం వాయుపూరితముగా నుండుట.

★ త్రేపుల వల్ల జీర్ణాశయ బాధలు తాత్కాలికముగా తగ్గుట.

★ జీర్ణకోశము నొక్కిన పుండువలె నుండుట.

★ భోజనానంతరం కడుపు వాయుపూరితమై బరువుగా వుండుట.

★ అజీర్ణం వల్ల తలనొప్పి.

★ భోజనం చేయుటవల్ల వాయువు పైకి త్రేపుల రూపంలో వచ్చి నొప్పి తాత్కాలికముగ తగ్గుట.

★ ఉపవాసమున్నపుడు నొప్పి వెన్నుపాముకు చేరుట.

★ చంటి పిల్లవాడు ఎల్లప్పుడు పాలను త్రాగాలనుకొనుట – తరచుగా, తేలికగా డోకు (వాంతి) చేసుకొనుట.

★ చన్నీళ్ళు త్రాగినా, ఐస్క్రీము తిన్నా, భోజనం చేసినా నిస్త్రాణ, నొప్పి, వాంతి, తలనొప్పి, విరేచనాలు అధికమగుట.

★ ఉప్పులో నిల్వ యుంచిన పంది మాంసమును, పొగచూరిన జంతు మాంసమును అధికముగా తినదలచుకొనుట – తినుటకు ప్రయత్నించినపుడల్లా శూల, శుష్కించుట.

★ పొత్తి కడుపు శుష్కించుట, బిగిలేకుండుట – చిన్నప్రేగుకు, ఉదరకుహర వెనుక గోడకు అంటించే ఆంత్రవేష్టన ముడతకు సంబంధించిన గ్రంథులు పెద్దవగుట.

**12. ఉదరము / కడుపు** (Abdomen) :

★ బొడ్డు / నాభి (Navel) చుట్టూ పుండువలె నొప్పిగా నుండుటచే పిల్లవాడు ఏడ్పుతో గోల పెట్టుట.

★ ప్లీహము (spleen) లో కోయుచున్నట్టి బాధ.

★ పొత్తికడుపులో మంట – భోజనం చేయుటకు ప్రయత్నించునపుడు ఉదర కుహరమందు తీవ్రమగు నొప్పి.

★ పిల్లలలో ఉదరం వ్రేలాడుచుండుట.

★ దుర్వాసనగల అపానవాయువు శబ్దం చేస్తూ వెలువడుట – ఆ తర్వాత నొప్పి తగ్గుట.

★ **పిత్తాశయపు రాళ్ళు** (Gall - stones) – క్రొత్త రాళ్ళు ఏర్పడకుండా చేయుటకు.

★ **హెర్నియా :** రక్తహీనుల హెర్నియా – పొత్తికడుపునకు సంబంధించిన హెర్నియా.

★ ఆంత్రయోజక[1] లింఫ్ గ్రంథుల క్షయ వ్యాధి.

**13. గుదము, పురీషనాళము** (Anus and Rectum) :

★ గుదము వద్ద రంధ్రం ఏర్పడుట – ధనారింపుగ కొట్టుకొనుచుండుట (Throbbing)

*1. **ఆంత్రయోజకం :** చిన్నప్రేగును ఉదరకుహర వెనుకగోడకు అంటించు ఆంత్రవేష్టన (peritoneal) ముడత.*

★ మూలవ్యాధి / మూలశంక (Piles) – వాటి నుండి పసుపు పచ్చని స్రావం వెలువడుట.

**14. విరేచనాలు** (Stools) :

★ ఆకుపచ్చని, జిగురువంటి అజీర్ణ విరేచనాలతో శూల.

★ చంటి పిల్లలందు కలుగు కలరా విరేచనాలు, వాంతులు.

★ విరేచనం వేడిగా, నీటివలే, విస్తారంగా, దుర్వాసనతో, శబ్దం చేస్తూ వెలువడుట.

★ ముసలివారి మలం గట్టిగాను, రక్తంతోను ఉండుట, మానసికంగా క్రుంగుట, తలత్రిప్పు, తలనొప్పి, దీర్ఘకాలపు దగ్గు ఉండుట.

★ రసం గల ఫలములు తినుట, ఏపిల్స్‌తో తయారు చేసిన సారాను (Cider) త్రాగుట, దంతములు వచ్చుట, విసుగు చెందుట వీటివల్ల విరేచనములు అధికమగుట.

★ మలం దుర్వాసనగల చీముతో కూడి యుండుట.

★ రక్తహీనత కలిగి, దుర్బలులుగా ఉన్న రోగుల ప్రేగులలో క్రిములు ఉండుట (నేట్రంఫాస్)

**15. మూత్రావయవములు** (Urinary Organs) :

★ ముసలివారు, పిల్లలు మూత్రమును ఆపుకొనలేక పోవుట – ప్రక్క (Bed) ను మూత్రముతో తడుపుట – మూత్రకోశమందు రాళ్ళు ఏర్పడుట – మూత్రంలో ఆల్బుమిన్ / ఫాస్ఫేట్సు / ఇసుక వంటి పదార్థం పోవుట.

★ వరిబీజము / బీజములుండు తిత్తి ద్రవముతో కూడుట (Hydrocele).

★ ఊపిరితిత్తుల వ్యాధులున్న వారిలో చక్కెరతో కూడిన అతిమూత్రం.

★ మూత్రం తరచుగా సన్నధారతో వచ్చుట – మూత్రం ముదురు రంగులో ఘాటు వాసనతో ఉండుట.

★ మూత్రాశయ మెడ వద్దను, మూత్రనాళం వెంబడి కోయుచున్నట్టి నొప్పి.

★ చక్కెర వ్యాధి గ్రస్తులు (Diabetic Patients) ఈ మందును మధ్యమధ్యన వాడవచ్చు.

**16. పురుష జననేంద్రియాలు** (Male Sexual Organs) :

★ సంభోగేచ్ఛ అధికముగా నుండుట.

★ జననేంద్రియం ఉద్రేకించి బాధాకరముగా నుండుట.

★ కీళ్ళవాతం ప్రతి శీతాకాలంలో అధికముగా నుండుట.

★ మూత్ర విసర్జన నాళమందును, ప్రోస్టేటు గ్రంథి యందును చురకగ నుండు నొప్పి, దురద, పుండువలె నుండుట.

★ బీజములు, బీజములుండు తిత్తి ఉబ్బుట / పచ్చి పుండువలె నుండి చెమట పట్టుట.

★ బస్సు / రైలులో ప్రయాణిస్తున్నప్పుడు సంభోగేచ్ఛ లేకపోయినను అంగం లేచుట.
★ సెగరోగం / గనోరియా (Gonorrhoea) వలన వచ్చు నొప్పులు.

**17. స్త్రీ జననేంద్రియాలు** (Female Sexual Organs) :

★ ఋతుస్రావం ఎర్రగా, విస్తారముగా నుండుట.
★ తరుణుల యందు ముఖ్యంగా కీళ్ళవాత రోగులందు ఋతువు చాల ఆలస్యముగ అగుపడుట – స్రావం నల్లగా నుండుట – జననేంద్రియపు ఉద్రేకం తర్వాత బహిష్టు అగుట – బహిష్టు తర్వాత బలహీనత, దుఃఖం, కీళ్ళవాత నొప్పి.
★ ఋతు సమయమందు జననేంద్రియ ఉద్రిక్తత – త్రికము[1], శ్రోణ్యస్థి[2] బాధగా ఉండుట.
★ ఋతు సమయములోను, ఆ తర్వాత ప్రసవం వంటి నొప్పులు – కొన్ని సమయాల్లో మూత్ర / మల విసర్జన తర్వాత నొప్పులు – ఆ సమయమున నడుము నొప్పి, పొత్తికడుపు నొప్పి ఎక్కువగ నుండుట – వాతావరణ మార్పు జరిగినప్పుడల్లా నొప్పులు అధికమగుట.
★ ఋతు సమయమున / ఋతువు తర్వాత అధిక నీరసం, బాధ, కీళ్ళవాత నొప్పులు.
★ ఋతుస్రావం చిక్కగా, ముదురు రంగుగా, గడ్డలు–గడ్డలుగా అగుట.
★ గర్భకోశం క్రిందకు దిగజారుట.
★ గర్భాశయంలో కంతులు.
★ యోనిపైన సిరలు ఉబ్బుట – మంట.
★ చంటిపిల్లవానికి పాలిచ్చు నెలలయందు బహిష్టు అగుట.
★ చిన్న పిల్లలందు బహిష్టు రెండు వారముల కొకసారి కనిపించుట – ఉదయాన స్రావం ఎక్కువగా నుండుట – స్తనములు గట్టిగా ఉండుట – కుసుమ (Leucorrhoea) స్రావం గుడ్డు తెల్ల సొన వలె, క్రీములాగా ఉండుట – ఉదయాన ఎక్కువగా ఉండుట – జననేంద్రియ సంబంధమైన భావాల ఉద్దీపన ఉండుట – కదలుటకు అయిష్టత.
★ క్షయ వ్యాధిగ్రస్తుల పిల్లలలో హస్త ప్రయోగ స్వభావం – అప్పుడు జననేంద్రియంలో ధనారింపు శబ్దం, ఇంద్రియలోలుపత్వం.
★ ఋతుస్రావం కనిపించకపోవుట / అణగారుట.

**గర్భవతులలో (In pregnant women):**

★ స్తనములలో నొప్పులు, మంట, పుండువలె నుండుట.

---

*1. **త్రికము :** ముడ్డి ఎవక – ఇది త్రికోణాకారములో ఉండును.*
*2. **శ్రోణ్యస్థి :** తుంటి ఎముకపైన వెడల్పుగ ఉండు భాగం.*

★ స్తనములు పెద్దవి అయినట్లు అనిపించుట.

★ తల్లిపాలు ఉప్పగా, నీలిగా నుండి పాడగుట వల్ల చంటిపిల్లవాడు త్రాగుటకు ఇష్టపడక పోవుట.

★ నిస్త్రాణగ నుండు గర్భవతుల జననేంద్రియం దిగజారినచో K.P తో కలిపి దీనిని ఇవ్వవలెను.

★ ఎక్కువ కాలంపాటు పిల్లలకు స్తన్యపానం చేయుటవల్ల తల్లులలో స్వరం క్షీణించుట, దగ్గు, నీరసం, భుజముల మధ్య నొప్పి ఉండును.

★ గర్భవతి అన్ని అవయవములలో నీరసం.

**18. శ్వాసావయవము (Respiratory Organ) :**

★ గొంతుక బొంగురుగాను, నొప్పిగాను ఉండుట.

★ రాత్రింబవళ్ళు దగ్గు.

★ అనియంత్రిత నిట్టూర్పు.

★ ఆల్బుమిన్ వంటి / పచ్చగా నున్న కళ్లె – కళ్ళె నీళ్ళవలె లేకుండుట – ఉదయాన కళ్ళె ఎక్కువగా ఉండుట – గొంతు పొడిగాను, బాధగాను ఉండుట.

★ తాకిన ఛాతీ పుండువలెనుండుట – రొమ్ము ఎముక, భుజపు ఎముక పుండువలె నొప్పిగా నుండుట, ఛాతీ సంకోచించుట, శ్వాస కష్టముగా నుండుట.

★ స్వరమును సరిచేసుకొనుటకు మాటిమాటికి కాండ్రించవలసి వచ్చుట.

★ క్షయ ప్రారంభపు దశ – క్షయ రోగుల దీర్ఘకాలపు దగ్గు.

★ దంతములు వస్తున్న పిల్లలలోను, దుర్బలులలోను కోరింత దగ్గు.

★ పడుకొన్న తగ్గునట్టి చిన్న పిల్లల ఊపిరాడనీయని దగ్గు – కూర్చొన్న దగ్గు అధికమగుట.

★ చిన్న పిల్లలకు పాలు త్రాగిన పిమ్మట ఊపిరాడని కంపములు కలుగుట – ఏడ్చిన కంపములు అధికమగును. ముఖం నీలిగా మారును – ఈ వ్యాధి విశ్రాంతి, తరచుగా వచ్చు హ్రస్వమైన, కఠినమైన శ్వాస వల్ల ప్రారంభమగును.

★ రక్తహీనత గల స్క్రాఫ్యులా[1] గౌటు తత్త్వంగలవారి యందు కలుగు జలుబు.

★ దంతోత్పత్తి మందగించుట వల్ల గ్లాటిస్[2]కు వచ్చు ఈడ్పులు.

**19. రక్తప్రసరణావయవములు (Circulatory Organs) :**

★ ఆందోళనతో గుండెదడ – తర్వాత వణకు కనిపించుట.

---

*1. స్క్రాఫులా (Scrofula): దీనియందు గ్రంథులు పెద్దవగును. క్షయతత్త్వం ఉండును.*

*2. శ్రోణ్యష్ఠి : శ్వాసనాళపు ఊర్ధ్వభాగమునకు, స్వరపేటికకు మధ్యగల ద్వారం / రంధ్రం.*

★ రక్తప్రసరణ మందగించుట వల్ల శరీర భాగాలు ముఖ్యంగా కాలి పిక్కలు (Calves) తిమ్మిరెక్కుట.

★ శ్వాసను పీల్చునపుడు గుండె చుట్టూ చురుకైన / కోయుచున్నట్టి బాధ.

★ కపాల అడుగు భాగమున గల ఎముకల రంధ్రం మూయబడకుండుట.

**20. మెడ, వీపు, నడుము (Neck, Upper back & Lower back) :**

★ చిన్న పిల్లలలో మెడ సన్నగా నుండుట.

★ ఎంత స్వల్పమగు గాలి సోకినను కీళ్ళవాత నొప్పి, మెడ బిర్రబిగియుట జరుగుట.

★ ఉదయాన నిద్ర లేవగానే నడుము నందు నొప్పి.

★ బరువు ఎత్తునపుడు / ముక్కు చీదునపుడు మెడ యందు, రెక్కగూళ్ళ (Shoulder - blades) చుట్టూ, నడుము నందు, మూత్రపిండముల వద్ద కండరములు ముడుచుకు పోవునట్టి నొప్పి.

★ వెన్నుపాము (back bone) చివరి ఎముక పుండు వలె నుండుట – వెన్నెముక ఎముకలు వాచి పుండు పడుట – చీముపట్టి శిథిలమగుట – యుక్తవయస్సు కన్యలలో వెన్నెముక వంగుట (గూను ఏర్పడుట) – వెన్నెముక / నడుము / నడుము క్రింది భాగాన నెరద (Crack) ఏర్పడుట.

★ పిరుదులు (Buttocks), వీపు తిమ్మిరి.

★ నడుము నందు వ్రణములు.

**21. కాళ్ళు – చేతులు :**

★ భుజములలోను, రెక్క గూళ్ళయందు, చేతుల పొడుగునా పుండువలె బాధ.

★ చేతులు పైకి ఎత్తలేకపోవుట.

★ మోచేతులలో పొడిచినట్లుండు నొప్పి.

★ మణికట్టు నందును, చేతివ్రేళ్ళ మొదళ్ళలో పుండు పడినట్టి నొప్పి.

★ కీళ్ళ ఎముక/స్నాయువు వాచి గట్టి పడుట.

★ వసంతకాలమందు తగ్గి, వర్షాకాలములో మరలా కనిపించునట్టి కీళ్ళవాతం.

★ కాళ్ళు – చేతులు తిమ్మిరెక్కుట – మధ్యాహ్నం తర్వాత ఎడమ భుజం తిమ్మిరెక్కుట.

★ పాదములు మంచువలె చల్లగా నుండుట.

★ కీళ్ళవాత నొప్పులు స్థానం మారుట.

★ మోకాళ్ళ నొప్పులు నడచుటచే అధికమగుట.

★ మోకాలి ఎముకలందు నొప్పి.

★ కాలి అడుగు భాగపు ఎముకలలో (Shin bones) నొప్పి.

- ★ మోకాలి పిక్కలలో (Calves) తిమ్మిరి.
- ★ కాలి చీలమండలం స్థానం తప్పినట్లుండుట.
- ★ చీలమండలములోను, కాలివ్రేళ్ళలోను గౌటు సంబంధమగు నొప్పి.
- ★ చల్లని వాతావరణంలో చీలమండలం, కాలివ్రేళ్ళు నొప్పిగా ఉండుట.
- ★ తుంటికీలు (Hip - joint) పుండుపడి దుర్గంధభరితమైన వాసనను వెదజల్లుట.
- ★ కీళ్ళవాతమునకు గురైన అవయవాలపై చీమలు ప్రాకుతున్నట్టి అనుభూతి.
- ★ కదిలెడు భాగములకు మధ్య చిన్న తిత్తి వంటిది ఏర్పడుట.
- ★ కీళ్ళ వద్ద నుండు సైనోరియం పొర దీర్ఘకాలపు వాపు.
- ★ ఎముకలు, మృదులాస్థిచే సంధింపబడిన భాగములు ఉబ్బుట.
- ★ శిశువు నిలువ లేకపోవుట.
- ★ పిల్లలలో దొడ్డికాళ్ళు – నడక నెమ్మదిగా నేర్చుకొనుట.
- ★ పాదపు కీళ్ళ యందును, ముంజేతి ఎముక అడుగు భాగమున, మోకాలి ఎముక అడుగు భాగమున లోతు రంధ్రంగల పుండ్లు.
- ★ ఎముక పైభాగమున సవాయి (Syphilis) సంబంధమైన వాపు / పుండ్లు.
- ★ ప్రక్కటెముకల క్రింద నుండి పిరుదుల వరకు గల భాగమున వ్రణం.

**22. నాడీ వ్యవస్థ (Nervous System) :**

- ★ నరముల బాధలు రాత్రిపూట ప్రారంభమగును – ఇవి నియమిత కాలములో మరలా మరలా వచ్చును – ఈ బాధలు ఎముకలలో నున్నట్లు చాల లోతుగ నుండును – ఈ నొప్పులు చీల్చినట్లుండును – వాతావరణ మార్పులవల్ల ఇవి ఎక్కువగును – ఈ నొప్పులు ప్రాకినట్లు, తిమ్మిరెక్కినట్లు, చల్లగా నున్నట్లు, విద్యుత్ షాక్ తగిలినట్లు అనిపించును.
- ★ తక్కువ స్థలములో నొప్పి.
- ★ కీళ్ళవాతపు పక్షవాతం – చేతులు వణకుట – అలసట, విసుగువల్ల, మెట్లెక్కునపుడు, పనిచేయుటకు ఇష్టం లేనపుడు ఇది సంభవించును.
- ★ బలహీనపరచు తరుణ వ్యాధుల తర్వాత అధిక నిస్సత్తువ ఏర్పడుట.
- ★ అనేక రకముల ఈడ్పులు – వీటికి మెగ్నీషియంఫాస్ (M.P.) తర్వాత ఈ మందు బాగా పనిచేయును.
- ★ పండ్లు వచ్చునప్పుడు కలుగు ఈడ్పులు / కంపనములు.

**23. నిద్ర (Sleep) :**

- ★ పగటిపూట నిద్రమత్తు.

★ ముఖ్యముగ ముసలివారిలో నిద్రమత్తు, విచారకరమగు ఆలోచనలు – ఉదయాన అతికష్టం మీద మేల్కొనుట.
★ పిల్లలు రాత్రిపూట అరచుట.
★ నిరంతరం ఒడలు విరచుకొనుట, ఆవులించుట.

**24. జ్వరం (Fever) :**

★ వణకు ప్రాకుచుండుట.
★ క్షయ వ్యాధిలో రాత్రిపూట చల్లని చెమట, దేహం చల్లగా ఉండుట.
★ స్క్రోఫ్యులా / క్షయతత్త్వంగల పిల్లలలో విడిచి విడిచి వచ్చు జ్వరం – ఇది దీర్ఘకాలం నుంచి ఉండుట.
★ కళ్ళు, చెవులు, ముక్కు మొ॥ భాగాలు చల్లగాను, ముఖం వెచ్చగాను ఉండును.
★ వేడిమి క్రింది వైపునకు ప్రసరించును – దాహం ఉండదు – అరచేతులపై చల్లని చెమట – దేహమంతటా చల్లదనం.

**25. ఎముకలు (Bones) :**

★ ఎముకలలో, ముఖ్యంగా మోకాలి ఎముకల అంచులలో నొప్పి.
★ ఎముక పుండు పడుట.
★ ఎముక అధికముగా పెరుగుట, దొడ్డికాళ్ళు ఏర్పడుట, ఎముకలు సరిగా ఏర్పడకపోవునపుడు ఈ మందు బాగా ఉపయోగపడును.

**26. చర్మం (Skin) :**

★ చర్మం చల్లగా, పొడిగా, ముడతలు పడి ఉండుట.
★ చర్మమంతటా రాగి రంగులో వుండు మొటిమలు.
★ శరీరపు పైభాగాన మొటిమలు.
★ చర్మంపై గోకుడు పుండ్లవంటివి, ఒరుపులు కలుగుట.
★ చర్మం దురద పెట్టుట ముఖ్యంగా ముసలివారిలో.
★ రక్తహీనత, స్క్రోఫ్యులా / క్షయ, గౌటు తత్త్వంగల వారి పసుపు పచ్చని / తెల్లని / నీటి పొక్కులు గల గజ్జి.
★ దురదగా నుండు హెర్పస్[1], ప్రూరిగో[2] వంటి చర్మ వ్యాధులు.
★ ముసలమ్మల భగనాళం దురదగా నుండుట.

*1. హెర్పస్ (Herpes) : ద్రవపు పొక్కులు లేక తామర.*

*2. ప్రూరిగో (Prurigo) : చిన్న పొక్కులు లేచి, ఆ భాగం వాచి, అమిత దురదగా నుండుట.*

★ చర్మంపైన / చర్మంలో ఆల్బుమిన్‌కు సంబంధించిన స్రావములు గల పుండ్లు లేక ఎముకలకు సంబంధించిన స్క్రాఫ్యులా సంబంధమైన పుండ్లు లేక పుండ్ల నుండి ఏర్పడిన కురుపులు.

★ చర్మంపై గులాబి రంగుగల పోతరపు పొక్కులు[1]

★ చర్మంపై చిన్న ముడులు.

**27. ధాతువులు :**

★ రక్తహీనతలో క్రొత్త రక్తకణాలను సరఫరా చేయును.

★ వదులుగా నున్న, క్రుంగిన, శుష్కించిన పిల్లలకు ఉపయోగకారి.

★ ముఖం జిడ్డుగా, ఆకుపచ్చగా, తెల్లగా నుండు వ్యక్తులకు ఉపయోగపడును.

**ఈ మందు క్రింది వ్యాధులకు బాగా ఉపయోగపడును.**

1. ఎముక వెలుపల కనపడే ఎముక కణజాలం ఉబ్బియుండుట.
2. మీద నుంచి ఎముక పెరుగుట.
3. ఎముక వ్యాధులు.
4. ఎముక చివర గుండ్రని ఆకారంగల భాగం వాచుట.
5. ముక్కు, గుదం మరియు గర్భకోశం జిగట పొరల నుండి పిలకలు / కంతులు ఏర్పడుట.
6. ఫాస్ఫేట్ల ప్రవృత్తివల్ల శుష్కించుట.
7. లోపభూయిష్టమైన పోషణ.
8. ఎముకలు సన్నగాను, పెళుసుగాను ఉండుట.
9. ఉబ్బురోగం.
10. ఉన్నతిలో క్రమబద్ధత లేకుండుట.
11. కార్నియాపై కలుగు పువ్వు.
12. తెల్ల కణాలు ఎక్కువగా ఉండుట.
13. రాపిడి నుండి కాపాడు ద్రవపు తిత్తికి సంబంధించిన వ్యాధి.
14. స్నాయుబంధనముల, కీళ్ళ బాధ.

*1. **పోతరపు పొక్కులు :** చర్మపు చీముగ్రంథులు వాచి చీముపట్టుట.*

## 3. కాల్కేరియాసల్ఫ్/కాల్కేరియా సల్ఫ్యూరికమ్ (Calcarea Sulph / Calcarea Sulphuricum)

**రసాయనిక నామం :** కాల్కేరియా సల్ఫేట్.

**ఈ లవణం దేహంలో దేనిలో ఉండును?**

ఈ లవణం దేహంలో పైత్యరసంలో ఉంటుంది. కాని ఇది స్థిరంగా ఉండదు.

**ఈ లవణం చేయు పని :** పైత్యరసంలోనున్న కాల్కేరియా సల్ఫ్ కాలేయం నుండి వచ్చును. ఇది శిథిలమైన ఎర్రరక్త కణాలలోని నీటిని గ్రహించి వాటిని నాశనం చేస్తుంది.

**ఈ లవణం దేహంలో లోపించిన జరుగు నష్టం :** దేహంలో కాల్కేరియా సల్ఫ్ తగ్గిన రక్తంలో పనికిరాని ఎర్రకణాల సంఖ్య ఎక్కువగును. వాటిపని ఆలస్యమగును. దీనివల్ల చర్మవ్యాధులు వచ్చును.

**ఈ మందు ఉపయోగం :** ఈ మందు లోతుగా దీర్ఘకాలం పనిచేయును. చీము కారుచుండుటయే దీని ప్రధాన లక్షణం. ఏ అవయవం నుండైనా చిక్కని, పసుపు పచ్చని / రక్తపు జీరగల స్రావం వచ్చుచున్న ఈ మందు బాగా పనిచేయును. పొడవుగా, శరీర కష్టం లేకుండా బొజ్జతో నుండువారికి, శరీరమంతా పులుపు దుర్వాసనగలవారికి ఇది బాగా పని చేయును. అల్లోపతి వైద్యవిధానం ప్రకారమైతే దీనిని యాంటి బయోటిక్‌గా భావించవచ్చు. ఇది రక్తశుద్ధికి సహాయ పడును. ఇది క్షయ, ప్రేగులు, కనుగ్రుడ్లకు సంబంధించిన పుండ్లను మాన్పును.

చీముపట్టి పగిలి చీము కారిపోయిన పిమ్మట రసి ఇంకను కారుచున్న దీనిని వాడవచ్చు. పురుషుల

**ఉద్రేకములు :** తడి, నీళ్ళతో కడుగుట, నీటిలో పని చేయుట, వాతావరణ మార్పు, పరిశ్రమ, నడచుట, వెచ్చని గది.

**ఉపశమనం :** విశ్రాంతి, బయటి పొడిగాలి, చన్నీటిస్నానం, కప్పుకొనకుండుట.

**మందు లభించు పొటెన్సీలు :** 3× నుండి 1000× వరకు.

**ఏ పొటెన్సీ ఏ రోగమునకు వాడాలి?**

1. చీముతో కూడిన కంటి వ్యాధులకు : 6×, 12×.
2. మొండి పుండ్లకు : 30×, 200×.
3. గోరుచుట్టు, కణుపు జెష్ఠ వంటి రోగాలకు పైపూతగా 3×

**మయాజమ్ :** కొన్ని సందర్భాలలో ట్యూబర్క్యులర్, కొన్ని సందర్భాలలో సిఫిలిస్.

**మానసిక స్వభావం :** తేలికగా ఉత్తేజం పొందుట (Nervous).

**ఉష్ణసహనత :** ఉష్ణమును సహించలేక పోవుట.

**మందు పనిచేయు కాలం :** సరిగా తెలియదు.

లోని నపుంసకత్వమును, స్త్రీల వంధ్యత్వమును మాన్పుటకు ఇది మంచి మందు. త్రాగుడువల్ల శిథిలతత్త్వంగల వారికి, ఎయిడ్స్ వ్యాధిగ్రస్తులకు, రక్తక్షీణతకు సంబంధించిన బాధలు పడువారికి ఈ మందు బాగా ఉపయోగపడును.

**ముఖ్య గమనిక :**
సరిగా ఎన్నుకొన్న మందు పనిచేయనపుడు దీనిని ఇచ్చిన మందు చర్యను పెంచును.

## మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు (Mind) :**

★ మారుచుండు స్వభావం.

★ జ్ఞాపకశక్తి, స్పృహ ఆకస్మికముగ పోవుట.

★ పరధ్యానం, చిరచిరలాడుట, ఆందోళన చెందుట – ఆతృతతో కూడిన మనఃప్రవృత్తి – ధారాళముగ గాలి వీచునపుడు ఈ లక్షణం తగ్గుట.

★ అసంతృప్తి, మనసు నిండా భయాలు.

**2. తల (Head) :**

★ **తల వెంట్రుకలు (Scalp)** : చిన్న పిల్లల తలమీద పసుపు పచ్చని చీమును స్రవించు పుండ్లు / పక్కులు.

★ చుండ్రు ఎక్కువై వెంట్రుకలు రాలిపోవుట.

★ వికారముతో నున్న తలనొప్పి.

★ తల వెంట్రుకల వద్ద చీము కారుట.

★ జలుబు వల్ల తలనొప్పి – చల్లనిగాలి వల్ల తగ్గుట.

★ తల అంతా నొప్పి, నుదుటివద్ద చాలా ఎక్కువ.

★ తలను వేగంగా త్రిప్పిన తలత్రిప్పు, వమన వికారం.

**3. కళ్ళు (Eyes) :**

★ కళ్ళ కలక[1]

★ కంటి కొలికి వాపు – తెల్లగుడ్డు వాపు.

★ కనురెప్పలు అదరుట.

*1. **కళ్ళ కలక (Eye-sore) :** దీనిలో కళ్ళు వాచును. కళ్ళ నుండి చిక్కని పసుపు పచ్చని పదార్థం స్రవించును. కళ్ళలో ఏదో వస్తువున్నట్లు అనిపించును. కళ్ళు అతుక్కొని పోవును.*

★ కార్నియా[1] పైన మసకగా నుండుట, దానిపైన లోతైన పుండ్లు.

★ రెటీనా వాచుట.

★ పుడకవల్ల కంటికి హాని కలిగిన తర్వాత కంటిని బంధించవలసి వచ్చుట.

★ తెల్లగ్రుడ్డు ఆవిరి పట్టినట్లుండుట.

★ కంటి ముందున్న అరలో చీము.

★ కంటిలో గాజు, పెంకు మొ॥ అన్య పదార్థమేదో ఉన్నట్లనిపించుట.

★ కంటిముందు దృశ్యములు సగం కనిపించక పోవుట.

★ అర్థదృష్టి.

★ మెడకు సంబంధించిన గ్రంథుల వాపుతో కన్ను ఎరుపెక్కి, కంటి మీద పొర వాచి, నొప్పిపెట్టి నీరు కారుట, కండ్ల కలక (క్షయలో).

**4. చెవులు (Ears) :**

★ మధ్య చెవి నుండి పసుపు పచ్చని స్రావం వెలువడుట – ఒక్కొక్కపుడు రక్తపు జీర ఉండుట – దీనివల్ల చెవుడు ఏర్పడుట – ఇట్టి లక్షణాలు ఉన్నప్పుడు సైలీషియా (Sil) తర్వాత ఈ మందు వాడవలెను.

★ చెవుల వెనుక భాగమున వాచి చీము పట్టుట – చెవిని తాకిన నొప్పిగా నుండుట.

★ చెవి చుట్టూ మొటిమలు.

**5. ముక్కు (Nose) :**

★ తలలో జలుబు.

★ ముక్కు ఒక వైపు నుండి స్రావం స్రవించుట – స్రావం చిక్కగా పసుపు పచ్చగా నుండుట – ఈ స్రావం తరచుగ రక్తపు జీరతో నుండుట.

★ ముక్కు రంధ్రపు అంచులు బాధగా నుండుట.

★ ముక్కు పొడిగా నుండుట, పక్కులు ఏర్పడుట, దురదగా నుండుట, దిబ్బడ వేయుట.

**6. ముఖం (Face) :**

★ దవడ వాపు – అది చీము పట్టు స్థితిలో నుండుట.

★ ముఖంపై మొటిమలు, హెర్పస్[2] పొక్కులు.

★ గడ్డం క్రింద మృదువుగా నుండు మొటిమలు.

---

*1. **కార్నియా (Cornea) :** దీనిని కాచ బింబం లేక శుక్లపటలం అందురు. ఇది కనుగ్రుడ్డు ముందుభాగమున గట్టిగ నుండును. దీనిలో పారదర్శకమగు ద్రవముండును.*

*2. **హెర్పస్ :** ఇది చర్మవ్యాధి. ద్రవపు పొక్కులు ఏర్పడి అచ్చటచ్చట పుండు పడును. ఆ పుండుపై త్వరలో పక్కుకట్టును. ఆ పక్కు క్రింద క్రొత్తగా ద్రవపు పొక్కు ఏర్పడును. అచ్చట చర్మం వాచును.*

**7. నోరు (Mouth) :**

★ నోరు పొడిగా, వేడిగా నుండుట.

★ పెదవుల లోపలి భాగం పుండ్లు పడుట.

★ పెదవులపై తేమగ నుండు పుండ్లు.

★ చిగురు కురుపు (Gum-boil) – దీని నుండి రక్తం కారును.

**8. నాలుక (Tongue) :**

★ **రుచి :** పుల్లని, సబ్బు వంటి మంటగా నుండెడి రుచి.

★ నాలుక మొదట్లో (Base) పచ్చని మలినం – నాలుకపై రేగడిమన్ను వర్ణంగల మలినం / పూత.

★ చీము పట్టునపుడు నాలుక వాచుట.

★ నాలుక బిగి లేకుండుట – అది ఎండిన బంకమన్ను పొరవలె ఉండుట.

**9. దంతములు (Teeth) :**

★ చిగుళ్ళ లోపల కీళ్ళవాతపు పంటి నొప్పి.

★ వాచిన చిగుళ్ళు బాధాకరముగ నుండుట.

★ పళ్ళను తోముకొనునపుడు చిగుళ్ళ నుండి రక్తం స్రవించుట.

★ చిగుళ్ళ కురుపులు (Gum boils) – పుండు పడిన దంతములు.

**10. గొంతు (Throat) :**

★ గొంతు నొక్కినట్లుండి మ్రింగుట కష్టముగా నుండుట – గొంతు బొంగురుపోవుట – గొంతులో పుండ్లు పడి ఎర్రగా నుండుట (చివరి దశ), పసుపుపచ్చని పదార్థం స్రవించుట – ముడులలాంటి వాపు, నొప్పి.

★ టాన్సిల్స్ వాచి చీము వచ్చుట.

★ మృదు తాలువు డిఫ్తీరియా – నాలుక వెనుక నుండి గొంతు వరకు గల భాగం బాగా వాచుట.

★ గొంతులో టాన్సిల్ అంచున చీము గడ్డ ఏర్పడుట – ఊపిరాడకుండుట. దీనివల్ల తీవ్రమగు నొప్పి, గుటకవేయుట కష్టమగుట, దుర్వాసనగల శ్వాస ఉండును.

**11. జీర్ణకోశం (Stomach) :**

★ ఫలములు, టీ, ఆకుపచ్చని, పుల్లని కాయగూరలను కోరుట.

★ అధిక దాహం, అధిక ఆకలి.

★ నీరు త్రాగిన ఆకలి అదృశ్యమగుట.

★ భోజనానంతరం పుల్లని త్రేపులు వచ్చుట – అవి చేదుగాను, వాసనగాను ఉండును. ఆ వాసన చెడుగాను లేక తిన్న ఆహారపు వాసనతోను ఉండును.
★ కడుపులో మంట కోయుచున్నట్లు, కొరుకుచున్నట్లు వుండును.
★ భోజనం చేసిన తర్వాత తలత్రిప్పు.
★ నిస్త్రాణను తొలగించుటకు ఉత్తేజకరమైన పదార్థాలను కోరుట.
★ కాఫీ, పాలు సహించకపోవుట.
★ తలత్రిప్పుతోనున్న వమన వికారం.

**12. ఉదరకుహరం (Abdomen) & విరేచనాలు (Stools) :**

★ కాలేయపు కుడివైపున కటి ప్రదేశమందు నొప్పిగా నుండుటచే నీరసంగా యుండుట.
★ కడుపులో నొప్పి.
★ గుదము చుట్టూ దురద – గుదము బయటికి వచ్చుట. గుదము వద్ద తేమ.
★ **భగందరం** (Fistula) / గుదము వద్ద నొప్పిలేని చీముగడ్డలు/కురుపులు.
★ పొత్తికడుపు చల్లగా వ్రేలాడుచుండుట.
★ బొడ్డు చుట్టూ నొప్పి, పురీషనాళమందు దురద.
★ క్షయ సంబంధమగు జ్వరం (మధ్యాహ్నం తర్వాత వచ్చును).
★ శ్వాస కష్టముగ నుండుట.
★ ప్రేగుల నుండి చీము వంటి జిగురు.
★ మలబద్ధకం.
★ విరేచనములు నీళ్ళగా లేక రక్తపు జీరతో నున్న చీములాగా వచ్చును – వాతావరణ మార్పువల్ల విరేచనాలు కల్గును – పిల్లల్లో భోజనానంతరం విరేచనాలు అధికమై బాధారహితముగాను, అప్రయత్నముగాను వెలువడును.
★ పురుగుల వల్ల ప్రేగులలో ఏర్పడిన పుండ్లు.

**13. మూత్రావయవములు (Urinary Organs) :**

★ ఎర్రని మూత్రం, క్షయ సంబంధ జ్వరం.
★ మూత్రపిండముల వాపు (దీర్ఘకాలపు), మూత్రములో చీము పోవుట.
★ మూత్రపిండముల వాపు – దీనిలో మూత్రం బంధించబడును. మూత్రంలో ఆల్బుమిన్ ఉండును. జ్వరం, అస్వస్థత, ముఖంవాపు, కాళ్ళకు వాపు, క్రమేణా శరీరం ఉబ్బుట.

**14. పురుష జననేంద్రియాలు (Male sexual organs) :**

★ నపుంసకత్వం.

★ గ్రంథుల వ్రణోత్పత్తి.
★ ప్రోస్టేటు గ్రంథికి పుండు.
★ దీర్ఘకాలపు సవాయి రోగములో చీముపట్టుట – శుక్ర నష్టం[1].
★ గనోరియా వ్యాధిలో అధికముగా రసికారుట.
★ చంకలలోను, గజ్జలలోను లింఫ్ గ్రంథులు వాచి చీము కారుచున్నచో చీమును అదుపు చేయుటకు ఇది బాగా ఉపయోగబడును. దీనిని సైలీషియాతో మార్చి మార్చి వాడాలి.

**15. స్త్రీ జననేంద్రియాలు (Female sexual organs) :**

★ బహిష్టు ఆలస్యముగ అగుట – దీర్ఘకాలముండుట – తలనొప్పి, కండరములు అదరుట, అధిక నీరసం – గర్భాశయం బయటికి వచ్చుట – గర్భాశయంలో కంతులు.
★ బహిష్టు ముందు / తర్వాత కుసుమ పసుపుపచ్చగాను, రక్తముతోను వుండును. అప్పుడు తలనొప్పి, బద్ధకం, నిస్త్రాణ వుండును.
★ బహిష్టు తర్వాత యోని దురదగా నుండును. భగనాళమందు దురద – జననేంద్రియ పార్శ్వములు ఉబ్బుట – వంధ్యత్వం.
★ కటివలయపు ధాతువులలోని చీము నాళముచుట్టూ ఉన్న కణజాలంలోనికి తప్పించుకొని పోవుట.

**గర్భవతి (Pregnant Woman) :** స్తనముల వాపు – చీము స్రవించుట – ఈ లక్షణములకు సైలీషియా తర్వాత ఈ మందు బాగా ఉపయోగపడును.

**16. శ్వాసావయవములు (Respiratory organs) :**

★ ఊపిరితిత్తులందలి వాయుగోళములు శ్లేష్మముచే నిండి ఉబ్బుట.
★ శ్వాస సరిగా ఆడక దగ్గు, ఆయాసం వచ్చుట – క్షయ జ్వరం (సాయంకాలం వచ్చుట)
★ పుల్లని, దుర్వాసన గల చీము వంటి ఆకుపచ్చని కళ్ళె.
★ సాయంత్రం, రాత్రి ఊపిరి సరిగా ఆడకపోవుట.
★ బ్రాంకైటిస్ / న్యుమోనియా / క్రూపు[2] అంతిమ దశ.
★ చల్లగాలి యందు దగ్గు తగ్గుట.
★ హెర్పస్ చర్మవ్యాధిగ్రస్తులగు పిల్లలకు తీవ్రమగు దగ్గు.

*1. శుక్రనష్టం (Spermatorrhoea) : నిద్రలో వీర్యస్కలనము*

*2. క్రూపు (Croup) : శ్వాసనాళం, స్వరపేటికల వాపు వల్ల మొరటగు దగ్గుతో ఊపిరిపీల్చుట కష్టముగా నుండుట.*

★ ఊపిరితిత్తులు/వాటిచుట్టూ ఉండే ప్లూరా పొరల శూన్య ప్రదేశంలో చీము చేరుట.

★ క్షయ.

★ ఛాతీలో పుండు వంటి నొప్పి – ఛాతీలో మంట, నొప్పి.

★ చీముతోనున్న కళ్ళె.

★ క్రూప్/కింక వాయువులో దీనిని కాలీమూర్ తర్వాత వాడాలి.

**17. రక్తప్రసరణావయవములు** (Circulatory organs) :

★ హృదయం చుట్టూ వుండు పొర వాచుట – చీము పట్టుట – రాత్రిపూట గుండెదడ.

**18. వీపు, కాళ్ళు-చేతులు** (Back and extremities) :

★ వీపు నందు, వెన్నెముక ఆఖరి పూసయందు నొప్పి.

★ నడుము వంకరపోవుట.

★ చీము స్రవించు పుండ్లు, వీపుమీద రాచపుండ్లు.

★ చేతివ్రేళ్ళు బిగ్రబిగియుట.

★ గోరుచుట్టు చివరి దశ – దాని నుండి చీము స్రవించుట కొనసాగుట – పైపైన.

★ మోకాళ్ళలో కుట్టుచున్నట్లు బాధలు.

★ పిక్క (Calves) కండరాలు లాగుట.

★ అవయవములు తిమ్మిరి పట్టుట.

★ సిరలు వాచుట.

★ కండరములు అదరుట.

★ అరికాళ్ళలో మంటలు, దురద.

★ తుంటి కీలు వ్యాధి – చీము స్రవించుటకు ఈ మందును ఫెర్రంఫాస్‌తో వాడాలి.

**19. నాడీమండల వ్యవస్థ (Nervous System) :**

★ కండరములు అదరుట, నీరసం, అలసట.

★ వృద్ధులలో వణకు.

★ నీరసమును పోగొట్టుకొనుటకు ఉత్తేజకర పదార్థాలను కోరుట.

**20. నిద్ర (Sleep) :**

★ పగటిపూట నిద్రమత్తు – రాత్రిపూట మెలకువ.

★ భయంవల్ల కండరములు ముడుచుకుపోవుట.

★ ఆలోచనల వల్ల నిద్రపట్టకపోవుట.

**21. చర్మం (Skin) :**

★ పసుపుపచ్చని స్రావం వెడలు పుండ్లు.

★ మానసట్టి పుండ్లు.

★ పిల్లల తలపై గజ్జి, పచ్చని పక్కులు, బొబ్బులు, కాల్పులు.

★ దీర్ఘకాలంగా మానసట్టి పుండ్లు, చీమును స్రవించెడి రాచపుండ్లు, పోతరపు పొక్కులు, మసూచికపు పొక్కులు, వెంట్రుకల క్రింద పదార్థమేదీ లేని చాలా చిన్న పొక్కులు, (గోకినపుడు రక్తం స్రవించుట), కోతలు (cuts).

★ కాళ్ళ–చేతుల వ్రణములు.

★ చీము పట్టుటను తగ్గించుటకు, వ్రణములను అదుపులోనికి తెచ్చుటకు ఈ మందు బాగా ఉపయోగపడును.

**22. జ్వరం (Fever) :**

★ సాయంకాలపు చలితో రోజు విడిచి రోజు వచ్చు విడుపు జ్వరం – ఇది దీర్ఘకాలంగా ఉండును.

★ చలి పాదములందు ప్రారంభమగుట.

★ చీముతో క్షయ సంబంధమగు జ్వరం, పాదాల అడుగున మంట.

★ విరేచనాలు ప్రారంభమగుటతో టైఫస్ వ్యాధి (ఇది కీటకముల ద్వారా వచ్చును. దీనిలో శరీరంపై తట్టు లేచును. జ్వరం 10–14 రోజులు ఉండును).

**23. ధాతువులు :**

ఈ మందు క్రింది వ్యాధులలో ఉపయోగపడును – సంధాయక ధాతువుల వ్యాధులు – పుండ్లు/వ్రణములకు సంబంధించిన వ్యాధులలో చీముపట్టు ప్రక్రియా కాలమును తగ్గించి చీము పరిమాణమును పరిమితం చేయుటకు (ఈ వ్యాధులలో సైలీషియా తర్వాత ఈ మందును ఇచ్చిన వ్రణమును నయం చేయును) – సీరమ్‌నకు సంబంధించిన వాపులు – బాగా సాగిన కండరముల, స్నాయుబంధనముల వ్యాధులు – వీపు కుంటితనం – త్రాగుడువల్ల క్రుంగిపోవుట – మూసుకొని ఉన్న తిత్తులపై కంతులు – వాపు తృతీయదశ, ముద్ద/రక్తస్రావం – దగ్గు, తెల్లబట్ట/కుసుము, గనోరియాలలో జిగురుపొరల స్రావం పసుపుపచ్చగా, చిక్కగా, ముద్దలుగా ఉండుట – చర్మం/జిగురు పొరలనుంచి పదార్థం/రసితోనున్న చీము స్రవించుట – చీము ఏర్పడినపుడు పుపుసావరణంలోగాని, హృదయావరణంలోగాని లేదా కీళ్ళ సందుల్లో గాని ద్రవం చేరుట – లింఫ్ గ్రంథుల నుండి చీము స్రవించుట – గ్రంథుల వ్రణోత్పత్తి – కీళ్ళ నుండి / శరీరంలో ఏ భాగం నుండైనా చీము స్రవించుట – కణికలు అధికముగా ఏర్పడుట, అవి బాధాకరముగా ఉండుట – వ్రణోత్పత్తి మొదలైన తర్వాత జీవితానికి ప్రమాదకరమైన ఎదుగుదల.

# 4. ఫెర్రంఫాస్ / ఫెర్రం ఫాస్ఫారికం
## (Ferrum Phos / Ferrum Phosphoricum)

**రసాయనిక నామం :** ఫెర్రం ఫాస్ఫేటు.

**ఈ లవణ లోపం వల్ల వచ్చు వ్యాధులు :** రక్తహీనత గలవారు అల్లోపతి వైద్యుని వద్దకు వెళ్ళినపుడు ఐరన్ టాబ్లెట్స్ లేక ఐరన్ ఉండే టానిక్కు వ్రాసి ఇస్తాడు. ఈ వైద్యవిధానంలో ఆ ఐరన్‌ను ఫెర్రంఫాస్ అందించును.

ఐరన్ హెమగ్లోబిన్‌లో వుండును. ఆ హెమ గ్లోబిన్ ఎర్ర రక్తకణాలకు రంగును సమకూర్చే పదార్థం. ప్రతి కణపు (cell) కర్బన ఆధారం శ్వేత ధాతువు (అల్బ్యుమెన్). శ్వేత ధాతువునందు ఇనుము ఉండును. కనుక ప్రతి కణము నందు ఇనుము వుండి తీరవలయును. ఇనుము/ఇనుమునకు సంబంధించిన లవణములకు మనం పీల్చునట్టి గాలిలోని ప్రాణ వాయువును ఆకర్షించు స్వభావం వుండును. ఇనుమునకు, కాలిసల్ఫునకు (Kali sulph) మధ్య జరుగు రసాయనిక క్రియవల్ల ఇనుము ప్రతి కణానికి ప్రాణ వాయువును సరఫరా చేయును. ప్రాణ వాయువును సరఫరా చేయుటలో దేహంలోని ఏ భాగంలోని ఇనుప అణువులలో అవరోధం/కలత ఏర్పడునో ఆ భాగం వ్యాధిగ్రస్తమగును.

**ఉదాహరణకు :**

**ఇనుప అణువుల యథాస్థితి యందు కలత ఏర్పడుచోటు :**

1. కండర పోగులు.
2. రక్తనాళముల గోడల కండర పొరలు.
3. ప్రేగుల శృంగకముల (villi) కండరపు గోడలు.
4. ప్రేగుల కండరపు గోడలు.

కనుక ఫెర్రంఫాస్ ఈ క్రింది వాటికి మంచి మందు.

**ఉద్రేకములు :** కదలిక (Motion), మానసిక ఉద్రేకాలు, తిన్న తర్వాత, నిలబడుట, కుడి వైపు, స్పర్శ, 4-6 am.

**ఉపశమనం :** చల్లదనం, నెమ్మదిగా కదలుట, ఒత్తుట, లేచుట, ఒంటరితనం, స్నానం

**లభించు పొటెన్సీ :** 3× నుండి 1000× వరకు.

**ఏ వ్యాధిలో ఏ పొటెన్సీ వాడాలి:**

తరుణ (Acute) వ్యాధి : 6×, 12×.

దీర్ఘ (Chronic) వ్యాధి : 30×, 200×.

రక్తక్షీణతకు : 1×, 2×, 3×.

జలుబు, వేసవి కాలపు వాంతులు, విరేచనములు, సెగ : 30–200 పొటెన్సీ.

**సంభవించు వ్యాధి :**

1. కండర పోగుల బిగి తగ్గి పటుత్వం లేనివగుట.
2. రక్తనాళములు ఉబ్బుట – రక్తాధిక్యత ఏర్పడి రక్తపోటు (B.P) పెరుగుట.
3. ప్రేగుల బిగి సడలి విరేచనములగుట.

1. అన్ని రకాల వాపుల ప్రథమ దశ (ఉదా : జలుబు)
2. కదలికచే అధికమై, చల్లదనంచే తగ్గు బాధలు.
3. రక్తాధిక్యతచే కలుగు రక్తస్రావములు.
4. దెబ్బలు, నరుకులు మొదలగు వాటిచే కలుగు క్రొత్త గాయాలు.

**5. జ్వరం :** క్రమంగా పెరుగు జ్వరం – ముఖం కాంతి విహీనంగా వుండుట – ఎరుపెక్కిన బుగ్గలు – నాడి వడిగా కొట్టుకొనుట.

**6. దగ్గు :** కఠినమైన, పొడిగానున్న, గిలిగింతలు పెట్టే దగ్గు – ఛాతీ బాధాకరంగాను, బొంగురు తనంతోను ఉండుట.

**7. తలనొప్పి :** ధనారింపుగ కొట్టుకొనునట్లుండు తలనొప్పి – కుడివైపున తలనొప్పి – తడిగుడ్డ పెట్టిన తగ్గు తలనొప్పి.

4. ప్రేగుల సహజచలనం నీరసించి మలబద్ధకం ఏర్పడుట.
   ఇనుప అణువుల యథా స్థితి యందు కలత ఏర్పడి నపుడు ఫెర్రంఫాస్‌ను వాడిన వ్యాధి నివారణ యగును.

**పై పూతగా :** బెణుకులు, గాయములు, రక్తస్రావములు మొదలైన వాటికి.

**మయాజమ్ :** సోరా.

**మానసిక స్వభావం :** మంద కొడిగా నుండుట.

**ఉష్ణసహనం :** సామాన్యంగా వేడిమిని, కొన్ని సమయాల్లో చలిని సహించలేకపోవుట.

**మందు పనిచేయు కాలం :**

సరిగా తెలియదు.

**సూచన :**

1) రక్తక్షీణతకు దీనిని కాల్కేరియాఫ్లోర్ ముందు/తర్వాత వాడాలి.
2) మొలలకు దీనిని C.P.తో కలిపి వాడాలి.
3) డయాబిటిస్‌లో దీనిని N.S.తో కలిపి వాడాలి.
4) తలనొప్పికి దీనిని N.P.తో కలిపి వాడాలి.

# మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు (Mind) :**

★ సాధారణ విషయములందు నిర్లక్ష్యం.

★ స్వల్ప విషయములు కూడా పెద్దవిగా కనిపించి విసుగు కలిగించుట.

★ ఆశ, ధైర్యం నశించుట.

★ మెదడుకు రక్తప్రసరణాధిక్యత వల్ల కలుగు సంధి, ఉన్మాదస్థితి – స్వల్పకాలమందు అధిక ఉన్మాదం.

★ త్రాగుబోతుల వాగుడు, తూలుట, దేహం మెలికలు తిరుగుట.

★ నిద్రమత్తు, జ్ఞాపకశక్తి నశించుట – మాటలను సరిగా చెప్పలేకపోవుట, సరైన శబ్దాలను ప్రయోగించలేకపోవుట.

★ మనోనిశ్చలత లేకపోవుట.

★ నిద్ర తర్వాత బాగుండుట.

**2. తల (Head) :**

**తలనొప్పి :**

1. కుడివైపున నడినెత్తి నుండి కుడి కంటి పై భాగం వరకు మొద్దుగ నుండు తలనొప్పి – ఆ భాగంపై చల్లని వస్తువుల నుంచి నొక్కిన నొప్పి తగ్గును.
2. తలకు రక్తం వడిగా ప్రవహించుటవల్ల కలుగు తలనొప్పి – ఆ ప్రాంతమున కంటికి పై భాగమున మేకుతో కొట్టినట్టి నొప్పి.
3. సమ్మెటతో కొట్టినట్లుండు తలనొప్పి – కుడివైపున అధికముగా ఉండుట.
4. ముక్కు నుండి రక్తస్రావమైనా, ఉపశమనం చెందు తలనొప్పి.
5. అజీర్ణపదార్థం వాంతియైన వచ్చు తలనొప్పి.
6. అంధత్వమును కలిగించు తలనొప్పి.
7. పైత్యరసాధిక్యతచే కలుగు తలనొప్పి.
8. చిన్నపిల్లల తలనొప్పి – చల్లదనం/పుల్లనిత్రేపులు/ముక్కు నుండి రక్తస్రావం వల్ల తగ్గుట.

★ ఎండవేడిమి దుష్ఫలితాలు (ఈ లక్షణమునకు ఈ మందు తర్వాత కాల్కేరియాఫాస్‌ను వాడాలి).

★ తలపై లేచు చర్మవ్యాధుల ప్రథమ దశ – తలపై చర్మం పుండువలె నొప్పిగా నుండుట, చల్లదనం సహించలేకపోవుట.

**3. కళ్ళు :** కళ్ళు వాచుట – కళ్ళు ఎఱ్ఱగా, మంటగానుండుట – కళ్ళ నుండి నీరు కారుట – కళ్ళ కలక (తరుణ) – కనురెప్పల క్రింద ఇసుకపోసినట్లుండుట, – కంటి పొర సడలుటవల్ల కలిగిన కళ్ళకలక, వెలుతురు చూడలేకపోవుట – కనులను కదుపుటచే బాధ అధికమగుట – కనురెప్పలందు కంతి – కుడికన్ను క్రింద, రెప్ప మీద చిన్న కురుపులు – ప్రథమ దశలో రెటీనా నొప్పి – కార్నియా చీము పట్టి నొప్పి చేయుట – కళ్ళ క్రింద నల్లని వర్తులములు (Circles) – కంటి యందు, కంటి కొలికి వైపున, ముక్కునందు నరముల బాధ.

**4. చెవులు :** శబ్దం సహించలేకపోవుట – జలుబు చేసినా, చలికి, తేమ వాతావరణానికి చెవినొప్పి వచ్చుట – రక్తపోటుచే చెవి ఎఱ్ఱగా వాచి శబ్దములు కలుగుట – చెవిపోటు (ప్రథమదశ) – చెవిలో నాడి గట్టిగా కొట్టుకొనుచున్నట్లుండుట, వికీర్ణం చెందు నొప్పులు – బాహ్య చెవి ఎఱ్ఱగానుండుట – చెవిలో గింగురుమనుట – చెవి వెనుక భాగం వాపు, నొప్పి – చెవి నుండి చీము/స్రావం/రక్తం స్రవించుట – వాపు వలన జ్వరం వచ్చుట – కణత ఎముక ఎత్తయిన భాగం వాచుట – కర్ణభేరి వాచుట – వాపు చుట్టూ గీత వలె కలసిపోవుట – వాచిన భాగములు నల్లగా/ఎఱ్ఱగా వుండుట.

**5. ముక్కు :**

★ జలుబు/రొంప ప్రథమ దశ.

★ జలుబు చేయు స్వభావం.

★ కుడివైపుండు నాసికానాళమందు తీవ్రమగు బాధ.

★ గాలిని లోనికి పీల్చునపుడు జలుబు ఎక్కువగుట.

★ ముక్కు యందు జలుబు – రక్తంతో కూడిన స్రావం, ముఖ్యంగా పిల్లలలో – ప్రకాశవంతమైన ఎఱ్ఱని రక్తం ముక్కు నుండి స్రవించుట. – పక్కులు కట్టుట – స్రావం బరువును కలిగించుట.

★ పిల్లలలో తరచుగా వచ్చు జలుబు – ఈ లక్షణమునకు ఈ మందును కాలీమూర్ (K.M.)తో మార్చి–మార్చి కొన్ని వారాల పాటిచ్చిన నిరోధక శక్తి పెరుగును.

**6. ముఖం :**

★ రక్తాధిక్యతచే ముఖం ఎఱ్ఱగా, మంటగా, బాధగానుండుట.

★ బుగ్గ వేడిగా పుండువలె నుండుట – చల్లని పానీయాల వల్ల ఉపశమనం.

★ రక్తక్షీణత వల్ల ముఖం పాలిపోవుట.

★ నుదుటి మీద, గడ్డం మీద మొటిమలు.

★ ఎఱ్ఱని ఛాయ (ఎఱ్ఱని ముఖం రాబోవు తలనొప్పికి ముందు సూచన)

★ ముఖం మీద విసర్పి అను చర్మవ్యాధి (NS).

**7. నోరు :**

1) **చిగుళ్ళు :** ఇవి ఎర్రగా, వేడిగా, బాధగా ఉండును.

2) **నాలుక :** నాలుక వాచి ఎర్రగా, వెచ్చగా, బాధగా ఉండుట – నాలుక చిక్కని ఎర్రని వాపు – నాలుకపై వెంట్రుక ఉన్నట్టి భావన.

3) **దంతములు :** పంటినొప్పి వేడి పానీయం/చల్లని ద్రవం వల్ల తగ్గుట – దంతములు తాకినా/ఒత్తిడి కలిగించినా నొప్పిగా ఉండుట – దంతములు వచ్చునప్పుడు బాధలు, జ్వర లక్షణములతో – స్పర్శ/ఒత్తిడివల్ల దంతములు పుండువలె చాలా బాధగా ఉండుట. దంతములు పొడుగైనట్లు అనిపించుట.

4) **దవుడలు/చెంపలు :** దవుడలు మూయలేకపోవుట, నొప్పి లేకుండుట – దవుడలు వెచ్చగా ఉండుట.

5) **నోటి ఆమత్వక్కు/జిగురు పొర :** ఎర్రగా ఉండుట.

**8. గొంతు/కంఠం :**

★ గొంతు పొడిగా, ఎర్రగా, పుండువలె జ్వరంతో నుండుట.

★ టాన్సిల్స్ ఎర్రగా వాచుట (KM).

★ స్వరపేటిక వాచుటవల్ల గొంతు బొంగురుపోవుట (ముఖ్యంగా గాయకుల, ఉపన్యాసకుల విషయంలో).

★ రక్తప్రసార దోషం, వేడిమి, జ్వరం, నొప్పి, ధనారింపుగ కొట్టుకొనుటను ఈ మందు నివారించును. దవుడ క్రింది గ్రంథులు వాచుట – చెవి నుండి సప్తపథి వరకు గల నాళములకు కలుగు తీవ్రమగు జలుబు (డిఫ్తీరియా ప్రథమ దశ) – ఫారింగ్స్, స్వరపేటికలు గల భాగం, ముఖ్య శ్వాసనాళం నుండి రక్తస్రావమగుటను ఆపును.

★ గొంతు ఎర్రగా, నొప్పిగా ఉండుట, చెమర్చుట లేకుండుట.

★ గొంతులో వ్రణోత్పత్తి.

**9. జీర్ణాశయం :**

★ అజీర్ణం, అన్నం తిన్న తర్వాత, పానీయములు త్రాగిన తర్వాత వాంతులగుట – అన్నం సహించకపోవుట – జిడ్డు వాసనతో త్రేపులు – మాంసం, పాలు అయిష్టం – చల్లని నీరు త్రాగాలనే కోరిక – ఉద్రేకం కలిగించు బ్రాంది, కల్లు మొదలైనవి కోరుట – కడుపులో మంట – జీర్ణంకాని ఆహారం లేదా రక్తం వాంతి యగుట – చల్లని పానీయాల వల్ల ఉపశమనం.

★ జీర్ణాశయపు వాపు (Gastritis) – ప్రథమ దశ : జీర్ణాశయపు గుంట వద్ద వాపు, సున్నితమైన నొప్పి.

**అజీర్ణం :** పొట్టకు వెళ్ళే రక్తనాళాలు సడలుట వల్ల కలిగే అజీర్ణం – ఆహారం తీసుకొన్న తర్వాత, ఒత్తిడి వల్ల కలుగు నొప్పి.

**కడుపునొప్పి :** పొట్ట భయంకరమైన అనారోగ్యం – శిశువులలో చలివల్ల వచ్చు కడుపునొప్పి, వాపు ఉండుట, నీళ్ళ విరేచనాలు – ప్రకాశవంతమైన ఎర్రని రక్తాన్ని వాంతి చేసుకొనుట – అపానవాయువు తిన్న ఆహారపు రుచితో బయటికి వచ్చుట – ఆకలి లేకుండుట, పాలపట్ల అరుచి – తిన్నతర్వాత వమన వికారం, ఆహారాన్ని వాంతి చేసుకొనుట – వాంతి చేసుకొన్న పదార్థాలు కొన్ని సందర్భాల్లో పుల్లగా ఉండుట – రోగి పుల్లని పదార్థాలు, హెర్మింగ్ చేపలు, కాఫీ, కేక్స్ తీసుకొనలేకపోవుట – విడువకుండా వాంతులు – ఉదయపు ఉపాహారమునకు ముందే కొన్ని సమయములలో వాంతి చేసుకొనుట.

**10. ఉదరకుహరం :**

★ పెరిటోనియం[1] అను పొర వాచుట (ప్రథమదశ).

★ కాలేయం, స్ప్లీన్[2] వాచి గట్టిగా నుండుట.

★ చిన్నప్రేగుల వేడిమివల్ల మలబద్ధకం, గుదము క్రిందికి దిగజారుటవల్ల బాధగా వుండుట – రోగి కూర్చొనలేకపోవుట.

★ ప్రేగులందు నుసిపురుగులు, బద్దీక్రిములు ఉండుట (NP).

★ మొలల వాపు/వాటి నుండి ఎర్రటి రక్తస్రావం (CF) – ఆ రక్తం రాతివలె గట్టిపడుటకు పూర్వం చిక్కబడుట.

**11. విరేచనాలు : కలరా :** చంటి పిల్లలందు కలుగు కలరా (వాంతులు, ప్రాణహాని కలిగించే నీళ్ళ విరేచనాలు) – రోగి ముఖం ఎర్రగా ఉండుట, నిండుగాను, కోమలముగాను ఉండు నాడి.

★ చెమట అణగారిన పిమ్మట విరేచనం నీటి వలె/రక్తం వలె అగుట.

★ విరేచన విసర్జనకు తొందర కలుగుట, కాని నొప్పి లేకపోవుట.

★ ప్రేగులలోని ద్రవమును మామూలుగా గ్రహించవలసినంత గ్రహించక పోవుటవల్ల కలుగు విరేచనాలు.

★ అజీర్ణ విరేచనాలు.

★ చలిచే కలుగు విరేచనాలు.

---

*1. **పెరిటోనియం (Peritoneum) :** ఇది ఉదరకుహర మందలి అవయవములను కప్పును. ఇది ఉదరకుహరమంతటా నుండును. ఇది సున్నితమగు పొర. దీనిని వప అని కూడా అందురు.*

*2. **స్ప్లీన్ (Spleen) :** దీనిని ప్లీహం అని అందురు. ఇది ఉదరవితానం క్రింద, జీర్ణకోశమునకు వెనుక నుండును.*

★ గ్రహణి (దీనిని KMతో వాడాలి)
★ వాచిన/రక్తం స్రవించునట్టి మూలశంక (Piles).

**12. మూత్రావయవములు :**

★ మూత్రమును ఆపుకొను శక్తి లేకపోవుటచే మూత్రం చుక్కలు చుక్కలుగా పోవుట.
★ దగ్గినప్పుడు మూత్రం అప్రయత్నముగా వెలువడుట.
★ తరచుగా మూత్ర విసర్జన వాంఛ.
★ మూత్రకోశం వాచుట (ప్రథమదశ), నొప్పి, వేడిగా నుండుట/జ్వరం వచ్చినట్లుండుట.
★ మూత్రంలో రక్తం వెడలుట (Haematuria).
★ వేడిమి వలన పిల్లల మూత్రనాళం వద్ద చురచురలాడుట – మూత్ర విసర్జన తర్వాత ఆ బాధ తగ్గుట.
★ మూత్ర విసర్జన ఎక్కువ పరిమాణంలో వుండుట (NM).
★ నాడి వడిగా కొట్టుకొనుట/నొప్పి, ఒత్తిడి, వేడిమి/శరీరంలోని ఏ అవయవంలోనైనా రక్తప్రసారదోషం ఉన్న చక్కెర వ్యాధిని తెలుపును.
★ సంవరణి కండరం (Sphincter) బలహీనత వల్ల మూత్రమును ఆపుకొనలేకపోవుట.
★ మూత్రద్వారపు క్షోభవల్ల పగటియందు పక్కలో మూత్రవిసర్జన (Diurnal enuresis).
★ మూత్ర విసర్జన అణచబడుట/బంధింపబడుట (Ischuria) – చిన్న పిల్లలలో.
★ అతిమూత్ర వ్యాధి.
★ ఎంతసేపు ఎక్కువగా నిల్చొంటే అంత ఎక్కువగా పై లక్షణాలు ఉద్రేకించుట, మూత్రవిసర్జన తర్వాత ఉపశమనం.

**13. పురుష జననేంద్రియాలు :**

★ బీజములు/వృషణములు వాచి నొప్పిగా నుండుట.
★ బీజముల తిత్తియందు నీలిరంగు కలిగిన సిరలుబ్బుట.
★ సెగ (Gonorrhoea) రోగములో తెల్లని స్రావం వెలువడుట.
★ ప్రోస్టేటు గ్రంథి వాచుట.
★ శీఘ్రస్కలనం.
★ రక్తస్రావం.
★ సవాయి రోగ సంబంధమైన బిళ్ళ.
★ సంభోగేచ్ఛ లేకపోవుట.
★ వృషణముల వెనుక అంచునకు అంటియుండు నాళపు వాపు, నొప్పి, వేడి, మంట, తీపు (Epididymitis).

**14. స్త్రీ జననేంద్రియాలు :**

★ గర్భాశయం, గర్భాశయపు పొర క్షోభ మూత్రాశయపు బాధలతో సంబంధం కలిగియుండుట.

★ యోని వాచుట, అది పొడిగాను, వేడిగాను వుండుట (NM).

★ సంభోగము నందు యోని బాధ.

★ సెగ (గనోరియా) – ప్రథమ దశ.

★ గర్భకోశపు వాపు, జ్వరం, నొప్పి, వేడిమి (ప్రథమదశ).

★ బహిష్టు సమయమున అధిక రక్తప్రసారదోషం – ఋతుస్రావం ఎక్కువ ఎర్రగా నుండుట

★ బహిష్టు మూడు వారాలకు ఒకసారి – ఋతుస్రావం అధికం – రక్తప్రసారదోషంవల్ల బహిష్టుకు ముందు, బహిష్టు సమయాన నడుము నొప్పి, పొత్తికడుపు నొప్పి, తలపై నొప్పి తీవ్రం (NP).

★ కటి ప్రదేశమందు బరువుగ క్రిందకు నొక్కుచుండు నొప్పులు స్థిరంగా ఉండుట – అండాశయపు నొప్పులు మందముగా నుండుట.

**గర్భిణి :** గర్భిణీ స్త్రీలలో వేవిళ్ళు – తిన్న ఆహారాన్ని అట్లే వాంతి చేసుకొనుట – రుచి ఉండవచ్చు లేకపోవచ్చు – మూడవ నెలలో స్తనముల వాపు (ప్రథమదశ).

**బాలింతరాలు :** ప్రసవాంతరపు నొప్పులు, సూతికాజ్వరం (ప్రసవించిన స్త్రీకి వచ్చు జ్వరం) – వీటికి ఈ మందు నిరోధకంగా పనిచేయును.

**15. శ్వాసావయవములు :**

★ ఇది చిన్నపిల్లల ఛాతీ వ్యాధుల ప్రథమదశలో ప్రధానౌషధం – అప్పుడు ఛాతీ ప్రక్కలందు సూదితో కుట్టినట్లుండును. శ్వాస కష్టముగ నుండును. శ్వాస పీల్చునపుడు పట్టినట్లుండు దగ్గు.

★ న్యుమోనియా, బ్రాంఖైటిస్, ప్లూరసీ[1] ప్లూరా – న్యుమోనియా.

★ ఛాతీలో నొప్పి – శ్లేష్మం రక్తజీరతోనుండుట.

★ స్వరపేటిక, వాయునాళముల శోథము/నొప్పి, వేడిమి, వాపు.

★ శ్వాస సరిగా ఆడక పొడిదగ్గు వచ్చుట.

★ జ్వర లక్షణాలతో కోరింత దగ్గు, క్రూపు – కోరింత దగ్గులో ఆహారం వాంతి చేసుకొనుట.

---

*1. **ప్లూరసీ (Pleurisy) :** ఇందు ఊపిరితిత్తులను చుట్టియుండెడి ప్లూరాయనెడి పొరలు వాచును. దీనిలో అత్యధికమగు చలి, జ్వరం, ఛాతీయందు నొప్పి ఉండును.*

★ రొమ్ములో చితుకకొట్టినట్లు బాధ.

★ అన్ని దగ్గులకు, జలుబులకు ప్రథమంగా ఇవ్వవలసిన మందు.

★ పాడిన తర్వాత, ఉపన్యసించిన తర్వాత స్వరపేటికలో బాధ, క్షోభ, నొప్పి – దీనివల్ల బొంగురుతనం కలుగుట, స్వరం పోవుట జరుగును.

**16. రక్తప్రసరణ వ్యవస్థ :**

★ జ్వర లక్షణాలతోనున్న గుండెదడ.

★ గుండె పై పొర, లోపలి పొర వాపు (ప్రథమదశ).

★ గుండెకు సంబంధించిన రక్తనాళాలు, కేశనాళికలు పెద్దవగుట (CF).

★ చర్మపు రక్తనాళాలు పెద్దవై ఎరుపు/నీలిరంగు మచ్చలు ఏర్పడుట.

★ సిరలుబ్బి ముడుల వలె నుండుట (CF).

★ ఎర్ర రక్తకణాలు తక్కువగుట (CP).

★ గుండె గోడ పెద్దదగుట – ఇది రక్తప్రసరణాధిక్యత వల్ల సంభవించును. ఈ మందు రక్తప్రసరణను సరిచేయును.

★ నాడి వేగంగా కొట్టుకొనుట.

**17. వీపు, చేతులు, కాళ్ళు :**

★ నడుము, మూత్రపిండముల ప్రాంతములో తీవ్రమైన నొప్పులు (CP).

★ మెడ బిర్రబిగియుట.

★ కదలినపుడు నడుము నొప్పి ఎక్కువగుట.

★ భుజం కీలునందు, ఛాతీ పై భాగమందు, మణికట్టునందు నొప్పులు.

★ ఒక కీలు తర్వాత మరొక కీలు వ్యాధికి గురియగుట.

★ తుంటి కీలు వాచి నొప్పిగా నుండుట (Sil) – స్నాయువులు నలిగినపుడు, ఎముకలు విరిగినపుడు కలుగు బాధలు.

★ చేతివ్రేళ్ళ స్నాయువులందు శబ్దములు.

★ అరచేతి మంటలు.

★ తొడలలో వెచ్చదనం, వాపులతో కూడిన బాధలు.

★ కదలినప్పుడు కీళ్ళ నొప్పి/నొప్పులు ప్రారంభమగుట, అధికమగుట – వేడివల్ల నొప్పులు తక్కువగుట.

★ రక్తప్రసరణ చాల తక్కువై, పాలిపోయి, తిమ్మిరెక్కుట.

★ రక్తనాళములు వాచి నీలిగా మారుట.

★ ప్రమాదాలలోను, బెణుకులందు కలుగు వాపులకు, నొప్పులకు ప్రథమదశలో ఇవ్వవలసిన మందు.
★ వీపు నందు ఈడ్పు సంబంధమైన బాధ (KS).
★ చేతులు ఉబ్బి నొప్పిగ నుండుట.
★ అరచేతులు వేడిగ నుండుట.
★ గోరుచుట్టు ప్రథమదశ.
★ వాచిన చేతివ్రేళ్ళు.

**18. నాడీ వ్యవస్థ :**

★ నరముల శక్తి నశించుటచే నిస్త్రాణ, మందకొడితనం, కోపమధికమగుట.
★ ఉద్రేకపరచు పదార్థాలు/ద్రవాలు కోరుట.
★ కీళ్ళ జబ్బుతో కూడిన పక్షవాతం.
★ రాత్రిపూట నరాల బాధ అధికం.
★ తలకు రక్తప్రసరణాధిక్యత వల్ల మూర్ఛ ఫిట్స్, జ్వరం వచ్చుట.
★ దంతాలు వచ్చునపుడు పిల్లలకు జ్వరం, కంపనాలు – వారు బలహీనంగా కనిపించుట.
★ రక్తాధిక్యతవల్ల కలిగే నరాల వాపులు.

**19. నిద్ర :**

★ మెదడులో రక్తమధికముగా చేరుటవల్ల నిద్రపట్టకపోవుట.
★ రాత్రి పూట అస్థిమితముగానుండుట.
★ నరముల సంబంధమైన బాధతో నిద్రలేమి – ఈ లక్షణానికి ఈ మందుతోపాటు KP ఇవ్వాలి.
★ సాయంత్రం 4.30 గంటలకు నిద్రమత్తు.
★ **కలలు :** ఆందోళనతో కూడిన కలలు.

**20. జ్వరం :**

★ అన్ని శ్లేష్మ పొరల శోథమునకు సంబంధించిన జ్వరాల చలి దశలో వణకు, వేడిమి, వడిగా కొట్టుకొను నాడి, నొప్పి ఉండుట.
★ కీళ్ల వాతం, జీర్ణాశయం, చిన్నప్రేగులు, టైఫాయిడ్ మొదలైనవానికి సంబంధించిన జ్వరాల చలిదశ.
★ ఏ వ్యాధి ప్రారంభములోనైనా వేడి, జ్వరం ఉండుట.
★ విడిచి–విడిచి వచ్చు జ్వరంలో ఆహారాన్ని వాంతి చేసుకొనుట.

★ స్కార్‌లెట్ జ్వరపు సాధారణ కేసులు.

★ పురుగులవల్ల వచ్చు టైఫస్ జ్వరపు ప్రథమదశ.

★ ప్రతిరోజు 1 p.m. తర్వాత చలి ప్రారంభమగుట.

★ అధిక జ్వరం, ఉష్ణోగ్రత పెరుగుట, తీవ్రముగా నాడి కొట్టుకొనుట – రాత్రిపూట అధికముగా చెమట పట్టుట – అరచేతులు, ముఖం, గొంతు, ఛాతీ పొడిగాను, వేడిగాను ఉండుట.

**21. చర్మం :**

★ యంత్రాలవల్ల కలిగే ప్రమాదాలు, తాజా గాయాలు – వీటి వల్ల కలిగే రక్తాధిక్యత – వాటినుండి చీము కారకుండుట.

★ రక్తనాళాలలో రక్తప్రసార దోషంవల్ల చర్మం మండుట, వేడిగా ఉండుట.

★ కురుపులు, చీముగడ్డలు, రాచపుండ్లు, చీముపట్టిన వేలు చివరన / అరచేయి / అరికాలు వైపున ఉన్న గుజ్జు – వీటి ఆరంభమున ఉన్న వేడిమిని, రక్తం చేరుటను, నొప్పిని, వడిగా కొట్టుకొనుటను ఈ మందు తగ్గించును.

★ ఆటలమ్మ, విసర్పి వ్యాధులలో చర్మపు వ్యాధులను, జ్వరమును, నొప్పిని తగ్గించును.

★ జ్వరపు లక్షణాలతో చర్మం చీము పట్టుట.

★ పొంగు, స్కార్‌లెట్ జ్వరం, స్ఫోటకం, మొటిమలు, అక్కి వ్యాధులలో నొప్పి, వేడిమి, రక్తప్రసార దోషం తగ్గించుటకు.

★ మాసిపోని పుట్టుమచ్చలు.

**22. ధాతువులు :** రక్తహీనత (Anaemia) : రక్తనాళికల కండరాల స్నాయువులు సడలుటవల్ల ఏర్పడు రక్తాధిక్యత – వాపు ఆరంభదశ – శరీరంలోని ఏ అవయవం నుండైనా రక్తస్రావం – పిల్లల ముక్కుల నుండి రక్తస్రావం – యాంత్రిక గాయాలు, గుద్దులు, క్రిందపడుట, కోతలు మొదలైనవాటివల్ల ఏర్పడు వాపులు – ఎముకల వ్యాధులలో కోమలమైన భాగాలు ఎర్రగా, వాచినట్లు, బాధాకరముగా ఉండుట – యువకులలో సిరలవాపు – ఎముకలు విరిగినపుడు, కోమలమైన భాగాలు దెబ్బతిన్నప్పుడు ఎముకలలో శోథము – శరీరములోపల, బయట కలుగు బెణకులు – గ్రంథుల వాపు – కోమల భాగముల గాయాలు, వాపు లక్షణాలతో ఉన్నప్పుడు ఈ మందు వాడదగును. ఇనుప లవణ లోపంవలన ఏర్పడు రక్తహీనత (Chlorosis)కు కాల్కేరియా ఫాస్ తర్వాత ఈ మందు ఇవ్వవలెను.

# 5. కాలిమూర్ / కాలిమ్యూరియాటికం
## Kalimur/Kalimuriaticum

**రసాయనిక నామం :** పొటాషియం క్లోరైడు.

**వ్యావహారిక నామం :** క్లోరైడు అఫ్ పొటాష్.

**ఈ లవణం దేహంలో ఉండు ప్రదేశములు :**

ఇది రక్తకణములందు, కండరములందు, నరములందు, మెదడు కణములందు, కణ మధ్యస్థ మగు ద్రవం నందు ఉండును. ఈ లవణం లేని యెడల మెదడు నందు నూతన కణమొక్కటియు తయారు కాదు.

**ఈ లవణ లోపంవల్ల కలుగు రోగములు :**

ఈ లవణ లోపంవల్ల క్రింది రోగాలు వచ్చును : డిఫ్తీరియా (కంఠవాతం), గొంతుక, టాన్సిల్స్, అంగుడు లేక కొండనాలుక వాచుట – గ్రహణి – క్రూప్ – ఊపిరాడని న్యుమోనియా – శోషరస గ్రంథులు పెద్దవగుట – ధాతువులలోనికి చొచ్చుకొని పోయిన వాపు – పాడైన టీకాలు వేసినందువల్ల కలుగు చర్మవ్యాధులు – నాలుక మొదట్లో తెల్లని/మసి రంగుగల పదార్థం కూడుట – కళ్ళు, ముక్కు, నోరు, ప్రేగులు, గుదము నుండి చిక్కని, తెల్లని, జిగురువంటి స్రావం వెలువడుట – చర్మం మీద పిండి వంటి పొర ఏర్పడుట – కాలేయం జడముగ పనిచేయుట – చెవి ఎక్కువగ వాచుట, దాని నుండి అధిక స్రావం స్రవించుట.

**ఈ మందు ప్రత్యేకతలు :**

1. ఇది మూర్ఛకు సిద్ధౌషధం.
2. ఈ మందు ఫెర్రంఫాస్‌తో పాటు అనేక డిఫ్తీరియా కేసులకు ప్రధాన ఔషధం.

**ఉద్రేకములు :** క్రొవ్వు పదార్థములు, పిండివంటలు, కదలికలు, బిగువైన దుస్తులు, ఎండా కాలం, వేడి, శబ్దములు, ఒత్తిడి, తెల్లవారుజాము.

**ఉపశమనములు :** చల్లని పానీయములు, విశ్రాంతి, కప్పుకొనుట.

**ఈ మందు లభించు పొటెన్సీ :** 3× నుండి 1000× వరకు.

**ఈ లవణమును ఏ పొటెన్సీలో ఎప్పుడు వాడాలి ?**

1. **డిఫ్తీరియా :** 3× లోపలికి – అంతేకాకుండా ఈ మందు 4,5 మాత్రలను ఒక గ్లాసు నీటిలో వేసి పుక్కిలించవచ్చు.
2. **కాల్పులు, గెడ్డలు, రాచ పుండ్లు, సురుగుడు కాయలు :** వీటికి ఈ మందును 3×లో నోటిలో వేసుకోవాలి. అంతే గాకుండా ఈ మందును ద్రవం రూపంలో తీసుకొని దూది మీదవేసి పైపూతకు వాడవచ్చు.
3. **దీర్ఘకాలిక మానసిక వ్యాధులు:** 30×, 200×

**మయాజమ్ :** ట్యూబర్క్యులర్.

**మానసిక స్వభావం :** తేలికగా

3. పొంగు, ఆటలమ్మ (Measles)[1]కు దీనిని నివారణ ఔషధం (preventive remedy)గా వాడవచ్చు.

ఉత్తేజం పొందుట (Nervous).

**ఉష్ణసహనం :** సామాన్యంగా ఉష్ణమును సహించలేకపోవుట – కొన్ని సమయాల్లో చలిని సహించ లేకపోవుట.

**మందు పనిచేయు కాలం :**

స్వల్పకాలం.

**ప్రత్యేకతలు :**

1. కష్టపడి పనిచేయనివారికి; సోరా, సైకోసిస్, అనుమాన స్వభావం గలవారికి ఇది మంచి మందు – **డా॥ సౌందర్.**
2. ఎంపికచేసిన ఏ మందైనా పనిచేయనిచో ఈ మందును వాడిన తర్వాత ఆ మందును వాడిన అది సరిగా పనిచేయును. కనుక దీనిని హోమియో సల్ఫర్ అని అందురు.
3. కాల్కేరియా సల్ఫ్ కాలీమూర్ పనిని సంపూర్ణం చేయును.

*1. **పొంగు, నూకలమ్మ (Measles) :** ఇది ఎర్రని, చిన్న, నూకల వంటి తట్టుతో కూడిన అంటువ్యాధి. ఇది రావటానికి ముందు జలుబు, జ్వరం వచ్చును.*

## మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు :**

★ మారునట్టి మానసిక స్వభావం – ఒకసారి దుఃఖముగాను, మరొకసారి సంతోషముగాను ఉండుట.

★ రోగ నివృత్తికి ఉపవాసం వుండదలచుట.

★ ఆతురత, చిరచిరలాడుట, ఆత్మ విమర్శ చేసుకొనుట, సోమరితనం, జీవితం పట్ల అసహ్యం, జీవితమంటే భయం.

★ ఉన్మాదం.

**2. తల :**

★ **తలనొప్పి :** వాంతితో కూడిన తలనొప్పి – పాల వంటి కఫాన్ని కాంక్షించుట.

★ తలమీద చుండ్రు – తెల్లని పొలుసులూడుట.

★ చిన్న పిల్లల తలపై తెల్లని రసికారు చర్మవ్యాధి.

★ మెనింజైటిస్[1] పొర వాపులో ఇది రెండవ మందుగా పనిచేయును.

**3. కళ్ళు :**

★ కళ్ళు వాచి ఎర్రగా, నొప్పిగా ఉండుట – తెల్లని/పచ్చని స్రావం.

★ తెల్లగ్రుడ్డుపై చదునైన పుండ్లు/నీటి బొబ్బలు.

★ కంటిలో ఇసుకవున్నట్లు అనిపించుట (FP).

★ రెటీనా (నేత్రపటలము) శోథము – వెలుతురు చూసిన కళ్ళ నుండి నీరుకారుట.

★ కనురెప్పలందు నూకలవలె నుండుట.

★ శుక్లము (Cataract) నకు కాల్కేరియా ఫ్లోర్ తర్వాత దీనిని వాడవలెను.

★ కంటి తెల్లగ్రుడ్డు పొరలందు చీముకూడుట – కనుగ్రుడ్ల పూర్వాంత కక్ష్యలో చీము కూడుట – దుర్మాంసం పెరుగుట – కార్నియా శోథము.

**4. చెవులు :**

★ మధ్య చెవిలో పుండ్లు వుండుట వల్ల చెవుల నుండి తెల్లని స్రావం దీర్ఘకాలంగా వచ్చుచుండుట.

★ మధ్యచెవి చర్మమందును, వెలుపలి చర్మమందును చిన్న నూకల వలె నుండుట.

★ మధ్యచెవి/కర్ణాంతర నాళములు[2] వాచుట – చెవుడు/చెవిపోటు.

★ ముక్కు చీదునపుడు, గుటక వేయునపుడు చెవిలో శబ్దములు వినబడుట – టప్ అను ధ్వని వినబడుట.

★ చెవి ప్రక్కన వుండు మాంసగ్రంథులు వాచుట.

★ కర్ణభేరి వెనుకకు లాగబడుట.

★ ఈ మందు కుడివైపున ఉండు కర్ణాంతర నాళం వాపుకు బాగా పనిచేయును.

**5. ముక్కు :**

★ జలుబు – ఈ లక్షణం వున్నప్పుడు ఈ లవణమును FPతో మార్చి ఇవ్వవలెను.

★ శ్లేష్మం/చీమిడి చిక్కగా, తెల్లగా వుండును – తలలో దిబ్బడ వేయు జలుబు.

---

*1. **మెనింజైటిస్** (Meningitis) : మెదడును, వెన్నుపాములోని మజ్జను చుట్టియున్న మెనిక్స్ పొరలు వాచుట.*

*2. **కర్ణాంతరనాళం/యూస్టేషియన్ నాళం :** ఈ నాళం గొంతుక నుండి లోపలి చెవి వరకు ఉండును.*

★ సవాయి రోగం వల్ల ముక్కులో పుండ్లు ఏర్పడును.

★ మధ్యాహ్నం తర్వాత, ముక్కు నుండి రక్తస్రావం – పొడిగా నుండు జలుబు.

★ సప్తపథ కప్పు పొక్కులతో ఉండుట.

**6. ముఖం :**

★ దవుడలు/చెంపలు వాచి నొప్పిగా నుండుట – దీనికి ఈ మందును FPతో మార్చి వాడాలి. ముఖం మీద మొటిమలు – దీనికి 3× లోషనును మందుగా వాడవలెను.

★ శిశువులలో ముఖం మీద గజ్జి.

★ ముఖం/చిగుళ్ళు వాచుటచే ముఖం నొప్పి.

**7. నోరు :**

★ నోటియందు తెల్లని చిన్న పుండ్లు (ముఖ్యంగా చంటి పిల్లలలోను, పాలిచ్చు తల్లులలోను).

★ దవుడ, మెడ గ్రంథుల వాపు, నోరు పొడిగా వుండుట – నోటి చర్మం ఒరియుట – నోటిలో కొరుకుడు పుండ్లు.

**8. నాలుక :**

★ నాలుక వాచి ఉబ్బుట.

★ నాలుకపై తెల్లని/నుసి వర్ణపు, పొడిగ/జిగురుగనుండు పూత.

★ నాలుకపై మ్యాపులవలె వివిధ ఆకృతులుగల మచ్చలు.

**9. దంతములు :** చిగురుపై ఏదైనా పదార్థం ఏర్పడటానికి పూర్వం కురుపు.

★ ఇగుళ్ళ, దవుడల వాపుతోకూడిన పంటినొప్పి.

**10. గొంతు :**

★ డిఫ్తీరియా కేసులకు ఫెర్రంఫాస్‌తో ఈ మందు బాగా పనిచేయును.

★ గొంతు వాచినా, పెరోటిడ్ గ్రంథులు[1] వాచినా ఈ మందును 3× పొటెన్సీలో నోటిలో వేసి పుక్కిలించవలెను.

★ టాన్సిల్స్ వాచి పెద్దవై ఊపిరాడుట కష్టముగా నుండుట.

★ ముక్కు కాయలు/ఎడినాయిడ్స్ పెరుగుట.

★ మ్రింగునప్పుడు నొప్పిగానుండుట.

★ గొంతులో బూడిదవర్ణపు మచ్చలు/అతుకులు – తెల్లని పదార్థం కూడుట.

★ గొంతు చిక్కని, బంకగా నుండు కళ్ళెతో నిండియుండును.

*1.* ***పెరోటిడ్ గ్రంథులు :*** *ఇవి చెవి వద్ద నుండును.*

**11. జీర్ణాశయం :**

★ ఆకలి తక్కువ.

★ క్రొవ్వు పదార్థాలు, పప్పుదినుసులచే తయారైన పిండివంటలను తినుటవల్ల వచ్చు అజీర్ణం – భుజం క్రింద కుడివైపున బరువుగా నున్న భావన.

★ అధిక పైత్యం – చిక్కని, తెల్లని స్రావమును వాంతి చేసుకొనుట.

★ చాలా వేడి పానీయాలను త్రాగుటవల్ల జీర్ణాశయం వాచుట.

★ మలబద్ధకంతో కడుపునొప్పి.

★ నల్లని జిగటగానున్న రక్తాన్ని గడ్డలు – గడ్డలుగా / తెల్లని, చిక్కని కళ్ళెను వాంతి చేసుకొనుట.

★ కామెర్ల వ్యాధి (జీర్ణాశయం నొప్పి, అమితమగు మలబద్ధకం, నోటి యందు చేదు రుచి).

★ మితిమీరిన ఆకలి – నీరు త్రాగిన తగ్గుట.

**12. ఉదరకుహరం – విరేచనాలు :**

★ కామెర్లు – దీనిలో లేత పసుపు/గోధుమ పసుపురంగు/రేగడిమట్టి వర్ణపు/తెల్లని/ జిగురు పడు విరేచనాలుండును.

★ కాలేయం పని మందగించును – కుడివైపున నొప్పి.

★ టైఫాయిడ్ (సన్నిపాతజ్వరం)కు ఇది మంచిమందు.

★ ఉదరకుహరం వాచుట.

★ ఉదరకుహరం పెద్దదగుట – అపానవాయువుతో నిండుట.

★ పెరోటిడ్ గ్రంథుల వాపు, ఎప్పెండిక్స్ వాపు (ద్వితీయ దశ).

★ మలబద్ధకం – లేత రంగు మలం.

★ క్రొవ్వు పదార్థాలు తిన్న తర్వాత నీళ్ల విరేచనాలు.

★ బంక విరేచనాలు.

★ నల్లని, చిక్కని రక్తపు గడ్డలను స్రవింపచేసే మొలలు.

**13. మూత్రావయవములు :**

★ మూత్రాశయపు తీవ్రమగు వాపు – దీర్ఘకాలం నుంచి వున్నచో ఇది ప్రధానమైన మందు. – మూత్రం నల్లగా, యూరిక్ యాసిడ్‌తో కలిసి వెడలుట – తెల్లని, చిక్కని శ్లేష్మం స్రవించుట – మూత్ర విసర్జన తరచుగాను, దుర్వాసనతోను వుండుట – మూత్రవిసర్జన కష్టముగా నుండుట.

**14. పురుష జననేంద్రియాలు :**

★ బీజముల వాపు (CP) – దీర్ఘకాలపు సవాయిలో పుండ్లు – వీర్యస్కలనం – సుఖవ్యాధుల వల్ల గజ్జలందు వాపు – గ్లీట్‌వ్యాధి – దీర్ఘకాలపు సెగ వ్యాధిలో మూత్రమార్గపు మంట, వాపు, అందులో రసికారుట.

**15. స్త్రీ జననేంద్రియాలు : బహిష్టు :** బహిష్టు ఆలస్యముగా అగుట/అణచి పెట్టబడుట/ ఆగిపోవుట/అతి త్వరగా వచ్చుట – స్రావం అధికముగా, గడ్డలవలె/చిక్కగా, తారువలె/ నల్లగా చాలారోజులు అగుట – గర్భకోశపు ద్వారం/రంధ్రం పుండ్లు పడుట – చిక్కని, తెల్లని, బాధ కలిగించని స్రావం వచ్చుట – రక్తప్రసార దోషంవల్ల గర్భకోశం పెద్దదగుట (దీర్ఘకాలపు) – ద్వితీయ దశ.

**తెల్లబట్ట / కుసుమ :** ఇది పాలవలె తెల్లగానుండును – ఇది క్షోభ (Irritation) కలిగించదు.

**గర్భిణి :** గర్భిణిలో వాంతులు, తెల్లని కఫం వాంతియగుట.

**బాలింతరాలు :** బాలింతరాలు యొక్క సూతికా జ్వరమునకు ఇది ప్రధానమైన మందు. స్తనాల వాపులో ఈ మందు వాపును నియంత్రించును.

**16. శ్వాసావయవములు :**

1) **జీర్ణవ్యవస్థ పాడగుటచే వచ్చు ఉబ్బసం :** దీనిలో కళ్ళె (Mucus) తెల్లగానుండును. దానిని కాండ్రించుట కష్టమగును.

2) **పొట్ట నుండి వెలువడు దగ్గు :** ఇది హ్రస్వంగా, ఉద్ధృతంగా ఈడ్పులతో (Spasmodic) కూడి ఉండును. దగ్గు బిగ్గరగా శబ్దం చేస్తూ వెలువడును. కోరింతదగ్గు వలె ఉండును. కళ్ళె చిక్కగా, తెల్లగాను, నాలుకపై తెల్లని పూత. కళ్ళు ముందుకు తోసుకొని వచ్చినట్లుండును.

3) **బ్రాంకైటీసు (శ్వాసనాళోపశాఖ వాపు) :** ద్వితీయదశ – తెల్లని చిక్కని శ్లేష్మమేర్పడును.

4) **క్రూపు (స్వరపేటిక వాపు) :** మొరటైన దగ్గుతో ఊపిరిపీల్చుట కష్టముగానుండును. ఈ వ్యాధిలో చెమర్చుటకు ఇది ముఖ్యమైన మందు.

5) **న్యుమోనియా (ఊపిరితిత్తుల వాపు) :** ద్వితీయ దశ – తెల్లని జిగురువంటి కళ్ళె.

6) **ప్లూరసీ[1] :** ద్వితీయ దశ – మెత్తని పదార్థం చెమర్చుట – భాగములు అస్వభావికముగ అంటుకొనుట/అతుకుకొనుట.

---

*1. **ప్లూరసీ (Pleurisy) :** ఊపిరితిత్తులను చుట్టియుండెడి ప్లూరా యనెడి పొరల వాపు. ఈ వ్యాధి మొదట్లో అధిక చలి, జ్వరం, ఛాతీయందు నొప్పియుండును.*

**7) క్షయకు సంబంధించిన దగ్గు :** దీనిలో తెల్లని, చిక్కని, పాల వంటి కళ్ళె పడును. శ్వాసనాళోపశాఖలందు శ్లేష్మం చేరును – గురగుర శబ్దములతో దగ్గు విడిచి విడిచి వచ్చును – దగ్గు ఉద్ధృతముగా వచ్చినప్పుడు చంటి పిల్లవాడు కంఠమును/ గొంతును గట్టిగ పట్టుకొనును.

**17. రక్తప్రసరణావయవములు :** రక్తమందు కుదుపులు ఏర్పడి రక్తప్రసరణకు ఆటంకం కలుగుట – గుండె పెద్దదగుటచే రక్తం అమితముగ ప్రవహించుట వల్ల గుండె దడ – హృదయంపై పొర శోథము – నాడి బలహీనంగా ఉండుట – హృదయమందు కుట్టుచున్నట్టి నొప్పికి ఈ మందును FPతో మార్చి మార్చి వాడాలి.

**18. మెడ, వీపు, కాళ్ళు, చేతులు :**

★ మెడ యందలి గ్రంథులు ఉబ్బుట.

★ నడుము నుండి పాదములకు మెరుపుతీగ వంటి బాధలు.

★ కాళ్ళు – పాదములు దీర్ఘకాలంగా వాచియుండుట – అవి బాధారహితంగా ఉండుట – ఉద్ధృతమగు దురద.

★ కాళ్ళు – చేతులపై పుండ్లు.

★ వ్రేళ్ళు కొంకరులు పోవుట.

★ వ్రాయునపుడు చేతులు బిర్రబిగియుట.

★ కీళ్ళవాతం దీర్ఘకాలం నుండి ఉండుట – కదిలినపుడు మాత్రమే కీళ్ళవాత నొప్పులు వచ్చుట, రాత్రిపూట అవి అధికమగుట (F.P).

★ శయ్య వేడిమివల్ల ఎక్కువగుట.

★ తుంటి కీలుకు చీము ఏర్పడుట.

★ కాళ్ళపై పుండ్లు – వాటి నుండి పీచు వంటి స్రావం.

★ బొటనవ్రేలి కీళ్ళ వద్ద గల ద్రవపు తిత్తి వాచి బాధపెట్టుట .

★ చేతి వెనుక భాగాన ఉండు స్నాయు బంధనములు (Tendons) శబ్దం చేయుట. చేతులపైన/కాళ్ళపైన/ఏభాగంలోనైనా శీతాకాలమున చర్మం ఎరుపెక్కి పుండ్లుపడుట.

**19. నాడీ వ్యవస్థ :** గజ్జితో లేక గజ్జి/వ్రణములను అనచిన వచ్చు మూర్ఛకు ఇది ప్రధానమైన మందు. వెన్నెముక నందలి మజ్జను శుష్కింపజేయు వ్యాధి.

**20. చర్మం :**

★ పుండ్లు వాచి తెల్లని పదార్థంతో నిండి ఉండుట.

★ చర్మం నుంచి తెల్లని పొలుసులు ఊడుట.

★ పాడైన టీకాలు వేసిన వచ్చు వ్యాధులు.

★ అమ్మవారు (పొంగు, ఆటలమ్మ, మసూచికం)కు ప్రధాన ఔషధం.
★ పొక్కులు, మొటిమలు వీటికి ఈ మందును 3×లో తీసుకొని పేస్ట్ చేసుకొని రాత్రిపూట ముఖానికి పూయాలి.
★ కాల్పులు, బొబ్బలు (ఈ మందును పైకి, లోపలికి వాడాలి).
★ పిల్లల తల మీద చీము కారునట్టి కురుపులు.
★ కాలిగోళ్ళ చర్మం లోపలికి పెరుగుట.
★ గోళ్ళు దళసరిగా నుండుట.
★ అతి శీతలం వల్ల కాళ్ళు/చేతులు/ఏదైనా శరీరావయవం చర్మం ఎరుపెక్కి, వాచి, తీవ్రమగు దురద, మంటతో నుండుట.
★ విసర్పి/అక్కి (Erysipelas).
★ చేతులపై పులిపిరికాయలు (warts).
★ వ్రణములు/కురుపులు/పుండ్లు/రాచపుండ్లలో ధాతుకణముల మధ్య చెమర్చుట.

**21. జ్వరం :**

★ **జలుబు జ్వరం :** అధికముగ చలి ఉండును. ఏమాత్రం చలి తగిలినా వెచ్చదనం కొరకు నిప్పు వద్ద కూర్చొనవలెను. దుప్పటి కప్పుకొని పడుకొన్న చలి తగ్గును.
★ **జీర్ణకోశ సంబంధమైన జ్వరం :** సన్నిపాత జ్వరం (టైఫాయిడ్) – ద్వితీయదశ.
★ కీళ్ళవాత జ్వరం.
★ ప్రసవాంతర జ్వరం (KP, FP).
★ మలేరియా జ్వరం.
★ టైఫస్ జ్వరం – దీనిలో ఈ మందు మలబద్ధకమును నివారించును.
★ స్కార్లెట్ జ్వరం; దీనిలో ఈ మందును FPతో ఇవ్వాలి. అంతేగాకుండా ఈ మందు స్కార్లెట్ జ్వరానికి నిరోధకంగా పనిచేయును.

**22. నిద్ర :**

★ స్వల్ప అలికిడికి ఉలికిపడుట.
★ నిద్రమత్తు.
★ అస్థిమితమగు నిద్ర.

**23. ధాతువులు :**

★ చర్మవ్యాధులతోపాటు రక్తహీనత ఉన్నచో ఈ మందును మధ్య–మధ్య వాడాలి.
★ నల్లని రక్తపు గడ్డలను స్రవించు రక్తస్రావములు.

★ గుద్దిన, కోసిన, నలిగిన తర్వాత కలుగు వాపులకు.
★ పైత్యరస నాళములలో ఏర్పడు ఆటంకముల వల్ల, గుండె బలహీనతవల్ల, గుండె వడిగా కొట్టుకొనుట వల్ల వచ్చు ఉబ్బువ్యాధి.
★ మూత్రములో తెల్లని పదార్థం ఉండుట – నాలుకపై తెల్లనిపూత.
★ ధాతు కణముల మధ్య ఉండు సంధాయక కణములలో పీచువంటి లింఫ్ స్రావం చెమర్చుట.
★ ధాతువుల వాపులకు, తిత్తులలోనికి చొచ్చుకొనిపోవుటకు ఇది ముఖ్యమైన మందు.
★ మానుతున్న గాయం చుట్టూ మాంసపు కండ ఏర్పడుట – లేత కణజాలం సమృద్ధిగా ఏర్పడుట.
★ క్షయవ్యాధిలో గ్రంథుల వాపు.
★ స్కర్వీ వ్యాధిలో గట్టిగా ఉండు వాటిలోనికి చొచ్చుకొనిపోవుట.
★ బెణుకులకు ఇది రెండవమందు.
★ వ్యాక్సినేషన్ చెడు ఫలితాలు.
★ సిఫిలిస్.

## 6. కాలీఫాస్ / కాలీ ఫాస్ఫారికం
## Kali Phos/Kali Phosphoricum

**రసాయనిక నామం :** పొటాషియం ఫాస్ఫేటు.

**వాడుక పేరు :** ఫాస్ఫేటు ఆఫ్ పొటాష్.

**ఈ లవణం దేహములో వుండు ప్రదేశములు :** శరీర ద్రవములన్నింటియందు, ధాతువులన్నింటి యందు ముఖ్యముగా మెదడు, నరములు, కండరములు, రక్తకణములలో ఈ లవణం ఉంది.

**ఈ లవణం ప్రాముఖ్యత :** ఇది అద్భుతమైన మందు. ఇది గుండెకు టానిక్ (Brain Tonic) వంటిది. నాడీ సంబంధ వ్యాధులలో ప్రధానమైన మందు. ఇది సూక్ష్మక్రిములను వృద్ధి చేయకుండా ధాతువులను, కండరములను మొదలైన వాటిని కుళ్ళకుండా ఆపుచేయు యాంటిసెప్టిక్ మందు. ఇది పక్షవాతానికి

**ఉద్రేకములు :**

చల్లగాలి, చల్లదనం, ఒంటరి తనం, మానసిక ఉద్రేకం, శారీ రక శ్రమ, శబ్దములు, కూర్చొని లేచుట, విశ్రాంతి, సంభోగం, అలియుట, ఎడతెగని పరిశ్రమ, తెల్లవారుజాము, 2 గం|| – 5 గం||.

**ఉపశమనములు :**

నిదానముగా కదలుట, భుజించుట, వేడి, ఇతరులతో కలిసి ఉండుట, వంగుట, కప్పుకొనుట, విశ్రాంతి.

మంచి మందు. ఈ మందు గర్భస్రావాన్ని, గర్భిణీ దొంగ నొప్పులను నివారించును. ప్రసవాంతర బాధలను తొలగించును. గర్భం దాల్చినప్పటి నుండి ప్రసవించు వరకు దీనిని CFతో యిచ్చిన సుఖ ప్రసవమగును. ప్రసవ సమయమందు CF-6x, KP-6x, MP-6x మార్చి మార్చి వేడినీటితో ఇవ్వవలెను.

ఇది స్ఫోటకము నిరోధక మందు. వృత్తి కార్యకలాపాలలో తలమునకలైనవారు ఈ మందును తీసుకొన్న ప్రశాంతతను పొందుదురు. పిల్లల సంరక్షణలో విసిగివేసారిన తల్లి ఈ మందును రాత్రిపూట తీసుకొన్న హాయిగా నిద్రించును.

**ఈ లవణ లోపం వల్ల వచ్చు బాధలు :**

ఈ లవణ లోపం వల్ల క్రింది లక్షణాలు కనిపించును.

1. ఆత్మబలం లేకపోవుట, సిగ్గు, పిరికితనం, పదిమందికి తెలియుట ఇష్టం లేకుండుట, ఆందోళన, భయం, కన్నీరు కార్చుట, అనుమానం, ఇంటికి దూరంగానున్నపుడు ఇంటికి పోవలయుననెడి బెంగ, జ్ఞాపకశక్తి నీరసించుట, క్రుంగుట మొదలైనవి.
2. రక్తనాళముల మీద పనిచేసి, రక్త ప్రసరణను అదుపులో ఉంచు నరములు తొలుత చిన్నవిగాను, వడిగాను, తర్వాత మెల్లగాను ఉండుట.
3. రస, రూప, స్పర్శ, గందాదులను మెదడుకు తెలుపు నరములు పక్షవాతం పొందినట్లు బాధగా నుండుట.
4. చలనమును కలిగించు నరములు నిస్త్రాణ మొ॥ పక్షవాతం వరకు గల వివిధ స్థితులలో నుండుట.
5. ఒక ప్రదేశమందలి నరములు బలహీనమై శిథిలమగుట.

**ఈ మందు లభించు పొటెన్సీ :**

3× నుండి 1000× వరకు.

**ఏ పొటెన్సీని ఏ రోగానికి వాడాలి ?**

**1) ఉబ్బసం :** 6×, 12×.

**2) దీర్ఘకాల వ్యాధులు :** 3× నుండి 1000× వరకు.

**3) అవసాన కాలం :** హెచ్చు పొటెన్సీ.

**మయాజిమ్ :**

సిఫిలిస్, ట్యుబర్క్యులర్.

**మానసిక స్వభావం :**

తేలికగా ఉత్తేజం పొందుట.

**ఉష్ణసహనం :**

సామాన్యముగా ఉష్ణమును సహించలేడు. కొన్ని పరిస్థితులలో చల్లదనం సహించలేడు.

**మందు పనిచేయు కాలం :**

సరిగా తెలియదు.

# మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు :**

ఆందోళన – నాడీ మండల అమిత భయం – ప్రత్యేక కారణం లేకుండానే – ప్రతి విషయమందు చెడు జరుగునని ఊహించుట – లేనిది ఉన్నట్లు తలంచుట – విచారముగ నుండుట – చిరచిరలాడుట – జ్ఞాపకశక్తి తగ్గుట (CP) – మందకొడిగా నుండుట – శబ్దములను ఏ మాత్రం ఓర్చుకొనలేకపోవుట – జడముగానుండుట – ఆకస్మికముగా హిస్టీరియా వచ్చుట (NM) – ఏకాంతం కోరుట – ఇతరులతో కలవలేకపోవుట – ఇతరులతో మాట్లాడుట ఇష్టం లేకపోవుట – నిద్రలో మాట్లాడుట – నడచుట – దయ్యాలగుపడుట – సందర్భం లేని / త్రాగుబోతుల వాగుడు– నిద్రమత్తు – పని/చదువుపై మనస్సును కేంద్రీకరించలేకపోవుట – తెలివితేటలు తక్కువ – కోపం, చెడు స్వభావం – ఇతరులను బాధపెట్టు స్వభావం – ప్రసవానంతరం సంధి లక్షణాలు – వ్రాయునపుడు అక్షరాలు, పదాలు వదలివేయుట – తప్పు శబ్దాలు ప్రయోగించుట – ఆలోచనల గందరగోళం – ఇతరులు మాట్లాడునప్పుడు తప్పులు వెదకుట – గత దృశ్యములు అగుపించుట – భయం/దుఃఖం తర్వాతి పరిణామాలు – నిద్రలేమి – అస్థిమితం – చప్పుడు/అల్లరి/ధ్వనిని సహించలేకపోవుట.

పిల్లలలో కేకలువేయుట, కుక్కవలె మొరుగుట, సిగ్గు, ముఖం బాగా ఎర్రబడుట, నిద్రలో లేచి స్పృహ లేకుండానే పనులు చేయుచుండుట, నిద్రలో మాట్లాడుట, మెలకువగా నున్నప్పుడు ఒక గది నుండి వేరొక గదికి త్రిప్పుమని కోరుట కనిపించును. ఉద్రేక కంపములతో చేయు వెర్రి (Hysteria) చేష్టలు – నవ్వుట, ఏడ్చుట.

**2. తల**

**తలనొప్పి :**

1. తల తిరుగుట : లేచినపుడు, పరుండినపుడు, నిలబడినపుడు, కూర్చొన్నప్పుడు, పైకి చూచినపుడు తలతిరుగుట.
2. నాడీ మండలపు అలసట వల్ల నీరసం, తలత్రిప్పు, తలదిమ్ము.
3. నుదుటి యందు మొద్దుగ నుండు నొప్పి తలుపులు వేసిన గదిలో అధికమగుట – అలసినట్లుండుట.
4. మెదడులో రక్తక్షీణత, మెదడుకు కలుగు అదరుపాటు (concussion), నీరస పరిస్థితులు.
5. నాడీమండల ఉద్రేకత వలన కలుగు తలనొప్పి, శబ్దమును సహించలేకపోవుట, తికమక.

6. విద్యార్థుల తలనొప్పి.
7. అలసటచే శిథిలమైన వారి తలనొప్పి.
8. మెల్లగ నడచుట వల్ల తలనొప్పి తగ్గుట.
9. తల వెనుక భాగమున, కళ్ళకెదుట నొప్పిగను, బరువుగను ఉండుట, అప్పుడు అలసట, నిస్త్రాణ, ఆలోచించలేకపోవుట; ఈ నొప్పులు భుజించుటవల్ల తగ్గుట.
10. అలసట, పొట్ట శూన్యముగనున్న భావనతో గల తలనొప్పి.
11. నాడీ సంబంధమైన నొప్పులు (చెవులందు హుంకార శబ్దములు, నిలబడలేక పోవుట) – సంతోషకరమైన మానసికోద్రేకత, విచారకరమైన మానసిక స్థితి, భుజించుటవల్ల ఈ నొప్పులు తగ్గుట.
12. మెదడునందు నీరు కూడుట.
13. వెంట్రుకలను లాగినట్లుగా తలవెనుక భాగాన పుండువంటి నొప్పి.
14. ఎడమ కణత (Mastoid) క్రింది భాగాన తీవ్రమగు నొప్పి – ఈ నొప్పి కదలిక వల్ల, ధారాళమైన గాలివల్ల / బహిరంగ ప్రదేశమున అధికమగును.

**3. కళ్ళు :**

★ డిఫ్తీరియా వల్లను, నిస్త్రాణ వల్లను చూపు మందగించుట/మెల్ల ఏర్పడుట/వస్తువు దూరమును బట్టి కంటికటకం మార్పు చెందకపోవుట.

★ కంటి కండరములు వస్తువులను బట్టి సమన్వయం చేసుకొనకపోవుట / దగ్గరి వస్తువులను సరిగా చూడలేకపోవుట.

★ కళ్ళల్లో ఇసుక/కర్రపుల్లలు వున్నట్లు తోచుట.

★ కనుగ్రుడ్లలో పుండు వంటి నొప్పి.

★ కనురెప్పల అంచుల చుట్టూ (పొగతో నిండినట్లు) పుండు వంటి బాధ.

★ కనురెప్పలు అదరుట.

★ కళ్ళ ముందు నల్లని మచ్చలు.

**4. చెవులు :**

★ నరముల బలహీనత, నిస్త్రాణ వల్ల చెవుడు, గాఢ నిద్ర తర్వాత చెవిలో హుంకారం, బజ్ శబ్దాలు (MP)

★ చెవుల నుండి అసహ్యాకరమైన, దుర్వాసన గల రసి వంటి చీము.

★ మధ్య చెవి చీము పట్టుట.

★ కర్ణభేరిలో పుండ్లు.

★ కర్ణనాళములో దురద.

★ వినికిడి అతి సున్నితం – ఎలాంటి శబ్దం తాళలేకపోవుట.
★ ముసలివారి ధాతువులు ఎండి పొలుసులుగా మారుట.

**5. ముక్కు :**

★ బలహీనముగను, సున్నితముగను ఉండునట్టి వ్యక్తుల ముక్కుల నుండి రక్తస్రావం.
★ ముక్కు పుండు పడి దుర్వాసన గల చిక్కని, పసుపుపచ్చని స్రావం వెలువడుట/పక్కులు ఏర్పడుట.
★ పసుపుపచ్చని పక్కులు చీదబడిన తర్వాత రక్తస్రావం పెరుగుట.
★ వెనుక నున్న ముక్కు రంధ్రముల నుండి చిక్కని శ్లేష్మమును చీదుట.
★ ముక్కుతో మాట్లాడినట్లుండుట (Nasal Speech).

**6. ముఖం :**

★ కమిలిన, శుష్కించిన, కళ్ళు గుంటలు పడిన ముఖం.
★ ముఖం నుదురు ఎర్రగా, వేడిగా, మంటగానుండుట.
★ ముఖం కుడివైపున నరాల బాధ – తదనంతరం అధిక నిస్త్రాణ – శీతల ఉపశాంతులచే నరాల బాధ తగ్గుట.
★ పై పళ్ళ వరుస నుండి ఎడమ చెవి వరకు కుట్టినట్లుండు నరాల బాధ.
★ దవుడ ఎముకల నొప్పి తినుట, మాట్లాడుట, తాకుట వల్ల తగ్గును.
★ ముఖంలో కండరాల బలహీనతవల్ల వంకరలు ఏర్పడును.
★ గడ్డం క్రింద దురద, మొటిమలు/చిన్న చీము పొక్కులు.
★ నీళ్ళలో పనిచేయుటవల్ల ముఖమునకు సంబంధించిన పక్షవాతం వచ్చుట.

**7. నోరు :**

★ నోటివాపు.
★ ఇగుళ్ళు స్పాంజి వలె మెత్తగ నుండి వెనుకకు జారుట.
★ లాలాజలం/జొల్లు విస్తారముగ, చిక్కగ, ఉప్పగ నుండుట.
★ నోటిలో కుళ్ళు – బూడిదరంగు పుండ్లు.
★ పెదవులపై చిన్న చీము పొక్కులు పుండుపడి పక్కుకట్టుట – చర్మం పొర ఊడుట.
★ శ్వాస దుర్వాసనతో కుళ్ళు వాసన గొలుపునట్టిదిగా ఉండుట.

**8. నాలుక :**

★ ఉదయాన చాలా పొడిగానుండుట.
★ చాలా పొడిగానున్నప్పుడు/ఎక్కువ నిస్త్రాణ సంభవించినప్పుడు నాలుక వాచుట.
★ నాలుక అంచులు ఎర్రని పుండువలె బాధ పెట్టుట.

★ నాలుక నోటి పై భాగమునకు అతుక్కొనిపోయినట్లు భావించుట.

★ నాలుక తెల్లగా/గోధుమ వర్ణంలోను, జిగురుగానుండుట.

**9. దంతములు :**

★ **పంటినొప్పి :** తేలికగా ఉత్తేజం పొందునట్టి, సున్నితమైన, పాలిపోయిన, భావావేశం గల వారి సులభంగా రక్తమును స్రవించు, ఎర్రని చారగల ఇగుళ్ళు.

★ పంటినొప్పి చిగుళ్ళ రక్తస్రావమునకు సిద్ధపరచుట.

★ పళ్ళు కొరుకుట.

★ మాట మెల్లగ, అస్పష్టముగ నుండుట.

★ చిగుళ్ళు స్పాంజి వలె మెత్తగా నుండి వెనుకకు జారుట.

★ పళ్ళు బాధగా నుండుట.

★ పుచ్చిపోయిన/పెట్టుడు దంతములలో విపరీతమైన నొప్పి.

★ పంటి నొప్పి, నుదుటి తలనొప్పి – వీటిలో ఒకదాని తర్వాత మరొకటి వచ్చుట.

**10. గొంతు :**

★ **డిఫ్తీరియా తర్వాతి ప్రభావం :** దృష్టి బలహీనపడుట, ముక్కుతో మాట్లాడుట, ఏదేని అవయవపు పక్షవాతం, స్వరపేటికల పక్షవాతం, ధాతువులను క్షీణింపజేయు పరిస్థితులు అధికముగా నుండుట, నిస్త్రాణ.

★ **టాన్సిల్స్ :** టాన్సిల్స్ పెద్దవిగాను, బాధాకరంగాను ఉండుట – వాటిపై డిఫ్తీరియా వంటి తెల్లని, ఘనపదార్థపు పొర ఏర్పడుట.

★ గొంతు పొడిగానుండి ఎప్పుడూ ఏదో ఒకటి మ్రింగాలనుకొనుట – గొంతు బొంగురు పోవుట, స్వరం పోవుట – గొంతులో నుండి ఉప్పుగా నుండు శ్లేష్మం కాండ్రించుట – ధాతువులు క్రుళ్ళునట్టి (Gangrenous) గొంతునొప్పి అపాయకరమైన స్థితిలో ఉండుట, నిస్త్రాణ.

★ క్రూప్ చివరి దశలో తాత్కాలికముగ శ్వాస, రక్తప్రసరణ ఆగిపోవుట.

★ స్వరతంత్రుల పక్షవాతం – స్వరం పోవుట – బొంగురుతనం.

**11. జీర్ణకోశం :**

★ శరీరపోషణకు సంబంధించిన నరాలు సక్రమంగా పనిచేయకపోవుటవల్ల జీర్ణకోశానికి పుండు ఏర్పడుట.

★ అన్నం తిన్న తర్వాత విపరీతమైన ఆకలి, జీర్ణకోశపు గుంట ఖాళీగా నున్నదను భావన, వాయు పూరితమైన త్రేపులు, నీరసం. ఈ లక్షణాలకు చికిత్స ఆలస్యమైనచో జీర్ణకోశపు వాపు ఏర్పడును.

★ క్రుంగిపోవుట వల్ల అజీర్ణం.

★ కడుపు నొప్పి – భయం/ఉద్రేకం వల్ల.

★ ఎక్కువ దప్పిక – వమన వికారం – పుల్లని, చేదైన ఆహారాన్ని, రక్తాన్ని వాంతి చేసుకొనుట – తినుట కడుపులో ఏమీ లేదను భావనను, నమలుచుండు భావనను తగ్గించును.

★ చేదైన, పుల్లని త్రేపులు.

★ కడుపు మీద గల ఉదరకుహర మండలమందు ఒక చిన్న ప్రదేశంలో నిరంతరం నొప్పి వచ్చుట.

★ మెదడుకు సంబంధించిన బాధలవల్ల గాఢమైన ఆకుపచ్చ/నీలపు వాంతి .

**12. ఉదరకుహరం :**

★ ప్లీహము (Spleen)నకు సంబంధించిన బాధలు.

★ పొత్తికడుపు వాయుపూరితమగుట (కడుపుకు ఎడమ వైపున గుండె బాగుగా పనిచేయకపోవుట వల్ల) – అపానవాయువు/పిత్తులు వెలువడుట.

★ కడుపు మీద గల ఉదర కుహర మండలం (Epigastrium)లో శూల.

★ కటి ప్రదేశమందు బరువుగ క్రిందకు నొక్కుచుండు నొప్పులు.

★ నిష్ఫలమగు మల విసర్జన వాంఛ – ముందుకు వంగుటవల్ల ఈ పరిస్థితి మెరుగవుట.

★ అధికమైన నిస్త్రాణ.

★ నాడి క్షీణించుట.

**13. విరేచనాలు, మలం, మలద్వారం :**

★ భయం, క్రుంగదీయు ఇతర కారణాలవల్ల బాధలేని నీళ్ళ విరేచనాలు – ఇవి అధిక నిస్త్రాణ కలుగజేయును.

★ బియ్యపు కడుగువలె నుండునట్టి, రక్తముతోనున్న, కుళ్ళిన మాంసపు వాసన వచ్చునట్టి విరేచనం.

★ తప్పక వెళ్ళవలసిన నీళ్ళ విరేచనం, ఆ తర్వాత కడుపునొప్పి.

★ భోజనం చేయునపుడు తప్పక వెళ్ళవలసిన విరేచనం.

★ అపానవాయువు శబ్దంతోను, దుర్వాసనగాను ఉండుట.

★ అధిక దుర్వాసనగల, నొప్పిలేని విరేచనం.

★ కలరా విరేచనం.

★ పురీషనాళము (పెద్దప్రేగు చివరి భాగం)నకు, పెద్దప్రేగునకు స్వల్పముగా/ సంపూర్ణ ముగా పక్షవాతం.

★ పురీషనాళం మండుట – కదలికల వల్ల అది పుండుగా ఉండి జారుట.

★ మూలశంక (Piles) కంతులు పుండువలె నొప్పిగాను, బాధగాను, దురదతోను ఉండును.

★ మలబద్ధకం – గాఢమైన గోధుమ వర్ణం / పసుపు పచ్చ / ఆకుపచ్చ చీముతోనున్న మలం.

**14. పురుష జననేంద్రియాలు :**

★ అధిక సంభోగ వాంఛ–చాలాసార్లు (ఉదయం కూడ) రమించినా వాంఛ తీరకపోవుట.

★ పురుష జననేంద్రియం ఉద్రేకపూరితమై బాధగానుండుట.

★ రాత్రి పూట శిశ్నం ఉబ్బకనే బాధాకరమైన స్కలనం.

★ త్వరితముగ వ్యాపించు సవాయి పుండ్లు.

★ శిశ్నాగ్ర భాగం శోథం.

★ సంభోగేచ్ఛ తగ్గుట – నపుంసకత్వం.

★ సంభోగానంతరం అధిక నిస్త్రాణ – చూపు బాగా సన్నగిల్లుట.

**15. స్త్రీ జననేంద్రియాలు :**

★ స్త్రీలలో క్లిటోరిస్ యొక్క ఉబ్బెత్తుభాగం వాచుట.

★ **బహిష్టు :** నరముల ఉద్రిక్తత గల స్త్రీలలో బహిష్టు ముందుగా వచ్చును. వారిలో రక్తస్రావం అధికముగ ఉండును. ఇతరులలో క్రమం ఉండదు. బహిష్టు సక్రమముగా రాదు.

★ **బహిష్టు స్రావం :** నల్లగా, దుర్వాసనతో నుండును.

★ **బహిష్టు నొప్పి లక్షణాలు :** ఉత్సాహం తగ్గును – పనిచేయుటకు ఇష్టముండదు – మొద్దుబారిన తలనొప్పి – బాగా అలసిపోవుట – నిద్రమత్తు – కాళ్ళనొప్పి – నడుమంతటా, గర్భకోశపు ఎడమవైపునా సూదితో కుట్టినట్లు నొప్పి – అండాశయముల నొప్పి – త్రికాస్థి[1]కి అడ్డంగా నొప్పి.

★ బహిష్టు తర్వాత తీవ్రమగు సంభోగ వాంఛ.

★ **కుసుమ :** ఇది పసుపుపచ్చగా నుండి బొబ్బలు లేచునట్లు చేయును లేదా నారింజ రంగులో వేడిగనుండి మంట, ఒరుపు కలిగించును.

★ **గర్భిణి :** నాడీమండల ఉద్రిక్తత గల స్త్రీలలో గర్భస్రావం (Abortion).

★ దొంగ ప్రసవనొప్పులు.

*1. **త్రికాస్థి :** వెన్నెముక వెనుక భాగమున దానికి ఆధారంగా వుండు త్రిభుజాకారపు ఎముక.*

★ **బాలింతరాలు :**
★ నీరసం, అలసట కలిగించు కష్టప్రసవం.
★ స్తనాల వాపు – అపరిశుభ్రమైన, దుర్వాసనగల, గోధుమ రంగులోనున్న చీము – దుర్బలస్థితి.
★ ప్రసవానంతర/ప్రసవ సమయపు ఉన్మాదం.
★ ప్రసూతి జ్వరం.

**16. మూత్రావయవములు :**
★ మూత్రాశయపు సంవరణి కండరమునకు పాక్షిక/సంపూర్ణమైన పక్షవాతం.
★ నరాల బలహీనతవల్ల పెద్ద పిల్లలందు మూత్రం అప్రయత్నముగ పోవుట.
★ బలహీనస్థితిలో నున్న మూత్రకోశపు వాపు, శక్తి నశించుట.
★ మూత్రపిండముల బ్రైట్స్ వ్యాధి[1].
★ నరాల బలహీనత, విపరీతమైన ఆకలి మొదలైన లక్షణాలు గల చక్కెర వ్యాధి/అతిమూత్ర వ్యాధి.
★ రక్తస్రావంతోనున్న సెగ/గనేరియా.
★ కుంకుమ పువ్వువలె పచ్చగా నుండు మూత్రం.
★ మూత్ర విసర్జన నాళమందు దురద.
★ మూత్రకోశమందు, మూత్ర విసర్జన నాళమందు కోయుచున్నట్టి నొప్పి.
★ తరచుగా మూత్రవిసర్జన, మంట.

**17. శ్వాసావయవములు : ఉబ్బసం :**
★ కొద్దిపాటి ఆహారం తీసుకొన్నా ఉబ్బసం.
★ నాడీ వ్యవస్థ దుర్బలమైనపుడు వచ్చు ఉబ్బసం – ఈ లక్షణానికి ఈ లవణాన్ని 3× పొటెన్సీలో తరచుగా వాడవలెను.
★ హే ఉబ్బసం[2].

**దగ్గు :**
★ పుండుగా నుండు శ్వాసనాళపు క్షోభ (Irritation) వల్ల వచ్చు దగ్గు –కళ్ళె చిక్కగా, పసుపుపచ్చగా, ఉప్పుగా, దుర్వాసనగాను, ఛాతీ ఎక్కువ పుండుగాను వుండును.

---

*1. **బ్రైట్స్ వ్యాధి (Bright's disease) :** మూత్రపిండముల వాపు ఉండును. దీనిలో ఆల్బుమెన్ పోవును. సాధారణముగ ఒంటికి నీరు పట్టును.*

*2. **హే ఉబ్బసం :** పుప్పొడి మొదలైన వాటివల్ల వచ్చును. దీనిలో జలుబు, తుమ్ములు, కన్నీరు వచ్చును.*

- ★ నరముల ఆవేశం, అలసట అధికంగా ఉన్న వారిలో కోరింతదగ్గు వచ్చుట.
- ★ నురుగు, సీరంతో పొర్లుపొర్లుగ దగ్గువచ్చుట, ఊపిరాడకపోవుట.
- ★ మెట్లెక్కునపుడు/ఏదైనా శ్రమకు గురయినపుడు హ్రస్వశ్వాస/ఆయాసం.
- ★ క్రూప్ (అంతిమదశ) – అధిక బలహీనత, పాలిపోయిన ముఖం.

**18. రక్తప్రసరణావయవములు :**

- ★ భయం, అలసట మొదలైనవాటివల్ల కలుగు శోష.
- ★ దుఃఖం వంటి భావాల వల్ల, నరాల అధిక స్పందనవల్ల, గుండె అప్పుడప్పుడు పనిచేయుట ఆగిపోవుట వల్ల, మెట్లు ఎక్కుటవల్ల గుండె వడిగా కొట్టుకొనును.
- ★ రక్తహీనత, రక్తప్రసరణ మందముగా నుండుట, నిద్రలేమి, విశ్రాంతి లేమి.
- ★ నాడి మధ్య–మధ్య లోపించుట, క్రమం తప్పుట, మామూలు కన్నా తక్కువగా కొట్టుకొనుట.

**19. వీపు, కాళ్ళు, చేతులు :**

- ★ వెన్నెముక రక్తహీనత – వెన్నెముక మజ్జ శక్తిహీనముగా నుండుట – ఆ కారణాన రోగి తనకు తానుగా నడవలేకపోవుట, తూలుట, తప్పటడుగు వేయుట.
- ★ పక్షవాతం/కీళ్ళవాత సంబంధమైన కుంటితనం – విశ్రాంతి తర్వాత కూర్చొని తొలుత లేచినపుడు, ఉదయాన బిర్రబిగియుట/నొప్పులు ఎక్కువగుట – నెమ్మదిగా కదలుటవల్ల ఉపశమనం.
- ★ వీపు, కాళ్ళు, చేతులలో నొప్పి – కదలిక వల్ల ఉపశమనం.
- ★ రెక్క గూడుల (Shoulders) మధ్య నొప్పి.
- ★ చేతి వ్రేళ్ళ కొనలు నిద్రపోవునట్లుండుట.
- ★ అరచేతులు, అరికాళ్ళు దురద పెట్టుట.
- ★ రాత్రిపూట కాళ్ళు దురదగానుండుట, తిమ్మిరి, బలహీనత.
- ★ పాదముల అడుగు భాగాన పక్షవాతం – లాగుతున్నట్లు నొప్పి.
- ★ పాదముల మంట – పాదములు స్థిమితం లేక ఊగుచుండుట.
- ★ కూర్చొని లేచినప్పుడు/అధిక అలసట వల్ల నొప్పులు అధికమగుట.
- ★ వ్యాధిగ్రస్తమైన భాగములందు కముకు దెబ్బ తగిలినట్లుగను, నొప్పిగను ఉండుట, ఆ భాగముల రంగు మారుట.
- ★ కాలివ్రేళ్ళపై శీతలం (చర్మం ఎరుపెక్కుట, దురద, పుండుపడుట).
- ★ తీవ్రమైన రోగం వచ్చిన తర్వాత ఏర్పడు కండరాల బలహీనత.
- ★ తొడయొక్క ఊర్ధ్వభాగంలో నొప్పి.

**20. నాడీమండల వ్యవస్థ :** ఇది నరాలకు సంబంధించిన గొప్ప లవణం.

★ **పక్షవాతం :**

1) కాళ్ళు, మూత్రకోశం, ముఖం, కనురెప్పలు మొదలైన దేహభాగాలలో దేనికైనా పాక్షికంగా గాని, ఒకవైపు గాని కలుగునట్టి పక్షవాతం.

2) పక్షవాతం ఆకస్మికంగా వచ్చుట.

3) శుష్కించుటవల్ల వచ్చు పక్షవాతం.

4) చలనమునకు ఉపయోగపడు కండరాల పక్షవాతం – దీనివల్ల చలన శక్తి నశించును – ఇది నెమ్మదిగా ఎక్కువగును – ఇది ప్రాకుతూ వెళ్ళును – శరీరమును శుష్కింపచేయును – స్పర్శజ్ఞానమును నాశనం చేయును.

5) ముఖమునకు సంబంధించిన పక్షవాతం – భయం/అకస్మాత్తుగ కలుగు భావోద్వేగం వల్ల వచ్చు మూర్ఛ – మూర్ఛ తర్వాత గుండె వడిగా కొట్టుకొనుట – క్రుంగిపోయిన ముఖాకృతి – శీతలం.

6) చిన్నపిల్లల పోలియో.

★ నాడీమండల ఉద్రేకం, క్షోభతో కూడిన శారీరక నిస్త్రాణ – శారీరక బాధలు చాలా ఎక్కువగా ఉండుట – సునాయాసముగా ఉలికిపడుట – కన్నపు దొంగలను గురించి భయం.

★ క్రుంగుట, శక్తి నశించుట, శబ్దములను, వెలుగును సహించలేకపోవుట, ఒంటరిగాను, ప్రశాంతముగాను ఉన్నప్పుడు అనుభవంలోనికి వచ్చు నరాల బాధలు – ఇవి ఆహ్లాదకరమైన వాతావరణంలోను, నెమ్మదిగా నడచుట వల్ల తగ్గును.

★ సయాటికా నొప్పి – తొడవెనుక క్రింది భాగము నుండి మోకాలి వరకు వుండు లాగునట్టి నొప్పి – అధికమైన అస్తిమితం, నొప్పి, నాడీ సంబంధ నిస్త్రాణ – రోగి కన్నీరు కార్చి గోరంతలు కొండంతలుగా చెప్పుట.

★ క్షీణింపజేయు వ్యాధుల వల్ల వెన్నెముక రక్తహీనత – దీని వల్ల కుంటునట్లు చేయు నొప్పి (ఈ నొప్పి విశ్రాంతివల్ల అధికమగును – కదలుటకు ప్రారంభించినపుడు ఈ నొప్పి మొదలగును).

**21. నిద్ర :**

★ నాడుల బలహీనతవల్ల ఉత్తేజం కలుగుట – దానివల్ల నిద్రలేమి.

★ నిరంతరం నిప్పు, బందిపోటు దొంగలు, దయ్యములు, పడిపోవుచున్నట్లు కలలు గనుట.

★ ప్రేమ సంబంధమైన కలలు.

★ ఉదయాన నిద్రలేచు కోరిక లేకుండుట – గాఢ నిద్రపోయిన తర్వాత కండరాలు అదరుట.

★ పిల్లలు రాత్రిపూట భయపడుట, వారు ఆ భయంతో గాఢ నిద్ర నుండి మేల్కొని గట్టిగా కేకవేయుట, వారు నిద్రలో నడచుట, ఆవులింతలు, ఒడలు విరుచుట.

**22. జ్వరం :** విడిచి విడిచి వచ్చు జ్వరం : దీనిలో దుర్వాసన గల, నిస్త్రాణ గలిగించు చెమట విస్తారముగ వచ్చును.

★ **టైఫస్ జ్వరం :** ఇది అంటువ్యాధి. దీనిలో రోగి అధికముగ క్రుంగును – జ్వరం ఎక్కువ – శరీరంపై తట్టు.

★ ధాతువులు క్రుళ్ళునట్టి జ్వరం : ఇది అపాయకరమైనది.

★ మెదడు వాపు జ్వరం : ఇది నరములకు సంబంధించినది.

★ టైఫాయిడ్ జ్వరం.

★ జీర్ణాశయ వ్యాధులకు సంబంధించిన జ్వరం.

★ ప్రేగులకు సంబంధించిన జ్వరం (Enteric fever).

★ **హే ఫీవర్ :** ఇది నాడుల క్షోభవల్ల వచ్చును.

**పై జ్వరాలలో కనిపించు లక్షణాలు :**

1) నాలుక గోధుమరంగులో పొడిగా ఉండును. 2) చర్మం క్రింద రక్తం చేరుటచే కలుగు ఎర్రని రంగుగల చిన్న మచ్చలు 3) నిద్రలేమి 4) మగత 5) సంధి 6) అధిక ఉష్ణోగ్రత 7) పొట్ట బలహీనత వల్ల అధిక చెమట, కంపు కొట్టెడు చెమట 8) గొంతు కుళ్ళినట్లుండుట 9) స్పృహ పూర్తిగా/కొద్దిగా పోవుట 10) శోషింప జేయుట.

★ **స్కార్లెట్ జ్వరం :** దీనిలో గొంతు ధాతువులు కుళ్ళును. దీనిలో నిస్త్రాణ, మగత, దుర్వాసన గల అమితమైన చెమట వుండును. భుజించునపుడు చెమట, పొట్టలో బలహీనత వుండును.

**23. చర్మం :** గజ్జి : ఇది సహనశక్తి లేకపోవుట, నాడుల బలహీనత వల్ల కలుగును.

★ గోరుచుట్టు, కణుపు జ్యేష్ఠ, వ్రణం, రాచపుండు – వీటిలోని పదార్థం దుర్వాసన కలిగించును.

★ పెంఫిగస్ (Pemphigus) : దీనిలో పెద్ద బొబ్బలు లేచును. ఇది పురిటిలోని శిశువునకు కలుగును. ఆ బొబ్బలలో నీటి పదార్థం ఉండును. చర్మం ముడతలు పడి ఎండినట్లుండును.

★ జిడ్డు పొక్కులు : ఇవి ఎంతో దుర్వాసన కలిగియుండును.

★ **దురద :** చేతులలోను, పాదములలోను దళసరి చర్మమున్నచోట దురదగానుండును. ఈ దురద ప్రాకినట్లుండును. మెల్లగ గోకుటవల్ల కలుగు బాధను సహించవచ్చు. కాని దురద అధికమైన పుండు ఏర్పడును. చర్మం పొర ఊడును.

★ కాలి వ్రేళ్ళు, చేతులు, చెవులు శీతలమువల్ల వాచుట – దురద, నొప్పి ముళ్ళు గ్రుచ్చుకొనుచున్నట్లుండుట – చీముతో గూడిన పొక్కులు లేచుట (అపాయకరమగు వ్యాధి)

★ మచ్చలు – మచ్చలుగా అక్కడక్కడ ఏర్పడిన బట్టతల.

★ చర్మంపై క్షోభ (Irritation) కలిగించు స్రావములు.

★ స్ఫోటకము (Small-pox) వల్ల కలిగిన కుళ్ళిన స్థితి.

**24. ధాతువులు :**

★ రక్తహీన పరిస్థితులు – ఎప్పుడూ మాంసం లేకపోవుట.

★ కుళ్ళిన వాసన వచ్చు విరేచనాలతో శుష్కింపజేయు వ్యాధులు.

★ నల్లని, చిక్కని, గడ్డకట్టని, కుళ్ళిన వాసనగల రక్తముతో రక్తస్రావములు.

★ సాధారణ బలహీనత, అలసట చెందుట.

★ అణచబడిన సంభోగ వాంఛ కలిగిన, అధికంగా సంభోగ సుఖాలలో పాల్గొనిన వారి రోగాలకు.

★ సీరం, రసి చెమర్చుట – అది అసహ్యకరముగను, దుర్వాసనతోను ఉండును. అది తినివేయును. ఒరిపిడి ఉండును.

★ గాంగ్రీన్ (కుళ్ళిన పుండు) పరిస్థితులు ఆరంభదశలో ఉండుట.

★ క్యాన్సర్ నొప్పులు, క్యాన్సర్ నుండి దుర్వాసనగల స్రావములు వెలువడుట, రంగు మారుట.

★ రికెట్స్ వ్యాధి – ప్రేగుల నుండి కుళ్ళిన వాసనగల స్రావములు వెలువడుట.

★ స్కర్వీ వ్యాధిలో కుళ్ళిన పరిస్థితులు.

★ విషపూరితమైన రక్తస్రావములు.

★ మురికిగాను, అసహ్యకరముగాను, దుర్వాసనగాను కుళ్ళిన వాసనతో ఉండు చీము/ రసి కారుట.

★ తెల్లకణములు విపరీతముగా అభివృద్ధి చెందుట – గీతలు ఏర్పడుట – క్రిములవల్ల వచ్చు టైఫస్ జ్వరం.

★ ముసలివారు శుష్కించుట – ధాతువులు పొడిగాను, పొరలతోను ఉండుట – జీవశక్తి (Vitality) తక్కువగా ఉండుట.

# 7. కాలీసల్ఫ్ / కాలీసల్ఫ్యూరికం
## Kali Sulph / Kali Sulphuricum

**రసాయనిక నామం :** పొటాషియం సల్ఫేటు / కాలి సల్ఫస్.

**వాడుక పేరు :** సల్ఫేటు ఆఫ్ పొటాష్.

**ఈ క్షారం లోపించిన కలుగు వ్యాధులు :**

**లక్షణాలు :**

1. తల భారముగా నుండుట.
2. తల దిమ్ము / తల తిరుగుట / తలనొప్పి.
3. అమిత అలసట.
4. చలి.
5. గుండెదడ.
6. భయం.
7. తత్త్వ సంబంధమగు విచారం.
8. పంటి నొప్పి.
9. కాళ్ళు – చేతులందు వచ్చిపోవు నొప్పులు.

**ఈ క్షారం క్రింది రోగాలలో ఉపయోగపడును.**

ఈ క్షారాన్ని హోమియోపతి పల్సటిల్లాగా భావిస్తారు. ఇది ఈ రోగాలకు ఉపయోగపడును.

1. నాలుకపై పసుపుపచ్చని/జిగురు వంటి పూత.
2. జ్వరంలో కూడా చెమట పట్టకపోవుట.
3. ఒకచోటు నుండి మరొక చోటుకు మారు నొప్పులు.
4. అల్సర్, ఆతురత, విసుగు, తలతిరుగుడు, గుండెదడ, భయం, పంటినొప్పి మొదలైనవి.
5. చర్మ క్యాన్సర్.
6. కళ్ళ కలక, బ్రాంకైటీస్.
7. స్ఫోటకం.

**ఉద్రేకములు :** సాయంత్రం, తలుపులు వేసియున్న గాలి చొరని వేడిగది, ఎండాకాలం, క్రొవ్వు గల / విలువైన ఆహార పదార్థాలు.

**ఉపశమనములు :** ప్రాణవాయువు అధికముగాగల ఆరుబయటి గాలి, చల్లని పానీయములు, మర్దన చేయుట.

**ఈ మందు లభించు పొటెన్సీలు:** 3× నుండి 200× వరకు.

**ఏ పొటెన్సీ ఏ రోగానికి వాడాలి ?**

1. 12×, 6× మంచి ఫలితాలను ఇచ్చును.
2. తలకు చుండ్రు పట్టినపుడు, తలపై కలుగు చర్మవ్యాధులకు ఈ మందును పైపూతగా వాడవలెను.

   పై పూతకు 3×, అంతకంటె తక్కువ పొటెన్సీలను తరచు ఇవ్వవచ్చు. హెచ్చు పొటెన్సీ లను అవసరాన్నిబట్టి వాడాలి.
3. కాలిమూరుతో ప్రారంభమైన నివారణను ఈ మందు పూర్తి చేయును.

**మయాజమ్ :** సిఫిలిస్, ట్యుబర్క్యులిం.

**మానసిక స్వభావం :**

తేలికగా ఉత్తేజమునొందుట.

**ఉష్ణసహనం :** ఉష్ణమును సహించలేరు.

**మందు పనిచేయు కాలం :** సరిగా తెలియదు.

# మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు :**

★ ఎల్లప్పుడు హడావిడి చేయుట.

★ ఎక్కువ చిరచిరలాడుట.

★ క్రింద పడిపోతాననే భయం.

★ పిరికితనం, ఆశ, ఏకాగ్రత, ఆత్మవిశ్వాసం లేకపోవుట.

★ అసంతృప్తి.

★ సాయంకాలమున ఆదుర్దా – దీనిని మానసిక పరిశ్రమ ఉద్రేకపరచును.

**2. తల :**

★ పైకి చూచునపుడు లేదా తన సీటులోనుండి లేచునపుడు తలత్రిప్పు.

★ కీళ్ళ వాతమునకు సంబంధించిన తలనొప్పి.

★ సాయంకాలం వెచ్చని వాతావరణంలో ప్రారంభమై తలను ప్రక్కకు/వెనుకకు త్రిప్పుట వల్ల అధికమగుట, తలపై పుండ్లు పడుట.

★ చుండ్రు, తడిగా, జిగురుగా ఉండు పొలుసులు అధికముగా రాలుట.

★ వెంట్రుకలు రాలుట, బట్టతల అక్కడక్కడ ఏర్పడుట.

**3. కళ్ళు :**

★ కేటరాక్ట్ ఏర్పడుట వల్ల కంటి పటలమునకు పారదర్శకత్వం పోవుట.

★ కళ్ళ నుండి పసుపుపచ్చని/ఆకుపచ్చని స్రావములు విస్తారముగ స్రవించుట.

★ కనురెప్పల మీద పచ్చని/ఆకుపచ్చని పుసులు/పక్కులు కట్టుట.

★ కంటి కలక.

★ కంటిలో చీము కూడుట.

★ కార్నియా (శుక్లపటలం) పుండు పడుట.

**4. చెవులు :**

★ మధ్యచెవిలోని రక్తప్రసార దోషం / కర్ణాంతర నాళపు లైనింగు జలుబు / వాపు వల్ల కలుగు చెవుడు.

★ పసుపుపచ్చగానున్న స్రావంతో కూడిన చెవినొప్పి.

★ వాపు తర్వాత చిక్కని పసుపుపచ్చ/ ఆకుపచ్చ స్రావం వచ్చుట (చిక్కని చీము వంటి స్రావమైతే : కాల్కేసల్ఫ్).

★ చెవి క్రింద నొప్పి.

★ కణత ఎముక ముందుకు తోసుకువచ్చిన భాగం క్రింద నొప్పి.

★ చురుకైన/కోయుచున్నట్లున్న / సూదితో కుట్టినట్లున్న / గ్రుచ్చినట్లున్న నొప్పి.

★ ఒత్తిడి.

★ చెవిలో కంతులు వ్రేలాడుటవల్ల చెవి రంధ్రం మూయబడుట.

★ చెవి నుండి వచ్చు చీము దుర్వాసన గొలుపుట.

**5. ముక్కు :**

★ **జలుబు :** చీమిడి నీళ్ళగా/పసుపు పచ్చగా/ ఆకుపచ్చగానుండుట (ఫెర్రంఫాస్ తర్వాత ఈ మందు ఉపయోగకారి).

★ దీర్ఘకాలపు జలుబు – పసుపుపచ్చని జిగురువంటి స్రావం – ముక్కు దిబ్బడ వేయుట – ఊపిరాడకపోవుట **(Sil)** – వాసన తెలియదు.

★ ముక్కు పుండుపడి దుర్వాసన గల స్రావం స్రవించుట (ప్రారంభ దశలో **ఫెర్రంఫాస్**తో మార్చి యిచ్చిన జలుబు రాకుండా కాపాడును.

★ ముక్కు దురద.

**6. ముఖం :**

★ ముఖం నొప్పి.

★ పాలిపోయిన ముఖం.

★ ముఖం ఎర్రగానుండుట.

★ ముఖాకృతి వికృతమగుట.

★ ముఖం చర్మంపై పుట్టు వ్రణం **(Epithelioma)** – కేన్సరు.

**7. నోరు :**

★ క్రింది పెదవి వాపుతోను, పొడిగాను ఉండుట – దానిపైన వున్న పొర పెద్ద–పెద్ద పొరలుగా ఊడిపోవును.

★ నోటియందు అధిక వేడిమి.

**8. నాలుక :**

★ నాలుకపై పసుపుపచ్చని, బంకగానుండు పూత.

★ కొన్ని సందర్భాలలో నాలుకకొన తెల్లగా ఉండుట.

★ అరుచి/జావ(గంజి) రుచి – రుచి కోల్పోవుట – రుచి చప్పగా, చేదుగా నుండుట.

★ పెదవులు, నాలుక, చిగుళ్ళు తెల్లగానుండుట.

**9. దంతములు :**

★ పంటినొప్పి.

★ చిగుళ్ళవాపు (దీర్ఘకాలం నుంచి).

**10. గొంతు :**

★ పొడిగాను, మంటగాను ఉండుట.

★ గొంతు చుట్టూ నొక్కివేయబడినట్లుండుట.

★ కళ్ళెను కాండ్రించుట.

★ టాన్సిల్స్ వాపు.

★ మ్రింగుట కష్టముగా నుండుట.

★ ముక్కు కాయలు/ఎడినాయిడ్స్ శస్త్ర చికిత్స తర్వాత నోటి ద్వారా శ్వాస పీల్చుకొనుట, గురక పెట్టుట (అంగుడు వెనుక భాగమునకు పైన గల సప్తపథ జిగట పొరలో రక్తం కూడుట వల్ల ఈ లక్షణాలు కలుగును).

**11. జీర్ణాశయం :**

★ జీర్ణాశయంలో మండుచున్నట్టి వేడి, తీవ్రమగు దాహం, వమన వికారం, వాంతి.

★ జీర్ణాశయపు దీర్ఘకాలపు జలుబు (ఈ విషయం నాలుకపై నున్న పసుపు పచ్చని, బంక వంటి పూత ద్వారా తెలియును)

★ అజీర్ణం – జీర్ణాశయపు గుంట నిండుగాను, దానిలో ఏదో బరువున్నట్లు అనిపించుట, నొప్పిగానుండుట, నోటిలో నీరు చేరుట.

★ జీర్ణాశయం బలహీనమైనట్లు అనిపించుట.

★ జీర్ణాశయపు శూలకు మెగ్నీషియం ఫాస్ పనిచేయనిచో ఈ మందు ఉపయోగకారి.

★ జీర్ణాశయంలో లోతుగానున్న నొప్పి.

★ జీర్ణాశయపు జ్వరం – ఉష్ణోగ్రత సాయంకాలం పెరిగి, ఉదయానికి తగ్గును – దప్పిక ఉండదు – వేడి పానీయములను కోరును (ఈ లక్షణాలున్నచో ఈ మందును ఫెర్రంఫాస్‌తో మార్చి యివ్వాలి).

★ చిన్నప్రేగు మొదటిభాగం (Gastro Duodenum) యొక్క జలుబువల్ల కలుగు కామెర్లు.

**12. ఉదరకుహరం :**

★ విరేచనాలు పసుపుపచ్చగా, బంకగా, నీళ్ళవలె చీముతో నుండును.

★ ఉదకుహరపు నొప్పులు శూలవలె నుండును. అధిక వేడిమి, ఉద్రేకం, అకస్మాత్తుగ ఉదరకుహరం చల్లబడుటవల్ల ఈ నొప్పులు వచ్చును.

★ ప్రేగుల నుండి వెళ్ళు వాయువు గంధకపు వాసనను కలిగియుండును.
★ స్వాభావికమైన మలబద్ధకం.
★ విరేచన సమయమున మలాశయం (Rectum)లోను, గుదం (Anus)లోను నొప్పి.
★ లోపల, బయట మూలశంక (CF).
★ టైఫాయిడ్, ప్రేగులకు సంబంధించిన జ్వరాలలో ఉష్ణోగ్రత సాయంకాలం/రాత్రిపూట పెరిగి, ఉదయానికి తగ్గును. పొట్ట వాయుపూరితమై ఉబ్బియుండును.
★ ఉదర కుహరంలోని కండరములు నొప్పితో ముడుచుకొనిపోవుట (ఇది ఉదర కుహరమును కప్పియుంచు పెరిటోనియం పొర వాపును తెలుపును), పొట్ట బిర్రబిగుసుకొని చాలా చల్లగానుండుట.
★ గుదం నందు దురద ఎక్కువగా నుండుట.
★ విరేచనమగుటకు ముక్కవలసి వచ్చుట – అప్పుడు సూదితో కుట్టినట్లుండు నొప్పి.
★ కలరా లక్షణాలు – నల్లని, పలచని, దుర్వాసన గొలుపు విరేచనాలు.
★ స్కార్‌లెట్ జ్వరం తర్వాత వచ్చు మూత్రపిండముల వాపు.

**13. పురుష జననేంద్రియాలు :**

★ సెగ (గనేరియా) – సెగ స్రావం పసుపుపచ్చగా/ఆకుపచ్చగా, బంకవలె ఉండుట
★ సెగను అణచిన తర్వాత వృషణములు వాచుట.
★ గ్లీటు (పురుష జననేంద్రియపు చివరి భాగం) వాచుట.

**14. స్త్రీ జననేంద్రియాలు :**

★ **బహిష్టు :**

1. బహిష్టు చాలా ఆలస్యంగా వచ్చుట. బహిష్టు స్రావం చాలా కొద్దిగా ఉండుట.
2. తలనొప్పి.
3. పొట్ట నిండుగాను, బరువుగాను ఉన్నట్లు అనిపించుట.
4. నాలుకపై పసుపుపచ్చ పూత.
5. వస్తికము (నడుము వద్ద నుండు ఎముకల గూడు) క్రిందికి లాగబడు చున్నట్లుండుట.
6. జననేంద్రియమున మంట.

★ **కుసుమ :**

1. పసుపుపచ్చ / ఆకుపచ్చగా నుండుట.
2. బంకగా / నీటివలెనుండుట.

**15. మూత్రావయవములు :**

★ దీర్ఘకాలం నుంచి వున్న మూత్రకోశపు వాపు – మూత్ర విసర్జన బాధాకరముగా నుండుట.

★ మూత్రం తనకు తెలియకుండానే కొద్ది–కొద్దిగా పోవుట.

★ మూత్రంలో ఆల్బుమిన్ పోవుట.

★ మూత్రం అడుగుకు జిగురువంటి పదార్థం అధికంగా చేరుట.

★ స్కార్లెట్ జ్వరం[1] తర్వాత మూత్రపిండముల వాపు.

**16. శ్వాసావయవములు :**

★ ఎండాకాలం/వేడి వాతావరణంలో అధికమగు ఉబ్బసం – దీనిలో పసుపుపచ్చని కళ్ళె వెలువడును.

★ బ్రాంకైటిస్ (శ్వాసనాళముల వాపు) – పసుపుపచ్చని / ఆకుపచ్చని కళ్ళె జిగురుగా గాని, నీళ్ళవలె గాని విస్తారంగా పడును – దగ్గు సాయంకాలం అధికమగును.

★ న్యుమోనియా : ఊపిరితిత్తుల వాపు – శ్వాసనాళములందు బుడగలవంటి శబ్దములు అధికముగ వినబడును – కళ్ళె అధికముగా కాండ్రించబడదు – కళ్ళె నీటివలె వుండును – అది లోపలికి వెళ్ళిపోవును – సాధారణముగ అది మ్రింగబడును – వేడి వాతావరణమున ఊపిరాడదు – చల్లని గాలిని కోరును.

★ క్రూప్‌వలె నుండు గట్టి, మొరటు దగ్గు – ఫారింగ్స్ (సప్తపథ)లో అలసట – ఛాతీలో గురక – దగ్గుతో గడగడ శబ్దం చేస్తూ కళ్ళె పడుట.

★ క్రూప్‌కు సంబంధించిన బొంగురుతనం – మాట్లాడుటచే అలసటగానుండుట – జలుబు వల్ల బొంగురుతనం.

★ జలుబుచే వచ్చు దగ్గు (మూడవ దశ) – పసుపుపచ్చని కళ్ళె తేలికగా కాండ్రించబడును.

★ కోరింతదగ్గు – దీనిలో పసుపుపచ్చని, బంకగా నుండు కళ్ళె – దీనిలో శ్వాస ఆడనపుడు MP వాడాలి.

**17. రక్తప్రసరణావయవములు :**

★ నాడి ధనారింపుతో / బలంగా వడిగా నుండుట – దీనివల్ల నాడిని చూచుట కష్టమగును.

★ పొత్తి కడుపులో (తుంటి ఎముక వెడల్పుగ నుండు ఊర్ధ్వ భాగములో) తొలుచునట్టి నొప్పి.

---

*1. **స్కార్లెట్ జ్వరం (Scarlatina) :** ఇది సాధారణముగ చిన్నపిల్లలకు వచ్చు అంటువ్యాధి. దీనిలో తీవ్ర జ్వరం ఉండును. దీనిలో నోరు, నాలుక, టాన్సిల్స్, గొంతుక వాచును.*

**18. వీపు, కాళ్ళు–చేతులు :**

★ వీపు లోను, మెడ వెనుక భాగమందు, కాళ్ళు – చేతులందు నరముల/కీళ్ళ వాతపు నొప్పులు – ఇవి కాలనియమముగా వచ్చును – సాయంకాలమున/వెచ్చని గదిలో పెరుగును; చల్లని వాతావరణంలో తగ్గును.

★ కీళ్ళ వాత నొప్పులు – ఒకచోటు నుండి మరొక చోటునకు మారును – కీళ్ళలో కుక్కగొడుగు వంటి వాపు ఉండును.

★ కాళ్ళు – చేతులలో, ముఖ్యంగా చేతుల మీద పొలుసు కట్టునట్టి చర్మవ్యాధి అధికముగా నుండును – ఇది వేడి నీటిచే తగ్గును.

★ కాళ్ళు చేతుల కండరములు బాధతో ముడుచుకొని పోవుచుండును.

**19. నాడీ వ్యవస్థ :**

★ నరముల నొప్పులు ఒక చోటు నుండి మరొక చోటునకు మారును.

★ కొరియా వ్యాధిలో కండరములు బాధతో వాటంతటవే అదరుచుండును. దీనికి MP పనిచేయనపుడు ఈ మందునివ్వాలి.

**20. నిద్ర :**

★ కలలు వివరంగా ఉండును.

★ నిద్రలో ఊపిరాడకపోవుట/అమిత భయంతో ఛాతీ భారంగానుండుట జరుగును.

★ అస్థిమితమైన నిద్ర – రాత్రిపూట ఎక్కువసార్లు మేల్కొనుట జరుగును – నిద్ర నుండి త్వరగా మేల్కొనును.

**21. జ్వరం :**

★ విడిచి విడిచి వచ్చు జ్వరం (రోగి నాలుకపై పచ్చని, బంకగా నుండు పూత ఉండును), రక్తం విషాక్తమగుటచే వచ్చు జ్వరం, జీర్ణాశయమునకు సంబంధించిన జ్వరం, స్కార్లెట్ జ్వరం – వీటికి ఈ మందు పనిచేయును.

★ ఈ జ్వరములలో ఉష్ణోగ్రత సాయంకాలం నుంచి అర్ధరాత్రి వరకు పెరిగి అప్పటి నుండి మరలా తగ్గుట ప్రారంభమగును. వీటిలో చల్లని చెమట ఉండును.

ఇట్టి స్థితిలో ఈ మందును తరచుగా ఇవ్వవలెను. అంతేగాక రోగిపై వెచ్చని గుడ్డలు కప్పవలెను. అట్లు చేసినచో చెమట ఎక్కువగా పట్టి జ్వరం తగ్గును. పొంగు (Measles) తగ్గి చల్లని చెమట పట్టునపుడు ఈ మందు బాగా ఉపయోగపడును.

**22. చర్మం :**

★ **కురుపులు :** ఇవి ద్రవముతోను, చీముతోను ఉండును.

★ **చిన్న కురుపులు/దద్దుర్లు :** వీటి నుండి ఆకుపచ్చని/పసుపుపచ్చని రసి కారును. ఆ రసివల్ల పల్చని పొర, ఆ తర్వాత పక్కు ఏర్పడును – చర్మం స్తబ్దముగా నుండును – మంట, దురద ఉండును – ఇట్టి స్థితిలోనున్న రోగికి వేడి పానీయాలిచ్చి దుప్పట్లను బాగా కప్పాలి.

★ చర్మం పై పొరకు క్యాన్సర్ – దీని నుండి పలచని, పసుపుపచ్చని సీరం పదార్థం వెలువడును.

★ ఏ వ్యక్తుల గజ్జి అణచివేయబడినదో, ఎవరి గజ్జిలో పసుపుపచ్చ/ఆకుపచ్చ, నీటివలె ఉండు స్రావం స్రవిస్తున్నదో అట్టివారికి ఇది మంచి మందు.

★ ఈ మందు అరచేతులలో పొలుసులూడు చర్మవ్యాధికి మంచి మందు.

★ ఇది స్ఫోటకములో పక్కులు ఊడిపోవునట్లు చేసి కొత్త చర్మం ఏర్పడునట్లు చేయును. ఇది పసుపుపచ్చని చీమును, శోషరసమును స్రవింపచేయు దీర్ఘకాలపు గజ్జి/తామర. క్షయకు సంబంధించిన పుండ్లకు మంచి మందు.

★ ఇది అక్కి (Erysipelas) పొక్కులు ఊడిపోవునట్లు చేయును.

★ దీనితో సోరియాసిస్, సెబోరియా, చర్మపు వాపు, ఫంగస్ మొదలైన వ్యాధులను అదుపు చేయవచ్చు.

★ మంట, దురద, అధికంగా దద్దుర్లు, గోర్లు పాడగుట, వాటి పెరుగుదల ఆగుట (Sil).

★ క్షయ క్రిములు రక్తప్రసరణ ద్వారా చర్మంలో ప్రవేశించి కలగజేయు దీర్ఘకాలపు పుండ్ల నుండి నిరంతరం పసుపుపచ్చని చీము, లింఫ్ ద్రవం/శోషరసం కారుట.

★ ఇవీ[1] (Ivy) యొక్క విషపు ప్రభావం – తీవ్రమగు దురద, మంటలతో చర్మం మీద లేచు దద్దుర్లు.

★ పిల్లలలో ఒరుపు[2] (Chafing)

★ చర్మంపై పొక్కులు/బొబ్బలు, బుడిపెలు.

**23. ధాతువులు :** జిగటపొరల నుండి పసుపుపచ్చని, అతుక్కొనునట్టి, బంకగా నుండు స్రావం.

---

*1.* **ఇవీ :** *ఎప్పుడూ పచ్చగా ఉండు మొక్క.*

*2.* **ఒరుపు :** *రాపిడి వలన చర్మం రేగుట.*

## 8. మెగ్నీషియ ఫాస్ / మెగ్నీషియా ఫాస్ఫారికం / మెగ్నీషియం ఫాస్
**Magnesia Phos / Magnesia Phosphoricum / Magnesium Phos**

**రసాయనిక నామం :** మెగ్నీషియం ఫాస్ఫారికం.

**వాడుక పేరు :** ఫాస్ఫేటు ఆఫ్ మెగ్నీషియా.

**ఈ లవణం దేహములో ఉండు చోట్లు :** ఈ లవణం కండరములు, నరములు, ఎముకలు, దంతములు, రక్త కణములు, మెదడు, వెన్నుపాము, శుక్రం/వీర్యం నందు ఉండును. ఇది ముఖ్యముగా శుక్రంలో అధికం.

**ఈ లవణలోపం వల్ల కలుగు బాధలు :**

ఈ లవణలోపం వల్ల ఈ బాధలు కలుగును –

1. టెండాన్స్[1], లిగ్మెంట్స్[2], కిడ్నీ మొదలైన వాటిలో కాల్షియం స్థాయి పెరిగి తత్సంబంధమైన వ్యాధులను కలిగించును.
2. రక్తనాళాలలో కొలెస్టరాల్ పెరిగి రక్తప్రవాహములో అడ్డంకులు కలిగించును. కనుక చాలా బాధలు ఏర్పడును.

**ఈ లవణం ఏ రోగాలకు ఉపయోగపడును ?**

ఈ లవణం బహుళ ఉపయోగం గల మందు. ఇది Anti-neuraligic మరియు Anti-spasmodic మందు. కనుక ఇది నరముల నొప్పిని, కంపనములను తగ్గించును. ఇది తిమ్మెర్లను, శూలను, పార్శ్వపు నొప్పులను, పొర్లను/కంపములను మొదలైన వాటిని నివారించును. ఈ మందు నరముల పేశ కణములందు, నరములు అంతమగు చోట్ల, కండరము

**ఉద్రేకాలు :** చల్లదనం, చల్లగాలి, చలిగాలి, స్పర్శ, కదలిక, కుడివైపు.

**ఉపశమనములు :** వెచ్చదనం, మెల్లగా నొక్కుట, శరీరమును వంచుట.

**ఈ లవణం లభించు పొటెన్సీలు:**

3× నుండి 1000× వరకు

**ఏ పొటెన్సీ ఏ రోగానికి ఉపయోగకారి :**

1. శూలకు : 30× లేదా పెద్ద పొటెన్సీలు – ఈ మందును నీటిలో కలిపి తరచుగా వాడవలెను.
2. డా॥ సూస్లెరు ఈ మందును 6×లో వాడమని సలహా యిచ్చారు. ఈ పొటెన్సీలో పనిచేయనిచో 1×, 2× మొదలైన చిన్న పొటెన్సీలు వాడాలి.

**మయాజమ్ :** సోరా

*1. **టెండాన్ (Tendon) :** కండరముల చివరి భాగం. ఇది తెల్లగ, గట్టిగ నుండి, కండరమును ఎముకతో కలుపును.*

*2. **లిగమెంట్ (Ligament) :** స్నాయువు కండరమును ఎముకకు కట్టునట్టి త్రాడువంటి భాగం.*

లందు, కండర ధాతువులందు గల బాధలను తొలగించుటలో బాగా ఉపయోగపడును.

ఈ మందు పనిచేయు నొప్పులకు ఈ లక్షణాలు ఉండును – 1) మంట ఉండదు. 2) ఆకస్మికముగా మెరుపుతీగవలె వచ్చును. 3) త్వరగా చురుకును కలిగించును 4) కండరములు ముడుచుకొనిపోవునట్లు చేయును (ఈడ్పు స్వభావం కలిగియుండును) 5) నొక్కినట్లు చేయును 6) తరచు స్థానం మార్చును 7) కుడివైపు వచ్చును.

ఇది సన్నని శరీరం, మంచి దేహఛాయ, నరముల నిస్త్రాణ చెందినవారికి బాగా పనిచేయును. జీవశక్తి లేక నీరసముతో శక్తిహీనులై కూర్చొనుట కష్టముగా నున్నవారికి ఈ మందు బాగా ఉపయోగకారి. ఇది చాలక నాడుల మీద బాగా పనిచేయును. ఇది ఋతుశూలలకు మంచి మందు.

**మానసిక స్వభావం :** తేలికగా ఉత్తేజం పొందుట.

**ఉష్ణసహనం :**

చలిని సహించలేకపోవుట.

**మందు పనిచేయు కాలం :**

40–50 రోజులు.

**ప్రత్యేక సూచనలు :**

1. ఈ మందును వేడినీటితో వాడాలి.
2. లక్షణములను బట్టి ఎంపిక చేసిన ఈ మందు పనిచేయనిచో కాల్కేరియాఫాస్‌ను వాడాలి. ఎందుకనగా రెంటి మానసిక లక్షణాలలో ఎక్కువ సంబంధం వుంది.
3. మూర్ఛకు కాలిమూర్‌తో మార్చి యివ్వాలి.
4. ధనుర్వాతం[1] వచ్చినప్పుడు తరచుగా వేడినీటిని ఇవ్వాలి.
5. చిగుళ్ళ వాపు ఉన్నప్పుడు ఈ మందును చిగుళ్ళకు పూయాలి. మందును నీటిలో వేసి దూదిని దానిలో ముంచి చిగుళ్ళపై పూయాలి.

*1. **ధనుర్వాతం (Tetanus) :** మెడ, శిరస్సు, వెన్నెముక ధనుస్సు వలె వంగుట, పండ్లు కొరుకుట, ఆవలింతలు, నోటి నుండి చొంగ కారుట, అవయవములన్నియు బిగబట్టుట, కళ్ళు కదపలేకపోవుట, దవుడలు/చెంపలు నొక్కుకొని పోవుట, మాట్లాడలేకపోవుట మొదలైన [illegible]*

★ [illegible] భాగం గరుకుగా ఉండుట – అధికమైన చుండ్రు –

# మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు :**

★ ఇంద్రియములకు సంబంధించిన విషయాలను లేనివాటిని ఉన్నట్లుగా భావించుట.

★ మందబుద్ధిగా నుండుట.

★ స్పష్టంగా ఆలోచించలేకపోవుట.

★ శారీరక/మానసిక శ్రమ చేయుటకు ఇష్టపడకుండుట.

★ అధిక దుఃఖంతో వెక్కివెక్కి ఏడ్చుట.

★ ఎల్లప్పుడు బాధలను గురించి ఎక్కిళ్ళతో ఏడ్చుచుండుట.

★ నిరంతరం మనసులోనే మాట్లాడుకొనుట/మౌనంగా కూర్చొనుట.

★ ఒకచోటు నుండి మరొక చోటునకు వస్తువులను తీసుకొని వెళ్ళుట.

**2. తల :**

**తలనొప్పి :**

1) పొడుచుచున్నట్టి, కత్తితో కోయుచున్నట్టి తలనొప్పి. ఇది ఈడ్పు సంబంధమైనది. ఉద్ధృతముగ తగ్గుచు – హెచ్చుచు ఉండును. మధ్య–మధ్య వచ్చి పోవుచుండును. ఇది ఒకచోటు నుండి మరొక చోటునకు మారును.

2) **నాడుల దౌర్బల్యం వల్ల వచ్చు తలనొప్పి :** కళ్ళ ముందు నిప్పుకణముల వలె కనిపించును. ఇది యువకులలోను, బలమైన వ్యక్తులలోను ఉండును. స్కూలుకు హాజరైనపుడు/మానసిక శ్రమ తర్వాత/కీడు కలిగించు ఉత్తేజం వల్ల తలలో నిరంతరం తీవ్రమైన నొప్పివచ్చును. తలపైన నొప్పి. తలవెనుక నుండి వెన్నుపాము వరకు నొప్పి ఉండును. ఈ నొప్పి భుజముల మధ్య అధికం.

**3) తలవెనుక భాగమున ఉండు తలనొప్పి :** తలనొప్పి తల అంతయు ఉండును. వమన వికారం, చలి దీని లక్షణాలు.

**ఈ తలనొప్పుల లక్షణాలు :** 1) ఈ తలనొప్పులు ఎడమ వైపున వచ్చును. 2) ముందుకు వంగుట చేతను, తలను వడిగా తిప్పుట వల్ల బాధలు అధికమగును 3) తలను అదుముట వల్ల, బహిరంగముగా గాలిలో నడచుట వల్ల ఈ బాధలు తగ్గును 4) వీటిలో తలత్రిప్పుట కూడా ఉండును (KP) 5) తలనొప్పి 10 నుండి 11 a.m. లేదా 4 నుండి 5 p.m. సమయంలో వచ్చును.

★ కపాలము కప్పియుంచు భాగం గరుకుగా ఉండుట – అధికమైన చుండ్రు– చిన్న గుండ్రని చీము పొక్కులు.

★ **పిల్లల మెదడుకు సంబంధించిన బాధలు :** వీటిలో స్పృహ ఉండదు. పొర్లు ఉండును.

★ తలలోని పదార్థాలు థప్‌మని ధ్వనిచేస్తూ తిరుగుట – మెదడులోని భాగాలు స్థానం మారుట.

**3. కళ్ళు :**

★ దృష్టిలోపం వల్ల కంటి ముందు రంగు రంగుల చుక్కలు, మెరుపులు కనిపించును – కళ్ళ ముందు నల్లని మచ్చలు తేలుచున్నట్లుండుట – వస్తువులు రెండుగా అగుపడుట.

★ కళ్ళు వెలుతురును చూడలేవు.

★ రెటీనా (కంటి నుండి మెదడుకు పోవు నరము) వ్యాధిగ్రస్తమగుటచే చూపు అస్పష్టముగా నుండుట – రెటీనా వాచి గట్టిపడి రంగు మారుట.

★ ఈడ్పు సంబంధమైన మెల్ల.

★ కనుగ్రుడ్లు ఊగుట.

★ కంటి గూడు, కంటి గూటి పై భాగపు నరముల బాధ : ఇది కుడివైపు అధికం. వేడి కాపడం పెట్టుట వల్ల తగ్గును. స్పర్శను ఏమాత్రం సహించలేడు. నొప్పితో కన్నీరు కారుట అధికమగును.

★ కనురెప్పలు అదరుట – పై కనురెప్పలు క్రిందికి వాలిపోవుట – కనురెప్పలు ఏదైనా బరువుతో అదుమబడుతున్నట్లు బరువుగానుండుట – కనురెప్పలలో దురద.

★ కళ్ళు తేలికగా అలసట చెందుట – కొన్ని పంక్తులను మాత్రమే చదువగలుగుట.

**4. చెవులు :**

★ "చెవికి సంబంధించిన అంతర్గతమైన వ్యాధులన్నింటిలోనూ ఈ మందును గూర్చి ఆలోచించవచ్చును" **– కోప్‌ల్యాండ్**

★ **చెవుడు :** శబ్దమును మెదడుకు తీసుకొని వెళ్ళే నరాల – తంతువుల బలహీనత వల్ల ఏర్పడిన చెవుడు.

★ **నాడీ మండలమునకు సంబంధించిన చెవినొప్పి :** ఇది వేడివల్ల తగ్గును.

★ కుడి చెవి క్రింద నరాల బాధ ఎక్కువ. ఈ బాధ చల్లని గాలిలో తిరిగినా, ముఖం, మెడను చన్నీటితో కడుగుకొన్నా ఎక్కువగును.

**5. ముక్కు :**

★ తలలో జలుబు : ఈ జలుబు ఒకసారి పొడిగాను, మరొకసారి స్రావంతోను ఉండును – ఇట్లు మార్చి–మార్చి వచ్చుట.

★ జలుబు లేకపోయినా వాసన గ్రహించు శక్తి నశించుట/సరిగా వాసన చూడకపోవుట.

★ ముక్కు దిబ్బడవేయుట, ఎక్కువగా స్రావం స్రవించుట – ఈ రెండూ మార్చి మార్చి వచ్చును.

★ చురుకైన మంట, పొడిగా నుండుట : ఇవి ఎడమవైపున ఎక్కువగా నుండును.

**6. ముఖం :**

★ కంటిపైన, కంటి క్రింద నరాల బాధ – నొప్పులు మెరుపుతీగవలె వచ్చును. ఇవి విడిచి విడిచి వచ్చును. వేడి కాపడం వలన ఉపశమించును. తాకటం వల్ల, ఒత్తిడివల్ల, జలుబు వల్ల, కుడివైపున పరుపుపై పడుకొన్నప్పుడు, 2 p.m. సమయాన అధికమగును.

★ ముఖ నరముల నొప్పి కంటి క్రింద నుండి కొరుకుడు పంటికి వ్యాపించి క్రమంగా కుడివైపు ముఖమంతటా వ్యాపించును – ఈ నొప్పి తాకటంవల్ల, నోటిని తెరచుట వల్ల, శరీరం చల్లబడినపుడు, చల్లగాలి వల్ల ఎక్కువగును. చన్నీటితో కడుగుకొన్నా, చన్నీటిలో నిల్చొన్నా, ఉత్తర దిశ నుండి వీచే బలమైన గాలులు సోకినా ఈ నొప్పి అధికమగును.

★ డా॥ బెరిడ్జ్ ఈ మందుతో కుడిపైవైపు దవుడ నుండి నుదుటికి, చెవికి ప్రాకు శూలనొప్పిని నయం చేసెను.

**7. నోరు :** నోటి మూలలు/కొనలు అదరుచుండును – క్రింది దవుడ కీలు వెనుకకు అదరుటచే కండరం బాధతో ముడుచుకొన్నట్లుండును – కండరములకు సంబంధించిన కంపనము లతోనున్న నత్తి – అంకెళ్ళు[1] (Lock-Jaw) బిగ్రబిగియును – నోరు పొడిగా వుండును – లాలాజలం బంకగా నుండును – పెదవుల మూలలు చీలియుండును.

**8. నాలుక :**

★ శుభ్రంగా వున్న నాలుక కడుపునొప్పిని, తెల్లగానున్న నాలుక నీళ్ళ విరేచనాలను సూచించును.

★ నోరు పొడిగా యుండుట, ఎడమ వైపున పుండు పడియుండుట – అది తినివేసెడి పుండువలె నొప్పిని కలిగించుట వల్ల భుజించుట బాధాకరంగా ఉండును.

**9. దంతములు :** తాకినా, చల్లని గాలి సోకినా దంతములు చాలా బాధగానుండుట – చన్నీటితో దంతములను తోముకొనలేని స్థితి – పడుకొన్న తర్వాత నొప్పి ఎక్కువగుట,

*1. అంకెళ్లు (Lock-Jaw) : దవుడలు నొక్కుకొని యుండుట.*

ఆ నొప్పి చాలా వేగంగా స్థానం మారుట – ఆ నొప్పి చల్లని పదార్థముల వల్ల, చన్నీటితో కడుగుట వల్ల ఎక్కువగుట; వేడిమివల్ల, వేడి పానీయాలవల్ల తగ్గుట (చల్లదనంవల్ల ఉపశమనం పొందినచో **ఫె.ఫా)** – పాడైన/పెట్టుడు దంతములలో విపరీతమైన నొప్పి – దంతములు పుండుపడుట – ముఖం, గొంతు, మెడలోని గ్రంథుల వాపుతో ఉండుట.

★ దంతములు వచ్చే పిల్లల సమస్యలకు ఇది మంచి మందు.

**10. గొంతు :**

★ మెడయందలి థైరాయిడ్ గ్రంథి పెద్దదగును – అది పుండువలె నుండును – అది బిర్రబిగియును (ముఖ్యంగా కుడివైపున) – గొంతు భాగాలన్నీ ఉబ్బినట్లుండును. అవి చల్లగా, నొప్పిగా నుండును – తల ఒకవైపున నొప్పితో ఉండును – మ్రింగుట బాధాకరంగా ఉండును.

★ నాసికా రంధ్రముల వెనుక భాగం నుండి స్రావములు జారును. అప్పుడు తుమ్ములు వచ్చును. గొంతు గరుకుగా ఉండును.

★ గ్లాటిస్/ కంఠబిలము ఈడ్పు – ద్రవ పదార్థాలను మింగునపుడు గొంతులోని కండరాలు దగ్గరకు ముడుచుకుపోవును – ఊపిరాడదు – మ్రింగునపుడు పొరపోవును.

★ గొంతులో పుండు వంటి నొప్పి – ఈ నొప్పి దీర్ఘకాలంగా ఉండును.

**11. జీర్ణాశయం :**

★ ఆమ్లములను సహించలేదు. అనగా పచ్చళ్ళు తిన్నచో మంట.

★ కాఫీ ఇష్టముండదు.

★ పంచదారను కోరును.

★ మొండి ఎక్కిళ్ళు – ఎక్కువ బాధను కలిగించుట – రాత్రింబవళ్ళు.

★ త్రేపులు మంటగా, రుచి లేకుండా ఉండును.

★ తిన్న ఆహారం మరలా పైకివచ్చును.

★ పొట్టలో ఈడ్పులు – దేహమును బద్దీతో బిగించి కట్టినట్లుగా ఉండును.

★ జీర్ణకోశం వాయుపూరితమై ఉబ్బును – నొక్కివేయుచున్నట్లుండు నొప్పి – అపానవాయువుతో కూడిన అజీర్ణం – వమన వికారం, వాంతి.

★ పై నొప్పులు చన్నీటిని త్రాగిన ఉద్రేకించును/మరలా వచ్చును – వేడినీటిని త్రాగిన/ వెచ్చదనం వల్ల, బాగా వంగుట వల్ల తగ్గును **(చూడుడు : ఉద్రేకములు, ఉపశాంతి)**

**12. ఉదరకుహరం/పొత్తికడుపు :**

★ ప్రేగులలో నొప్పి.

★ అపానవాయువుతో కూడిన శూలరోగిని వంగునట్లు చేయును – వెచ్చదనం/మర్దన/అదముట/నొక్కుట వల్ల అపానవాయువు శబ్దం చేస్తూ త్రేపుల ద్వారా బయటికి వచ్చి నొప్పి తగ్గును.

★ బాలుడు/అప్పుడే పుట్టిన శిశువు అపానవాయువుతో కూడిన శూలతో బాధపడుచుండును. అతని పొత్తికడుపు నొప్పి అస్తిమితం కలిగించును. ఆ నొప్పి నాభి వద్ద ప్రారంభమగును. దేహాన్ని చాచుట వల్ల నొప్పి ఎక్కువగును. నీళ్ళ విరేచనాలు ఉండును. అతడు వీపుమీద వెల్లకిల పరుండలేడు. ఎందుకనగా నొప్పి అధికమగును. ముందుకు వంగి పరుండవలెను. అప్పుడు అతని నొప్పి తగ్గును.

★ పొత్తికడుపు ఉబ్బి నిండుగా ఉన్నట్లు అనిపించును. అప్పుడు రోగి తన నొప్పిని తగ్గించుటకు గుడ్డలను వదులుచేసుకొనవలసి రావచ్చు/నడవవలసి రావచ్చు/ అపానవాయువును నిరంతరం వదలవలసి రావచ్చు.

★ విరేచనానికి ముందున్న శూల వంటి నొప్పులు విరేచనానంతరం కూడా ఉండును. అదముట/నొక్కుట వల్ల నొప్పికి ఉపశమనం.

**13. విరేచనం : 1) మలబద్ధకం :** విరేచనం పొడిగాను, గట్టిగాను, గాఢమైన గోధుమ రంగులో ఉండును. అతి కష్టంతో మలం బయటికి వెలువడును. **2) శిశువుల మలబద్ధకం :** విరేచనానికి ప్రయత్నించినపుడల్లా ఈడ్పులతో కూడిన నొప్పి ఉండును. ఈ నొప్పిని శిశువు కీచు ధ్వని గల ఏడ్పు ద్వారా తెలుపును. గడగడ ధ్వని చేస్తూ అపానవాయువు వెలువడును. శూల ఉండును. **3) నీళ్ళ విరేచనాలు :** వాంతి, పిక్క కండరాలు బాధతో ముడుచుకొనిపోవుట, చలి, కడుపునొప్పి, విరేచనాన్ని ఆపుకోలేక వడిగా విసర్జించుట. **4) గ్రహణి :** రక్తవిరేచనాలు – బంక/చీము విరేచనాలు – కండరములు ముడుచుకొనిపోవు నొప్పులు – మూత్రకోశ కండరముల ఈడ్పుచే మూత్రం బంధించబడుట **5) మూలశంక** (Piles) : 1) కోయుచున్నట్టి, మెరుపువంటి నొప్పులు – ఇవి చాలా అధికంగా ఉండి రోగికి శోష కలిగించును. 2) పొత్తికడుపు కండరముల ఈడ్పు దీర్ఘకాలంగా ఉండుటచే నొప్పి 3) ప్రతి విరేచనంతోను పురీషనాళమందు నొప్పి.

**14. మూత్రావయవములు :**

★ నిల్చొన్నప్పుడు, నడచునపుడు ఎడతెగని మూత్ర విసర్జన వాంఛ.

★ మూత్రకోశం, దాని ద్వారం వద్ద ఈడ్పు/కంపం.

★ బాధతో మూత్ర విసర్జన చేయాలనుకొనుట.

★ చిన్న పిల్లలు ఎక్కువ పరిమాణంలో మూత్రమును విసర్జించుట.
★ నాడీమండల క్షోభచే రాత్రి పక్కలో మూత్రం తెలియకుండగనే పోవుట.
★ కెతెటీర్[1] ను ఉపయోగించి మూత్రమును తీసిన తర్వాత మూత్రకోశమందు నరాల బాధ.
★ ఫాస్ఫేట్సు తక్కువగా/ ఎక్కువగా ఉండుట.
★ మూత్రంలో ఇసుక ఉండుట.

**15. పురుష జననేంద్రియాలు :** సంభోగేచ్ఛ అధికంగా ఉండుట – సెగరోగంతో మూత్రనాళం మూసుకొనిపోవుట – ప్రోస్టేటు గ్రంథి చాలా పెద్దదిగా నుండుట.

**16. స్త్రీ జననేంద్రియాలు : బహిష్టు :** బహిష్టు చాలా త్వరగా కనిపించి స్రావం నల్లగా గడ్డలు–గడ్డలుగా పడును లేదా తీగవలె ఉండును. ఈ విధంగా మధ్యమధ్య జరుగును. ఫైబ్రిన్ సంబంధమైనదిగా ఉండును – ఋతుస్రావమందు పొరలవంటివి విసర్జింపబడును. ఇట్టి దానికి ఇది మంచి మందు.

**ఋతుశూల :** 1) స్రావానికి ముందు నొప్పి వస్తూ పోతూ ఉంటుంది. నొప్పి కుడివైపున అధికముగా ఉంటుంది. వేడి వల్ల ఉపశమనం. 2) యోని ద్వారమును అదిమి ఉంచు కండరములు దగ్గరకు ముడుచుకుపోవుట (Vaginismus) 3) పల్చని పొరకు సంబంధించిన ఋతుశూల (Membranous dysmenorrhoea) 4) అండాశయపు వాపు (Ovaritis) 5) జననేంద్రియపు వెలుపలి భాగములు ఉబ్బుట. 6) కటి ప్రదేశంలోని ఎముకల గూడు (Pelvis) అంతటా ఈడ్పు నొప్పులు 7) రెండు అండాశయములందును, వీపు నడిమి భాగమున చురుకైన నొప్పులు 8) గర్భకోశం ముడుచుకుపోయినట్లు, రక్తం వేగంగా బయటికి పంపబడినట్లు అనుభూతి – వేడి తగిలిన వెంటనే అనగా వేడి పదార్థములను సేవించిన వెంటనే ఉపశమనం.

**గర్భిణి :** ప్రసవనొప్పులు ఈడ్పు సంబంధమైనవిగా ఉండును – కాళ్ళయందు కండరాలు బాధతో ముడుచుకుపోవుచుండును – ఈడ్పు సంబంధమైన కండరాలు – శిశువును పైకినెట్టు ప్రయత్నములు ఎక్కువగా జరుగును – ప్రసవ సమయపు పొర్లకు, ప్రసవాంతరపు పొర్లకు ఈ మందును ఇతర మందులతో మధ్యమధ్య వాడవలెను – సంకోచించిన గర్భాశయాన్ని ఈ మందు వదలగునట్లు చేయును – మావిని నిలిపి ఉంచును.

**17. శ్వాసావయవములు : 1) ఉబ్బసం :** అపానవాయువు వెలువడుట బాధాకరముగ నున్నచో ఉబ్బసం వచ్చును.

*1. **కెతెటీరు :** మూత్రాశయంలోని మూత్రమును పైకి తీయుటకు ఉపయోగపడు సన్నని రబ్బరు/ లోహపు గొట్టం.*

**2) దగ్గు :** 1) ఈడ్పు సంబంధమైన దగ్గు పొరలు పొరలుగా వచ్చును - స్రావం వెలువడదు - భ్రమాత్మకమైన జలుబు; నాడీ స్వభావం కలిగిన దగ్గు. 2) నాడీ సంబంధమైన దగ్గు కోరింత దగ్గుగా మారును. 3) రాత్రి దగ్గు పొర్లు పొర్లుగా వచ్చి పరుండుట కష్టమగునట్లు చేయును - కఫం వెలువడదు.

**3) ఛాతీ నొప్పులు :** ఇవి ఒక చోటునుండి మరియొక చోటునకు వేగంగా మారును - ఇవి ప్రేగుల నొప్పినుండి వ్యాప్తమగును - వీటిలో ఛాతీ అదిమినట్లుండును - శ్వాస హ్రస్వముగానుండును - గిలిగింతలు పెట్టే దగ్గుతో ఛాతీ నొక్కివేయ బడినట్లుం డును -శ్వాసకోశములకు సంబంధించిన కండరాలు బలహీనంగా ఉండును - శ్వాసను వదలు నప్పుడు ఛాతీ కృంగిపోయినట్లుండును-కదలిక వల్ల ఛాతీ నొప్పులు అధికమగును.

**18. రక్తప్రసరణావయవములు :** గుండెనొప్పి, నరాల ఈడ్పులు, నాడులకు సంబంధించిన గుండెదడ ఈడ్పు స్వభావముతో ఉండును - గుండె కొట్టుకొనుట ఎక్కువగును - ఎడమవైపున పడుకొన్న గుండెదడ తగ్గును-రోగి దుస్తులు వేసుకొన్నా అతని గుండె కొట్టుకొనుట పైకి వినిపించును.

**19. మెడ, వీపు :** మెడ, వీపు (క్రింది భాగమున, మధ్యభాగమున) లో పుండు పడినట్లు నొప్పి - వీపులో ఏ భాగమందైనా నరాల నొప్పులు తీవ్రంగా, తొలుచునట్లు ఉండును. అవి ఒక చోటు నుండి మరియొక చోటునకు మారును. అవి ప్రక్కటెముకల మధ్య ఉండును. వెన్నెముకపై భాగాన నొప్పి బాధాకరంగా వుండును. తాకిన భరించలేనంత నొప్పి ఉండును.

**20. కాళ్ళు - చేతులు :**

★ భుజములందు, చేతులందు ఉన్న నొప్పులు ఒక చోటు నుండి మరొక చోటునకు త్వరగా మారును - ఈ నొప్పులు కుడివైపున అధికం.

★ చేతులు అప్రయత్నముగ కదలుచుండును - పక్షవాతం - ముళ్ళు గ్రుచ్చుకొనుచున్న ట్లుండుట - రాత్రిపూట కాళ్ళ యందు నరాల బాధ, కండరాల ఈడ్పులు - పడుకొన్న తర్వాత కాళ్ళ బాధ - కాళ్ళు, చేతులలో విద్యుత్ షాక్ వంటి అనుభూతి - ఆ తర్వాత కండరాలు పుండువలె ఉండుట - పాదములు చాలా కోమలంగా ఉండుట, మెల్లగా తాకినా నొప్పి ఉద్రేకించుట.

★ కాళ్ళ యందు సయాటికా నరమునకు ఈడ్పు నొప్పులు - ఇవి తీవ్రంగా బాధపెట్టును.

★ పిక్కలలో (Calves) కండరాలు బాధతో ముడుచుకుపోవును.

★ కీళ్ళవాతమందు తీవ్రమైన నొప్పులు (ఈ మందును మధ్య-మధ్య వాడాలి).

★ చాలకశక్తి తక్కువగా నుండుట.

**21. నాడీ వ్యవస్థ :** ఈ మందు నరముల ధాతువులకు బలాన్నిచ్చి అవి బాగా పనిచేయునట్లు చేయును. కనుక ఈ మందు నాడీ సంబంధమైన క్రింది రోగాలకు బాగా ఉపయోగపడును.

1. రోగి శోషిల్లి, క్షీణించి, కూర్చొనలేకపోయినపుడు.
2. మద్యమును సేవించుటవల్ల రాత్రిపూట కలుగు నరాల బాధ.
3. కండరాల ఈడ్పు సంబంధమైన సంకోచాలు.
4. మెదడు ఆజ్ఞలను వివిధ అవయవములకు తీసుకొని వెళ్ళు నరాల ధాతువులు వ్యాధిగ్రస్తమగుట.
5. మేల్కొన్నపుడు శరీరమంతటా కండరాలు అదరుట.
6. నొప్పులు మెరుపు తీగవలె వచ్చిపోవుట.
7. కాళ్ళు – చేతులు/దేహం బిర్రబిగియుట, ఈడ్పులు
8. వ్రేళ్ళు దగ్గరకు ముడుచుకుపోవుట.
9. బొటనవ్రేళ్ళు లోపలికి లాగబడుట.
10. ఎక్కిళ్ళు.
11. కొరియా వ్యాధి (కండరములు అప్రయత్నముగా కదలుట).
12. పక్షవాతం : కాళ్ళు – చేతులు వణకుట, తలను ఆడించుట (KP)
13. నాడీపేశముల (Nerve fibres) పక్షవాతం – వ్రాయసగాండ్ర వ్రేళ్ళకు కలుగు ఈడ్పు.
14. పియానో, వీణ వాయించేవారి చేతి కండరాలకు కలుగు బాధ.
15. ఈడ్పులతో వెక్కివెక్కి ఏడ్చుట.
16. ధనుర్వాతపు ఈడ్పులు.
17. అంకెళ్ళు (Lock Jaw) – నమలుటకు ఉపయోగించు కండరములు బిర్రబిగియుట (ఈ వ్యాధికి ఈ మందును చిగుళ్ళలో రుద్దాలి).
18. చెడు అలవాట్లచే కలుగు మూర్ఛ.
19. వెక్కి వెక్కి దుఃఖించుట పొర్లు–పొర్లుగ కలుగును.
20. పిడికిళ్ళు, దంతములు దగ్గరకు ముడుచుకుపోవుట.

**22.** నిద్ర **:**

★ ఆవులింతలు పొర్లు–పొర్లుగ వచ్చుట.

★ అలసట/మెదడుకు పోషణ తగ్గుటవల్ల కలుగు నిద్రలేమి.

★ నిద్రమత్తు.

★ తల/మెడ వెనుక భాగమందు నొప్పి వల్ల నిద్రాభంగం.

★ భయంకరమైన కలలు.

**23. జ్వరం :**

★ పిక్కలలో ఈడ్పులతో విడిచి విడిచి వచ్చు జ్వరం.

★ సాయంకాలం ఏడు గంటల సమయాన భోజనానంతరం చలి.

★ వీపు అడుగున వణకుతో కూడిన చలి – ఊపిరాడకుండుట.

★ ఉదయం 9 గం॥ సమయాన అధిక చలి.

★ పైత్యంతో కూడిన జ్వరం – విస్తారంగా చెమట పోయుట.

**24. చర్మం :**

★ పాదముల వాపులందును, ఆనికాయలందు[1] (Corns) మంట.

★ పాదములందలి కీళ్ళ వద్ద, ముఖ్యముగ బొటనవ్రేలి కీళ్ళ వద్ద రాపిడి కలుగకుండ చేయు ద్రవపుతిత్తి వాచి చాలా బాధగానుండుట (Bunion).

★ తట్టు/పొంగు (Rash) కురుపులు తేనెటీగలు కుట్టినట్లుండుట – ఇది మోకాళ్ళు, మోచేతులు, చీలమండ వద్ద ఎక్కువగా ఉండును.

★ మంగలి కత్తిచే కలుగు వ్యాధి.

★ తెల్లని పక్కులు గల హెర్పస్ అను చర్మవ్యాధి.

★ సెగ్గడ్డలు[2] (Boils).

**25. ధాతువులు :**

★ నరాల వ్యాధులు – ఈడ్పులు.

★ నరాల సంబంధమైన ఉబ్బసం.

★ గ్లాటిస్[3] ఈడ్పులు.

★ కొరియా వ్యాధి.

★ హానికరమైన ఉత్తేజక పదార్థాల చెడు ఫలితాలు.

---

*1. **ఆణికాయి, ఆనె (Corn) :** ఇది రాపిడి/ఒత్తుడు వల్ల పాదములందు/కాలివ్రేళ్ళ మీద చర్మం దళసరెక్కి గట్టిపడును.*

*2. సెగ్గడ్డ **(Boil) :** వాచి చీము కారు కురుపు.*

*3. **గ్లాటిస్ :** శ్వాసనాళపు ఊర్ధ్వభాగమునకు, స్వరపేటికకు మధ్యగల రంధ్రం.*

# 9. నేట్రం మూరియాటికం / నేట్రంమూర్
## Natrum Muriaticum/Natrum Mur

**రసాయనిక నామం :** సోడియం క్లోరైడు.

**వాడుక పేరు :** (మనం తినే) ఉప్పు, టేబుల్ సాల్ట్.

**ఈ లవణం దేహంలో ఎక్కువగా ఎక్కడ ఉండును ?**

ఈ లవణం శరీరపు ప్రతి ద్రవభాగంలోను, రక్తపు ప్లాస్మాయందు అతి ముఖ్యమైనది.

**మన దేహానికి ఉప్పు ఎలా లభిస్తుంది ?**

మనం త్రాగే నీటిలోను, ఇతర ద్రవ పదార్థాలలోను, మనం తినే కాయగూరల/పండ్ల (Fruits) వల్లను మన దేహానికి కావలసిన ఉప్పు లభిస్తుంది. కాని ఈ ఉప్పు దేహంలోని వివిధ కణాలకు అందాలంటే 4-5 లీటర్ల నీరు ప్రతిరోజు త్రాగాలి. అలా చేసినచో ఆ నీరు ఉప్పును దేహంలోని కణాలకు అవసరమైన మేరకు సరఫరా చేయగలదు. కాని నేటి యాంత్రిక జీవితంలో మనిషి అన్ని పనులూ వేగంగా ముగించాలనుకొంటాడు. మన విద్యాసంస్థలలోను, కార్యాలయాలలోను సురక్షితమైన త్రాగునీటిని అందించే వ్యవస్థ లేదు. ఎక్కువ నీరు త్రాగితే ఎక్కువసార్లు మూత్ర-విసర్జన చేయాల్సి వస్తుందని మనవారి ముఖ్యంగా విద్యార్థినుల, ఉద్యోగినుల భయం. మూత్రవిసర్జనకు కావలసిన శుభ్రమైన వ్యవస్థ కూడా మన సంస్థలలో లేదు కదా! కారణమేదైనా మనం తగినంత పరిమాణంలో నీటిని తీసుకొనకపోతే ఉప్పు దేహంలోని అన్ని కణాలకు సక్రమంగా సరఫరా కాదు. ఒకచోట ఎక్కువగాను, మరొకచోట తక్కువగాను ఉంటుంది.

**ఉద్రేకములు :**

ఉదయం 10-11 గంటలు, ఎండ, సముద్ర తీరం, చల్లని వాతావరణం / చల్లగాలి, ఓదార్పు, పున్నమి, ఎడమవైపున నిద్రించుట, ఏడ్చుట.

**ఉపశమనములు :**

సాయంకాలం, బహిరంగ గాలి, ఉపవాసం, కుడిప్రక్కన పడుకొనుట, నిద్ర, వీపుకు మర్దన, గట్టిగా నున్నదానిపై పడుకొనుట.

**ఈ మందు లభించు పొటెన్సీలు:**

3× - 1000×.

**ఏ పొటెన్సీ ఏ వ్యాధికి వాడాలి ?**

**శూల :** 30× నీటిలో కలిపి తరచుగా వాడాలి.

**మానసిక వ్యాధులు :** క్రమంగా పెంచుతూ 100× వరకూ.

**పైపూతకు :** 2× లేదా 3×.

**మందు పనిచేయుకాలం :** 40-50 రోజులు.

**మయాజమ్ :** సోరా, సిఫిలిస్, సైకోసిస్.

చాలామంది కూరలు వండేటప్పుడు రుచికోసం ఉప్పు వేస్తూ ఉంటారు. ఉప్పు కలిపిన మజ్జిగనే త్రాగుతారు. పెరుగన్నంలో ఉప్పు కలుపు కొంటూ ఉంటారు. ఈ విధంగా తీసుకొనే ఉప్పును మన అవసరం కంటే ఎక్కువే అని భావించాలి.

**నీరు ఉప్పు పూరకములు :** నీరు, ఉప్పు – వీటిని పూరకములుగా భావించవచ్చు. నీరు కణాలకు అందాలంటే ఉప్పు చాలా అవసరం. ఉప్పు నీటిని ఆకర్షిస్తుంది. అట్లే ఉప్పు కణాలకు అందాలంటే అది ద్రావణీయ స్థితిలో ఉండాలి. అందుకు నీరు కావాలి.

**మానసిక స్వభావం :**

తేలికగా కోపపడుట/ఉత్తేజం పొందుట.

**ఉష్ణ సహనం :**

ఉష్ణం సహించలేకపోవుట, సులభంగా జలుబు చేయుట.

**ప్రత్యేకత :**

వడదెబ్బకు నివారణగా ఉపయోగపడును.

**ఉప్పు తక్కువైన కలుగు బాధలు :** కణములందు ఉప్పు/సోడియం క్లోరైడు తక్కువైనా/ఏర్పడకపోయినా వాటికి తేమనిచ్చుటకు నిర్దేశింపబడిన నీటి కణముల మధ్యస్థ ద్రవములందే ఉండిపోవును. దీనివలన రక్తం నీరు వలె ఉండును. అప్పుడు రోగి నీరు పట్టినట్లుగా ఉండును. అతడు శోష చెందినవాడుగాను, జీవశక్తి లేనివాడుగను, నిరుత్సాహవంతుడుగను, నిద్రమత్తు తోను ఉండును. అధికమైన నీరు కన్నీటి రూపంలో స్రవించును. లాలాజలం అధికమగును. రక్తమందలి సీరం (ద్రవం) జీర్ణకోశంలోనికి స్రవించి నీటి వంటి ద్రవం వాంతి యగును. త్రేపులు వచ్చును. జీర్ణకోశ మందు మంటతో కూడిన బాధ కలుగును. కనురెప్పలపై బొబ్బలు లేచును. వెన్నెముక పొడుగునా చలిగా ఉండును.

**ఉప్పు అధికముగ తిన్నచో కలుగు బాధలు :**

1. స్వరతంత్రులు దళసరెక్కును. వాటికి కొంతవరకు పక్షవాతం కలుగును. గొంతునొప్పి, బాగా స్రవించెడి జలుబు ఉండును.
2. శరీరపు రంగు పాలిపోవును. చెమట బాగా పట్టును.
3. మలబద్ధకం/దీర్ఘకాలపు విరేచనములు.
4. విపరీతమైన ఆకలి, ఎడతెగని దాహం.
5. ద్రవములు స్రవించును.
6. రక్తం పలచనగును. రక్తప్రసరణం మెల్లగ జరుగును. రక్తక్షీణత ఏర్పడును.
7. చుండ్రు.
8. వ్రణములు, తట్టు/పొంగు (చీము లేనట్టి కురుపులు).

9. చలి జ్వరం.
10. శరీరములో పనికిమాలిన పదార్థములు నిల్వయుండి కీళ్ళవాతం (Gout) కలిగించును.

**ఉప్పు – ప్రాచీన భారతీయ వైద్యుల దృక్పథం :**

ఉప్పు నష్టాలను బట్టి మనకు ఈ విషయం అవగత మవుతుంది – "పుట్టినప్పటి నుండీ మనం ప్రతి రోజూ తినే ఎక్కువ ఉప్పంతా శరీరంలో ఎక్కువై బయటకు పోలేక, పేరుకుపోయి, రకరకాలుగా కణాలకు, అవయువాలకు తుప్పు పట్టించడం మొదలుపెడ్తుంది". ఉప్పు నష్టాన్ని తెలిసిన ప్రాచీన భారతీయ వైద్యులు ఉప్పును శనిగాను, దరిద్రముగాను అభివర్ణించారు. అందుకే నేడు కొంతమంది వైద్యులు ఉప్పును వంటలలోను, మజ్జిగలోను వేసుకోవద్దనియు, మనిషికి అవసరమైన ఉప్పు కూరగాయలు, ఆకు కూరలు, పండ్లు, ఆహారపదార్థాలు మొదలైన వాటి ద్వారా లభిస్తుందనియు, నీరు బాగా త్రాగమనియు విస్తృతంగా ప్రచారం చేస్తున్నారు. భోజనం/అల్పాహారం చేయటానికి అరగంటముందు, భోజనం చేసిన రెండు గంటల తర్వాత నీరు త్రాగాలనియు, భోజనం చేసేటప్పుడు నీరు త్రాగరాదనియు వారు ఆరోగ్య సంబంధమైన ఉత్తమ సలహాలు ఇస్తున్నారు.

**నేత్రంమూరు – ప్రాధాన్యత :** ద్వాదశ లవణాలలో పొటెన్సీల రూపం లోనికి మార్చబడిన నేత్రంమూరు ఎంతో ప్రముఖమైన మందు. ఉప్పు దురుపయోగం వల్ల మన శరీరానికి కలిగే నష్టాన్ని ఈ మందుతో నివారించవచ్చు. కనుకనే ఈ కణ–లవణం యొక్క విలువను ఊహింపజాలం అని సి.ఎస్. సాండర్, ఎల్.ఆర్.సి.పి. పేర్కొన్నారు.

## మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు :**

★ భవిష్యత్తు గూర్చి నిరాశ, నిరుత్సాహం – ఓదార్పుచే నిరాశ, నిరుత్సాహం అధికమగుట.

★ ఆందోళన వల్ల గుండె వడిగా కొట్టుకొనుట.

★ సంతోషదాయకం కాని, ఉత్సాహాన్ని కృంగదీసే విషయాలపై ఎక్కువగా ఆలోచించుట – గడచిన విషయాలను జ్ఞాపకం చేసుకొని వాటిని గురించే ఆలోచిస్తూ వుండుట.

★ కన్నీరు కార్చుటకు సిద్ధంగా ఉండుట, తేరిపార చూచుట, నాలుకమీద నురుగులు – ఈ లక్షణాలతో నున్న సంధి.

★ మలబద్ధకంతో కారణం లేకుండగనే కృంగు స్థితి.

★ మానసిక ఉద్రేకత.

★ అమిత సంతోషముతో నృత్యము చేయాలనుకొనుట, పాడదలచుట.

★ చిరచిరలాడుట.

★ సంధిలో వాగుడు.

★ రజస్వలలో విచారం.

★ మెదడు అలసట చెందుట.

★ జ్ఞాపకశక్తి తగ్గుట.

★ మానసిక శక్తి అలసటను కలిగించుట.

**2. తల :**

★ **తలనొప్పి :** వివిధ రకాలైన తలనొప్పులకు ఇది మంచి మందు. నుదురు/కణత/ అర్థపార్శ్వం తలనొప్పికి స్థానం.

1) **రక్తాధిక్యతచే కలుగు తలనొప్పి :** ఇది ఉదయాన అధికంగా ఉండును. నిద్రవల్ల తగ్గును. బహిష్టు సమయమున వచ్చును.

2) **మొద్దుబారునట్లు చేయునట్టి, భారముగానుండు తలనొప్పి :** మెడ నరాల బలహీనత వల్ల తల అప్రయత్నముగా ముందుకు ఊగుచుండును. కన్నీరు కారును. నిద్రమత్తుగా నుండును. నిద్రపోయిన విశ్రాంతి లభించదు.

3) **మలబద్ధకంతో నుండు తలనొప్పి :** ప్రేగుల ఆమత్వక్కు కొంతభాగం పొడిగ నుండును. ప్రేగు స్తబ్దత – నాలుక పరిశుభ్రంగా ఉండుట – లాలాజలం నురుగుతో.

4) **వమనముతోనున్న తలనొప్పి :** దీనిలో పారదర్శకమగు కళ్ళె/నీరు వాంతియగును.

5) **రోగగ్రస్తము చేయు తలనొప్పి :** దీనిలో వాంతి కలుగును (CP)

6) **సమ్మెటలతో కొట్టుచున్నట్లుండు తలనొప్పి :** ఇది సాధారణంగా ఉదయాన ఎక్కువగ నుండును.

7) **స్కూలు విద్యార్థినుల తలనొప్పి :** ఇది వారి బహిష్టు సమయాన వచ్చును. అప్పుడు నడినెత్తిలో మంటగానుండును.

8) **కపాలమందు సగభాగం సరిగా వృద్ధి చెందకుండుట :** దీనిలో స్పృహ నశించుటతో కాళ్ళు – చేతులు అదరుచుండును.

9) **మెదడువాపు :** వడదెబ్బ వలన మెదడు వాచిన ఇది మంచి మందు. ఇది మెదడువాపు నిరోధమునకు కూడా ఉపయోగపడును.

★ **తలపై నుండు చర్మం :** మెడ వెనుకనున్న వెంట్రుకల అంచువద్ద దురదతో నుండు చర్మవ్యాధి వచ్చును. జిగురు వంటి తేమ, చుండ్రు, తెల్లని పొలుసులు ఈ వ్యాధి లక్షణాలు. కొన్ని సమయాలలో నోరు, ముక్కు, కళ్ళ నుండి నీటి వంటి స్రావం స్రవించును. తల వెంట్రుకలు రాలును.

3. **కళ్ళు : కార్నియా (శుక్లపటలము) :** దీని పారదర్శకత్వం లోపించుట వల్ల చూపు మసకగా నుండుట – దీనిపై నీటి బొబ్బలు, తెల్లని మచ్చలు (KM) – దీనిపై క్షయ సంబంధమైన పుండ్లు – ఇది వెలుగును సహించలేకపోవుట.

★ కనుగ్రుడ్డులోని పారదర్శకమైన జిగురులాంటి ద్రవం వ్యాధిగ్రస్తమగుట. దీనికి ఈ మందు బాగా ఉపయోగపడును.

★ కళ్ళ ముందు గాజుగుడ్డ/దోమతెర గుడ్డ వంటిది ఉన్నట్లు అనిపించును – అక్షరాలు కలిసిపోయినట్లుండును.

★ కంటివద్ద నుండు సైనస్ నాడి వాచుట.

★ కన్నీటి నాళములో కలుగు ఆటంకం వల్ల కళ్ల నుండి కన్నీరు స్రవించుట – ఇది సిల్వర్ నైట్రేట్ వాడకంవల్ల ఎక్కువగును.

★ **కండ్లకలక :** కళ్ళు ఎర్రగా నుండును. కళ్ళ నుండి తెల్లని ఆమము వచ్చును. మంటగా నుండు కన్నీరు స్రవించును.

★ కనురెప్పలు బాగా పొడిగానుండును. వాటిలో గ్రుచ్చినట్లు నొప్పి ఉండును. వాటిలో దురద, మంట ఉండును – వాటి అంచులు బాగా దళసరిగాను, ఎర్రగాను ఉండును – వాటి అంచులపై చిన్న నీటి పొక్కులుండి, అవి బాగా వాచి, కన్నీరు కూడా బాగా మండుచున్న ఈ మందు బాగా ఉపయోగపడును.

★ కంటి బాహ్య కండరాలు అలసిపోవుటచే చూపు నీరసముగా/బాధాకరముగా నుండుట – ఈ లక్షణానికి దీనికి మించిన మందు లేదు.

★ కంటి నరాల బాధ కాలనియమముగా వచ్చుచుండును – కన్నీరు కారుచుండును – కనురెప్పల నరాల బాధ సూర్యుని రాకతో (ఉదయాన) వచ్చి సూర్యుని పోక (సాయంత్రం)తో పోవును.

★ కన్నీటి నాళములు దగ్గరికి నొక్కివేయబడినట్లుండును.

4. **చెవులు :**

★ చెవిలో దురద, మంట, కుట్టినట్లుగా ఉండుట.

★ చెవులలో హోరుశబ్దాలు–చెవుల నుండి చీము–నమలునపుడు పటపట శబ్దం వినిపించుట.

★ మధ్య చెవి రంధ్రం వాపువల్ల చెముడు.

★ మధ్యచెవికి, కర్ణాంతర నాళమునకు జలుబు (KS)

**5. ముక్కు :**

★ **ముక్కు, గొంతుకు సంబంధించిన జలుబు :** ఇది దీర్ఘకాలంగా ఉండును. దీనివల్ల రుచి, వాసన తెలియదు. ద్రవంతో కూడిన పుండ్లు ఏర్పడును. పుండ్లు పగలగా పలచని పక్కులు ఏర్పడును.

★ **ఇన్‌ఫ్లూయంజా జలుబు :** దీనిలో ప్రబలమైన జలుబు, తలనొప్పి, జ్వరం, నొప్పులు ఉండును. ఈ లక్షణాలకు నేట్రంమూర్ మంచి మందు.

★ రక్తంలేని రోగుల దీర్ఘకాలపు జలుబు. దీనిలో శ్లేష్మం ఉప్పు రుచితో నుండును.

★ శుద్ధమైన నీటిస్రావం గల జలుబు, పొడిగానుండు జలుబు : ఇవి మారుచుండును. వీటిలో రుచి, వాసన తెలియదు. ముక్కు రంధ్రముల వెనుకభాగం పొడిగానుండును. తుమ్ములు అధికంగా వచ్చును.

★ **ముక్కు నుండి రక్తస్రావం :** ఇది వంగుట/దగ్గుటవల్ల కలుగును.

★ ఈ జలుబులన్నియూ ఉదయాన అధికమగును. ముక్కు ఎరుపెక్కును. చిన్న చీము పొక్కులు, మొటిమలు (pimples), నీటి పొక్కులు, బాధాకరమైన చిన్న ముడులు ఏర్పడును. ముక్కు ఒక వైపున తిమ్మిరిగనుండును. తుమ్ములతో జలుబు ప్రారంభమగును.

★ ముక్కు పుండు పడుట, పొడిగానుండుట, అడ్డంకి, గ్రుడ్డు తెల్లని సొన వంటి స్రావం స్రవించుట – ఈ విధంగా ముక్కు ఒకవైపున మాత్రమే ఉండవచ్చు.

**6. ముఖం :** ముఖం పచ్చగా/పసుపు గోధుమ రంగు/సీసం రంగులో ఉండుట – చర్మం జిడ్డుగా నుండుట – తినునపుడు చెమటపోయుట – సైకోసిస్ వల్ల మీసములు రాలిపోవుట – అచ్చుట దురద, నీటి పొక్కులు ఏర్పడుట – నుదుటిపై చిన్న కురుపులు/ దద్దుర్లు లేచుట – ముఖంనొప్పి మలబద్ధకంతోను, శుద్ధమైన నీటితో – క్వినైను వాడిన తర్వాత, ఒక కాలనియమం ప్రకారం నరాలనొప్పి, కన్నీరు కారుటతో.

**7. నోరు :**

★ నోటిలో లాలాజలం విస్తారముగను, ఉప్పు రుచితోను ఉండును.

★ నోటిచుట్టూ ముత్యాల వంటి బొబ్బలు లేచును.

★ నోటిలో లాలాజలముతో కూడిన పుండ్లు.

★ నోటి మూలలందు తేమతోకూడిన పుండ్లు.

★ పెదవులు చీలుట – అవి మంటగాను, నొప్పిగాను ఉండుట.

★ కొండనాలుక దిగుట.

★ ఫారింగ్స్ ద్రవపు తిత్తుల జలుబు.

★ పెదవుల వాపు.

★ గడ్డంపై దద్దుర్లు.

8. **నాలుక :** నాలుక మీద బంకగాను, శుద్ధమైన, నీటివలెనున్న పాచి (Coating) – సీరం (రక్తంలోని ద్రవం) ఆమముగ వెలువడుట – నాలుక అంచులపై నురుగు చిన్న చిన్న బుడగలు – రుచి తెలియకపోవుట – నాలుక కొనపై నీటి పొక్కులు – నాలుకపైన దేశపటంలోని వివిధాకృతుల వంటి మచ్చలు – నాలుక తిమ్మిరిగను, బిర్రబిగిసినట్లు ఉండుట – నాలుకపై వెంట్రుక ఉన్నట్లు తోచుట – పిల్లలు మాట్లాడటం నేర్చుకొనుటలో నెమ్మదిగా ఉండుట.

9. **దంతములు :** ★ **పంటినొప్పి :** దీనిలో కన్నీరు/లాలాజలం అప్రయత్నంగా స్రవించును. ★ **లాలాజలగ్రంథుల వాపు :** ఇది దీర్ఘకాలంగా ఉండును. ★ **చిగుళ్ళు :** చిగుళ్ళు పుండుపడి స్పర్శను భరించలేకుండుట – వాటినుండి రక్తం స్రవించుట – ★ చిగుళ్ళ కురుపులు, కొట్టుచుండునట్టి (Throbbing), తొలచునట్టి నొప్పులతో.

★ దంతములు వదలుగా నుండుట.

★ దంతోత్పత్తి చొంగ/జొల్లు కారు లక్షణముతో.

10. **మెడ, గొంతు :**

★ మెడ శుష్కించుట.

★ ముఖం ఉబ్బరించుట, పాలిపోవుట, మగత, నీటి విరేచనాలు, లాలాజలం స్రవించుట/నీటిని వాంతి చేసుకొనుట మొదలైన లక్షణాలతో డిఫ్తీరియా.

★ డిఫ్తీరియా తర్వాత వచ్చు పక్షవాతం – ఆహారం సరిగా మింగుడు పడకపోవుట, ద్రవపదార్థములను మాత్రమే మ్రింగ గలుగుట.

★ గొంతునొప్పి : కళ్ళె పారదర్శకముగా నుండుట – అది టాన్సిల్స్‌ను కప్పియుంచుట.

★ దీర్ఘకాలముగానున్న గొంతునొప్పి – గొంతులో ఏదోఉన్నట్లు అనిపించుట – గొంతు నిగనిగలాడుచు పొడిగ ఉండుట – గొంతు నొక్కివేసినట్లుండుట, దానిలో కుట్టినట్టి నొప్పి – పొగ త్రాగువారిలోను, సిల్వర్‌నైట్రేట్ చికిత్స తర్వాత గొంతులోని గ్రంథులు వాచుట.

★ కొండనాలుక వ్రేలాడుట – కొండనాలుక పెద్దదగుట.

★ దవుడల క్రిందనున్న గ్రంథులు, పెదవులు, మెడలోని గ్రంథులు, టాన్సిల్సు వాచుట.

★ మెడయందలి థైరాయిడ్ గ్రంథి వాచుట – నీళ్ళవంటి స్రావములుండుట (ముఖ్య ఔషధం CP)

- ★ గవదల (Mumps) వాపు : లాలాజలం స్రవించుట, తరచుగా శ్లేష్మమును కాంక్షించుట – కళ్ళె ఉప్పుగా నుండుట.
- ★ దుర్వాసనగా నుండు శ్వాస.

**11. జీర్ణాశయం :**

- ★ ఎక్కిళ్ళు.
- ★ అజీర్ణం – శుద్ధమైన, నురుగుతోనున్న నీరు వాంతి చేసుకొనబడును. కొందరిలో తీగలవలె సాగు లాలాజలం వాంతియగును. మరికొందరిలో లాలాజలం వాంతియగును. అప్పుడు నొప్పిగా ఉండును.
- ★ దుర్వాసన గల శ్వాస.
- ★ పై లక్షణాలతోనున్న కడుపునొప్పి.
- ★ జీర్ణాశయం బరువుగాను, నిండుగాను ఉన్నట్లు అనిపించును.
- ★ అజీర్ణముచే నోటియందు నీరు అధికముగా ఊరి గొంతులోనికి వచ్చును – ఆ నీటికి ఆమ్ల స్వభావం ఉండదు.
- ★ కడుపు ఉబ్బు, కడుపుపై ఒత్తిడి పెరుగును.
- ★ కారముగాను, ఉప్పుగాను ఉండు వస్తువులను తినాలనెడి కోరిక.
- ★ ఎక్కువ ఆకలి – ఎక్కువ నీళ్ళు త్రాగాలనే దప్పిక.
- ★ తిన్న తర్వాత కడుపులోను, ఛాతీ భాగంలోను మంట.
- ★ బ్రెడ్ అయిష్టం – పొగ త్రాగవలయుననెడి కోరిక తగ్గుట.
- ★ మగతతో కూడిన కామెర్లు.
- ★ అధికమైన బలహీనత.
- ★ జీర్ణాశయం వద్ద కృంగినట్లుండుట.
- ★ జీర్ణాశయపు గుంటపై ఎర్రని మచ్చలు.

**12. పొత్తికడుపు – విరేచనం/మలం :**

- ★ **మలబద్ధకం :** ఉదయాన లేచినపుడు పొత్తికడుపులో నీరు తగు పరిమాణంలో లేకపోవుటచే మలబద్ధకం.
- ★ పొత్తికడుపును కప్పిఉంచు పొరలు పొడిగా ఉండును. కాని ఇతర అవయవాలలో నీరుండును. నీరు వాంతియగును. కళ్ళల్లో నీరుండును. నోటిలో లాలాజలం స్రవించును.
- ★ కాలేయం, ప్లీహ మండలంలో నొప్పి.
- ★ మూలశంక సంబంధమగు మలబద్ధకం.

★ ప్రేగుల బలహీనతతో కూడిన మలబద్ధకం – అమితమైన స్తబ్ధత ఉండును, కాని నొప్పి ఉండదు.

★ గుదము వద్ద నెరదలు : ఇవి పొడిగా నుండు మలం వల్ల ఏర్పడును – గుదం వద్ద మండుచున్న నొప్పి.

★ మూలశంక (Piles) : నొప్పి విషక్రిములు కుట్టినట్లుండును.

★ గుదము చుట్టూ హెర్పస్ సంబంధమైన చర్మవ్యాధి.

★ మలం గట్టిగానుండును. అందువల్ల మలవిసర్జన కష్టముగా నుండి చిన్న–చిన్న ముక్కలుగా విసర్జింపబడును. మలవిసర్జన తర్వాత గుదం చీల్చబడి, రక్తం కారుచు తీవ్రమైన బాధతో నుండును. పురీషనాళమందు చురుకగు నొప్పి.

★ పొత్తికడుపునకు, వృషణములుండు తిత్తికి మధ్యభాగమందు నొప్పి.

★ నీళ్ళ విరేచనం నురుగుతోనుండును.

★ నీళ్ళ విరేచనం, మలబద్ధకం – ఈ రెండూ ఒకదాని తర్వాత మరొకటి మారును.

★ విరేచనం నీళ్ళ వలె వుండి ఒరుపు కలిగించును.

★ తెలియకుండానే విరేచనమగును – అపానవాయువు వెడలినదీ, మలం వెళ్ళినదీ రోగికి తెలియదు.

★ పొత్తికడుపు, పొత్తికడుపులోని అవయవములు అధిక నీరసముగా ఉండును.

**13. మూత్రావయవములు :**

★ త్రేపులు, అజీర్ణంచే నోటియందు నీరు అధికముగా ఊరుట, రోగి బాగా శుష్కించుట – ఈ లక్షణాలతో అధిక మూత్రోత్పత్తి.

★ స్కర్వీ (శారీరక నిస్త్రాణ) వల్ల మూత్రకోశం నుండి రక్తస్రావం.

★ మూత్ర విసర్జన తర్వాత కోయుచున్నట్టి, మంటతో నుండు నొప్పి.

★ ఇతరుల సమక్షమున మూత్ర విసర్జన చేయలేకపోవుట – నడచునపుడు, దగ్గునపుడు, మూత్రం తెలియకుండానే పోవుట.

★ మూత్రం వచ్చుటకు కొంతసేపు వేచియుండాలి.

★ మూత్రకోశపు ఆమత్వక్కు వాపు – ఒక రకమైన స్రావం స్రవించుట.

**14. పురుష జననేంద్రియాలు :**

★ వృషణములలో (Testicles) నొప్పి.

★ వృషణములుండు తిత్తి (Scrotum)పై అమితమైన దురద.

★ జననేంద్రియముపై వెంట్రుకలు పెరుగు ప్రదేశమున (Pubes) వెంట్రుకలు రాలుట.

★ శుక్రవాహక నాళము (Spermatic cord), వృషణములు ఎక్కువ బాధాకరంగా నుండుట – అవి వాచుట – శరీరములో గుల్లగ నుండు ప్రదేశములందు ద్రవం కూడుట.

★ గనోరియా వ్యాధిచే దీర్ఘకాలంగా బాధపడుచుండుట – పారదర్శకమైన, నీళ్ళగా, బంకగా నుండు స్రావం – అమితమైన దురద.

★ శుక్ర స్కలనం తర్వాత చలి, అలసట – సంభోగేచ్ఛ అధికముగా నుండుట – నపుంసకత్వం – బీజముల తిత్తి (Scrotum) కి నీరు పట్టుట – ప్రోస్టేటు స్రావం స్రవించుట.

**15. స్త్రీ జననేంద్రియాలు :**

★ **కుసుమ :** విస్తారమైన కుసుమ – అది పారదర్శకముగను, తెల్లగను, చిక్కని ఆమముగను ఉండును.

★ **యోని :** యోని పొడిగాను, మండుచున్నట్లుగాను వుండును. అందువల్ల రతి చాలా బాధాకరముగ నుండును – మూత్ర విసర్జన తర్వాత యోని మంటగాను, పుండుగాను వుండును – మూత్ర విసర్జన అదుపులో వుండదు.

★ **బహిష్టు :** బహిష్టు స్రావం పలచగా నీటివలె నుండును, రక్తంతో కూడియుండును – ఆలస్యమైన బహిష్టు తలనొప్పితో కూడియుండును – జననేంద్రియం ఎక్కువ దురదగా నుండును – బహిష్టు సమయమున విపరీతమైన విచారం – కుసుమ నీళ్ళగానుండుట – బహిష్టు విస్తారముగా నుండుట, దానితోపాటు బంకగానుండు కుసుమ. అది ధాతువులను నాశనం చేయును – బహిష్టు తర్వాత రెండు బహిష్టుల మధ్య నీటిలాగా ఉండునట్టి, చురుకైన బాధ కలిగించునట్టి స్రావములు – ఆ స్రావములు వేడినీరు పోసినట్లుండి, క్షోభను కలిగించి జననేంద్రియంపై దురదను కలిగించి వెంట్రుకలు రాలునట్లు చేయును – బహిష్టుకు ముందు దుఃఖం, విచారం – బహిష్టు తర్వాత, బహిష్టు సమయాన తలనొప్పి.

★ ఇనుప లవణం లోపం వలన ఏర్పడు రక్తక్షీణత (Chlorosis) చర్మం అంద విహీనంగా కనిపించుట, గుండెదడ, బహిష్టు ఆలస్యమగుట.

★ గర్భకోశ వ్యాధులు

★ గర్భకోశం దిగజారుట – దీనిని నివారించుటకు కూర్చొనవలెను.

★ ఇతర గర్భకోశవ్యాధులు తగ్గుటకు 1) వీపు మీద/వెల్లకిలపడుకొనుట 2) దిండుపై పడుకొనుట 3) ఉదయాన జననేంద్రియం వైపుకు అదముట/తోయుట చేయాలి.

★ **గర్భిణి :** వమన వికారం – నురుగుగా, నీళ్ళవలె నున్న కళ్ళెను వాంతి చేసుకొనుట.

★ **బాలింతరాలు :** శిశువు జన్మించినపుడు/శిశువుకు పాలిచ్చునపుడు తల్లి వెంట్రుకలు రాలును – స్తనములు శుష్కించును.

**16. శ్వాసావయవములు :**

★ శ్వాసనాళం వాపు – స్వచ్ఛమైన, నురుగుగానున్న, నీటివలెనున్న శ్లేష్మం/కళ్ళె – అది వదలుగాను, గడగడ ధ్వనితోను వెలువడును. కొన్ని సమయాల్లో ఆ కళ్ళె అతి కష్టముతో కాండ్రించబడును.

★ పొడిగా, హ్రస్వముగానుండు దగ్గు రాత్రింబవళ్ళు జీర్ణాశయపు గుంటవద్ద గల క్షోభ కారణంగా వచ్చును.

★ **బ్రాంకైటిస్ (శ్వాసనాళముల వాపు) దగ్గు :** రొమ్మెముక వెనుక గులగ నుండుటచే దగ్గు వచ్చుట – ఈ దగ్గు బ్రద్ధలు చేయు తలనొప్పిని కలిగించును. తెలియకుండానే మూత్ర విసర్జన జరుగును. పొత్తికడుపు – బీజముల మధ్య భాగం (Abdominal ring), శుక్రవాహక నాళం (Spermatic cord) ల మధ్య నొప్పి – కన్నీరు స్రవించుట – గుండెదడ – ఛాతీ యందు సూదితో పొడుచుచున్నట్టి నొప్పులు.

★ దీర్ఘకాలపు శ్వాసనాళముల జలుబు, చలికాలపు దగ్గు, తలను బ్రద్ధలు చేయు దగ్గు – బుగ్గల మీదుగా స్రవించు కన్నీరు, తెలియకుండానే జరుగు మూత్ర విసర్జన.

★ **ఉబ్బసం :** నీళ్ళవంటి శ్లేష్మం విస్తారంగా.

★ కోరింతదగ్గు.

★ ఊపిరితిత్తుల వాపు – కళ్ళె గడగడ ధ్వని చేస్తూ వెలువడుట – నురుగు వంటి సీరం అతి కష్టం మీద కాండ్రించబడుట/ఉమ్మివేయబడుట.

★ ఊపిరితిత్తుల పై పొర యగు ప్లూరా వాపు (Pleurisy) : దీనిలో సీరమునకు సంబంధించిన ద్రవం కూడును.

★ ఊపిరితిత్తుల వాపు : బొంగురుతనం, నొప్పి, ఆయాసం.

**17. రక్తప్రసరణావయవములు :**

★ **గుండె పై భాగమున నొప్పి :** ఈ నొప్పి ఏ మాత్రం కదలినా, గాలిని లోతుగా పీల్చినా ఎక్కువగును. నాడి వేగంగా కొట్టుకొనును. మధ్య–మధ్య కొట్టుకొనుట ఆగిపోవును. ఎడమవైపున పడుకొన్న నాడి కొట్టుకొనుట ఎక్కువగును. దీని ప్రభావం దేహమంతటా ముఖ్యంగా కడుపుమీద గల ఉదరకుహరమండలం (Epigastrium)లో కనిపించును. ఒక ప్రదేశంలో రక్తమధికమగును. స్కర్వీ వ్యాధిలో నాడి ఎక్కువగా కొట్టుకొనును.

★ **గుండె వడిగా పక్షి రెక్కలవలె కొట్టుకొనుట :** చుట్టూ నొక్కివేయబడినట్లుండును. ఆందోళన, దుఃఖం, రక్తహీనతలో గుండెదడ.

★ **గుండె విపరీతముగా పెద్దదగుట :** అప్పుడు రోగి తరచుగా పడుకొనుట. అతని చేతులు చల్లగాను, కాళ్ళు తిమ్మిరిగాను ఉండుట.

**18. వీపు, కాళ్ళు–చేతులు :**

★ పిల్లలలో మెడ శుష్కించుట.

★ వీపు నొప్పి–ఏదైనా గట్టి వస్తువుపై నిద్రించిన నొప్పితగ్గును–వీపులో చల్లని అనుభూతి.

★ కాళ్ళు వాటంతటవే కదలుచుండుట.

★ మోకాళ్ళలోను, మడిమలలోను బలహీనత.

★ మోకాళ్ళ వంపులో హెర్పస్ చర్మవ్యాధి.

★ కాలి వ్రేళ్ళ మధ్య పగుళ్ళు.

★ కాళ్ళు, పాదములు తరచుగా చీలమండల కీళ్ళ బలహీనత వల్ల తిమ్మిరిగ ఉండుట.

★ చేతుల చర్మం ముఖ్యంగా గోళ్ళ వద్ద పొడిగాను, పగిలినట్లు ఉండును.

★ అరచేతులందు సురుగుడుకాయలు (warts).

★ వ్రేళ్ళ మధ్య నీటి బొబ్బలు లేచుట.

★ గోళ్ళ వద్ద చర్మపు పైపొర లేచివాచుట (Hang nails) – గోళ్ళు పొడిగా, చీలి యుండుట.

★ తొడ వెనుక భాగపు సయాటిక్ నరమునకు సంబంధించిన కండర స్నాయువులు దగ్గరకు ముడుచుకొనిపోయి బాధాకరంగా ఉండుట.

★ కీళ్ళ నొప్పుల వ్యాధి (Gout) కాలనియమముగా వచ్చుట – నిద్రలో కాళ్ళను చివుక్కున లాగుకొనునట్లు చేయుట – దీర్ఘకాలపు కీళ్ళ వాతము – కీళ్ళు పగిలినట్లు శబ్దమగుట – కీళ్ళ వద్ద నుండు పొర (సైనోవియా) వాచుట – కీళ్ళ వద్ద దురద, వేడి, గుల్లలతో కూడిన తట్టు/దద్దుర్లు – నడచునపుడు కీళ్ళ యందు శబ్దం.

★ బిర్రబిగియుట, కీళ్ళ వాపు, చీలమండ బలహీనముగా నుండుట, లేచినపుడు వీపు మధ్య భాగమున నొప్పి.

★ తుంటియందు నొప్పి – తుంటి కీలు నొప్పి.

**19. నాడీ వ్యవస్థ :**

★ పక్షవాతం – నడుములో పక్షవాతపు నొప్పి; మొండెం, కాళ్ళు–చేతుల కండరాల పక్షవాతపు బలహీనత.

★ వెన్నెముకలో క్షోభ – తాకినా, ఒత్తినా వెన్నెముక నొప్పి పెరుగుట.

★ కండరాల అస్తిమితం, అదరుట – కండరాల బలహీనత, బిగిసడలుట వల్ల అలసట, ఎలాంటి పనిచేయుటకు ఇష్టం లేకుండుట.

★ నరాలనొప్పి ముఖ్యంగా కనురెప్పల వద్ద, కనుగ్రుడ్ల క్రింద కొన్ని సమయాల్లో మాటిమాటికి వచ్చును. అప్పుడు లాలాజలం/కన్నీరు స్రవించును.

★ నాడీపేశం (Nerve Fibre) : దీనిపై నీటి పొక్కులు – దీని పొడుగునా పొడుచునట్టి నొప్పి.
★ కొరియా (కండరములు అప్రయత్నముగా అదరుట).
★ హిస్టీరియా (పొర్లుతోనున్న స్పృహ) బలహీనత, ఈడ్పులు – ఉదయాన ఎక్కువ.
★ తేలికగా జలుబు చేయుట.
★ ఎక్కిళ్ళు (MP).
★ మూర్ఛ – నోటివద్ద నురుగుతో.

**20. నిద్ర :**

★ నిద్ర చాలా ఆలస్యముగా పట్టి చాలా అస్తిమితంగా ఉండును.
★ నిద్రలో తరచు ఉలికిపడుచుండుట.
★ **నిద్రలేమి :** అసాధారణ ఉత్సాహం వల్ల నిద్రపట్టకపోవుట.
★ ఎప్పుడూ నిద్రించవలయుననెడి కోరిక ఎక్కువగనుండుట – అధిక నిద్ర (మెదడులో అధిక తేమ చేరుటవల్ల).
★ సహజముగ పరుండునట్టి నిద్ర వలన అలసట తీరదు. లేచిన తర్వాత ఉదయాన అలసట కలుగును.

**కలలు :** ఇంట్లో దొంగలు పడ్డారని కలలు వచ్చుట.

**21. జ్వరం :**

★ ఇది చలి జ్వరాలకు మంచి మందు.
★ వెన్నెముక, జీర్ణకోశం, చేతులు, పాదాలు మొ॥ శరీర భాగాలన్నీ చల్లగానుండుట – ఒకే సమయమున చలి, దాహం రెండూ ఉండుట.
★ స్కార్‌లెట్ జ్వరం : కండరములు అదరుట/నీటి వంటి ద్రవం వాంతియగుట, రాత్రిపూట చెమట విస్తారముగ పట్టుట.
★ కీళ్ళవాత జ్వరం : దీనికి ఈ మందు ద్వితీయ ఔషధముగా ఉపయోగకారి.
★ హే జ్వరం (ప్రతిరోజు కొంతసేపు జలుబుగ నుండి తుమ్ములు వచ్చుచుండును) : దీనిలో కళ్ళు, ముక్కు నుండి నీటి వంటి స్రావం వచ్చును.
★ టైఫస్ జ్వరం : మగత, నిద్రమత్తు అధికం.
★ విడుపు చలి జ్వరం : ఈ వ్యాధికి అల్లోపతిలో క్వైనా ఇచ్చెదరు. అది వాడినా ఈ జ్వరం తగ్గనిచో నేట్రంమూర్ బాగా పనిచేయును. తేమ ప్రదేశంలోను, క్రొత్తగా సేద్యం చేయబడిన ప్రదేశాలలో నివసించు వారికి ఈ చలిజ్వరం వచ్చును. రోగికి చలి దాదాపుగా ఉదయం 10 గం॥ వరకు ఉండును. చలి రాక ముందు దురద

తీవ్రముగా ఉండును. వేడి పెరిగినచో తలనొప్పి, దాహం కలుగును. చెమట పుల్లగానుండును. అధిక నీరసం కలుగును. రోగి ఎండిపోయినట్లుండును. పాలిపోయిన ముఖం. తలనొప్పి ధనారింపుగ (Throbbing) ఉండును. పెదవులపై జ్వరమునకు సంబంధించిన బొబ్బలు.

★ టైఫాయిడ్ (సన్నిపాత జ్వరం) : అదరుట, నిద్రమత్తు, నీటిలాంటి పదార్థాన్ని వాంతి చేసుకొనుట.

★ అదరుట, నిద్రమత్తు, నీటిలాంటి పదార్థాన్ని వాంతిచేసుకొనుట లక్షణాలు గల ఏ అపాయకరమైన జ్వరమైనా ఈ మందువల్ల తగ్గును.

**22. చర్మం :**

★ స్వేదగ్రంథులు అధికంగా ఉండే నూనె ఉండే ప్రదేశాలు/వెంట్రుకలు పొడిగా ఉండి రాలిపోవు చోట్లలో నీటి బొబ్బలు / చిన్న పక్కులు లేచుట.

★ దురదతో స్వల్పకాలముండు చర్మవ్యాధి.

★ దీర్ఘకాలపు చర్మవ్యాధి.

★ సున్నితమైన పొలుసులు/నీటి పొక్కులు గల గజ్జి – ఉప్పును ఎక్కువగా తినుటవల్ల వచ్చు గజ్జి.

★ వ్యాధి మధ్యలో లేచు హెర్పస్ సంబంధమైన పక్కులు.

★ నీటి పక్కులు, పక్కులు, బొబ్బలు, పెద్ద బొబ్బలు (Blebs).

★ మోకాలు, మోచేతి వంపు నందు ఏర్పడు పక్కులు.

★ రంగులేని నీటిపక్కులు పల్చని పక్కు కట్టును లేదా పక్కులు రాలిపోయి వెంటనే మరలా ఏర్పడును.

★ చిన్నపిల్లలలో చర్మం పుండుపడి ద్రవంతో కూడియుండును.

★ అరచేతులలో పులిపిరికాయలు (warts).

★ తలపైనున్న చర్మంపై తెల్లని పక్కులు.

★ తొడలు – వృషణముల తిత్తికి మధ్యనున్న చర్మం రాపిడిచే ఎర్రబడి మంటగానుండుట, చర్మం ఒరియుట.

★ చీము లేనట్టి చర్మవ్యాధి.

★ క్రిమికీటకాలు కుట్టుట/కాటు వేయుట.

★ తీవ్రమగు దురద, మంటతోనుండు దద్దుర్లు (Nettle Rash) ఎక్కువగా ఉండుట – ఇవి శారీరక శ్రమ తర్వాత వచ్చును.

★ కనుబొమలపైన, చెవులవెనుక, తలపై నున్న చర్మపు అంచులవద్ద, నుదురు, మెడ వెనుక భాగం, కీళ్ళ వంపులందు కలుగు గజ్జి.

★ తామర (Herpes circinatus)కు రెండవ మందు.

★ విసర్పి (Shingles) : నరముల పొడుగునా నీటిపక్కులు గుంపులుగా లేచి తీవ్రమగు వాపుతో బాధాకరముగ నుండుట.

★ సవాయి (Syphilis) పుండ్లు – ఇవి దుర్వాసనతో నుండును.

★ సెగ (Sycosis) సంబంధ చర్మవ్యాధి – ద్రవంతో కూడియుండును. గడ్డం వెంట్రుకలు రాలును – చుండ్రు ఉండును.

★ రక్తం కారుచుండు క్యాన్సర్/కంతులు (Fungus haematodes).

★ గోళ్ళ వద్ద చర్మం సన్నగ పొప్పర ఊడుట.

**23. ధాతువులు :**

★ ఉబ్బుట – స్త్రీల స్తనాగ్రమున ఉండు చూచుకపు (Tip of the female breast) ధాతువులలో సీరం చేరుట – ధాతువులు ఉబ్బుట.

★ సీరం/నీరు చెమర్చుట.

★ రక్తహీనత, ఐరన్ లోపం వలన కలుగు రక్తహీనత – దీనికి ఈ మందు ప్రధానమైనది. దీనిని కాల్కేరియాఫాస్‌తో ఇవ్వవలెను – ఉప్పు దుర్వినియోగంవల్ల కలుగు రక్తహీనత.

★ చక్కెర వ్యాధి – కన్నుగ్రుడ్డు వికృతముగా బయటకు పొడుచుకొని ఉండుట (Grave's Disease) – మూత్రపిండాల శోథము (Bright's Disease), గుండ్రముగా నుండు క్రిములు – ఎండిపోవుట, పాలిపోవుట : చర్మం మురికిగా, బిగి లేకుండా, తిమ్మిరిపట్టి యుండుట – రక్తమందు ప్లాస్మా, రక్తకణాలు ఒక నిష్పత్తిలో ఉండును. కాని రక్తకణాలు ఆ నిష్పత్తి కన్నా ఎక్కువగా ఉండుట – (ఈ స్థితి గర్భిణీలలో అధికముగ ఉండును) –అధిక నీరసంతో ఉండుట – థైరాయిడ్ గ్రంథి పెద్దదగుటచే కన్నులు ముందుకు తోసుకువచ్చుట (Basedow's Disease) – మూత్రపిండముల ఊర్ధ్వభాగమందలి గ్రంథులు వ్యాధి గ్రస్తమగుటచే శరీరం, జిగటపొరలు కంచు రంగులోనికి మారుట, రక్తపు పోటు తగ్గుట, నీరసం మొదలైన లక్షణాలు కలుగు వ్యాధి (Addison's Disease) - జిగట పొరలు పొడిగానగుట, ఒరియుట – బాగా ఉన్నా శుష్కించుట, ముఖ్యంగా మెడ శుష్కించుట – మలేరియా జ్వరం (Ague), క్వినైన్ వాడకంవల్ల ఎండిపోవుట – లింఫ్ గ్రంథులు, క్రొవ్వు గ్రంథులు దీర్ఘకాలంగా వాచియుండుట – చిన్న కీళ్ళు ముఖ్యముగ కాలిబొటనవ్రేళ్ళ కీళ్ళు వాచి నొప్పిగా ఉండుట (Gout) మొదలైన వ్యాధులకు ఇది చక్కని మందు.

★ ఇది మృదులాస్థి ఉపాస్థి పైన, జిగటపొరల ద్రవపుతిత్తులపైన, వాటి గ్రంథులపైన, లాలాజల గ్రంథులపైన, చిన్న ప్రేగులకు అంటియుండు పెరిటోనియం పొరకు సంబంధించిన గ్రంథులపైన బాగా పనిచేయును.

- ★ చెమర్చిన ద్రవములు, స్రావములు అన్నియూ ఉడకబెట్టిన పిండివలె పారదర్శకం గాను, బంకగాను ఉన్నప్పుడు దీనిని వాడాలి.
- ★ కొన్ని సందర్భాలలో దేహంలోని అవయవాలకు / కణజాలమునకు / జిగురుపొరకు అస్వస్థత వల్ల క్షతం కలుగును. అట్టి క్షతం గోర్లకు కలిగి వాటి రూపం వికృతమైన ఈ మందును వాడవలెను.
- ★ కొందరి తలపై నున్న చర్మంపై చీము పొక్కులు/పొలుసులు ఏర్పడును. దానివల్ల తలపై నుండు వెంట్రుకలు రాలుట జరుగును. ఈ లక్షణంతోపాటు జీర్ణాశయపు/మూత్ర సంబంధమైన వ్యాధి, శుష్కించుట, బలహీనత, తలనొప్పి, మానసిక గందరగోళం మొదలైన లక్షణాలు ఉన్నచో ఇది బాగా పనిచేయును.

## 10. నేట్రంఫాస్ / నేట్రం ఫాస్ఫారికమ్
## Natrum Phos / Natrum Phosphoricum

**పర్యాయ పదాలు :** సోడియం ఫాస్ఫేటు, నేట్రి ఫాస్ఫాస్.

**వాడుక పేరు :** ఫాస్ఫేట్ ఆఫ్ సోడా.

**ఈ లవణము శరీరములో ఉండు చోటు :** ఈ లవణం రక్తములో 1000 భాగములకు 0.3 మొదలు 0.5 భాగముల వరకు ఉండును. ఇది అణు రూపములో కండరములందు, నరములందు, మెదడు కణము లందు, కణముల మధ్య నుండు ద్రవములందు ఉండును.

**ఈ లవణము లోపించిన కలుగు వ్యాధుల లక్షణాలు :** ఎక్కువ ఆమ్లత్వం/మంట, నాలుక మీద పసుపు పచ్చని క్రీమువంటి పూత, పుల్లని త్రేపులు, ఆకుపచ్చని విరేచనం, నొప్పులు, ఈడ్పులు/కంపములు, జ్వరం, పులుపు వాసన గల చెమట మొ॥వి.

**ఈ లవణము ప్రాధాన్యత :** శిశువుల పోషణలో పాలు, పంచదార అధికమైన వారి రక్తంలో లాక్టిక్ యాసిడ్ అధికమగును. దీనివల్ల కలిగే వ్యాధులకు, ఆమ్లత్వం/మంట గల రోగులకు ఇది మంచి మందు. ఇది ఎముకలు, గ్రంథులు, ఊపిరితిత్తులు, పొత్తికడుపు మీద పనిచేయును. శోషరస గ్రంథుల వ్యాధులకు,

**ఉద్రేకములు :** పాలు, క్రొవ్వు పదార్థాలు, బహిష్టు, రతి తర్వాత, తుఫాను, ఆరుబయటి గాలి, మధ్యాహ్నం, సాయంకాలం, మెట్లు ఎక్కునపుడు.

**ఉపశమనములు :** కొంచెం ఆహారం తినుట, చెమట పట్టుట, బీరు, చల్లని పానీయాలు సేవించుట.

**లభించు పొటెన్సీలు :** 3× నుండి 30× వరకు.

**ఏ పొటెన్సీ ఏ వ్యాధికి మంచిది :**

1. దీర్ఘవ్యాధులకు 30 పొటెన్సీ మంచిది (డా॥ మోర్గన్).
2. క్రిమి బాధలకు 4× ఇంజక్షన్ రూపంలో మంచిది **(డా॥ క్వీస్సె).**

**మందు పనిచేయుకాలం :** సరిగా తెలియదు.

క్షయకు ఇది మంచి మందు.

ఇది పైత్యరసతిత్తిలో రాళ్ళు ఏర్పడకుండా కాపాడును. కామెర్ల వ్యాధి నివారణకు తోడ్పడును. గనోరియాను అణచుట వలన వచ్చు కీళ్ళ వ్యాధులకు పనిచేయును.

నేట్రంఫాస్ చిన్న మోతాదును చర్మం క్రింద వేసిన (Subcutaneously) మార్ఫిన్[1]కు విరుగుడు (anti-dote) గా పనిచేసి దానిని సేవించు అలవాటును మాన్పును.

**మయాజమ్ :** ట్యూబర్క్యులర్.

**మానసిక స్వభావం :**

పైత్యస్వభావం, నిరుత్సాహం.

**ఉష్ణసహనం :**

చలిని సహించలేదు.

## మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు :**

★ ఏదో జరుగుతుందనే ఆందోళన, భయం.

★ నిరుత్సాహం, ఆశ లేకపోవుట.

★ మరచిపోవు స్వభావం.

★ రాత్రిపూట మేల్కొని కుర్చీల వంటి ఫర్నీచర్ వస్తువులను మనుష్యులుగా భావించుట – మరొక రూములో అడుగుల చప్పుడు వినుట.

★ నాడీ మండల ఉద్రిక్తత – తేలికగా కోపం చెందుట – ప్రతి చిన్న విషయానికి విసుగు చెందుట – అధిక మానసిక నిస్త్రాణ.

**2. తల :**

**తలనొప్పి –**

1. ఉదయం మేల్కొన్న తర్వాత తలనొప్పి – నాలుక పసుపుపచ్చగాను, తడిగాను వుండుట – అంగుడు వెనుక భాగమందు మీగడవలె కనిపించుట.
2. తల యందు తీవ్రమైన నొప్పి – కపాలం నిండుగా ఉన్నట్లనిపించుట.
3. నుదుటిలో/తల వెనుక భాగమున నొప్పి – వమన వికారం/జిగురు వంటి వాంతి.
4. తలపై భాగమున అధిక ఒత్తిడి, వేడిమి – తల బ్రద్ధలగునేమోనని అనిపించుట.
5. అస్వస్థత కలిగించు తలనొప్పులు – పుల్లని నురుగు నోటిలోనికి వచ్చుట.
6. తలదిమ్ము (Giddiness), తల తిరుగుట, జీర్ణకోశపు అస్వస్థత.

1. *మార్ఫిన్ (Morphine) : నల్లమందులోని ముఖ్య పదార్థం.*

**3. కళ్ళు :**

★ కళ్ళనొప్పి.

★ చూపు మసకగా ఉండుట – కళ్ళ మీద ఏదో పలచని గుడ్డ వున్నట్లు అనిపించుట.

★ **కళ్ళ కలక :** పసుపుపచ్చని, మీగడ వంటి పదార్థం స్రవించుట – ఉదయాన రెండు కనురెప్పలు అతుక్కొనిపోవుట.

★ **నూకల వంటి కళ్ళ కలక :** నూకలు చిన్న బొబ్బల వలె కనిపించును.

★ **మెల్ల :** ఇది పురుగుల వల్ల ప్రేగులకు క్షోభ కలుగుటచే వచ్చును.

★ కంటిలోని కార్నియాకు, నల్లగ్రుడ్డుకు మధ్య భాగాన చీముకారుట (Hypopon).

★ కన్నీరు మండుచుండుట.

★ కళ్ళ ముందు నిప్పు నెరసులవలె అగపడుట.

★ స్క్రాఫ్యులా తత్త్వము (శోషరస గ్రంథులు పెద్దవై శిథిలమగు తత్త్వం) కలవారిలో కంటి యందలి ఆమత్వక్కు/జిగురుపొర వాచుట.

**4. చెవులు :**

★ చెవులు పుండు పడినట్లుండుట – బయటివైపున మండుతూ, దురదతో ఉండుట.

★ ఒక చెవి ఎర్రగా, వేడిగా, తరచుగా దురదతో ఉండుట (FP).

★ చెవులందు హోరు.

**5. ముక్కు :**

★ జీర్ణాశయంలో క్రిములుండుటవల్ల దానిలో ఆమ్లం అధికముగా తయారగును. కనుక ముక్కును గిల్లుకొనును.

★ ముక్కు రంధ్రాలలో ముల్లు గ్రుచ్చుకొనినట్లుండుట.

★ ముక్కు నుండి దుర్వాసన.

★ ముక్కు దురద.

★ ముక్కు మొదటి భాగం బిగుతుగ నుండుట.

★ **జలుబు :** చిక్కని, పసుపుపచ్చని చీము వంటి స్రావం వెలువడుట.

**6. ముఖం :**

★ ముఖం పాలిపోయి నీలముగ, రక్తం చిందుతున్నట్లు ఉండుట.

★ ఎర్రని మచ్చలు గల ముఖం – జ్వరం మాత్రం ఉండదు.

★ ముక్కు, నోరు తెల్లగా వుండుట.

★ ముఖమునకు సంబంధించిన నాడీ నొప్పి పొడుచుచున్నట్లు, సూదితో కుట్టుచున్నట్లు ఉండును.

★ కుడి క్రింది దవుడ పుండుగా నుండును.

**7. నోరు :**

★ నోటిలో ఆమ్లపు/రాగి రుచి.

★ నోటి యందు పుల్లని రుచి, పెదవుల మీద చిన్నపుండ్లు (KM, KP).

★ అంగటి వెనుక భాగమున పసుపుపచ్చని మీగడ వంటి పూత.

**8. నాలుక :**

★ నాలుక వెనుక భాగమున తడిగాను, మీగడగాను లేక బంగారు పసుపుపచ్చ వర్ణములో నుండు పూత (ఈ లక్షణం ఈ మందుకు చాలా ముఖ్య లక్షణం).

★ నాలుక కొనపై బొబ్బలు/వెంట్రుక ఉన్నట్లు అనిపించుట – సాయంత్రం కుట్టుచున్నట్లుండుట.

★ మాట కష్టముతో వెలువడుట.

**9. దంతములు :**

★ నిద్రలో పిల్లలు దంతములు కొరుకుట.

★ దంతములు పుచ్చిపోవుట/వదలుగా వుండుట.

**10. గొంతు :**

★ అంగటి వెనుక భాగమందు, టాన్సిల్స్ పైన, కొండ నాలుకపైన తేమగా ఉండుట – మీగడ వలె బంగారు పసుపు రంగు పూత ఉండుట – ఈ లక్షణముతో గొంతులోని ఏ భాగమైనా వాచినను, జీర్ణాశయంలో ఆమ్లాధిక్యత ఉన్నను ఈ మందు ఇవ్వవలెను.

★ గొంతులో ఏదో ముద్ద/గుండు వున్నట్లు అనిపించుట (ద్రవములను మ్రింగునప్పుడు ఈ భావం అధికమగుట).

★ ముక్కు రంధ్రముల వెనుక భాగం నుండి చిక్కని, పచ్చని శ్లేష్మం వచ్చుట – ఇది రాత్రిపూట అధికమగుట.

★ అంగటి వెనుక భాగము పైన గల ఫారింగ్స్ జలుబు.

★ గొంతులో వాపు ఉండి మ్రింగుట కష్టమగుట.

**11. జీర్ణాశయం :**

★ ఆమ్లాధిక్యత – లాక్టిక్ యాసిడ్ ఎక్కువగుటచే పుల్లని త్రేపులు.

★ అపానవాయువు వెలువడుట.

★ ఆకలి నశించుట – అజీర్ణం – నోటిలో పుల్లని రుచి.

★ జీర్ణాశయపు పైపొర గీకివేయబడినట్లయి వాచుట.

★ అన్నం తిన్న తర్వాత/అన్నం తిన్న రెండు గంటలకు నొప్పి వచ్చుట.

★ పుల్లని పదార్థములు/కాఫీ విత్తనముల వంటి నల్లని పదార్థాలు వాంతి చేసుకొనుట.

★ జీర్ణకోశం నుండి నీటి వంటి పుల్లని ద్రవం నోటిలోనికి వచ్చుచుండుట (water brash).

★ వేవిళ్ళ వలన ఉదయం పుల్లని ద్రవాలు వాంతి అగుట.

★ **పిల్లలలో శూల :** ఆమ్లాధిక్యత – ఆకుపచ్చని, పుల్లని వాసన గల విరేచనాలు – పైత్యరసం తక్కువగుటచే క్రొవ్వు పదార్థాలు సరిగా జీర్ణం కాకపోవుట – గడ్డ కట్టిన పాలు/పెరుగు వంటి పదార్థం వాంతి చేసుకొనుట – కడుపులోను, ఛాతీలోను మంట – నిద్ర సరిగా రాకపోవుట.

**12. పొత్తికడుపు – మలం :**

★ యువకులలో అలవాటు ప్రకారముగా నున్న మలబద్ధకం – దీనితోపాటు అప్పుడప్పుడు నీళ్ళ విరేచనాలు అగుట.

★ మొండిగా నున్న మలబద్ధకం – మలవిసర్జనకు గట్టిగా ముక్కవలసి వచ్చుట.

★ ఆమ్లాధిక్యత వల్ల గుదము వద్ద దురద – గుదము పుండుగా, పచ్చిగా నుండుట – రాత్రిపూట పరుపు వెచ్చగానుండుటవల్ల దురద ఎక్కువగానున్నచో ఈ మందును ఇంజెక్షను రూపంలో ఇవ్వవచ్చు.

★ ఆమ్లాధిక్యతవల్ల కలిగే నీళ్ళ విరేచనాలు – విరేచనాలు పుల్లని వాసనతో నుండుట – అప్పుడు విరేచనం ఆకుపచ్చగా, జెల్లీ (కలబంద జిగురు) వంటి నురుగుతో నుండును. మలం పాలు విరిగిన పదార్థం వలె నుండును. అది స్వల్పంగా, తరచుగా అగును. మలవిసర్జనకు తినకవలసి రావచ్చు.

★ మలమును అకస్మాత్తుగా విసర్జించవలసి వచ్చుట – మలవిసర్జనను ఆపుచేయుట కష్టమగుట.

★ పైత్యరసం తక్కువగుటచే కామెర్లు.

★ అపానవాయువుతో కూడిన శూల.

★ కుడివైపు గజ్జ (groin) వద్ద దురద.

★ భోజనానంతరం ఉదరభాగం ఉబ్బి, నొప్పిగా ఉండుట.

★ ఈ మందు పైత్యరస తిత్తిలో రాళ్ళు ఏర్పడకుండా కాపాడును.

**13. మూత్రావయవములు :**

★ కాలేయ దోషముచే ఏర్పడు మధుమూత్రవ్యాధి (Hepatic form of diabetes) : ఎప్పుడూ మూత్రవిసర్జన చేయాలనే వాంఛ ఉండును. ప్రవాహం ఆగి–ఆగి వచ్చును. మూత్రవిసర్జనకు ముక్కవలయును.

★ కీళ్ళ వాతంవల్ల మూత్రం ముదురు ఎరుపుగా ఉండుట (FP).

★ మూత్రాశయమునకు శక్తి లేకపోవుట – తరచుగా మూత్రవిసర్జన చేయవలసివచ్చుట.

★ ఆమ్లాధిక్యత వల్ల పిల్లలు మూత్రమును ఆపుకోలేకపోవుట.

★ ప్రేగులలో క్రిములుండు వారికి రాత్రిపూట మూత్రం అప్రయత్నంగా పోవుట.
★ మూత్రంలో ఆల్బుమిన్ పోవుట.

**14. పురుష జననేంద్రియాలు :**

★ కలలు రాకపోయినా శుక్రం స్కలనమగుట – శుక్రం పలచగాను, నీళ్ళవలె ఉండుట – స్కలనానంతరం నీరసం, వణకు.
★ సంభోగ వాంచ తగ్గుట.
★ ఉద్రేకం వచ్చినపుడు జననేంద్రియం/శిశ్నం నిక్కపొడుచుకొనుట (erection) - దీనివల్ల సంభోగేచ్ఛ పెరుగుట.
★ వృషణములందు, శుక్రనాళములందు (Spermatic cords) లాగినట్లు నొప్పి (Drawing pain).
★ గనేరియా ప్రథమ దశకు, ఈ వ్యాధిని అణచుట వలన వచ్చు కీళ్ళ వ్యాధులకు ఈ మందు బాగా పనిచేయును.

**15. స్త్రీ జననేంద్రియాలు :**

★ **బహిష్టు :** బహిష్టుకు ముందు నిద్రలేమితో కూడిన ఉత్తేజం. బహిష్టు చాలా ముందుగా వచ్చును – రోగి పాలిపోయినట్లుండును – మధ్యాహ్న సమయాన కళ్ళపైన తలనొప్పి – బహిష్టు తర్వాత తలనొప్పి అధికమగును – మోకాళ్ళ దూరం పొట్టిదైనట్లు అనిపించును – గర్భకోశ ప్రాంతమందు బలహీనత, విచారం – విరేచనం తర్వాత గర్భకోశం దిగజారినట్లుండును. కీళ్ళవాత నొప్పులతో కూడా అట్లు జరుగును. యోని నుండి ఆమ్ల సంబంధమైన స్రావములు స్రవించును – వీటివలన ఒరుపు, దురద కలుగును – వంధ్యత్వం ఏర్పడును.
★ **కుసుమ :** కుసుమ స్రావం జున్ను లాగా/ తేనె రంగులో/ఆమ్లం, నీరు కలిసిన రంగులో ఉండును. గర్భకోశం నుండి వచ్చు స్రావం పుల్లని వాసనతో ఉండును.
★ **గర్భిణి :** వేవిళ్ళు – పుల్లని ద్రవం వాంతి అగును.

**16. శ్వాసావయవములు :**

★ ఆమ్లాధిక్యత, జలుబుకు సంబంధించిన ఇబ్బందులు ఉన్నప్పుడు ఈ మందును మధ్య మధ్య వాడవచ్చు.
★ నీరు త్రాగిన తర్వాత దగ్గు వచ్చుట.
★ బహిష్టు సమయాన నిట్టూర్చు నట్టి, వంశపరంపరగా క్షయతో బాధపడుతున్న యువతులకు ఈ మందును వాడవచ్చు. క్షయవల్ల ప్రక్కటెముకల మధ్యనుండు కండరాలు, రొమ్మెముక క్రింది భాగం పుండువలె నుండును.
★ **ఛాతీ నొప్పులు :** అదముట/ఒత్తుట వల్లను, గాఢంగా శ్వాసను లోనికి పీల్చుకొనుట వల్లను ఇవి ఎక్కువగును.

**17. రక్తప్రసరణావయవములు :**

★ అజీర్ణం వల్ల గుండె ప్రాంతమున వణకు.

★ గుండె ఆరంభములో నొప్పులు – ఈ నొప్పుల వల్ల కాళ్ళు – చేతుల నొప్పి, కాలి బొటన వ్రేళ్ళ నొప్పి తగ్గును – శరీరపు వివిధ భాగాల వద్ద నాడి కొట్టుకొనుచున్నట్లు తెలియును. ధమనుల గుండా రక్తం ప్రవహిస్తున్న అనుభూతి కలుగును.

**18. నడుము :**

★ నడుము నందు నీరసం, నొప్పి ఉండును.

**19. మెడ :**

★ మెడ యందు ఆకస్మికముగ నొప్పి కలుగును – మెడలోని గ్రంథులు ముఖ్యంగా థైరాయిడ్ గ్రంథి వాచును (Goitre).

**20. వీపు, కాళ్ళు, చేతులు :**

★ వీపు, కాళ్ళు – చేతుల యందు బలహీనత/నీరసం – కాళ్ళు, చేతులందు పక్షవాతం వల్ల కలిగిన బలహీనత.

★ కాళ్ళు–చేతులు చల్లగా నుండుట.

★ నడచునపుడు కాళ్ళ మధ్య దూరం ఎక్కువగుట – దీనివల్ల నడక అస్వాభావికముగ ఉండును/నిలకడగా ఉండదు/స్వాధీనం లేక పట్టు తప్పును.

★ తొడల లోపల లాగినట్లుండుట.

★ తొడ వెనుక భాగమందలి కండరముల స్నాయువులు పుండువలె ఉండుట.

★ వ్రాయునపుడు చేతుల కండరాలు సంకోచించుటచే కలుగు నొప్పి, తిమ్మిర్లు – మణికట్టు నొప్పి.

★ భుజపు వెనుక భాగమున నుండు, సాచుటకు ఉపయోగపడే కండరాలు సంకోచించుట.

★ మోకాళ్ళ లోను, చీల మండలం లోను, మోకాలి ఎముకల లోను నొప్పి.

★ కీళ్ళల్లో పుండు పడినట్లు బాధ – వాటిలో శబ్దములు.

★ కీళ్ళ వాతముచే చేతివ్రేళ్ళ కీళ్ళ నొప్పి అకస్మాత్తుగ గుండెకు చేరుట.

**21. నాడీ వ్యవస్థ :**

★ ముఖపు కండరాలు అదరును.

★ మానసిక శ్రమవల్ల, అధిక సంభోగంవల్ల నరముల బలహీనత కలుగును–సంభోగపు శక్తి నశించును.

★ పక్షవాతం వచ్చినట్లు బరువుగా నుండుట – నిస్త్రాణ.

**22. నిద్ర**

★ క్రిముల కారణంగా నిద్ర అస్థిమితంగా ఉండుట – నిద్రమత్తుగా ఉండుట – కూర్చొన్నపుడు గాఢ నిద్రపోవుట – దురద వల్ల నిద్రలేకపోవుట – నిద్రలో పళ్ళు కొరుకుట – సులభంగా మేల్కొనుట.

★ **కలలు :** శృంగార సంబంధమైన కలలు.

**23. జ్వరం :**

★ విడిచి విడిచి వచ్చు జ్వరం.

★ ప్రతిరోజు మధ్యాహ్న సమయమున వేడిసెగలు ఎక్కువగా వుండి తలనొప్పి వచ్చుట.

★ ఆమ్లం, పుల్లని పదార్థాలను వాంతి చేసుకొనుట/పుల్లని వాసననిచ్చు చెమట.

★ పగటిపూట పాదములు మంచువలె చల్లగానుండుట, రాత్రిపూట మండుట.

**24. చర్మం :**

★ కామెర్లు – చర్మం పుసుపుపచ్చగా నుండును.

★ చర్మం రాపిడిచే ఒరియును.

★ శరీరమంతా మొటిమలు.

★ దేహమంతటా దురద – క్రిమికీటకములు కుట్టినట్లుండును – చీలమండ కీళ్ళ వద్ద ఎక్కువ దురద, గజ్జి వంటి దురద.

★ **గులాబి రంగు తట్టు** (Rash) : బంగారు పసుపు వర్ణములోనుండు పక్కులు.

★ స్రావములు పసుపుపచ్చగా తేనెవలె ఉండును. అవి చర్మం పుండు పడునట్లు చేయును.

★ **తడిగానుండు గజ్జి** (Wet Eczema) : దీనిలో ఆమ్ల లక్షణాలు కలిగిన స్రావం జున్ను వలె, తేనె రంగులో ఉండును.

★ **చిన్నపిల్లల చర్మవ్యాధి :** చిన్నపిల్లల ముఖం మీద, తలమీద చిక్కని చీముతో కూడిన పొక్కులు ఏర్పడును. అవి పగిలి తెల్లనిపక్కు గట్టును. అవి గుంపులుగా నుండును. అవి దురద కలిగించును.

**25. ధాతువులు :**

★ శోధసహిత స్రావం[1] పసుపుపచ్చగను, తేనె రంగులోను ఉండుట.

★ రక్తమందలి తెల్ల కణములు విపరీతముగ వృద్ధి చెందుట.

★ లింఫ్ గ్రంథులు గట్టిపడుటకు పూర్వం వాచుట.

★ పిల్లలు ఎండిపోవుట / శుష్కించుట.

★ కామెర్లు – దీనికి ఈ మందును 1× లో వాడాలి.

★ ఎముకల వ్యాధులలో లైమ్ ఫాస్ఫేట్‌ను జమచేయుటకు ఈ మందు ఉపయోగకారి.

★ క్షయ.

★ రక్తములో తెల్ల కణములు తాత్కాలికముగ అధికమగుట.

★ ఆమవాతపు కీళ్ళవాపు.

★ చెప్పుకోదగిన రక్తహీనత.

*1. **శోధసహితస్రావం :** నొప్పి, వేడి, మంట, వాపుగల తలముల నుండి మరియు గాయముల నుండి అధికప్రోటీన్ శాతం, కణముల శిథిల పదార్థంగల ద్రవం.*

# 11. నేట్రం సల్ఫ్ / నేట్రం సల్ఫ్యూరికమ్
## Natrum sulph / Natrum sulphuricum

**పర్యాయపదం :** సోడియం సల్ఫేటు.

**వాడుక పేర్లు :** గ్లాబరు (Glauber's) సాల్టు, సల్ఫేటు ఆఫ్ సోడా.

**ఈ లవణం దేహంలో ఉండుచోట్లు :** ఈ లవణం శరీరమందలి ధాతుకణములందు ఉండదు. కణ మధ్యస్థ ద్రవములందు మాత్రమే ఉండును.

**ఈ లవణం చేయుపని :** మనదేహంలోని నేట్రంఫాస్ లాక్టిక్‌యాసిడ్‌ను వియోగం నొందించును. అప్పుడు నీరు ఏర్పడును. ఆ నీరు దేహమునకు అవసరమైన దానికన్నా ఎక్కువగా ఉన్న ఊబ శరీరం వచ్చును. అప్పుడు దేహంలోని నేట్రంసల్ఫ్ అధికముగా నున్న / అవసరం లేని నీటిని బయటికి నెట్టును. దేహంలోని నేట్రంసల్ఫ్ తక్కువగానున్న నేట్రంసల్ఫ్ మందును వాడినచో అవసరం లేని నీటిని తొలగించును. అధిక నీటివల్ల కలిగే ఊబ శరీరం తగ్గను.

**నేట్రంమూర్‌కు, నేట్రంసల్ఫ్‌కు గల తేడా :** నేట్రంసల్ఫ్ పని నేట్రంమూరు పనికి వ్యతిరేకం. ఈ రెంటి ధర్మాలు భిన్నం. నేట్రంమూర్ ఆకర్షించే నీరు జీవకణాల వ్యవస్థకు వినియోగపడ్తుంది. కాని నేట్రం సల్ఫ్ ఆకర్షించే నీరు బయటికి గెంటివేయ బడును.

**ఈ లవణం ప్రాధాన్యత :** ఊబ శరీరం కలవారిని హైడ్రోజనాయిడ్ తత్త్వం కలవారని అంటారు. వారు నీటితో నిండియుంటారు. వారి రక్తం నీటివలె ఉంటుంది. వారు శక్తి లేకుండా ఉంటారు. వారికి తేమ వాతావరణం ఏ మాత్రం పడదు. అలాంటివారి అన్ని రోగాలకు ఈ మందు బాగా పనిచేయును.

**ఉద్రేకములు :**

తేమ, తేమ వాతావరణం, వానాకాలం, ఎడమవైపున పరుండుట, ఉదయం 4–6 గంటల మధ్య సంగీతం.

**ఉపశమనములు :**

పొడిగానుండు వెచ్చని వాతావరణం, ఆరుబయటి గాలి, కాళ్ళు ముడుచుకొనుట, ఒత్తిడి, రుద్దుట, కూర్చొన్నప్పుడు అపాన వాయువు వెలువడుట.

**లభించు పొటెన్సీలు :**

3× నుండి 1000× వరకు

**ఏ వ్యాధికి ఏ పొటెన్సీ ఉపయోగకారి :**

1. సీసముచే కలుగు శూలకు : 1×, 2× తరచుగ.
2. డా॥ హెర్రింగు, ఇతరులు 30, 200 పొటెన్సీలను వాడిరి.

**మందు పనిచేయుకాలం :**

30–40 రోజులు.

**మయాజమ్ :** సైకోసిస్.

**మానసిక స్వభావం :**

పైత్య సంబంధమైన – విచారముగనుండుట.

**ఉష్ణసహనం :**

చలిని సహించలేకపోవుట.

ఈ లవణం గొప్ప శరీరతత్త్వ సంబంధమైన మందు. ఇది మూత్రపిండం, మూత్రవాహక నాళం, పైత్యరసనాళం, పాంక్రియాస్, ప్రేగుల ఎపితీలియం[1] కణాలను ఉత్తేజపరుచును. వాటి నుండి వెలువడు స్రావములను క్రమబద్ధం చేయును. రక్తం, పైత్యరసం, క్లోమరసం – వీటి గాఢతను క్రమపరచును. కనుక ఇది రక్తంలో పెరిగిన చక్కెర, కీటోన్స్, ట్రైగ్లిసరైడ్స్, కొలెస్టరాల్ మొ॥ వాటిని తగ్గించుటకు ఉపయోగపడును.

ఈ లవణం ప్రమాదాలలో రక్తస్రావాన్ని ఆపుటకు ఉపయోగపడును. శ్లేష్మస్తరాలు ఉబ్బకుండా చేయును.

నియమిత కాలంలో రోగ లక్షణాలు అధికమగు సందర్భాలలో ఈ మందు బాగా పనిచేయును.

ఇది జీర్ణకోశ వ్యాధులు, గాల్‌తిత్తిలో రాళ్ళు, గనేరియా, ల్యూకేమియా, మలబద్ధకం, కలరా, న్యుమోనియా, ఉబ్బసం, గౌటు, ఉలిపిరికాయలు, చిన్నపిల్లల వాంతులు, విరేచనాలు, ఎపెండిసైటిస్, చలిజ్వరం, గజ్జి మొదలైన వ్యాధులకు ఉపయోగకారి.

## మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు :**

★ ఆత్మహత్య చేసుకోవాలనుకొనుట–మరలా బ్రతకాలని భావించుట–వికృతమైన చేష్టలు.

★ పైత్య రసాధిక్యతచే క్షోభ – రాత్రులందు నిద్రపట్టకపోవుట – చిరచిరలాడుట – మాట్లాడుటకు ఇష్టపడకపోవుట – మాట్లాడదలచిన వారితో కూడా మాట్లాడ దలచకపోవుట.

★ ఏడ్పు, పాటలు లక్షణాలను ఉద్రేకపరచును.

★ ఉదయాన బాధలు ఎక్కువగును.

★ ధైర్యం లేకపోవుట.

★ పడిపోవుట/తలకు ఏదైనా గాయం తగులుట వల్ల వచ్చు మానసిక బాధలు.

**2. తల :**

**తలనొప్పి –**

1. నడినెత్తి యందు ఉద్ధృతంగా, గుండెకొట్టుకొనుచున్నట్లు (pulsating) ఉండు తలనొప్పి – ఇది మంటగా, బాధగా, అధికంగా ఉండును.

***1.ఎపితీలియం కణాలు :*** *ఇవి చర్మమును, ఆమత్వక్కుల/జిగురుపొరల ఉపరిభాగమును కప్పియుంచు పొరకు సంబంధించినవి.*

2. జీర్ణాశయపు అస్వస్థత కలిగించు తలనొప్పి – పైత్యరసాధిక్యతచే కలుగు విరేచనములు/వాంతి – వాంతి వచ్చినపుడు చేదు రుచి, శూల ఉండును – నాలుకపై అపరిశుభ్రమైన పూత ఉండును.
3. తల వెనుక భాగమున ఉండు తలనొప్పి – ఇది ఉద్ధృతముగను, నొక్కినట్లు/ నములుకు తిన్నట్లు ఉండును.
4. తలత్రిప్పు ఉండే తలనొప్పి.

★ క్రిందపడుట, తలకు దెబ్బలు తగులుట వల్ల కలిగే మానసిక బాధలు – వీటికి ఇది మంచి మందు.

★ తలలో రక్తం అధికంగా కూడుట.

★ మెదడు అడుగు భాగమున తీవ్రమైన నొప్పి – ఈ నొప్పి కలప పరిశ్రమలో వాడు వైస్ (vice) యంత్రంలో అదిమి పట్టినపుడు కలుగు బాధ వలె ఉండును.

★ వంగినపుడు మెదడు వదులుగా నున్నట్టి భావన.

★ తలపై భాగమున మంట.

★ సంధి (Delirium), మూర్ఛకు ఇది మంచి మందు.

**తలపై చర్మం :**

★ ఇది చాలా బాధగా నుండును – తల వెంట్రుకలను దువ్వునపుడు నొప్పి.

**3. కళ్ళు :**

★ కంటి తెల్లగ్రుడ్డు పసుపు పచ్చగా నుండుట – పెద్ద బొబ్బలు, మండుతున్న కన్నీరు – కనురెప్పల అంచులు మండుచున్నట్లుండుట. దీర్ఘకాలం నుంచి ఉన్న కళ్ళ కలక – ఆకుపచ్చని చీము/ పుసుల వల్ల ఉదయానికి కనురెప్పలు అతుకుకొనుట – అవి బరువుగా ఉండుట – వాటిపై నూకల వంటివి ఏర్పడుట – వెలుగును సహించలేక పోవుట – ఉదయాన కనురెప్పలు అతుకుకొనుట, వెలుతురును భరించలేని స్థితి.

★ కంటిముందు భాగము (cornea)న రంగు మారిన మచ్చలు.

**4. చెవులు :**

★ చెవిపోటు – తడి వాతావరణంలో ఇది ఎక్కువగును – ఏదో వస్తువుపైకి వచ్చుచున్నట్లు అనిపించును.

★ చెవులలో గంటలు కొట్టుచున్నట్లు ధ్వనులు.

★ చెవులలో మెరుపు తీగవంటి నొప్పులు – చెవులు కుట్టినపుడు ఉండునట్టి నొప్పులు.

**5. ముక్కు :**

★ బహిష్టు సమయమున ముక్కు నుండి రక్తస్రావం.

★ సవాయి (Syphilis)చే ముక్కు ఎముకలు పుండుపడి దుర్వాసనగల స్రావం వెలువడుట – పొడి వాతావరణం నుండి తేమ గల వాతావరణమునకు మారినపుడల్లా ఇది ఎక్కువగును.

★ ముక్కు దిబ్బడ వేయుట.

★ ముక్కు ఎక్కువ ఎండినట్లుగను, మంటగను ఉండుట.

★ ముక్కు రెక్కల దురద.

★ ముక్కుకు సంబంధించిన జలుబు – ఉప్పు వంటి కళ్ళెను కాండ్రించుట – ఆ కళ్ళె కాంతికి/వెలుగులో ఆకుపచ్చగా అగుట.

**6. ముఖం :**

★ పైత్య రసాధిక్యంచే ముఖం పచ్చగా/కామెర్లవలె ఉండును.

★ గండస్థలము (కణత ఎముక, దౌడ ఎముక కలియుచోటు)న నొప్పి.

★ ముఖం మీద పొక్కులు, చిన్న చీముగల మొటిమలు.

**7. నోరు :**

★ నోటిలో మంట – చేదు రుచి.

★ చిక్కని, జిగురు వంటి, కదలని తెల్లని కళ్ళె – దీనిని జీర్ణకోశం, శ్వాసనాళం, ఆహారనాళం నుండి నిరంతరం కాండ్రించవలసివచ్చుట.

★ అంగుడు (palate) తాకుటకు పుండువలె నొప్పిగా ఉండుట – చల్లని పదార్థాలు తీసుకొనుట వల్ల ఉపశమనం.

★ చిగుళ్ళు మండుట – వాటిపై బొబ్బలు.

★ నోటిలోను, గడ్డము క్రింద ద్రవముతో కూడిన పొక్కులు.

**8. నాలుక :**

★ నాలుక మొదట్లో గోధుమ – ఆకుపచ్చ/బూడిద – ఆకుపచ్చ రంగులోనున్న అపరిశుభ్రమైన పూత (coating) ఎడమవైపున పడుకొన్న ఈ పూత ఎక్కువగును – ఈ లక్షణాలకు ఈ మందు బాగా ఉపయోగపడును.

★ నాలుక ఎర్రగా, జిగురుగా నుండుట – దానిపై మంటతోనున్న పొక్కులు.

**9. దంతములు :**

★ పళ్ళనొప్పి – పొగత్రాగుట, చల్లగాలి వల్ల తగ్గుట, నోటిలో చల్లని నీటిని ఉంచుకొన్నా ఉపశమనం.

★ చిగుళ్ళు మండుట – వాటిపై బొబ్బలు – వాటి నుండి చీము స్రవించుట – పుల్లని నీరు కూడుట – లాలాజలం స్రవించుట.

**10. గొంతు :**

★ డిఫ్తీరియా (గొంతుక, మెడ వాచును. టాన్సిల్స్, అంగుడు, కొండ నాలుక, ముక్కు రంధ్రములపై పొర ఏర్పడి ఊపిరాడదు)లో ఆకుపచ్చ వాంతి అగుచున్న కాలీమూర్, నేట్రంసల్ఫ్‌ను మార్చి-మార్చి ఇవ్వవలెను.

★ గొంతునొప్పి - మ్రింగునపుడు ఏదో ఉండ/ఆటంకం ఉన్నట్లు భావన కలుగుట.

★ గొంతు పొడిగా ఉండుట.

★ గొంతు పుండు పడి నొప్పిగా నుండుట.

★ ఫారింగ్స్ జలుబు - చిక్కని, వదలని, తెల్లని కళ్ళె విస్తారముగా నుండుట.

★ ఉదయాన ఉప్పుగా నుండు కళ్ళెను కాండ్రించుట.

**11. జీర్ణాశయం :**

★ ప్రతిరోజు సాయంకాలం దప్పిక.

★ కడుపు ఉబ్బరించి బరువుగా ఉండుట.

★ వాయుశూల : ఇది పెద్ద ప్రేగు చివరి భాగమందు అధికముగా ఉండును - పొట్ట ఖాళీగా నున్నప్పుడు (ఉదయమున టిఫెన్ తినుటకు ముందు) ఎక్కువ వాయుశూల.

★ కాలేయ ప్రాంతమున నొప్పి, కోయుచున్నట్లుండు నొప్పి.

★ కాలేయములో రక్తాధిక్యత - ఎడమవైపున పడుకొన్నపుడు ఇది మరింత అధికమగును - దీనివల్ల కోపం, విసుగుదల ఎక్కువగును. చల్లని పానీయాలను, పదార్థాలను ఇష్టపడుదురు.

★ నిరంతరం వమన వికారం - ఉప్పుగా/చేదుగా, పుల్లగా ఉండునట్టి పైత్యరసమును వాంతి చేసుకొనుట - తలత్రిప్పు, తలనొప్పి.

★ పైత్యరస సంబంధమగు శూల, నల్లని విరేచనాలు.

★ పిండి పదార్థాలను జీర్ణం చేసుకొనలేకపోవుట.

★ విసుగుచే కామెర్లు కలుగుట - ఆకుపచ్చని విరేచనాలు, శరీరపు రంగు, కనుగ్రుడ్లు ఆకుపచ్చగ నుండును.

★ పుల్లని పదార్థం నోటిలోనికి వచ్చుట.

★ కడుపులోను, ఛాతీ క్రింది భాగమందు మంట.

★ సీసమునకు సంబంధించిన శూలకు ఈ మందును తరచుగా 1×, 2×లో ఇవ్వాలి.

★ ఈ మందును నిత్యం వాడిన ప్రేగులందలి బద్దీక్రిములను వెళ్ళగొట్టును.

★ గాల్‌తిత్తి/పిత్తాశయం యందు రాళ్ళు.

**12. ఉదరకుహరం – మలం :**

★ ఉదరకుహరం వాయుపూరితమై కోయుచున్నట్లుండు నొప్పి – ఈ నొప్పి కుడివైపు గజ్జలో ప్రారంభమై ఉదరకుహరమంతా వ్యాప్తి చెందును.

★ బొడ్డు చుట్టూ చీల్చుచున్నట్టి నొప్పి (MP).

★ నడుము చుట్టూ బిగుతుగా నుండు దుస్తులను సహించలేకపోవుట.

★ ఉదరకుహరంలో గుడగుడమను శబ్దాలతో అకస్మాత్తుగా నొప్పి వచ్చి విరేచనమగుట – దుర్వాసనతో అపానవాయువు కష్టంగా వెలువడుట – దీనివల్లను, ఉదరభాగములో నొప్పి వలనను రాత్రి 2 గంటలకు నిద్ర లేపుట.

★ క్రింది ప్రేగులలో వేడిమి, ఆకుపచ్చని పైత్యరసపు స్రావములు.

★ నీళ్ళ విరేచనములు – విరేచనం నల్లగాను, పైత్యరసపూరితముగా/ఆకుపచ్చని పైత్యంతో ఉండుట.

★ వంశపరంపరగా నీళ్ళ విరేచనాలతో బాధపడుచున్న ముసలి స్త్రీల విరేచనాలు.

★ పెద్ద ప్రేగు యొక్క మొదటి భాగం వాచుట – వాతావరణంలో తేమ అధికంగా ఉండునట్టి ఉదయపు పూట నీళ్ళ (loose) విరేచనాలు.

★ కొన్ని సమయాల్లో అధిక అధ్యయనం/మానసిక శ్రమవల్ల కలుగు కాలేయపు క్షోభ (irritation).

★ తాకినా, కుదుపబడినా కాలేయం పుండుగా ఉండి నొప్పులు సూదితో కుట్టినట్లుండుట.

★ గుదము మీద, తొడల మధ్య పులిపిరి/సురుగుడు కాయలు (warts) / మాంసం గల ఎదుగుదల.

★ సైకోసిస్.

★ పెద్దప్రేగు మొదటి భాగం వాచుట.

**13. మూత్రావయవములు :**

★ డయాబెటిక్ రోగి/ చక్కెర వ్యాధిగ్రస్తునిలో మూత్రం అధికంగా ఉత్పత్తి అగును – అట్టి వానికి ఇది ప్రధానమైన మందు.

★ మూత్రం పైత్యరసముతో కూడియుండుట.

★ దీర్ఘకాలంగా ఉన్న మూత్రపిండాల వాపు, మూత్రనాళం నుండి పసుపుపచ్చ – ఆకుపచ్చ మూత్రం.

★ మూత్రం విసర్జించాలనే ప్రబలమైన ఆకాంక్ష – గజ్జలలో అతుకుకొనుట.

★ మూత్రాన్ని నిలుపుకొనదలచినపుడు మూత్రం మండుట.

★ మూత్రంలో చీము, నురుగు.
★ బొడ్డు వద్ద ఎక్కువ గ్రుచ్చినట్లు నొప్పి – వీపు నడుమ భాగాన నొప్పి.
★ కీళ్ళ వాతము (Gout) , మూత్రంలో రాళ్ళు, ఇసుక వంటివి అడుగుకు దిగుట – మూత్రం ఇటుకల పొడి వలె బాగా ఎరుపు, పసుపు–ఎరుపు, పసుపు–తెలుపు రంగులో ఉండుట.

**14. పురుష జననేంద్రియాలు :**

★ శిశ్నాగ్రముపై నుండు చర్మపు ముడతకు సంబంధించిన వాపు.
★ వృషణముల తిత్తికి నీరుపట్టును.
★ ప్రోస్టేటు గ్రంథి వాపు.
★ వృషణముల తిత్తి దురద – గోకుట వల్ల మంట పుట్టును.
★ సవాయి (Syphilis) సంబంధమైన కాయ/కంతి వలె ఉండు ఉబ్బెత్తుగ నుండు ఎదుగుదల (Condylomata), ఆకుపచ్చని స్రావం.
★ దీర్ఘకాలంగా అణచబడియున్న గనేరియావల్ల ఆసనం దగ్గర పుండ్లు ఏర్పడి వాటినుండి ఆకుపచ్చని స్రావం వెడలుట.
★ సిఫిలిస్ వ్యాధులవల్ల పులిపిర్లు వచ్చుట.

**15. స్త్రీ జననేంద్రియాలు :**

★ స్త్రీ జననేంద్రియం వాచి, ఉబ్బి, ద్రవపు పొక్కులతో నిండియుండును.
★ **బహిష్టు :** బహిష్టుకు ముందు ముక్కు నుండి రక్తస్రావం – బహిష్టు ఆలస్యం – మంటగా నుండు రక్తపు గడ్డలు – తొడలు ఒరుపుగా నుండుట – నడచునపుడు ఎక్కువగుట – శూల, మలబద్ధకం/ఉదయాన నీళ్ళ విరేచనాలు, చలి.
★ **కుసుమ/తెల్లబట్ట** (Leucorrhoea) : ఇది మంటగాను, ఒరుపు కలిగించునదిగాను ఉండును. ఇది ధాతువులను నాశనం చేయును. జననేంద్రియ భాగాలు వాచును – గనేరియా తర్వాత పసుపు – ఆకుపచ్చ కుసుమ.
★ **గర్భిణి :**
★ గర్భిణి నీటిని వాంతి చేసుకొనును – నోటిలో చేదు రుచి. స్త్రీ బాహ్య జననేంద్రియపు భాగములకు హెర్పస్[1] సంబంధ చర్మవ్యాధి.
★ **బాలింతరాలు :** స్తనములందు పాలను నిలుపుటకు ఇది మంచి మందు.
★ ప్రసవించిన తర్వాత సిరలలో థ్రాంబోసిస్ వలన కాలు లావెక్కి నొప్పి పుట్టుట.

*1. హెర్పస్ (Herpes) : తొలుత ద్రవపు పొక్కులు ఏర్పడును. అచ్చట పుండు పడును. ఆ భాగముపై పక్కుకట్టును. ఆ పక్కు క్రింద క్రొత్తగా ద్రవపు పొక్కులు ఏర్పడును. అచ్చట చర్మం వాచును.*

**16. శ్వాసావయవములు :**

★ బొంగురుతనం.

★ **దగ్గు :** చిక్కని, దారంవలె సాగునట్టి, ఆకుపచ్చని చీమువంటి స్రావంతోనున్న కళ్ళెను బయటికి నెట్టుటకు ఎక్కువగా దగ్గవలసియుండును. అందుకు కారణం ఛాతీ పుండువలె నుండుట. ఛాతీ ఎడమవైపున సూదితో గ్రుచ్చినట్టి నొప్పి యుండును. ఈ లక్షణం న్యుమోనియా వ్యాధిగ్రస్తులలో బాగా కనిపించును. దగ్గునప్పుడు లేచి కూర్చొని రెండు చేతులతో ఛాతీని పట్టుకొనుటవల్ల ఉపశమనం. ఉదయాన మేల్కొన్న తర్వాత ఎక్కువగా కాండ్రించవలసి వచ్చును.

★ తడివాతావరణం లోనికి మారినపుడల్లా దగ్గు/ఉబ్బసం ఉద్రేకించును.

★ తేమ వాతావరణంలో వచ్చు ఉబ్బసం (Humid asthma) : దీనిలో కళ్ళె గడగడ ధ్వని చేస్తూ వెలువడును.

★ తేమ వాతావరణంలో శ్లేష్మం చేరుటవల్ల శ్వాస కష్టంగానుండును లేదా గురకగా నుండును. నడచునపుడు హ్రస్వశ్వాస యుండును.

★ జలుబుతో కూడిన జ్వరం, శ్వాసనాళముల ఆమత్వక్కువాపు, వేకువజామున 4–6 గంటల మధ్య ఆయాసం – దగ్గు ఎక్కువగా నుండును.

**17. రక్తప్రసరణావయవములు :**

★ గుండెలో (ఛాతీ ఎడమప్రక్క) నొక్కుచున్నట్లుండును. చిరాకు, ఒత్తిడి, ఆందోళన ఉండును. గుండె వడిగా కొట్టుకొనును. చూపు మందగించును. చన్నుమొనల వద్ద దురద వుండును – ఉపశమనానికి ఆరుబయటికి వెళ్ళాలి.

**18. మెడ, వీపు, నడుము, కాళ్ళు–చేతులు :**

★ మెడ వెనుక భాగము లాగుడు నొప్పివల్ల బిర్రబిగిసి యుండును – ఈ నొప్పి తల వెనుక భాగం వరకు ఉండును. అప్పుడు నొప్పి గ్రుచ్చుకొన్నట్లు ఉండును. కదలిక ఉద్రేకం. మర్దన ఉపశమనం.

★ వెన్నెముక పైన – క్రింద, మెడలోను పుండువంటి నొప్పి.

★ వెన్నెముక చుట్టూ ఉండు మెనింజస్ అను పొరలు వాచుట – దీనికి ఇది మంచి మందు

★ వీపులో ఈడ్పులు ఉన్నచో ఈ మందు బాగా ఉపయోగపడును.

★ నడుము మధ్యభాగమున త్రికాస్థి (Sacrum)లో కముకు/చితక కొట్టినట్టి నొప్పి.

★ చంకకు సంబంధించిన గ్రంథులు వాచి చీము పట్టుట.

★ చేతులలో కీళ్ళవాతపు నొప్పులు (జీర్ణాశయపు లక్షణాలతో).

★ వ్రాయునపుడు చేతులలో వణకుడు, అలసట.

★ అరచేతులు పొడిగాను, మంటగాను ఉండుట.

★ ఎడమ తుంటిలో సూదితో కుట్టినట్లుండు నొప్పులు.

★ తుంటి దగ్గర నుండి మోకాలు వరకు నొప్పులు.

★ కండర కదలికలు అదుపులో లేక కలుగు నొప్పి (Locomotor ataxia)

★ కీళ్ళల్లో శబ్దములు–శరీరమంతా వణకుట–నిద్రలో కాళ్ళు–చేతులు తటాలున అదరుట.

★ పాదముల వాపుకు ఇది మంచి మందు.

★ అరికాళ్ళ మంట మోకాళ్ళ వరకు వ్యాపించును.

★ **గోరుచుట్టు (Paronychia) :** గోర్ల వ్రేళ్ళ చుట్టూ వాపు, చీము పట్టుట – గోర్ల క్రింద ముళ్ళు గ్రుచ్చుకొన్నట్టి నొప్పి.

★ వ్రేళ్ళ వాపు – అవి బిర్రబిగిసినట్లుండుట.

**19. నాడీ వ్యవస్థ :**

★ నిస్త్రాణ, అలసట, విసుగుదల (ముఖ్యంగా మోకాళ్ళ వద్ద).

★ శూలతో కలుగు నిస్త్రాణ.

★ దేహమంతా వణకు – నిద్రలో చేతులు, పాదములు వణకుట – వ్రాయునపుడు చేతులు వణకుట.

★ కాళ్ళను ఎప్పుడూ కదలించాలనే కోరిక.

★ సయాటికా నరము బాధ కూర్చొన్నప్పుడు/లేచునపుడు/పడకలో దొర్లినపుడు అధికమగును.

★ **కొరియా వ్యాధి[1] :** దీనిలో మలబద్ధకం ఎక్కువగా ఉండును. ఈ మందును (4–5 మాత్రలను) ఒక గ్లాసెడు నీటిలో వేసి పగటిపూట త్రాపాలి. 3–4 విరేచనములు అగువరకు ఈ మందును వాడిన కొరియాజబ్బు నయమగును.

**20. నిద్ర :**

★ నిద్రమత్తు పైత్యరస లక్షణాలతోవచ్చు కామెర్లకు పూర్వసంకేతం – ఈ లక్షణాలు మధ్యాహ్నామునకు ముందు, చదువునపుడు ఎక్కువగుట.

★ **కలలు :** బరువైన, ఆందోళనకరమైన, కొట్లాడుచున్నట్లు, క్రిందపడుతున్నట్లు, భయపెడుతున్నట్లు, ఎగిరిపోతున్నట్లు, అందమైన కలలు – గాఢముగా నిద్రపోయిన వెంటనే ఎక్కువ కలలు వచ్చుట – భయంతో ఉలిక్కిపడినట్లు లేచుట.

*1. **కొరియా వ్యాధి (Chorea) :** కండరములు అప్రయత్నముగ అదురుచుండు నాడీమండల వ్యాధి.*

★ ఉబ్బసం వల్ల రాత్రిపూట మేల్కొనుట.

★ పొట్ట వాయుపూరితమై ఉబ్బి నొప్పి చేయుట వల్ల మేల్కొనును.

**21. జ్వరం :**

★ ఇది మలేరియా జ్వరమునకు (Ague) ముఖ్య ఔషధం.

★ కొద్దిగా తగ్గి మరలా పెరుగునట్టి పైత్యరస సంబంధమగు జ్వరం తీవ్రరూపం దాల్చుట – దీనిలో ఆకుపచ్చ – పసుపుపచ్చ లేక గోధుమవర్ణపు/నల్లని వాంతి చేసుకొనును.

★ పైత్యరస సంబంధమైన జ్వరాలలో ఉదరకుహరం వాయుపూరితమై ఉబ్బును.

★ అంటువ్యాధి యగు పీతజ్వరం (yellow fever) తీవ్రరూపంలో ఉండుట.

★ **ఈ జ్వరముల సాధారణ లక్షణాలు :** లోపల చల్లదనం – సాయంకాలానికి ఇది మంచువలె అతి చల్లగా మారును – నడుము పై భాగాన వేడి/చెమట ఉండదు – పళ్ళు పటపట కొరుకు ధ్వని – ఆందోళన, నిద్రమత్తు – తలలోపల వేడిమి – పాలిపోయిన ముఖం – రోమ కూపముల వద్ద చర్మం ఉబ్బుట – ఆ తర్వాత చెమట – దప్పిక లేకుండుట – సాయంకాలం 4 గం॥కు శయ్యలో ఉపశమనం – తెల్లవారుజామున 4 గం॥కు చెమట – సాగదీయుట, ఆవులింత – ఉష్ణం ఉపశమనం కాదు – సాయంకాలానికి వేడిసెగలు – చెమట ఎక్కువ – ఆ తర్వాత పొడిగానున్న నోరు – ఏ దశలోను దప్పిక ఉండదు – కాలేయ మండలం పుండుగా నుండును. అపానవాయువు ఒక చోటు నుండి మరొక చోటునకు మారును – నీళ్ళ విరేచనాలు కలుగును.

**22. చర్మం :**

★ **పులిపిరికాయలు, ఉలిపిరికాయలు** (warts) **లేచు స్వభావం :**
కళ్ళ చుట్టూ, తలపైనున్న చర్మం మీద, ముఖం మీద, ఛాతీపైన, గుదం వద్ద ఇవి ఏర్పడును.

★ పిల్లల చర్మం ఒరియుట, అది రాపిడిచే వేడిగా నుండును. పైత్యరస లక్షణాలు ఉండును.

★ బహిష్టు సమయాన బొబ్బలతో కూడిన చర్మవ్యాధి (Pemphigus) – శరీరమంతటా నీటివంటి ద్రవముతో కూడిన బొబ్బలు.

★ తట్టు (Wheal) – పసుపుపచ్చని నీళ్ళ వంటి స్రావం.

★ తామర – చర్మంపై ద్రవముతో కూడిన పొక్కులు/బొబ్బలు పగిలిన పిమ్మట పచ్చని పక్కులు కట్టుట – దీనికిది సరైన మందు.

★ విసర్పి (Erysipelas) - చర్మం నున్నగా, ఎర్రగా ప్రకాశించుచుండును. ముళ్ళు గ్రుచ్చుకొనుచుండునట్టి నొప్పి, వాపు ఉండును.

★ తేమగ నుండు చర్మవ్యాధులు – పైత్యరస లక్షణాలతో.

★ చర్మం నీరుపట్టుట, వాపు.

★ కామెర్లచే చర్మం రంగు మారుట.

★ గుడ్డలు వదులునపుడు దురద – ఇది స్థానం మారును.

★ సైకోసిస్ సంబంధమగు ఎదుగుదల.

★ కొన్ని సంవత్సరములుగానున్న లోతైన రంధ్రములు గల పుండ్ల నుండి నీళ్ళగా నుండు చీము స్రవించును – పుండ్ల చుట్టూ వెడల్పాటి నీలిరంగు అంచు ఏర్పడును – అది చర్మం క్రింద తొలుచుచుండును.

★ ఎముకలలో కొరుకుకు తినుచున్నట్టి/చీల్చునట్టి నొప్పి.

**23. ధాతువులు :**

★ సిరల నీటి సామర్థ్యాన్ని నియంత్రించును.

★ విపరీతమైన వాపు, శోషం, నీరు పట్టు వ్యాధి.

★ మెత్తగ నుండు వాపు.

★ చొచ్చుకొనిపోవుట (Infiltration) -

★ సంధాయక ధాతువులలోనికి చొచ్చుకొనిపోవుటవల్ల కలుగు సాధారణ ఉబ్బు వ్యాధి.

★ స్రావములు పసుపుపచ్చగ, నీల్ళవలె ఉండును.

★ సైకోసిస్.

★ రక్తములో తెల్లకణములు విపరీతముగా వృద్ధి చెందు వ్యాధి.

★ తేమ ప్రదేశములు/తేమ వాతావరణం/నీరు, తడి, వాన, చిత్తడి నేలలు గిట్టని తత్త్వముగల శరీరం (Hydrogenoid constitution).

★ క్షయ.

★ రక్తములో విషక్రిములు చేరి మెదడు, మూత్రపిండములు, ఊపిరితిత్తులు, గుండె మొదలైన దూరముగా నుండు అవయవములలో ఒకేసారి చీముతోనుండు వ్రణములను కలిగించు వ్యాధి (Pyaemia).

★ సయాటికా నొప్పి.

# 12. సైలీషియా
## (Silicea)

**పర్యాయ పదములు :** సిలిక, సైలీషియా టెర.

**సరియైన పేరు :** సిలిసిక్ ఆక్సైడు.

**వాడుకపేర్లు :** క్వార్ట్జ్, సిలిసియస్ అర్త్.

**ఈ లవణం ప్రాధాన్యత :** ఇది బహుళ ఉపయోగం గల మందు. హోమియో వైద్యంలో కూడా దీనిని ఉపయోగింతురు. హోమియో డాక్టరుకు ఇది కత్తిలాంటిది అని చెప్పుదురు. ఇది చాలా లోతుగను, దీర్ఘకాలం పనిచేయును.

**ఈ లవణం దేహంలోని ఏ భాగాలలో ఉండును :** ఈ లవణం శరీర సంధాయక ధాతువులు, ఎముకలు, గ్రంథులు, గోళ్ళు, వెంట్రుకలు, నరములు మొదలైన వాటిలో ఉండును.

**ఈ లవణ లోపంవలన కనిపించు లక్షణాలు :** కొంతమంది బాగా తిన్నప్పటికీ సరైన శోషణ (assimilation) లేకపోవుటవల్ల బాగా నీరసించి పోవుదురు. వారు ఎప్పుడూ పడుకొన వలయునని భావింతురు. వారిలో అస్వస్థత, నిద్రమత్తు, ఆందోళన కరమగు కలలు, నాడీమండల క్షోభ, క్రుంగుట, తలనొప్పి, వణకు, పక్షవాతపు లక్షణాలు మొదలైనవి ఉండును.

**ఈ మందు పనికివచ్చు రోగములు :** ఈ మందు స్క్రాఫ్యులతత్త్వం[1] గలవారికి, సరియైన పోషణ లేనివారికి, సరిగా వంటబట్టని వారికి బాగా పనిచేయును.

**ఉద్రేకములు :**

రాత్రి, పౌర్ణమి, అమావాస్య, చలి (చల్లదనం), ఉదయం, బహిష్టు సమయం, ఎడమవైపు పరుండుట, పాదముల చెమట అణగారుట, తలపై ఏమీ కప్పు కొనకుండుట, పడుకొనుట.

**ఉపశమనములు :**

వేడి గది, వెచ్చదనం, వేసవి, తలను కప్పుకొనుట, చల్లని ఆహారం తీసుకొనుట.

**ఈ మందు లభించు పొటెన్సీలు :**

3× నుండి 1000× వరకు.

**ఏ పొటెన్సీని ఏ రోగాలకు వాడాలి:**

1. తరుణ వ్యాధులందు ఈ మందును 2–3 గంటల కొక సారి వాడాలి. అంత దీర్ఘ వ్యాధి కానిచో ఉదయం, సాయంకాలం వాడవచ్చు.
2. స్క్రాఫ్యులా సంబంధమగు వ్యాధులలోను, చీము పట్టి నట్టి గ్రంథుల వాపునకు ఈ మందును హెచ్చు పొటెన్సీలో పదేపదే వాడాలి.
3. చీము ఏర్పరచి బయటికి పంపుటకు : 6×.

---

*1. **స్క్రాఫ్యులా తత్త్వం గలవారు :** ఈ తత్త్వం గలవారిలో లింఫ్ గ్రంథులు పెద్దవై శిథిలతత్త్వం కలిగియుండును.*

ఇది ఎముకలు, కీళ్ళు, గ్రంథులు, చర్మం, జిగురు పొర/ఆమత్వక్కు గల ఉపరిభాగములపై బాగా పని చేయును. ఇది చీము ఏర్పడు వ్యాధులకు, లోతు రంధ్రంకలిగి చీము స్రవించు వ్యాధులకు బాగా పని చేయును. ఇది అంటు వ్యాధులకు (రక్తమందు సూక్ష్మ జీవులు చేరు వ్యాధులకు) విలువైన మందు. దేహంలో గ్రుచ్చుకొన్న సూదుల వంటి వస్తువులను బయటికి నెట్టుటకు ఇది బాగా ఉపయోగపడును.

చీము త్వరితముగ పట్టుట తగ్గి మెల్లగ పట్టు చుండునపుడు ఈ మందు సిద్ధౌషధం. ఇది రోగి నీరసంతో నుండునపుడు మంచి ఔషధం.

ఇది మలాశయం దిగజారుట, గుండె పెద్దదై క్షోభతో నుండుట, ప్రసవాంతరపు లక్షణా లుండుట, దీర్ఘకాలపు గౌటు సంబంధమగు వ్యాధులలోను, కీళ్ళవాతపు రోగాలలోను, చెమట అణగారుటవల్ల చూపు మసకగానగుట, కేటరాక్టు, మెడవెనుక భాగము నుండి నడినెత్తివరకు ప్రాకునట్టి, వెన్నెముక నుండి వచ్చి ఒక కంటిలో కేంద్రీకృతమైనట్టి దీర్ఘకాలపు తలనొప్పి మొదలైన వాధ్యులలో బాగా ఉపయోగ పడును.

4. రాచపుండ్లకు, వ్రణములకు 3×ను పైపూతగ వాడాలి. ముక్కునందు దుర్వాసనగల స్రావం వెలువడుచున్నప్పుడు ఈ మందు spray చేయాలి/ జల్లుగా కురిపించాలి.
5. గుండె, ఊపిరితిత్తుల కేసు లలో జాగ్రత్త వహించాలి. లేనిచో రంధ్రాలు ఏర్పడి హాని కలిగించును.
6. తత్త్వసంబంధమైన వ్యాధు లలో హెచ్చు పొటెన్సీ ఒక మోతాదుమాత్రమే వాడాలి.
7. సైలీషియా పల్సటిల్లా (హోమియో)కు సహాయకారి.
8. సైలీషియాను మెర్క్‌సాల్ (హోమియో)కు ముందు గాని, వెనుకగాని వాడరాదు.

**మందు పనిచేయు కాలం :**

40–60 రోజులు

**మానసిక స్వభావం :**

ఆశాపూరితుడై, సంతోష ముగ, చలాకిగా ఉండును.

**ఉష్ణసహనశక్తి :**

చలిని సహించకలేకపోవుట.

# మార్గదర్శక లక్షణములు
## Guiding Symptoms

**1. మనస్సు :**

★ ఆలోచన తట్టుట కష్టం – మనస్సును కేంద్రీకరించుట కష్టం.

★ జీవితమందు విసుగు – శబ్దములను ఏమాత్రం ఓర్చుకొనలేక పోవుట.

★ శారీరకంగా కంటె మానసికంగా దృఢంగా ఉండుట.

★ గుండుసూదులతోను, సూదులతోను ఆడుకొను వింత స్వభావం.

★ పిల్లలు మొండిగా, పెడసరముగా, మూర్ఖంగా ప్రవర్తించుట – పెద్దలు వారితో నెమ్మదిగా మాట్లాడినా అరచుట – ప్రతి విషయమందు వెనుకబడి ఉండుట – ఆదుర్దా, ఆందోళన – ఆత్మవిశ్వాసం లేకపోవుట.

★ స్కూలు విద్యార్థులు పై లక్షణాల కారణంగా తమ ఆలోచనలను ఇతరులకు సరిగా చెప్పలేరు. కనుక వారు కంఠస్థం చేసిన విషయాలను ఉపాధ్యాయులకు చెప్పునప్పుడు గాబరా చెందుదురు. కాని చెప్పుట మొదలు పెట్టిన తర్వాత ఆత్మవిశ్వాసాన్ని, శక్తిని పొంది బాగా చెప్పుదురు.

**2. తల**

★ తలత్రిప్పు : కారు నడుపునపుడు / పైకి చూచునపుడు / ముందుకు వంగునపుడు రోగి ముందుకు / ఎడమకు పడిపోవుచున్నట్లుండును.

★ లోపలి చెవిలోని అనేక తిరుగుళ్ళగ నుండు భాగపు వాపు వల్ల వచ్చు తలత్రిప్పు (Labyrinthine vertigo)

★ సాయంకాలమున వచ్చు తలత్రిప్పు – అప్పుడు రోగి త్రాగబోతువలె వ్యవహరించును.

★ తలత్రిప్పుతో కూడిన తలనొప్పి.

★ తలనొప్పి ధనారింపుగను, చితుక కొట్టినట్లు, తల ముక్కలగుచున్నట్లు, నొక్కుచున్నట్లు, చాల చల్లగా ఉండును – తలను ఎల్లప్పుడు దుస్తులతో కప్పుకొనవలసి వచ్చును.

★ **తలనొప్పి :** ఇది మెడ వెనుక భాగం నుండి నడినెత్తి వరకు వ్యాపించును. ఇది ఎక్కువగా కుడివైపున ఉండును. శబ్దం, అలసట, వెలుతురు, చదువుట, నాడీ నిస్త్రాణ వల్ల ఎక్కువగును. తలకు వెచ్చదనమును కలిగించుటకై గుడ్డ కట్టుట వల్ల తలనొప్పికి ఉపశమనం.

★ **ఆడవారి తలనొప్పి :** ఈ తలనొప్పి తలను పైనుండి క్రిందకు నొక్కినట్లుండును. అప్పుడప్పుడు యోనిలో దురదగా ఉండును.

★ **తలనొప్పి – ఉద్రేకములు :** రాత్రి, మధ్యాహ్నం నుండి రాత్రి వరకు, కళ్ళ కదలిక, వ్రాయుట, మానసిక శ్రమ, మాట్లాడుట, వెచ్చగా నగుట, తలపై గుడ్డను తొలగించి దానిని చల్లబడునట్లు చేయుట, ఈడ్పులు, ముందుకు వంగుట.

★ **తలనొప్పి – ఉపశమనం :** వెచ్చని గది, తలపై వెచ్చగా నుంచు గుడ్డ కట్టుట.

★ తల పెద్దదిగాను, మిగిలిన శరీరం శుష్కించియు ఉండును.

★ తలపై ఎముకలు సరిగా అతుక్కొనక బ్రహ్మరంధ్రం తెరచుకొని ఉండును.

★ తల వెనుక భాగాన దుర్వాసనగా ఉండు చర్మవ్యాధి.

★ **పక్షవాతం :** మెదడులోని రక్తనాళం పగులుటచే పక్షవాతం ఏర్పడును. అప్పుడు ఈ లక్షణాలు ఉండును–1) కపాలపు కుడి భాగమున లోతుగా సూదులతో గ్రుచ్చి నట్లుండుట 2) చేతులు మొద్దుగాను, బరువుగాను ఉండుట (ఈడ్పు నొప్పుల వల్ల)

**తలపై చర్మం (Scalp) :**

★ తలపై నున్న చర్మంపై చిన్న ముడులువంటివి ఉండును. ఈ ముడులు ఆకలి / ఉదర కుహరపు క్షోభ / ఎక్కువగా చదువుట / నాడుల నిస్త్రాణ వల్ల ఏర్పడును – ఈ లక్షణాలతో తలనొప్పి, తల తిరుగుడు ఉండుట.

★ తలపై చర్మం పుండ్లు పడి యుండును. వాటి నుండి దుర్వాసనతో రసి వెలువడు చుండును. వాటిని తాకిన ఎంతో నొప్పి కలుగును. అవి దురదగా నుండును. కనుక టోపీ పెట్టుకొనుటకు ఎంతో బాధగా ఉండును.

★ బాధ కలిగించు చీము పొక్కులు ఏర్పడును.

★ పిల్లల తలపై ఎక్కువ చెమట (CP) – వారు వెచ్చని గుడ్డలను తలకు చుట్టుకొన దలచెదరు.

★ తల వెనుక భాగమున దుర్వాసనగా ఉండు పొక్కులు – వాటివల్ల వెంట్రుకలు రాలి పోవును (KS) –కొంత మందికి చిన్నతనమందే కేశములురాలి బట్టతల అగును.

**3. కళ్ళు :**

★ కన్నీటి గ్రంథి వ్యాధులకు (కన్నీటి గ్రంథి వాపు, కన్నీటి గ్రంథికి లోతు రంధ్రం గల పుండు ఏర్పడుట మొ॥) ఇది మంచి మందు.

★ కనురెప్ప అంచుల వాపు – కనురెప్ప అంచుల మీద లేచు కంతులు / కురుపులు (Styes).

★ కనురెప్ప యందలి పలచని సంధాయక ధాతువు కంతి.

★ కళ్ళచుట్టూ, కనురెప్పల చుట్టూ సెగ్గడ్డలు, ద్రవముతో కూడిన కంతులు ఏర్పడుట.

★ బయటి గాలిలో కన్నీరు కార్చుట.

★ కళ్ళల్లో పసుపు పచ్చని పుసులు ఏర్పడుట.

★ కార్నియా / శుక్లపటలముపై పుండ్లు, ముఖ్యముగా రంధ్రం పడునట్లు చేయు చిన్న గుండ్రని పుండ్లు – ధాతువులను తినునట్టి పుండ్లు – పొడుచునట్టి నొప్పి – పుండు యందు ఏర్పడిన మృత పదార్థం విడివడు చుండుట.

★ మశూచికము తర్వాత కార్నియాపై మచ్చలు, పువ్వు (అపారదర్శకమగు పొర) ఏర్పడుట.

★ కంటి లొత్తులు (Orbits) నొక్కుచున్నట్లు, పుండుగా ఉండుట.

★ కంటి లొత్తుల ఎముకలకు సంబంధించిన పుండు.

★ కనురెప్ప వెంట్రుకల నరాల బాధ / పక్షవాతం (ముఖ్యంగా కుడి కంటిపై).

★ కంటి ముందు నల్లని చిన్న మచ్చలు వంటివి గాలిలో తేలుచున్నట్లుండుట.

★ చదువునపుడు, వ్రాయునపుడు అక్షరాలు కలసి పోవుట.

★ కేటరాక్ట్ – అరికాళ్ళ చెమట / పుండ్లను అణచుట వల్ల చూపు మసకగా నుండుట – దూరపు వస్తువులను మాత్రమే చూడగలుగుట.

**4. చెవులు :**

★ హోరు–బిగ్గర / పెద్ద ధ్వనులను సహించ లేకపోవుట.

★ చాలా కాలం చీము పట్టుట వల్ల.

★ చెవి నుండి వచ్చు స్రావం పెరుగువలె, పలచని పచ్చని రసి వలె ఉండును – అది కణత ఎముకలలో పుండును కలిగించును.

★ స్నానానంతరం చెవి వాపు.

★ దీర్ఘకాలం నుంచి చీము పట్టి యుండుట వల్ల మధ్య చెవి వాచుట.

★ వెలుపలి/బాహ్య చెవి రంధ్రం వాచి ఉబ్బుట.

★ **చెవుడు :** జలుబు వల్ల కర్ణాంతర నాళం (Eustachian tube), మధ్యచెవి వాచుట – దానివల్ల వినికిడి మందముగా నుండుట – బిగ్గరగ మాట్లాడిన చెవులు తెరచుకొనుట.

**5. ముక్కు :**

★ ముక్కుపైన ఉండు వ్రణాల నుంచి మంట కలిగించు, తినివేయు స్రావం వెలువడుట – ఈ వ్యాధి దీర్ఘకాలముగా ఉండి చికిత్సకు లొంగకుండుట.

★ ముక్కు కొన ఎరుపు.

★ ముక్కు కొనపై, ముక్కు రంధ్రాలలో భరించలేనంత దురద.

★ తుమ్ములు – ముక్కు జలుబు వల్ల.

★ దీర్ఘకాలపు జలుబు – స్రావం దుర్వాసనగా ఉండుట (KP) – గడ్డకట్టిన శ్లేష్మం వల్ల ముక్కు బిగుసుకు పోవుట.

★ ముక్కు ఆమత్వక్కు జిగటపొర వాపు – పొడిగా నుండుట – ఒరియుట – పక్కులు కట్టుట – వాసన తెలియకపోవుట.

★ సవాయి / క్షయ వల్ల ముక్కు ఎముకలు పుండు పడుట.

★ మంట, ఒరుపు కలిగించునట్టి, తినివేయునట్టి స్రావం వెలువడి మొండి రకపు పుండును కలిగించుట.

★ ముక్కు రంధ్రములు, పెదవులు – వీటి వద్ద ద్రవపు పొక్కులు.

★ జిగట పొర క్రింద ఉండు సంధాయక ధాతువులు / ఎముకల చుట్టూ ఉండు తెల్లని పీచు వంటి పొరలో నాసికా వ్యాధి గ్రస్తమైన ముక్కు పుండు పడి కంపు కొట్టెడు, దుర్వాసనగల శ్లేష్మం వెలువడుట.

**6. ముఖం :**

★ ముఖం పాలిపోయినట్లు మట్టి రంగుతో నుండుట.

★ ముఖంపై (ముఖ్యంగా చెక్కిళ్ళపై) తెల్లని / బాగా ఎర్రని మచ్చలు.

★ ముఖపు చర్మం పగుళ్ళు.

★ క్షయ తత్త్వమునకు సంబంధించిన కంతులు ముఖంపై ఏర్పడి నొప్పిని కలిగించుట.

★ క్రింది దవుడ గ్రంథులు వాచి బాధాకరముగ నుండుట – దవుడ ఎముక పుండుపడి ధాతువులు మృతి చెందుట .

★ గడ్డం మీద మొటిమలు.

★ సంధాయక ధాతువుల వాపు – చిగురునొప్పి.

**7. నోరు :**

★ నోరు పొడిగా నుండుట.

★ లాలాజల గ్రంథులు చీము పట్టుట.

★ నోటి యందలి ధాతువులు మృతి చెందుట – దీనివల్ల అంగటి (palate) యందు తూటు పడునట్టి పుండు ఏర్పడుట.

★ నోటి వెనుకభాగం వాచుట (దీర్ఘకాలపు) – మలబద్ధకపు లక్షణంతో.

★ నోటి మూలల పుండు పడుట.

★ ఉదయాన నోటి రుచి పుల్లగా / చేదుగా ఉండుట.

★ పెదవుల మీద కంతులు.

**8. నాలుక :**

★ నాలుక మీద పలచని తెల్లటి పూత.

★ నాలుక వాపు.

★ నాలుక మీద పుండ్లు.

★ నాలుక మీద వెంట్రుక ఉన్నట్టి భావన.

**9. దంతములు – పంటినొప్పి :**

1. రాత్రిపూట విపరీతమైన పంటినొప్పి – పాదములు చల్లబడినప్పుడు ఈ నొప్పి వచ్చును. వేడిమి / చల్లదనం వల్ల ఉపశమనం లభించదు.
2. ఎముక పైపొర యందు లోతుగ పునాది ఏర్పరచుకొన్న పంటినొప్పి.
3. చెమటచే కాళ్ళు అకస్మాత్తుగా చల్లగా అగుట వలన వచ్చు పంటినొప్పి.

★ దంతముల మూలయందు పంటి కురుపు (పిప్పి పన్ను) ఏర్పడుట.

★ దంతములు వదులుగ నుండుట.

★ చిగుళ్ళపై బొబ్బలు (చిగురు కురుపు) ఏర్పడును. వాటిని మెల్లగా నొక్కినా / కొద్దిగా తాకినా బాధాకరంగా ఉండును.

★ చిగురు కుళ్ళిపోయి ధాతువులు మృతి చెందుట.

★ దంతములు వచ్చుట కష్టం.

★ పండ్లు సరిగా రాకున్న ఈ మందు బాగాపనిచేయును–ఇది పంటి పుండ్లను మాన్పును.

**10. గొంతు :**

★ థైరాయిడ్ గ్రంథి వాపు – మ్రింగునపుడు గొంతులో సన్నటి పొడుగైన ముక్కలు ఉన్నట్టి భావన.

★ టాన్సిల్ గ్రంథులు చీము పట్టి టాన్సిల్ నొప్పి వచ్చుట.

★ కాలనియమం ప్రకారం వచ్చు క్వీన్సీ[1] – దీనిలోని జ్వరాన్ని నయం చేయుటకు కాలీసల్ఫ్‌ను వాడవలెను.

★ అంగటి వెనుక భాగమునకు కలుగు పక్షవాతం.

**11. జీర్ణాశయం / పొట్ట**

★ పిల్లలు ఎంతతింటున్నా పోషక పదార్థాల శోషణ సరిగాలేకపోవుటచే కృశించి పోవుట.

★ శిశువు త్రాగిన వెంటనే పాలను వాంతి చేసుకొనుట (FP, CP)

★ ఉత్తేజకరాలైన సారాయి, మద్యం మొ॥ వాటిని అసహ్యించుకొనుట.

---

*1.* క్వీన్సీ **(Quinsy)** : *దీని లక్షణాలు – జ్వరం, టాన్సిల్స్ వాచి చీము పట్టుట, గొంతు తీవ్రముగ వాచుటవల్ల తీవ్రమగు నొప్పి, గుటకవేయుట కష్టముగా నుండుట, విడుచు శ్వాస దుర్వాసనతో నుండుట.*

★ పైలోరసు (జీర్ణకోశపు చివరి భాగం) వాచుట.

★ పొట్టలో రాయి ఉన్నట్లు అనిపించుట – వమన వికారం, వాంతి ఒక దాని తర్వాత మరొకటి ఎల్లప్పుడూ ఏమైనా తిన్నవెంటనే.

★ అజీర్ణం (దీర్ఘకాలపు), పులిత్రేపులు; కడుపులోను, ఛాతీ అడుగు భాగమున నొప్పి, మంట (NP), చలి, ఉదయాన వాంతి, మాంసం / వేడిగా నున్న ఆహారం పట్ల అయిష్టం, విపరీతమైన ఆకలి.

★ అర్ధరాత్రి తర్వాత వాంతి.

**12. పొత్తి కడుపు / ఉదరకుహరం – మలం**

★ పిల్లలలో ఉదరకుహరం పెద్దదిగా ఉండును.

★ గజ్జల యందలి గ్రంథులు పెద్దవగును.

★ కాలేయపు వాపు – కాలేయము పుండు.

★ విరేచనాలు పసుపుపచ్చగా, నీళ్ళగా, మెత్తని ముద్దవలే ఉండుట.

★ చిన్న పిల్లలయందు కలుగు కలరా విరేచనాలు – ఆ విరేచనాల నుండి శవము వంటి దుర్వాసన – టీకాలు వేసిన తర్వాత తలపై అధికంగా పుల్లని చెమట పోయుట, ఉదరకుహరం గట్టిగాను, వేడిగాను, వాయుపూరితమై ఉండుట.

★ చిన్నపిల్లలలో క్రిముల / పురుగుల శూల.

★ అపానవాయువు ఉదరకుహరంలో ఒక చోటు నుండి మరొకచోటుకు పోవుట – దుర్వాసనగల అపానవాయువు వెలువడునపుడు పొట్టలో శబ్దం.

★ మొలలు / మూలశంక (Piles) తీవ్రమైన నొప్పితో ఉండును. – వాటి నుండి చిక్కని, పసుపు పచ్చని చీము వెడలుచుండును – మొలలు, ఛాతీ లక్షణాలు తారుమారగు చుండును.

★ మలబద్ధకం, వెన్నెముక బాధలు – గుదమునకు ఏర్పడిన పక్షవాతం వల్ల కలిగిన సంవరణి, కండర క్షోభచే మలం కొంత పైకి వెలువడి, పిమ్మట మరలా లోపలికి వెళ్ళును (Shy stools) – ఇలాంటి లక్షణానికిది మంచి మందు.

★ మలం గట్టిగా నుండుట – మలబద్ధకం –మలం తరచుగ దుర్గంధభరితంగా నుండుట.

★ గుదము దగ్గర చీలికలు (Fissures), దురద – గుదము లోపల, బయట రంధ్రాలు.

**13. మూత్రావయవములు :**

★ మూత్ర విసర్జన బాధగా ఉండి మూత్రం చుక్కలు చుక్కలుగా పడుట.

★ మూత్ర పిండములు చీము పట్టుట.

★ మూత్రంలో చీము, ఆమము (mucus) / రక్తం ఉండుట.

★ మూత్రాశయపు వాపు (దీర్ఘకాలపు).
★ ప్రోస్టేటు గ్రంథి వాపు.
★ మూత్రం అడుగునకు యూరిక్ యాసిడ్ ఎర్రని ఇసుక రంగులో దిగుట.
★ క్రిములవల్ల / కొరియా వ్యాధి వల్ల మూత్రం తెలియకుండానే పోవుట.

**14. పురుష జననేంద్రియాలు :**

★ దీర్ఘకాలముగా నున్న సవాయి (సిఫిలిస్) రోగం – వృషణాల కోశము వాపు – వృషణాల కోశము నుండి చీము స్రవించుట.
★ దీర్ఘకాలము నుంచి ఉన్న సెగ (గనేరియా) రోగం – చిక్కని, పసుపు పచ్చని, కంపుకొట్టెడు చీముగల స్రావం.
★ నిరంతరం సంభోగమునకు సంబంధించిన ఆలోచనలు – రాత్రిపూట స్కలనములు తరచుగా అగుట, పక్షవాతముతో నాడీ మండలక్షోభ అత్యధికమగుట.

**నపుంసకత్వం :**

★ సంభోగానంతరం తేలికగా అలసట చెంది, బలహీనముగా నుండుట.
★ బీజముల తిత్తి (scrotum) వద్ద దురద – అచ్చట అధికముగా చెమట.
★ **బుడ్డ / ఒరిబీజం** (Hydrocele) : వృషణముల తిత్తి / శుక్రవాహక నాళములందు ద్రవం కూడుట – శుక్ర స్కలనం.

**15. స్త్రీ జననేంద్రియాలు :**

★ **బహిష్టు :**

1. బహిష్టులో శరీరమంతా మంచులాంటి చల్లదనం, మలబద్ధకం, పాదములకు దుర్వాసనగల చెమట పట్టుట.
2. బహిష్టు త్వరగా కనిపించుట – బహిష్టుస్రావం చాల కొద్దిగా ఉండును. అప్పుడప్పుడు విస్తారంగా – స్త్రీ బాహ్య జననేంద్రియంలో మంట, దురద.
3. శిశువునకు పాలిచ్చునప్పుడే బహిష్టు.
4. రెండు బహిష్టుల మధ్య కాలములో రక్తస్రావం.

★ **కుసుమ :** కుసుమ మంటగాను, విస్తారముగాను, దురద పెట్టునదిగాను, కొరుకునట్టిదిగాను ఉండును – అది తొడలు ఒరుసుకు పోయేటట్లు చేయును.

★ పట్టశక్యంకాని అధిక సంభోగేచ్ఛ
★ వంధ్యత్వం.
★ అండవాహక నాళములందు ద్రవం, చీము కూడుట.
★ యోనియందు సీరమునకు సంబంధించిన తిత్తులు.

- ★ జననేంద్రియ పార్శ్వముల మీద వ్రణములు – ఆ వ్రణములకు రంధ్రములను లోతుగా చేయు స్వభావముండుట
- ★ చన్నీటిలో నిలబడినచో ఋతు సమయం కానపుడు గర్భకోశం నుండి రక్తస్రావం.

★ **గర్భిణి :**

- ★ స్తనాలు గట్టిగాను, నొప్పిగాను ఉండుట. ఇవి చీము పట్టకుండా ఈ మందు చేయును.
- ★ స్తనాలు రాతివలె తగులుట.
- ★ స్తనాలలో పుండ్లు – ఇవి లోతైన రంధ్రములు చేయును – వీటి నుండి చిక్కని పసుపు పచ్చని స్రావం స్రవించుచుండును.
- ★ చన్మొన పగిలి తేలికగా పుండు పడును.
- ★ గర్భిణీగా నున్నప్పుడు పాదముల వంపు దగ్గర నుండి అరికాలు వరకు మంట, కుంటితనం.
- ★ గర్భవిచ్ఛిత్తి.

**16. శ్వాసావయవములు :**

- ★ న్యుమోనియా (ఊపిరితిత్తుల వాపు), చీము పట్టు దశ (CS)
- ★ ప్లూరా (ఊపిరితిత్తుల చుట్టూ నుండు పొర)లో చీము ఏర్పడుట.
- ★ లూజుగానున్న చిక్కని పసుపుపచ్చ – ఆకుపచ్చ చీము గడగడ ధ్వని చేస్తూ స్రావముగా వెలువడుట.
- ★ దీర్ఘకాలంగా ఉన్న బ్రాంకైటిస్ (శ్వాసనాళముల వాపు) – క్షయతో.
- ★ క్షయకు సంబంధించిన జ్వరం – రాత్రిపూట అధికంగా చెమట పోయుట – అధిక నీరసం.
- ★ రాళ్ళు కొట్టువారి ఆయాసానికి ఇది మంచి మందు.
- ★ అనారోగ్యముగా ఉన్న చిన్న పిల్లలందు రాత్రి చెమటలు పట్టుటతో దగ్గు ఉండును – ఛాతీ లోతున నొప్పి ఉండును.
- ★ బొంగురుతనం, క్షోభ, చిరాకు కలిగించు దగ్గు – ఈ దగ్గు గొంతులోను, రొమ్మెముక ఊర్ధ్వభాగపు లొత్తయందును గుల (tickling) కలుగుట చేతను, చల్లని పానీయములు త్రాగుట చేతను ప్రేరేపింపబడును. రాత్రిపూట ఎక్కువగును – నాలుకపై వెంట్రుక ఉన్నట్లు అనిపించును.
- ★ బలహీనత, ఛాతీలో లోతుగా చోటు చేసుకొన్న నొప్పి – కళ్ళె విస్తారం. అది చిక్కని చీమువలె నుండును.

★ ఊపిరితిత్తులలో క్షయ సంబంధమగు పుండు.
★ దగ్గు, గొంతునొప్పి – దుర్వాసనగల చిన్న గింజల వంటి కళ్ళె.
★ కోరింత దగ్గు – వేగంగా నడచునపుడు, మానసిక శ్రమ చేయునపుడు రొప్పుట – విశ్రాంతిలో ఛాతీ బిగుతుగ నుండుట.

**17. రక్తప్రసరణావయవములు :**

★ గుండెదడ : ఇది వేగంగా నడచునపుడు / ప్రశాంతంగా కూర్చొన్నప్పుడు కలుగును.
★ దీర్ఘకాలం నుంచి ఉన్న గుండెజబ్బు.

**18. మెడ, వీపు, నడుము, కాళ్ళు – చేతులు**

★ మెడ గట్టిగా ఉండుట.
★ భుజాలు పుండువలె నుండుట.
★ గూని, రికెట్సు, వెన్నెముక క్షోభ.
★ గుర్రం ఎక్కిన తర్వాత; బండి, బస్సు, రైలులో ఎక్కువ దూరం ప్రయాణం చేసిన తర్వాత వెన్నెముక చిట్టచివరి 4వ పూస ఎముకలు బాధగా నుండుట, గ్రుచ్చుకొనునట్టి నొప్పి.
★ వెన్నెముక పొడుగునా రాచపుండ్లు.
★ పుట్టుకతో నడుమునందు / నడుము క్రింది భాగాన ఏర్పడిన వెన్నెముక నెరద (ఈ నెరద గుండా వెన్నెముక భాగాలు కనిపించును. కొంతమందిలో అవి పైకి వచ్చుట కూడా కలదు)
★ వెన్నెముక వాచి చీము పట్టుట (Pott's disease)
★ వెన్నెముక పుండులో మాంసం ఉబ్బెత్తుగా పెరుగుట.
★ వెన్నెముకకు దెబ్బ తగిలిన తర్వాత కలుగు నాడీ వ్యాధులు.
★ వీపుకు ఈదరగాలి సోకుటచే కలుగు వ్యాధులు.
★ చంకలలో దుర్వాసనగల చెమట.
★ నడుము ప్రాంతమున పుండు / చీముగడ్డ లేచుట.
★ తుంటికీలు వ్యాధిలో చీమును నిరోధించుటకు/నియంత్రించుటకు.
★ చేతులు, భుజాలు భారంగాను, పక్షవాతం పొందినట్లుగాను ఉండుట.
★ రాత్రిపూట భుజాలలోను, చేతులలోను నొప్పి – వెచ్చని దుస్తులు కప్పుకొనుట వల్ల నొప్పి తగ్గుట.
★ చేతులు – కాళ్ళు బాగా అలసిపోయినట్లుగాను, పక్షవాతం బారిన పడినట్లుగాను ఉండుట.

★ మోకాలి చుట్టూ ఉండు సైనోవియం పొర ఉబ్బి నొప్పి పుట్టును – నొక్కినచో నొప్పి అధికమగును.

★ మోకాళ్ళు పట్టు తప్పుట.

★ చాల దూరం నడచునపుడు కాళ్ళకు, కాలివ్రేళ్ళకు బాధాకరమగు, బిర్రబిగిసిన ఈడ్పు కలుగుట.

★ పాదముల నొప్పులు చీలమండ నుండి అరికాలు వరకు ఉండును–పాదముల చెమట భరించలేనంత దుర్వాసనగా ఉండుట, చెమటను అణచివేసిన ఇతర రోగాలు వచ్చుట.

★ చీలమండలు బలహీనం – అవి బాధను భరించలేనంత సున్నితంగా ఉండుట.

★ చేతులు వణకుట – పక్షవాతపు లక్షణాలతో.

★ కాళ్ళు – చేతుల యందు చీము పట్టిన పుండ్లు – ఇవి చిక్కని పసుపు పచ్చని స్రావమును స్రవింపజేయును – చీము పట్టుట చాల లోతుగ నుండును. చాలా కాలం నుంచి ఉన్న పుండ్లు నొప్పి చేయును. అవి మంటగాను, శూలముతో పొడిచినట్లుగాను ఉండును.

★ గోళ్ళు విరుగుట, పెళుసుగా ఉండుట, వాటిపై తెల్లని మచ్చలు పడుట.

★ కాలిగోళ్ళు దళసరెక్కి వంగుట – అవి సరిగా పెరగక పోవుట.

★ **గోరుచుట్టు** (Whitlow), **కణుపుజెష్ఠ** (Felon) – చేతి వ్రేళ్ళ చివరలందు చీము పట్టినట్లుండును. చీము పట్టుటలోను, దానిని నియంత్రించుటలోను ఈ మందు సహాయపడును. ఇది క్రొత్తగా గోరు ఏర్పడుటలో సహాయపడును.

★ ఎముకల, ముఖ్యంగా మోకాలి ఎముకల నొప్పి–అదముటవల్ల నొప్పి ఎక్కువ కాదు.

★ ఎముక పుండ్లు, వీటికి లోతైన రంధ్రములు ఉండును. వీటినుండి చిక్కని చీము స్రవించును. వీటి నుండి ఎముక చిన్న ముక్కలు క్రింద పడును.

★ కీలును చుట్టి యుండెడి పొరవాపు (synovitis) –దీర్ఘకాలంగా వాపుఎక్కువగా ఉండుట.

★ కీళ్ళు (ముఖ్యంగా తుంటికీలు; మోకాళ్ళ, భుజాల కీళ్ళు) బిర్రబిగియుట – అవి నొప్పిగా ఉండుట – ఆ నొప్పులు కూర్చొన్నప్పుడు ప్రారంభమగును – ఈ మందు కీళ్ళు చీము పట్టకుండా చేయును.

★ వ్రాయునపుడు చేతి కండరాలు బిర్రబిగిసి సంకోచించుట.

## 19. నాడీ వ్యవస్థ

★ రాత్రిపూట వచ్చు మూర్ఛ – ఇది అమావాస్య రోజున వచ్చుట (MP, CP, KM) – మూర్ఛవచ్చు సూచన తొలుత జీర్ణాశయపు వెనుక భాగమునగల నరముల కూడలి (Solar Plexus) యందు లభించును.

★ శరీరములోని వివిధ భాగాలందు పుండు పడి నొప్పి ఉండును.

★ వెన్నెముక క్షోభ – సహనశక్తి కోల్పోవుట – అనేక పరావర్తన నొప్పులు – అలియుట.

★ వెన్నెముకలోని మజ్జ శుష్కించు వ్యాధి – స్వల్ప ప్రేరేపణ వల్ల ఈడ్పులు.

★ నిస్త్రాణ, బలహీనత – ఎప్పుడూ పడుకోవాలనిపించుట – నాడీ మండల క్షోభ అత్యధికముగ నుండుట.

★ బాధ పడుతున్న భాగాలు నొప్పిగా ఉండుట – అవి తేమను సహింపలేక పోవుట.

★ గుదము, మూత్రకోశ ద్వారము మొ॥ వాటి వద్ద నుండు సంవరణి కండరములు ఆయా ద్వారాలను ఈడ్పుచే మూసివేయుట.

★ వెర్రి / హిస్టీరియా, మొండి రకపు నరాల బాధ.

**20. నిద్ర :**

★ రక్తప్రసరణాధిక్యతచే నిద్రలేమి.

★ గుండెదడ – నాడి వేగంగా కొట్టుకొనుట – వేడిమి.

★ నిద్రలో కాళ్ళు – చేతులు ఆకస్మికంగా అదరుట.

★ నిద్రలో మాట్లాడుట, లేచి నడచుట.

★ కలలు : చెడు కలలు.

**21. జ్వరం :**

**క్షయ జ్వరం :** దీర్ఘకాలంగా నున్న పుండ్లు చీము పట్టినపుడు జ్వరం వచ్చును. దీనిలో రోజంతా చలి ఉండును. కదలికచే చలి కలుగును. జీవోష్ణం తక్కువ. చల్లగాలిని సహించలేడు. మధ్యాహ్నం తర్వాత వేడిమి. రాత్రంతా పాదాలలో మంట, రాత్రిపూట చెమట – ఆకలి నశించును – శక్తి కోల్పోవును – చెమట పట్టును – తలపై ఎక్కువ చెమట – కాళ్ళకు దుర్వాసనగల చెమట.

**22. చర్మం**

★ చర్మం దురదగా నుండుట, మంట.

★ చీము లేనట్టి చిన్న కురుపులు, ముడులు, పుండ్లు, రాచపుండ్లు, గోరుచుట్టు, విషపు కురుపులు.

★ శీతాకాలమందు కలుగు పొక్కులు / బొబ్బలు.

★ ముఖంమీద, తలమీద చిక్కని చీముతో నున్న పొక్కులు – అవి పగిలి తెల్లని పక్కు గట్టుట – వాటి నుండి దుర్వాసనగా స్రావం వెలువడుట.

★ గజ్జి పొలుసులు.

★ పోతరపు పొక్కులు – ఇవి చాలా నొప్పిగా నుండును.

★ ఏ భాగమందైనను సెగ్గడ్డలు గుంపులు గుంపులుగా లేచు స్వభావం అధికంగా ఉండుట.

★ వ్రణములు, రాచపుండ్లు ఏర్పడి, తర్వాత వాచుట.

★ మాంసం బాగా పెరిగిన పుండ్లు – వాటి నుండి దుర్వాసన, మంట, ఒరుపు కలిగించు నీటి వంటి స్రావం (రసి) వెలువడును. అంచులు ఉబ్బెత్తుగాను, నీలిగాను ఉండును.

★ లోతు రంధ్రములుగల పుండ్లు గోళ్ళ చుట్టూ ఏర్పడును.

★ చర్మవ్యాధులు అతి కష్టముతో నయమగును. తేలికగా చీము పట్టును.

★ స్క్రాఫ్యులా తత్త్వము (క్షయ తత్త్వము) గల పుండ్లు ఏర్పడుట.

★ చర్మం మీద నెరదలు.

★ లోతుగ పాతుక పోయిన, చీము పట్టునట్టి విసర్పి.

★ శరీరములో ఎముకలు కలియుచోట, కీళ్ళవద్ద, కండర సంధానముల మధ్య రాపిడి కలుగకుండుటకై వాటి మధ్య నుండు జిగురు వంటి ద్రవముగల తిత్తులు, వాని చుట్టూ ఉండు గ్రంథులు ఉబ్బుట.

★ మశూచిలో చీము పట్టినప్పుడు – అపరిశుభ్రమగు టీకాల వల్ల కలుగు లక్షణాలు.

★ కుష్ఠు – ముక్కు పుండు పడుట.

★ ఉబ్బుట – రాగి మచ్చలు, ముడులు.

★ ధాతువులు, సంవరణి కండరములు[1] మొ॥ వాటి నుండి పదునగు గాజు ముక్కలు, ముళ్ళు (foreign bodies) మొ॥ వాటిని బయటికి నెట్టుటకు ఈ మందు బాగా ఉపయోగకారి.

**23. ధాతువులు :** ఫంగస్ (బూజు) : తేలికగా స్రవించు వ్రణం / కురుపు, కురుపులు, వేడిమి, ఎరుపు, నొప్పి, ఉబ్బుట లక్షణాలతో నున్న వాపు – ఒక ప్రదేశమందలి ఎముక ధాతువులు మృతి చెందుట – రికెట్స్ – కణములలో నెమ్మదిగ చీము చేరుట, ఆ తర్వాత అవి గట్టిపడుట – శరీర భాగములు కుళ్ళుట, అవి వేడిగా, ఎర్రగా, నొప్పితో ఉండుట – ఈ లక్షణాలు ప్రాణాపాయకర స్థితిలో ఉండుట – వాచిన చీము కారుతున్న గ్రంథులు, ముఖ్యంగా మెడకు సంబంధించిన గ్రంథులు – నిర్లక్ష్యం చేయబడిన గాయములు చీము స్రవించుచున్నచో – స్రావములు, శరీరం నుండి విసర్జించబడిన మలినములు దుర్వాసన గొల్పుట – ఉబ్బు రోగం – క్రొవ్వు గ్రంథులు – క్షయ ప్రవృత్తి – మృదులాస్థి సంబంధమైన కంతి.

*1. సంవరణి కండరము (Sphincter) : ఒక మార్గమును / రంధ్రమును చుట్టియుండు కండరము.*

# లక్షణ సముదాయం

(REPERTORY)

## 1. మనస్సు
(Mind)

అకస్మాత్తుగా స్పృహ కోల్పోవుట – కాల్కే.స.

అతి సున్నితము, సహనశక్తి లేకుండుట, జ్ఞాపకశక్తి నశించుట, ఇతరులతో కలవలేకపోవుట – కాలీ.ఫా.

అతి సున్నితము, సహనశక్తి లేకుండుట, ఆలోచించుట కష్టమగుట, దేనిపైనా కేంద్రీకరించలేకపోవుట – సైలీ.

అధిక దుఃఖం పొందుట – మె.ఫా.

అధిక సిగ్గు – కాలీ.ఫా.

అధైర్యపడుట – నే.స.

అధైర్యముతో నిరాశ – కాలీ.ఫా.

అపస్మారక స్థితి – కాలీ.ఫా.

అమిత భయం – కాల్కే.ఫా.

అమితముగ ఉద్రేకపడుట – కాలీ.ఫా.

అమితముగ త్రాగి వాగుట, సాధారణ విషయాలపట్ల నిర్లక్ష్యం, గోరంతలు కొండంతలు చేయుట – ఫె.ఫా.

అమితముగా త్రాగి వాగుట, ఇతరులతో కలవలేకపోవుట – కాలీ.ఫా.

అమితముగా త్రాగి వాగుట, భవిష్యత్తుపట్ల నిరాశ – నే.మూ.

ఆందోళన – కాల్కే.ఫా.

ఆలోచన కలుగుట కష్టముగా నుండుట – సైలీ.

ఇంటిపై బెంగ – కాలీ.ఫా.

ఇష్టం వచ్చినట్లు మాట్లాడుట, ఇతరులతో కలవలేకపోవుట – కాలీ.ఫా.

ఇష్టం వచ్చినట్లు మాట్లాడుట, భవిష్యత్తుపట్ల నిరాశ – నే.మూ.

ఉన్నతస్థితిని పొందవలయుననెడి ఆశ లేకపోవుట – నే.ఫా.

ఉలికిపడుట, ఇతరులతో కలవలేకపోవుట – కాలీ.ఫా

ఉలికిపడుట, ఉపవాసం ఉండవలసి వస్తుందని/ఆహారం లేక చనిపోవలసి వస్తుందని తలంచుట – కా.మూ.

ఎక్కువగా మాట్లాడుట, భవిష్యత్తుపట్ల నిరాశ — నే.మూ.

ఎక్కువగా మాట్లాడుట, గోరంతలు కొండంతలు చేయుట — ఫె.ఫా.

ఏకాంతమును ఇష్టపడుట — కాల్కే.ఫా.

ఏడ్చుట — కాలీ.ఫా.

ఒక వస్తువుపై దృష్టిని కేంద్రీకరించుట కష్టముగా నుండుట — సైలీ.

ఓదార్చుటవల్ల బాధలు ఉద్రేకించుట — నే.మూ.

ఓర్పు/సహనం లేకుండుట — కాలీ.ఫా.

కష్టంమీద ఆలోచన తట్టుట — సైలీ.

కుండ బ్రద్దలు కొట్టినట్లు మాట్లాడుట — నే.మూ.

కోపము, కోపోద్రేకములు, చిరచిర — నే.మూ.

**క్రుంగిపోవుట :**

ఆరోగ్యమును గురించి ఆలోచిస్తూ క్రుంగి పోవుట, ఇతరులతో కలవలేకపోవుట — కాలీ.ఫా.

ఆరోగ్యమును గురించి ఆలోచిస్తూ క్రుంగిపోవుట, ఉన్నతస్థితిని పొందవలయుననెడి ఆశ లేకపోవుట — నే.ఫా.

ఉత్సాహాదులు క్రుంగిపోవుట, ఇతరులతో కలవలేకపోవుట — కాలీ.ఫా.

ఉత్సాహాదులు క్రుంగిపోవుట, కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడుట — నే.మూ.

ఉత్సాహాదులు క్రుంగిపోవుట, ఆర్థికనష్టాన్ని గురించి ఆధారం లేకుండానే భయపడుట — కాల్కే.ఫ్లో.

ఉత్సాహాదులు క్రుంగిపోవుట, మారుతూ ఉండే మానసిక స్థితి, పరధ్యానముగ నుండుట, చిరాకుపడుట — కాల్కే.స.

రజస్వల అయినపుడు భయముతో కీడును గూర్చి ఎల్లప్పుడు తలపోస్తూ క్రుంగిపోవుట — నే.మూ.

వ్యవహారం/వ్యాపారం గురించి మానసికంగా క్రుంగుట — కాలీ.ఫా.

గతములో చూసిన వాటిని/దృశ్యాలను చూడాలనుకొనుట — కాలీ.ఫా.

గుండుసూదులతోను, సూదులతోను ఆడుకొనుట — సైలీ.

గోరంతలు కొండంతలుగా అగుపడుట — ఫె.ఫా.

చిన్న విషయాలు పెద్దవిగా కనిపించుట — ఫె.ఫా.

చిన్నవైనను విసుగును కలిగించుట — నే.ఫా.

చెవులు గింగురుమనునట్లు అరచుట — కాలీ.ఫా.

జీవితంపై విరక్తి — సైలీ.

జీవితంలో అలసిపోవుట – సైలీ.
జీవితంలో డోలాయమానస్థితి/సందిగ్ధ స్థితి – కాల్కే.ఫ్లో.

**జ్ఞాపక శక్తి :**

జ్ఞాపకశక్తి అకస్మాత్తుగ క్షీణించుట – కాల్కే.స.
జ్ఞాపకశక్తి కొద్దికాలమే ఉండుట – కాల్కే.ఫా.
జ్ఞాపకశక్తి క్షీణించుట – కాల్కే.ఫా.
జ్ఞాపకశక్తి మందకొడిగా ఉండుట – కాలీ.ఫా.
తప్పుడు ఆలోచనలు/అభిప్రాయములు, ఇతరులతో కలవలేకపోవుట – కాలీ.ఫా.
తప్పుడు ఆలోచనలు/అభిప్రాయములు, ఏదో జరుగుతుందనే భయం – నే.ఫా.
తరుణ వ్యాధులలో (Acute Diseases) నిద్ర, అచేతన స్థితి – నే.మూ.
దిగులుగానుండుట, ఇతరులతో కలవలేకపోవుట – కాలీ.ఫా.
దిగులుగానుండుట, భయముతో కీడును గూర్చి ఎల్లప్పుడు తలపోస్తూ ఉండుట – నే.మూ.

**తర్వాతి బాధలు /అనంతర ఫలితాలు**

అధిక దుఃఖం తర్వాతి బాధలు – కాల్కే.ఫా., కాలీ.ఫా.
అధిక శ్రమవల్ల కలుగు బాధలు (నిద్రపట్టకపోవుట, అస్థిమితం మొదలైనవి) – కాలీ.ఫా., సైలీ.
ఆరోగ్యం కుదుట పడిన తర్వాత నిరాశ, నిస్పృహ – నే.స.
ఆశాభంగం/నిరాశ వల్ల కలుగు బాధ/విసుగు – కాల్కే.ఫా.
ఆశాభంగంవల్ల ఏడ్చుట – కాల్కే.ఫా., కాలీ.ఫా.
ఆశాభంగంవల్ల కలుగు భయం – కాలీ.ఫా.
కోపం/విసుగు తర్వాతి బాధ – కాల్కే.ఫా.
భయంవల్ల కలుగు బాధలు – కాలీ.ఫా.
దుఃఖంతో గుండె బాదుకొనుట – నే.మూ.
దుఃఖముగా నుండుట – మె.ఫా.
నవ్వుతూ నుండుట – కాలీ.ఫా.
నిట్టూర్పు విడుచుట – కాలీ.ఫా., నే.మూ.
నిద్రలేమి – కాలీ.ఫా.
నిద్రలో నడచుట – కాలీ.ఫా.

నిద్ర వల్ల ఉపశమనం – ఫె.ఫా.
నియంత్రణ అవసరమైనచో – నే.స.
నిర్ణయమునకు రాలేకుండుట – కాల్కే.ఫ్లో, కాలీ.ఫా.
నెమ్మదిగా/మెల్లగా అర్థం చేసుకొనుట – కాల్కే.ఫా.
నెమ్మదిగా గొణుగుట – కాలీ.ఫా.
నొప్పిని గురించి నిరంతరం అరచుట, ఏడ్చుట – కాలీ.ఫా.
నొప్పిని గురించి నిరంతరం దుఃఖించుట – మె.ఫా.
పరధ్యానము/పరాకుగా నుండుట – సైలీ.
పాట పాడాలని, నృత్యం చేయాలని కోరిక యుండుట – నే.మూ.
పాత దృశ్యాలు వెంటాడుట – కాలీ.ఫా.

**పిచ్చి/ఉన్మాదం/వెర్రి/సంధి :**

ఆకస్మికముగా/ప్రసవ సమయమున వచ్చునది – కాలీ.ఫా.
తలకు గాయాలు తగులుటవల్ల వచ్చునది – నే.స.
పిరికితనం వల్ల వచ్చునది – కాలీ.ఫా.
మద్యం, సారాయి మొదలైన వాటి చెడు ఫలితములవల్ల వచ్చునది. – ఫె.ఫా., కాలీ.ఫా., నే.మూ.
పిచ్చిలో ఒక విషయము నుండి మరొక విషయమునకు మారుట – నే.మూ.
పిచ్చిలో మెల్లగా గొణుగుచుండుట – కాలీ.ఫా.
పిచ్చిలో మేల్కొని బాగా మాట్లాడుట – ఫె.ఫా.
పిల్లలు ఎత్తుకొమ్మని కోరుట – కాలీ.ఫా.
పిల్లలు ఎదురుప్రశ్నలు వేయుట – కాలీ.ఫా.
పిల్లలు బాధను గూర్చి నెమ్మదిగా చెప్పుట – కాలీ.ఫా.
పిల్లలు రాత్రులందు అమితముగా భయపడుట – కాలీ.ఫా.
పిల్లల ఏడ్చే స్వభావం – కాలీ.ఫా.
పిల్లల కోపం – కాల్కే.ఫా., కాలీ.ఫా.
పిల్లల చెడు స్వభావం – కాలీ.ఫా.
పిల్లల మొండితనం – నే.స.
పిల్లలలో (థైరాయిడ్ లోపం) వల్ల శారీరక, మానసిక ఎదుగుదల లేకపోవుట/ తెలివితేటలు లేకపోవుట, మాటలు/నడక ఆలస్యంగా వచ్చుట – కాల్కే.ఫా.

పిల్లలలో విసుగు, చిరచిరలాడెడు స్వభావం - **కాల్కే.ఫా.**
ప్రతిదానిపట్ల ఉదాసీనత్వం - **ఫే.ఫా.**
ప్రతి విషయమందు కీడు ఎంచుట - **కాలీ.ఫా.**

**భయం :**

ఆరుబయలులో ఉండుటకు భయం - **కాలీ.ఫా.**
ఆర్థిక నష్టానికి సంబంధించిన భయం - **కాల్కే.ఫ్లో**
క్రింద పడతాననే భయం - **కాలీ.స.**
జనులు గుమిగూడు చోటునకు/సంత మొ॥ చోట్లకు వెళ్ళాలంటే భయం - **కాలీ.ఫా.**
ధ్వనులకు భయపడుట - **కాలీ.ఫా.**
నరముల బలహీనతచే భయపడుట - **కాలీ.ఫా.**
రజస్వల అయినపుడు కన్యలు భయముతో కీడును గూర్చి ఎల్లప్పుడు తలపోయుట - **నే.మూ.**
భయోత్పాతముగ నుండుట - **కాలీ.స.**
భవిష్యత్తును గురించి ఆశలేకుండుట - **నే.ఫా., ఫే.ఫా.**
భవిష్యత్తులో కలుగబోవు చెడును/అపాయమును గురించి ఆలోచించుట-**కాలీ.ఫా.**
మంచి నిద్రలో ఇష్టం వచ్చినట్లు మాట్లాడుట - **కాలీ.ఫా.**
మందబుద్ధి - **కాలీ.ఫా., మె.ఫా., నే.ఫా.**
మగత - **కాలీ.ఫా.**
మగతతో బాహ్య ప్రపంచం తెలియని స్థితి - **కాల్కే.ఫా.**
మతి తప్పుట - **కాలీ.ఫా.**
మతి తప్పుట (తలకు గాయాలు తగులుట వల్ల) - **నే.స.**
మతి మరపు/మరచిపోవుట - **కాల్కే.ఫా., మె.ఫా.**
మతి స్థిమితం లేకుండుట - **కాల్కే.స., కాలీ.ఫా.**
మనస్సు ఒక నిర్ణయానికి రాలేకపోవుట - **కాల్కే.ఫ్లో., కాలీ.ఫా.**
మనస్సును నిలుపుట కష్టం - **సైలీ.**
మానసిక అసహజత్వం - **కాలీ.ఫా.**
మానసిక ఉద్రేకములచే ముఖం ఎర్రబడుట - **కాలీ.ఫా.**
మామూలుగ లేని మానసిక స్థితి - **కాలీ.ఫా.**
మారుచుండెడి మానసిక స్థితి - **కాల్కే.స., కాలీ.ఫా.**

ముఖం కలవరం/భావోద్వేగం/సిగ్గుతో ఎరుపెక్కుట – **కాలీ.ఫా.**

మెదడు అధిక పరిశ్రమచే అలియుట – **కాలీ.ఫా., సైలీ, నే.మూ.**

మొద్దుగా నుండుట – **కాలీ.ఫా., మె.ఫా., నే.ఫా.**

రజస్వల వయస్సునందు విచారం – **నే.మూ.**

రాత్రిపూట మేల్కొన్నపుడు కాలి అడుగుల శబ్దం వినుట – **నే.ఫా.**

వస్తువులను ఒకచోటు నుండి మరొక చోటునకు తీసుకొనివెళ్ళుట – **మె.ఫా.**

వస్తువులపై దృష్టిని కేంద్రీకరించుట కష్టముగానుండుట/ఏకాగ్రత లోపించుట – **సైలీ.**

విసుగుతో కూడిన క్రోధం – **నే.మూ.**

విచారం (నిరుత్సాహంతో కూడిన) – **కాలీ.ఫా., నే.స.**

విసుగువల్ల కలుగు ఫలితం/ప్రభావం – **కాల్కే.ఫా., కాలీ.ఫా.**

వెక్కివెక్కి ఏడ్చుట – **మె.ఫా.**

వ్రాయునపుడు కొన్ని అక్షరములను/శబ్దములను వదలిపెట్టుట – **కాలీ.ఫా.**

వ్రాయునపుడు/మాట్లాడునపుడు తప్పుడు మాటలు వాడుట – **కాలీ.ఫా.**

శక్తి తక్కువగా ఉండుట/లేకుండుట – **కాలీ.ఫా.**

శబ్దమును ఏ మాత్రం సహించలేకపోవుట – **కాలీ.ఫా., సైలీ., కా.మూ.**

శుష్కించి చావాలని తలంచుట – **కా.మూ.**

సంగీతం ఉద్రేకపరచుట/లక్షణాలను అధికం చేయుట – **నే.స.**

సంతోషముగా, చలాకీగా ఉండుట – **నే.మూ.**

సంవేదన శీలత్వం – **కాలీ.ఫా., సైలీ.**

సిగ్గు, అమితముగ – **కాలీ.ఫా.**

స్పృహపోవుట, ఆకస్మికముగ – **కాల్కే.స.**

**స్వభావం (Nature) :**

అధైర్యంతో నిరాశ చెందు స్వభావం – **కాలీ.ఫా.**

అనుమాన స్వభావం – **కాలీ.ఫా.**

ఆత్మహత్య స్వభావం – **నే.స.**

ఇతరులతో మాట్లాడుటకు/కలియుటకు అయిష్టపడుట – **కాలీ.ఫా.**

ఉల్లాసముతో గంతులు వేసెడు స్వభావం – **నే.మూ.**

ఏడ్చే స్వభావం – **కాలీ.ఫా.**

ఒంటరిగానుండు స్వభావం – **కాలీ.ఫా.**

చిరచిరలాడెడు/మండిపడెడు స్వభావం – **కాల్కే.ఫా., కాలీ.ఫా., నే.స., నే.ఫా.**
తిరిగెడు స్వభావం – **నే.మూ.**
మాట్లాడుచుండు స్వభావం – **ఫె.ఫా., నే.మూ.**
విచారముతో నుండు స్వభావం – **కాలీ.ఫా., నే.మూ.**
సంబంధం లేకుండ మాట్లాడుట – **కాలీ.ఫా., నే.మూ.**
స్థిరమైన ఆలోచన లేని స్వభావం – **కాల్కే.స.**
స్త్రీ తనలో తాను నిరంతరం మాట్లాడుకొనుట – **మె.ఫా.**
హిస్టీరియా, ఆకస్మిక మానసిక ఉద్రేకములచే – **కాలీ.ఫా.**
హైపోకాండ్రియాసిస్ (తనకేదియో వ్యాధి ఉందని తలంచుట)– **కాలీ.ఫా., నే.ఫా.**
క్షోభ (చిరచిరలాడుట) – **కాలీ.ఫా., నే.స., నే.ఫా., సైలీ.**
క్షోభ, అశాంతి – **కాల్కే.ఫా., కాలీ.ఫా.**

## 2. కపాలం
## (Skull)

కపాలము సగభాగం సరిగ వృద్ధి చెందకపోవుట – **నే.మూ.**
కపాలములో మెదడుకు, వెన్నుపాముకు సంబంధించిన ద్రవం హెచ్చుట – **కాల్కే.ఫా., కాలీ.ఫా., నే.మూ.**
కపాలములోని ఎముకలకు కముకు దెబ్బ – **కాల్కే.ఫ్లో.**
కపాలములోని ఎముకలు రికెట్స్ వ్యాధిచే సన్నబడుట – **కాల్కే.ఫా., కాల్కే.స.**

## 3. కపాల చర్మము
## (Scalp)

గట్టి అంచులతో నుండుట – **మె.ఫా.**
గరుకుగా నుండుట – **మె.ఫా.**
చల్లగా, సున్నితంగా ఉండుట – **ఫె.ఫా.**
దురదగా ఉండుట – **కాల్కే.ఫా., కాలీ.ఫా.**
పచ్చి పుండుగా ఉండుట – **కాల్కే.ఫా.**
సున్నితంగా ఉండుట – **నే.స.**

* * *

అధికముగా తెల్లని పొలుసులు లేచుట – కాలీ.స., నే.మూ.
కాయలు/కంతులు/బుడిపెలు – కాల్కే.ఫ్లో.
గడ్డలు/ముడులు – సైలీ.
చిన్న పిల్లల తలపై చెమటపట్టుట – కాల్కే.ఫా., సైలీ.
చీము పట్టుట – కాల్కే.ఫా., సైలీ, కాల్కే.స.
జిగటగానుండు పొక్కులు – కాలీ.స.
తడిగా/తేమగా నుండు దద్దుర్లు – కాలీ.స.
తామర వంటి రోగం – కాల్కే.ఫా.
తెల్లని పొలుసులు – కాలీ.స., నే.మూ.
దద్దుర్లు, పొక్కులు – నే.మూ., ఫె.ఫా.
దురద – కాల్కే.ఫా., కాలీ.ఫా.
పసుపు పచ్చని పొక్కులు – కాల్కే.స.
పుండ్లవలె నుండుట, పుండ్లు – కాల్కే.ఫా.
పుండ్లు గట్టిపడుట – కాల్కే.ఫ్లో.
పొలుసులు విస్తారముగ నుండుట – కాలీ.స.
పొక్కులు, దురద – నే.మూ.
వెంట్రుకల అంచు మీద దురద – నే.మూ.
వెంట్రుకల అంచున దురద పుట్టించు చీమ పొక్కులు – సైలీ.
వెంట్రుకలు/కేశములు రాలిపోవుట – కాలీ.స., నే.మూ., సైలీ.
శోషరస గ్రంథులు పుండ్లుపడుట – కాల్కే.ఫా.
సహనశక్తి లేకపోవుట – నే.స.

## 4. తల (Head)

ఎండ వేడిమి దుష్ప్రభావం – ఫె.ఫా.
కుట్టినప్పుడు కలుగు నొప్పి వంటిది – ఫె.ఫా.
క్రిందపడుటవల్ల తలకు గాయమగుట – నే.స.
చిన్నపిల్లల తలపై అధిక చెమటపోయుట (జ్ఞాపకశక్తి మందగించిన, చిరచిరలాడు స్వభావంగలిగిన, మానసిక దుర్బలత కలవారిలో) – కాల్కే.ఫా.
చిన్నపిల్లల తలపై అధిక చెమట పోయుట (సూదులు, గుండుసూదులతో ఆడుకొను వారిలో, తొందరగా మానసిక అలసట చెందువారిలో) – సైలీ

చిన్నపిల్లల తలపైన, ముఖంపైన చిక్కని చీముతోకూడిన పొక్కులు లేచుట (కొద్దిగా శబ్దమైనా ఉలిక్కిపడువారిలో, అస్థిరమైన నిద్రతో) **– కా.మూ.**

తలంతయు బరువుగా ఉన్నట్లు అనిపించుట **– నే.స.**

తల దానంతటదే ముందుకు ఊగుట **– నే.మూ.**

తల నిండుగా ఉండుట **– కాల్కే.ఫా., ఫె.ఫా.**

తలకు కముకు దెబ్బ తగులుట వల్ల కలుగు నొప్పి **– ఫె.ఫా.**

తలను కొట్టుతున్నట్లు అనుభూతి **– ఫె.ఫా.**

తలపై ఒత్తిడి, వేడిమి **– కాల్కే.ఫా.**

తల పై భాగం చల్లని గాలికి తేలికగా ఉండుట **– ఫె.ఫా.**

తల పై భాగం మంటగా ఉండుట **– నే.స.**

తలపైన ఎడతెగని నొప్పి **– నే.ఫా., నే.స.**

తలపైన తాళలేనంతటి నొప్పి **– మె.ఫా.**

తలపైన బుడిపెలు **– సైలీ.**

తల బ్రద్దలగుతున్నట్లు అనుభూతి **– నే.మూ.**

తలలో అదుముచున్నట్లు ఉండుట **– నే.స.**

తలలో కుట్టుచున్నట్టి నొప్పులు **– ఫె.ఫా.**

తలలో చల్లని అనుభూతి **– కాల్కే.ఫా.**

తలలో ధనారింపుగ/గుండె కొట్టుకొనుచున్నట్లుండుట **– ఫె.ఫా.**

తలలో ధ్వనులు వినిపించుట **– కాలీ.ఫా.**

తలలోని పెద్ద ఎముకలు విడివడుట/వేరగుట **– కాల్కే.ఫా.**

తల వెనుక భాగం బరువుగా ఉండుట **– కాలీ.ఫా.**

తల వెనుక భాగమున దుర్వాసనతో కూడిన పొక్కులు **– సైలీ.**

తల వెనుక భాగమున పుండువలె నొప్పిగ ఉండుట **– కాలీ.ఫా.**

బట్టతల మచ్చలు **– కాలీ.స., కాల్కే.ఫా.**

బాధపెట్టు నొప్పులు, తీవ్రముగ ఉండుట **– మె.ఫా.**

బ్రహ్మరంధ్రం (మాడపట్టు) తెరుచుకొనియుండుట/మూయబడకుండుట **– కాల్కే.ఫా., సైలీ.**

బ్రహ్మరంధ్రం కళ్ళకు అడ్డంగా మూయబడకుండుట **– కాలీ.ఫా.**

మెడ వెనుక భాగమున వెంట్రుకల అంచున లేచునట్టి పొక్కులు **– నే.మూ.**

రక్తం తలకు వేగంగా ప్రవహించుట **– ఫె.ఫా., నే.స.**

వడదెబ్బ **– నే.మూ.**

వెంట్రుకలు దువ్వుకొనునపుడు నొప్పిగా ఉండుట – నే.స., ఫె.ఫా.

వెంట్రుకలు రాలుట (క్రింద పడిపోతాననే భయం, చిరాకు, సాయంకాలం పూట ఆదుర్దా, ఎల్లప్పుడూ హడావిడి చేయువారిలో) – కాలీ.స.

వెంట్రుకలు రాలుట (తాను అనారోగ్యముగ నున్నానని తలంచువారిలోను, కోపం, చిరాకు కలవారిలోను, జ్ఞాపకశక్తి తక్కువగా ఉన్నవారిలోను) – నే.మూ.

వెంట్రుకలు రాలుట (దేనిపైనన్నా దృష్టి కేంద్రీకరించుట కష్టముగానున్నవారిలోను, సూదులు, గుండుసూదులతో ఆడుకొనే స్వభావం కలవారిలోను, ఆలోచించదలచి, ఆ పని చేయలేనివారిలో) సైలీ.

## 5. తలత్రిప్పు
## (Vertigo)

అంతర్గత చెవి వాపువల్ల – సైలీ.

ఎడమవైపుకు పడిపోయే ప్రవృత్తి కలిగినవారిలో – సైలీ.

కర్ణములు/చెవులకు సంబంధించిన వ్యాధులవల్ల – సైలీ.

జీర్ణకోశపు వ్యాధుల (Gastric Derangements) వల్ల – నే.ఫా.

నడచునపుడు/కదలునపుడు వచ్చుట – కాల్కే.ఫా.

నాడీమండల నిస్త్రాణవల్ల వచ్చుట – కాలీ.ఫా.

పైకి చూచునపుడు/లేచునపుడు వచ్చుట (సాయంకాలమున వెచ్చని గదిలో అధికమై, చల్లని/బహిరంగ ప్రదేశంలో తగ్గుట) – కాలీ.స.

పైకి చూచునపుడు/లేచునపుడు వచ్చుట (పడుకొన్నా, నిల్చొన్నా వచ్చుట, మూసిన గదిలో అధికమగుట) – కాలీ.ఫా.

ముసలి వయస్సు/వృద్ధాప్యము నందు వచ్చుట – కాల్కే.ఫా.

రక్తం వడిగా తలకు చేరుటవల్ల వచ్చుట – ఫె.ఫా.

రక్తహీనత/నరాల శోషణ వల్ల వచ్చుట – కాలీ.ఫా.

**తలత్రిప్పు- సహచర లక్షణాలు (Vertigo– Concomitants) :**

ఎడమవైపుకు పడిపోవుటతో – సైలీ.

జీర్ణకోశపు అస్వస్థతతో – నే.ఫా.

తలకు రక్తం వడిగా ప్రవహించుటతో – ఫె.ఫా.

భయంకరమగు వికారంతో – కాల్కే.ఫా.

# 6. తలనొప్పి
## (Head ache)

**స్థానం :**

కుట్ల వద్ద – **కాల్కే.ఫా.**

కుడివైపున – **ఫె.ఫా.**

తల అంతటా – **కాల్కే.స.**

తల చుట్టూ/నుదుటి భాగం – **కాల్కే.స.**

తల పుఱ్ఱె అంతయు (పైభాగం, ముందుభాగం, వెనుక భాగం) – **నే.ఫా.**

తల వెనుక భాగం – **నే.స.**

తల వెనుక భాగమున కళ్ళకు అడ్డముగా – **కాలీ.ఫా.**

నడినెత్తి నుండి కుడి కంటి లొత్త పైభాగం – **ఫె.ఫా.**

నుదుటి భాగం – **నే.ఫా.**

పార్శ్వం/ఒకవైపున (Migraine) - మలబద్ధకం వల్ల – **నే.మూ.**

పార్శ్వం/ఒకవైపున–వేడిమివల్ల, జీవితంపట్ల ఏవగింపు కలిగినవారిలో – **సైలీ.**

పైనుండి క్రిందకు – **కాల్కే.ఫా.**

మెడ వెనుక భాగం నుండి శీర్షం వరకు (జీవితంపట్ల ఏవగింపు గలవారిలో) – **సైలీ**

మెడ వెనుక భాగం నుండి శీర్షం వరకు (కుడివైపున ఎక్కువ, ధ్వనులచే ఉద్రేకం, వేడిమివల్ల తగ్గుట) – **సైలీ.**

మెడ వెనుక భాగం నుండి శీర్షం వరకు (బల్లెంతో పొడిచినట్టి నొప్పి, స్థానం మారునట్టి నొప్పి, అప్పుడప్పుడు వచ్చునట్టి నొప్పి) – **మె.ఫా.**

**ఎవరిలో :**

కంఠమాల, గండమాల తత్త్వం గలవారిలో – **సైలీ.**

కీళ్ళ జబ్బులు గలవారిలో – **ఫె.ఫా., నే.స.**

జీర్ణకోశ వ్యాధులు గలవారిలో – **కాల్కే.ఫా., నే.స., సైలీ**

పిల్లలలో – **కాల్కే.ఫా., ఫె.ఫా.**

పాలిపోయిన, సున్నితమైన వారిలో – **కాలీ.ఫా.**

విద్యార్థినులలో (పాఠములు శ్రద్ధగా చదువునట్టి వారిలో) – **కాల్కే.ఫా., నే.మూ.**

విద్యార్థులలో – **కాలీ.ఫా., మె.ఫా.**

విద్యార్థులలో (తల బరువుగానుండుట, తలవెనుక భారం, కళ్ళముందు నొప్పి) – **కాలీ.ఫా.**

స్కూలుకు వెళ్ళు బాలికలలో **– కాల్కే.ఫా., నే.మూ.**

స్క్రాఫ్యులా తత్త్వం గలవారిలో **– సైలీ.**

**సమయం :**

అకస్మాత్తుగా వచ్చి తాత్కాలికముగా ఉండుట **– మె.ఫా.**

ఉదయాన నిద్రనుండి లేచిన తర్వాత మొదలై మధ్యాహ్నమునకు ఎక్కువై రాత్రి పడుకొనునప్పటికి తగ్గుట **– నే.స.**

ఉదయాన నిద్రమేల్కొన్నప్పటి నుండి మధ్యాహ్నం/సూర్యాస్తమయం వరకు ఉండుట **– నే.మూ.**

ఉదయాన నిద్రలేవగానే **– నే.ఫా.**

ఏదైనా తినునపుడు **– కాలీ.ఫా.**

కాల నియమం ప్రకారం వచ్చునట్టి (Periodical) **– నే.స.**

దీర్ఘకాలపు (Chronic) **– కాల్కే.ఫా., నే.మూ.**

పిల్లలలో దంతములు వచ్చునప్పుడు **– కాల్కే.ఫా.**

పైత్యరసపు వాంతికి ముందు సూచనగా వచ్చునట్టి **– కాలీ.ఫా.**

ప్రతి వసంత ఋతువులో వచ్చునట్టి **– నే.స.**

బహిష్టులో/ముందు/తర్వాత **– నే.మూ.**

బహిష్టు సమయాన **– నే.ఫా.**

బహిష్టు సమయాన ఆకలి, ఎడమ స్తనమున తీవ్రమైన నొప్పి **– కాలీ.ఫా.**

మధ్యాహ్నం వరకు ఉండునట్టిది **– నే.మూ.**

విడిచి–విడిచి వచ్చునది (Intermittent) **– మె.ఫా.**

సాయంకాలమున ప్రారంభమగునది **– కాలీ.స.**

**తలనొప్పి కారణం (Cause) :**

అమిత వేడిమి, ఆకలి **– సైలీ.**

ఉదరకుహర క్షోభ **– సైలీ.**

ఎండ వేడిమి **– ఫే.ఫా.**

గౌటు స్వభావం (చిన్న కీళ్ళు వాచుట) **– ఫే.ఫా., నే.స.**

చాలా చల్లదనం **– ఫే.ఫా.**

జంతు సంబంధమైన ద్రవములు (Animal fluids) లోపించుట **– కాల్కే.ఫా., నే.మూ.**

తలకు గాయాలు తగులుట **– నే.స.**

తలకు రక్తం వేగంగా ప్రవహించుట – ఫె.ఫా., నే.స., సైలీ, నే.మూ.
నడచుట – నే.మూ.
నరముల ఒత్తిడి (pressure)/ నాడీమండల అలసట – సైలీ.
నిద్రలేమి – ఫె.ఫా., కాలీ.ఫా.
పొట్టకు సంబంధించిన బాధలు – సైలీ.
పొట్ట ఖాళీగా ఉండుట – కాలీ.ఫా.
బాగా వేడి చేయుట – సైలీ.
మానసిక అలసట – మె.ఫా., సైలీ.
మానసికముగా క్రుంగుట – కాలీ.ఫా.
వడదెబ్బ – నే.మూ.
శరీరమందలి ద్రవములు పోవుట – కాల్కే.ఫా., నే.మూ.

**తలనొప్పి స్వరూపం**

ఒకచోటు నుండి మరొక చోటునకు మారుట – కాలీ.స.
కంటిలో మేకును గ్రుచ్చినట్లుగా నొప్పి – ఫె.ఫా.
కుట్టినట్లుండు నొప్పి (Stitching pain), కముకు నొప్పి (Bruising pain), అదుముచున్నట్టి, గుండె కొట్టుకొనుచుండునట్టి నొప్పి – ఫె.ఫా.
తలపై భాగమున ఒత్తిడి, వేడిమి – నే.ఫా.
తల పైభాగమున కొట్టినట్లుండునట్టి, వర్ణించుటకు వీలుకాని నొప్పి – నే.స.
తాకితే బాధ – ఫె.ఫా.
తాళలేనంతటి నొప్పి, ఈడ్పులతో – మె.ఫా.
తేనెటీగలు కుట్టుచున్నట్టి / తేలు కుట్టినట్టి నొప్పి – మె.ఫా.
ధనారింపు/గుండె కొట్టుకొనుచుండునట్టి నొప్పి – ఫె.ఫా., సైలీ.
మందకొడిగాను, భారంగాను ఉండు నొప్పి – నే.మూ.
శూలముతో గుచ్చినట్లుండు నొప్పి – మె.ఫా.
సుత్తితో కొట్టినట్లుండు నొప్పి – నే.మూ., ఫె.ఫా.

**దేని తర్వాత వచ్చిన తలనొప్పి :**

బహిష్టు తర్వాత – నే.మూ.
నడచిన తర్వాత – నే.మూ.

**తలనొప్పి ఉత్ప్రేరకాలు (తలనొప్పిని పెంచునవి)**

అధిక అలసట – సైలీ.

కదలిక, చదువుట - నే.స.
చలనం/కదలిక - నే.స., ఫె.ఫా.
చలనము, ముందుకు వంగుట - ఫె.ఫా.
చల్లదనం - కాల్కే.ఫా.
జలుబు - కాల్కే.ఫా.
టోపీ ఒత్తిడి - కాల్కే.ఫా.
తల ఊపుట/కదుపుట - ఫె.ఫా.
తలను ఒకవైపు నుండి మరొక వైపునకు/వెనుకకు మరల్చుట - కాలీ.స.
తలలో ధ్వనులు - సైలీ.
మానసిక అలసట - కాల్కే.ఫా., మె.ఫా., సైలీ.
ముందుకు వంగుట, కదలుట, తలను త్రిప్పుట - ఫె.ఫా.
వాతావరణ మార్పు - కాల్కే.ఫా.
వెలుతురు - సైలీ.
వేడిగానున్న/వెచ్చని గది, సాయంకాలం - కాలీ.స.
వేడిమి - కాల్కే.ఫా.

**తలనొప్పి ఉపశమనాలు (తలనొప్పిని తగ్గించునవి)**

ఆనందకరమైన వాతావరణం - కాలీ.ఫా.
చల్లని గాలివల్ల, బహిరంగ ప్రదేశమున - కాలీ.స.
చల్లని పదార్థాన్ని తలనొప్పిగల చోటున అదుముట - ఫె.ఫా.
చాలా చల్లదనం/జలుబు - ఫె.ఫా.
తినునప్పుడు, క్రుంగిపోయినప్పుడు - కాలీ.ఫా.
నెమ్మదిగా నడచుట/కదలుట - కాలీ.ఫా.
ప్రశాంతత - నే.స.
బయటి వేడి - మె.ఫా., సైలీ.
ముక్కు నుండి రక్తస్రావం - ఫె.ఫా.
మెల్లగ కదలుట - కాలీ.ఫా.
వెచ్చని వస్త్రమును తలకు చుట్టుట - సైలీ.
సంతోషకరమగు మానసిక ఉద్రేకత - కాలీ.ఫా.

**తలనొప్పి - సహచర లక్షణాలు :**

అంధత్వం - ఫె.ఫా.

| | |
|---|---|
| అజీర్ణం | **– ఫె.ఫా.** |
| అధిక నిస్త్రాణ/శారీరక నీరసం | **– కాలీ.ఫా.** |
| అపాన వాయువు/పిత్తులు | **– కాల్కే.ఫా.** |
| అమితమైన కన్నీరు | **– నే.మూ.** |
| అలసట | **– కాలీ.ఫా.** |
| అలసట తీరని నిద్ర | **– కాలీ.ఫా., నే.మూ.** |
| ఆవులింతలు (Yawning) | **– కాలీ.ఫా.** |
| ఈడ్పులు (Spasams)/ కండరములు సంకోచించుట | **– మె.ఫా.** |
| ఉదయాన నోరు చేదుగా నుండుట | **– నే.స.** |
| ఉదరకుహరం వాయుపూరితమగుట | **– కాల్కే.ఫా.** |
| ఎరుపెక్కిన కళ్ళు/ముఖం | **– ఫె.ఫా.** |
| కంటి దోషాలు | **– మె.ఫా.** |
| కన్నీరు అధికముగా ఉండుట | **– నే.మూ.** |
| కపాలముపై గడ్డలు | **– సైలీ.** |
| కళ్ళముందు వెలుతురు/నిప్పు నెరసులు కనిపించుట | **– మె.ఫా.** |
| కళ్ళు, ముఖం ఎర్రగ నుండుట, కంటిదోషములతో | **– మె.ఫా.** |
| కోపం, విసుగు | **– కాలీ.ఫా.** |
| గ్రుడ్డివానిగా చేయుట | **– ఫె.ఫా.** |
| చలి | **– మె.ఫా.** |
| జలుబు | **– నే.మూ.** |
| తలత్రిప్పు (నడచునప్పుడు/కదలికవల్ల వచ్చిన) | **– కాల్కే.ఫా.** |
| తలలో చల్లగానుండుట, తల తిరుగుట | **– కాల్కే.ఫా., సైలీ.** |
| తలత్రిప్పుట | **– ఫె.ఫా., నే.స., సైలీ.** |
| తల నిండుగా ఉన్నట్టి అనుభూతి | **– కాల్కే.ఫా.** |
| తలపై చర్మంమీద చిన్న కంతులు | **– సైలీ.** |
| తల పైభాగం భారంగాను, బద్ధకంగాను ఉండుట | **– ఫె.ఫా.** |
| తాకితే పుండువలె నుండు బాధ | **– ఫె.ఫా.** |
| తెల్లని కళ్ళె ఉమ్మివేయుట | **– కా.మూ.** |

| | |
|---|---|
| నడినెత్తి వేడిగానుండుట | **– నే.స., నే.ఫా.** |
| నాలుకపై పూత/ఉన్నెవంటి పూత | **– ఫె.ఫా.** |
| నిద్రపట్టకపోవుట | **– ఫె.ఫా., కాలీ.ఫా.** |
| నిద్రమత్తు | **– నే.మూ.** |
| నిరుత్సాహం, నిస్పృహ | **– కాలీ.ఫా.** |
| నీరసం | **– కాలీ.ఫా.** |
| నీళ్ళగా నుండు లాలాజలమును ఉమ్మివేయుట | **– నే.మూ.** |
| నీళ్ళ విరేచనాలు (పైత్యరసంతో), శూలనొప్పి | **– నే.స.** |
| నోటి నిండా లాలాజలం | **– నే.మూ.** |
| బద్ధకం (Dullness) | **– నే.మూ., కాల్కే.ఫా.** |
| మతిమరుపు/మరుపు | **– కాల్కే.ఫా.** |
| మలబద్ధకం, స్పృహ కోల్పోవుట, కాళ్ళు–చేతులు వణకుట | **– నే.మూ.** |
| మూర్ఛకు సంబంధించిన వికారం | **– కాల్కే.ఫ్లో.** |
| మొద్దుగ నుండుట | **– కాల్కే.ఫా.** |
| వమన వికారం | **– కాల్కే.స., నే.ఫా.** |
| వమన వికారం, చలి | **– మె.ఫా.** |
| **వాంతి/వమనం** | **– కాలీ.మూ.** |
| వాంతి, అమిత అలసట | **– కాలీ.ఫా.** |
| వాంతి, ఆవలింతలు | **– కాలీ.ఫా.** |
| జిగురు వంటి వాంతి | **– నే.ఫా.** |
| జీర్ణం కాని ఆహారం వాంతి అగుట | **– ఫె.ఫా.** |
| తెల్లని ఆమం వాంతి అగుట | **– కా.మూ.** |
| పారదర్శకముగనుండు ఆమం వాంతి అగుట | **– కాల్కే.ఫా., నే.మూ.** |
| పుల్లని పదార్థం వాంతి అగుట | **– నే.ఫా.** |
| పైత్యరసం వాంతి | **– నే.స.** |
| సాగదీయుట/ఈడ్పులు | **– కాలీ.ఫా.** |
| స్వచ్ఛమైన కళ్ళె | **– కాల్కే.ఫా., నే.మూ.** |

# 7. కళ్ళు
(Eyes)

అదురుట – **మె.ఫా., కాల్కే.స.**

అలుకుకు పోవుట – **కాలీ.ఫా.**

ఇసుక ఉన్నట్లు అనిపించుట – **కా.మూ., కాలీ.ఫా., ఫె.ఫా.**

ఈడ్పులు – **కాల్కే.ఫా., మె.ఫా.**

ఎరుపు (రక్తంవలే) – **ఫె.ఫా., నే.మూ.**

ఏదో వస్తువు పడినట్లు అనిపించుట – **కాల్కే.స.**

కనులొత్త (కనుగ్రుడ్డు ఉండెడి ఎముకల గూడు)పై ఒత్తిడి – **సైలీ.**

కనులొత్త చీము పట్టుట – **సైలీ.**

కార్నియా– ఐరిస్ మధ్యభాగంలో చీము పట్టుట (Hypopyon)
**కాల్కే.స., కా.మూ., సైలీ., కాలీ.స., నే.ఫా.**

**కేటరాక్ట్ :** కాల్కే.ఫ్లో, కాల్కే.ఫా., కాలీ.స., కా.మూ.

కార్నియా – ఐరిస్ మధ్యభాగంలో పొగవంటి పుసిచేరుటవల్ల వచ్చిన కేటరాక్ట్
– **కాల్కే.స.**

కాళ్ళ చెమటను అణచుట వల్ల వచ్చిన కేటరాక్ట్ – **సైలీ.**

కొనలవద్ద కురుపులు – **సైలీ.**

గాయమైన తర్వాత – **కాల్కే.స.**

గ్యాస్‌లైట్ ముందు కళ్ళను వాడలేకపోవుట – **కాల్కే.ఫా.**

చదువునపుడు అక్షరాలు ఒకదానితో మరియొకటి కలిసిపోవుట – **నే.మూ.**

చురకచురకమనుట – **నే.మూ.**

(దగ్గర) చిన్న, చిన్న పొక్కులు – **నే.మూ.**

దురద – **మె.ఫా.**

నల్ల మచ్చలు – **కాలీ.ఫా.**

నిర్మలమైన కటకం (lens) మసకగా కనిపించుట – **కాలీ.స.**

నీటికాసులు (Glaucoma) **నే.మూ.**

**నొప్పి :** – **నే.ఫా., నే.మూ., మె.ఫా., ఫె.ఫా.**

కళ్ళను కదుపుటచే అధిక నొప్పి – **ఫె.ఫా.**

పచ్చి పుండుగ ఉండుట – **కాలీ.ఫా.**

పుల్ల ముక్కలు కంటిలో ఉన్నట్లుండుట - కాలీ.ఫా.
సన్నని బద్ద పెట్టినట్లుగా ఉండుట - కాల్కే.స.
పొడిగా ఉండుట - కాల్కే.ఫా.
(పైన) చిన్న నూక వంటి బొబ్బలు - నే.ఫా., నే.స.
(పైన) పసుపుపచ్చని పొక్కులు - కాలీ.స.
(పైన) పొక్కులు, బొబ్బలు (Vesicles) - నే.మూ.
మంటగ నుండుట - ఫె.ఫా., కాలీ.ఫా.
మండుచున్నట్లుండుట - ఫె.ఫా.
మచ్చలు - కా.మూ.
రక్తం చిందుట - నే.ఫా., ఫె.ఫా., నే.మూ.
రెటీనా వాచుట (Retinitis) - కాల్కే.స., ఫె.ఫా., కా.మూ.

**వాపు :** - కాల్కే.ఫా., కాల్కే.స., ఫె.ఫా.

నల్లగ్రుడ్డు (Iris) వాపు - కా.మూ., నే.మూ.
బాధతో కూడిన వాపు, చురకగు నొప్పితో - ఫె.ఫా.

**సహచర లక్షణాలు :**

పచ్చని పదార్థం స్రవించుట - కాల్కే.స.
పొడిగానుండుట - కాల్కే.ఫా.
స్రావం లేకుండుట - ఫె.ఫా.

## 8. కళ్ళకు సంబంధించిన

**కన్నీరు (Tears) :**

అశ్రునాళం (కన్నీటి గ్రంథి నుండి కన్నీరు వచ్చునాళం)లో అవరోధం - నే.మూ.
అశ్రునాళం సన్నబడుట - నే.మూ.
కన్నీటి ద్రవపు కంతికి సంబంధించిన వ్యాధి - సైలీ.
కన్నీటికి సంబంధించిన వ్యాధులు - సైలీ.
కన్నీరు కారుట - మె.ఫా., నే.మూ., నే.స.
కన్నీరు మంటగ నుండుట - నే.మూ.
కన్నీరు మండుచున్నట్లుండుట - నే.స., నే.ఫా.
కన్నీరు, చిన్న-చిన్న పొక్కులు - నే.మూ.

తెల్లని కన్నీరు – కా.మూ.
స్వచ్ఛమైన కన్నీరు – నే.మూ.

**కంటి నరాల నొప్పి :**

కంటి గ్రుడ్డు పైన నరాల బాధ – మె.ఫా., నే.మూ.
కంటి నరాల నొప్పి వేడిమి/వెచ్చదనం వల్ల తగ్గుట – మె.ఫా.
కుడి కంటి నరాల నొప్పి – సైలీ.
కుడి కంటి నరాల నొప్పి తీవ్రముగ ఉండుట – మె.ఫా.
కన్నీరు, కంటి నరాల నొప్పి – నే.మూ.
క్రమానుసారముగ (Periodical) వచ్చు కంటి నరాల నొప్పి – నే.మూ.

**కళ్ళ పుసి (pus)**

ఆకుపచ్చ – నే.స.
కార్నియా – ఐరిస్ మధ్యభాగంలో ఉండుట – కా.మూ., సైలీ.

**కళ్ళ కలక (Yellow Conjunctiva)**

కళ్ళ కలక / దీర్ఘకాలం నుంచి ఉన్న కళ్ళ కలక – నే.స.
ఎలాంటి స్రావం లేని కళ్ళ కలక – ఫె.ఫా.
కనురెప్పలపై పొక్కులు లేచిన కళ్ళ కలక – కాలీ.స.
క్రొత్తగా జన్మించిన శిశువుల కళ్ళ కలక (Neonatorium) – కాలీ.స.
చిక్కని పచ్చని స్రావంతోనున్న కళ్ళ కలక – కాల్కే.స.
ద్రవముతో కూడిన పొక్కులతోనున్న కళ్ళ కలక – కాల్కే.స.
బంగారు వర్ణపు, మీగడ వంటి స్రావం స్రవిస్తున్న కళ్ళ కలక – నే.ఫా.
స్రావం స్రవిస్తున్న కళ్ళ కలక – కాల్కే.స., కా.మూ., కాలీ.స.
స్క్రొఫ్యులా/శోషరస గ్రంథులకు సంబంధించిన కళ్ళ కలక – నే.ఫా.

**కంటిలోని ఆమత్వక్కు/జిగట పొర వాపు–** కాల్కే.ఫ్లో., ఫె.ఫా., కాలీ.స., నే.మూ., నే.ఫా.

**కళ్ళ స్రావం :**

అధికముగ స్రవించుట – కాల్కే.స., కాలీ.స.
ఆకుపచ్చ/పసుపుపచ్చ – కాలీ.స., కా.మూ.
తెల్లని స్రావం – కా.మూ.
పసుపుపచ్చని చిక్కని స్రావం – కాల్కే.స., కా.మూ.
స్రావం లేకపోవుట – ఫె.ఫా.

**కనుగ్రుడ్లు (Eye-balls)**

అప్రయత్నముగ ఊగుట (Nystagmus) **– మె.ఫా.**

కనుగ్రుడ్డు ముందు భాగం, కనురెప్పలు వాచుట (Trachoma) **– కా.మూ.**

కుంచించుకు పోవుట **– మె.ఫా.**

తెల్లగ్రుడ్డు పొరలందు చీముకూడుట (Onyx) **కా.మూ.**

నల్లగ్రుడ్డు వాపు (Iritis) **– కా.మూ., నే.మూ.**

నల్లగ్రుడ్డు మరియు కార్నియా వాపు **– కాల్కే.ఫా., కా.మూ.**

నల్లగ్రుడ్డు మరియు కార్నియా వాపు, చీము పొక్కులుండుట **– కాల్కే.స., సైలీ.**

**కనుగ్రుడ్ల నొప్పి :**

ఎడతెగని నొప్పి **– కాల్కే.ఫ్లో.**

పుండువలె నొప్పిగా ఉండుట **– కాలీ.ఫా.**

కనురెప్పలను కదిలించుట వల్ల నొప్పి తగ్గుట **– ఫె.ఫా.**

పొక్కులుండుట **– కాల్కే.స., సైలీ.**

**శుక్లమండలం (Cornea)**

శుక్లమండలపు పుండ్లు (ప్రథమదశ) **– ఫె.ఫా.**

చదునుగా నుండు పుండ్లు **– కా.మూ.**

లోతైన పుండ్లు **– కాల్కే.స., కాల్కే.ఫా., సైలీ.**

శోషరష/స్కాప్ఫ్యులా తత్త్వపు పుండ్లు **– కాల్కే.ఫా., నే.మూ.**

శుక్లమండలపు ద్రవముతో కూడిన పొక్కులు/బొబ్బలు **– నే.మూ., కా.మూ.**

పారదర్శకముగా లేకుండుట (Opaque) **కాల్కే.ఫా., సైలీ.**

పొగచూరినట్లు ఉండుట **– కాల్కే.స.**

పొరల చీము **– కా.మూ.**

భాగాల వాపు **– కాల్కే.ఫా., కా.మూ.**

**శుక్లమండలపు మచ్చలు** **కాల్కే.ఫ్లో., నే.స.**

తెల్లని మచ్చలు **– నే.మూ.**

నల్లని మచ్చలు **– మె.ఫా.**

చిన్న మచ్చల వంటి పదార్థం ఉండుట **– కాలీ.మూ.**

**దృష్టి దోషములు :**

అంధత్వం, అసంపూర్ణమైన/సంపూర్ణమైన **– కాల్కే.ఫా.**

నీటి వలె ఉండునట్టి **– నే.మూ, నే.స.**

పలచని, దుర్వాసనగల, ఆకుపచ్చని, సీరంతో కూడిన **– కాల్కే.స.**

బాధ కలిగించని **– కాల్కే. ఫా.**

భరించుటకు వీలు కానంత దుర్వాసనగా ఉండునట్టి **– కాలీ.ఫా.**

రక్తం, చీముతో నున్న **– కాల్కే. స.**

రక్తమును గడ్డ కట్టునట్లు చేయు పదార్థంతో నున్న **– కా.మూ.**

రక్తమును విషపూరితం చేయునట్టి (septic) **– కాలీ.ఫా.**

**ఇతరములు**

అధిక నీరసమును కలిగించు పరిస్థితులు **– నే.మూ, కాలీ.ఫా.**

అపాయకరమైన చీము పొక్కులు / కురుపులు **– సైలీ, కాలీ.ఫా.**

ఆడిసన్ వ్యాధి[1] **– నే.మూ, కాలీ.ఫా.**

ఆమత్వక్కునకు సంబంధించిన కంతి **– కాల్కే.ఫా, కాల్కే.స.**

ఆమత్వక్కు వాపు **– నే.మూ, కాలీ.స, కా.మూ.**

ఓడ ప్రయాణంచే కలుగు వికారం (sea - sickness) **– కాలీ.ఫా, నే.ఫా.**

కదిలెడి కీలు (condyle) వద్ద కలుగు ఉబ్బు **– కాల్కే.ఫా.**

కముకు దెబ్బ (bruise) **– కాల్కే.స, కా.మూ.**

కముకు మచ్చలు (నల్లని–నీలి) **– కా.మూ.**

కింక వాయువు / శ్వాసనాళం, స్వరపేటికల వాపు (croup), చెమర్చుట **– కా.మూ.**

కుళ్ళుట (mortification) **– కాలీ.ఫా.**

క్లోమ సంబంధమగు వ్యాధి **– కాల్కే.ఫా.**

క్వినైను, మలేరియా జ్వరం వల్ల శుష్కించుట **– నే.మూ.**

గోరుచుట్టు (felon/onychia)**– కాల్కే.స, ఫె.ఫా, సైలీ, నే.స, కాల్కే.ఫ్లో, కాలీ.ఫా.**

గౌట్ / రక్తవాతం **– నే.మూ, నే.ఫా, నే.స.**

గ్రుద్దుల ప్రభావం **– కా.మూ., ఫె.ఫా.**

చిన్న పిల్లలలో సరియగు పోషణ లేకపోవుటచే కమిలిన మచ్చలు ఏర్పడు వ్యాధి(Barlow's disease) **– కాలీ.ఫా, సైలీ.**

చెవివాపు (ostitis) **– ఫె.ఫా.**

తడి ప్రదేశాలు / వాతావరణం సరిపడకుండుట (Hydrogenoid constitution) **– నే.స.**

---

*1.* ***ఆడిసన్ వ్యాధి :*** *శరీరం కంచు రంగుగ మారుట, రక్తపుపోటు తగ్గుట, నీరసం కలుగుట ఈ వ్యాధి లక్షణాలు.*

తెల్లకణాలు తాత్కాలికముగా హెచ్చుట (Leucosycosis) **– నే.ఫా.**

తెల్ల కణాలు విపరీతముగా అభివృద్ధి చెంది
అపాయమును కలిగించుట (Leucaemia) **– నే.ఫా, కాల్కే.ఫా, నే.స, కాలీ.ఫా.**

థైరాయిడ్ గ్రంథి పెద్దదగుటచే కళ్ళు ముందుకు త్రోసుకు వచ్చు వ్యాధి (Basedow's disease) **– సైలీ.**

దీర్ఘకాలం పరుపుపై పడుకొనుటవల్ల కలుగు పుండ్లు (Bed Sores) **– కాలీ.ఫా.**

ద్రవపు సంచిలో ద్రవం కూడుట **– కా.మూ.**

ధమనుల / ఎఱ్ఱ రక్తనాళాల గోడలు
గట్టిపడుట (Arterio-sclerosis) **– నే.ఫా, సైలీ, నే.స.**

ధాతువులు అనారోగ్యముగ నుండుట **– కాల్కే.స.**

ధాతువులు గట్టిపడుట **– కాల్కే.ఫ్లో.**

నల్లమందు (morphine) సేవించు అలవాటు **– నే.ఫా.**

నాడీకణముల సమూహములు మెదడుకు,
వెన్నుపామునకు వెలుపల కలుగుట (ganglion) **– కాల్కే.ఫ్లో, కాల్కే.ఫా.**

నాలుకపూత (Noma) **– కాలీ.ఫా.**

నీరసం, బలహీనత (debility) **– కాలీ.ఫా.**

పిల్లలలో ముక్కునుండి రక్తం కారుట **– ఫె.ఫా.**

పుట్టుకతో ఏర్పడు వెన్నెముక నెరద (Spina Bifida) **– కాల్కే.ఫా, కాల్కే.ఫ్లో.**

ఫాస్ఫేట్ వ్యాధి తత్త్వం **– కాల్కే.ఫా.**

బెణుకు (sprain) **- ఫె.ఫా.**

ముక్కు పుండు పడి దుర్వాసనగల స్రావం వెలువడుట (ozaema) **– మె.ఫా, నే.ఫా.**

ముఖం, ముక్కు, చెవులను వికృతముగా మార్చుట (Lupus) **– కాలీ.స, సైలీ.**

మూత్రమందు కాల్షియం ఆక్సిలేట్లు ఉండుట (Oxaluria) **– కాలీ.స.**

మెత్తని ధాతువు మృతినొందు పరిస్థితులు **– కాలీ.ఫా.**

రక్తకేశనాళికల సమూహం విస్తరించుట (Telangiectasy) **– ఫె.ఫా, కాల్కే.ఫ్లో.**

రక్తక్షీణతకు సంబంధించిన పరిస్థితులు **– నే.మూ, కాల్కే.ఫా.**

రక్తం విషపూరితమగుట (Septicaemia) **– కాలీ.ఫా.**

రాచపుండు **– సైలీ, కాల్కే.ఫ్లో, కా.మూ, కాలీ.ఫా.**

రికెట్స్[1] – **సైలీ, కాల్కే.ఫా. కాలీ.ఫా.**

రేనాడ్[2] వ్యాధి – **ఫె.ఫా, కాల్కే.ఫా, నే.మూ.**

వేడిమిచే కలుగు కాల్పులు (Burns) – **కాల్కే.స, కా.మూ.**

వేడిమిచే కలుగు పుండ్లు (scalds) – **కాల్కే.స, కా.మూ.**

వ్యాక్సినేషన్ చెడు ప్రభావం – **కా.మూ, సైలీ.**

వ్రణములను కలిగించు విషక్రిములు ఉండుట (Pyaemia) – **నే.స, కాలీ.ఫా.**

శరీర పోషణ లోపభూయిష్టంగా ఉండుట – **కాల్కే.ఫా.**

శరీరమందు రాతివంటి పదార్థం ఏర్పడుట (Calculi) – **మె.ఫా, కాల్కే.ఫా, కా.మూ.**

శరీరమునకు నీరు పట్టుట(Anasarca) – **నే.మూ.**

శుష్కించుట (Atrophy, emaciation, exhaustion, marasmus)– **కాల్కే.ఫా, కాలీ.ఫా, నే.ఫా.**

ఆరోగ్యముగా ఉన్నప్పుడు శుష్కించుట – **నే.మూ.**

సాగు తంతువుల బిగి తగ్గుట – **కాల్కే.ఫ్లో.**

సిఫిలిస్ – **కా.మూ.**

సిరలు (veins) ఉబ్బుట – **కాల్కే.ఫ్లో, నే.మూ.**

యువకులలో – **ఫె.ఫా.**

సీరమునకు సంబంధించిన వాపు – **కాల్కే.స.**

సీసముతో పనిచేయు వారి శూల (saturnismus) – **నే.స. 2 ×**

సెగ్గడ్డలు – **సైలీ, కాల్కే.స, కా.మూ.**

సెగ్గడ్డలు లేచు స్వభావం – **సైలీ.**

సైకోసిస్ తత్త్వం – **నే.స.**

స్కర్వీ[3] (scurvy) – **కా.మూ, కాలీ.ఫా.**

స్క్రాఫ్యులా[4]కు సంబంధించిన పరిస్థితులు – **కా.మూ.**

స్తనములలో ఎముకగల ప్రదేశంలో లోతు రంధ్రంగల వ్రణం/ కంతులు/ముడులు (knots) – **కాల్కే. ఫ్లో.**

హే జ్వరం – **మె.ఫా.**

---

*1. **రికెట్స్ :** ఈ వ్యాధిలో దొడ్డికాళ్ళు, విస్తారమగు చెమట, కండరముల బిగి లేకపోవుట, దంతములు ఆలస్యముగ వచ్చుట, కోపంతో అస్థిమితంగా ఉండుట, వెన్నెముక వంగి గూనె కలుగుట, తల పెద్దదిగా ఉండుట, బ్రహ్మరంధ్రం పూడకపోవుట మొ॥ లక్షణాలు ఉండును.*

*2. **రేనాడ్ :** గొంతు పక్షవాతం, చర్మం నీలి రంగుగా మారుట ఈ వ్యాధిలో ఉండును.*

*3. **స్కర్వీ :** దీనిలో ఇగుళ్ళు సున్నితంగాను, శ్వాస దుర్వాసనగాను, కాళ్ళు–చేతులునొప్పులతోను ఉండును. రోగి నీరసంగా ఉండును.*

*4. **స్క్రాఫ్యులా తత్వం :** దీనిలో శోషరస గ్రంథులు పెద్దవై శిథిలమగును.*

# 32. లక్షణములను మార్చు పరిస్థితులు
## (Modalities)

**ఉద్రేకములు / వ్యాధిని అధికం చేయు కారణములు (Aggravations)**

| | |
|---|---|
| ఆరుబయటి గాలి | **– సైలీ.** |
| ఉదయం | **– నే.మూ, నే.స.** |
| ఉప్పుగా నుండు మొక్కలు | **– నే.స.** |
| ఉరుము | **– నే.స.** |
| ఎడమవైపున పడుకొనుట | **– నే.స.** |
| ఒంటరిగా నుండుట | **– కాలీ.స, కాలీ.ఫా.** |
| కదలిక / చలనం (motion) | **– కా.మూ, ఫే.ఫా, కాల్కే.ఫా.** |
| నిరంతర కదలిక | **– కాలీ.ఫా.** |
| కసరత్తు / వ్యాయామం | **– కాలీ.ఫా.** |
| కాళ్ళ చెమట అణచుట | **– సైలీ.** |
| కుడివైపు | **– మె.ఫా.** |
| కూర్చొని లేచుట | **– కాలీ.ఫా.** |
| క్రిమికీటకములు కరచుట | **– నే.మూ.** |
| క్రొవ్వు పదార్థాలు తినుట | **– కా.మూ.** |
| క్వినైనుగల మందులు వాడుట | **– నే.మూ.** |
| గుడ్డలు ఉతుకుట, నీళ్ళలో పనిచేయుట | **– కాల్కే.స, నే.స.** |
| చల్లని గాలి | **– కాలీ.ఫా, మె.ఫా.** |
| చల్లని వాతావరణం | **– కా.మూ, సైలీ, నే.మూ.** |
| చేపలు తినుట | **– నే.స.** |
| తడచుట | **– కాల్కే.ఫా.** |
| తడి వాతావరణం | **– కాల్కే.ఫ్లో, నే.స.** |
| తాకుట | **– మె.ఫా.** |
| ధ్వని / శబ్దం | **– కాలీ.ఫా.** |
| నిర్ణీత సమయం | **– నే.మూ, నే.స.** |
| నీరు | **– నే.స.** |
| నీళ్ళలో పనిచేయుట, ఉతుకుట, కడుగుట | **– కాల్కే.స., నే.స.** |
| పండ్లు తినుటవల్ల విరేచనాలు ఎక్కువ అగుట | **– కాల్కే.ఫా.** |

పిండివంటలు (pastry) – **కా.మూ.**
పూర్ణిమ (full moon) – **సైలీ.**
మధ్యాహ్నం (బహిష్టును ఉద్రేకపరచుట) – **నే.మూ.**
రాత్రి పూట – **సైలీ.**
వాతావరణ మార్పు – **కాల్కే.ఫా.**
విశ్రాంతి తర్వాత – **కాలీ.ఫా.**
వెచ్చని గది – **కాలీ.స.**
సముద్రప్రాంతపు వైపు – **నే.మూ.**
సముద్ర స్నానం – **కా.మూ.**
సాయంకాలం – **కాలీ.ఫా, కాలీ.స, నే.ఫా.**
సిల్వరు నైట్రేటు – **నే.మూ.**

**ఉపశమనములు / వ్యాధిని తగ్గించునవి (Ameliorations)**

ఒత్తిడి – **మె.ఫా.**
కాపడం పెట్టుట – **కాల్కే.ఫ్లో.**
కొద్దిగా గట్టిగా నున్న దానిపై పడుకొనుట – **నే.మూ.**
చల్లని ఆరు బయటి గాలి – **కాలీ.స.**
చాలా చల్లదనం / జలుబు – **ఫె.ఫా, కాల్కే. ఫ్లో.**
తలకు చుట్టుట – **సైలీ.**
తినుట – **కాలీ.ఫా.**
తేమతో నున్న వెచ్చదనం – **సైలీ.**
నలుగురిలో ఉండుట – **కాలీ.ఫా.**
నెమ్మదిగా నడచుట – **కాలీ.ఫా.**
పడుకొనుట – **కాల్కే.ఫా.**
బాగా వంగుట – **మె.ఫా.**
మర్దన / రాపిడి – **మె.ఫా.**
మానసిక ఉద్రేకం – **కాలీ.ఫా.**
రుద్దుట – **కాల్కే.ఫ్లో.**
వాతావరణంలో మార్పు – **నే.స.**
వెచ్చదనం, వేడిమి – **సైలీ, మె.ఫా.**
వెచ్చని గది – **సైలీ.**
వెచ్చని, పొడి వాతావరణం – **నే.స.**

❊ ❊ ❊